కొందఱు తమకు నేను చేసినయుపకారమునకని వందనములు చేయుచున్నారు; కొందఱు కానుకగయి మంచిమంచివస్తువులను దెచ్చి చూపుచున్నారు. ఇంతకుమునుపే యొకకట్టుపనివాఁడు నన్ను తన యింటికి పిలుచుకొనిపోయి, నానిమిత్తమయి కొన్నవని కొన్నిపట్టు గుడ్డలనుచూపి, నాశరీరమునుబట్టి కొలఁత పుచ్చుకొన్నాఁడు. ఇదంతయు చూడఁగా నీపట్టణములో మళయాళమంత్రగాండ్రు తప్ప మఱియెవ్వరును కాపుర ముండనట్టు కనఁబడుచున్నది.

[చిన్నలక్ష్మణుడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నల—నన్ను తెమ్మనిపంపిన రూపాయ లివిగో; మీరు రాయమదూతను వదల్చుకొన్నారా?

చిన్నవ—ఇవి యెక్కడి రూపాయలు? ఏయమదూత?

చిన్నల—యమలోకంలో వుండే యమదూత కాదు; భూలోకంలోవుండే యమదూత. కన్నపాటిపులిచర్మం మెడలో వేసుకుని వూళ్ళోవాళ్ళప్రాణాలన్నీ తీస్తాడూ—అతఁడు. ఇందాకో పిశాచంలాగున మిమ్మ పట్టుకొని తీసుకు వెళుతూ వున్నాఁడు.

చిన్నవ—నీమాట లేమియు నాకు తెలియు లేదు.

చిన్నల—ఇదే తెలియలేదా? నాకు స్పష్టంగా తెలుస్తూ వున్నవి. మిళ్ళోతోలికి వెండిబిళ్ళ వేసుకొనితిరుగుతాడు; అప్పువుచ్చుకొని యెగఁబెట్టినవాళ్ళనూ, నేరాలు చేసినవాళ్ళనూ, తన కేమీ యివ్వనివాళ్ళనూ పట్టుకుంటాడు. అతణ్ని మీరు యెరగరా?

చిన్నవ—రాజభటుఁడని నీ యభిప్రాయమా యేమి?

చిన్నల—అవు నతఁడే.

చిన్నవ—నీపిచ్చిమాటలింతటితో కట్టిపెట్టు. ఈదినమున వెళ్లెడి బండి యేదైనదొరకినదా? మనమీరాత్రిప్రయాణమైవెళ్ళవచ్చునా?

చిన్నల—బండికుదిరి సిద్ధంగా వున్నది. మీ౨దేఆలస్య మని రెండుగడియలక్రింద నే మీ౨తో వచ్చి చెప్పలేదా? అప్పుడు బంట్రోతు మిమ్మల్ని తీసుకు వెళుతూవుండడంచేత తొందరలోవుండి తిన్నగా జవాబు చెప్పినారు కారు. మిమ్మల్ని విడుదల చేయించుకోవడానికి తెమ్మన్నరూపాయ లివిగో.

చిన్నవ—వీని మతిపోయింది. నేనును మతిపోయిన వాని వలెనే కనపడుచున్నాను. మేమిక్కడ మాయలలోపడి తిరుగు చున్నాము. మా౨పాలిటి భాగ్య దేవతవచ్చి మమ్మీయాపత్సముద్ర ములోనుండి పయికి లేవదీసి గట్టున పడవేయవలెనుగాని మా యంతట మేము లేవలేము.

[ప్రిభావతి ప్రివేశించుచున్నది.]

ప్రిభా—వసంతకా! మంచిసమయానికి కనపడ్డావు. నీకు కంసాలి కనపడ్డట్టున్నాడు. అదేనా నాకిస్తానన్న చంద్రహారము?

చిన్నవ—పిశాచమా! నన్ను మోసముచెయ్యక వెళ్ళిపో.

చిన్నల—అయ్యో! ఈమె పిశాచమా?

చిన్నవ—ఈమె పెనుభూతము.

చిన్నల—ఈవిడ భూతాలకన్నిటికీ ముత్తవతల్లిలాగు కనపడు తూవున్నది.

ప్రభా—యివేళ యజమానుడున్నూ సేవకుడున్నూకూడా మహా ఉల్లాసంగావున్నారు! నాతోవస్తారా? సాయంకాలంకూడా మా౨యింట్లోనే భోజనము చేస్తురుగాని.

చిన్నల—వెళ్ళవద్దు. వెళితే యీ౨దయ్యం మనల్ని పట్టుకుని వదలదు; యెల్లకాలం పీల్చి పిప్పిచేస్తుంది.

చిన్నవ—ఓసి దయ్యమా! నన్ను భోజనమునకు రమ్మను

చున్నావా? నేను రాను వెళ్ళిపో. నీవు దయ్యాలపోతువు.

చిన్నల—అలాగయితే మనకేదో దయ్యాన్ని పంపుచేస్తుంది, మంత్రం పారకుండా పళ్ళు పీకించి వెయ్యవలెను.

ప్రభా—మీరు మధ్యాహ్నం భోజనాలవేళ పుచ్చుకొన్న నా వుంగరం నాకిచ్చివెయ్యండి. వెళ్ళిపోతాను; లేకపోతే నావుంగరం లోని వజ్రానికి బదులుగా మీరిస్తానన్న చంద్రహార మయినా యివ్వండి. నేనూ వక్కనిముషం యిక్కడవుండను.

చిన్నల—దయ్యాలెక్కడయినా కుంభం పొయ్యవలసినదనీ దిగదుడుపు పెట్టవలసినదనీ కోరుతవిగాని నగలు పెట్టమని కోరవు. ఈచండి దురాశాపాతకురాలు గనుక చంద్రహారం తెమ్మంటూ వున్నది.

ప్రభా—మాటాడరేమి? మీరు మంచివారు; మోసం చెయ్యరు; నావుంగరమైనా చంద్రహారమయినా యేదోవకటి యియ్యండి.

చిన్నవ—ఓసి శిఖండీ! నా దేహము మండుకొనిపోవుచున్నది. మాటాడక వెళ్ళిపో—లక్ష్మణా! మనము వెళ్ళుదమురా.

చిన్నల—మంచివారికి మాటాడక పోవడమే మందని కాలికి బుద్ధి చెప్పడం చూచినావా?

(అని యిద్దఱును పరుగెత్తుచున్నారు.)

ప్రభా—(తనలో) సందేహంలేకుండా వసంతకుడికి పిచ్చి యెత్తింది; లేకపోతే యీప్రకారంగా మాట్లాడడు? నలభయివరహాలు చేసే నావుంగరం పుచ్చుకొని వానికి బదులుగా చంద్రహారం యిస్తానన్నాడు. ఇప్పుడు రెండింట్లో యేదీ లేదంటూవున్నాడు. ఇంతేకాకుండా మధ్యాహ్నం భోంచేసేటప్పుడు తన్ను లోపలికి రాని

య్యకుండా తనయింటితలుపులు వేసిరాఁగని పిచ్చికథనొకటి చెప్పినాడు. యితనిపిచ్చ తెలుసుకొని పెళ్ళాము బుద్ధిపూర్వకముగా నే తలుపులు వేయించి వుండును. నే నిప్పుడు తిన్నగా అతనియింటికి వెళ్ళి పిచ్చచేత నాయింట్లో ప్రవేశించి బలవంతముగా నావుంగరం యెత్తుకొని పోయినాడని పెళ్ళాముతో చెప్పివస్తాను. యీసంగతి చెప్పితే నా వుంగరంపోయినా దానివెల నలభైవరహాలయినా వస్తవి.

(అని వెళ్ళు చున్నది.)

---

చతుర్థరంగము — వసంతపురిని గృహాంతరమున వీధి

[పెద్దవసంతకుఁడును, ఒకరాజభటుఁడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ — నీ వేమియు భయపడనక్కఱలేదు; నేనుపాఱిపోను; సాయంకాలములోపల నే నియ్యవలసిన సొమ్మిచ్చి నిన్ను పంపెదను. ఈదినమున నాభార్య నామీఁద కొంచెము కోపముగా నున్నది. అందుచేత నేను పంపినవర్తమానము వేగిరము నమ్మినది కాదు కాఁబోలును! ఈపట్టణములో రాజభటులు నన్ను ఋణమునిమిత్తమయి పట్టుకొన్నారన్నమాట యామెచెవులకు వింతగా వినఁబడి నమ్మనర్హము కానిదిగా నుండును.

బెత్తము పట్టుకొని యింతలో పెద్దలక్ష్మణుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

అదుగో నేను పంపినసేవకుఁడు వచ్చుచున్నాఁడు; అతఁడు సొమ్ము తీసికొని వచ్చియుండును — ఏమి? నేను తెమ్మన్నది తీసికొని వచ్చినావా?

పెద్దల — ఇదుగో బెత్తము తీసుకొని వచ్చినాను. (అని యియ్యఁబోవుచున్నాఁడు.)

పెద్దవ—ఇది కాదు. సొమ్మెక్కడ నున్నది?

పెద్దల—సొమ్ము నాదగ్గర లేదు; బెత్తం కొన్నవాడి కిచ్చి వేసినాను.

పెద్దవ—ఓరి భ్రష్టుఁడా! బెత్తము కొన్నవానికి నాలుగ వందలరూపాయలమూట యిచ్చినావా?

పెద్దల—నాలుగువందలరూపాయలమూట నేమిటి?

పెద్దవ—ని న్నెందుకు పంపినాను?

పెద్దల—నన్ను బెత్తమునిమిత్తం పంపినారు; బెత్తం తెచ్చి నాను.

పెద్దవ—నిన్నగా అడిగినమాటకు సదుత్తరము చెప్పనంద కిప్పు డీబెత్తము నీవీపుమీఁద విఱుగవలెను. (అనికొట్టుచున్నాఁడు.

రాజభటుఁడు—మీరు కోపమును శాంతం వహించవలెను

పెద్దవ—ఆపదలో నున్నవాఁడను నేనా శాంతము వహించ వలసినది?

పెద్దల—ఏమిటండీ? అలాగు—

రాజభ—వూరుకో; నోరుముయ్యి.

పెద్దల—నామీఁద కోపపడకపోతే ఆయనను కొట్టకుండ చెయ్యరాదా?

పెద్దవ—మొండిశిఖండీ! పరమనిర్భాగ్యుఁడా! నీకు తెలివి లేదురా?

పెద్దల—నాకు తెలివి తప్పివుంటే యీదెబ్బలు తెలియక నైనాపోను.

పెద్దవ—నీకు దెబ్బలు తగిలినవని తెలిసికొనుటలో తప్ప మఱియెందులోను నీకు తెలివి లేదు. నీవు గాడిదవు.

పెద్దల—నేనుగాడిదనే; యెంతవోర్పు గలిగి పనిచేస్తూవున్నా నాకు దెబ్బలు తగులుతూ వుండడంచేత నేను గాడిదనే.

[సీతయు, సుభద్రయు, దుర్గాదాసనుమాంత్రికుడును
ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—అదిగో నాభార్యవచ్చుచున్నది; ఎదురుగా వెళ్లుదము రండి.

పెద్దల—అమ్మా! చేతిలో బెత్తంమాది జాగ్రతగా వుండు; దగ్గిరకు వస్తివా దెబ్బలు తగులుతవి. నాజ్యోతిషం నమ్మి దూరంగా వుండు;

పెద్దవ—నీవింకను నోరు మూసికోనవా?

(అని కొట్టుచున్నాడు.)

ప్రభా—నీవిప్పు డేమి చెవుతావు? నీ మొగుడు పిచ్చివా డవునా కాడా?

సీత—ఆయన చేస్తూవున్న దుర్మార్గం చూస్తే మరివకలాగు వూహించడానికి వీలు లేకుండా వున్నది.—దుర్గాదాసుగారూ! మీరు మంత్రవేత్తలుగదా? ఆ పెనిమిటిని పట్టుకున్నభూతాన్ని వదిలించి యథాప్రకారంవుండేటట్టుచేస్తిరా మీకునుంచిబహుమానంచేస్తాను.

సుభ—యెంతవికారంగా మనకేసి యెఱ్ఱబారి చూస్తూ వున్నాడో చూడు.

ప్రభా—అతికోపంచేత యెలావణకుతూవున్నాడో చూడు.

దుర్గా—నీచెయ్యి నాచేతికిచ్చి నాడి చూడనీ.

పెద్దవ—ఇదిగో చేయిచూడు. (అని చేయిచాపి) అవకతవక మాటలు ప్రేలినపక్షమున, ఈచెయ్యినీదవడకుద్దిచేయుగాక.జాగ్రత్త.

దుర్గా—చేతిలో భూతనాడి ఆడుతూవున్నది. ఈయన దేహ

న్నాశ్రయించి వున్నవో భూతమా! నీపేరు చెప్పి వేగిరం వదిలి పో. వేగిరం వదిలి వెళ్ళని పక్షానికి నామంత్రశక్తిచేత నిన్ను సీసాలో దింపి మారణహోమం చేస్తాను.

పెద్దవ—ఊరుకో దయ్యాలపోతా! వూరుకో నాకు పిచ్చ యెత్తలేదు.

దుర్గా—నేనెరుగుదును; మీకు పిచ్చ కాదు; మీ దేహాన్ని గ్రహాంసోకి యిలా బాధపెడుతూ వున్నది. త్రిపురసుందరినైనా, భ్రమరాంబనైనా, జ్వాలానృసింహమునైనా, శరభసాళ్వమునైనా ప్రయోగించి నిమిషంలో మీకు గ్రహబాధలేకుండా చేస్తాను.

పెద్దవ—ఓరి పరమచండాలుండా! వీరందఱును నీకీప్రకారముగా బోధించి నిన్నిక్కడకు తీసుకొని వచ్చినారా? ఈ యేడుపు మొగము నిర్భాగ్యురాలు తలుపులు బిగించివేసి నన్ను లోపలికి రానియ్యక ఎవనినో లోపల పెట్టుకొని సిగ్గులేక నాయింట నేప్రకారముగా భోజనము చేసినది?

సీత—ఓ ప్రాణనాథా! ఈ మధ్యాహ్నం నీవు నాతో కలిసి మనయింట్లో భోజనం చేసిన సంగతి భగవంతుడికి తెలుసును; నాకు తెలుసును.

పెద్దవ—ఓసిగ్గుమాలినదానా! ఏమనుచున్నావు? నీయింట భోజనము చేసినానా?

పెద్దల—స్వామీ! నేను నిజం చెపుతాను. మీరు యీదినం యింటికాడ భోజనం చెయ్యలేదు.

పెద్దవ—ఇంటితలుపులు వేసివెయ్యలేదా?

పెద్దల—అవును వేసివేశారు. నేను కళ్ళారా చూచినాను.

పెద్దవ—మనమెంత పిలిచినను తలుపు తియ్యలేదు కాదా?

పెద్దల—అవును, మనం యెంతపిలిచినా తలుపు తియ్యలేదు.

పెద్దవ—లోపలనుండికూడ నెవ్వరో తలుపు తీయవలదని కేక వేసినారు కారా?

పెద్దల—అవును, లోపలనుంచికూడా యెవరో తలుపు తియ్యవద్దని కేక వేశారు. నేను చెవులారా విన్నాను.

పెద్దవ—గుమ్మమువద్ద కావలి యున్నవాఁడు నన్ను తిరస్కరించి కానిమాటలు లాడలేదా?

పెద్దల—అవును గుమ్మంవద్ద కావలి వున్నవాడు మిమ్మల్ని తిరస్కారంచేసి మిగతామాటలాడినాడు.

పెద్దవ—నాకంసుచేత కోపమువచ్చి గిరుక్కునమరలి నే నక్కడనుండి మఱియొకచోటికి పోలేదా?

పెద్దల—అవును అక్కడనుండి తత్క్షణం కోపంవచ్చి వెళ్ళిపోయినారు. ఆ సంగతికి నావళ్ళంతా సాక్ష్యంయిస్తూవున్నది. భార్యాగారిమీదవచ్చిన మహాకోపం నావళ్ళిమీద యెక్కడిపడితే అక్కడల్లా కనపడుతూవున్నది.

సీత—ఈయన బద్ధాలలో నీవుకూడా యేకంకావడం కూడానా

సుబ్బా—వానికి సిగ్గాభిమానమయినా లేదు. యజమానుణ్ణి పిచ్చవాణ్ణిచేసి మఱింత ఆడిస్తూవున్నాఁడు.

పెద్దవ—కంసాలివాఁడు నన్నుపట్టుకొనునట్లు చేయుటకు నీవు వానికి సహాయురాలవయినావా?

సీత—అయ్యో! నేనేపాపమూ యెఱగను. ఇంకా మీరు నగల పెట్టెలోవున్న రూపాయలమూట యిమ్మన్నారని లక్ష్మణుడు వగరుస్తూ పరుగెత్తుకొనివస్తే మిమ్మల్ని విడిపించడానికి వెంటనే సొమ్మిచ్చి పంపినాను.

నిజం వప్పుకోవడంలేదా?

సీత—ఓరి పంచమహాపాతకుడా! నీవు రెండుసంగతులలో నూకూడా ఘోరముగాన అబద్ధమాడుతూన్నావు.

పెద్దన—ఓసి దుర్మార్గురాలా! అన్నిసంగతులలోను నీవబద్ధమాడుతున్నావు. నడివీధిలో నన్నువదలిపెట్టిపోవుటయేకాక మీరందరిక్కలిసి పిండీకొంటానని కూడా కట్టుకొనివచ్చి, సిగ్గులేక నాకేసి తేటిపారజూచుచున్నావా? ఈరెండు సంగతులలోను నీగుర్రాలు రెండును నాకుదీసి క్రిందపెట్టెదను. (అని పిడికిలి బిగించుచున్నాడు. అప్పుడిద్దఱుబంట్లు రతనిని పట్టుకొనుచున్నారు.)

సీత—పట్టుకోండి; పట్టుకోండి; నాదగ్గరకు రానియ్యకండి; కట్టిపెట్టండి.

దుర్గా—భూతాలావేశించేటట్టుగా యిద్దఱికీలొంగకుండా వున్నాడు, మీరుకూడా సహాయంరండి.

సుభ—అయ్యో! పాపము! ఉన్మాదప్రకారంగా, తెల్లపోయి వికారపుచూపు చూస్తూవున్నాడు!

పెద్దన—ఏమి మీరందఱునుజేరి నన్ను హత్యచేసెదరా యేమి?—ఓ రాజభటుడా! నీకావలినున్న నన్ను వీండ్రందఱును కొట్టి విడిపించి తీసికొనిపోవుచుండగా చూచుచు నూరకుండెదవేమి?

రాజభ—అయ్యా! మీరీయనను వదిలిపెట్టండి. నాకావలలో వుండగా మీరీయన నెవ్వరూ పట్టుకోకూడదు.

దుర్గా—ఇతనికికూడా వఱ్ఱి తెలియకుండావున్నది. యితణ్ణి కూడా పట్టుకొని కట్టిపెట్టండి. (ఇద్దఱు బిఱ్ఱుగాని కట్టుచున్నారు.)

సీత—ఓరి రాజభటుడా! నీవెందుకడ్డంవస్తావు? పిచ్చివాడిప్రకారంగా బాధపడుతూ అందరినీ కొట్టబోతూవుంటే చూడ

డానికి నీకు సంతోషంగావున్నదా దేమిటి?

రాజభ— ఈయన నాకావలిలో వున్నాడు; ఈయనను వదిలిపెట్టితే యీయన బాకీవున్నసొమ్ము నేను యివ్వాలో వలసి వస్తుంది.

సీత—బాకీమొత్తం యెంతో చెప్పినపక్షమందు నేను యిచ్చి వేస్తాను; ఆవిషయంలో నీవేమీ జడియనక్కరలేదు. నాతో యింటికిరా—ఓభూతవైద్యుడా! నీవుకూడా వెళ్ళియీయనను భద్రంగా లోపలిగదిలో పెట్టించు. ఈరోజు మాకు గొప్పదినము.

పెద్దవ—ఓసి పాపాత్మురాలా!

పెద్దల—నీమూలంగా నన్నుకూడా కట్టిపెట్టినారు.

పెద్దవ—చండాలుడా! నీవేనాకు పిచ్చియెత్తిస్తున్నావు.

పెద్దల—వృథాగా మిమ్మల్ని కట్టిపెట్టితీసుకొని వెళుతూవుంటే లోబడివూరకుంటారా? ఇదివరకు పిచ్చిలేకపోయినా యిప్పుడు పిచ్చెత్తించుకొని యీ దయ్యాలన్నీ హడిలి పారిపోయేటట్టు కేకలు వెయ్యండి.

సుభ—పాపము! యెంత అసందర్భంగా మాట్లాడుతూ వున్నారూ! వీరినిద్దరినీ దైవం రక్షించుగాక!

సీత—మీరీయిద్దరినీ యింటికి తీసుకువెళ్ళండి.—సుభద్రా నీవు నాతో వుండు. (దుర్గాదాసును; సహాయులును, పెద్దవసంతకుడును పెద్దలక్ష్మణుడును వెళ్లుచున్నారు.)

సీత—ఓయీ! యెవరిబాకీనిమిత్తం యీయనను పట్టుకున్నారు?

రాజభ—ఎవరో విశ్వకర్మ అనే కంసాలి బాకీనిమిత్తం నీ వామనిషిని యెరుగుదువా?

సీత—మొగుడను; బాకీమొత్తం యెంత?

రాజభ—నూఱువరహాలు.

సీత—ఆసొమ్ము యెందుకోసం బాకీ వున్నారు?

రాజభ—నీపెనిమిటి చేయించిన చంద్రహారం నిమిత్తం.

సీత—ఆయన నాకోసం చంద్రహారం చేయిస్తూ వున్నానని చెప్పినాడుగాని తీసుకొని రాలేదు.

ప్రజ—నీమొగుడు మధ్యాహ్నం కోటంలో మాయింటికి వచ్చి నావుంగరం పట్టుకొని వెళ్ళినాడు. ఇప్పుడాయన వేలిని వున్నది ఆవుంగరమే. ఆయనను వీధిలో చూచినాను.

సీత—అయివుండును నేనుమాత్రం చంద్రహారం చూడలేదు—ఓభటుడా! కంసాలి యెక్కడ వున్నాడో నావద్దకు తీసుకురా. నిజం అతనివల్ల తెలుసుకొని సొమ్ము యిచ్చివేస్తాను.

[చేతిలో కత్తితో చిన్నవసంతకుడును, చిన్నలక్ష్మణుడును ప్రవేశించుచున్నారు.]

సుభ—హా! దైవమా! రక్షించుము. వాళ్ళు మళ్ళీ వదల్చుకొని వీధిని పడ్డారు.

సీత—ఈసారి కత్తులు దూసుకొని వచ్చినారు. వారిని మళ్ళీ పట్టుకొని కట్టిపెట్టడానికి సహాయం రమ్మని అందరినీ పిలవండి.

రాజభ—పారిపొండి. వాళ్ళిద్దరూ మనను చంపివేస్తారు.

(రాజభటుడును, సీతయు, సుభద్రయు, పాఱిపోవుచున్నారు.)

చిన్నవసం—మనకత్తులు చూచి వారు బెదరినారు.

చిన్నవ—యిందాకా మిమ్ముల్ని మొగుడని వెంబడించినది యిప్పుడు హడలి మీదగ్గిరనుంచి పాఱిపోతూ వున్నది.

చిన్నవసం—ఇంక మనకు భయము లేదు. సత్రమువద్దకు వెళ్ళి మనసామాను పట్టుకొనిరా. ఈరాత్రి బండియెక్కి వెళ్ళిపో వచ్చును.

చిన్నల—యీరాత్రికి మనం యిక్కడవున్నా వుండవచ్చును. వాళ్ళు మనకేమీ కీడు చెయ్యరు. వాళ్ళు మనతో అనుకూలంగా మాట్లాడుతూవున్నారు; మనకు బంగారం యిస్తూవున్నారు. ఈ వూళ్లో వాళ్ళందరూ నాకు బహుమంచివాళ్లుగా కనపడుతూవున్నారు. నన్ను మొగుడని పట్టుకొన్న ఆగ్రామదేవతమూలంగా గాని లేకపోతే యెల్లకాలమూ నాకు యీవూళ్ళోనే వుండవలెనని వున్నది.

చిన్నవసం—మనకు లక్షవరహాలు వచ్చినను నేనీరాత్రి యీ గ్రామములో నుండను. మనసామాను పట్టించుకొని వత్తమురా.

(అని యిద్దఱును వెళ్ళుచున్నారు.)

---

## పంచమాకంము



ప్రథమరంగము—పాతసమీపమున వీధి

[వర్తకుఁడును, విశ్వకర్మయు ప్రవేశించుచున్నారు.]

విశ్వ—నామూలంగా మీప్రయాణం నిలిచిపోయినందుకు బహువిచారంగా వున్నది. అతఁడు శుద్ధఅన్యాయానికి వడిగట్టి యివ్వ లేదంటూవున్నా నేనతనిచేతికి చంద్రహారంయిచ్చినానని ప్రమాణం

వర్త—అతనికి యీపట్నంలో అంత గౌరవం యెందుచేత వచ్చినది?

విశ్వం—అందరున్నూ అతణ్ని బహుగౌరవంగా చూస్తారు; అతను మహామంచివాడు; అబద్ధమన్నమాట అతనినోటినుంచి రాదు; అతని పేరు చెపితే యెంతపరపతి ఐనా పుడుతుంది. యీగ్రామంలో అతనితో సమానులు మరియెవరూ లేరు. యేరాత్రివేళ యేమనిషి చేత అతడు కాస్తవర్తమానం పంపినా తనధనంఅంతా అతణ్నినమ్మి పంపేటంత గురి అందరికీ అతనియందు వున్నది.

వర్త—మెల్లిగా మాట్లాడు; అడుగో అతడు వస్తూవున్నాడు.

[చిన్నవసంతకుడును, చిన్నతమ్ముడును ప్రవేశించుచున్నారు.]

విశ్వ—అవును. అతడు తన కియ్యలేదని ప్రమాణముచేసిన దా చంద్రహారమే. అతడు దగ్గరకు రానీ; అడుగుతాను—ఓవసంతకా! నాకీ అవమానమున్నూ శ్రమానున్నూ యెందుకు కలగచేసినావో నాకు అద్భుతంగా వున్నది; ఇప్పుడు మీరు యింత బహిరంగంగా మెడలో వేసుకొని వీధిలో తిరుగుతూవున్న యీచంద్రహారము లేదనడము మీకు మాత్రం సిగ్గుచేటు కాదా? నన్ను వృధాగా నలుగురిలోనూ పరాభవపరచడమే కాకుండా యీపెద్దమనిషికికూడా లేనిపోనిఆయాసం కలుగచేసినారు. మనవివాదమూలంగా గాని లేకపోతే యీయన యీపాటి ప్రయాణమయి వెళ్ళివుండును. నావద్ద వుచ్చుకున్న చంద్రహారం యిది యిప్పుడు మీరు లేదనగలరా?

చిన్నవసం—అవునిది నీవే నాచేతి కిచ్చినావు కాబోలును! నీ వియ్యలేదని నే నీవఱకెప్పుడును అనలేదే.

వర్త—అవును మీరు లేదన్నారు; లేదని ప్రమాణంకూడా చేసినారు.

చిన్నవసం—నేను లేదను కూడా గాని ప్రమాణం చెయ్యగాఁగాని యెవరు విన్నారు?

వర్త—నాయొక్క యీ రెండు చెవులున్నూ విన్నవి. ఇఁక మాటాడక వూరుకో. పెద్దమనుష్యులలో తిరుగనేర్చినవాడవు. యిటువంటి అబద్ధమాడి సిగ్గులేకుండా మనుష్యుల యెలాగు పెద్దగోతలయి త్తురుని తిరుగుతూవున్నావు?

చిన్నవసం—నామీఁద అటువంటి దోషారోపణము చేయుట చేత నీవు పచ్చిదొంగవుగా కనఁబడుచున్నావు. మగవాఁడవయి నీవు నాతో దెబ్బలాటకు వచ్చిన పక్షమున, నా మహాత్మ్యము మర్యాదయు నీకు నిమిషములో కనఁబడఁగలదు.

వర్త—తిరిగితే మొగంమీఁద చెప్పు. నీవు పెద్దదొంగవని నేను కనుపరుస్తాను. (వారు దగ్గఱకు వచ్చుచున్నారు.)

[సీతయు, సుభద్రయు, ప్రభావతియు, మొదలగు దిక్కున ప్రవేశించుచున్నారు.]

సీత—అక్క—ఆతని కేమి రానే వెఱ్ఱి—ఆతఁడు పిచ్చవాఁడు—కొండలు ముందరకి వెళ్ళి చెప్పి ఒక్కొక్కతో—లక్ష్మణున్నికూడా పట్టుకొని కట్టిపెట్టి యుద్ధమునకు యింటికి తీసుకొనిరండి.

చిన్నల—అయ్యా! పరుగెత్తు పరుగెత్తు. అపచారం; అందులో మూరి తలుపులు లోపల వేసుకొందాము లేకపోతే పెళ్ళిమనని బ్రతకనియ్యరు.

(చిన్నలక్ష్మణుఁడును, చిన్నవసంతుఁడును, మఠములోనికి వెళ్ళుచున్నారు)

[మఠములోనుండివచ్చి యోగిని ప్రవేశించుచున్నది.]

యోగిని—జనులారా! అల్లరిచేయకండి. మీరిక్కడ యెందుకు గుంపుగా చేరినారు?

సీత—మతిచాంచల్యం కలిగి నా పెనిమిటిని [illegible]డనుంచి తీసుకువెళ్ళడానికి మమ్మల్ని లోపలకు రానీ. వేమ్మతణ్ని [illegible]కట్టి పెట్టి వైద్యంచేయించడానికి యి టికి తీసుకుపోతాను.



విశ్వ—ఈయనకు మతి చలించినదని యిదివరకే అనుకున్నాను.

వర్త—ఈయనతో దెబ్బలాటకు సిద్ధమయినందుకు నాకిప్పుడు విచారంగావున్నది.

యోగిని—యెంతకాలంనుంచి యితఁడీస్థితిలో వున్నాఁడు?

సీత—వారం దినములనుంచి యీయన పరధ్యానంగానూ, విచారంగానూ, వ్యాకులంగానూవుండి వెనుకటికంటె యేమోభేదంగా కనిపిస్తూవచ్చినారు. కాని యీరోజువరకూ యింతచేటులేదు. మరీ యీమధ్యాహ్నంనుంచీ వళ్లు తెలియకుండా లేచిపోయినారు.

యోగిని—అవశాత్తుగా యితనిధన మేమయినా విస్తారంగా పోయిందా? ఎవరైనా ప్రాణమిత్రుడు కాలంచేసినాడా? ఇతనిదృష్టి యెవత్తెమీదికైనా పారి అక్రమంగా పరస్త్రీకోసం పరితపిస్తూవున్నాఁడా? వయస్సులో వున్నవాళ్ళు అందగత్తెఅయిన కొత్తదాన్ని చూడడంతోనే దానిమీద కన్నువేసి సాధారణంగా పిచ్చియెత్తి తిరుగుతూవుంటారు. ఈమూడింట్లో నీమొగుడి పైత్యభ్రమకు యేది కారణమయి వుండవచ్చును?

సీత—వకవేళ అయితే నీవు కడపట చెప్పినదితప్ప మరియేదీ కారణమయి వుండదు. ఈయన తరుచుగా యింటికాలస్యంగా వస్తూవుండడంచేత యెవతెవలలోనో పడి యిల్లూవాకలీ మరచి తిరుగుతూవున్నాడని వూహిస్తాను.

యోగి—అపని చేసినందుకయి నీవతణ్ని కూకలు వెయ్యవలసింది.

సీత—నేనుమాత్రం మూరుకున్నానా? కూకలు వేస్తూనే వున్నాను.

యోగి—నీవు తగినంతగట్టిగా కూకలు వేసినట్టు తోచదు.

సీత—భార్య మొగుణ్ని కూకలువెయ్యతగినంత గట్టిగా కూకలువేస్తూనే వచ్చినాను.

యోగి—వకవేళరహస్యంగాకూకలు వేసేవానవు కాబోలును.

సీత — రహస్యంగా మాత్రమే కాదు; బహిరంగంగా కూడాను.

యోగి—అయితే చాలినంత కాదు.

సీత—అలాగయితే నిజం చెప్పుతాను. ఇఖ ఆయనతో నాకు రెండో ప్రసంగమే లేదు. రాత్రి పరున్నప్పుడు నిద్రపట్టిందాకా చెవి దగ్గరచేరి యీసంగతినే గొణుగుతూ వుండేదాన్ని; భోజనమువద్ద కూడా యీసంగతి చెప్పకుండా ముద్ద మింగనిచ్చేదాన్నిగాను; మే మిద్దరమూ వంటిగావున్నప్పుడే యిదితప్ప మరిఒకసంగతి మాటాడేదాన్ని కాను; అతడు పదిమందిలో వుండేటప్పుడయినా యీధోరణే తెచ్చి యెత్తిపొడుపుమాట లంటూనే వుండేదాన్ని. నేను యెప్పుడూ యీ విషయమయ్యే చీవాట్లుపెడుతూ వుండేదాన్ని.

యోగి—నీవాడే మాటలమూలంగానే నీమొగుడికి పిచ్చ యెత్తింది. లేనిపోనిఅనుమానం పెట్టుకొని అహోరాత్రములు చెవి దగ్గర చేరి విరామం లేకుండా సాధిస్తూవుండే భార్యమాటలు వెఱ్ఱి కుక్కకాటుకంటెనూ యెక్కువవిషంగా వుండి యెటువంటి పరమ శాంతుడికయినా నిమిషంలో పిచ్చియెత్తిస్తవి; నీపోరుచేత అతడు రాత్రిళ్ళు నిద్రకుకూడా మొగంవాచినట్టు తోస్తుంది; రోజూ కలత నిద్రపోయేవాడికి మతి చలించిపోవడం అంతఆశ్చర్యంకాదు; నీవాడే

మాటలతో చిన్న అన్నం కడుపున పట్టక నీరయిపోయి వుందును. ఈ ప్రకారం నిద్రాహారాలు లేక యిల్లు అడివిగా నున్నప్పుడు యేరో గాలూ యెదురు రాకుండా వుంటవి ? జారత్వశంక చేత యిదంతా నీవు చేసుకున్న దోషఫలమే. కాబట్టి స్వయంకృతాపరాధము నీది నీవే అనుభవించవలెను.

సుభ—ఆతడు యెంత అక్రమంగా ప్రవర్తిస్తూవచ్చినాగానీ నాఅప్పమాత్రం అతణ్ని మంచిమాటలతోనే బోధిస్తూ వచ్చినది; అంతేగాని తూలుమాట యెప్పుడూ నోటరానియ్యలేదు—(మెల్లగా) ఆమెతప్పితమంతా నీమీద నేమోపి చివాట్లు పెడుతూవుంటే బదులు చెప్పకుండా వూరుకుంటూ వేమి ?

సీత—(మెల్లగా) ఆమె అంతా నానోటనే పలికించి నన్ను నోరెత్తకుండా చేసింది. నేనేమి చెప్పగలను? (బిగ్గరగా)—మీరు లోపలికి వెళ్ళి అతణ్ని పట్టుకోండి.

యోగి—మీరు యెవరూ లోపలికి వెళ్ళకూడదు.

సీత—అలాగయితే మీవాళ్ళ నెవళ్ళనయినా నాపెనిమిటిని యివతలకు తీసుకునివచ్చి నాకు వప్పగించుమను.

యోగి—అది వల్లగాదు. ఇది పవిత్రమయినమఠం గనుక అతను దీనిలో శరణొందినాడు; అందుచేత నేను అతణ్ని మంచి మాటలతో స్వస్థచిత్తుణ్ని చేసేవరకూనీకువప్పగించను. నాప్రయత్నం వ్యర్థమయితే అప్పటిమాట చూతాము; యీలోగా వదలిపెట్టను.

సీత—నాపెనిమిటికి పరిచర్యచెయ్యడం నాకువిధిగనుక, నా పెనిమిటివద్ద నేనే కనిపెట్టుకునివుండి నేనే పథ్యపానాదులు పెట్టి వుపచారం చేస్తాను; మరివకరిని నమ్మి నేను అతణ్ని విడిచిపెట్టను; కాబట్టి నన్ను యింటికి తీసుకువెళ్ళనీ.

యోగి—కొంచెం శాంతించు. అతణ్ని మళ్లీ యెప్పటిమనిషిని చెయ్యడానికి మందులూ మూలికలూ మంత్రాలూ అన్నీ ప్రయోగించి నాశాయశక్తులా పనిచేసేవరకూ నేను అతణ్ని విడిచిపెట్టను. యోగినిని గనుక కష్టంలో వున్నవాళ్ళకు సహాయం చెయ్యడం నాకు ధర్మము. అతణ్ని యిక్కడ నావశంలో వుంచి నీవు వెళ్ళిపో.

సీత—నా పెనిమిటిని విడిచిపెట్టి నేను వెళ్ళను. మొగుణ్నీ పెళ్ళాన్నీ యెడబాపడం నీవంటి పుణ్యవ్రతంలో ప్రవేశించినదానికి ధర్మం కాదు.

యోగి—నే నతణ్ని వదలిపెట్టను; మాటాడక వెళ్ళిపో (అని లోపల తలుపు వేసికొనుచున్నది.)

సుభ—యీ అన్యాయం నీవు రాజుతో వెళ్ళి మొఱపెట్టుకో.

సీత—వెళుదాము రా, నేను ఆయన కాళ్ళమీద సాష్టాంగ పడి, నాప్రార్థనలవల్లనూ కన్నీళ్ళవల్లనూ ఆయన మనసు కరిగించి స్వయంగా యిక్కడకువచ్చి యీ యోగిని చేతులలోనుంచి నా పెనిమిటిని విడిపించి యిచ్చేవరకూ కాళ్లమీదనుంచి లేవను.

వర్త—యిప్పుడు దగ్గరదగ్గరగా అయిదుగంటలుకావచ్చింది. యింకా కొంచెంసేపటికి యీ మఠంవెనకాల వున్నవధ్యభూమికి వెళ్లడానికి రాజుగారు స్వయంగానే యీదోవను వస్తారు.

విశ్వ—యెందుకోసము?

వర్త—యీపట్నంతాలూకు శాసనాలకు విరుద్ధంగా యీ వూరికి వచ్చినందునకయి వక మధురాపురపువర్తకుణ్ని ముసలివాణ్ని వురి తీయించడానికోసము.

విశ్వ—అదుగో వారు వస్తూవున్నారు. అతణ్ని వురితియ్యడం మనం చూతాము.

సుభ—రాజు యీనూరు దాటి వెళ్ళకముందే నీవు ఆయన పాదాలమీఁద పడు.

[ధర్మపాలమహారాజును, సేవకులును, వర్ధమానుఁడును, గారాగృహాధికారియు, రాజభటులును ప్రవేశింతు మన్నారు.]

ధర్మ—'ఏధర్మాత్ముఁడయినను వచ్చి యీతనిప్రాణరక్షణార్థము ధనమిచ్చి పుణ్యము కట్టుకొన్నపక్షమున, ఈతనిని విడుదల చేయుదుము.' అని మఱియొకసారి గట్టిగా చాటింపుఁడు. మన మీతనికీపాటియుపకారమును జేయుదము.

సీత—ఓ మహాప్రభో! యీ యోగిని నాకు చేసిన అన్యాయం విచారించి నాకు న్యాయం దయచేయించవలెను.

ధర్మ—ఆమె మిక్కిలి పుణ్యాత్మురాలు, బహుపూజ్యురాలు: నీవిషయమున లోపమేమియు అక్రమము చేసియుండదు.

సీత—ఓ మహారాజా! అనుగ్రహించి నా మొరాలకించండి. వసంతకుఁడుగారు నాకు భర్త; మొదలివారు చేసిన నమ్మకములను బట్టి నేనాయనను వివాహం చేసుకున్నాను; నాదురదృష్టంచేత ఆయనకు యీరోజున ఉదాత్తుగా పైత్యప్రకోపమకలిగింది నాకుటుంబానికంతా గొప్పవిపత్తు సంప్రాప్తమయింది. ఏమికాలకర్మదోషంచేతనోకాని తనతోపాటు మోకశాలనుండి దెచ్చిన యెత్తైనతన సేవకుణ్ని వెంటవేసుకొని వూరిమీఁదపడి ఆయన కనబడ్డయిల్లెల్లా దూరి వుంగరాలూ నగలూ చేతికి నేదిదొరికితే అదెల్లా యెత్తుకుపోతూ అందరికి అప్రియంచేస్తూవున్నాడు. వకపర్యాయం నేను ఆయనను కట్టిపెట్టించి యింటికిపంపించి, అదివరకాయన అక్కడక్కడ చేస్తూ వచ్చిన నష్టానికి సొమ్మిచ్చి వారిని సమాధానపఱుస్తున్నాను. ఆయన యెలాగోకాని తప్పించుకొని పల్లీవీధిబడి తన సేవకుడునూ

తానున్నూ కత్తులు చూసుకొనివచ్చి మమ్ముతఱిమినారు. తరువాత మేము చాలామందిని సహాయంచేసుకొనివచ్చి మళ్ళీ కట్టిపెట్టడానికి వెంబడించేవరకు వాడు పరుగుత్తుకొనిపోయి యీమఠంలో పడ్డారు. మేమాయనను యింటికి తీసుకపోదామంటే యీయోగిని మాకడ్డం వచ్చి తలుపులు లోపలవేసి మమ్ము లోపలికి వెళ్ళనూవెళ్ళనియ్యాదు; తానాయనను యివతలకు పంపనూపంపడు. దీనులమయిన మా మొర్రాలకించి దేవరవారేలాగయినా ఆమె వారిని యివతలికి పంపేట్లు ఆజ్ఞచేసి పతిభిక్షపెట్టి రక్షించవలెను.

ధర్మ—విస్తారకాలముక్రింద నీభర్త మాయొద్ద నొక సేనానాయకుఁడుగా నుండి మాకు మిక్కిలి యుపకారము చేసినాఁడు. అప్పుడు నిన్నతనికి వివాహము చేయించి మేముచేయఁదగినప్రత్యుపకారమంతయుచేసి మేమాతని బహువిధముల గౌరవించినారము.— మీలో కొందఱువెళ్ళి మఠద్వారమువద్ద నుండి పిలిచి యోగిని మాయొద్దకు తీసికొనిరండు; మేమాతగవుతీర్చి పతియిక్కడనుండి వెళ్లెదము.

[ఒకపరిచారిక ప్రవేశించుచున్నది.]

పరి—అమ్మా! పరుగెత్తుకొనివెళ్ళి వేగిరం నీప్రాణాలు దక్కించుకో. అయ్యగారున్నూ సేవకుడున్నూకూడా వదిలిపించుకొని ఇంట్లోవున్న పరిచారికల నందరినీ కొట్టి, భూతవైద్యుణ్ని కట్టిపెట్టి గడ్డానికి నిప్పంటించినారు; అతడు గడ్డంకాలి యేడుస్తూవుంటే అదృతామన మొగంనిండా బురదవేసికొట్టి నిప్పార్పినారు. మనయజమానుడు శాంతించుమని అతనికి బోధచేస్తూవుండగా, లక్ష్మణుడు కత్తితీసుకుకొని వచ్చి అతనితల రేవురేవులుగా గొరిగినాడు, వెంటనే

మీరు యెవరినైనా పంపితేనే తప్ప వారిద్దరూచేరి మంత్రిగాణ్ని చంపివేస్తారు.

సీత—ఓసిపిచ్చిదానా నోరుముయ్యి నీయజమానుడున్నా సేవకుడున్నా యిక్కడనే వున్నారు. నీవు చెప్పినదంతా అబద్ధం.

పరి—అమ్మా! మీతోడు నేను నిజం చెప్తూవున్నాను. నామాట నమ్మండి. అతణ్ని నేనుచూచి అన్నగా నిముషమయినా అయివుండదు. ఆయన నీపేరుపెట్టి పిలిచి యెక్కడవున్నావని కేకలు వేస్తూ, నీవు కనపడిన పక్షానికి నీమొఖంనిండా గంట్లుపెట్టి నిన్ను విరూపిని చెయ్యకపోతే తనపేరు మార్చుపెట్టుమని వొట్టుపెట్టుకుంటూవున్నాడు. (లోపల పెద్దవసంతకుఁడు కేక వేయుచున్నాఁడు.) అమ్మా! ఆలకించు! ఆలకించు ఆయనమాటలు వినఁబడుతూవున్నవి. ఇక్కడ నిలువకు; పరుగెత్తు.

ధర్మ—జడియకు. ఈలాగువచ్చి నీవు నావెనక నిలుచుండు— ఈబెత్తుపుచ్చుకొని కాచుకొండి.

సీత—అయ్యో! అతఁడు నాభర్త. అతఁడు యెలా కనపడకుండా వచ్చినాడో చూడండి. ఇంతకు మునుపు యితఁడీమఠంలో ప్రవేశించడం చూచినాము. ఇప్పుడప్పుడే అక్కడవున్నాఁడు! అతఁడు ఇప్పుడక్కడికేలాగవచ్చినాఁడో వూహించడానకైనా వీలులేకుండా మహాద్భుతంగా వున్నది.

[పెద్దవసంతకుఁడును పెద్దలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—న్యాయము దయ చేయుండి ఓమహారాజా! న్యాయమునుదయచేయుండి. చిరకాలముక్రిందట నాదేహమంతా నెత్తురు వఱదలుగట్ట గొప్ప గాయములు తగిలినను సాహసము చేసి మీకష్టపడి

నిప్పుడు త్రాగి మత్తుగొనియుండలేదు; కోపముచేత నొడలు తెలియకయు నుండలేదు; నాకు చిత్తోన్మాదమును గలిగి యుండలేదు. ఈదినము నేను భోజనమునకు రాకుండ ఇతని తలుపులు లోపల గడియ వేసినది. ఈకంసాలికూడ కుట్రలో చేరియుండని పక్షమున, ఇతఁడు నాతో నున్నాఁడుగనుక నాపక్షమున సాక్ష్యమియ్యవచ్చును. ఇతఁడు నాతోఁగూడ కొంతదూరము వచ్చి ప్రభావతి యింటివద్దకు చంద్రహారము తీసికొనివచ్చెదనని చెప్పి తనయింటికి వెళ్ళినాఁడు; కాంచనగుప్తుఁడును నేనును గలిసి ప్రభావతియింటివద్ద భోజనముచేసినాము. మా భోజనమైనతరువాత నతఁడక్కడను రానందున కొంతసేపు చూచి నేనితనికొఱకు వెళ్ళినాను. నేనితనిని వీధిలో కలిసికొన్నప్పుడు ఈపెద్దమనుష్యుఁడుకూడ నితనితో నున్నాఁడు. అప్పుడే అసత్యవాదియైన యీ స్వర్ణకారుఁడు నేనీదినమున తనవద్దనుండి చంద్రహారమును పుచ్చుకొన్నానని ప్రమాణము చేసినాఁడు. ఆచంద్రహారము నే నెఱుఁగనిసంగతి భగవంతునకే తెలియును. దానినిమిత్తమయి యితఁడు నన్ను రాజభటునకొప్పగింపఁగా, నేను కోఁబడి సొమ్ము నిమిత్తమై నాసేవకుఁడైన పినిసి మాయింటికిఁబంపినానుగాని వాఁడుసొమ్ముతేక పట్టిచేతులతో నే మరల వచ్చినాఁడు. నేనింటికి వెళ్ళి సొమ్ము భటునివశమున నిచ్చిపంపెదనని రాజపురుషునిని సమాధానపఱిచి వచ్చుచుండఁగా త్రోవలో నాభార్యయు, దాని చెల్లెలును, మఱి కొంత అల్లరిమూఁకయు నాకెదురుపడిరి. వారు తమతో దుర్గాదాసను ఎముకలగూడువలెనున్న యొక జీవచ్ఛవమునుకూడ తీసికొని వచ్చిరి. ఆపడమీనుఁడు తాను భూతవైద్యుఁడనని వేషము వేసికొని నానాడియు చూపులును పరీక్షించి నాకు భూతము సోఁకినదని అఱచినాఁడు. వెంటనే అందఱును నామీఁదపడి నన్ను కట్టిపెట్టి, తీసికొని

వెళ్ళి, నా సేవకునినిగూడ కాళ్ళు వేసికట్టినారు యిద్దరిని నాయింటనే యొక చీకటిగదిలో పెట్టినారు. నేను పండ్లతో కాటికె కట్లుత్రెంపుకొని యీసంగతి మొఱపెట్టుకొనుటకు త్వరణమే యేలినవారి దర్శనమునకు పరుగెత్తుకొనివచ్చినాను. ధర్మస్వరూపులైన దేవరవారు నాకీదినమున సంభవించిన మానభంగమునకును శ్రమకునుతగిన ప్రతిక్రియ చేయవలెను.

విశ్వ—మహాప్రభూ! ఈయన యీరోజు యింటికాడ భోజనం చెయ్యలేదనిన్నీ యింటితలుపులు వేసి వేసినారనిన్నీ యింతవరకు మాత్రం నేను సాక్ష్యం యివ్వగలను.

ధర్మ—అతఁడు నీయొద్దనుండి చంద్రహారమును పుచ్చుకొన్నాఁడా లేదా?

విశ్వ—పుచ్చుకొన్నాఁడు మహాప్రభూ! ఈయన యిక్కడికి పరుగెత్తుకొనివచ్చినప్పుడు యీయన మెడలో చంద్రహారంవీరందరూ కూడా చూచినారు.

వర్త—అంగడివీధిలో నీవు మొదట చంద్రహారం యెరగనని ప్రమాణంచేసి తరువాత, నీవింతకుమును పే యిక్కడపుచ్చుకొన్నట్టు మళ్ళీ నీనోటితో వప్పుకోవడం నేను చెవులారా విన్నాను. అందుమీద నాకు కోపంవచ్చి నీతో యుద్ధమునకు సిద్ధంకాఁగా, జనుల మందనుజూచి నీ వీమఠంలోదూరి యెలాగో గాండీచేత నీవామాల నుంచి ప్రత్యక్షమయినావు.

పెద్దవ—ఈమఠ సమీపమునకు నేనసలు రానులేదు. నీవు నాతో యుద్ధమునకు సిద్ధము కానులేదు. దైవసాక్షిగా నేను చంద్రహారము పుచ్చుకోనులేదు; నీవు నిష్కారణముగా నామీఁద దోషారోపణము చేయుచున్నావు.

ధర్మ—మీరందఱును ఒకదానికొకటి సందర్భించకుండ మాటాడుచున్నారు! మీరందఱును త్రాగియున్నారని నాకు సందేహము కలుగుచున్నది. ఇతఁడీయింటఁ బ్రవేశించఁగా మీరు చూచియుండినపక్షమున; ఇతఁడిక్కడనే యుండి యుండును. ఇతనికి మతిచలనము గలిగియుండిన యెడల, ఇతఁడింత శాంతతతో సహేతుకముగా మాటాడియుండఁడు. ఇతఁడింటికడ భోజనము చేసెనని నీవు చెప్పుచున్నవు; ఇంటివద్ద భోజనము చేయలేదని యీకంసాలి చెప్పుచున్నాఁడు!—ఓరీ! నీవేమి చెప్పెదవు?

పెద్దలక్ష్మ—స్వామీ! యీయన యీదినం యీప్రభావతి యింటివద్దనే భోజనం చేసినారు.

ప్రభా—ఈయన నాయింటికాడనే భోజనం చేసినారు; అప్పుడు నా వేలిది యీవుంగరం కూడా పుచ్చుకున్నారు.

పెద్దవసం—ఔను. నీమాట నిజమే. ఆమెయొద్ద నే నీయుంగరమును పుచ్చుకొన్నాను.

ధర్మ—ఇతఁడీమందిరములోనికి వెళ్ళుచుండఁగా నీవు చూచినావా?

ప్రభా—నేను నిశ్చయంగా చూచినాను మహాప్రభో!

ధర్మ—ఇదంతయు నత్యద్భుతముగా నున్నది. నీవు వెళ్ళి యోగినిని మాకడకు పిలుచుకొని రా—నాకు చూడఁగా మీ కందఱికిని పిచ్చియెత్తినట్టు తోఁచుచున్నది.

(ఒకసేవకుఁడు వెళ్ళుచున్నాఁడు.)

వర్ధ—మహాప్రభూ! నేనొక్కమాట వీరితో మాటాడుటకు నాకనుజ్ఞ యిచ్చెదరా? సామిమ్మిచ్చి నాప్రాణమును కాపాడఁగలవాఁడిందులో నొకఁడున్నట్టు కనఁబడుచున్నాఁడు.

ధర్మ—నీ వెవ్వరితో నేమి మాటాడవలెనో నిర్భయముగా మాటాడవచ్చును.

వర్ధ—అయ్యా! మీపేరు వసంతకుడును, మీయీసేవకుని పేరు లక్ష్మణుడును కాదా?

పెద్దల—ఈఘుడియకు అకు నేనియనసేవకున్నాయినలక్ష్మణున్నే ఈయనయు వసంతకుడే.

వర్ధ—నిశ్చయముగా మీగడ్డలును నన్ను స్మరణకు దెచ్చుకొని యుండురు.

పెద్దల—మిమ్మల్నినగానే నాయొద్దరిసంగతీ మాకు స్మరణకు వస్తూవున్నది. మీంవలెనే మేగున్ను కొంచెంసేపటికిందకట్లలో వున్నాము. మీరున్నూ నావలెనే దుర్గాబాసుగారిచేత వైద్యం చేయించుకున్నారా యేమి?

వర్ధ—నీవు నావంక వింతపడి చూచుచున్నా వేమి? నీవు నన్ను చక్కగా నెఱుగుదువు.

పెద్దవసం—ఇప్పుడు తప్ప నేను నాజీవితకాలములో మిన్నెప్పుడును జూచి యుండలేదు.

వర్ధ—దుఃఖముచేత నారూపముమారిపోయి యుండవచ్చును నాకంఠస్వరమునైన గుఱుతు పట్టినావా?

పెద్దవసం—లేదు.

వర్ధ—లక్ష్మణా! నీవో?

పెద్దల—లేదు. నేనూ ఆనవాలు పట్టలేను.

వర్ధ—నాకంఠధ్వనికూడ మీరెఱుగరా? ఓకాలమా! ఈనాలుగుసంవత్సరములలోనే నాకన్నకొడుకుసహితము నామాట నానవాలు పట్టలేకుండునట్లుగా నాకంఠస్వరమునుగూడ పూర్ణముగా

మార్చివేసినావా? వార్ధకముచేతను దుఃఖములచేతను నేనెంతమాఱి పోయినను, నాదృష్టిమాత్రము నాకన్నులను విడిచిపెట్టక నీవు నా కొమారుఁడ వని చూపు చున్నది. నేనిట్లు మఱియొకలాగునననుకోఁ గలను?

పెద్దవసం—నాతండ్రిని నేనెప్పుడును చూచి యుండ నేలేదు.

వర్ధ—కొమారా! నాలుగుసంవత్సరములక్రిందట నీవు నన్ను మథురాపురములో విడిచిపెట్టి వచ్చినావు. ఒకవేళ నిట్టిదురవస్థల నున్న నన్ను తండ్రివని యొప్పుకొనుటకు సిగ్గుచేత నీ విట్లనుచున్నా వేమో?

పెద్దవ—ఈమహారాజును నన్నెఱిఁగిన వీరందఱును చిర కాలమునుండి నేనిక్కడనే యున్నాననియు, నేనెప్పుడును మథురా పురమునకు వెళ్ళ లేదనియు సాక్ష్య మియ్యఁగలరు.

ధర్మ—ఓయివృద్ధుఁడా! పదియేను సంవత్సరములనుండి మే మీతనికి ప్రాపకులముగా నున్నాను. ఈకాలములో నీతఁ డెప్పుడును మథురాపురమునకు వెళ్ళి యుండలేదు. వృద్ధత్వముచేతను కష్టముల చేతను నీమతిపోయి నీ వీలాగున భ్రమపడి యుందువని మే మను కొనియెదము.

[చిన్నవసంతకునితోను, చిన్నలక్ష్మణునితోను, యోగిని ప్రవేశించు చున్నది.]

యోగిని—ఓమహారాజా! అన్యాయము సంభవించిన యీ మనుష్యుణ్ని రక్షింపుఁడు. (అందఱును జూచుటకు గుంపు కూడు చున్నారు.)

సీత—నాకిద్దఱుభర్తలు కనఁబడుతూ వున్నారు! నాకళ్ళకు భ్రమగప్పినదా యేమి?

ధర్మ—వీ రొకరికొకరు ప్రతిబింబములవలె నున్నారు. వీరిలో నిజమయినవాఁ డెవఁడో యెవరు నిర్ణయింపగలరు?

చిన్నల—లక్ష్మణున్ని నేను. యీ రెండోవాణ్ని అవతలకు పంపివెయ్యండి.

పెద్దల—నేనులక్ష్మణున్ని నన్నిక్కడ వుండనియ్యండి.

చిన్నవ— మీరు వర్ధమానులా? లేక ఆయనప్రతిబింబమా?

చిన్నల — ఓహో! నాపెద్దయజమానుఁడు! ఈయనను ఈప్రకారంగా కట్టి యెవ రిక్కడకు తీసుకువచ్చినారు?

యోగిని—యెవరు తీసుకొవస్తే నేమి? నే నీయనకట్లువిడిపించి మళ్ళీభర్తను సంపాదించుకొంటాను. ఓపుణ్యాత్మా! పూర్వము చారుమతి అనేభార్యను వివాహం చేసుకొని ఆమెవల్ల యిద్దఱుకవల పిల్లవాళ్ళను కన్న వర్ధమానులు మీరేనా? ఈచారుమతితో మాటాడండి.

వర్ధ—నే నిప్పుడు స్వప్నావస్థలో లేనిపక్షమున నీవు నిశ్చయముగా చారుమతివే. నీవుచారుమతివే యయినయెడల, అప్పుడునీతో గూడ సముద్రములో తేలిబ్రతికిన పుత్రుఁ డెక్కడనున్నాఁడో చెప్పు.

చారుమ—నన్నూ నాకొడుకునూ సేవకుఁడయిన లక్ష్మణున్నీ తమపడవలలో యెక్కించుకొన్న చేపలవాళ్లు దుర్మార్గంచేసి పిల్లలిద్దరినీ బలాత్కారంగా నాదగ్గరనుంచి తీసుకుపోయి యెవరికో అమ్ముకొన్నారు. తరువాత వారిస్థితి యేమైనదో నాకు తెలియదు. నేను చిరకాలం అక్కడవుండి తరువాత యీపట్టణంచేరి నాలుగేళ్ళనుంచి యీమఠంలో యోగినినిగా వున్నాను.

ధర్మ—ఇతఁడీప్రాతఃకాలమునఁ జెప్పినకథ యిప్పుడు విదర్శనముగా కనఁబడుచున్నది. ఈయిద్దఱు వసంతకులు నేకరీతిగా నున్నారు; ఆప్రకారముగానే యీయిద్దఱు లక్ష్మణులునుకూడ నచ్చునఁ బోడిచిన ట్లొకవిధముగా నున్నారు. దైవవశముచేత నకస్మాత్తుగా కలిసికొన్న వీరిద్దఱును వీరిజనకులు.—వసంతకా! నీవు మొట్టమొదట రామనాథపురమునుండియే కాదా కాళహస్తితీసికొని రాఁబడినావు?

చిన్నవ—నేను కాను. నేను మధురాపురమునుండివచ్చినాను.

ధర్మ—నీవు దూరముగా నిలుచుండుము. మీలో నెవరెవరో నాకేభేదము తెలియకుండ నున్నది.

పెద్దవ—రామనాథపురమునుండి వచ్చినవాఁడను నేను మహాప్రభూ!

పెద్దల—ఈయనతోఁ గూడా వచ్చినది నేను.

పెద్దవ—మమ్మిక్కడకు తీసికొనివచ్చి దేవరవారి కొప్పగించినది మీ మేనమామగారైన సుబంధుఁడను మహావీరుఁడు. పల్లెవాండ్రవద్దనే మమ్మాయనకొని పెంచినారు.

సీత—మీయిద్దరిలో యెవరు యీమధ్యాహ్నం నాతో భోజనం చేసినారు?

చిన్నవ—నేను.

సీత—మీరు నాభర్తగారు కారా?

పెద్దవసం—ఆతఁడు నీభర్త కాఁడని నేను రూఢిగా చెప్పఁగలను.

చిన్నవసం—నేనును మధ్యాహ్న మీమాటయే యీమెతోఁ జెప్పినాను; ఈమె నామాట నమ్మినదికాదు.—ఓసుభద్రా! నేను

మధ్యాహ్నము నీతో నేమిచెప్పినానో స్మరణకు దెచ్చుకో; ఆ మాట నిజముచేయుటకు సమయమువచ్చుచున్నది.

విశ్వ—మీరు నావద్దపుచ్చుకొన్న చంద్రహారమదే.

చిన్నవ—అవును. ఎవరుకాదన్నారు?

పెద్దవ—ఈ చంద్రహారము నిమిత్తము నీవు నన్ను రాజభటుల కొప్పగించినావు.

విశ్వ—అవును కాంబోలును.

సీత—నేను లక్ష్మణునిచేత మీకు ధనం పంపినాను. వాడు మీకిచ్చినాడు కాడు.

పెద్దల—లేదు. నాచేత నీవు సొమ్ము పంపలేదు.

చిన్నవ—ఈరూపాయలమూట నాసేవకుండు తెచ్చి నాచేతి కిచ్చినాడు. మన మొకరిసేవకుని నొకరిసేవకునిగా భ్రమించుటవలన ఈచిత్రములన్నియు పుట్టినవి.

పెద్దవ—ఈధనము నేను నాతండ్రి ప్రాణరక్షణముకొఱ కిచ్చెదను.

ధర్మ—నీధనదాన మక్కఱలేకయే నీతండ్రికి మేము ప్రాణదానము చేసినారము.

ప్రభా—ఆవజ్రపుటుంగరము మీవేలిది నాది.

పెద్దవ—అవును. నీయుంగరమిదిగో నీవుపుచ్చుకో.

(అని యిచ్చుచున్నాఁడు)

చారు—ఓమహారాజా! దేవరవారు మాతో యీమందిరంలోకి విజయంచేసి, సావకాశంగా మాసంభాషణవిని, కొంచెంసేపు మా గృహపావనం చెయ్యవలెనని వేడుకొంటూవున్నాను. యీరోజున యిక్కడ పోగయి మామూలుగా శ్రమపడ్డవారందరూ కూడా

లోపలకు దయచెయ్యవలెను; మేము మిమ్మల్నందరినీ సమాధానం చేసి పంపుతాను. ఓపుత్రులారా! మిమ్మల్ని యెడబాసి యిరవై సంవత్సరాలైనది; యింత కాలమునకు యెప్పుడూ యెదురుచూడని దే మనమందరమూ వక్కచోట కలుసుకున్నాము గనుక లోపలికివెళ్ళి కొంచెంసేపు సల్లాపసౌఖ్యం అనుభవింతాము రండి.

ధర్మ—మిక్కిలి సంతోషముతో లోపలకువచ్చి మీసంభాషణవిని వేడుకపొందెదము.

(రాజును, చారుమతియు, వర్ధమానుడును, ప్రభావతియు, వర్తకుడును, విశ్వకర్మయు, పరిజనమును వెళ్ళుచున్నారు.)

చిన్నల—అయ్యా! బండిమీద యెక్కించడానికి తీసుకొని వెళ్ళిన మీసామానుపట్టించుకురానా?

పెద్దవ—నాది యేసామాను బండిమీద నెక్కించినావు?

చిన్నల—సత్రమువద్దనున్న మీసరకులు.

చిన్నవ—వాడు నాతో చెప్పుచున్నాడు. లక్ష్మణా! నీ యజమానుడను నేను. అవి తరువాత తీసికొని రావచ్చును. మాతో లోపలికి రా. ముందు నీసోదరుని కౌగిలించుకొని మీరిద్దఱునుకలిసి లోపలికిరండి. (పెద్దవసంతకుడును, చిన్నవసంతకుడును, సీతయు, సుభద్రయు, లోపలికి వెళ్ళుచున్నారు.)

చిన్నల—నీయజమానుడి యింటికాడ కొండంతమనిషివకత్తె కనపడ్డది. అది నన్నుచూచి నీ వనుకున్నది; నా వదినెగారు కాబోలును!

పెద్దల—యెలాగు భ్రమపుట్టకుండా వుంటుంది? సరిగ్గా నీవు నా అద్దంలో నీడలాగు వున్నావు. నీరూపాన్నిచూస్తే నేనూ అంత గాణ్ణే అని తోస్తుంది. మనంకూడా లోపలకు వెళుదాముర.

చిన్న—నీవు పెద్దవాడవు. ముందర నీవు నడువు.

పెద్దల—ఆభేదం మనకుతప్ప యెవరికీ తెలియదు. అందరికీ తెలియడానికి యేమిచేశాం ?

చిన్నల—అందరికీ తెలియడానికి తరువాత మనంయేమైనా ఆపవాలు వేసుకుందాము. అందాకా నీవు ముందర నడువు.

(అని వెళ్లుచున్నారు.)

సంపూర్ణము.

——: o :——

బాక్సు ప్రెస్, రాజమండ్రి 1950.



# రాగమంజరి




గ్రంథకర్త:-

కందుకూరి వీరేశలింగము పంతులు



నాల్గవ కూర్పు

ప్రకాశకులు:-

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

# ఈ నాటకమునందువచ్చు పాత్రములు



## పురుషులు

1. సుదర్శనవర్మ—విజయవర్మకును, భానుమతికిని తండ్రి.
2. విజయవర్మ—సుదర్శనవర్మ కొడుకు: సుదంతప్రియుఁడు.
3. కామపాలుడు—భానుమతిప్రియుఁడు.
4. వసుకాముఁడు—భానుమతిని వివాహమాడఁగోరినవాఁడు.
5. చంద్రకేతుఁడు—వసుకాముని మిత్రుఁడు.
6. నారాయణశర్మ—పురోహితుఁడు.
7. గండభేరుండాచార్యులు—కేశవస్వామి యర్చకుఁడు.
8. కంఠీరవాచార్యులు—రెండవయర్చకుఁడు.
9. దామోదరుఁడు—విజయవర్మ సేవకులలో నొకఁడు.
10. దారకుఁడు—సుదర్శనవర్మ సేవకులలో నొకఁడు.
11. ఘటకుఁడు—సుదర్శనవర్మ సేవకులలో నొకఁడు.

## స్త్రీలు

12. భానుమతి—సుదర్శనవర్మ కూతురు; కామపాలుని ప్రియురాలు.
13. సుదంత—విజయవర్మప్రియురాలు; మాధవసేనుని కూతురు.
14. రాగమంజరి—భానుమతి పరిచారిక.
15. చతురిక—భానుమతి పరిచారిక.
16. సుదంతపరిచారిక.

[అప్పుడు తనమిత్రుని నొకని తోడుచేసికొని కామపాలుఁడు మాఱువేషముతో ప్రవేశించి పాడుచున్నాఁడు.]

ద్విపద. చెప్పవె మా వీణియ! చెచ్చెరనాకు
ఇప్పుడు వెడలు నీమృదులస్వరంబు
నీయజమానుని నెమ్మదిలోని
పాయని వెతయెల్లఁ బల్కఁగాఁగలదె?
పటుమతి నిటఁ గ్రిందఁ బాడువారెవరొ
వుటపుటనిట్టూర్పు పుచ్చువారెవరొ
నలువొందనిద్రించు నాప్రియురాలు
తెలిసికోవలసిన, తెగనమ్మెనామె
కమ్మనినిద్దుర కనుఁబాయకుండ
నిమ్మళంబుగఁ బాడి నిట్టూర్పు లిమ్ము.
ఏ నింతకంటెను హెచ్చుగాఁదెల్పఁ
బూని తెగింపకయుండె స్వప్నమున
నాభాగ్యదేవత నళినాక్షి చెవిని
సాభిలాషగబోధ సలుపునుగాక!

మిత్రు—కామపాలా! నీవీలాగున దీనముగా పాడుచున్న యెడల నీప్రియురా లెప్పటికిని మేలుకొనదు. ఉయ్యాలలోనున్న పసిబిడ్డవలె వలపుసహితము జాలికొలుపు పాటలచేత జోకొట్టఁబడి మఱింత నిద్రపోవును.

కామ—ఆమెకు నిద్రాభంగముచేయ నామనసు కొలుపదు.

మిత్రు—మేలుకొల్పినయెడల లేచివచ్చి పల్కరించునంతటి గౌరవమామెకు నీయందు లేదని యెఱుఁగుదువు గనుకనే నీ వామె నిద్రాభంగమున కింత భయపడుచున్నావు.

కామ—అట్లయిన నీకిప్పుడా సందేహము తీర్చి నమ్మకము పుట్టించెదను చూడుము. (అని పాడుచున్నాఁడు.)

ఉ. వేకువ చేరవచ్చె యిదె వేగమె రాత్రిని సాగనంపెదన్;
నీ కమనీయనేత్రముల నీవిఁక విప్పుము, సుందరీమణీ!
యీకడ నీసురూప మనుమింపఁగ బ్రొద్దుదయించు నంతకున్
నాకు వెలుంగు గన్పడను, నాకుఁబగల్ గనిపించ దింతయున్

భానుమతి—(ఒకగవాక్షమునుండి బయలు పాడుచున్నది.)
సుగంధివృత్తము. విన్నదాన లేచి నన్ను వేఁడు నీదుగీతమున్;
కన్నదాన నేత్రరంజకంబుగాఁ బ్రభాతమున్;
నన్నుఁ బాటపాడి వేఁడు నాయకున్ మనంబులో
నెన్నుకొంటిఁ గాముఁ డంచు నిమ్మహీజనంబులో.

సుదర్శనవర్మ—(మఱియొక గవాక్షమునుండి) ఎవరురా తులువలు గాణలతోను వీణలతోను రాగములతోను భోగములతోను ఆటలతోను పాటలతోను మా వీధిని జేరి యల్లరి చేయుచున్నారు? పొండి, పాటకులారా! పరుగెత్తిపొండి.

భాను—నాన్నగారూ! వృథాగా మీ రేల యిట్లాగ్రహపడెదరు? ఊరకుండుఁడు.

కామ—ప్రియురాలా! నేను నీవిధేయ సేవకుఁడను.

సుద—అమ్మాయీ! ఆ మోసపుమాటలను నీవు చెవియొగ్గి యేల వినెదవు? గవాక్షములోనుండి లేచి రా.

భాను—ఓ ప్రియుఁడా! అనుజ్ఞ వేఁడుకొనెదను.

కామ—నీవు పోక తీఱదా?

భాను—మన మొకవేళ మరలశీఘ్రముగా నేకలిసికోవచ్చును. మనకు దురదృష్ట మొకగొప్పశత్రువుగా నున్నను, మనపక్షమున

లక్షణమా? నీ వెప్పుడును నన్ను మనసార ప్రేమించితి వని నే ననుకోను.

దామో—(తనలో) నేనును అనుకోను.

విజ—అట్లుగాక స్త్రీజనస్వాభావిక మయినచపలత్వమును బట్టి మనస్సు గడియ గడియకును మాఱుచుండుటచేత నిట్లని యుండునా?

దామో—(తనలో) స్త్రీలచిత్తములు క్షణక్షణమును మాఱుచున్నను వారుమాత్ర మది యొప్పుకోరు.

విజ—ప్రపంచములో సుదంతవలె నవివేకిను లగువారు మఱియెవ్వరైన నున్నారా?

దామో—(తనలో) నాకొక్కఁడు కనఁబడు చున్నాఁడు!

విజ—ఉన్నారు. ఆమె చపలత్వమునకు దాసుఁడయి యున్న యీబుద్ధిహీనుఁ డటువంటివాఁడే. (అని తన్ను చూపుకొనుచున్నాఁడు)

దామో—(తనలో) ఈసంగతి యితఁడు తెలిసికోఁగలఁడని నేనీవఱకే యనుకొన్నాను.

విజ—ఓహో! నీవెంత చంచలురాలవు! ఓదయావిహీనురాలా! తెలివిమాలిన నీయుపకారత్వముచేత నన్నెంత దుఃఖపెట్టుచున్నావు? నాదృష్టికి నీవిప్పుడు దోషరాశివిగాఁ దోఁచుచున్నావు. నీచూపులే కావలసినంత తిరస్కారమును వెడలఁగ్రక్కుచున్నవి. ఒక్కచూపులే కావు నీచిఱునవ్వులును. అయ్యో! నేనిప్పు డాచిఱునవ్వుల నేల తలపెట్టితిని? ఆమె సుందరమందహాసములోనే దృష్టిని మిఱుమిట్లు గొల్పెడు సోయగమును హృదయమును మరులుగొల్పెడు విభ్రమమును నామనస్సునకు పాడకట్టుచున్నవి. సాకిప్పుడు మరణో

స్వాదము లాసన్న మగుచున్నవి. నాప్రియురాలు లభింపక పోయిన యెడల నేనిఁక ప్రాణత్యాగము చేసికొనెదను.

దామో—(తనలో) ఔరా! ఆవిషపునవ్వులే యందఱిని జెఱుచుచున్నవి.

విజ—(పాడుచున్నాఁడు)

ద్విపద. సుగుణసంపదయెల్ల పొరిఁదిని మఱచి
మగువదోషంబులె మదిని నిల్పంగఁ
జాలుదునేని, నిప్పుతోపాతమునఁ
గ్రాలువివేకంబు కడు వేగఁ గాముఁ
డాము దుర్బలుఁగాఁగఁ దప్పక చేయు;
కాని, కోపమువచ్చి కాంతదోషముల
నెన్నంగ మదిలోన నేఁ బూనినపుడు
క్రన్నన నడుమను గాముండు వచ్చి
కలికిసద్గుణములఁ గాన్పించి నాకు
నల వివేకము నిట్టె యంధంబుఁ జేయు.

దామో—స్వామీ! కామపాలుఁ డిటువచ్చుచున్నాఁడు.

విజ—మంచిది. నీవింటికిపొమ్ము. నేనును నీ వెనుకనే వచ్చెదను.

దామో—ఆహా! ఆకుత్సితపునవ్వులు!

(అని నిష్క్రమించుచున్నాఁడు)

[అప్పుడు కామపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విజ—కామపాలా! నీవు మాగుమ్మమువద్ద పాడుచుండఁగా మిమ్మువిడిచివచ్చినానని దామోదరుఁడు చెప్పినాఁడు. మాతండ్రిగారు లేవలేదుగదా?

కా:—లేచినాడు. ఆయన సంగీతప్రియులుగనుక, ఇనుప కమ్ములు వేసిన గవాక్షములో నిలుచుండి బోనులోని పండుకోతివలె కావలసినంతసేపు గొంతు బద్దలుచేసి కొండనిలేచివచ్చినాను. నీ వింతపెందలకడనే యిల్లుబైలుదేఱివచ్చుటకు కారణమేమి?

విజ—నీతో చెప్పినానో లేదో కాని సుదంతసవతితల్లి తనభర్తయైన మాధవసేనుని సొత్తంతయు తాను గన్నకొమార్తెకే యిప్పించవలెనని తంత్రముచేసి తండ్రి నొడఁబఱిచి సుదంతను యోగినినిగా మఠమున కర్పింప నిర్ణయించుకొన్న దినము రేపేసుమా. అందుచేత నేను సర్వమునకు తెగించి, వీధితలుపు తాళముచెవి కష్టపడిసంపాదించి, లోపల గడియవేయకుండ సుదంత పరిచారికకు లంచమిచ్చి, తెల్లవాఱుజామున రెండుగంటలకు రెండవకంటివా రెఱుఁగకుండ లోపల ప్రవేశించి, సుదంతగదిలో దొంగతనముగా దూఱినాను. అప్పుడు నాప్రియురాలు మేలుకొని కూరుచుండి కన్నులనీరు పెట్టుకొనుచున్నది.

కామ—ఓవిజయవర్మా! నీ వదృష్టవంతుఁడవు.

విజ—తొందరపడక పర్యవసానము వినుము. రాత్రిపూట వేళగానివేళను వచ్చి తనగదిలో ప్రవేశింప సాహసించినందుకు నన్నామె పరమ సాహసికుఁడయిన దుష్టవర్తనునితో సరిచేసినది.

విజ—ఇది యారంభదశలోలేదు. అదేయంత్యదశ. అటుతరువాత నామాట యొక్కటియైనను వినిపించుకొనక తత్క్షణము గదివిడిచి లేచి పోనిపక్షమున తనతల్లిని లేపెదనని బెదరించినది.

కామ—మంచిది కడపట నేమిజరిగినది?

విజ—కడపటనా? మొదట నేను లోపలప్రవేశించినట్టుగా నే

మరల చేతు లూఁచుకొనుచు మాటుమాటాడక లోపలినుండి వెలుపలికివచ్చుట జరిగినది.

కామ—ఆమెకు కోపమువచ్చునని నీవక్కడ నేమియు చేయలేదుగదా?

విజ—దైవముతోడు! నే నేమియు చేయలేదు. పది పండ్రెండుసారులు మాత్రము బలవంతముగా బుగ్గలు ముద్దుపెట్టుకొన్నాను.

కామ—అంతేకద? అటువంటి మోటుతనము నే నీవలని కెన్నఁడును వినియుండలేదు.

విజ—చీచీ! నేనుమోటుతన మెంతమాత్రమును జూపలేదు. నామాటనమ్ము. నే నామెయెడల మిక్కిలి గౌరవముతో నే నడచుకొన్నాను.

కామ—ఈశ్వరసాక్షి! నీవిషయమయి చెప్పలేదు. నే నది సుదంతవిషయమయి చెప్పినాను. విజయవర్మా! నీవు తలుపు తాళము చెవి వారివద్ద నిచ్చియే వచ్చినావుగదా?

విజ—ఇచ్చివచ్చినాను. నన్ను సాగనంపుటకయి వెలుపలికి వచ్చిన పరిచారిక తీసికొనిపోయినది.

కామ—అట్లయినపక్షమున, సుదంత రూఢిగా నీవెనుక నే యిల్లువిడిచివచ్చునని నేనిప్పుడు ప్రమాణముచేసి చెప్పఁగలను.

విజ—ఒకవేళ నాప్రతిపక్షి నెవ్వరి నైన ధన్యునిజేయుటకయి వచ్చునేమో! నాప్రస్తుతస్థితినిబట్టి విచారింపఁగా నాకిప్పు డందఱి యందును సందేహము కలుగుచున్నది. వెనుక నీవుకూడ సుదంతను కామించి, నావలెనే యామెను భాగ్యదేవతనుగా భావించుకొను చుంటివికాదా?

కామ.—ఆమెకు నామీఁద ననురాగము లేదని తెలిసికొను వఱకును నేనామెను మోహించినాను. కాని నేనటుతరువాతవరింపఁ దగినశుభలక్షణ మొక్కటియు నామె సుఖమునందు లేదనుకొనితుద కభావ విరక్తి చేసికొని మరలుకొన్నాను.

ద్విపద. కాంక్షతోడను నన్నుఁ గాంచనికనుల
వీక్షింప ఘనశోభ నెప్పుడును నేను;
ఏనానఁగా లభియింపనిమోవి
నేను సుధారస మెప్పుడుఁ జూడ;
తద్దయు ననుఁగోరు తరళాయతాక్షి
నిద్దపుఁజెక్కుల నెఱిమించునేని,
పలుముద్దు లిడి నేను పరికించుదాక
తళుకుఁజెక్కులటంచుఁ దలఁపను నేను
ఏణాక్షిహస్తంబు మృదువందు రేని,
పాణినంటుచు నేనె పరికింపవలయు;
మరలఁ గృతజ్ఞత మగువ నాచేయి
కరుణఁబట్టినదాఁక కనినమ్మ నేను.
పొలఁతినిట్టూర్పులు పుచ్చుచునుంట
తిలకింపవలసినఁ దేటగా నేను,
యువతి న న్నాశించి యూర్పుచున్నట్టు
లవగతమైనఁగా కరయులే నేను.

అంతేకాక నీచెల్లియందు నాకు గాఢానురాగ మున్నసంగతి నీకు దృఢముగా తెలియునుగదా? ఆవిషయములో నాకు నీవు తోడు పడుము. సుదంతవిషయములో నీకెంతమాత్రమును నేను శ్రమ కలుగనియ్యను.

విజ—మా కుటుంబగౌరవమునకు హాని రాకుండ నాకు సాధ్యమయినంతవఱకు నే నావిషయములో నీకు సదుపాయము చేసెదను. కాని యింటినుండిమాత్రము నీవు భానుమతిని లేవఁదీయఁగూడదు సుమా.

కామ—ఇంటినుండి సుదంతనుమాత్రము నీవు లేవఁదీయ ప్రయత్నము చేయవచ్చునా?

విజ—అది వేఱేసంగతి. పరులవిషయములో మనము జరిగించునట్లుగా మనభార్యలవిషయములోను మనతోఁబుట్టువులవిషయములోను పరులు జరిగించుటకు మన మొప్పుకోము. ఇక్కడ మఱియొకసంగతికూడ నున్నది. రేపటిదినము సుదంతను బలాత్కారముగా యోగినిని జేయఁబోవుచున్నారు.

కామ—సరే. ఇప్పుడు నేనుమాత్ర మటువంటి నిర్భాగ్యస్థితిలో లేనా? రేపటిదినము మీతండ్రియు భానుమతిని బలవంతముగా వసుకాముసకిచ్చి వివాహము చేయఁబోవుచున్నాఁడు. నాతో రా. మన మేదయిన నుంచియుపాయము నాలోచింతము.

విజ—నే నింటికి పోవలెను.

కామ—మంచిది. నాకు సెల విమ్ము.

విజ—అవునుగాని, కామపాలా! నీకొకవేళ నాచెల్లెలిమీఁద ననురాగము లేకపోయినను మర్యాదయు మనస్నేహమును విచారించి సుదంతవిషయములో నీ వేమియు విఘ్నము తలపెట్టఁగూడదుసుమా.

కామ—గీ. ధర్మమూలంబు మైత్రి యిద్ధరణిమీఁద;
మనుజులను జేరి వలపు పైకొనియె నేని,
వలపునకుఁ దాము ననుకూలపడక యున్న
నిలువవే ధర్మములు నొక్కనిమిష మైన.

గీ. నేను జెలులకుఁ జేయు వాగ్దానములను
శౌర్యధర్మంబులంచుఁ దలంతు నెపుడు;
వలపునకుఁ జేయు నల్ప్రమొక్కుబడులనెల్ల
నేను మతధర్మము లటంచు నెంతు మదిని.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

విజ—ఈవిషయమయి కామపాలునితో నేనెప్పుడు ప్రసంగము చేసినను నాకీతనిచర్య యేమో వక్రముగా నేకనఁబడుచున్నది. అందువలన నామనస్సునకారాటము హెచ్చుచున్నది. ఇంతకువచ్చిన మీఁదట సుదంత యీతనిని వరించునేని నేను నిశ్చయముగా ప్రాణములు విడువవలసినవాఁడనే.

మ. అనుమానింపఁగ హేతువున్న, నను రాజబ్జాక్షి కామించునం
చును దెల్పంగ నిదర్శనంబులె కనుంజూపట్టు; నాశంక యిం
కను సత్యంబగునేని నేను జెడితిన్; గాదేని నేసౌఖ్యముం
గన నర్హుండనుగాను; లోనఁ బెరుఁగుం గాయీర్ష్యదుఃఖంబులన్.

ఉ. నాయెడ నాతిమిన్న చిఱునవ్వొలయించిన నెంతపూజ నేఁ
జేయఁగఁజెల్లునో యెఱుఁగఁ; జేడియనవ్వులె యన్యుఁ జేరినన్
బాయఁగఁజెల్లు నావలపు; నామదివేదన యెల్లతీఱెడున్
బ్రేయసి నన్నిటుల్ వెతలఁబెట్టుకొలందిన ప్రేమహెచ్చఁగన్?

(అని నిష్క్రమించుచున్నాఁడు)

---

3. రంగము—సుదర్శనవర్మ గృహములోని గది.



[భానుమతియు, రాగమంజరియు ప్రవేశించుచున్నారు]

భాను—ఓ చెలీ! రాగమంజరీ! మన మాలోచించిన యుపాయము నిరపాయముగా సాగునని నీవు నమ్మక మున్నదా?

రాగ—భానుమతీ! వినుము. నా కావిషయములో నెంత మాత్రమును సందేహము లేదు. కాని మన మాలోచించిన యుపాయమును వెంటనే ప్రయోగింపవలెను. నీకదిలో నేను చేయవలసినది సర్వమును సిద్ధము చేసినాను; ఇఁక నందు జరగవలసినదానికి మనము మనభాగ్యదేవతను నమ్ముకొని యుండవలెను.

భాను—తాను నిర్ణయించినవానిని వివాహమాడుటకు నే నంగీకరించువఱకును నాముఖము చూడనని నాతండ్రి ప్రతిజ్ఞ చేసినాఁడు.

రాగ—ఈవిషయమే యొకఁడు తనమిత్రుఁ డయిన జయపాలునితో మాటాడుచుండఁగా నేనును పొంచుండి విన్నాను.—"నా కూఁతురు వసుకాంతుని పెండ్లియాడుట కొప్పుకొనునో లేదో రేపు గట్టిగా కడసారి యడిగి చూచెదను; భానుమతి యొప్పుకొనుట కనుమానించినయెడల, నాకూఁతురు నాకు మరల విధేయురాలయి నా యాజ్ఞ శిరసావహించువఱకును నేను దానిని కన్నెత్తిచూడను; దానితో నోరు తెఱచి మాటాడను."—అని నీతండ్రి చెప్పినాఁడు.

భాను—అతఁ డన్నమాట తిరుగక యెప్పుడును పట్టినపట్టు విడువని కఠినస్వభావుఁడని యెఱిఁగియే నేను తప్పించుకొనిపోవుట కయి నీవీయుక్తి పన్నితివి కదా. ఈకృషిలో మనపరిచారిక మన కనుకూలురాలుగా నుండునట్లు పదిలపఱిచినావా?

రాగ—అది యీయుపాయములో మొదటినుండియు నాతో చేరియే యున్నది. నీప్రయత్నము సఫలమయిన పక్షమున, వసుకాంతుని విషయములో నీ కున్న స్వాతంత్ర్యమును బాధ్యతయు సర్వమును నాకు విడిచిపెట్టెదనని నీవు వెనుక చేసినవాగ్దానమును మఱ

[illegible]

భాను—నేనది సంతోషపూర్వకముగా చెల్లించెదను. సాధ్యమయినయెడల నీవాతనిని దక్కించుకొమ్ము. మీరుభయులును చిరసుఖ మనుభవింపవలయునని కోరి నిరంతరమును పరమేశ్వరుని ప్రార్థించెదను. అతఁడు నాప్రియుఁడయిన కామపాలునికంటెను పదిరెట్లు ధనమెక్కువగలవాఁడు సుమా.

పంచచామరము.　ధనంబు గల్గుదానవంచుఁ దాఁక నన్ను నెంచినన్,
జను లెలంపఁబోరు నిన్నుఁ జానరో! ధనాఢ్యఁగన్;
పెనంగొనుమ్మదంబు నీవు పెదదానవౌటకున్,
ఘనంబుగా ధనంబు నియ్యఁగల్గు దేనుగావునన్.

పంచచామరము.　వెలందిమిన్న! నీకు నాదువిత్తమెల్ల నిచ్చినన్,
జెలంగి నాదువల్లభుండు చిత్తమం దెఱింగెడున్
గొలందిలేని యట్టివస్తుకోటియున్ ధనంబునున్
దలంపఁ దన్ను కోరియున్నదాన వంచుఁబిమ్మటన్.

పంచచామరము.　వరుండు నాదుచెట్టఁబట్టు భాగ్య మింత యబ్బినన్
స్మరింపఁ గల్మి లేకయుంట స్వప్నమందు నేనియున్;
కరంబు తన్నె కోరికొంటిఁగాని యన్యమేదియున్
వరింపలేదటంచు నప్డువల్లభుండు నమ్మెడున్.

రాగ—భానుమతీ! నీతండ్రి వచ్చుచున్నాఁడు. కామపాలుని యొద్దనుండి నేను కట్టకడపట తెచ్చిన యుత్తరము వేగిరము నాచేతి కిమ్ము. నన్ను మీయింటినుండి పంపివేయుట రాజా బే కారణము కాఁబోవునుజుమా. నీకీపత్ర కియ్యనట్టుగా దీనికి లక్కముద్ర వేసి తెచ్చి నేనిది యిక్కడ జాఱవిడిచెదను. (అని విస్మరించుచున్నది)

[సుదర్శనవర్మయు, విజయవర్మయు ప్రవేశించుచున్నారు.]

సుద—ఓయీ! నీవుకూడ రాత్రులయందు వీధులలో బయలుదేఱి ప్రియురాండ్రనిమిత్తమయి పాటలు పాడుచున్నట్టున్నావే! పాపము! నీపనికిమాలినయీలలతోను కామగీతములతోను, నీ వెక్కడ చుట్టుపట్లవారికి నిద్రపట్టకుండఁ జేయుచున్నావు? నీనడతవల్ల నీవు నీచెల్లెలికిఁగూడ మంచిమార్గమునే యుపదేశించుచున్నావు. ఓసీ! అమ్మాయీ! నీకొక్కసంగతి చెప్పవచ్చినాను. ఇఁక రాత్రులయందు మీకామవికారములును మీమాటలును పాటలును నేను సాగనియ్యను; మీపాటలును పద్యములును విన్నవారికెల్లను మతిపోవుచున్నది. అయినను నీవెఱ్ఱిచేష్టలు రేటిటితో కట్టువడిపోవునులే. ఇఁక కొంచెముసేపటికి వసుకాముఁ డిక్కడకు వచ్చును. రేపటిదినము నీ వాతనిని వివాహము చేసుకోవలెను.

భాను—నాబొందిలో ప్రాణ ముండఁగా నేనాతనిని పెండ్లి చేసికోను.

విజ—నాన్నగారూ! అటువంటివానిని అల్లునిగా కోరి తెచ్చుటకు మీ కెట్లు బుద్ధి పుట్టినది?

సుద—పిలువనిపేరంటముగావచ్చి నీయంతటనీవే మాకుహితబోధచేయ కరుణించుచున్నావుగనుక, నాయందు దయచేసి నీకతనియం దేమిలోపము కనఁబడినదో చెప్పు.

విజ—మొదటమాట అతఁడు విదేశస్థుఁడు.

సుద—ఆసందేహముతో పని లేదు. అతఁడు స్వదేశమువిడిచి తండ్రినాటినుండియు ఇక్కడనే యుండుటచేత ఈ దేశస్థుఁడే యయినాఁడు.

సుద—ఇది మఱియొక తెలియనిమాట, అతఁడీ రెండుమార్గములనుండియు విష్ణుమతస్థుఁడయినాఁడు.

విజ—అవునవును. అతఁడు ధనమునిమిత్తము పూర్వులనుండియు వచ్చుచున్న స్వమతమును వదలిపెట్టినాఁడు. ఈ క్రొత్తమతమును మార్చుకొనుట కింకను ఆవశ్యకము రాలేదు కాఁబోలును!

భాను—అతఁడిప్పు డేమతములోను లేక దేవాలయమునకును మసీదునకును మధ్య నూఁగులాడుచున్నాఁడు.

సుద—ఇది కాక మఱి యేమైననున్నదా?

విజ—మఱి యేమియు లేదుగాని, అతఁడు మోసములయందును జిత్తులయందును విచిత్రమైన యాసక్తికలవాఁడఁట.

భాను—లోకములో మోసగాండ్రే తెలివితక్కువవారిని మాయచేసి లాభము పొందుచున్నను, అతఁడుమాత్రము సాధారణముగా తనజిత్తులచేత తానే మోసపోవుచుండుననీ వినుచున్నాను.

విజ—అది సత్యము. నేర్పుచాలని విలుకానివలెనే యితఁ డెప్పుడును పెట్టిన గుఱి తప్పిపోయినను, తనచేతికి మాత్రము నారిదెబ్బ తగిలించుకొనుచుండును.

సుధ—ఇంతటితో సరిపోయినదా?

భాను—వీని నన్నిటిని మించినది యితనివద్ద భర్తయగుటకు పనికిరాని ప్రధానమైన లోప మింకొకటి యున్నది. అది వివాహమాడవలసినదాననైన నామనస్సునకు సరిపడినవాఁడు కాకపోవుట.

సుద—నీ కతఁడు మనసు రాకపోయినను నీవాతని మనస్సునకు నచ్చినదానవు. వధూవరులలో నెవ్వరో యొక రనురాగము కలవారయి యుండుట చాలును. పెండ్లికిద్దఱునుపరస్పరానురాగము గలవా రెప్పుడును దొరకరు. నీవెంత వెగటుగానున్నను, అతఁడు

మాత్రము తియ్యని స్వభావముగలవాఁడు. పుల్లచెట్టును తియ్యచెట్టు మీఁద నంటు కట్టినట్టుగా నిన్నటువంటివాని కంటఁగట్టినంగాని సఫ లము కలుగదు.

భాను—మొదల నతఁడు నన్ను కామించుననుటచేత నేనాతల కంటగించుచున్నది; అందుమీఁద నా కతఁడు భర్తయగునన్న పదిరె ట్లధికముగా నాతల నొచ్చుచున్నది.

సుద—అది యంతయు నాకు తెలియదు. వివాహ మయిన తరువాత సామాన్యముగా సమస్తమును మాఱిపోవును. ఇప్పుడు నీతో నాకు వాగ్వాద మెందుకు? నేను చెప్పినట్టు విని నీ వాతనిని వివాహము చేసికొనెదవా? చేసికోవా?

భాను—ఈవిషయములో తప్ప మఱి యేవిషయములోను నేను మీయాజ్ఞ మీఱను.

సుద—నీవు నీతండ్రి సుఖమును చూడవా?

భాను—కావలసినంత చూచెదను. జనితైకపుత్రికను యావ జ్జీవము సుఖహీనురాలినిగాఁ జేయు దుఃఖ మాతనికి కలుగనియ్యను.

సుద—అమ్మాయీ! మేలుమేలు! నీబుద్ధికిసంతోషించినాను. ఇటుచూడు. నీవు బుద్ధితెచ్చుకొని నాయాజ్ఞకు లోఁబడువఱకును నే నిఁక మొగము చూచి యెప్పుడును నీతో మాటాడను—ఏమి! బదులు చెప్పవేమి?—ఈచావడియు గదియు దాఁటి నిన్నివలకు రానియ్యను. నీవింటిలోనే రాత్రింబగళ్లు పడియుండవలెను. నేను వెలుపలకు పోవలసివచ్చునప్పుడు నిన్ను గదిలోపెట్టి తాళము వేసికొని కాని యిల్లుకదలను. నేనింట నున్నప్పు డెవ్వరునీయొద్దకుపోవలసినను నాపడకగదిలోనుండి పోవలసినట్లు చేసెదను. ఇఁక మన యిద్దఱిలో నెవరు గెల్తురో చూతము. ఏమి? మాటాడవేమి? నీవునాయెదుట

నుండి లేచి పో. పుత్రికాధర్మమును నీవు తెలిసికొని యుక్తముగా ప్రవర్తించు నంతవఱకును వెలుపలనుండు.

(అని వెలుపలకు త్రోసి వేయుచున్నాఁడు)

విజ—నాన్నగారూ! ఇటువంటివిషయములో తప్పక మీరు నా చెల్లెలియిష్టముకూడ కొంచెమాలోచించవలెను. అదిగాక కామ పాలుఁడు నామిత్రుఁడైన సంగతికూడ మీరుకొంతవిచారించవలెను.

సుద—అతఁడు నీకు మిత్రుఁడగుట యొక గొప్పయోగ్యత! అందుచేత నే నతనిని తప్పక గౌరవింపవలసినదే!

విజ—బావమఱఁదియగుటకు నామనస్సునకువచ్చినవాఁడతఁడొ క్కఁడుతప్ప మఱియెవ్వరు నాకంటికగపడరు.

సుద—అగపడరు. అదినిశ్చయమే. నాకు కూతురుకాని చెల్లెలు నీకెప్పుడైన నుండ తటస్థించినయెడల, అతనితో వియ్యమం దుటకు నేను నీకప్పు డడ్డమురాను. ప్రస్తుతముమాత్రము దయచేసి యిఁక నీ ప్రసంగము కట్టిపెట్టు.

విజ—సరేకాని నాచెల్లెలియెడలఁగల గౌరవముచేత నే నొక్కమాటమాత్రము చెప్పెదను.

సుద—చాలును. నీతండ్రియెడలఁగల గౌరవముచేత నీవా మాటను నీ మనసులోనే యుంచుకొని యిప్పుడు నోరుమూసుకొమ్ము.

విజ—ఇఁక నేను చెప్పవలసినదయిపోయినది. ఇప్పుడెవరివిష యములో మీ రింత క్రూరముగానున్నారో యాభానుమతియొక్క తల్లివిషయములో మీ కప్పుడున్న ప్రేమకు మీతండ్రి యడ్డమువచ్చి నయెడల మాయీాదున మీ కెట్లుండియుండునోమాత్రము స్మరణకు తెచ్చుకొండి.

సుద—అబ్బాయీ! మంచిమాట చెప్పినావు. నేను నిజము

చెప్పెదను విను. వయఃకాలములో నాకొక్క నీతల్లిధనముమీఁదనే యెంతో మక్కువయుండినది. అంతకంటె మఱియేమియు లేదు. ధనమునిమిత్తము నేనామెను వివాహమాడినాను; తనతండ్రియాజ్ఞ ననుసరించి నన్నామె వివాహమాడినది. అంతకంటె మఱియేమియు లేదు. అయినను మాది అనుకూలదాంపత్యమయినందుకు లేశమును సందేహము లేదు. వివాహమునకు పూర్వము మేమొకరినుండి యొకరము విశేషానురాగము నపేక్షించి యెఱుఁగము గనుక, మా కాశాభంగ మెప్పుడును కలుగలేదు. మాలోమా కెప్పుడైన కొంచెము వివాదము సంభవించినను, మాయిద్దఱిలో నెవ్వరము కలహప్రియులము కానందున మరల మేమప్పుడే సమాధానపడుచువచ్చెడి వారము. ఆదొడ్డయిల్లాలికి మరణ మాసన్నమయినప్పుడు—ఆమె యెల్లకాలమును జీవించుఁగాకయని దైవమును ప్రార్థించితిని. ఈయుజ్జయినీనగరములోని కళత్రవిహీను లందఱును తమభార్యలవిషయమయి యిట్లు ప్రశంసింపఁగలుగుదురుగాక! ఇప్పుడు నేను లోపలికిపోయి యీఁగది తాళము పట్టుకొనివచ్చెదను. ఇంతలో తండ్రియాజ్ఞ మీఱుమని నీవేదైన నీ చెల్లెలి కుపదేశము చేయవలసియున్నయెడల, నీయుపన్యాసమును మిక్కిలి సంగ్రహపఱుపవలెను. కాలము వ్యర్థపుచ్చక నీపనిచూచుకో. విన్నావా; (అని నిష్క్రమించుచున్నాఁడు.)

విజ—నామిత్రుఁడయినకామపాలుఁడిఁక నిరాశచేసుకోవలసినదే; అయినను భానుమతిమాత్రము చలింపక దృఢముగానున్నది. నాతండ్రికోపమువలన ప్రియునిమీఁద దాని కనురాగము మఱింత యెక్కువే కావచ్చును. ప్రపంచములో సాధారణముగా ననుద్దేశపూర్వకముగానైనను మనమనోవేదనకు హేతుభూతులయిన పక్షముఁ, మనక్షేమము కోరినవారియెడలసహితము మనకు ద్వేషము

కలుగుట సహజము. తమమనఃప్రియులయి యున్నవారినిమిత్తమయి తాము శ్రమపడవలసివచ్చునట్లుండునను స్త్రీలెప్పుడును వారియెడల నధికానురాగమును గనఁబఱుపరు. (లోపల సందడి) ఓహోహో! ఆగడబిడ యేమి? మాతండ్రిగారికిని రాగమంజరికిని నేదో దొమ్ములాట పొసఁగినది. ఇఁక నేనిక్కడ నిలువఁగూడదు. పోయెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

[చేత జాబొకటి పట్టుకొని, రాగమంజరిని లాగుచు సుదర్శనవర్మ ప్రవేశించుచున్నాఁడు]

సుద—నా కద్భుతముగా నున్నది! నా కాశ్చర్యముగా నున్నది! ఏమి యీద్రోహము! ఏమి యీమోసము! ఓ కామపాలుని తొత్తా! వెఱబొమ్మ నుంచినట్లు నిన్నిక్కడ నుంచినందుకు నా కొమార్తెను లేవఁదీయుటకే దుస్తంత్రము నడుపుచున్నావా?

రాగ—ఇప్పుడు న న్నేమన్నారూ!

సుద—వెఱబొమ్మ నన్నాను. తెలివిమాలిన వయసువారినివల లోఁ బడఁద్రోచెడి పరమవంచకురాలా రా! నీవుదీని కేమి చెప్పెదవో చెప్పు.

రాగ—మీరీయుత్తరము నాచేతినుండి పెనఁగులాడి పుచ్చుకొని నాగుట్టు తెలిసికొన్నారు గనుక, నేనిప్పుడేదియు లేదనను. మీరన్నట్లు నేను కామపాలుని కనుకూలురాలనే. వివేకము లేక కఠినచిత్తులై యుండు ముసలితలిదండ్రులకెల్లను బుద్ధివచ్చునట్లుగా వారియెడల తిరస్కారము చూపెడు లోకములోని పడుచుపుత్రికలవలెనే మీకొమార్తెయు మీయెడలను నడుచుకోవలెననియే నాకోరిక. ఆమె సుకుమారమైన యనురాగమునకు నా కానంద మగుచున్నది. ఆయనురాగపోషణమునకయి నాచేతనయిన సాయము చేయుటయే నాయభిమతము.

సుద—ఆఁ! సుకుమారమైన యనురాగమా! మిమ్ము శిలల వలె నింతకఠిన మతులనుచేసినది యీసుకుమారానురాగమే. మోసములకు పుట్టినిల్లవైన ఓముసలితొత్తా! నాకొమార్తె సౌందర్యమునకు రక్షకురాలవుగా నుండుటకు నిన్ను గావలి యుంచినాను. పెద్దపులివంటి నిన్నుచూచి చెంతచేరక శృంగారనాయకులు బెదరి పారిపోవుదురని నేను నమ్మినాను. పరులకు భీతికొల్పెడు క్రూరలక్షణములన్నియు నీముఖముమీఁదనే యిప్పుడును వ్రాసియున్నట్లు కనఁబడుచున్నవి. ఓసి కృతఘ్నురాలా! తత్క్షణము నీవు మాయిల్లువిడిచిపెట్టిపో. ఇది నిస్సందేహముగా సుకుమారానురాగమే. పోపో! ఓతుంటరికుంటెనకత్తెకానా! పో.

రాగ—ఓయి తిట్టఁబోతు ముసలి — నీపే రుచ్చరించి నా నోరు చెఱుపుకోను. ఓకిరాతుఁడా! చెఱసాలనుబోలిన నీయిల్లిప్పుడు విడిచిపోయెదను. నాబట్టలైనను నన్ను తెచ్చుకోనిచ్చెదవా? లేదా? నావస్తువులు నేను తీసికొని పోవచ్చునా?

సుద—మాయింటికి వచ్చినప్పుడు నీవు కట్టుచీరతో వచ్చినావు. ఇంతలో నీవే వస్తువులు దొంగిలించినావు?

రాగ—నాయజమానురాలివద్ద నేను సెలవుపుచ్చుకొనికూడ రావలెను. నావస్తువు లామెవద్ద నున్నవి. నామేలిముసుఁగుకూడ ఆమె గదిలోనే యున్నది.

సుద—నీయందమునకు మేలిముసుఁగుకూడ కావలసివచ్చినదా! శృంగారనాయకు లెవ్వరైన నీమొగ మాశపడి చూచెదరని భయపడుచున్నావా? లేక నీకు దృష్టి తగులునని భయపడుచున్నావా? లోపలికిపోయి నీయజమానురాలివద్ద సెలవుపుచ్చుకొని, నీమేలిముసుఁగును బట్టలను తెచ్చుకొని వేగిరము రా. అయిదునిమిషము

లలో నీవు మాయిల్లు విడిచిపోవలెను. ఊఁ! వేగిరము, వేగిరము! లోపలికి నడువు.

రాగ—(లోపలికి పోవుచున్నది.)

సుద—ఓహో! చెఱువుచేయుటకిదియెంతగొప్పతంత్రముపన్ని నది! పెద్దతనములో జనకులకు కొమార్తెలు తెచ్చు సుఖము లిటు వంటివే.

ఉ. పుత్రిక లుద్భవిల్లినని పోవును సౌఖ్యము కొంత తండ్రికిన్;
చిత్రము! శాంతియుండదిటు చిత్తములో క్షణకాలమేనియున్
ధాత్రిని నిర్వహేండ్లు కడదాఁటెనులోననె చెప్పఁబుద్ధులన్
బుత్రిక లిట్లుమీఱి కరమున్ వెతఁగూర్తురు కన్నవారికిన్.

గీ. కటకటా! తండ్రి కెంత దుఃఖంబు గలుగు!
తిరుగఁబడుచును గన్నీరు తెచ్చుకొనుచుఁ
బలుకు వినకుండఁ బుత్రికల్ మెలఁగిరేని,
కటకటా! తండ్రి కెంత దుఃఖంబు గలుగు!

ఉ. యుక్తులుపల్కమించుదురహో నెఱప్రాయమురాకమున్నె; యా
సక్తినిబుత్రికల్ ప్రియులచక్కికిఁబుచ్చి కలంతు రుల్లముల్;
యుక్తవిచారముల్ సలిపి యొక్కటఁ దండ్రికుదుర్వ్యసద్వ్యథన్
శక్తికొలంది వంకలిడి చారుగతిన్ వలదందు రేర్పుచున్.

గీ. కటకటా! తండ్రి కెంత దుఃఖంబు గలుగు!
విట్టువీఁగుచు లోలోన విసుఁగుకొనుచు
మొఱకుఁదనమునఁ బుత్రికల్ మొఱఁగిరేని,
కటకటా! తండ్రి కెంత దుఃఖంబు గలుగు!

[భానుమతి రాగమంజరి వేషముతో మేలిముసుఁగు వేసికొని బట్టలమూట చంకఁ బెట్టుకొని వెక్కి వెక్కి యేడ్చుచు ప్రవేశించుచున్నది.]

సుద — రాగమంజరీ! ఈదారిని. ఈదారిని. ఆహా! ఇప్పుడెంత దుఃఖముతో మాయిల్లు విడిచి పోవుచున్నావు! నీరెండుచెక్కుల మీఁద కన్నీరు కాలువలు కంటఁ మిరపకాయ పెట్టుకున్నావా యేమి? నీవీలాగున తల యెవ్వరికిని చూపక ముసుఁగులో దాఁచుకొనిపోవల సినదే. ఇఁక నీవు నీమనసువచ్చినంత సేపేడువు. ఇఁకనీవెన్ని శుష్కవార్పణలు చెప్పినను నేనొక్కటియు వినువాఁడను గాను. కాఁబట్టి నీ విప్పుడు మౌనము ధరించి పోవుచుండుటయే మంచిపని చేసినావు. ఈదారిని. ఈదారిని. (ముందు భానుమతియు వెనుక సుదర్శనవర్మయు నిష్క్రమించుచున్నారు.)

[అప్పుడు రాగమంజరి మరల ప్రవేశించుచున్నది.]

రాగ — ఓ మహాబుద్ధిమంతుఁడవైన సుదర్శనవర్మా! పొమ్ము! పొమ్ము! నీదురాగ్రహమునకును మూర్ఖత్వమునకును తగినఫలము కలిగినది! ఇప్పుడు నేనే యజమానురాలనయి, ఆమెవలె నటింపఁ గలుగుట కయి నాసామర్థ్యము చూపవలెను. నాభాగ్యముచేత నా యుపాయము నిరంతరాయముగా కొనసాగెనా, ఇఁక యావజ్జీవమును నేను నిజముగా గృహయజమానురాలనే యగుదును. నే నిప్పుడు పోయి నాయజమానురాలు నాకిచ్చిపోయిన నగలు మొదలైనవలంకరించుకొనవలెను. (అని నిష్క్రమించుచున్నది.)

౧౧ రంగము—సుదర్శనవర్మ ప్రాసాదముయొక్క వీథివాకిలి.



[సుదర్శనవర్మయు, రాగమంజరి వేషముతో నున్న భానుమతియు ప్రవేశించుచున్నారు.]

సుద—రాగమంజరీ! అదిగో నీవు వీధిలోనికి పోవుటకు మార్గము. ఇఁక ప్రపంచ మంతయు నీవు యిచ్చవిడిగా తిరుగవచ్చును. పరుగెత్తు. ఓ పాపాత్మురాలా! పరుగెత్తు. అదుగో దేవఁడో నీవంక చూచుచు తారుచున్నాఁడు. కాముపాలుఁడై యుండవచ్చును. అతనివద్దకే పో. విన్నావా? నీ శ్రమ కతనిచే పరిహార మగును. నిన్ను మాయింటినుండి పంపివేయుట కతఁడే కారకుఁడు గనుక, నిన్నతఁడు స్వీకరించుట న్యాయమని యతనితోనే మొఱ్ఱపెట్టుకో.

భాను—(నిష్క్రమించుచున్నది.)

సుద—ఇప్పటికి దీనిని వదలించుకొన్నాను. దైవానుగ్రహము చేతనే నిఁక నా ప్రతిజ్ఞను నిలుపుకొని, సురక్షితముగా నా కొమార్తెను నిరోధములో నుంచఁగలను. నేను పోయి గదితలుపుల తాళము వేసి వచ్చెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

---

౧౨ రంగము వీథిలోని వసంతుని ఇంటిముంగిలి.



[సుదంతయు, పరిచారికయు ప్రవేశించుచున్నారు.]

పరి—అమ్మా! నీవిప్పు డెక్కడకు పోదలఁచుకొన్నావు?

సుదం—నాసవతితల్లియొక్క దౌర్జన్యమును విజయవర్మయొక్క దుడుకుతనమును తప్పించుకొనుటకయి యెక్కడికి పోయినను సరే.

పరి—అమ్మా! విజయవర్మ యిచ్చిన తాళముచెవి మూలముగా

మనము తప్పించుకొని యీవలఁ బడఁగలిగితిమిగనుక, మనమాతనిని వెదకి కనుఁగొని మనవందనము లర్పింపఁ బోవుదమా?

సుద—అతనియొద్దకు పోవద్దు. అతఁడు నా కతికోపము తెప్పించినాఁడు. (అని ప్రక్కకు తిరుగుచున్నది.)

[అప్పుడు భానుమతి ప్రవేశించుచున్నది.]

భాను—ఇప్పు డింటినుండి వెడలఁగొట్టించుకొనఁబడు నంత వఱకు మాయుపాయము సఫలమయినదిగాని యిఁక కామపాలుఁడు నాకగపడుట యెట్లు సంభవించును? అతనిపేరు చెప్పి యడిగినపక్షమున నన్నెవ్వ రానవాలు పట్టుదురోయని నా కాతనిగుఱించి విచారించుటకే భయమగుచున్నది. ఇప్పుడు నా చెలియైనసుదంతయొద్దకు పోవలెనని యున్నదికాని; ఆనంగనాచి నామీఁద తప్పులెన్ని చీవాట్లు పెట్టునేమో యని భయమగుచున్నది.

పరి—అమ్మా! అట్లయినపక్షమున, నీసఖ యైనభానుమతి నిన్నాదరించి లోపల పెట్టుకొనునేమో ప్రయత్నంచేసి చూచెదవా?

సుదం—అక్కడకు పోఁగూడదు. పితృభక్తి దాని కతివిస్తారముగనుక రహస్యము బయలఁబెట్టి నన్నది రవ్వపెట్టునేమో!

భాను—సుదంతది కొంత శాంతస్వభావము; నేనుచేసిన దతిసాహసకార్యమని యెంచును.

సుదం—భానుమతికి తండ్రియెడల గౌరవము మెండు; అది నాక్రూరత్వమును మన్నింపదు.

భాను—(ప్రక్కకుతిరిగి సుదంతను పరిచారికను జూచి) ఓహో! ఈవచ్చెడువా రెవరు? వీరిలో నొకతె నిశ్చయముగా సుదంత. అయినపక్షమున, నేనుదానియందు నమ్మక ముంచెదను. ఓసుదంతా! (అని ముందుకు నడుచుచున్నది.)

సుదం—భానుమతీ! ఏమియీావింత! నీవు మేలిముసుఁగు కూడ వేసికొన్నావు!

భాను—నేను మాతండ్రిగారియింటనుండి పాఱిపోయివచ్చితి నన్నవార్త విన్నపక్షమున నీకెంతకంటెను మహాద్భుతముగా నుండును.

సుదం—నిశ్చయముగా నాకత్యద్భుత మగుచున్నది. ఇప్పుడు నేనుకూడ మాతండ్రి యింటినుండి పాఱిపోయి రాకుండిన పక్షమున ఈయవివేకకార్యము చేసినందుకు నిన్ను తప్పక తలవాచునట్లు చీవాట్లు పెట్టియుందును.

భాను—ఓచెలీ! సుదంతా! (అని కౌఁగిలించుకొనుచున్నది.)

సుదం—ఓపిఱికిచెల్లెలా! నీవెక్కడకు పోవుచున్నావు!

భాను—నాప్రియుని వెదకుటకయి పోవుచున్నాను. ఇప్పుడు నాయన్నగారిని కలిసికొనుట నీకసమ్మతము కాదనుకొనెదను.

సుదం—నిశ్చయముగా నాకసమ్మతమే. అతఁడు నావద్ద మిక్కిలి పచ్చిగా ప్రవర్తించినాఁడు గనుక, ఇఁక నేనాతని నెప్పుడును క్షమింతు ననుకోను.

ద్విపద. గాఢాంధకారంబు గ్రమ్మియెల్లెడల
గాఢనిద్రమునుబూని కాముకుల్ కూడ
బడలిక యుడఁగంగఁ బఱపుపైనొక్క
గడియసే పొఱగెదు ఘనరాత్రివేళ,
తనయుని గోల్పడ్డ తల్లికైవడిని
వనట నొందుచు శోకభరమున మునిఁగి
వాడినలేఁదీగవలె సొమ్మసిల్లి
పీడనివ్యథతోడ వేవేగ నేను
నించుకసేపు కన్నిట్టె మూయుంగ

ముంచుకొనదనులే.

(సుదంతయు, పరిచారికయు, నిష్క్రమించుచున్నారు.)

భాను——అవచ్చుచున్న నాదూత ఆత్మస్తుతి ముగించి సమీపమునకు వచ్చుచున్నాఁడు. (అని మరలుచున్నది.)

[వసుకాముఁడును, చంద్రకేతుఁడును, ప్రవేశించుచున్నారు]

వసు——(తనముఖమును చిన్నయద్దములో చూచుకొనుచు) ఓయీ! చంద్రకేతుఁడా! నామీసములసొగసు చూచుకోఁగా నా మనస్సులో నాకే సంతోషమగుచున్నది.

చంద్ర——అవునుగాని యిటువంటిముఖముతో పోయి నీవు నీప్రియురాలిని నెట్లు సంతోషపెట్టఁగలవు?

వసు——ఏమి? నా మొగములో నేమియుందము తక్కువ యున్నది? నాకన్నులతో చూడఁగా నావదనారవిందము సుందరుల హృదయముల నాకర్షించునదిగానే కనఁబడుచున్నదే! ఈమెలిమీసములనుజూచి కూడ మోహింపకపోయినయెడల, నేనాయువతి వివేకురా లనుకోను. (భానుమతిని జూచి) అదిగోచూడు. ఈ మీసములను జూచి వలచి యాసుందరి యెట్లు సమీపించుచున్నదో!

భాను——అయ్యా! మీసాయ మాశించి వచ్చిన యీసుందరిని కొంచె మనుగ్రహించి రక్షించెదరా?

(అని మొగము తెర తీయుచున్నది.)

వసు——ఓహో! ఈమె సౌందర్యరాశిగానున్నదే! మిత్రుఁడా! తప్పక యీచక్కనిచిన్నది నన్ను వలచియేవచ్చినదినుమూ. ఓసుందరీ ముందుగా నేను నీపేరు తెలియఁగోరెదను.

భాను——(తనలో) ముందుగా నేనేనాలోచించుకొని మెలఁకువ పడుట మంచిదే యయినది. (ప్రకాశముగా) నాపేరు సుదంత.

వసు—ఏమీ! నీవు మాధవసేనుని కూతురవా? నీవింటి నుండి పాఱిపోయినావని త్రోవలో నేనింతకుముందే విన్నాను.

భాను—నేను కామాతురనయి వచ్చినదానను. ఇదే నా యెడఁగల తప్పిదము. రసికశిఖామణివయిన నీవు కామార్తనయివచ్చిన నన్ను పరులకు పట్టి యొప్పగింపవని నమ్మి నీపాలఁ బడినాను.

వసు—ఓహో! నమ్మితివా? పాపము! ఈచిన్నది నన్ను కామించి వచ్చినది—ఓసుందరీ! నిన్నన్యుల కప్పగించుటవలన నా కేమిలాభ మున్నది? నన్నువిషయములో నీవు నమ్మకొనియుండుము. నీవు కామార్త నని చెప్పుచున్నావే, కామవిషయములో మాత్రము నీకోరిక సఫలము కానేరదని చింతిల్లుచున్నాను.

భాను—అయ్యో! ఎందుచేత?

వసు—ఈవఱకే నాకు వివాహనిశ్చయ మయినది. ఓచంద్రకేతూ! కాలేదా?

భాను—ఆమాట సత్యమే కాని, నాప్రార్థన వినుము.

వసు—నేను వినను వినను. నేను విన్నప్రయోజన మేమి? ఇఁక నిన్ను నేను వివాహపూర్వకముగా పరిగ్రహించుట సంభవింప నేరదు. మఱియొకవిధముగా నీయభిమతమును తీర్చుటకు నేనొడఁబడినయెడల, నీకన్నగారో తమ్ముఁడో యొకఁ డుండి నేను చేసిన యుపకారమును చింతింపక కృతఘ్నుఁడయి మీఁదిమిక్కిలి నా గొంతుక కోయరావచ్చును. కాఁబట్టి నీవు మాఱుమాటాడక మరల వచ్చినదారినే యింటికి విజయము చేయుము.

భాను—(తనలో) ఓరి పరమచండాలుఁడా! (ప్రకాశముగా) అయ్యా! నేనిల్లువిడిచి వచ్చినది కామపాలుని నిమిత్తము.

వసు—ఏమేమీ! నానిమిత్తము కానేకాదా? నీవు నను

కామింపనే లేదు?

భాను—లేదు. నిన్ను కామింపనే లేదు.

వసు—అట్లయినపక్షమున నీవు పరమసాహసికురాల వయిన పాపచింత లేనిమూఢురాలవుగా నున్నావే. నేనీసంగతి తప్పక నీ తండ్రితోఁ జెప్పెదను.

భాను—ఇదేనా నీరసికత్వము?

వసు—చెప్పెదను తాళు. నీవు కామపాలుఁ డని కాదా యిప్పుడు చెప్పినావు? దీనివల్ల నేను కొంతలాభము పొందవచ్చును. కామపాలుఁడా!

భాను—నిస్సందేహముగా నీవు కామించెడుసుందరిని నీవెప్పుడయిన దక్కించుకోఁ దలఁచినయెడల, తప్పక నీవు కామపాలుని నా యొద్దకు తెచ్చి నాకొప్పగింపనే యొప్పగించెదవు.

వసు—అవును నేనాపని చేసెదను. చెలికాఁడా! భానుమతి విషయములో కామపాలుఁడు నాకక్కడ ప్రతిపక్షిగా నున్నాఁడు. అతనిని నేనిప్పుడీచిన్నదాని కంటఁగట్టఁ గలిగితినా, ఇఁక నక్కడ నాకడ్డువచ్చువాఁ డెవ్వఁడును లేక నే నప్రతిహతమనోరథుఁడ నగుదును. చెలికాఁడా! ఇది మంచి ఆలోచన ఔనా? కాదా?

చంద్ర—అవును, నిరుపమానమైనయాలోచన.

వసు—నా కుపాయముల కెప్పుడును తక్కువలేదు. ఈమన స్సుపాయములపుట్ట నాబుద్ధిసూక్ష్మత కనిపెట్టినావా? సుదంతా! నామిత్రునియందు విశ్వాసముంచి కొంచెముసేపు నీవీతనివశమున నుండెదవా?

భాను—అయ్యో! నేనునిన్ను నమ్ముకొని యుండవచ్చును గదా?

చం ద్ర—ఓ సుందరీ! నేను నిన్ను మోసపుచ్చుట యెప్పుడును సంభవింపనేరదు.

ద్విపద. కడుపునిండను నాకుఁ గల్లలుండినను,
చెడుగుచేయఁగ లేను, చెలువరో నీకు;
నమ్మికేదియు నీవు నను( గోరకున్న,
నమ్ము నీ చెలువమ్ము నను సాధుఁజేయు.
వంచింప రెవ్వరు వసుధలో నిన్ను
నెంచఁ డే యెగ్గు నీకెంతయున్యేఁడును;
బద్ధానురాగులై పడుచువారొప్పు,
వృద్ధులు మిత్రత వెలయింత్రు నీకు.
భవదీయహృదయంబు పరునిపై నింత
తవిలి యున్నదటంచుఁ దా మెఱింగినను,
తరుణవయస్కులు తమయీర్ష్య విడిచి
ధరియింత్రు సోదరత్వంబు నీయెడను.
ముదిత! కల్గదు నీకు మోసమన్మాట,
యొదవ దేకీడు నీ కువిద యిచ్చోట.
అడరి వృద్ధులు మిత్రు లౌదురు నీకు;
పడుచువా రెల్లను భ్రాత లయ్యెదరు.

వసు—ఓ చంద్రకేతూ! నీ వీమెను మాయింటికి తీసికొని పొమ్ము. నేను వేగిరము సుదర్శనవర్మ యింటికి పోవలెను. ఓసుందరీ! నీవు భానుమతి నెఱిఁగి యుండవచ్చును. ఆమె సౌందర్యముచేత దేవతాకన్యలను మించి యుండు నఁట! సత్యమే కదా?

భాను—ఈవిషయములో నేను నీతో నేకీభవింపఁజాలనందుకు నన్ను క్షమింపవలెను.

వసు—అట్లనెద వేమి? నా కామె సౌందర్యమును గుఱించి యందఱును నేకవాక్యముగాఁ జెప్పుచున్నారే.

భాను—ఆమెయందు తండ్రి కలిపిన పాతము. అందుచేత నతఁ డందఱితో నట్లు చెప్పుచుండును. ఆమెది కొంచెము ముదురు ముఖమైనమాట నీవు పోయి చూచినప్పుడు నీకే తేటపడును.

వసు—చెలికాడా! ఇది యంతయు కేవలాసూయ సుమా. ఓ సుందరీ! మీవంటిపడుచుకన్య లోకములోన నెప్పుడును చక్కనివారని యొప్పుకోరు. ఓమిత్రుఁడా! నామాట వినుము. నీవు కామపాలుని వెదకి తెమ్ము; నేనీసంకిలి యతనికి తగిలించెదను. నే నెంతో భాగ్యశాలిని గనుక నా కీయుపాయము తోఁచినది. ఓ సుదంతా! నేను నీకు పరమవిధేయుఁడను. ఓమిత్రుఁడా! నీవు నీపనిమీఁద నుండుము. ఓ సుందరీ! నాప్రియురాలు నారాక కయి యెదురు చూచుచుండును; నేనామెవద్దకు పోవలెను. నేనిప్పుడా మెనవ్వు మొగము చూడక యెట్లు తాళఁగలను?

భాను—నీవు పెండ్లికొడుక వయి శీఘ్రముగా రమ్ము. అయినను నీ వాపెండ్లి సంతోషములో నేనిక్కడ నా ప్రియునికి దూరస్థురాలనయి యొంటిపాటున పడలను నమ్మి వారికి శరీర మప్పగించి యీ యవస్థలో నున్న మాటమాత్రము మఱచిపోకుము.

వసు—సుందరీమణీ! నీవు సర్వమునకును నామిత్రుని నే నమ్ముకొని యుండుము. ఇతఁడే నీకు సేవకుఁడును రక్షకుఁడును మార్గదర్శియు నగును.

చంద్ర—ఓసాధ్వీ! నామీఁద నీ వేల యనుమాన పడెదవు? ముందుగా నాచేత సేవ చేయించుకొని మఱి నన్ను నిరాకరింపుము. నీవు నన్ను నమ్మినప్పుడు నిన్ను మోసపుత్తునా? నీవు వ్యసనముగా

నున్నప్పుడు నిన్ను దుఃఖపెట్టుదునా? ఓసాధ్వీ! నాయందు నీకీసందేహమేల? నాచేత నీయిచ్చవచ్చినపని చేయించుకొమ్ము.

భాను—ఏవిషయమునందైనను నాకు ద్రోహము తలఁచిన యెడల, నీ వెప్పుడును సుఖపడకుందువుగాక!

వసు—ఏవిషయమునందైనను నాకు ద్రోహము తలఁచిన యెడల, ఇతఁ డెప్పుడును సుఖపడకుండునుగాక!

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## ద్వితీయాంకము



౧. రంగము సుదర్శనవర్మ పడకగదిలోని కిటికీ ప్రక్కయింటియందు.

[సుదర్శనవర్మయు, వసుకాముఁడును ప్రవేశించుచున్నారు.]

సుద—ఆహాహా! తండ్రిని టక్కుపెట్టి పాఱిపోయినదా! ఎంతపని చేసినది! కూఁతు రిల్లు విడిచి జాఱుచున్నను తండ్రికి తెలియనే లేదుగా! అయ్యో! పాపము! మాధవసేనున కెంతదురవస్థ పట్టినది!

వసు—అవును. ఆమెను నేనే కాముపాలునియొద్దకు తీసికొని పోవలెను. ఈయుపాయముచేత నీకూఁతురివిషయమయి నాకిఁకముందతఁ డేమియు తొందర కలుగఁ జేయకుండ నేనతని కాళ్ళకు బంధము తగిలించెదను. అతని నేనెట్లు వలలో పడవేయుచున్నానో చూచినారా? నాది మంచియుపాయమగా కాదా? ఇది మహేంద్రజాలము.

సుద—నిస్సంశయముగా నీది నిరుపమానమయిన మాయో పాయము. దానిని వానియొద్దకు తీసికొనిపోయి తప్పక వలలో పడవే యుము. హాహాహా! వృద్ధదశలో మాధవసేనున కెంతగతి పట్టినది! పడుచుకుఱ్ఱ దాముసలివాని నిట్టే మోసము చేసినదే.

వసు—స్త్రీలు నక్కలవలె మాయలమారులు. దానిలో నున్న మర్మమిది.

సుద—వారి మాయలమారితనము బుద్ధిహీనులవద్ద పనికి వచ్చునుగాని మనవంటివారివద్ద పారదు. నాకూఁతు రెండుచేత నావద్ద నట్లు మాయచేయదు? ఏదీ? అది నన్ను మోసపుచ్చుమను చూతము.

వసు—మీరన్నది సత్యము. తెలివిగలవారివద్ద వారియాటలు సాగవు. జగత్తులోని యేస్త్రీవచ్చి నన్ను మోసముచేయునో చేయు మనండి. ఎప్పటికిని చేయలేదు. నామేనత్త చిన్నప్పుడు నాకు బృహ స్పతియని పేరు పెట్టినది. ఈభూలోకబృహస్పతికి నెఱజాణలను మించిన మాయలు తెలియును.

సుద—ఒక్క మాధవసేనునివంటి వెంగలిమాత్రమే సులభ ముగా మోసపోవును.

వసు—కామపాలునివంటి యమాయకుఁడును మోసపోవును.

సుద—సత్యము. వీరిద్దఱును తప్ప లోకములో నింతసులభ ముగామోసపోవు తెలివిమాలినవారు నాకీవఱ కెక్కడను కనఁబడ లేదు. రమ్ము; నీవుపోయి నాకొమార్తెను చూచుట కిది మంచిసమ యము. ఓవసుకామా! ఇప్పు డీశానుమతియొక్క మనోదుర్గమును నీవొంటిగా ముట్టడివేయవలెను.

వసు—మీరు నావెంటవచ్చి నన్నామెకొప్పగించి—

సుద — నేను రాను. తన తిరుగుబాటుతనమునువిడిచిపెట్టువఱ కును దానిముఖము చూడ ననియు దానితో మాటాడననియు నే నొట్టుపెట్టుకొన్నాను. నీశక్తిచేత దానిని నాయాజ్ఞకు బద్ధురాలగు నట్లుచేయుము. దానికిప్పుడు తండ్రియు భర్తయు నొక్కసారిగా నే లభింతురు.

వసు — నే నొంటిగా నామెతో మాటాడి యొప్పింపలేను. అటువంటి యసమానసౌందర్యమును జూచినప్పుడు భయగౌరవముల చేత నానోట మాటరాదు. కురూపముగలవారిని జూచినప్పుడో మన స్సున కంతశంకలేక మాటాడుట కొకవిధముగా ధైర్యముకలుగును.

ద్విపద. అంద మంతగ లేని యది యైన నాకు
మందహాసము గల్గు మగువయె చాలు;
సకియ లావంచును సన్నం బటంచు
వికలాంగికాదేని, విడనాడ నేను
ఇంతి నల్లని దైన నెఱ్ఱని దైన
నింతయుశంకింప హృదయమందేను.
కలికికన్నులు నల్లకల్వ లైయైన
వెలిదమ్ము లైనను వెనుదీయ నేను
ఆసతి నెమ్మొగం బది యట్టిదైన
మీసముల్ లేవేని మెత్తు నేనదను
కులకాంత కందంబు కోరి పల్మారుఁ
దలపోయఁగా నేల? దక్కినఁజాలు.

సుద — ఓవసుకామా! భానుమతిని జూచినతరువాత నీవీయ భిప్రాయమును మార్చుకొందువులే.

వసు — ఓసుదర్శనవర్మా! మీతోడి బంధుత్వగౌరవమే —

సుద—ఆసౌందర్యమునుజూచి నీవానందపరవశుఁడ వగుదువు. తండ్రినయిన నే ననవలసినమాట కాదుగాని, నిజముగా నాకూతురు సౌందర్యమునం దద్వితీయురాలు సుమా! నీవు నాకన్నులతోఁ జూడఁ గలిగినపక్షమున, సొగలయినభ్రుకుటి వెలిదళుకు చూపుల యందొక వింతయైన జాణతనముకనఁబడి నీకప్పుడది నాకూఁతురగుట స్మరణకు రాకపోదు సుమా.

వసు—ఆమె నామనసువచ్చిన జాణ.

సుద—అది మందహాసము చేసినప్పుడు బుగ్గలు కొంచెము సొట్టలు పడి మొగమున కొక వింతయందమును పెట్టును. సొట్టలు పడినప్పుడే బుగ్గలు విశేషసుందరములుగా నుండునో పడనప్పుడే యుండునో నీవు కనిపెట్టలేవు.

వసు—ఆమె నామనసువచ్చిన యందకత్తె.

సుద—నిగ్గుటద్దములవంటి నునుతళుకు చెక్కులమీఁద వెలి బెళుకు చూపులు వ్యాపించి చెక్కులకొక క్రొత్తకాంతినిగూర్చి నీ దృష్టిని మిఱుమిట్లు గొలుపును.

వసు—ఆమె నామనసువచ్చిన శోభావతి.

సుద—దానిశరీరము బంగారుచాయను మించి, కరచరణాదుల యందున్న శుద్ధసువర్ణభూషణములను కాంతిమంతములనుగాఁ జేయు చుండును.

వసు—ఆమె నామనసువచ్చిన సమ్మోహనయంత్రము. ఇఁక నా కామెకంఠస్వర మెట్లుండునో మాత్రము తెలిపి కర్ణోత్సవము చేయుఁడు.

సుద—శ్రావ్యతమముగా నుండును. నీవు దానిచేత నొక్క సారి కంఠ మెత్తి పాట పాడింపఁ గలిగితివా, నీ వత్యంతసంతోషపర

వచ్చుఁడ వగుదువు. భానుమతి భూమికి దిగివచ్చినసరస్వతి. రూపము ధరించిన కేవల గాంధర్వవిద్య. ఈవర్ణనతో నిఁక పనిలేదు. నీవు లెమ్ము. దానిపరిచారిక యిప్పుడు గదిలోనికిఁ దీసికొనిపోయి నిన్న చ్చట విడిచి వచ్చును.

వసు—నే నిఁక ధైర్య మవలంబించి, యామెకటకుచూపు లకు నిర్భయముగా తల యొగ్గెదను.

సుద—ఓ యభినవబృహస్పతీ! నీవు పోయి చిత్తవృత్తి ననుసరించి దాని మపసర్పించి, నీవశము చేసికొనివచ్చి, నాకిప్పుడే నీ బుద్ధికుశలతకు నిదర్శనము కనఁబఱుపవలెను సుమా.

వసు—నామిత్రుఁ డయిన చంద్రకేతుఁ డిప్పుడే నాతో నిక్కడకు రావలెను. రాఁగానే నాకుఁ దెలియఁబఱిచెదరా!

సుద—అలాగుననే తెలియఁబఱిచెదను. ఓచతురికా! ఇటురా.

చతు—(ప్రవేశించి) అయ్యా! వచ్చినాను.

సుద—అది నీకు గది చూపును. దానివెంటఁబొమ్ము. ఏమి! నీవు తల వ్రేలవేసికొన్నావేమి? ఈరసికుఁడు ప్రియురాలిని వరించుటకు దీనముఖముతోఁ బోవుచున్నాఁడు!

(అందఱును నిష్క్రమించుచున్నారు)

---

౨. రంగము—భానుమతియొక్క గది.



[వసుకాముఁడును, పరిచారికయు ప్రవేశించుచున్నారు]

పరి—నాయకుమారులరా లిప్పుడే మీసన్నిధికి వచ్చును.

(అని తలుపువద్దకు పోవుచున్నది)

వసు—తొందరపెట్టఁబోకు. ఆమె సావకాశముగా నేరావచ్చును.

పరి—(నిష్క్రమించుచున్నది)

వసు—ఈవఱ కెన్నఁడును నేనువలపువిషయములో స్త్రీలతో ముచ్చటించి యెఱిఁగినవాఁడను కాను. నేనిప్పుడు పరిహాసపాత్రుఁడ నగుదునేమోయని భయమగుచున్నది. విచారణనిమిత్తము నన్ను ధర్మాధికారివద్దకుఁ గొనిపోయి యెదుట నిలిపినప్పుడును నాకింతభయ ముండదు. అదిగో తలుపుచప్పు డగుచున్నది. అవ్వు నామె లోపలి నుండి తలుపు తీసికొని వచ్చుచున్నది. పెళపెళలాడుచున్న యామె చీరచప్పుడే నాచెవికి తిరస్కారశబ్దముగా వినఁబడుచున్నది.

రాగమంజరి—(భానుమతి వేషముతో ప్రవేశించుచున్నది)

వసు—(తలవంచుకొని) నాప్రాణపద మైనయామెముఖము వంక తేఱిచూచుటకే నాకిప్పుడు సిగ్గగుచున్నది. ఒకవేళ మొగము వంకఁ జూడఁగలిగినను, ఆమె సౌందర్యమును పొడగన్న పిమ్మట నాకు మాటాడుటకే నోరు లేవదు. నన్నామెయే ముందుగా పలుక రించునని కోరెదను.

రాగ—అయ్యా! మీసెల వయిన దని వచ్చినాను.

వసు—(తనలో) ఇక్కడికి మబ్బు విడిపోయినది. ఇంతవఱ కారంభము మర్యాదగానే యున్నది. (ప్రకాశముగా) శ్రీమతీ! ప్రియురాలా! నే నవధానుఁడనయి యున్నాను.

రాగ—అయ్యా! సంభాషణ జరపవలసినవారు మీరు; విన వలసినదానను నేను.

వసు—(తనలో) ఈమాటలోఁగూడ నాయెడ తిరస్కార భావమేదియులేదు. ఇఁక నేను తలయెత్తి చూడవచ్చును. ఇంత వేగిరము చూడఁగూడదు. ఈటక్కరి ప్రియురాలి సౌందర్యవీక్ష ణమువల్ల మరల నోటినుండి మాట రాదేమో!

రాగ—అయ్యా! మీలో మీ రేదో యాలోచించుకొను చున్నారు. ఈపాటి పీఠమును స్వీకరింపుఁడని నేను మిమ్ము వేఁడ వచ్చునా?

వసు—(తనలో) అంతకంతకు నాయం దీమెకు దయ హెచ్చగుచున్నట్టున్నది. నారూపము చూడఁగానే యీమె కాళ పుట్టినది. నాయొయ్యార మిక్కడ నిష్ఫలము కాలేదు.

రాగ—అయ్యా! మీరు పీఠముమీఁద దయచేయుఁడు.

వసు—ఓకాంతా! నీసౌజన్యాతిశయము నన్నిప్పుడు సంతోషసాగరమగ్ననిగాఁ జేయు చున్నది. ఇటువంటి సుందరీతిలకము తన సుందరకటాక్ష వీక్షణములను నాయందు ప్రసరింపఁజేయుటచేత నేను ధన్యుఁడ నయినాను.

రాగ—(చేయి పట్టుకొనుచున్నది.)

వసు—(ఆమెకేసి తిరిగి కన్నెత్తి చూచుచున్నాఁడు)

రాగ—మీరు నానమ్రత కద్భుతపడుచున్నట్టున్నారు.

వసు—అవును. నాకిది కొంతయద్భుతముగానే యున్నది. (తనలో) చెప్పి! ఇది భానుమతి కాదు. దీనికి మాతల్లికున్నంత వయస్సున్నట్టున్న దే!

రాగ—మాతండ్రిగారి యాజ్ఞాబలముచేత నేనునాపూర్వాభిమానము నంతను విడువవలసినదాన నయినాను.

వసు—(తనలో) తండ్రిగారా! అవును. ఈమె భానుమతియే. ఓయీశ్వరా! లోకములో తండ్రులు కొంద రెంత కన్యాగాదనిరా రుగా నుందురు!

రాగ—అయ్యా! వసుకామా!

వసు—(తనలో) ఈమె నిజముగా దొడ్డయిల్లాలు. నాయం దీమె యిప్పుడు తల్లిప్రేమ కనఁబఱుచుచున్నది. మొదటినుండియు నేనీమెరూపమునఃకాశపడక ధనమునకే యాశపడుట మంచిపనియే జరిగినది.

రాగ—అయ్యా! మీ రాసీనులు కారా!

(అని కూరుచున్నది.)

వసు—ఓయిల్లాలా! నన్ను మన్నింపుము. నీసౌజన్యమువల నఁగలిగిన యద్భుతరసములో మునిఁగి నేనింకను తేలుకోలేదు. (తనలో) దయ్యమువలె దీనిముఖమునిండను సొట్టలేయున్నవే!

రాగ—నాసౌలభ్యముచూచి మీరు వింతపడుచుండుట నా కద్భుతముగా లేదు. వెనుక మీమీఁద నాకపరిమితద్వేష మున్న మాట వాస్తవమే యని నేనిప్పుడు మీయొద్దనే యొప్పుకొనెదను. నాతండ్రి నన్ను మిక్కిలి పీడించుటచేత, కామపాలునికి నే నప్పుడు కొంతప్రోత్సాహము కలిగించినాను. అప్పుడు మీరూపవిషయమయి నాకు వేఱువిధముగా చెప్పినారు.

వసు—ఈశ్వరసాక్షిగా నీరూపవిషయమయి నాకును వేఱు విధముగానే చెప్పినారు.

రాగ—మీరూపమిప్పుడు చూడఁగా నేయిచ్చునఁబొడిచినట్లు నామనస్సున నాటుకొన్నది.

వసు—అలాగుననే నీరూపమును నామనస్సున నాటుకొన్నది. నీరూపము పదియిచ్చులను బొడిచినట్లు నాహృదయములో లగ్న మయి నన్ను విడువకున్నది.

రాగ—ఈపఱకు మనమిద్దఱమును సమానముగానే భ్రమ పడినాము. ఇప్పుడు ప్రత్యక్షమున మన యిరువుర సందేహములును

తీఱిపోయినవి. నేను గర్విష్ఠురాల ననియు ప్రతికూలురాల ననియు మీ రనుకొన్నారు; మీరు రూపమును మర్యాదయు రసికత్వ మును లేని చప్పిడిముక్క నల్లమొద్దు లని నే ననుకొన్నాను.

వసు—(తనలో) ఈమె యీప్రకారముగా తనసౌందర్యాభి వర్ణనమునుకూడ చేసికొన్న బాగుండును.

రాగ—మీది గంభీర మయిన విగ్రహము. మీ చుఱుకు చూపులేమి! వలపు గొలుపు చిఱునవ్వు లేమి! నాదృష్టికి మీరు ధీరోదాత్తనాయకులుగాఁ గనఁబడు చున్నారు.

వసు—(తనలో) నేనిప్పుడీమెవంక తిన్నగా మఱియొకసారి చూడవలెను. మొదట కనఁబడ్డంత వికారముగా నాకిప్పు డీమె కనఁబడదు.

రాగ—శైవులయం దుండుపామండలక్షణము మీ మొగ మున నీసమంతయినఁ గనఁబడదు. మీయం దన్నియు మహాకులీనుఁ డయినదొడ్డగృహస్థు లక్షణములే యున్నవి.

వసు—(తనలో) మంచిది. ఈమెకంఠమునందు నిశ్చయముగ కావలసినంత మాధుర్య మున్నది.

రాగ—స్త్రీజనోచిత మయిన మర్యాదనతిక్రమించి మిమ్మీ ప్రకారముగా ముఖస్తుతి చేసినందుకు దాసురాలిని క్షమింప వలెను. ఈవఱకు విపరీతముగా విని మోసపోయి యున్న నేను మీమూర్తి విశేషమును జూడఁగానే కలిగినవిర్భరానందమును మనస్సులో నిలుపుకో లేక నా మానోగతమును వెలిపుచ్చినాను.

వసు—ఓప్రాణేశ్వరీ! ఇటువంటి ప్రియవాక్యములను పలికిన యీచిన్నపెదవులను నేనొక్కసారి కృతజ్ఞతాసూచకముగా ముద్దు

పెట్టుకోవచ్చునా? (అని రాయాసామె చేయి ముద్దుపెట్టుకొని) ఏమి! ఈ హస్తము దూదికంటెను మెత్తగా నున్నది!

రాగ—అయ్యా! మీరొద్ద మంచి లాలనశక్తి యున్నది. అయినను పెద్ద దేశమువంటి మొండ్లవలె నున్న మీకాలకు మీసములను మాత్రము మీరు శీఘ్రముగా వదల్చుకోవలెను.

వసు—(తనలో) మంగలకత్తి నా కాలకు మీసములకును నీ బిరుసు కేశములకును కూడ సమానముగానే పనికివచ్చును. (ప్రకాశముగా) ఒకచిన్న పాట పాడి నాచెవుల కొక్కసారి విందు చేయఁగలవా?

రాగ—నాది కొంచెము బొంగురుగొంతు కయినను, మీ యానందముకొరకు నేను సంతోషపూర్వకముగా పాడెదను.
(కొంచెము దగ్గి గొంతు సవరించుకొని పాడుట కారంభించుచున్నది)

వసు—(తనలో) ఈమె తప్పక భూలోకసరస్వతిగా నేయున్నది. నీ వాయాస పడఁబోకు.

రాగ—నాకాయాస మెంతమాత్రమును లేదు. ఆలకింపుము.

ద్విపద. కనుమకోమలి నోర్తుఁ గోరి తోల్దొల్త
వెసనాయకుఁ డొకండు వేడ్కతోఁ జేరి
పరిశోధనము చేయుచుట్టున నతఁడు
పరువడిఁ దనమనోవ్యథ తేటపడఁగఁ
జాలుచూపులు మీఁదఁ జొప్పించెనేని
తరళాక్షికిని సిగ్గు తల మున్కగాదె?
కర మాతఁడు గ్రహింపఁ గడు గంప మొందు;
అరఘంటఁ గెమ్మోవినంట మూర్ఛిల్లు;

గుండెలు తటతట కొట్టుకొనంగ
నిందుభీతిని దేల్పు నెలఁత డెందంబు.
కాని యంతంతకుఁ గ్రమముగా భీతి
తాను యుల్లములోన తగ్గుచునుండు;
తరుణి నాయకుఁ జూచు ధైర్యంబుతోడ;
వరుఁ డామోహాస్త్రంబు వచ్చి పట్టినను,
కరముఁ గూరిమితోడఁ గౌఁగిలించినను,
బాలయు దింతయును సిగ్గు పోలఁతి యామీఁద.
ముద్దియ చిఱునవ్వు మోదంబుఁ దెల్ప
నిద్దఱుఁ బెండ్లికి నేగుదు రొకట;
గుండెలు తటతట కొట్టుకొనంగ
నిందుప్రేమను దెల్పు నెలఁత డెందంబు.

వసు—ఆహా! నీపాట నాకెంత కర్ణరసాయనముగా నున్నది! ఇప్పుడు నిజముగా నీకంఠస్వరము నాకు ప్రేమాస్పదురాలయి నిన్నుఁ బోలి యున్నయొకయిల్లాలిని స్మరణకుఁ దెచ్చుచున్నది.

రాగ—అట్లయిన, నీకు ప్రేమాస్పదురాలు మఱియొకతె కూడ నున్నదా?

వసు—ఓ సుందరీ! నీవు నాయభిప్రాయమును గ్రహింపలేక భ్రమ పడుచున్నావు. నేను మాతల్లిమాట చెప్పినాను.

రాగ—రమ్ము. ఓప్రియుఁడా! ఇటు రమ్ము. నే నింత సులభముగా వశ్యురాల నయినందున కమ్ముతప్రమోదములలో మునిగి పోయి నీమనసు కలఁగి యుండుటచేత నీ వేమిచెప్పవలెనో తెలియక తడఁబాటు పడుచున్నావు.

వసు—ఆమాట సత్యము. నీవు వశ్యురా లయినవార్త సుదర్శనవర్మతో మనవి చేసి వచ్చుట కయి నన్ను నీవు సంపూర్ణమనోరథుని జేయుట కెప్పుడనుగ్రహింతువో యాశుభవేళ నడుగక జాగు చేసినందుకు నాకిది శిక్ష యనుకొనెదను.

రాగ—ఇప్పుడు నామనస్సులోనున్నది నీతో నిష్కపటముగా చెప్పివేయవలెను. నాతండ్రియనుమతిమీఁద, నే నెప్పుడును నీసొమ్ము కాఁగలదానను గాను.

వసు—ఏమి? ఎందుచేత;

రాగ—నాతండ్రి కోపావేశముచేత నేను తనయిష్టములో మెలఁగువఱకును నామొగము చూడనని ప్రతిజ్ఞ పట్టినాఁడు; అతని చేతిమీఁదుగా భర్తను చేసికోనని నేనును పంతము పట్టినాను. ఏది యేమయినను నాప్రతిజ్ఞ నేను తప్పను. అతనియెఱుక లేకుండ నన్ను తీసికొనిపోవునైపుణ్యమును సాహసమును నీయొద్ద నున్నయెడల నేను నీదానను.

వసు—అది యుక్తము కాదు.

రాగ—నాకు మఱియొకమాట సరిపడదు. నీవనుమానించెదు పక్షమున—

వసు—(తనలో)ఇది యంత పిచ్చపనిగాఁ గనఁబడదు. ఈమాట ప్రకారముగా నేనీమెను పాణిగ్రహణము చేసికొన్నయెడల, నేనీమెకేమియు బదులు వ్రాసి యియ్యనక్కఱలేకయే యీమెధనమును దక్కించుకోవచ్చును. అప్పుడీమెకొక్కదానిని మాత్రమే కాక యీమెతండ్రినిసహితము నేను మోసము చేయఁగలిగినవాఁడ నగుదును. ఓహో! నాయుపాయముచేత నే నిప్పు డెంతటియదృష్టవంతుడ నగుదును! ఈయాలోచన నేను పరుల కెవ్వరికిని తెలియనియ్యక

[అప్పుడు పరిచారిక ప్రవేశించుచున్నది.]

పరి—అమ్మా! వసుశాముునితో మాటాడవలసినపని యున్న దని యెవరో యొకగృహస్థు వచ్చి గుమ్మమువద్ద నిలిచియున్నాఁడు.

వసు—ప్రాణేశ్వరీ! అతఁడు నామిత్రుఁడు. నా ప్రాణమిత్రుఁడు—ఓ పరిచారికా! నీ వాతనిని లోపలికి రానియ్యవచ్చును.

పరి—మంచిది. (అని నిష్క్రమించుచున్నది.)

వసు—సమస్తవిషయములలోను మన మాతనిని నమ్మవచ్చును.

[అంతట చంద్రకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వసు—(మిత్రునితో నేకాంతముగా) అన్నా! ఏమి సమాచారము?

చంద్ర—(ఏకాంతముగా) సుదంతిగారి యింటివద్ద నుంచి వచ్చినాను. నా కెక్కడను కామపాలుఁడు కనఁబడలేదు.

వసు—పోనిమ్ము. అతనిని నేనే వెదకెదను లే. ఓ మిత్రుఁడా! ఇక్కడ నాయాత్రము పాయుచున్నది. నేను కృతార్థుఁడ నయ్యెదను.

చంద్ర—నీ ప్రియురా లెక్కడ ?

వసు—అదిగో! అక్కడ నిలుచున్నది.

చంద్ర—ఓహో! ఈమె చెడ్డకురూపినిగా నున్నదే !

వసు—ఊరకుండుము. (అని మిత్రునితో ననుచున్నాఁడు.)

రాగ—అయ్యా! నీమిత్రుఁడు నన్నుగూర్చి యేమో యనుచున్నట్టున్నాఁడు.

వసు—ఇటువంటిరూపమును మున్నెప్పుడును చూచి యుండ

లేదని యత్యంత ప్రేమతో యభ్యక్తపడి తన సంతోషమును నాతో తెలుపుచున్నాఁడు. మిత్రుఁడా, కాదా?

చంద్ర—ఇట్టి రూపమును నిశ్చయముగా నే నీవఱకెన్నఁడును చూచి యుండలేదు.

రాగ—అయ్యో! నాయందు మీకు దయ గనుక, అట్లు సెలవిచ్చుచున్నారు. ఓవసుకామా! మనమింతట విడిపోవుట మంచిదనుకొనెదను. మన యుపాయము మఱవకుము.

వసు—ఓ ప్రాణేశ్వరీ! మఱవఁపోను. నీ దివ్యసుందర విగ్రహమువలెనే యీ యుపాయమును నా మనస్సులో శిలాక్షరమువలె నాటుకొని యున్నది. నా భాగ్యదేవతా! పోయి వచ్చెదను సెలవిమ్ము. ఇఁకొక్కసారి యీ సేవకు ననుగ్రహింపుము.

(అని చేయి ముద్దు పెట్టుకొనుచున్నాఁడు)

రాగ—ఓ మనోవల్లభా! సెలవు గైకొనెదను.

వసు—నేను నీకు సంపూర్ణదాసుఁడను. ఓ చెలికాఁడా! మనము సెలవు పుచ్చుకొనుచున్నాము గనుక నీ విప్పు డేదయిన మంగళవాక్యము పలుకుము.

చంద్ర—ఓ వసుకామా! నేనుజూచిన సుందరులలో నెల్ల నా వర్ణన పనికిరాని దీమె యొక్కతయే నాకు కనఁబడు చున్నది. అయినను నే నిప్పుడు చూచినదానినిబట్టి సమయోచితముగాఁ గొంచెము కల్పించి పాడెదను:—

చ. ఇలఁ బలు సిట్టిదంపతుల నెప్పుడు నెవ్వరుఁ జూడఁ బోరికన్;
చెలువగు రూపసంపదల బిత్తరిమించెనుఁ గాంతుఁ డిత్తరిన్;
వలచి పరస్పరంబు నిటు పైఁ బడు మీదెసుఖంబు ధారుణిన్;
జెలువకు నిన్ను నీకు నలచెల్వను దైవము చేసె వింతగన్,

సుగంధి. మీరు శాంతదృష్టిచూచి మీకుఁ బుట్టు బిడ్డలన్
మీఁద నేడ్వఁగొంద్రుగాక మేటియౌ విధేయతన్;
మీదుపుత్రులెల్లఁ దండ్రిమించఁ జెల్వితేజులన్,
మీదుకూఁతులెల్లఁ దల్లిమించఁ జెల్లు రూపునన్,

తే. గీ. ఎంతపుణ్యంబు! సంతానమించుకైన
యిట్టిబుద్ధియు నందంబు నెఱమిఁగనుట!
వసుధ జీవించియున్నంతవఱకు మీదు
యోగ్యతకు మీకుఁ దగిన మేలొసఁగుఁగాక!

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---

3. రంగము—సుదర్శనవర్మ గృహమునందు పుస్తకనిలయము.

[సుదర్శనవర్మయు, విజయవర్మయు ప్రవేశించుచున్నారు]

సుద—కామపాలుని కిప్పుడు కాక్షేపణా? అతని బీదతనము. అతఁడు ధనహీనుఁడు కాఁడని నీవు చెప్పఁగలవా?

విజ—అతఁడు ధనాధికుఁడు కాఁడనుమాట సత్యమే. కాని యతఁడు మొదటినుండియు గౌరవముతోఁ బ్రతికిన ప్రాచీనసద్వంశమున బుట్టినవాఁడు.

సుద—ప్రతీరాష్ట్రమునందును గల బిచ్చగాండ్రందఱును ప్రాచీనకుటుంబములోఁ బుట్టినవారే. వారికిప్పుడు పేరుప్రతిష్ఠలు నుమాత్ర ముండవు.

విజ—కామపాలుఁడు విశేషసుగుణసంపత్తి కలవాఁడు.

సుద—ఎన్నిసుగుణము లున్ననేమి? ధనవంతుఁడుమాత్రము కాఁడుగదా? అతఁ డుల్లాసపురుషుఁడయి కన్నఁగాక పూర్వ

వసు—నే నామెను ప్రసన్నచిత్తురాలిని చేసినాను.

సుద—దానిగుణ మెంతవఱకు కుదిరినది?

వసు—కొంతవఱకు కుదిరినది. ఆమె నేననుకొన్నదానికంటెనిశ్చయముగా నాయందు బహుగుణము లెక్కువ ప్రేమ నేర్పఱచినది.

సుద—నాకన్నతల్లి నీయెడల గౌరవముతో నడుచుకొన్నదా?

వసు—అవు నాకన్నతల్లి నాయెదుట నత్యంతగౌరవముతో నడిచినది.

సుద—ఈమాట వినఁగలుగుటచేత నేను పరమానంద భరితుఁడ నగుచున్నాను. దాని సౌందర్యముచూడఁగా నే నీకాశ్చర్యము కలుగలేదా?

వసు—నిశ్చయముగా నేన త్యాశ్చర్యపడినాను. మీకొమార్తె కిప్పుడు వయ స్సెంత?

సుద—వయస్సా? పందొమ్మిదింటిలో మూడు తగ్గించు. పదునాఱు సంవత్సరము లున్నవి.

వసు—పదునాఱా?

సుద—అంతకంటె నొక్కమాసమయినను హెచ్చులేదు.

వసు—అంతకంటె నొక్కమాసమయినను హెచ్చులేదు.

వసు—అట్లయిన పక్షమున, ఆయీడు కామెది మిక్కిలి ముదురుముఖముగా కనఁబడుచున్నది.

సుద—అలాగా? కానిమ్ము. అంతకంటె చక్కనిదానిని నీ వెక్కడను జూచి యుండవు.

వసు—అప్పుడప్పు డొకానొక తెను మాత్రము చూచుచుందును.

సుద—నీకు భానుమతియందు మాకుటుంబలక్షణము లగపడలేదా?

వసు—(తనలో) కావలసినన్ని కుటుంబలక్షణములు కనబడినవి. నా కామె కేవలకుటుంబినిగానే తోచినది.

సుద—దాని కన్నులయందు తండ్రిపోలిక లేదా?

వసు—(తనలో) తండ్రిపోలికకు సులోచనములు మాత్రము తక్కువ.

సుద—దానిముక్కు మేనత్తను, నొసలు మాతృవతల్లిని పోలి యుండ లేదా?

వసు—(తనలో) ఒక్కనొసలే కాదు ముఖ మంతయు మాతృవనే పోలియున్నది.

సుద—ఓ వసుకామా! ఏమును భానుమతి యెంతసుందరురాలో యంత విధేయురాలుగా కూడ నయినపక్షమున, దానిది పయి యలంకారములచేత తాత్కాలికముగా వచ్చిన యందముగాక స్థిరమయిన స్వాభావిక సౌందర్యము నీకే యనుభవము కాఁగలదు.

వసు—అట్లే యనుభవ మగును. ఆమెప్రాయము పదియాఱు సంవత్సరములే యయినపక్షమున, ఆమె తనకంటె రెట్టింపువయస్సు దాని ముఖసౌందర్యమును పొందియున్నదని నాకిప్పుడే యనుభవ మగుచున్నది.

సుద—ఏమీ? వసుకామా! నీవు భానుమతిని పరిహాసము చేయుచున్నావా యేమి?

వసు—పరిహాసము కాదు. సత్యమే పలుకుచున్నాను. నిజముగా నీవు నీకొమార్తె సౌందర్యవతియని యే తలఁచుచున్నావా?

సుద—నాకన్నులతో చూచిన మొదలు, దానికంటె సౌందర్యవతి యీ యుజ్జయినీనగరములో నుండదు.

వసు—నేను నాకన్నులతోఁ జూచినాను నీవు నీకన్నులతోఁ

వసు—(తనలో) నామీఁద వీరిద్దఱు నేక మగుచున్నారు. ఈవిషయములో నే నతిదూరము పోయినాను.

విజ—ఇంతలో తప్పక యేదో పొరపా టున్నది. ఇతఁడు చూచిన దొక వేళ నాచెల్లెలు కాదేమో?

సుద—ఇతనివలెనే నీవును పెద్దయతిమాలినవాఁడ వగుచున్నావు. ఇక్కడ భ్రమ కవకాశ మేమున్నది? భానుమతిని గదిలో పెట్టి తాళము వేసి తాళముచెవి నాయొద్ద నుంచుకోలేదా? మనపరిచారిక తీసికొనిపోయి యితనిని నీచెల్లెలిగదిలో విడిచి రాలేదా? ఇందులో పొరపా టేమున్నది? లేశమును లేదు. ఈపాపండుఁడు బుద్ధిపూర్వకముగానే నన్ను పరాభవపఱుపఁ దలఁచుకొన్నాఁడు. మన గృహమున కతిథియై పోయినాఁడుకాని లేనియెడల న న్నిట్లవమాన పఱచినందుకు నాముసలికత్తి యీపాటి యితనిని యమగృహమున కతిథిని జేసియుండును.

వసు—(తనలో) ఈగొడవలోనుండి నే నేలాగున నైనను బయలఁబడవలెను. భానుమతి చక్కనిది కాకపోయినను, భానుమతి తెచ్చెడియరణము మిక్కిలి చక్కనిది. అరణము పోనియ్యకూడదు. (ప్రకాశముగా) అయ్యా! నిన్ను పరిభవపఱచవలెనని నాయుద్దేశ మెంతమాత్రమును కాదు. నాప్రియురాలిమీఁద నాకెంతో ప్రేమయున్నది. మేలు కలిగినను కీడు కలిగినను తప్పక మీకొమార్తెను వశపఱుచుకొని వివాహమాడవలెననియే నానిరంతరప్రార్థన. నేను పరిహాసము చేయలేదని ప్రమాణముచేసి చెప్పఁగలను.

సుద—చీ చీ! అతిప్రసంగముచేసి నాకు మఱింతకోపము తెప్పించకు. నీవాలకము చూచిన నాదేహము మండుచున్నది.

వసు—బావా! ఈయన కాగ్రహము హెచ్చుగుచున్నది.

ఈయనను గట్టిగా పట్టుకొమ్ము. అయ్యా! మీరు కోపావేశవివశు లయి యున్నారు. నేనిక్కడనుండి పాఱిపోవలెను.

సుద—నీవు దొంగవు. వట్టిపనికిమాలినవాఁడవు. ఇక్కడ నుండి లేచి పో.

వసు—మామా! రమ్ము. ఇఁక పరియాచకము చాలించి మనము కార్యాంశమును మాటాడుకొందము.

సుద—ఏమీ!

వసు—అహాహాహా! నేను నవ్వులాటకు మీకొమార్తెను చేసినయీదూషణ మీరు నిజముచేసి తప్పుపట్టినయెడల, నేను చెడిన వాఁడనేకదా!

సుద—నీయుద్దేశ మది కాదా?

వసు—ఎంతమాత్రమును కాదు. మీకెంతకోపము వచ్చునో చూడవలెనని యీయెగతాళిమాట లన్నాను.

సుద—సరిసరి. అంతేకదా! నీవు పరిహాసకుఁడవుకూడ నని నేనీవఱకెఱుఁగనే యెఱుఁగను. అహాహాహా! దైవముతోడు! నీ వన్నమాటలకు నాదేహము తెలియనంతకోపము వచ్చినది. ఇప్పుడు భానుమతి నీమనసువచ్చిన చక్కనియొయ్యారియేకదా?

వసు—చక్కనిదా యని నేనేయడుగవలెనా? రంభ నీకొమార్తె కాలికి దాస్యము చేయుటకు పనికిరాదు.

సుద—ఓ జిత్తులమారి పెండ్లికొడుకా! దగ్గఱగా వచ్చి నా కొక్కసారి నీ కౌఁగిలి యిమ్ము. ఈవిఘ్నమువల్ల కార్యము భగ్న మయిన దనుకొన్నాను, కాలేదు.

విజ—(తనలో) ఈకలహము ముదిరి కార్యవిఘాత మగునని

నే నెంతో యాశ పడినాను. ఈమాయలమారి పాపండుఁడు నా శాశాభంగము కలుఁగఁ జేసినాఁడు.

సుద—కోపవేగముచేత నాలుక తడియెండిపోయినది. లోప లికిఁ బోయి దాహశాంతి చేసికోవలెను. భానుమతీ! నీవందగత్తెవు కావఁట? అహహహహ! ఇది మంచి పరిహాసము.

వసు—(తనలో) ఇదిపరిహాసమే కాదు సత్యమే.

సుద—ఓవిజయవర్మా! నీ కాఁబోవుబావకు విజయము కోరుము.

విజ—ఓకాఁబోవుబావా! నీకు నేఁ డవాంఛితార్థసిద్ధి యగు నుగాక!

సుద—ఓ యభినవబృహస్పతీ! మనకు భోజనవేళ యయినది. నామనస్సులో నీమీఁది కోపమేమయిన దిగబడినయెడల, అప్యాయ నముగా భోజనముచేయఁగానే యడఁగునఁ బడిపోవును. పోదము లెమ్ము.

సీ. సరససల్లాపములకన్న శాంతవచన
సముదయముకన్నఁ గడువేగఁ జల్లపఱుచుఁ
బుష్టికరమైన యిష్టాన్నభోజనంబు
కాఁకనొందిన మనసును గడియలోన.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

౪. రంగము—వసుకాముని గృహము.

[భానుమతి ప్రవేశించుచున్నది.]

భాను—తండ్రియింటనుండి పాఱిపోయివచ్చి మనస్స్వస్థత లేక నావలె పరితపించు కొమార్తె లోకములో మఱియెవ్వతె యైన నుండునా? నాకు భర్త కాఁగోరియున్న వానిచేతనే నేనిప్పుడు నాప్రియుని వెదకించుచున్నాను. నాతండ్రి మెచ్చినవరుఁడు నేను మెచ్చినవరుని దెచ్చుటకయి పోయినాఁడు. ఆహా! ఇష్టులరాకను కోరినిరీక్షించుచున్న కాలము దుస్సహమయి మనము నెంతవ్యాకుల పెట్టుచుండును!

ద్విపద. కాలమా! ఱెక్కలు గట్టుకొంచీవు
హేలాగతిని నిల్వ కెగసెద వంచు
నేకవి నినుఁ దొల్త నిలను వర్ణించె
నో కాని యాతఁ డీయుర్విలోఁ దాను
బ్రియురాలి నెన్నఁడు నెడఁబాయనట్టి
వయసువాఁ డయియుండవచ్చు సత్యముగ
దినమొక్కటేనియుఁ దిన్నఁగాఁదాను
జెనుపొందువలపులోఁ బ్రియురాలిఁ బాసి
విరహాగ్ని వేఁగినవెంగలి యెవఁడు
వరుగెత్తుదు వటంచుఁ బలుకును నిన్ను?

[అప్పుడు చంద్రకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భాను—అన్నా! కామపాలుఁడు దొరికినాఁడా?

చంద్ర—సోదరీ! నా కతఁ డెక్కడను కనఁబడలేదు, నా

మిత్రుఁ డయిన వసుకాముఁ డిప్పు డాతని నేలాగునైన పట్టుకొని యిక్కడకు తీసికొని రాకమానఁడు.

భాను—ఎంతసిగ్గుపాటు! అతనిజాడ తీయుట కయి నీవు నీ చతురతను ముపయోగింపలేదా? నీప్రాణము నమ్ముకొనియున్న యీ సహోదరికి చూపవలసిన యుపచార మదేకదా?

చంద్ర—ఓ సోదరీ! నీపనిలో నే నశ్రద్ధ యెంతమాత్రమును చేయలేదు.

భాను—కామార్త యయి ప్రియునిరాక వేచియున్ననాయకి మనస్సునకు జాగు చేసిన యొక్కొక్కనిమిష మొక్కొక్కయుగముగా తోఁచి యెంతదుర్భరముగా నుండునో మీయిద్దఱిలో నెవ్వరికైన తెలిసియుండినపక్షమున మీరిట్లు కాలహరణము చేసియుండరు.

చంద్ర—అయ్యో! నాకాయవస్థ పూర్ణముగా తెలిసినదే.

భాను—అట్లయిన, నీ వొకసుందరిని కామించియుంటివి కాఁబోలును.

చంద్ర—ఓసోదరీ! పూర్వ మొకసారి నేనును శృంగారనాయకుఁడ నయి తిరిగిన వాఁడనే. ముందెప్పుడును స్త్రీపేరు తలపెట్టకుండ నా కాయొక్కసారితోనే బుద్ధి వచ్చినది.

భాను—నీప్రియురా లంత నిర్దయురాలుగా నుండినదా?

చంద్ర—ఆమె యెల్లప్పుడును దయావిహీనురాలుగానే యుండినయెడల నేను సుఖినే యయి యుందును.

సీ. నాప్రియురా లెప్డు నామీఁదఁ జిఱునవ్వు
పొలయింపకున్న నేఁ బొగుల నింత
కృశియింప వలదంచు, నిదె వరించెద నంచు,
నగమాటు కామాగ్ని రగులు కొలిపి

యెంతనిర్దయురాలో యెఱుఁగు మావల నింతి
తాను బెంచినయూళ తఱిగివేసె
నటునిటు గాలికి నల్లలనాడెడు
పగిలిపోయినయోడపయిని నిలిచి
దాని విడనాడి క్రిందిసంద్రంబులోన
పడఁగ నుంకించి దరియుంచు బనుగు భార్యఁ
బ్రాణములు వచ్చి యొద్దు చేరకయె యోడ
మునుఁగుచున్నవాఁడును నింత వనట గనఁడు.

భాను—అదుగో నీమిత్రుఁడు కామపాలుని తీసికొని వచ్చు
చున్నాఁడు. నేనొక్కనిమిష మీగదిలో దాఁగియుండి వారిని
భ్రమింపఁ జేసెదను. (అని నిష్క్రమించు చున్నది)
[అప్పుడు వసుకాముఁడును కామపాలుఁడును ప్రవేశించుచున్నారు]

కామ—ఓయీ! నీవు నిశ్చయముగా పొరపడి యుందువు.
నన్ను నుదంత కామించి వెదకి తెమ్మని నిన్ను పంపినదా? ఇ ల్లింత
మాత్రమును జరిగి యుండదు.

వసు—వృథావాద మెందుకు? ఇంకొక్కనిమిషములో సర్వ
మును నీకే తేటపడును. ఓ చంద్రకేతుఁడా! ఆమె యెక్కడనున్నది?

చంద్ర—(వ్రేలితో తలుపువంకఁ జూపుచున్నాఁడు.)

వసు—ఆగదిలోనా?

కామ—ఆమె నిజముగానే యిక్కడ నున్నపక్షమున, చిర
కాలమునుండి తనమనోహరుఁడుగా నున్నా ప్రియమిత్రునియొద్దకు
నన్ను తీసికొనిపొమ్మని వేఁడుకొను నిమిత్తమయి నన్నిక్కడకు
రప్పించి యుండును.

వసు—అందునిమిత్తము కాదని నేను దృఢముగాఁ జెప్పఁగలను. ఆమెకుఁ గావలసినవాఁడవు నీవే. నీవుతప్ప మఱి యెవ్వరును కారు. నీనిమిత్తమయి ప్రాణములు విడుచుచున్న సంపూర్ణయావనవతియైన సుందరీతిలకమువద్దకు నిన్ను బోధించి పంపుటకే మా కిక్కడ శ్రమపడవలసి వచ్చుచున్నది.

కామ—న న్నందుకు నిర్బంధపఱిచెదవు? నా కాసుందరి మీఁద ననురాగము లేదు.

వసు—భానుమతిమీఁద నున్నది కాఁబోలు! నామాట నమ్మును. ఇప్పు డక్కడ లేశ మయినను నీయాంశ కవకాశము లేదు. రెంటికిని చెడక నామాట విని నిన్ను వెదకికొనుచు వచ్చినయీభాగ్యదేవత నైనను దక్కించుకొమ్ము.

కామ—మిత్రిన కాశాభంగము కలుగఁజేయుట నాకు న్యాయమా?

వసు—రాజ్యాంగవిషయములవలెనే కామవిషయములోను న్యాయముతో పని లేదు. వలపునిన్ను దొంగనుగాఁ జేయలేకపోయిన పక్షమున, నీవు తిన్ననివలపు కలవాఁడవు కానే కావు. రమ్ము నీవొక్కసారి లోపలికి పోయి యామెతో మాటాడినైనను రమ్ము.

కామ—అంతవఱకు చేయుటకు నా కాక్షేపణ యేదియు లేదు.

వసు—(తలుపులు తీసి) అదిగో! అదిగో! ఆమె కిటికీవద్దనున్నది. లోపలికి పొమ్ము. (అని కామపాలుని లోపలికి త్రోచి తలు పోరగా వేసి) ఓ చంద్రకేతూ! ఇప్పుడు నే నీతనిని బోనులో త్రోసినాను. ఇఁక లోపల నీ రేమిచేయుదురో నేనిక్కడనుండి తొంగి చూచుచుండెదను. అతఁడు దిగ్భ్రమనొంది వెఱ్ఱివానివలె చూచుచున్నాఁడు—ఆమె వచ్చి బుజ్జగించుచున్నది—మిత్రుఁడా! చూడు, చూడు,

అతఁడు వారికి వచ్చుచున్నాఁడు—అవు నవును. అతఁ డిఁక తన న్యాయమును గీతమును శీఘ్రముగానే మఱచిపోవునులే.

చంద్ర—చూడు! ఇప్పుడు వారిద్దఱును నవ్వుకొనుచున్నారు.

వసు—అవు నవును. వారు నవ్వుకొనుచున్నారు. అతఁడిప్పుడు చెప్పినప్రియమిత్రుని దురదృష్టమును తలఁచుకొని నవ్వుచున్నారు కాఁబోలును. అయ్యా! పాపము వీ రతనికొంప తీసినారు.

చంద్ర—అతఁడిప్పు డామెచేయి ముద్దుపెట్టుకొనుచున్నాఁడు.

వసు—అవు నవును. వీ రిద్దఱును సమాధానపడినారు. ఇతఁడు వలలో తగులుకొన్నాఁడు; ఉరులలో చిక్కుకొన్నాఁడు. ఓ ప్రియమిత్రుఁడా! మనకృషి ఫలించినది; నాబుద్ధి పనికివచ్చినది. నేనిఁక బృహస్పతి నే; అపరబృహస్పతిని.

చంద్ర—ఆవల నెవరో నీవున్నావా యని యడుగుచున్నారు. నేను పోయి చూచివచ్చెదను. (అని నిష్క్రమించు చున్నాఁడు.)

[కామపాలుఁడును, భానుమతియు ప్రవేశించు చున్నారు.]

కామ—ఓయీ! వసుకామా! సుదర్శనవర్మ గృహమునందు నీకు విజయము కలుగుట నిశ్చయ మని యీమె నాకు నమ్మకము పుట్టించినది గనుక, ఇఁక నేనక్కడ నాప్రయత్నమును పూర్ణముగా వదలుకొనెదను.

వసు—అంతకంటె తెలివిగలపని మఱియొకటి లేదు. నీమిత్రుని మోసముచేయుట నీవిప్పుడంత గొప్పగా విచారింపవలసినపని లేదు. కామవిషయములో మోసము చేయుట నింద్యార్హము కాదు? అవునా? సుందరీ!

భాను—ఎంతమాత్రమును నింద్యార్హము కాదు. నీవిట్టియభి

ప్రాయము గలవాఁడ వయినందుకు నేను ముఖ్యముగా సంతోషించు చున్నాను.

వసు—ఆమాట నిశ్చయము. చేతనయినపక్షమున నన్నెవ్వ రైనను వచ్చి యిప్పుడు మోసము చేయుమను. ఓ యదృష్టవంతు రాలా! నే నిప్పుడు నిన్నాశీర్వదించెదను. మీరు వివాహము చేసి కొని సుఖ మనుభవింతురు గాక యని నామనఃపూర్తిగా కోరు చున్నాను.

భాను—మీ కటువంటి కోరిక యున్నపక్షమున, మాసుఖ మున కడ్డమువచ్చువారు మఱియెవ్వరును లేరు.

వసు—ఓ కామపాలా! ఇఁక మనము ప్రతిపక్షులము కాము. ఇప్పుడు మన మిద్దఱమును మిత్రుల మగుదము.

కామ—అవశ్యకముగా నగుదము.

వసు—ప్రతిపక్షి విషయ మయి యింత దయ గలిగి నావలె నీలాగున శ్రమపడువాఁ డెక్కడనో యొకానొకఁ డుండును గాని యందఱు నట్టివారు కారు సుమా.

కామ—అందుకుసందేహ మేమి? అటువంటి వాఁడీభరతఖండ మునందు నీవొక్కఁడవుతప్ప మఱియెవ్వఁడు నుండు నని నేనునమ్మను.

వసు—మంచిది. ఆసుందరియెడల నీకుఁగల సంబంధమంతయు వదలివేసెదవు గదా?

కామ—నిశ్చయముగా వదలియే వేసినాను.

వసు—అక్కడ నీకింకను కొంచె మాశ విడువక బాధించు చున్న దేమోయని నాకు శంక కలుగుచున్నది.

కామ—నీతోడు! లేదు. ఆయాశ నేను బొత్తిగా వదలు కొన్నాను.

వసు—ఆమె ధనముమీఁది యాశ యని నాయభిప్రాయము.

కామ—నా కదియు లేదు. ఆమె కున్నది సర్వమును నీవు యథేచ్ఛముగా పుచ్చుకోవచ్చును.

వసు—ఈబేరములో నీకేలాభమున్నది. అక్కడ కొంచెము ధననష్టము కలిగినను నీకిక్కడ ధనమున కిరువదిరెట్లెక్కువ సౌందర్యలాభము దొరకినది. ఓసుందరీ! ఇప్పుడు నీకొక్క రహస్యము చెప్పెదను. నే నీ సాయంకాలము లోపలనే భానుమతి నెత్తుకొని వత్తును సుమా!

భాను—అలాగుననా?

వసు—అవును. తండ్రిచేతిమీఁదుగా తాను భర్తను గ్రహింపనని యామె యొట్టు పెట్టుకొన్నది. ఆమెతోఁ గలిసి నన్నుద్యానవనములో సంచారము చేయనిచ్చుటకు తండ్రి నొడంబఱచి తాళము చెవి తెచ్చినాను. అక్కడనుండియే మే మిద్దఱమును ముసలివాని కన్నులు కప్పి మెల్లగా తప్పించుకొని జాఱఁ దలఁచుకొన్నాము.

భాను—సుదర్శనవర్మ కీసంగతి తెలియనే తెలియనియ్యరా?

వసు—ఎంతమాత్రము తెలియనియ్యము. మా మెలఁకువయంతయు నిందులోనే యున్నది. ఈ యుపాయముచేత నే నతని నెట్లు మోసము చేయుచున్నానో నా చమత్కారము కనిపెట్టినావా? ఓలి యొక్క చిల్లిగవ్వయు నియ్యనక్కఱలేకుండ నే నా ముద్దరాలి ధనమంతయు దక్కించుకొనుచున్నాను. నామంత్రాంగశక్తి యిప్పుడు నీకు స్పష్టమయినదిగదా? నావద్ద నింద్రజాల మహేంద్రజాలము లున్నవి.

కామ—అహహహా! నీవెక్కడ? మటుమాయలమారివి. మాయలయందు నీ వాశంబరాసురుని చంపి పుట్టినావు.

వసు—ఒకవేళ నీ విది మోసమందువేమో! అందునైనను నా తెలివికి మెచ్చుకొన్నావా? నేను శంబరాదులను మించిన మోసగాఁడను.

కామ—నీ వెంతవాఁడ వయిన నగుదువు. నీ వఖండ ప్రజ్ఞావంతుఁడవు.

వసు—నిజము తెలిసినతరువాత సుదర్శనవర్మ యింటివద్ద కడుపు లుబ్బ నవ్వుటకు మన కెంత వినోదమయినను కలుగును.

భాను—కావలసినంతవినోదము కలుగు నని నేను వ్రాసి యియ్యఁగలను. నిజము వెల్లడి యయినప్పుడు మాకు పట్టరాని సంతోషము కలుగును. అహాహా!

[అప్పుడు చంద్రకేతుఁడు మరల ప్రవేశించుచున్నాఁడు.]

చంద్ర—ఓవసుకామా! భానుమతి వేడుకనిమిత్త మయి నీవు పాడింపఁ దలఁచుకొన్న వీణెపాటకులు వచ్చి వాకిట నిలిచి యున్నారు.

వసు—వారిపని యిప్పుడు లేదు. ఆపాటకులకు నేను కొంచెము సొమ్మియ్యవలసి యున్నది గనుక వారిని తీసికొనిపోయి నేను సమాధానపఱిచి వచ్చెదను. నన్ను క్షమించెదరా?

భాను—అవశ్యకముగా పోయి రావచ్చును.

వసు—నామిత్రుఁడు మీయొద్ద నుండును. మీరితనిచేత కావలసినపని చేయించుకోవచ్చును. ఓ సోదరీ! నీకు నేను పరమ విధేయుఁడను. ఓ కామపాలా! మీరు సుఖు లయి యుందురుగాక! (తనలో) ఈకామపాలుఁ డమాయకుఁ డయిన బుద్ధిహీనుఁడు. ఇతనిని నాచేతిలో తోలుబొమ్మ నాడించిన ట్లాడించుచున్నాను. నేను దివ్య [illegible]

భాను—ఓ చంద్రకేతూ! నీవు మరల నాకు మార్గదర్శివయి కారాగారమునకు నన్నుఁ గొనిపోయి విడిచి వచ్చితివా?

కామ—ఓప్రియురాలా! నీ వక్కడ కేలపోవలెను?

భాను—దానికి వేఱే కారణమున్నది. నీవు నావెంట వచ్చు చుండఁగా మనల నెవ్వరును జూడఁగూడదు. అక్కడినుండి నేను మాతండ్రి కొక లేఖ వ్రాసెదను. ఏకారణముచేత నే నిల్లువిడిచిరావ లసివచ్చినదో వివరపఱిచినపక్షమున, అతనిమన సొక వేళ కరఁగ వచ్చును.

కామ—హా కాయాశ లేశమును లేదు. ఓ హృదయేశ్వరీ! ఇఁక నీవొక్క యీబాహువులనే శరణము చేసికోవలెను.

భాను—తాళిమివహించి కొంచెము నేపోర్చుకొని యుండుము. అక్కడినుండి నాతండ్రి నన్ను బలవంతముగా తీసికొని పోలేఁడు. కొంత ప్రొద్దుండఁగానే నీ వక్కడకువచ్చి నన్ను కలిసికొమ్ము. నీ కప్పుడు సమస్తమును తెలుపుదు చేసెదను.

కామ—నీవు చెప్పినట్లు చేసెదను.

భాను—మిత్రుఁడా! రమ్ము. ఓ కామపాలా! ఈచంద్రకేతుఁ డును నీవలెనే పూర్వ మొకసారి కాముకుఁడయి యున్నవాఁడే సుమా.

కామ—అట్లయినపక్షమున మనమీతనియుంచుంచినవిశ్వాస కారణ మింతనికి చక్కగా తెలియును.

చంద్ర—నే నెప్పుడును మీయెడల విశ్వాసఘాతుకుఁడ కానోను.

సీ. చిత్తము నొకసారి చిత్తంబులోపల
నతిథిగాయై మున్నన లంది యుండి

యేఁగినపిమ్మట నెడలోవ నెప్పుడుఁ
గామార్తునెడ జాలి కదలకుండు
యాత్రాపరాయణులైన మహాత్ములు
తాము వసించిన తావులెల్లఁ
బావనంబులు చేయుపగిదిని గాముండు
నొకసారి మున్ను తా నుండినట్టి
స్వాంతములనెల్లఁ బరిశుద్ధ పఱిచివైచి
వెనుకఁ దనచిహ్నముగాఁగ విడిచిపోవు
స్థిరముగా నాత్మలోఁ గనికరము కరము
తన్ను మఱచిపోయిన యనంతరము కూడ.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## తృతీయాంకము



౧. రంగము—సుదర్శనవర్మగృహములోని పుస్తకనిలయము.

[సుదర్శనవర్మయు సేవకుఁడును ప్రవేశించుచున్నారు.]

సుద—నేను పుట్టి బుద్ధి యెఱిఁగినతరువాత నాకిటువంటి యద్భుత మెప్పుడును కలుగలేదు. ఏమీ యీవింత. భానుమతియే వసుదాముని తీసికొని లేచిపోయినదిగా! నేను వివాహము చేయఁ దలఁచుకొన్న పురుషునితోనే దొంగతనముగా పాఱిపోయినదా! తన భర్తనే తగులుకొని పోయినదా! ఇట్లు జరగియుండదు.

సేవ—మీరు వీధిలోనికి వెళ్ళఁబోవునప్పుడు వారుద్యానవనములో తిరుగుటకు మీవద్ద సెలవు పొందినారని యామె పరిచారిక చెప్పినది. నేను పోయి చూచునప్పటికి పూలతోఁటలోనిలతా

గృహముతలుపు తీయఁబడి యున్నది; అప్పటినుండియు వారిజా యెక్కడను తెలియరాలేదు.

సుద—సరే. నాకిదియేమో మాయగా నున్నది. ఏమి ని యించుటకును వీలు కనఁబడదు. ఇందులో నాకు తెలిసికో శక్యమ కాని పిశాచప్రేరణ యేదో యున్నది.

[మఱియొక సేవకుఁడు లేఖపట్టుకొని ప్రవేశించు చున్నాఁడు.]

సేవ—ఇదిగో మీకు వసుకాముని యొద్దనుండి కమ్మవచ్చినది.

(అని నిష్క్రమించుచున్నాఁడు

సుద—ఇప్పుడీ లేఖవల్ల నిజము తేటపడవచ్చును. ఓ వస కామా! నీ వెంతటి వాఁడవురా! ఇందులో నే మున్నదో చది చూతము. (అని చదువుచున్నాఁడు.

"ఆర్యోత్తమా! నేను నీ కొమార్తెను తీసికొని పాఱిపోవు మీ కత్యాశ్చర్యకరముగా నుండును."—సందేహము లేదు. ఇ నిశ్చయముగా వీనిపనియే. నాకాశ్చర్యముగానే యున్నది.—"మా ప్రథమ సందర్శన సమయమునందే నే నామె హృదయమును న వశము చేసికొన్నాను."—ఓరి రాక్షసుఁడా! నీవశము చేసికొన్నావు "మందభాగ్యముచేత మీ చేతిమీఁదుగా తాను భర్తను పొంద న యామె ఘోరప్రమాణము చేసికొన్నందున, నే నామె పిచ్చికోరికన చెల్లింపవలసి వచ్చినది"—అలాగుననా? అలాగుననా?—"మేము శీఘ్రముగానే వచ్చి మీ పాదములమీఁద పడఁబోవు చున్నాము ఈ యవివేక కార్యమును మనసులో పెట్టుకోక మీ రల్లుని నాశీర దింప సంసిద్ధు లయి, యుందురని నమ్ముచున్నాను.

ఇట్లు విన్నవించు మీ విధేయ సేవకుఁడు

వసుకాముఁడు,"

ఇది యెంతపిచ్చి యాలోచన! ఆసమయమునందు నాకోమా ర్తెనదో పిశాచ మావహించి యుండి యిట్లు చేయించి యుండును. ఈప్రాతఃకాలము వఱకును ప్రాణము పోయినను తా నాతనిని వివాహము చేసికో ననుచుండినది! అప్పుడే సాయంకాల మయినను కాక మునుపే యతనితోనే పాఱిపోయినది! పోనిమ్ము. వారియుద్దేశ మెట్టిదయినను జరగవలసినది నాయిష్టమే జరిగినది. ఇఁక తక్కిన విషయములలో వసుకాముఁడు నాయొడంబడిన ప్రకారమే నడుచుకొనునని నమ్మెదను.

[సేవకుఁ డొకలేఖ పట్టుకొని మరల ప్రవేశించుచున్నాఁడు]

సేవ—ఈకమ్మ మీకోమార్తె యైనభానుమతి మీకిమ్మని పంపిన దని యెవ్వఁడో తెచ్చినాఁడు. (అనిచేతికిచ్చి పోవుచున్నాఁడు)

సుద—(పుచ్చుకొని) ఏమీ! ఈవ్రాఁత నేనెఱుఁగుదును. ఇది నాకూఁతురు వ్రాసినదే. ఇద్దఱును వేఱువేఱుగా జాబులు వ్రాయవలసిన పనిలేదే! అయినను భానుమతి యేమి చెప్పెనో చూతము. (అని చదువు చున్నాఁడు)

"ఓ ప్రియజనకుఁడా! నే నవివేకినయి యింతసాహస కార్యము చేసి యిప్పుడు నిన్నెట్లు క్షమింప వేఁడుకోఁగలను? ఈయుద్దేశముతో పాఱిపోతినని నే నేనోరు పెట్టుకొని చెప్పఁగలను?"—ఇంతే కద? ఆయుద్దేశమేమో యిప్పుడు వసుకాముఁడు చెప్పనే చెప్పినాఁడు. ఈలేఖను వ్రాసినప్పుడు వారిద్దఱు నొక్కచోట లేరనుకొనెదను—"నిరాదరము కలిగినప్పుడు నాహృదయ మెంత యాగ్రహపరవశమగునో, సదాదరము కలిగినప్పు డంత దయార్ద్రమగునని మీకు విశద మయియే యున్నది"—సరిసరి! ఇప్పుడు గుట్టంతయు బయలికి వచ్చుచున్నది. కామపాలుఁ డనాదరము చేయఁగా వసుకాముఁడు

చేసినయాదరమునుబట్టి దానికతనియందు దయపుట్టినది. అప్పనప్పను. ఇప్పటి కంతయు స్పష్ట మయినది. అపయిని—"నన్ను దేవతనుగా భావించి పూజించెడు నామనోహరుఁడే నాకుభర్తకాఁబోవుచున్నను, నే నింకను వివాహము చేసికోలేదు"—అప్పనప్పను. వసుకాముని కి భానుమతి పంచప్రాణములలో నొకప్రాణము.—"ఇప్పుడుమీయంగీకారమును పొందునంతటిభాగ్యము నాకు పట్టినయెడల, నేను సంపూర్ణసుఖవంతురాల నగుదు నన్ననమ్మకముతో ప్రతిక్షణమును మీ ప్రత్యుత్తరమున కెదురుచూచుచుండు

మీప్రియపుత్రిక—భానుమతి"

నాయంగీకారము కావలెనా? నిశ్చయముగా నీవివాహమునకు నే నంగీకరించెదను. నాకింతకంటె సంతోషము మఱి యెప్పుడును గలుగదు. నేను వెంటనే నాయనుమతి తెలుపవలెను. మూర్ఖపుపట్టు పట్టుట యెప్పుడును మంచిది కాదు. ఓరీ! దారకా!

సేవ—(ప్రవేశించి) అయ్యా! ఏమిసెలవు?

సుద—ఈరెండవలేఖ తెచ్చినవాని నుండుమని, మొదటివానితో మంచిది పొమ్మన్నానని చెప్పు. నీవు లోపలికిఁబోయి కాగితమును కలమును సిరాబుడ్డియు తీసికొని రా.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సుద—పాపము! ఉయ్యాలనవలె కొట్టుకొనుచుండు భానుమతీ మనస్సిప్పుడు శాంతిపడుతునా యని నాకత్యాతురముగా నున్నది. ఓరీ! దారకా! ఓఘటకా! (అని పిలుచుచున్నాఁడు)

[ఇద్దఱు సేవకులు ప్రవేశించుచున్నారు]

సుద—ఈరాత్రి బంధువుల కందఱకును మనయింట విందు గనుక, పిండివంటలతో వంట కావలెనని లోపలికిపోయి చెప్పు.

వంటలవారిని వేగిరము పిలిపించుమను. మంచికూరలు చేయించవలెను. సంగీతము పాడుటకయి పాటకులకు వర్తమానము పంపు. తిన్నఁగా విన్నారా ?

సేవ—చిత్తము. విన్నాము.

సుద—ఈరాత్రి యెవ్వరు వచ్చినను మనయింట భోజనములేకుండఁ బోవలదు.

సేవ—(నిష్క్రమించుచున్నారు.)

సుద—ఈరాత్రి వేడుకకు విలువలేకుండఁ జేయవలెను. ఈ రాత్రి నాచర్యచేత ముసలివాఁడుకూడ వేడుకసమయమం దెంత యుత్సాహముతో నుండఁగలఁడో యందఱికిని తెలియునట్టుచేసెదను.

ద్విపద. పగ లెల్ల సరసంపుఁబలుకులఁ గడపి
తెగువమై రాత్రులు తిని త్రాగి త్రుళ్ళి
కలుములఁ దులఁదూఁగి కష్టము ల్లేక
యెలఁబ్రాయమునఁ దొల్లి యేనున్నయపుడు
వ్యసనమన్ పేరైన నాలించి యెఱుఁగ;
నిసుమంత యున్న నాయీాడె పోఁద్రోలు;
మిగిలి యింకనున్న మృష్టాన్నభుక్తి
యెగమీాటు నద్దాని నించుకలోన,
తుద కిప్పు డింత నాదోశ్శక్తి తగ్గి
ముదిమి పైకొని నన్ను మోసంబుచేసె;
తలవెంట్రుకలు కొన్ని తలపైని నిలచె;
నిలిచిన కొన్నియు నెఱసి పీచయ్యె;
వసుధ సుదర్శనవర్మ కట్లయిన,
నిసుమంత యుత్సాహమేనియుఁ బోదు;

వయసు వచ్చినఁగాని వడి యించుకంత
యయినను జావలే దది నిశ్చయంబు.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

---

౨ రంగము—వీధిలో వినోదవాటిక.



[విజయవర్మయు దామోదరుఁడును ప్రవేశించుచున్నారు.]

విజ—ఏమి! నీవింతమాత్ర మామెజాడ తీయలేక పోయి నావుగదా! ఆమె యెక్కడకు పోయియుండునో నీ వూహ యైనను చేయలేవు. ఓ సుదంతా! ఓ సుదంతా!

దామో—నా కామెజాడ యెంతమాత్రమును తెలిసినది కాదు. ఆమె తండ్రియొద్దనుండి పాఱిపోయినదని మాత్ర మెక్కడఁ జూచినను గుంపులుకూడి చెప్పుకొనుచున్నారు. మాధవసేనుఁడామెను వెదకి పట్టుకొనవలె నని బయలుదేఱినాఁ డన్న మాటకూడ నందఱి నోళ్ళలో నున్నది. ఆమె యెక్కడకు పోయినదో యేమాయినదో మాత్ర మెవ్వరును జెప్పలేరు.

విజ—ఓ తెలివిమాలిన మొద్దా! నీమాటలకు నాకు కోపము వచ్చుచున్నది; ఆమె యీ యుజ్జయినీనగరము దాఁటి యెక్కడకును పోయి యుండదు.

దామో—నేనును నాలో నాలాగుననే యనుకొన్నాను. ఉజ్జయినీనగరము త్యజించి పోలే దని నాకును తెలియును. తెలిసిన నేమిప్రయోజనము? కొందఱామె కామవేదనచేత చచ్చిపోవుచున్న దన్నారు; మఱికొందఱామెను కాముపాలుఁ డెత్తుకొని పోయినాఁ డన్నారు.

విజ—ఓ పశువా! ఇది కేవలము నీకల్పన ఆమాట యెవ్వరు ననలేదు.

దామో—అట్లయిన పశువులవారిమాట నేనే పొరపాటుగా గ్రహించినాను కాఁబోలును!

విజ—పో. ఓ బుద్ధిహీనుఁడా! ఇంటికి పో. ఆమె సమాచారము తీసికొని వచ్చువఱకును నీవుమరల నాకు మొగముచూపవలదు.

దామో—మంచిది. (అని నిష్క్రమించుచున్నాఁడు)

విజ—ఓహో! కృతఘ్నురాలయిన యామెయందుఁ గల మోహముచేత నామన స్సెంత చెడిపోయినది!

[అప్పుడు వసుకాముఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసు—ఆమెను సురక్షితమైనచోటనుంచి వచ్చినాను. ఇఁకను వివాహము చేయించుటకొక్కపురోహితుని మాత్రము సంపాదించుకోవలెను. కామపాలుఁడిఁక సుదంతను వివాహము చేసికొన్నను సరే, చేసికొనకపోయినను సరే.

విజ—వసుకామా! నీవిప్పుడు సుదంతనుగూర్చియన్న దేమి?

వసు—ఓ విజయవర్మా! బావా! ఇక్కడ నీవు నా కలభ్య యోగముగా తటస్థించినావు!

విజ—ముందు సుదంతసంగతి చెప్పు.

వసు—సుదంతసంగతి కావలెనా? చెప్పెద వినుము. నేఁటి యుదయకాలమున నేనుమీయింటికి వచ్చుచుండఁగా నాకొకసుందరి యెదురుపడి తనపేరు సుదంత యనిచెప్పి నన్ను శరణు వేఁడినది.

విజ—ఏమని?

వసు—ఉజ్జయినీనగరమునందున్న యొక పడుచువానిమీఁది వలపుచేత తనతండ్రియింటినుండి లేచివచ్చినానని చెప్పినది.

విజ—ఓ యీశ్వరా! ఆసంగతి యామె యొప్పుకొన్నదా?

వసు—స్పష్టముగా నొప్పుకొన్నది. తానుపాఱిపోయి వచ్చు సంగతి తనప్రియునకు తెలియఁజేయ లేదనియు, తనకట్టియుద్దేశమున్నట్టయినను తనప్రియునకు తెలియదనియు కూడ చెప్పినది.

విజ—(తనలో) ఆమాట సత్యము. ఓప్రియురాలా! ఈ సంగతి యొక్కటియు నాకు నిజముగానే తెలియదుసుమా. ఓహో! నే నదృష్టవంతుఁడను. (ప్రకాశముగా) వసు కామా! అటుతరువాత—

వసు—అటుతరువాత తనప్రియుని వెదకి కనుఁగొని తన్నాతని యొద్దకుఁ గొనిపొమ్మని నన్ను బతిమాలుకొన్నది.

విజ—ఓయీశ్వరా! ఏమిభాగ్యము! అట్టయిన మనమిప్పుడు పోదము రా. ఇఁక నొక్కనిమిషమైనను నీవాలస్యము చేయఁగూడదు. (అని యతనిని లాగుచున్నాఁడు)

వసు—ఆగు. మన మిప్పు డెక్కడకు పోదము?

విజ—ఏమి? అటుతరువాత మఱి యేమైనజరిగినదా?

వసు—జరిగినది. ఆమెదీనాలాపములచేత నామనను కరఁగి నే నామెప్రార్థన చెల్లించినాను.

విజ—మంచిది. ఇప్పు డామె యెక్కడ నున్నది?

వసు—ఎక్కడ నున్నదా? ఆమెను సురక్షితముగా ప్రియుని చేతులలో నప్పగించి వచ్చి యామెప్రార్థన చెల్లించినానని నేను నీ కిప్పుడు చెప్పలేదా?

విజ—నాకు చావుగా నున్నది. నీ వూరక కాలహరణము చేయుచున్నావు. తరువాత నా కామె కనఁబడనేలేదు.

వసు—అవును కనఁబడలేదు, ఆమె నీకేలాగున కనఁబడును?

ఆమె కామపాలునినే కోరినది; నేనామెను కామపాలునికే యొప్పగించినాను.

విజ—(తనలో) అయ్యో! నేను చెడినాను. నామతి పోవుచున్నది. (ప్రకాశముగా) కామపాలుఁడా ? ఏకామపాలుఁడు ? విపణివీధినుండు కామపాలుఁడా ?

వసు—అవును, ఆకామపాలుఁడే. ఇందులో మఱియొక చమత్కార మున్నది. అతఁ డామెను స్వీకరించుట కొకపట్టున మొట్టమొదట నొప్పుకోలేదు. తనప్రియమిత్రుని మోసము చేయఁగూడదనియు, న్యాయము కాదనియు, మనసొప్పదనియు, అతఁడు బహుదూరము నీతులు చెప్పినాఁడు. కాని మేమాశంకల కన్నిటికిని పరిహారములు చెప్పి మెడలు విఱిచి తుదకతనిని సమాధానపఱిచినాము.

విజ—ఇంతపని మీరే చేసినారా?

వసు—నిస్సందేహముగా మేమే చేసినాము. అతఁడు మోసము కూడ దన్నాఁడు. ఆమె కామవిషయములో మోసము తప్పు కాదన్నది. అతఁడు తనప్రియమిత్రుఁ డన్నాఁడు; నేనాప్రియమిత్రుని తుంగలో నూరఁద్రొక్కు మన్నాను. పాపము! తుద కతఁడు విధిలేక యొప్పుకొన్నాఁడు. ఇష్ట మున్నయెడల నిఁక నాతనిని తనన్యాయము నిమిత్తమయి యురి పెట్టుకొని చావు మను.

విజ—(తనలో) ఇఁక నేనిక్కడనుండిపోవలెను. పోనియెడల నాగుట్టు బయలఁబడిపోవును. (అని పోవు చున్నాఁడు.)

వసు—విజయవర్మా! నిమిషము నిలువుము. ఇందులో నున్న చమత్కారము నీవు కడవఱకును విననేలేదు.

విజ—నీచమత్కారము తీసికొనిపోయి పాతిపెట్టు.

వసు—ఓహోహో! నీకు నిష్కారణముగా కోపము వచ్చుచున్నది. నేను నీకు కావలసినంతవినోదము కలిగించుచున్నా ననుకొనుచున్నానే.

విజ—వినోదము కాదు. వేదన కలిగించుచున్నావు.

వసు—ఆ మోసపోయిననిర్భాగ్యనాయకుఁడవు నీవు కావు గదా? నీవే యయినట్టున్నావు. అవునవును. సందేహము లేదు నీవే. ఇది యిప్పుడు నేను చెప్పెడుదానికంటెను మంచివినోదము. ఆహాహా!

విజ—ఓరిపాపిష్ఠుఁడా! పరమచండాలుఁడా! ఏమీ! నన్ను చూచి నవ్వుచున్నావా? (అని మెడ పట్టుకొని) నీవంటి యధముని మీఁద కోపము చూపుట నాకే గౌరవహానికాని, లేకపోయినయెడల నీకుండె లిపుడు బద్దలుచేయుదును. (అని త్రోయుచున్నాఁడు.)

వసు—రక్షించురక్షించు. బావగారికిచూపవలసిన గౌరవమా యిది?

విజ—ఓరి శుంఠా! విను. ఆద్రోహులు లెక్కడకు పోయినారో తిన్నగా చెప్పు. చెప్పకపోతివా చూడు నా—

(అని కత్తి యొఱలోనుండి దూయు చున్నాఁడు.)

వసు—ఓబావా! ఓకరుణామయా! క్షమించు క్షమించు. కోపము శాంతిపఱుచుకో. నేను జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నాను. మనుష్యుల ధారణశక్తిలో తారతమ్యము లున్నవి. కావలసినది కొందఱికి సమయమునకు స్మరణము రాదు; నాదివట్టిపిఱికిమతి. ఎదుటనీకత్తిని జూచి వెనుకకు పాఱిపోవుచున్నది. నీతో పోరాడ శక్తి యెంత యున్నదో జ్ఞాపకశక్తియు నాకిప్పు డంతే యున్నది.

విజ—భయములేదు నిజముచెప్పు. నీకు నేను హానిచేయను.

వసు—బావా! నీవు నాకెప్పుడును హాని చేయవుకాని నీ చేతిలోని యాభయంకరమైన—

విజ—ఏమీ? నీవు నిజము చెప్పునట్లు లేదు.

వసు—చెప్పుచున్నాను. చెప్పుచున్నాను. నీకు సమస్తమును చెప్పెదను. వినునప్పుడు నీకు చేతిలో కత్తి యేల తోడుకావలెను!

విజ—ఇదిగో కత్తి క్రింద పడవేయుచున్నాను. (పడవేసి) ఇప్పుడు చెప్పు.

వసు—వారు-వారు-అక్కడకు-కాదు కాదు-నా మిత్రుఁడైన చంద్రకేతుఁడు సుదంతను-ఓ విజయవర్మా! నీచేతులు దూరముగా పెట్టు-శారదామఠమువద్ద విడిచి వచ్చినానని చెప్పినాఁడు.

విజ—శారదామఠములోనా?

వసు—అవును. అక్కడనే కామపాలుఁడు నేఁ డామెనుగలిసి కొనఁబోవుచున్నాఁడు.

విజ—నీవు చెప్పినది సత్యమేకద?

వసు—ఈశ్వరం సాక్షి! సంపూర్ణసత్యము. ఈ విషయములో నే నెఱిఁగిన దింతే.

విజ—ఓరి పిఱికిపందా! ఇఁక నీవు బ్రతికిపోయినావు. ఈ కోపము నిఁక మిత్రద్రోహి యైనయా కామపాలునిమీఁదఁజూపెదను.

వసు—నీకోప మంతయుఁ జూపుము. అతనిని జంపుము. తల నఱికి వేయుము. నాకది పరమసంతోషము.

విజ—ఇఁక సుదంత నేమి చేతును? ఆమె దయనీయురాలు. ఆమెకీవఱకువచ్చినయపకీర్తియేచాలును. ఆమె నాపగకర్హురాలుకాదు

వసు—బావా! అర్హురాలు కాదు. ఆమె విషయములో నాకును కోపములేదు. ఆమె నాపగకును నర్హురాలు కాదు.

విజ—నీమాట సత్యము కాదు. నీ వసంగా నెంతవాఁడవు! ఆమె రాజాధిరాజుల స్పర్థకైన నర్హురాలే.

వసు—అవు నవును. నీమాట సత్యము. ఆమె యర్హురాలే. అంతటి యోగ్యురాలిని పోఁగొట్టుకొన్న నీ దుస్థితికి జాలిపడుచున్నాను.

విజ—ఓరి పాషండుఁడా! నాస్థితికి జాలిపడుచున్నానని చెప్ప సాహసించుచున్నావుగా! నన్నుఁజూచి జాలిపడుటకు నీ వేపాటి వాఁడవు!

వసు—ఓ బావా! క్షమింపుము. నే నెంతమాత్రమును జాలి పడలేదు. నామాట నమ్ము.

విజ—నీకు రెండునాలుక లున్నవి. ఓ జడుఁడా! పో పో. నాయెదుటనుండి లేచి పో. ఇంక నవ్యక్తప్రలాపములు ప్రేలి నాకు మఱింత కోపము తెప్పించకు. నీ యనామకత్వమే నిన్ను రక్షించి నది. పో.

వసు—(తనలో) అట్లయిన నా యనామకత్వమే నాకుముఖ్య బంధువు. (ప్రకాశముగా) ఓ విజయవర్మా! పోవుచున్నాను. (తనలో) ఇతఁ డెంత నిర్దయుఁడైన చండకోపనుఁడు!

(ఇద్దఱును వేఱు వేఱుగా నిష్క్రమించుచున్నారు)

3. రంగము—శారదామఠములోని తోఁట.

[భానుమతియు, సుదంతయు ప్రవేశించుచున్నారు]

భాను—నా యన్నగారికి నీవు కనఁబడ కుండవలెనని నిజము గానే నీమనసులో నున్నదా?

సుదం—ఉండకపోయినయెడల, నేనీ క్రొత్తవేషమెందుకు వేసికొందును?

భాను—ఈ నిమిషములో నొకవేళ నీ కీవేషమునిండఁత మక్కువ యుండి యుండవచ్చును. నీవెల్లకాలమును యోగినివై యుండుటకు మాత్రి మభిలషింప వనుకొనెదను.

సుదం—రాత్రి విజయవర్మ నిశ్చయముగా నా కంతకోపము తెప్పించియుండని యెడల—

భాను—నిన్ను పోఁగొట్టుకొందు వన్న భయముచేత తొందర పడి యతఁ డాసాహసము చేసెనేగాని మఱియొకటి కాదు.

సుదం—నీవు నన్ను క్రూరురా లనుకొందువు. అతఁ డిపుడి క్కడ నున్నయెడల, నే నతనిని క్షమించి యుందునని ప్రమాణము చేయఁగలను.

ద్విపద. మనప్రియుల్ తప్పులు మనయెడఁ జేయ,
మనకోప మెంతలో మాయమై యడఁగు!
ఒకదిన మెడగల్గ నున్నను దీఱు;
మొకము చూచినయంత మగిసి చల్లాఱు
గతరాత్రి నీ యన్నగా రటువచ్చి
వెతఁబెట్టుటను, వేగ వెడలి పొమ్మంటి;
అతఁడు చేసినయట్టి యపరాధ మరయ
సతికోప మొదవింప శక్తమైనదియె,
కాని యిప్పు డతండు కనఁబడు లేని,
యూన మెంతగ నాదు మది నేచుచున్న
దోఁడరి నో రాతని దూఱకయున్న
[illegible]

భాను—నీవు యోగినితన మెట్లుందునో పరీక్ష చేయుచున్నావు కాఁబోలును!

సుదం—ఈయోగినీవృత్తి నాకర్హతమముగా నుండలేదా?

భాను—పాఱిపోయివచ్చి మాఱువేషము వేసికొనువారికి యోగినీవేష మర్హతమ మైనదే. కాని మతిమాలిన దేవ్వతయో యొకానొకతె తప్ప వివేకము కలిగిన సుందరి యెవతెయు నీవేషము నొక్కరాత్రికంటె నెక్కువకాలము వేసికొన వాంఛింపదు.

సుదం—నీ ప్రియుఁ డయిన కామపాలుఁ డదె యావైపున నుండి వచ్చుచున్నాఁడు. ఇఁక నే నిక్కడనుండి మీ సల్లాపసౌఖ్యమునకు భంగము కలుగఁ జేయను. భానుమతీ! ప్రియుని మొగము చూచుటకై యెంతసంతోషముతో నీ వావంకఁ దిరుగు చున్నావు?

(అని నిష్క్రమించుచున్నది.)

[కామపాలుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

కామ—ఓ ప్రియురాలా! భానుమతీ! నేను నిన్ను విడిచి పోయినతరువాత విశేషము లేవియు లేవుగదా?

భాను—ఏమియు లేవు. నాతండ్రియొద్దకు త్తరము పట్టుకొని పోయినమనుష్యుఁ డింకను రాలేదు.

కామ—అతనియొద్దనుండి యనుకూలమైన ప్రత్యుత్తరము వచ్చునని యెప్పుడును నే నెదురు చూడలేదు.

భాను—అయినను నేనిప్పు డీప్రయత్నముకూడ చేసిచూచుట వలన తరువాత నన్ను నామనస్సు బాధించకుండఁ జేసికొన్నాను. నీకు నాయెడల నున్నప్రేమనుగూర్చి నా కనుమాన మెంతమాత్రమును లేదు. అయినను బీదతనము మొదటినుండియు తనలో పుట్టి పెరిఁగి యలవాటుపడని నూతనప్రేమను చంపివేయు దుస్స్వభావము

కలది. మనము రామదేవునినే మనగృహదేవతనుగాఁ జేసికొన దలఁచుకొన్నయెడల, అతనిసౌఖ్యమునిమిత్తమయి మనయిల్లు సుఖ ప్రదమయినదిగా చేసికోవలెను.

కామ—

చ. పడఁతిరో! యెన్నిసార్లు మునుపల్కవు నావయికూర్మి పేర్మి నీ
పుడమిని జక్రవర్తి దగుపొందును బాసెద నంచు నాకడన్!
నుడువుల నట్టి నెయ్యమును నూల్కొనఁజూపిన నీ నిమిత్తమై
పుడమిని జక్రవర్తిపదము న్విడనాడుదు నేను నొక్కటన్.
ఉ. బీదల మెట్టులాడు మెదఁ బ్రేమధనం బిటు లింత యుండఁగా!
పైదలి! నీవు ప్రేమమునఁ బట్టపుదేవివి; నే నృపేంద్రుఁడన్;
మేదిని సర్వసౌఖ్యముల మించుచు నెవ్వరు సాటిలేక యు
త్యాదరలీల నిద్దఱము హాయిగనుంచుము సర్వకాలమున్.

[ఉత్తరము చేతఁబట్టుకొని పరిచారిక ప్రవేశించుచున్నది]

భాను—ఈ యుత్తరము నాతండ్రియొద్దనుండి కాఁబోలును!
(అని పుచ్చుకొనుచున్నది)

కామ—ఓ ప్రియురాలా! నామాట నమ్ము. ఈ యుత్తర ములో తిట్లును బెదరింపులును తప్ప మఱియేమియు నుండవు.

భాను—అయినను చదివిచూతము. (చదువుచున్నది)
"నా యత్యంత ప్రియపుత్రికా! నీప్రియుని సుఖునిగాఁ జేయుము; నీ యిష్టప్రకారము వివాహమాడుటకే మనఃపూర్తిగా నేనిప్పుడనుమ తించుచున్నాను. ఈరాత్రి నీప్రియజనకునితోఁ గలిసి భోజనముచేసి యానందించుటకయి మీరు తప్పక మనయింటికి రండు. నిన్నాశీర్వ దించు ప్రియజనకుఁడు—

రామ—భానుమతీ! నీవు నాతో వెక్కసక్కెము లాడుచున్నావు.

భాను—కాదుకాదు. నీవే చదువుకొమ్ము. (అని యుత్తరమిచ్చుచున్నది)

రామ—ఏమి యీభాగ్యము! ఇందులో నీవు చదివినట్లే యున్నచో, నిస్సందేహముగా నీతండ్రి యిందులో నేదో భ్రాంతిపొంది యుండునని కానిమ్ము. మనకిప్పు డావిచారములతో పనిలేదు. ఇంక జాగుచేయుటకు నీ కేమియు పాలు లేదుగదా?

భాను—మనము పోయి మనకృతజ్ఞతను నాతండ్రికి తెలుపవలెనుజుమా!

రామ—ముందుగా మన యొక్క పురోహితుని సంపాదించి నీతండ్రి తాను వ్రాసిన దానిని మరల త్రిప్పుకొన్న ప్రయోజనము లేకుండ జేసికొని తరువాత పోదము. నేను పరుగెత్తుకొనిపోయి యొక యాజకుని యిప్పుడే తీసికొని వచ్చెదను.

భాను—నీవు మరల నన్నుడబాసిన పక్షమున, నీవొకవేళ నన్ను దక్కించుకొనశక్తుడవు కాకపోదువేమో!

రామ—అట్లయిన నీవును నాతో రమ్ము. కేశవస్వామి యాలయపు సమీపమున వసించు యాజకుడు నాకు పరిచితుడు. ఈ మతములలో నుండెడుగుట్టు నీ కిపుడే తెలిసిపోయినదిగదా! ఇంక దేవాలయములలోనుండు పరిశుద్ధతనుగూడ చూతువుగాని రా.

భాను—అది నేను చూడనక్కఱలేదు. మతములోను మైత్రిలోను నయివటన తెవ్వరి కెక్కువ యుండునో వారే యెప్పుడును మిక్కిలి వంచకులుగా నుందురు.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

[సుదంత మరల ప్రవేశించుచున్నది.]

సుదం—పరిశుద్ధమయిన పరస్పరానురాగమువలనఁ గలుగఁ దగిన సుఖమంతయు ననుభవించుచు వారట్లు పోవుచుండఁగా, నే నొంటరికత్తెనయి యిట్లు నిలుచున్నాను. కావలసినవారి నందఱిని విడిచివచ్చిన దుఃఖమున కయినను తాళనిచ్చునుగాని తాను కామించినవారివియోగము మాత్రము వల పెప్పుడును సహింపనియ్యదు. ఓహో! ఆవచ్చెడువా రెవ్వరు! అతఁడు నిశ్చయముగా విజయవర్మ. అతఁ డీలోపలి కెట్లు రాఁ గలిగినాఁడు? కామపాలుని వలెనే యితఁడును కావలివారికి లంచమిచ్చి వచ్చేయుండును. ఆహా! బంగారమునం దెంతయద్భుతమహిమ యున్నది! ఇతఁ డత్యాతురుఁడయి యెంతకలత నొందియున్నాఁడో! ఇతఁ డింకను నన్నిప్పు డెఱుఁగఁ గూడదు. (అని కావిబట్ట ముసుఁగు వేసికొను చున్నది.)

[విజయవర్మ ప్రవేశించు చున్నాఁడు.]

విజ—అవునవును. ఆపోవుచున్నవారు వారే. నాకతఁడు చెప్పినది సత్యమే. (అని పోఁబోవుచున్నాఁడు.)

సుదం—అయ్యా! క్షణకాల మాగుఁడు. మీ రిప్పు డిక్కడికేపనిమీఁద వచ్చినారో చెప్పుడు.

విజ—ఆసంగతి నీకెందుకు ? పోనిమ్ము—ఓహో ! వా రక్కడ నిలిచినారు! (ఆవంకఁ జూచుచు) ఆమె నిశ్చయముగా వంచకురా లయినసుదంతయే.

సుదం—(తనలో) లేనిపోనియనుమానముచేత నితఁడు వెఱ్ఱిభ్రమ పడుచున్నాఁడు. స్వస్థత లేక నానిమిత్తమయి యింతఁ డింత పరితపించు చున్నందుకు సంతోషముగా నున్నది.

విజ—ఆహా. డెంత వేషము మారుచుకొనును. ఆరూపు మొంత

మాత్రమును దాఁగునది కాదు. నావంటి కానుదంతయాకారము స్పష్టముగాఁ గనఁబడుచున్నది.

సుదం—(తనలో) ఇతఁడు చక్కఁగా గుఱుతు పట్టినాఁడు! (ప్రకాశముగా) అయ్యా—

విజ—ఓ యోగినీ! నన్ను మాటాడించకు. నన్నా యాసపెట్టఁబోకు—హాదైవమా! ఆమె యాతనిహస్తమెట్లుపట్టుకొని తన కవలంబము చేసికొనుచున్నది. ఓ కాంతా! కాంతా!

సుదం—అయ్యా! నీకిప్పుడు కావలసిన దెవరు?

విజ—నీవుకాదు నీవుకాదు. నన్నుశ్రమపెట్టఁబోకు. నీవు రానక్కఱలేదు. ఓ యోగినీ! నీయొద్దనుండి యిప్పుడు పోవుచున్నది సుదంత కాదా ?

సుదం—ఇంకను సుదంత యీతోఁట దాఁటి పోనేలేదు.

విజ—అవునవును. నేనూహించినది నిజమే. ఇప్పుడామెతోఁ గూడ గడపవద్ద నిలుచున్నవాఁడు కామపాలుఁడు కాఁడా?

సుదం—అవును. అతఁడు కామపాలుఁడే.

విజ—అతఁడుతప్ప మఱియొకఁడు కాఁడని నేనీవఱకే యనుకొన్నాను. ఓ యోగినీ! ఇంకొక్క ప్రశ్న మాత్రమున్నది. వారిప్పు డేపనిమీఁదఁ బోవుచున్నారో నీవు చెప్పఁగలవా?

సుదం—వివాహమునిమిత్త మనుకొనెదను.

విజ— తెలిసిపోయినది. ఇఁక చాలును. నేనిప్పుడుపోయి వారి వివాహము చెడఁగొట్టకపోతినా— (అని నిష్క్రమించుచున్నాఁడు.)

సుదం—(ముసుఁగుతీసివేసి) అన్యులమీఁద ననుమానమున్నప్పుడు కాముకు లేమో మహానూత్నదృష్టి కలవారుగా నుందురందురే. నా ప్రియుఁడిక్కడ గుడ్డివాఁడగుచున్నాఁడేమి? శుభ్రముగ

నాతో భానుమతి చెప్పినకథ హేతువయి యుండును. విశ్రాంతిలేక నానిమిత్తమయి యితఁ డింతకలఁత పడుచుండుట నాకు పరమానందముగా నున్నది. ఇతఁడు తాను పొందినభ్రమ తెలిసికొని యద్భుతపడునప్పుడు దగ్గఱ నేనుమాత్రి మేల యుండకపోవలెను! ఇతఁ డీదారిని బోవునప్పటికి వెనుక నేపోయి యక్కడ నేనుప్రత్యక్షమయ్యెదను. భానుమతి తోడులేకుండ పెండ్లికూఁతురు కాఁకూడదు.

ద్విపద. అనుతాపశబ్దంబు లనయ మిల్లెడల
వినఁబడుచుండంగ వెలయు మఠంబ!
నీయొద్ద సెల విదె నేఁ బోయి వత్తు
పాయక యెప్డు డీపాడింటనుండి
మ్రొక్కులకును స్తోత్రముల కేడ్పులకును
నొక్కట నలవడ్డ యోగినులార!
సెల వియ్యఁగదరమ్మ చెచ్చెర నాకుఁ
జింతలమఠమును శీఘ్రంబ విడిచి
సంతోషభూమికిఁ జనుచున్నదాన.

(అని నిష్క్రమించుచున్నది)

---

౪. రంగము—దేవాలయము ముందరివీథి.



[వసుకాముఁ డెదురురాఁగా కామపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కామ—ఓహో! నామిత్రుఁడు వసుకాముఁడా!

వసు—ఏమీ! కామపాలా! నన్ను దీవింపుము. నేను భానుమతిని భార్యనుగా తెలిసి నాకు

కామ—తెచ్చినావా! ఆభానుమతియు నీవును చిరకాలసుఖ మనుభవింతురుగాక !

వసు—నావివాహము చేయించుటకు యాజకునినిమిత్తమయి నేనిక్కడకు వచ్చినాను.

కామ—అట్లయినపక్షమున మన మిద్దఱము నొక్కపని మీఁదనే వచ్చినాము. నేనావీధినున్న నారాయణశర్మను పిలుచుకొని పోవలె నని వచ్చినాను.

వసు—నాకందుకు సంతోష మగుచున్నది. అతఁడు నావివాహము ముందుగా జరపవలెను. నాప్రియురా లావల వేచి యున్నది.

కామ—నాప్రియురాలును వేచియున్నది. ఆమెను నేనా వసంతమంటపమువద్ద విడిచి ముందు వచ్చినాను.

వసు—నేనిప్పుడు వేగముగా మరల సుదర్శనవర్మ యింటికి పోవలెను.

కామ—నేనును పోవలెను.

వసు—అట్లయిన యెడల కాలహరణము లేకుండ మన యిద్దఱ వివాహములు నొక్కసారియే చేయించుకొందము. నీకు నేను కన్యాప్రదాతనుగా నుండెదను. నాకు నీవు కన్యాప్రదాత వగుము. పురోహితుని పిలుచుకొనివత్తము రమ్ము. నీ కీవివాహము నాసాహాయ్యము మూలమున నగుచున్నది సుమా.

కామ—అవు నవును. సందేహము లేదు.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

---

౨ రంగము—కేశవస్వామి గర్భాలయము ముందరి మంటపము.



[గండభేరుండాచార్యులును, కంఠీరవాచార్యులును, క్రిందపళ్లెములో ప్రసాద ముంచుకొని చేతులలో గిన్నెలు పట్టుకొని కూరుచుండి ప్రవేశించు చున్నారు.]

కంఠీ—స్వామీ! మీదాసానుదాసునికి పెరుమాళ్ళసేవకు సెలవా?

గండ—ఇఁక నీవు స్వీకరింపవచ్చును.

గీ. వాలుచున్నాఁడు సూర్యుఁడు పశ్చిమమున;
ప్రొద్దు గ్రుంకిన వత్తురు పూజ కోరులు;
వాంఛ తీఱంగ మధు వింత వడిగ మనము
త్రాగవలయును కేశవార్పణముగాఁగ.

(అని త్రాగుచున్నాఁడు.)

కంఠీ—స్వామీ! మీ పెరుమాళ్ళబుడ్డి నావద్దికిఁ బంపుఁడు. ఈ మధ్యాహ్నము స్వామికి భోగము చేయించిన పద్మావతి పేరు చెప్పి యింకొక గిన్నె త్రాగవలెను. ఈరాత్రి పెరుమాళ్ళు మనలో తాండవ మాడవలెను.

(అని చేతిలో గిన్నె త్రాగి రెండవచేయిచాచుచున్నాఁడు.)

గండ—నేను గ్రామాంతరము పోయిన నాలుగుదినముల లోను స్వామివారి కెవ్వరెవ్వ రేమేతిరుకైంకర్యములు చెల్లించినారు?

కంఠీ—మన పట్టణములోని, మధుసూదనదాసుఁడు స్వామికి కంఠాభరణము చేయించుమని నూఱువరహాలు సమర్పించినాఁడు.

గండ—స్వామికిఁ గాదు మన సానికి కంఠాభరణము చేయిం

నుండును. ఇఁక భక్తు లెవ్వరును మ్రొక్కులు చెల్లింపలేదా?

కంఠీ—చెల్లించినారు. మనపట్టణములో లోభియని పేరు పడిన యీ ముసలిగోవిందసేనుఁడు వచ్చినతరువాత తనపేరుస్థిరముగా నుండుట కయి పెరుమాళ్ళసన్నిధానమునందు నందాదీపము పెట్టుమని వెండిదీపస్తంభమును, ఏటేట ధనుర్మాసములో తనపేరుపెట్టి యొకనాఁ డుత్సవము చేయించుమని వేయివరహాలును, అమ్మవారికి పట్టుచీరయు, సమర్పించినాఁడు.

గండ—అతఁడు పరమభాగవతోత్తముఁడు. ఆ వైకుంఠములో స్వామి సన్నిధానమందు నిత్యముక్తులలో చేరియుండును. అతఁ డిచ్చిన సొమ్మెలాగు వినియోగింపవలెనో తరువాత సావకాశముగా నాలోచింతము కాని దీపస్తంభముమాట ముందుగా పరిష్కరింతము. బ్రతికియున్న భూదేవత లుండఁగా దానిని ప్రాణము లేని రాతిదేవతలయొద్ద నుంచఁగూడదు. స్వామివారికి చీకటిలో భయము లేదు. ఆదీపము మన గదిలోనే పెట్టుకొందము. ఆ పట్టుచీర నీవు నీభార్య కిచ్చుకో. ఎవరో తలుపు తట్టుచున్నారు.

[కంఠీరవాచార్యులు తలుపు తీయఁగా సేవకుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

సేవ—ఎవరో వచ్చి గండభేరుండాచార్యులవారిని పిలుచుచున్నారు.

కంఠీ—స్వామీ! మీ కోసర మెవ్వరో వచ్చినారఁట.

గండ—(ఒకచేతిలో మధుపాత్రముతోను రెండవచేతిలో దధ్యోదనకబళముతోను ముందుకువచ్చి) ఓ శుంఠా! పెరుమాళ్ళసేవ చేసి స్వామివారికి నైవేద్యము పెట్టుచుండఁగా నడుమ వచ్చిపూజా భంగము చేసినా వేమిరా?

సేవ—స్వామీ! మీరు మీ పూజ ముగించినా రను కొన్నాను.

కండ—నీవు శుద్ధ బుద్ధస్వరూపుఁడవు. ఇంతకాలమునుండి మావద్ద నున్నను నీకు పూజాకాలమే తెలియదు. మీరు శుద్ధ భక్తి హీనులు. మీకు కడుపే వైకుంఠము. మత్తిల్లి యీ ప్రకారముగా నిహలోక సుఖములలో సదా మునిఁగి తేలుచుండెదరు మీవంటి యుదరపరాయణులకు పరమపదమును గోరి యీప్రకారముగా శరీర శోషణము చేసికొనుచు స్వామిసన్నిధానమునందు నిరంతరము కృశించు చుండు మాబోటి భాగవతశిఖామణుల రహస్యము లెట్లు గోచరము లగును? (అని దధ్యోదనపుముద్ద కొఱుకుచున్నాఁడు.)

సేవ—ఎప్పుడును మాకడుపు పట్టినంతకంటె మే మెక్కువ తినము. స్వాముల కారగింపు కాఁగా మిగిలిన ప్రసాదములో మీ రింత చేతిలో పెట్టినదేకదా మాకు—

కండ—ఓరీశుంఠా! భగవదపచారముకంటె భాగవతాపచార మెక్కువ పాపము సుమా. మీ వంటి పామరులకు పరలోకచింత లేదు. సమయము వచ్చినప్పుడు కేవల ఫలహారము చేసి మావలె నీ వొక్కదిన ముండఁగలవా?— ఓ కంఠీరవాచారీ! పెరుమాళ్ళ నివేదనచేసి మన మిప్పుడు త్రాగుచున్న గుమగుమ పరిమళించుచున్న యీ తిరుపానక మేమయిన గిన్నెలో మిగిలినయెడల నీ వారగింపు చేయుము. (తనచేతిలోని దధ్యోదనమును మ్రింగుచు) ఓరి తిండి పోతా! ఆ వచ్చినవా రెవరో నాకు చూపు. నేను వచ్చెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

౫. రంగము—దేవాలయముఖమంటపము.

—:o:—

[యాజ్ఞికుఁడు నారాయణశర్మయు, వసుకాముఁడును, కామపాలుఁడును ప్రవేశించుచున్నారు.]

వసు—ఆ పాడుగండభేరుండాచార్యుఁ డెంతసేపటికిని కదలి రాకున్నాఁడు! అతఁడు లోపల దేవతార్చన చేయుచున్నాఁడేమో !

కామ—లేదు. అదిగో వచ్చుచున్నాఁడు చూడు.

[గండభేరుండాచార్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

గండ—శ్రీమతే రామానుజాయ నమః

కామ—ఓ యాచార్యవర్యా! నేను నీ యాశీర్వచనముకోరి వచ్చినాను.

వసు—ఓ యాచార్యోత్తమా! నిజముగా నీవలన నొకకార్యముండియే మేము నీయనుగ్రహము కోరి వచ్చినాము.

గండ—మీరు వచ్చినకార్య మేమో చెప్పుఁడు.

వసు—మాకిప్పు డీ దేవాలయములో వివాహము కావలసి యున్నది. మావెంటఁ బురోహితుని దెచ్చుకొన్నాము.

గండ—ఇటువంటి పడుచువాండ్రను మాదేవాలయములో వివాహము చేసికోనియ్యఁగూడదు. మీరు తరువాత మాకేమయినను చిక్కులు తెచ్చిపెట్టుదురు. కాఁబట్టి యిక్కడ వివాహమునకు నే నొప్పుకోను. నాకొక గొప్పయాక్షేపణ యున్నది.

కామ—వసుకామా! ఈయాచార్యుని సమాధానపఱుచుటకు మంచిసాధన మేమయిన నున్నదా?

వసు—తిరుగులేనిదొడ్డిసాధన మొకటి యున్నది. దానిని మించినసాధనము మఱియొకటి లేదు, నీవిప్పుడు రెండువరహాలీతని

చేతిలో పెట్టితివా, దానితో సమస్తాక్షేపణలును నిమిషములో పోవును.

కామ—ఓయాచార్యోత్తమా! మాయందనుగ్రహింపుము.

(అని చేతిలో సొమ్ము పెట్టుచున్నాఁడు.)

గండ—ఈవిషయములో నేను ధన మంగీకరింపవలసినపని కాదు. కాని మీరు నాయోగ్యతను కనిపెట్టి భక్తిపూర్వకముగా దక్షిణ యిచ్చినప్పుడు దానిని నేనుస్వీకరింపకని రాకరించినపక్షమున మీమనస్సులు చిన్నపోవునని గ్రహించు చున్నాను.

కామ—ఇఁక మనము లోపలికి పోవుదము రండు.

వసు—ఓనారాయణశర్మా! ఇంక జాగుచేయక నీవు మా సంతోషములకు కారణభూతుఁడవు కమ్ము.

నారా—మంచిది. ఈవివాహమువలన ముందొకవేళ మీలో నెవ్వరైన పశ్చాత్తాప పడవలసివచ్చెడుపక్షమున మీరప్పుడు నన్ను నిందింపవలసినపని లేదు సుమండీ.

కామ—(తనలో) ఈహితబోధ వాప మీవసు కాముసకు తగియున్నది. (ప్రకాశముగా) ఓ బ్రాహ్మణోత్తమా! నీపని నీవు జరిగింపుము. ఆపయి నేమిసంభవించినను నేనుబద్ధుఁడ నయియుండెదను.

వసు—నేనంతకంటెను బద్ధుఁడ నయి యుండెదను.

[అప్పుడు భానుమతి పరుగెత్తుకొనివచ్చి ప్రవేశించుచున్నది.]

భాను—ఓకామపాలా! విజయవర్మ వసంతమంటపమువద్దకు వచ్చి మన మెక్కడ నున్నామని యక్కడవారి నడుగుచున్నాఁడు.

వసు—ఎవరు? సుదర్శనవర్మకొడుకు విజయవర్మా? అతఁడు నాపే రడుగలేదుగద?

కామ—ఓ ప్రియురాలా! జడియఁబోకుము నే నాతనిని శాంతాత్ముని జేసెదను.

వసు—ఆపని నీచేత కాదు. ఓకామపాలా ! నీవు నామాట విని పాఱిపో. ఆవిజయవర్మ దయాదాక్షిణ్యములు లేనిక్రూరకిరాతుఁడు. అతనివద్దనల్లత్రాఁచువలె నిడుపయినచెడుకత్తి యొక్కటి యున్నది. ఈశ్వరసాక్షికముగా చెప్పుచున్నాను. అతఁడు నిశ్చయముగా దానితో నీగొంతుక కోయనలెనని వచ్చుచున్నాఁడు.

కామ—నా కాభయము లేదు.

వసు—భయము లేకపోయినపక్షమున నీ వుండుము. నేను మఱియొకపురోహితుని సంపాదించి యింకొక దేవాలయములో వివాహము చేయించుకొనెదను. ఈరెండుకాళ్ళలోను శక్తియున్నంత వఱకు నీఁక నే నాతనికంటఁ బడను. (అని పరుగెత్తి పోవుచున్నాఁడు.)

భాను—(మేలిముసుఁగు వేసికొను చున్నది.)

[విజయవర్మ ప్రవేశించుచున్నాఁడు.]

విజ—కష్టపడి చిట్టచివఱకు మిమ్మిక్కడ పట్టుకొన్నాను.

కామ—మంచిది. ఇప్పుడేమనెదవు?

విజ—ఓరి పరమనీచుఁడా! మిత్రద్రోహీ! వంచకుఁడా! నమ్మించి ద్రోహము చేసినపురుషునివంక నింతనిర్భయముగా చూడఁ గలుగుటకు నీకీధైర్య మెక్కడినుండి వచ్చినది రా?

కామ—ఓయీ! నీవు దురాగ్రహగ్రస్తుడవయి యున్నావు. నాప్రాణాధికురా లయినప్రియురాలిని నేనిప్పుడు వివాహము చేసికొనఁబోవుచున్నమాట సత్యమే. కాని యిల్లు బయలుదేఱి రమ్మని నే నామె నెంతమాత్రమును ప్రోత్సాహపఱుపలేదు. నీవలెనే నేనును మోసమన్న ద్వేషించువాఁడనే. దైవముతోడు! ఆమె తనపితృ

గృహము విడిచివచ్చినదని నేనామెను కన్నులార చూచువఱకును నాకు తెలియనే తెలియదు.

విజ—ఇది వట్టిపనికిమాలిన సమాధానము. నీవీవిషయములో తప్పక మిత్రద్రోహముచేసినావు. ఆమె మొండిసాహసికత్వముచూచి యిట్టిద్రోహ మేదో జరిగిన దని మనసులో నేనీవఱకే యనుమాన పడినాను. ఈసంగతి యంతయు నీతాఱ్పకాఁ డయినయాపాపండుఁను నాతో స్పష్టముగా చెప్పినాఁడు. ఇఁక నీవు చేసినపనికి సాకులువెదకిన ప్రయోజనము లేదు. ఈద్రోహము చేయుసాహసించినావు గనుక నీ విప్పుడు నావెంటవచ్చి, చేసినపని చేసితి నని దృఢముగా చెప్పుటకు నీకు ధైర్య మున్నదని కనఁబఱుపుము.

భాను—(జనాంతికముగా) ఓ కామపాలా! నే నిప్పు డీతని భ్రమ కనిపెట్టినాను. ఇతనిని నా కొప్పగింపుము. నే నితనిభ్రమ నివారణము చేసెదను.

నారా—అయ్యా! ఆశపడి వచ్చిన కాముకులయొక్క పొందు చెడఁగొట్టుట నీకు ధర్మము కాదు.

విజ—ఓ పురోహితా! ఇందులో నీవేమియు సంబంధము కలుగఁ జేసికో కూడదు. ఇతఁడు పాణిగ్రహణము చేసికోఁ దలఁచు కొన్న యీ సుందరి నాసొత్తు.

నారా—అట్లయినపక్షమున నేనిఁక వివాహముచేయించను. ఓ సుందరీ! ఇతనిని చేపట్టెద నని నీ వెప్పుడయిన వాగ్దానము చేసి యున్నావా?

భాను—(తల యూఁచుచున్నది.)

విజ—ఓసుదంతా! నీమౌనమునకు నాకు సంతోష మగు చున్నది. నీజిహ్వ యసత్యము పలుకుచుండఁగా వినుటకు నా కిష్టము

లేదు. నిన్ను నేను దూషింప లేదని స్మరించుకొనుటయే నీకు తగిన శిక్ష.

[ముసుఁగు వేసికొని సుదంత ప్రవేశించుచున్నది.]

సుదం—ఏమి యీ హాస్య మిక్కడ !

విజ—కామపాలా! దేవాలయ మగుటచేత నీవిక్కడ నిరపాయుఁడ వయినావు. ఇఁక ముందు మన మొక్కడను కలిసికోక పోము లే. (అని పోఁబోవుచున్నాఁడు.)

సుదం—(అతని చేయి పట్టుకొను చున్నది.)

భాను—(రెండవ చేయి పట్టుకొని) కొంచెము సేపు నీకోపము చల్లార్చుకొని యొక్కసారి కరుణించి యీవంక చూడుము.

సుదం—నిన్ను నిలిపి నీ కోపశాంతి చేయుట కయి నేనును తోడుపడవలెను.

భాను—నీ కత్యంత ప్రేమాస్పదురాల నయిన నన్నానవాలు పట్టలేవా!

సుదం—నా ప్రియుఁడ వయి యుండియు నీవీప్రకారముగా నన్ను విడిచి పాఱిపో వచ్చునా ?

(ఇద్దఱును ముసుఁగులు తీసివేయు చున్నారు.)

విజ—ఇదియేమి ? నా చెల్లెలా ? సుదంతకూడనా ? నాకిక్కడ చిత్తవిభ్రాంతి కలుగు చున్నది.

భాను—ఓ ప్రియసహోదరా! నేను నీ చెల్లెలనే.

నారా—ఏమి యీ ధర్మవిరుద్ధము ! ఇతఁడు తన తోడఁ బుట్టిన దానినే వివాహ మాడఁ దలఁచుకొన్నాఁడా ?

భాను—ఎంత సిగ్గుపాటు! నీవు నీ సోదరినే తెలిసికో లేక

సుదం—నీప్రియురాలినే తఱిమివేయుట యంతకంటెను—

భాను—అనుమానముచేత జనులెంత కన్నుగానని వా రయ్యె దరో నీకు తెలియదా?

సుదం—ఇఁకముందును నీ వీలాగుననే యనుమాన పడు చుండెదవా?

విజ—ఎప్పుడును పడను—ఓ సోదరీ! నీవు క్షమింతు వని నే నెఱుఁగుదును—ఓసుదంతా! నిన్ను నే నెట్లు క్షమింపఁ వేఁడు కొఁగలనో—

సుదం—అక్కఱలేదు. "న న్నాయాస పెట్టఁబోకు" మని యింతకు ముందే నన్ను కసరినావు. "అయ్యా! నీ కిప్పుడు కావలసిన దెవరు?" అని నే నడిగినప్పుడు "నీవు కాదు నీవు కాదు" అని నాకు తెలియఁజెప్పినావు. ఓ కామాంధా! నా విషయ మయి యిఁకముం దెప్పుడును శంక పడనని ప్రమాణము చేసెదుపక్షమున, నిన్ను మన్నించెదను.

విజ—లోకములోని సర్వదేవతల—

సుదం—చాలును. ఇప్పు డెంత దృఢముగా ప్రమాణము చేయ నారంభించినావో ముందు నీ వంతదృఢముగా నే చేసినబాసను చెల్లింపవలెను సుమీ. (అని చేయి పట్టుకొనుచున్నది)

భాను—అన్నయ్యా! నీవు క్షమింపుమని వేఁడుకొవలసినవా రిక్కడ మఱొక్క రున్నారు.

విజ—ఓ కామపాలా! ఈ సంగతి తలఁచుకొనుటకే నాకు సిగ్గగుచున్నది. నన్ను—

కామ—విజయవర్మా! నీవు క్షమార్పణము చేయవలసిన పని లేదు. నేనును కాముకుఁడనే గనుక కాముకుల కోపమునుగణన

చేయురా దన్నమాట యెఱుఁగని వాఁడను గాను. మన మీాబ్రాహ్మణునితో లోపలికిఁ బోయి ముందుగా మన పెండ్లితంతు జరిపించుకొందము రమ్ము. ఈభ్రమకు కారణము తరువాత నీకు సావకాశముగాఁ జెప్పెదను.

ఉ. ప్రేమనటించుచుం బ్రియులు ప్రేలు ప్రలాపము లాలకించి లోఁ
గాముఁడు నవ్వుచుండు; మదిఁ గామునకెవ్వరు నిష్కళంకమా
ప్రేమ వహింతురో యెఱిఁగి వేగ ఫలంబిడు; ప్రేమచేత నే
కాము వివాహమాడి తగుధన్యులకే యిడు దీర్ఘసౌఖ్యముల్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

2 రంగము — సుదర్శనవర్మ గృహములోని సభా మంటపము.



[సుదర్శనవర్మయు, దామోదరుఁడును, సేవకులును, ప్రవేశించుచున్నారు]

సుద — ఈరాత్రి మనయింట నేమియు లోప ముండగూడదు. మన పరిచారకు లందఱును నవ్వుమొగములు గలవా రయి మహోల్లాసముగా నుండవలెను. ఈరాత్రి విందుకు వచ్చువారి నందఱిని మీా రాదరించి సమస్తోపచారములును జరుపవలెను. విన్నారా? పొండి.

సేవకులు — చిత్తము. (నిష్క్రమించు చున్నారు.)

సుద — దామోదరా! నీయజమానుఁ డెక్కడ నున్నాఁడు? అతఁడు సాయంకాలభోజనమున కింటికిఁ రాఁడా యేమి?

దామో — నిశ్చయముగా రానట్టే యున్నాఁడు. అతనికిచిత్త

చాంచల్యము కలిగిన దేమోయని నాకు సందేహముగా నున్నది. అతఁడు నన్నింతకుముందు బెదరించి యింటికి సాగనంపినాఁడు.

సుద—అతఁ డేదో వన్నెలాడివెంబడి తిరుగుచున్నాఁడు కాఁబోలును! పట్టిపడుచునిర్భాగ్యుఁడు. వాఁడు రాఁకపోయినను మన వేడుక కొఱఁతపడఁగూడదు. నీవుపోయి లోపల కావలసినసన్నాహము చేయింపుము.

దామో—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

సేవ—(ప్రవేశించి)అయ్యా! వసుకాముఁడు వచ్చియున్నాఁడు.

సుద—లోపలికి రమ్మను.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[వసుకాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సుద—ఓ క్రొత్తపెండ్లికొడుకా! అల్లుఁడా! మిమ్ము క్షమించినాను. నాయాశీర్వాదము లొందుఁడు. నాప్రియపుత్రిక యెక్కడ? ఏదీ భానుమతి?

వసు—ఆమె వాకిటలో నున్నది. మీయాశీర్వాదము పొందవలెనని యెంతోకుతూహల పడుచున్నదికాని లోపలికి వచ్చుటకు మాత్రము జంకుచున్నది.

సుద—నీవు పరుగెత్తుకొనిపోయి దానిని లోపలికి తీసుకొని రా

వసు—(నిష్క్రమించు చున్నాఁడు.)

సుద—పాపము! నన్నుచూచుటకు మొగముచెల్లక భయపడుచున్నది కాఁబోలును! దానిముద్దుమొగము చూడవలెనని నాకెంతో తొందరగా నున్నది.

వసు—(తెరలో) నాముద్దుగుమ్మా! రమ్ము. నావదఁకు దేవతా! రమ్ము.

[వసుకాముఁడును, రాగమంజరియు ప్రవేశించుచున్నారు.]

సుద—(ఎదుర్కొనుటకయి పరుగెత్తుచున్నాఁడు.)

రాగ—(సుదర్శనవర్మకాళ్ళమీఁద పడుచున్నది.)

సుద—నాకన్నతల్లీ! నాకొక్కసారి నీకౌఁగిలి యిమ్ము. (అని చేతులుచాఁచి యులికిపడి వెనుకకువచ్చి) ఈరాక్షసి నాయింటి కేలవచ్చినది?

సుద—ఓ సుదర్శనవర్మా! మీరు రీమెను క్షమించెద మని యిప్పుడేకదా నమ్మిక యిచ్చినారు? సిగ్గుచేత నాప్రియురా లెట్లు కుంగిపోయినదో చూడుఁడు.

వసు—నిశ్చయముగా కుంగినది. ఇది ముసలి రాగమంజరి. నా కూఁతు రెక్కడ? భానుమతి యెక్కడ?

వసు—ఇదిగో మీకన్నులయెదుర నే యున్నది.— ఓప్రాణే శ్వరీ! సిగ్గుపడఁబోకు.

సుద—ప్రాణేశ్వరీ! నీప్రాణముదీయుటకు దొడ్డప్రాణేశ్వరి దొరకినది. అయ్యో! నీ వీరాగమంజరినే వివాహము చేసికోలేదుగద?

రాగ—(సాష్టాంగపడి) ఓ బాబయ్యా! నన్ను మీబిడ్డనుగా భావించుకొందురని ప్రార్థించెదను.

సుద—బాబయ్యా? బాబయ్యా? నీవద్ద కురూపముకంటెను మొండితనము హెచ్చుగా నున్నట్టున్నదే.

వసు—నామనోహారిణీ! పాదముల మీఁదనుండి లేచి నీ మృదుబాహులతల నీతని కంఠమునందు తగిలించి నీ వీతని బిడ్డవని యొప్పింపుము.

రాగ—అయ్యా! నన్ను క్షమింపుము.

(అని కౌగిలించుకొను చున్నది.)

సుద—ఇక్కడ నరహత్య జరుగుచున్నది. ఓ సేవకులారా! మీయజమానుని రక్షింపుఁడు రక్షింపుఁడు.

[సేవకులు ప్రవేశించుచున్నారు.]

సేవ—అయ్యా! ఇప్పు డుపద్రవ మేమిసంభవించినది?

సుద—ఈపాడు పాపఁడుఁడు నాగొంతుక పిసుకుటకయియీ ముసలితొత్తును తెచ్చి నాకొప్పగించినాఁడు.

వసు—హా! దైవమా! ఈమె యీతని కన్నకూఁతురు. ఈతఁడు కఠినచిత్తుఁ డయి యీమెను క్షమింపకున్నాఁడు.

[కామపాలుఁడు, భానుమతి, ప్రవేశించి సుదర్శనవర్మ పాదములకు మ్రొక్కుచున్నారు.]

సుద—నా దేహము మండుచున్నది. కంప మెత్తుచున్నది నాముందీవేషము లెక్కడివి? ఇక్కడకు నిన్నెవ్వరు రమ్మన్నారు?

కామ—ఈమెభర్తను నేను.

వసు—ఈమాట సత్యమే. ఈతఁడే యీమెభర్తయని నేను నిశ్చయముగా చెప్పఁగలను. ఏ రిద్దఱిని దేవాలయములో పురోహితునివద్ద నేనే యొప్పగించినాను. కన్యాదాతనుకూడ నేనే కావలెననుకొన్నాను.

సుద—నీవే యొప్పగించినావా?

వసు—అవును. నేనే యొప్పగించినాను. ఇతఁడు నా కాప్తుఁడయిన కామపాలుఁడు; ఇతని కాళ్ళకు బందము తగిలించెద నని నే నప్పుడు మీతో మనవిచేసినది యీ చిన్నదాని విషయమే.

సుద—నీకేమి మతిపోయినదా? లేక త్రాగి దేహము తెలియకున్నావా? ఇది నా కూఁతురు.

వసు—కాదుకాదు. ఆ మతిభ్రమయు కల్లుమత్తునుగూడ మీకే కలిగినవి. ఇదిగో మీకోమార్తె యీమె.

సుద—ఓయన్యాయధన్యురాలా! ఇందులో వాస్తవమేమో జరిగినదంతయు నీవు చెప్పు.

రాగ—ఓ సుదర్శనవర్మా! సర్వమును మారూపములే మీ రిప్పుడు చెప్పుచున్నను, నేనును విన్నపము చేసెదను. మీరు మీ కోమార్తెను నన్నును తిన్నగా చూడుఁడు.

వసు—ఏమిపాపము! నా పాడుచెవు లీమెమాటలనే విను చున్నవా?

రాగ—నేఁటియుదయమున మీరు మీకోపవేగములో కొంచెము పొరపాటు చేసినారు. మీరు మీకోమార్తె నావలికి తోసి వేసి మీసేవకురాలిని గదిలోపెట్టి తాళము వేసినారు. దీనిసత్యమిది.

వసు—హాదైవమా! హాదైవమా! ఈబుద్ధిమంతుఁడు ముసలి రాగమంజరికి బదులుగా తనకోమార్తెనే యింటినుండి పంపి వేసినాఁడు!

సుద—హాదైవమా! హాదైవమా! ఈబుద్ధిమంతుఁడు నాకోమార్తెకు బదులుగా ముసలిరాగమంజరినే వివాహము చేసికొన్నాఁడు!—ఇఁక తక్కిన పనియంతయు నెట్లు జరిగినది?

రాగ—నేను మీపుత్రికాప్రతినిధినై యీయేకాంతమునగదిలో కూరుచుండి యిక్కడ నా సరసనున్న యీ ధీమంతుని ప్రేమకు పాత్రురాలనయి యీయనను భర్తనుగా దక్కించుకొను భాగ్యమును పొందితినని తప్ప నేను మరేమియు చెప్పవలసినది లేదు.

వసు—భర్తనుగానా? ఓసి ముసలిభూతమా! నేనింకను నీకు భర్తనుగా నుండెద ననుకొన్నావా? ఇది పట్టిమోసము! కేవల

మాయ! హీనమైనవంచన! ఈపనిచేసినందుకు మీరందఱును తలలు వంచుకోవలెను.

కామ—ఓ వసుకామా! మాయ యని నీవుకూడ తప్పించు చున్నావా?—ఓ సుదర్శనవర్మా! నామాట వినుము. ఈజిత్తులమారి పాపండుఁడు నీకోమార్తె కిచ్చెడియరణ మంతయు పుచ్చుకొని దానికి బదులు నీకోమార్తెకు స్త్రీధనముగా తానుంచువ యేమియు నియ్యక నిన్ను మోసవుచ్చుటకయి కృషిచేసి యీఫల మంతయు తానే తెచ్చుకొన్నాఁడు. ఇది యితని స్వయంకృతాపరాధము.

సుద—నన్ను మోసపుచ్చుటకా?

భాను—అందుకు సందేహ మేమి? ఈసంగతి మీయెదుటనే మే మిప్పుడు ఋజువు చేయఁగలము.

సుద—ఓరి పాపాత్ముఁడా! ఇది నిజమయియే యుండును. కాకపోయిన యెడల, రాగమంజరి ముఖమువంటి ముఖమును చూచిన తరువాతఁగూడ నితఁ డింత సాహసము చేసియుండఁడు. ఓభూలోక బృహస్పతీ! నేను హృదయపూర్వకముగా నిన్నును నీ భార్యను సుఖవంతులగుఁ డని యాశీర్వదించు చున్నాను.

భాను—'కామవిషయములో మోసము చేయుట నిందార్హము కాదు' కాదా? నీనీతి నీకే పనికివచ్చినది.

కామ—నీమంత్రాంగశక్తి యిప్పుడు స్పష్టమయినది! నీవద్ద నింద్రజాలమ హేంద్రజాలము లున్నవి!

భాను—నీవు శంబరాదులను మించిన మోసగాఁడవు!

సుద—అవునవును. మేనత్త యితనికి చిన్నప్పుడు బృహస్పతి

యని పేరు పెట్టెను

వసు—లోకములో నున్నసూయ లన్నియు మీయొద్దనే యున్నవి. ఇటువంటివంచనకు నేను లోఁబడుదు ననుకొన్నారా?

కామ—ఓ వసుకామా! నీకు నే నొక్కబుద్ధి చెప్పెదనువిను. నీకు లభించినదానితోనే తృప్తిపొంది యూరకుండుము. లేకపోయిన పక్షమున పరులను వంచింపఁబోయి మోసగాఁడే మోసపోయినాఁడని యెగతాళిచేసి లోకులందఱును నిన్ను చప్పటలుకొట్టి నవ్వుదురు సుమా.

వసు—నా కాపరిహాసము లక్ష్యము లేదు. ఈవంచన నేను సహింపను—ఓసుదర్శనవర్మా! దీని కంతకును నీవే కారకుండవు నీవు గదిలోపెట్టి తాళము వేసినదానిని జిహ్వా పడిపోవునట్లుగావర్ణన చేసి, నాతల్లి యంత ముదిముఖము కలదనియు కుబ్జవంటికురూపిణి యనియు నేను చెప్పినప్పుడు నామాట పెడచెవినిబెట్టి కోపపడినావు

రాగ—ఓరి జిత్తులమారినక్కా న న్నేమన్నావు?

సుద—మేలుమేలు. మంచిపని చేసినావు. రాగమంజరీ ఆలాగున బుద్ధిచెప్పు.

రాగ—ఓ నడపీనుఁగా! నీకుందమునకు నీవు సౌందర్యమను పేరుకూడ తలపెట్టుచున్నావా? పిల్లికన్నులును, చప్పిదౌడలును దొప్పముక్కును, మిట్టనొసలును, పెట్టుకొని కొండముచ్చువలెనున్న నీవుకూడ న న్నాక్షేపించవలెనా?

సుద—రాగమంజరీ! తగినట్లు చెప్పినావు.

రాగ—కత్తికట్టి సేనలో కొలువుచేసివచ్చినతోడఁబుట్టినవాఁ డొకఁడు నాకిక్కడ నున్నాఁ డన్నమాట మఱచిపోకు. నావిషయములో నీవన్యాయము చేసితివా—

వసు—నీవును నీతోఁబుట్టినవాఁడును కట్టకట్టుకొని నిప్పులో పడుఁడి. మీ బాధ విడుగడ చేసికొనుట కయి నే నిప్పుడు కాశీ లేచిపోయెదను.

రాగ—నీ వెక్కడకుపోయినను నేను నీ వెంట రాక విడువను.

సుద—ఓ రాగమంజరి! నీదూదివంటిచేతు లొక్కసారి [illegible]నికి సోఁకనిమ్ము.

[వసుకాముఁడును, రాగమంజరియు, నిష్క్రమించుచున్నారు.]

సుద—మంచిది. భానుమతీ! నిజముగా నీవీ వీరభద్రుని వివాహము చేసికొన్నావా?

భాను—మీయాజ్ఞకు బద్ధురాలనయి పెండ్లిపెద్దల క్రిందట నే యీతని చేఁబట్టినాను.

సుద—నాయాజ్ఞ కా!

కామ—అవును. ఇదిగో మీ యంగీకారపత్రిక. ఇది మీ స్వహస్తలిఖితము.

సుద—ఏమీ! నన్ను భ్రమపెట్టి నాకొమార్తెను నీ వపహరింపఁ దలఁచుకొన్నావా? ఈ యుపాయముచేతనే నీవు భానుమతి హరణమునుకూడ దక్కించుకో నెంచినావా? అట్లయిన, నిశ్చయముగా వసుకామునివలె నీవును దొంగవే.

కామ—ఓ సుదర్శనవర్మా! నేనట్టివాఁడనుగాను. నీ కొమార్తెను పాణిగ్రహణము చేసికొనుటలో నీ యుత్తరమువలని లాభము పొందినవాఁడ నయినను మోసముచేసి యీ సొమ్మును పరిగ్రహించుట నేను హేయముగా నెంచెదను. ఇదిగో నీయుత్తరము తిరుపుచ్చుకొమ్ము (అని యుత్తర మిచ్చి) నీ యాభరణమునకు బదులుగా నీకొమార్తెకు నీ దీవనలనిమ్ము. ఇందుకు మాఱుగా నా కున్న [illegible]

త్తంతయు నే నీమెకు స్త్రీధనముగా వ్రాసి యిచ్చెదను. నీ వీమెను ముత్యాలరాజునకిచ్చి వివాహము చేసినను, నీ కతఁడింతకంటె నెక్కు వేమియు చేయఁజాలఁడు.

సుద—నీ వత్యద్భుత మయినవాఁడవుగా నున్నావే! నీవు తప్ప నీవలె నుదారకార్యమును చేయువారు మఱియెవ్వరును లేరని నీకు గర్వమున్న దాయేమి?—ఓభానుమతీ! నే నెఱిఁగినంతవఱకు నీహారణ మక్కఱలే దన్నవాఁడు నాకితఁ డొక్కఁడు కనఁబడు చున్నాఁడు. ఈభరతఖండములో నెల్ల నీహారణమును పొందుటకితఁడే యర్హతముఁడని నా యభిప్రాయమగుట నీవు నీ ప్రియుఁడయిన యీ గర్వితునితోఁ జెప్పు. ఇదిగో మి మ్మిద్దఱిని నే నిప్పు డాశీర్వదించు చున్నాను. తప్పిదము నాద యినప్పుడు పట్టిన పట్టు నేను విడుచువా డనే కాక, న్యాయవిషయములో నేనన్నమాట యెప్పుడును తిరుగు వాఁడను కానని కూడ మీరు తెలిసికోఁ గలరు.

[అప్పుడు విజయవర్మయు సుదంతయు ప్రవేశించుచున్నారు.]

సుద—ఇక్కడ నా కింకొక యద్భుత మగపడు చున్నది! ఓ విజయవర్మా! నీవు యోగిని నెవ్వతెనైన మఠమునుండి లేవదీసి కొని రాలేదుగదా?

విజ—ఈమె పయిబట్టలో నే కాని మఱియేవిధములోను యోగిని కాదు. దగ్గఱగా వచ్చిచూడుడు. ఈమె మాధవసేనుని కూఁతు రయిన సుదంతయగుట మీ కన్నులే తేట పఱుచును.

సుద—ఇది మహాభాగ్యము! నీ వెంతో తెలివిగల పడుచు వాఁడవు. నిన్ను క్షమించినాను ఓముద్దులకోడలా! నీవు చక్కని చిన్నదానవు. నీముసలిమామగారి కొక్కసారి నీ నవ్వు మొగము ముద్దిమ్ము.

సుద—అయ్యో! ఇఁకముందు మీరు మమ్మాదరించి కడుపులో పెట్టుకో వలెను.

(అని చేయిముద్దిచ్చుచున్నది.)

సుద—తావళములు త్రిప్పుటచేత నీచేతులింకను గఱ్ఱుపాఱ లేదే! నేనిప్పుడు సంతోషము పట్టఁజాలకున్నాను—ఓరీ! దామోదరా! ఘటకా! దారకా! మన వీధితలుపులు తీసియుంచినారా! ఈవయస్సున మాకుబిడ్డలవివాహములే గొప్పవేడుకలు. ఈరాత్రి యుత్సవము దివ్యముగాజరగవలెను. మన బంధువులును మిత్రులును వచ్చుచున్నారు. పిన్నపెద్దలందఱును కలిసి యీరాత్రి యుల్లాసముగా గడపవలెను.

[లోపల సంగీతము పాడఁబడుచున్నది.]

ముత్తకోకిల

సుద—ఎల్లవారలు రండు వేడుక హెచ్చునిచ్చట హాయిగా
కొల్లగాఁగను పెండ్లిపాటలు కోరిపాడుచునవ్వుచున్
మెల్లఁగానిదె ప్రొద్దుపుత్తము మిత్రులార! కడంకతో
నుల్లమందలి చింతయంతయు నొక్కసారి యడంగఁగన్.

తరళ

భాను—మనసులోపల సంతసంబులు మల్లడింపఁగ వేడుకన్
ఘనులుమీరలు పాడియాడుచుఁ గాలమొక్కక్షణంబులోఁ
జనఁగఁ జేయుఁడు మీదునేర్పున జాగుచేయక యివ్వడిన్;
వినుఁడు వేఁడెద మిమ్ము నేశుభవేళ యియ్యదిగావునన్.

సుగంధి

విజ—క్రొత్తపెండ్లికూఁతులార! క్రొత్తపాటలన్

వృత్త మిప్పు డించుకంత ప్రొద్దు నవ్వులాటలన్
నృత్తగీతవిద్యలందు నేర్పు చూపి తన్వుఁడీ.

పంచచామరము.

కామ—కరంబు మీకు సౌఖ్య మిచ్చుఁగాత రాత్రివిందిటన్;
దిరంబు లేక యెల్లవారుఁ దద్దయు న్ముదంబునన్
బిహాన నాటపాటలందు వేడ్క యింత చూవుఁడీ;
పరాత్పరున్ స్తుతించి భక్తిఁ బ్రార్థనంబు సల్పుఁడీ.

ఉత్సాహ.

సుదంత—వ్యసనమెల్లఁ బాఱఁద్రోలివలయు మదులనుండి నేఁ
డసమమైనసంతసమున నలరవలయు నెల్లరున్;
వెసను మనము చేరి యిందు వింతవింతక్రీడలన్
దెసలు మాఱుమ్రోయ వేడ్క తెలుపవలయు నిత్తఱిన్.

స్రగ్విణి

సుద—ఇందుఁ గూర్చున్నవారెల్ల నల్లంబులన్
బొందఁగా మోదముం బొంది యీరాత్రి యీ
మందిరంబందు సన్మాన మొప్పారఁగన్
విందులై వీరి దీవింపుదుర్ గావుతన్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము.

శ్రీ

# కళ్యాణకల్పవల్లి

గ్రంథకర్త:-

కందుకూరి వీరేశలింగము పంతులు

నాల్గవకూర్పు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు



## పురుషులు

---

1. వీరసేనుఁడు—విక్రమసేనునితండ్రి.
2. విక్రమసేనుఁడు—వీరసేనునికొడుకు; కళావతిప్రియుఁడు.
3. దర్పసారుఁడు—చారుమతియొక్క ప్రియుఁడు.
4. దామోదరవర్మ—కళావతిని వరింపఁగోరిన రాజపుత్త్రుఁడు.
5. పురుషోత్తమదేవుఁడు—కళావతి తన్నుఁగామించిన దనుకొన్న యొక క్షత్రియవీరుఁడు.
6. విజయపాలుఁడు—విక్రమసేనుఁడు పెట్టుకొన్న మాఱుపేరు.
7. రాముఁడు—విక్రమసేనుని భృత్యుఁడు.
8. మాధవుఁడు—దామోదరవర్మ సేవకుఁడు.
9. శంకరుఁడు—వీరసేనుని బండివాఁడు.

## స్త్రీలు

10. సుభద్రమ్మ—కళావతి మేనత్త.
11. కళావతి—విక్రమసేనుని వరించిన రాజపుత్త్రి.
12. చారుమతి—దర్పసారుని వరించిన రాజపుత్త్రి.
13. మంథర—సుభద్రమ్మ దాసి.

---

# కళ్యాణకల్పవల్లి

—:o:—

## ప్రథమాంకము



౧. రంగము—పిఠాపురములోని వీధి

[రాముఁ డొకప్రక్కనుండియు, శంకరుఁ డొకప్రక్కనుండియు ప్రవేశించుచున్నారు]

రాము—వాడు శంకరుడా యేమిటి? అవును సందేహంలేదు. శంకరుఁడే—శంకరా! శంకరా!

శంక—ఎవరువారు? ఓహో! నాపాతస్నేహితుడు రాముడా! ఓరామూ! నిన్ను చూచి యెంతకాల మయిందిరా? దగ్గరగా వచ్చి నన్ను కౌగిలించుకో.

రాము—వద్దు వద్దు. నాబట్టమూసిపోతుంది. నిన్నుచూడడం చేత నాకు సంతోషం పట్టరాకుండా వున్నది. బండి బాగాతోలుతూ వున్నావా? నిన్ను పిఠాపురంలో చూస్తానని యెప్పుడూ అనుకోలేదు.

శంక—అయ్యగారూ, చారుమతీ, అమ్మగారూ, వెంకిగాడూ అందరమూ వచ్చినాము.

రాము—అలాగా?

శంక—అయ్యగారికి పిఠాపురం చూడవలెనని బుద్ధిపుట్టి గంటలో మమ్మలినందరినీ ప్రయాణంచేసి బయలుదేరినారు.

రాము—ఆయన యెప్పుడూ తొందరమనిషే. అలా చెయ్యకపోతే వీరసేనుడుగారి పేరులో గొప్ప నేమున్నది!

శంక—దానికేంగాని నీచిన్నయజమానుడుగారు యెట్లా వున్నారు? విక్రమసేనుడిగారిని యిక్కడచూస్తే వీరసేనుడుగారు అద్భుతపడుతారు.

రాము—నేను యిప్పుడు విక్రమసేనుడిగారివద్ద పనిలో లేను.

శంక—అలాగా? మరియెవరివద్ద వున్నావు!

రాము—ప్రస్తుతం నేను విజయపాలుడిగారివద్ద వున్నాను.

శంక—ఈమార్పువల్ల నీస్థితి యేమినా బాగుపడ్డట్టు నే ననుకోను.

రాము—యేమీా మార్పు లేదు.

శంక—మార్పు లేదా? విజయపాలుడిగారివద్ద పనిలో వున్నా వని యిప్పుడు నాతో నీవు చెప్పినావే.

రాము—నిన్ను యిట్లు చిక్కులుపెట్టను. విక్రమసేనుడుగారూ విజయపాలుడుగారూ యిద్దరూ వొక్కరే.

శంక—ఇద్దరూ వొక్కరేనా? యేమిహాశ్చర్యం!

రాము—వొక్కరే. వెనుకటి విక్రమసేనుడిగారే యిప్పుడు విజయపాలుడుగా రయినారు. కాబట్టి యిప్పుడు నాకు విజయపాలుడి కొలువే కాని విక్రమసేనుడితో పనిలేదు.

శంక—అలాగయితే యిదియేదో మాయలాగువున్నది. నీకు తప్పకుండా తెలిసివుంటుంది. నీ స్నేహితుణ్నిగదా నాకీమర్మం చెప్పవా?

రాము—నీవు రహస్యం దాచగలవా!

శంక—బండిదొడ్లో యెడ్లను పెట్టినట్టు మనస్సులో పెట్టు కొని పైకి రానియ్యను.

రాము—దీనికంతా కారణం కాముడు. ఏమిటో చెప్పకో.

శంక—అవు నవును. నాకిప్పుడు బోధపడ్డది. సంగతంతా వూహాచేసినాను. ఈవ్యవహారంలో యేదో స్త్రీవున్నది. సరే కాని నీయజమానుడు తా నెవరని చెపుతూ వున్నాడూ?

రాము—తాను సేనాధిపతినన్న మాట మరుగుచేసి చిన్న వుద్యోగస్థు డయినట్టు నటిస్తూవున్నాడు.

శంక—సేన కధిపతి అయియుండగా చిన్నవుద్యోగస్థుణ్ణని యెందుకు చెప్పకో వలెను? సేనాధిపతినని చెప్పకోవడానికి చిన్న తనంగా వున్న దా?

రాము—కాదు కాదు. దానికి హేతువు వేరేవున్నది. నా యజమానుడు కామించిన చిన్నది మహావిచిత్రమయినది. ఆవిడకు ముప్ఫయి వేల రూపాయలు వచ్చే సంస్థానానికి ప్రభువయినవీరసేనుని కొడుకున్ను సేనాధిపతిన్ని కావడం కంటే చిన్నవుద్యోగస్థుడుగా వుంటేనే నాయజమానుడియందు యెక్కువ యిష్టం.

శంక—ఇదీ వింతగానే వున్నది. ఆవిడెవద్ద డబ్బు బాగా వున్నదా యేమిటి? ఆవిడె భాగ్యవంతురాలా !

రాము—భాగ్యమో గీగ్యమో నాకు తెలియదు. ఆవిడె యింట్లో మోహిరీలు మీపశువులదొడ్లో గడ్డిపరకలలాగు యెక్కడ చూచినా దొర్లుతూవుంటవి. పశువుల కడుగుగోలెములుకూడా వారింట్లో బంగారవు వే. పంజరంలో చిలుకలకు మంచిముత్యాలు మేతపెడుతారు.

శంక—అలాగయితే ఆవిడెవద్ద పదిసంచు లయినా వుంటవి. ఆవిడెకు నీయజమానుడియందు అనురాగమేనా?

రాము—అనురాగ మేమిటి? నాయజమానుడంటే చెవులు కోసుకుంటుంది.

శంక—ఆవిడపేరు యెవరైనా వినవచ్చునా?

రాము—ఆవిడపేరు కళావతి. అయితే నేమి కాని ఆచిన్నదానికి మునలిమేనత్తవొకతె పానకంలోపుడకలాగు ప్రతిబంధకంగా వున్నది. అయినా కానీ ఆపెద్దావిడె యిదివరకు నాయజమానుణ్ని యెప్పుడూ చూడలేదు. ఆచిన్నది పువ్వులతోటలో విహారానికి వచ్చినప్పుడు మే మామెతో పరిచయం కలుపుకున్నాము.

శంక—అలాగయితే వారిద్దరికీ వేగిరం ముడివేసి పెళ్ళిలంకె వేస్తే బాగావుంటుంది. ఈసంగతి కేమిగాని యీపిఠాపురం యెటు వంటిది? యీవూరిని గురించి నేను యిదివరకు చాలావిన్నాను. ఈ వూళ్ళో వేడుకగా ప్రొద్దుపుచ్చడానికి అన్నీ వుంటవి కావూ?

రాము—అన్నీవున్నవి. మేము యెప్పుడూ స్నానం చెయ్యక పోయినా నాయజమానుడూ నేనూ ప్రతిదినమూ ప్రాతఃకాలమూ పాదగయకు వెళుతాము. భోజన మయినతరువాత తోటలోకయినా వెళుతాము; చీట్లయినా ఆడుకుంటాము. సాయంకాలము వూరిబయు టికి షికారు వెళుతాము. పాడువూరు ఈవూరంటేనాకప్పుడే విసుగు వేస్తూవున్నది. రాత్రి పదిగంట లయినతరువాత వూళ్ళో యెక్కడా సందడే వుండదు. పాటలూ లేవు పదాలూ లేవు. యేమీలేవు. అయినా దర్పసారుడిగారి నవుకరూ నేను కలుసుకుని రాత్రిళ్లు వినో దంగా ప్రొద్దు గడుపుతూవుంటాము. అతణ్ని నీకు చూపిస్తునా? వొక్కమాటు చూచినా వంటే నీ వతణ్నె మళ్ళీ వదలిపెట్టవు.

శంక—నేనాజోగిగాడిని యెరుగుదును. వాడియజమానుడు మన చారుమతిని పెళ్ళాడేమాట నీవు యెరుగవు కాబోలును.

రామ:—నేను మరచిపోయినాను. ఓయీ శంకరా! మాతో సహవాసం చెయ్యవలెనంటే నీవు నీ వేషం కొంచెం మార్చుకోవలెను. గంగిరెద్దు పాగాలాగు నీ కీతలగుడ్డ యెంతమాత్రమూ బాగావున్నది గాదు. నీ వీపాటి తలగుడ్డ మానివేసి టోపీ పెట్టుకోవడం నేర్చుకోవలెను. ఇప్పుడు వుద్యోగస్థులూ అందరూకూడా పాగాలు మానివేసి టోపీలు పెట్టుకుంటూ వున్నారు.

శంక—వాళ్ళ కర్మాచారం టోపీలు పెట్టుకుంటే వాళ్ళే చెడిపోతారు. నేనుమాత్రం లక్షవరహాలుయిచ్చినా మా తాతముత్తాతల నాటినుంచి వంశపరంపరగా వస్తూవున్నతలపాగా మానివెయ్యను. యెవళ్ళో పనికిమాలిననిర్భాగ్యులు పూర్వాచారం వదులుకుంటారుగాని నావంటి దేశాభిమానులు యెప్పుడూ వదిలిపెట్టరు.

రాము—నీవు టోపీ పెట్టుకోకపోతే మానినావుగాని వూరికే కోపపడకు.

శంక—పూర్వాచారం మీరితే యెంతోపాపం వస్తుంది. స్కూలుపిల్లవాళ్ళు టోపీలు పెట్టికుంటూవున్నా చాకలి సర్విగాడూ, మంగల మల్లిగాడూ, గమళ్ళ గాలిగాడూ, మావూళ్ళో పెద్దమనుష్యులు. అందరూ నెత్తికి తలగుడ్డలే పెట్టుకుంటూవున్నారు.

రామ—వూరుకో యెవరో వస్తూవున్నట్టున్నారు.

శంక—మరియెవరూ కారు. మా చిన్నదొరగారు విక్రమసేనుడుగారు. నీవు యిప్పుడు చెప్పినది ఆయనతోకూడా వున్న చిన్నదేనా?

రాము—కాదుకాదు ఈవిడె మంథర నేను చెప్పిన చిన్నదానివద్దవుండేదాసీ. ఆయన ఆయింట్లోనే బసచేసినాడు. నేను వెంటనే వెళ్ళి మీరు యీవూళ్ళోకి వచ్చినవర్తమానం చెప్పవలెను.

శంక—అదుగో ఆయన దానిచేతిలో సొమ్ము పెడుతూ వున్నాడు! ఓరీ! రామా! నిన్ను వొక్కసంగతి అడగవలె నను కుంటూ వున్నాను.

రాము—నాకు యిప్పుడు మాట్లాడడానికి తీరుబడి లేదు. వేగిరం పోవలెను. నేటిరాత్రి తొమ్మిదిగంటలకు మే మందరమూ తాటితోటలో సభ చేరుతాము. నీవుకూడా అక్కడికి రా. సావకాశంగా అన్నిసంగతులూ అక్కడ మాట్లాడుకుందాము.

(ఇద్దరును వేరువేరుమార్గములఁ బోవుచున్నారు.)

---

౨. రంగము—సుభద్రమ్మగారియింట నొకగది.

---

[కళావతి పుస్తకము చేతబట్టుకొని కూరుచుండి యుండఁగా నేదోసందేశమును గొని మంథర ప్రవేశించుచున్నది.]

మంథ—ఆపుస్తకంకోసం నేను వూరంతా వెతికినాను. యీవూళ్లో యేపుస్తకాలకొట్లులోనూ ఆపుస్తకం లేదు.

కళా—తారాశశాంక మయినను దొరకినదా!

మంథ—అదీ దొరకలేదు.

కళా—బిల్హణీయమో!

మంథ—అదీ లేదు.

కళా—రాధికాసాంత్వన మున్నదా!

మంథ—అది వొక్కపుస్తకం వుండగా యెవరో కొనుక్కపోయినారట!

కళా—మఱి యేమి తెచ్చినావు!

మంథ—మీరు యిచ్చిన రెండురూపాయిలకూ మూడు పొస్తకాలు తెచ్చినాను. ఇదుగో యిది సారంగధరచరిత్ర; యీ రెండోది వుషాకళ్యాణం; మూడోది రుక్మిణీకళ్యాణం.

(అని బల్లమీద పెట్టుచున్నది)

కళా—రుక్మిణీకళ్యాణముమాత్రము నాచేతికిచ్చి తక్కిన పుస్తకములు పరుపుక్రింద పెట్టు.

మంథ—ఇవి పరుపుకిందపెట్టి, అక్కడవున్న రాధామాధవ విలాసం తీసుకురానా?

కళా—నీవు మఱేదియుఁ దీసికొనిరానక్కఱలేదు. ఈపుస్తకము లక్కడ బడవేసి నీవు వేగిరము పో. ఇక్కడ కెవరో వచ్చుచున్నారు ఎవరో చూడు. మా చారుమతి కంఠములాగున వినఁబడుచున్నది!

మంథ—అమ్మా! జానకమ్మగారు వస్తూవున్నారు.

కళా—కాదు. నీవు వెళ్ళిపో.

మంథ—అమ్మా! వెళుతూవున్నాను.

(అని వెడలిపోవుచున్నది)

[చారుమతి ప్రవేశించుచున్నది]

కళా—ఓ ప్రియసఖీ! చారుమతీ! నిన్ను చూచుటచేత నా మనస్సున కపరిమితానందము కలుగు చున్నది. ఇంత శీఘ్రకాలములో నీదర్శనసుఖము కలుగునని నేనెన్నఁడు ననుకోలేదు.

(అని లేచి కౌఁగిలించుకొనుచున్నది)

చారు—చెలీ! కళావతీ! నీకంటెను నాకెక్కువ సంతోషముగా నున్నది. విశేషమేమి? మొట్టమొదట నే నడిగినప్పుడు నీ వింట లేవన్నారే!

కళా—సఖీ! నేను నీకు చెప్పవలసినవి వేయిసంగతులున్నవి. మీ రింత యాకస్మికముగా పీఠికాపురమున కేలవచ్చినారో మొట్ట మొదట చెప్పు. మీర నేనుడు మామగారుకూడా వచ్చినారా?

చారు—వచ్చినారు. మే మీ యూరిలో నడుగుపెట్టి రెండు గడియ లయినది. ఆయన స్నానముచేసి బట్టలు కట్టుకొనుట కాఁగా నే సుభద్రపిన్నిగారిని చూచుటకు వత్తు రనుకొనెదను.

కళా—అట్లయిన పక్షమున వారువచ్చి విఘ్నముచేయుటకు మొదలుపెట్టకముందే నాకష్టకథలు నీతోఁ జెప్పుకొనెదను. నీవు ధూరాలోచన కలదాన వగుటచేత నా వేగిరపాటుచూచి చీవాట్లు పెట్టినను నీ మంచిస్వభావముచేత నీవు నా దురవస్థకు జాలిపడక మానవని నే నెఱుఁగుదును. విజయపాలునకును నాకునుగల సంబంధమును నా యుత్తరములవలన నీవు వినియున్నావుగదా! అతఁడు లభించుభాగ్యము నాకిప్పుడు పోయినది. మా మేనత్త మాయుత్తర మొకటి త్రోవలో పట్టుకొని మాయుత్తర ప్రత్యుత్తరముల సంగతి తెలిసికొన్ని, అప్పటినుండియు న న్నీగదిలోఁ బెట్టి పైకిపోనీక నిర్బంధించు చున్నది. చెప్పితే నీవు నమ్ముదువో నమ్మవో కాని యింకొక విశేషముకూడ జరిగినది. ఒకనాటిరాత్రి జానకమ్మగారియింటికి మేము భోజనమునకు వెళ్ళినప్పు డక్కడ జైనవిగ్రహములాగున పొడుగుగానున్న యీ పురుషోత్తమదేవుని జూచి మోహించి మా మేనత్త యతనిని వలలోఁ బడి పరితాపపడుచున్నది సుమా.

చారు—చీ! నీవూరకే పరిహాసము చేయుచున్నావు.

కళా—నీతోడు! పరిహాసము కాదు. నేను నిజముగానే చెప్పుచున్నాను. ఏదోమాయపేరు పెట్టుకొని యిప్పుడామె యతనితో నుత్తర ప్రత్యుత్తరములు జరపుచున్నది. కొంతకాల మయిన తరు

చూత తన నిజమయిన పేరు బయలుఁ బెట్టఁ దలఁచుకొన్నది కాఁబోలును! ఆమె "రాధ" అని చేవ్రాలు చేయుచున్నది.

చారు—అట్లయినపక్షమున, ఇప్పుడాబిడ్డ నిశ్చయముగా తన మేనకోడలిని స్వతంత్రురాలినిగా విడిచిపెట్టి యుండును.

కళా—లేదు లేదు. ఆమెచర్య నీవనుకొన్నదానికి ప్రత్యక్ష విరుద్ధముగా నున్నది. తన దౌర్బల్యమును తెలిసికొన్నప్పటి నుండియు నాయందాబిడ కనుమాన మెక్కువయినది. గోరుచుట్టుమీఁద రోకటి పోటులాగున నాకిప్పుడు మఱియొక పీడకూడ పట్టుకొన్నది. ఆ నిర్భాగ్యుఁడు దామోదవర్మకూడ నేఁడీగ్రామమునకు వచ్చుట తటస్థించినది. కాఁబట్టి నేనిప్పు డిన్నిపిశాచముల బాధ వదల్చుకొను టకు పోరాడవలెను.

చారు—కళావతీ! అధైర్యపడకు నీకిప్పుడు వచ్చిన భయము లేదు. వీరసేనుఁడుబాబుగారు నీ మేనత్తతో మాటాడి నీకు తొందర కలుగకుండఁ జేయుదురు లే.

కళా—అన్నిటినిమించిన దురవస్థ నా కింకొకటి పట్టినది. నీవది యింకను విననేలేదు. ఆయుత్తరము నా మేనత్త పట్టుకొనుటకు కొంచెము ముందుగా నాదౌర్భాగ్యమువలన నేను మందభాగ్యుఁడైన విజయపాలునితోకలహము పెట్టుకొన్నాను. ఆకలహానివార ణము చేసికొనుట కతఁడప్పటినుండియు మరల నాకంటఁ బడలేదు.

చారు—అతఁడు చేసిన యపరాధ మేమి?

కళా—ఏమియు లేదు. అదియేమో నాకు తెలియదుగాని మేమెన్నిసారులు కలిసికొని మాటాడినను మాలో మాకొకసారి యైనను వివాదము రాలేదు. అందుచేత నతఁ డెప్పుడును ప్రణయ కలహమునకైన నాకవకాశ మియ్యఁడేమో యని భయపడి నాలో

నే నాలోచించుకొని కడచినగురువారము నాఁడు నాకు నేనే యొక యుత్తరము వ్రాసికొని, దానిలో విజయపాలుఁడు మఱియొకసుందరి పయిని వలపు నిలిపి యున్నట్టు తెలియఁబఱిచినాను. అట్లు వ్రాసి యాయుత్తరములో క్రింద "నీ వెఱుఁగని నీప్రియసేవకురాలు" అని చేవ్రాలుచేసి, ఆయుత్తరమును విజయపాలునికిఁ జూపి నాయెడల ద్రోహము జేసితివని యాతనిని నిందించి, మనసులో లేనికోపమును మొగమునఁ దెచ్చుకొని మండిపడి. ఇఁకముం దెప్పుడును నే నాతని ముఖము చూడనని యొట్టు పెట్టుకొన్నాను.

చారు—అట్లు పంపి వేసినతరువాత నీవాతనిని మరలఁ జూడనే లేదా?

కళా—ఆమఱునాఁడే మామేనత్త మాగుట్టు కనిపెట్టినది. నేనతనిని మొట్టమొదట మూఁడుదినములుమాత్రమే బాధపెట్టఁదలఁచుకొంటినిగాని యిప్పు డాతనిని దక్కించుకొనుభాగ్యమే యెప్పటికిని దప్పిపోయినది.

చారు—నాకు నీవు వ్రాసిన ట్లతఁడు నీమీఁద నిజమయిన కూరిమి గలవాఁడయి నీచెట్టపట్టుట కర్హుఁడే యయినపక్షమున, నిన్నింతటితో నాతఁ డెప్పుడును విడువఁజాలి యుండఁడు. అయినను నీవే యాలోచించుకో. అతఁడు చిన్నయుద్యోగములో నున్నాఁడని వ్రాసినావు. నీకు మూఁడులక్షలరూపాయల సొత్తున్నదిగదా!

కళా—అవునుగాని యుక్తవయస్సు వచ్చులోపల నామేనత్త యనుమతిలేకుండ నేనువివాహము చేసికొనెడుపక్షమున నాసొమ్ములో విశేషభాగము నాకు రాదన్నసంగతి నీవే యెఱుఁగుదువు. అయినను నాతండ్రి యిట్టియేర్పాటు చేసినాఁడని నాకుఁ దెలిసినప్పటినుండియుఁ బదునెనిమిదిసంవత్సరములు నిండకముందే పెండ్లి చేసికొనవలెనని

నేను నిశ్చయము చేసికొన్నాను. ధనమునిమిత్తమయియొక్కదినమయి నను వేచియుండవలసిన దని కోరెడుపురుషుని నెవ్వనిని నేను కామింపఁజాలను.

చారు—ఇది కేవలచపలత !

కళా—ఏమి! నాప్రియసఖి చారుమతి నాయందే చపలత్వ మారోపించి తప్పు పట్టుచున్నదా? నే నింతవఱకును చారుమతి ప్రియుఁడు దర్పసారుఁడు చారుమతికే చపలత్వము నేర్పినాఁ డను కొన్నాను.

చారు—ఆతనిదోషములనుగూడ గుణము లని భావించి నే నెప్పుడును ప్రేమింపను.

కళా—అయినను సమయమున కాతనికి సందేశము పంపియే నీ విక్కడకు వచ్చితి వనుకొనెదను.

చారు—నీతోడు ! లేదు. నే నీపీఠికాపురము వత్తునన్న మాటయే యాతనికిఁ దెలియదు. వీరసేనుఁడుబాబుగారీప్రయాణ మకస్మాత్తుగా తలపెట్టినందున, నేనాతనికి వర్తమానము పంపుట కయిన నవకాశము లేకపోయినది.

కళా—ఓచారుమతీ! వీరసేనుఁడుగారి సంరక్షణలోనున్నను నీవు స్వతంత్రురాలవు. అయినను నీ వతిదీర్ఘ మయిన యీసంవత్సర కాలమునుండియు భర్తృస్వాతంత్ర్యమును వహించుట కనుమానించుచు కాలహరణము చేయుచున్నకృతఘ్నుఁ డయినయీదర్పసారుని చాపల్యమునకును శంకాశీలత్వమునకును దాసురాల వయి యాతని గర్వము సాగనిచ్చుచున్నావుగదా !

చారు—చెలీ! నీవుపడ్డ యభిప్రాయ మెంతమాత్రమును సరియైనది కాదు. మాతండ్రిగారిమరణమునకు ముందే మేము వివా

షామునకు నిశ్చయము చేసికొన్నాము. ఆయనమ్మతియు తన్మూల మున వచ్చినకొన్నిచిక్కులును నడుమ నిలిచి నాహృదయవల్లభుఁ డయినదగ్వాహునిమనోరథమునకు విలంబనము కలుగఁజేయుచున్నవి గాని యిం దాతనిదోషము లేశమును లేదు. అటువంటియల్పాంశ మునుబట్టి కాలహరణము చేయుట కతఁ డంత దయమాలినవాఁడు కాఁడు. ఆతనిస్వభావమును గుఱించికూడ నీవు వట్టిపాపము కట్టు కొనుచున్నావు. కళావతీ! అటువంటి మహోదారచిత్తుఁ డెప్పుడును శంకాశీలుఁడు కాఁడు. అతఁ డప్పుడప్పుడు కొంచెము చంచలహృద యుఁడుగా నున్నను, ఆతనిహృదయమునందు కాపట్య మన్నది యేమూలను లేదు; అప్పుడప్పుడు కొంచెము చిరాకుపడినను, మృదువు తప్పినమాట యాతనినోటినుండి యెప్పుడును రాదు. అతఁ డీవఱకు కామతంత్రముల కలవాటుపడినవాఁడు కాకపోవుటచేత, ప్రియు రాండ్రు నాయకులవలనఁ బ్రతీక్షించు ప్రియభాషలను వేషములను జూపుటయందుమాత్ర మతఁ డంత నిపుణుఁడు కాఁడు. కానియాతని ప్రేమయు వినయవర్తనమును నవ్యాజములయినవి. అతనిహృదయము నందలిప్రేమ మేరమీఱినదగుటచేతఁ దనప్రియురాలును మాటల చేతను చేఁతలచేతను దనయం దట్టిప్రేమమునే చూపవలె నని యతఁడు ప్రతీక్షించుచుండును. తనయందుఁగల గుణాతిశయమును బట్టి యతఁ డెంత ప్రేమకయినను నర్హుఁడేయయినను, వినయగుణము చేత నతఁడు తనగుణాతిశయమును గొప్పగా భావించుకొనకున్నాఁడు. అవ్యాజప్రేమమును జూపుట కర్హ మయినగుణగౌరవము తనయం దేమున్నదని భావించుకొను నమ్రతకలవాఁ డగుటచేత, అతఁడు తనమీఁద తగినంతయనురాగ ముండదేమో యని శంకించుచుండుట కలదు. ఆతనియెడఁగల యీస్వభావమే నామనస్సును గొన్నివేళల

యందుఁ బడి తాపముపాలు చేయుచున్నది. ఇటువంటిసందేహములు కూడ నాయందుఁ గలప్రేమాధిక్యమునుబట్టియే యుత్పన్నము లగు చుండుటచేత, అనురాగఋణమును పూర్ణముగా తీర్చుకొనలేక నేనే యాతని కప్పుపడి యున్నానని నేనొప్పుకొనవలసి యున్నది.

కళా—ఓ చారుమతీ! అతనిపక్షమవలంబించి సమాధానము చెప్పఁ బూనుకొన్నందుకు నిన్ను నేను నిదింపను. కాని నిన్ను నే నొక్క ప్రశ్న వేసెదను. నీవుదానిని కపటము విడిచి యుత్తరము చెప్పవలెను. అతఁడు నీప్రాణరక్షణము చేసినవాఁడు కాకయుండిన పక్షమున, ఇప్పుడున్నంత ప్రేమ నీ కాతనియం దుండియుండునా? ఆది యందు నీపడవను తలక్రిందు చేసినయాక్రూరవాయువే యంతమందు నీమనస్సులో నాతనిపై యనురాగమును పూరించుటకు నీపాలిటి యనుకూలదేవత యయినది.

చారు—నాకతనిమీఁదియనురాగము కృతజ్ఞతవలనఁ గొంత బలపడి యుండవచ్చునుగాని నాప్రాణరక్షణము చేయకముందే నా కాతనిమీఁద నవ్యాజానురాగము గలదు. అయినను నాకతఁడు చేసినమహోపకార మొక్కటియే నన్నాతనియెడ బద్ధానురాగనుగాఁ జేయఁజాలినంత యనుబంధ మయినందుకు సందేహము లేదు.

కళా—ఇది యొక యనుబంధకారణమా? ఆసమయమందు దాపున నున్నపక్షమున నీటికుక్కసహిత మట్టిపని చేసి యుండును. ఈఁత చేతనయినవాఁ డన్నిహేతువుచేత నేనుమాత్ర మెన్నఁడును నాహృదయ మెవ్వరికి నర్పింపఁజాలను.

చారు—కళావతీ! ఇటురా. బొత్తిగా నీవాలోచన లేని మాటలాడుచున్నావు.

కళా—నేనూరక పరిహాసము కన్నాను. ఈమాటల పాటిగాఁ బట్టబోకు—ఎవరో వచ్చుచున్నారు.

[మంథర త్వరతోఁ బ్రవేశించుచున్నది.]

మంథ—అమ్మా! అమ్మా! మీమేనత్తగారితోఁ గలిసి వీరసేనుఁడుగారు యిప్పుడే మనయింటికి వచ్చినారు.

కళా—వారిక్కడకు రారు—మంథరా! నీవు కనిపెట్టియుండి నాతోఁ జెప్పు.

మంథ—చిత్తము. (అని వెళ్లుచున్నది.)

చారు—వచ్చినను రాకపోయినను నేను పోవలెను. నేనిక్కడకు వచ్చినసంగతి వీరసేనుఁడుబాబుగా రెఱుఁగరు. ఆయన నన్నిక్కడఁ జూచినపక్షమున, పోనీక నిలిపి యూరు చూచుటకై నన్నుఁ దన వెంటఁ గొనిపోక మానరు. నేను మఱియొకప్పుడు వచ్చి నీమేనత్తను జూచెదను. అప్పుడామె తనయిష్టము వచ్చినంతసేపు నిలిపి తనకు తెలియని పెద్దపెద్దమాటలు వేసి నాతో సావకాశముగా మాటాడ వచ్చును.

[మంథర మరలఁ బ్రవేశించుచున్నది.]

మంథ—అమ్మా! అమ్మా! వారిద్దఱును మేడమీఁదికే వచ్చుచున్నారు.

కళా—ఇఁక నిన్నిక్కడ నిలుపను. నాప్రాణసఖీ! చారుమతీ! సెలవా? నీరాకను దర్పసారునికిఁ జెప్పివచ్చుటకయి నీవు తొందర పడుచున్నావు. ఇదిగో వేరేమెట్లున్నవి. ఈదారిని క్రిందికి దిగి పో.

చారు—చెలీ! సెలవు. అని కళావతిని కౌఁగలించుకొని వెడలిపోవుచున్నది.)

కళా—ఓసీ! మంథరా! ఈపుస్తకములు తీసిదాచు. వేగిరము! వేగిరము! రుక్మిణీకళ్యాణము పెట్టెలసందునఁ బడవేయుము. విజయవిలాసము పరుపుక్రింద పెట్టు. భాగవతము సప్తమస్కంధము తెఱచి బల్లమీఁద పెట్టు.

మంథ—పాడుసప్తమస్కంధం తెండి. పంటబ్రాహ్మడు పొస్తకంలో చుప్పనాతికథపట్టు వచ్చేదాకా చింపివేశాడు.

కళా—పోనీ! ఉన్నంతవఱకు తెఱచిపెట్టి గూటిలోనున్న గజేంద్రమోక్షము నామీఁద గిరవాటుపెట్టు. వారువచ్చుచున్నారు. నీవు వెళ్ళిపో.

మంథ—అమ్మా! మంచిది. (అని వెడలిపోవుచున్నది)

[సుభద్రమ్మయు, వీరసేనుఁడును ప్రవేశించుచున్నారు]

సుభ—అదిగోనయ్యా! ఆబుద్ధిహీనురా లక్కడఁ గూరుచున్నది. ఈప్రబుద్ధురాలు కాసుకు గతిలేనినిర్భాగ్యుని పెండ్లిచేసికొని తనవంశమున కంతకు నపకీర్తి తేఁజూచుచున్నది.

కళా—అత్తా! వెనుక నీవిషయమయి నేననుకొన్నది—

సుభ—అమ్మాయీ! నీ వేమయిన ననుకొందువు. నీయనుకొనుట లెక్క చాలించు. చిన్నపడుచులు తమమనసు వచ్చినట్లెల్ల ననుకొనుట తప్పు. మేమిప్పుడు నిన్ను ప్రార్థింప వచ్చినసంగతి విను. నీవతని మఱచిపోయెదనని మాచేతిలో చెయ్యి వేయవలెను.

కళా—మఱ పెల్లప్పుడును మనస్సునకు స్వాధీనమయిన పని కాదు. మఱచిపోవలె ననుకొన్నను మఱచిపోవుటమాత్రము కొన్ని సమయములయందు చెప్పినంతసులభము కాదు.

సుభ—తెలిసినదానిని నేను సులభమని చెప్పుచుండఁగా నీవు కాదని నామాట కెదురుచెప్పెద వేమి? నిజముగా తలఁచుకొంటే

మఱచిపోవుట యెప్పుడును కష్టముకాదు. నాపెనిమిటిని నేనెట్లు మఱచిపోయినానో నీ వెఱుఁగుదువా? అస లాయన భూమిమీఁద కొంతకాల మున్నట్టే యిప్పుడు నాకు జ్ఞప్తిలేదు. నీమామగారిని మఱచిపోవలెనని నేను మనఃపూర్తిగా తలఁచుకొన్నాను; వెంటనే మఱచిపోయినాను. వేగముగా మఱచిపోక మెల్లకాలమునొక్కనిని మనస్సులో నుంచుకొనుట నీవంటికన్నెలకు బొత్తిగా తగదు.

వీర—నీవు మఱచిపొమ్మన్నదాని నొక్కదానిని దక్క మఱి దేనిని నీమేనకోడ లిప్పుడు మనస్సులో నుంచుకొన్నట్టు నటించదు. ఇది యంతయు నీమె చదువుకొన్న విద్యాప్రభావము.

కళా—అత్తా! నన్నిట్లు బాధపెట్టుటకు నేను మీ కేమి యపరాధము చేసినాను?

సుభ—కళావతీ! నీవు మాట మఱపించి తప్పించుకో చూడకు. నీ నేరమునకు నావద్ద తగినంత నిదర్శన మున్నది. దాని కేమిగాని యిఁకముం దయినను నేనుచెప్పినట్లు వినెదనని వాగ్దానము చేయుము. నామాట విని మనకు కావలసినవాఁ డీయన చెప్పిన పెనిమిటిని చేసికొనుట కంగీకరించు.

కళా—అత్తా! నీతో నేను స్పష్టముగాఁ జెప్పుచున్నాను విను. నేను కోరుకొన్న వానిని దక్క మఱొక్కనిని వరించుట కెప్పుడును నే నిష్టపడను. మీ రాలోచించిన సంబంధము నాకు సరిపడదు.

సుభ—అమ్మాయీ! వరించుటకును వరించక పోవుటకును కన్నెపడుచవు. నీ యిష్టముతో పనియేమున్నది? ఇష్టానిష్టము లెప్పుడును నీవంటి కన్యల కర్హము లయినవి కావు. అవి సదా మాఱుచుండుట సహజ మయినందున, వివాహవిషయములో సాధా

రణముగా నిష్టములేని వానితో నారంభించుటయే క్షేమకర మన్న సంగతి నీవెఱుఁగి యుండవలసినదే. మొట్టమొదట నేను నీ మామ గారిని పెండ్లి చేసికొన్నప్పుడు నా కాయనమీఁద నిజముగా పెద్దపులి మీఁద నున్నంత ద్వేషము అయినను మాది యనుకూలదాంపత్య మయినందుకు సందేహము లేదుకదా? భగవంతుఁ డనుగ్రహించి నాథర్తగారిని తనవద్దకు రప్పించుకొన్నప్పుడు నే నెంత బిగ్గరగా నేడ్చినానో కన్నీరెల్లు కాలువలు కట్టించినానో నీవే యెఱుఁగుదువు. ఈవఱకు నేను కుదిర్చిన సంబంధము మాని వేసి మేము మఱియొక మంచిసంబంధము చెప్పెద మనుకో. నీవప్పుడయిన విజయపాలుని వదలివేసెదవా?

కళా—కల్లవాగ్దానములు చేసి నేనొకవేళ నా మనస్సు నబద్ధము చేయఁ గలిగినను, నా చేష్టలుమాత్రము నా పలుకుల నబద్ధములు చేసి నిజమును బయలఁబెట్టక మానవు.

సుభ—పెద్దమనుష్యుల యెదుట సరసముగా మాటాడుటకు నీ వర్హురాలవు కావు. నీవు నీగదిలోనికిఁ బోయి కొఱకొఱలాడుచు నొంటిగా కూరుచుండి నీదురాలోచనలు చేసికో. పో.

కళా—మంచిది. సంతోషపూర్వకముగా బోయెదను.

(అని లేచి పోవుచున్నది.)

సుభ—ఇప్పుడు మీమీఁద పెద్దభారము పడినది.

వీర—ఇందేదియు వింతలేదు. ఇది యంతయు బాలికలకు విద్య చెప్పించుటవలన గలిగిన ఫలము. నాకీశ్వరానుగ్రహము వలన వేయిమంది పుత్రికలు కలిగినను వారిలో నొక్కరికిని విద్య చెప్పింపను.

సుభ—బావగారూ! మీరు కన్యల విషయమయి తప్పు తలఁచుచున్నారు.

వీర—సుభద్రమ్మా! నేనీదినమున ప్రత్యక్షముగా చూచిన సంగతి యొక్కటి చెప్పెదను విను. నేను మీయింటికి వచ్చుచుండఁగా మీ దాసి నీ మేనకోడలినిమిత్తము పుస్తకముల కొట్టులో నుండి కొన్ని పుస్తకములు కొని తీసికొని వచ్చుచున్నది. పయి యట్టలనుబట్టి యవి యెటువంటిపుస్తకములో నే నప్పుడే గ్రహించినాను.

సుభ—శృంగారప్రబంధములు.

వీర—అవును. అవి వట్టి పనికిమాలిన పుస్తకములు. అవి చదివినవారు చెడిపోక మానరు. ఆవాసన సోకినతరువాత వానిలో వర్ణింపఁ బడినదాని ఫలము ననుభవింపఁ గోరకుండరు. అందుచేత నే నేను స్త్రీలకు విద్య కూడదనుచున్నాను.

సుభ—మీ రూరక పరిహాసమున కనుచున్నారు. అంతేకాని మీరుమాత్రము స్త్రీలుమూర్ఖురాండ్రుగా నుండవలెనని కోరుదురా?

వీర—అది సరికాని స్త్రీ లెంతవఱకు చదువవలెనని నీయభిప్రాయము?

సుభ—బాలికలు విద్యలలో పండితురాండ్రు కావలె నని నేనెప్పుడును జెప్పను. వారికి సంస్కృతములోను వేదాంతములోను పాండిత్య మక్కఱలేదు. ఇంటిలెక్కలు వ్రాయుటకు కొంచెము వ్యాకరణము వచ్చియుండవలెను. చదివిన పద్య మర్థము చేసికొనుటకు కొంచెము గణితశాస్త్రము తెలిసి యుండవలెను; తప్పులు లేకుండ నుత్తరము వ్రాయఁగలుగుటకు కొంచెము తర్కము నేర్చు

కోవలెను. స్త్రీల కింతవఱకు విద్య చాలును. నేను చెప్పినది సరిగా నున్నదా?

వీర—నీవు శాస్త్రపండితురాలవు గనుక, ఈవిషయ మయి నీతో నేను వాదులాడను. నీ విప్పుడు చెప్పిన ప్రతివాక్యములోను నీ పాండిత్యమును బుద్ధివిశేషమును నాకు బోధపడినవి. విద్యావిషయ మటుండనిచ్చి మన మిప్పుడు కార్యాంశమునకు వత్తము. నేను చెప్పినసంబంధమునకు నీకేమియు నాక్షేపణ లేదుగదా?

సుభ—లేదు. ఆవగింజంతయునను లేదు. దామోదరవర్మ విషయమయి నేనూరకే సూచనగాఁ జెప్పినాను గాని యతనికి నేను నిశ్చయముగా మాట యియ్యలేదు. కళావతి తన కతఁడక్కఱ లేదని మూర్ఖపుపట్టు పట్టుచున్నది గనుక, మీకొడుకువిషయమయి సమాధానపడవచ్చును.

వీర—వెంటనే యిక్కడకు రావలసినదని మావానికి నేఁడే యుత్తరము వ్రాసిపంపెదను. నేను నా మనస్సులో కొంతకాలము నుండి యాలోచించుకొను చున్నను, మావానికి మాత్రమీవిషయ మయి యెంతమాత్రమును తెలియనియ్యలేదు. వాఁడు సేనలో నుద్యోగములో నున్నాఁడు.

సుభ—నే మీనడుమ కెన్నఁడును మీకొడుకును జూడలేదు. అయినను మాసంబంధమునకు మీకుమారుని కేమియు నాక్షేపణ యుండదనుకొనెదను.

వీర—ఆక్షేపణా? చేతనయిన యెడల నాక్షేపణ చేయుమను చూతము. వాఁ డెప్పుడును నామాట కడ్డు చెప్పఁడు. నామాట కావగింజంత యెక్కువ చెప్పినపక్షమున, నేనుసహించి యూరకుండు వాఁడను గానని నా మురాగ్రహ మూ విక్రమసేనుఁ డెఱుఁగును.

వాని చిన్నతనములో నేను "విక్రమా! ఇది చేయుము" అని యాజ్ఞాపించెడివాఁడను. వాఁడు తత్క్షణము చేయక యనుమానించిన పక్షమున, అప్పుడే వానిని పడతన్నెడి వాఁడను. ఏడ్చిన పక్షమున, వెంటనే గదిలోనుండి సాగనంపెడివాఁడను. ఎప్పుడును నాపద్ధతి యింతే.

సుభ—అదే నామనసును వచ్చిన మంచిపద్ధతి. కొంచెము కఠినముగా నుండక పోయినపక్షమున, చిన్నవాండ్రు చెప్పినట్లువినరు. ఇఁక దామోదరవర్మ కుద్యాగనము చెప్పి మీకుమారుని ప్రార్థన లాలోచించవలసినదని నామేనకోడలిని మెడలువిఱిచియొప్పించెదను. బావగారూ! మీకుమాత్రము మీకొడుకుతో నామేనకోడలు కొంచెము మంకుతనము కలదయినను బుద్ధిమంతురాలని బోధపఱచవలెను.

వీర—ఆవిషయమయి నీవు నాకు బోధ చెయ్యవలసినపని లేదు. నాపని నేను నీచిత్తమువచ్చినట్లు చెయ్యఁగలను. నీవుమాత్రము కొంచెము గట్టిపట్టు పట్టకపోయినయెడల, నీమేనకోడలునీకుస్వాధీనురాలుకాదు. నాబుద్ధి విని నేను చెప్పినట్లు చేయుము. నీమేనకోడలు మంచిమాటలకు లొంగక నాకొడుకు పనికిరాఁ డన్నపక్షమున, మాటాడక గదిలోపెట్టి తాళము వేసి రెండుదినములు నీసేవకు లెవ్వరును దీసికొనిపోయి యన్నము పెట్టకుండునట్లు దిట్టము చేయుము. మూడవదినము నీమేనకోడ లెట్లుచెప్పినట్లు వచ్చునో యప్పుడు నీకే తెలియవచ్చును. మంచిది. నే నిప్పటికి సెలవు పుచ్చుకొనెదను.

(అని వెడలిపోవు చున్నాఁడు)

సుభ—ఏలాగున నయినను నేను దానిని లోఁబఱుచుకొనవలెను. పురుషోత్తమదేవునిమీఁద నామనస్సు తగిలియున్నట్టది

యేలాగునో కనిపెట్టినది. మంథర నాగుట్టు బయలఁబెట్టియుండదు. నిశ్చయము. అది వట్టివెఱ్ఱిబాగులది. అయినను నిజము దానినోటనే పలికించెదను—మంథరా! మంథరా! (అని పిలిచి) అది రహస్యము వెల్లడి చేయుస్వభావము కల దయినపక్షమున, దానినెప్పుడును నేను నాయొద్దఁ జేర్పకయే యుందును,

[మంథర ప్రవేశించుచున్నది]

మంథ—అమ్మా! పిలిచినారా?

సుభ—పిలిచినాను. నీవు వీధిలోనికి వెళ్ళినప్పుడు నీకెక్కడనైన పురుషోత్తమదేవుఁడుగారు కనఁబడినారా?

మంథ—లేదు. అమ్మా! లేదు. ఆయనమొఖ మయినా నేను చూడలేదు.

సుభ—నీవాయనసంగతి యెవరితోను జెప్పలేదుగదా?

మంథ—నేనా? నేనా? ఓయి దేవుడా! నేను యెవరితోనైనా చెపితే నాలుక తెగ్గొయ్యవలెను.

సుభ—నీవెఱ్ఱిబాగులతనము చూచి ఎవరైన మోసము చేయుదురుసుమా. భద్రము!

మంథ—అమ్మా!

సుభ—కొంచెముసేపుండి మరలరా. పురుషోత్తమదేవుఁడుగారిపేర నొకయుత్తరము వ్రాసి యిచ్చెదను. ఇతరులరహస్యములను నాతోఁ జెప్పుటయే కాని నీవు నారహస్యములను మఱియెక్కడను జెప్పరాదు సుమా! చెప్పితివా, అమాయకురాలవని నిన్ను క్షమించను. తరువాత నీవు నాయాగ్రహమునకు పాత్రురాల వగుదువు. (అని లోపలికిఁ బోవుచున్నది)

మంథ—అహ హహహ! నా వెఱ్ఱిబాగులతనమా! నీవు కొంచెంసేపు విశ్రాంతిపొందు. నాతోటివాళ్ళు తాము గడుసువాళ్లులాగు కనపడడానికి చూచినా నేనుమాత్రం పయికి వెఱ్ఱిబాగుల వేషమే వేస్తాను. నా అమాయికత్వంవల్ల నాకు యెంతలాభం కలిగిందో చూచుకుంటాను. (కాగితము తీసి చదువుచు) విజయపాలునితో లేచిపోవడానికి సహాయం చేస్తూవున్నందుకు కళావతి యిచ్చినవి యిరవయిరూపాయల రొఖ్కమూ రెండుచీరెలూ. విజయపాలుడుగా రిచ్చినవి పదిరూపాయలు—రెండోపద్దు—వారిసంగతి బయలపడడానికి సిద్ధంగా వున్నప్పుడు రహస్యం పట్టియిచ్చినందుకు సుభద్రమ్మగా రిచ్చినవి రెండురూపాయలు—మూడోపద్దు — యిస్తానని చెప్పి యివ్వకుండా దోవలో చింపిపారవేసిన వుత్తరాలు పట్టుకు వెళ్ళినందుకయి దామోదరవర్మ యిచ్చినవి రెండురూపాయలు—నాలుగోపద్దు—పురుషోత్తమదేవుడుగా రిచ్చినవి మూడురూపాయలు—ఓ వెఱ్ఱిబాగులతనమా! బాగాచేసినావు నీదయచేతనే నాపురుషోత్తమదేవుణ్ని మేనత్తతో కాకుండా మేనకోడలితోనే తాను వుత్తరప్రత్యుత్తరాలు జరుపుతూవున్నట్టు నమ్మేటట్టు చేసినాను.

(అని నిష్క్రమించుచున్నది)

---

## ద్వితీయాంకము

౧. రంగము—విక్రమసేనుని గృహము

---

[విక్రమసేనుడును, రాముడును ప్రవేశించుచున్నారు]

రాము—నేను అక్కడ వుండగానే వీరసేనుడుగారు వీధిలోనుంచి వచ్చినారు. మీ క్షేమసమాచారం తెలుసుకు రావడానికి

మీ కొమారుడుగారు నన్ను యిక్కడకు పంపినారనిన్నీ, తమ దర్శనం చెయ్యడానికి యెప్పుడు సమయంగా వుంటుందో కనుక్కరమ్మన్నారనిన్నీ, మనవి చేసినాను.

విక్రి—నే నిక్కడ నున్నానని విన్నప్పు డాయన యేమన్నారు?

రాము—యేమంటారు? ముక్కుమీద వేలు వేసుకుని యెక్కడ లేని హాశ్చర్యమూ పడ్డారు. కొంచెంసేపు అద్భుతపడి నిలుచుండి మావాడు యిక్కడకు యెందుకు వచ్చినాడని అడిగినారు.

విక్రి—నీవేమి చెప్పినావు?

రాము—పెద్ద అబద్ధం చెప్పినాను. చెప్పిన అబద్ధం యేమిటో సరిగ్గా యిప్పుడు జ్ఞాపకం లేదుగాని నా నోటినుంచి నిజంమాత్రం రాలేదు. ఇక ముందయినా పొరబాటు లేకుండా వుండడానికి మనం పిఠాపురం యెందుకువచ్చినామో యేదోవొకటి యిప్పుడే నిశ్చయం చేసికోవలెను. యిప్పుడు వొకటి చెప్పి యింకోమాటు యింకొకటి చెపితే తంటా వస్తుంది. చెప్పే అబద్ధాలయినా వొకదానిని వొకటి పోసగి వుండేటట్టు ఆలోచించి మరీ చెపుతూ వుండవలెను. మరీ ఆయన నవుకర్లు మీరు యిక్కడకు యెందుకు వచ్చినారు యెందుకు వచ్చినారని పదిసార్లు అడిగినారు.

విక్రి—వాండ్రితో నీవేమియు చెప్పలేదు గదా?

రాము—లేదు లేదు. వొక్కమాటయినా చెప్పలేదు. వాళ్ళల్లో బండివాడు శంకరుఁడు మహానమ్మక మయినవాఁడు.

విక్రి—ఓరి నిర్భాగ్యుఁడా! కొంపతీసి వానినినమ్మి వానితో నీ వేమైనఁ జెప్పినావా యేమి?

రాము—లేదు. వొక్కక్షరం చెప్పలేదు. వూరికే యెవరి పడితే వాణ్ని నమ్మడానికి నేనంత వెఱ్ఱివాణ్ణనుకున్నారాయేమిటి నేను మహా గడుసువాణ్ని. నామాట నమ్మండి. వాడుమాత్రి నన్ను నీయజమానుడు యిక్కడికియెందుకు వచ్చినాడని గుచ్చిగుచ్చి అడిగినాడు. మనుష్యులను కుదుర్చుకోవడానికి వచ్చినారని చెప్పినాను. కుదుర్చుకోవడాని కన్నమాటమాత్రం నిశ్చయంగాచెప్పినాను. మగవాళ్ళనో, ఆడవాళ్ళనో, యెవరిని కుదుర్చుకోవడమో మాత్రం చెప్పలేదు. యెవరిని కుదుర్చుకోవడమో జోలిమాలిన సంగతి వాడికెందుకు?

విక్రి—కుదుర్చుకొనుట కన్నమాట సరిపోయినది. యెవ్వరడిగినను నీ వామాటే యింకముందును జెప్పుచుండుము.

రాము—సరిపోనిమాట నేను యెన్నడూ చెప్పను. కుదుర్చుకోవడ మన్నది దివ్యమయినమాట. దానికి వన్నె తేవడానికి మీరప్పుడే పదిమంది బంట్లనూ యిరవైమంది తప్పట వాయించే వాళ్ళనూ ముప్ఫయిమంది బాకా వూదేవాళ్ళనూ, కుదుర్చుకున్నారనికూడా చెప్పినాను.

విక్రి—ఓరి మూర్ఖుడా! అవశ్యమయినదానికంటె నధికముగా నీ వెప్పుడును జెప్పబోకుము.

రాము—క్షమించండి. నా నేరం క్షమించండి. అయినా కానీ మీరు నామనవి వొక్కటి చిత్తగించవలెను. వొకదాన్ని బలపర్చడానికి నాలుగబద్ధాలు వెంటనే వుంటేనేకాని అబద్ధం యెన్నడూ పనికిరాదు. అందుచేత వొకఅబద్ధం చెప్పి నమ్మించడానికి నేను యెప్పుడూ దానికి సాక్ష్యము మరినాలుగు అబద్ధాలు తోడుగా కల్పిస్తూ వుంటాను.

విక్రి—సాక్ష్యమతివిస్తార మయినపక్షమున నమ్మకము మొదలే చెడిపోవచ్చును. కాఁబట్టి నీవు జాగరూకుఁడవయి యుండవలెను.—దర్పసారుఁడుగా రింటికి వచ్చినారా?

రాము—ఆయన పయిన బట్టలు కట్టుకుంటూ వున్నారు.

విక్రి—ఆయునకు వీరసేనుఁడుగారును చారుమతియు వచ్చిన సంగతి తెలిసినదేమో నీ వెఱుఁగుదువా?

రాము—ఆసంగతి నేనాయనకు తెలిసిందనుకోను. ఆయన యిక్కడకు వచ్చినతరువాత పెద్దాపురాన్నుంచి వచ్చినపెద్దమనిషిని వొక్కరిని తప్ప మరియెవరినీ యింకా చూడలేదు. మెట్లుచప్పడవుతూ వున్నవి. దర్పసారుడుగారు కిందికి వస్తూవున్నట్టున్నారు.

విక్రి—నేనిక్కడ నున్నానని నీవాయనతో చెప్పిరా.

రాము—చిత్తము. (అని పోవుచు) అయ్యా! వొకవేళ వీరసేనుఁడుగారు యీలోపుగా యిక్కడకువచ్చి మిమ్మల్ని అడిగినట్టయితే; మనం మనుష్యులనుకుదుర్చుకోవడానికి వచ్చినామన్నమాట మీరు మరిచిపోకుండా బాగాజ్ఞాపకం వుంచుకోవలెను.

విక్రి—మంచిది పో.

రాము—నామాట బోటుకాకుండా మీరు సాధ్యమయ్యే పక్షానికి తప్పేటవాళ్ళనూ బాకావాళ్ళనూకూడా పోగుచేసి మీరు యిక్కడ వుంచితే నేను చాలా సంతోషిస్తాను. నా యజమానుడికోసం అబద్ధా లాడడానికి నేను యెప్పుడూ సందేహించకపోయినా, నాఅబద్ధం బయులపడితేమాత్రం నా మనసుకు చాలా నొప్పిగా వుంటుంది సుమండీ. (అని పోవుచున్నాఁడు.)

విక్రి—నా మిత్రుఁడు కొంచెము చంచలచిత్తుఁడు. తనప్రియు

రాలు వచ్చినవార్త యతనికిఁ దెలిసి యుండనిపక్షమున, అతనితో జెప్పక కొంతసేపు చిక్కులు పెట్టెదను.

[దర్పసారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విక్రి—మిత్రుఁడా! సంతోషముగా నున్నది. పీఠికాపురమునకు నీ వనుకొన్న వేళకే తప్పక మరల వచ్చినావు!

దర్ప—వెళ్ళినపని తీఱినతరువాత నే నక్కడ నిలువవలసిన యావశ్యకము లేకపోయినందున తిరిగి వెంటనే వచ్చినాను. నేను వెళ్ళినతరువాత నిక్కడ విశేషము లేమి? కళావతికిని నీకును నడుచుచున్న వ్యవహార మెట్లున్నది?

విక్రి—పూర్వ మున్నట్లే యున్నది. మా కలహదినము మొదలుకొని నే నామెను మరలఁజూడ నేలేను. అయినను నే నామె యొద్దనుండి సందేశము వచ్చునని ప్రతిక్షణమును ప్రతీక్షించుచున్నాను.

దర్ప—తత్క్షణమే నీతో లేచిరావలసిన దని బోధించియామె నేలయొప్పింపలేవు?

విక్రి—ఏమీ? ఆమెసొత్తుతో మూడింట రెండుపాళ్ళు పోఁగొట్టనా? మిత్రుఁడా! నీ వీసంగతి మఱచిపోయినావు. గట్టిగా తలఁచుకొన్నయెడల నే నామె నీవఱకే లేవఁదీసికొని రాఁగలిగి యుందును.

దర్ప—నీ వూరక కాలమును వ్యర్థపుచ్చుచున్నావు. ఆమె దక్కుట నిశ్చయ మని నీకు నమ్మక మున్న పక్షమున, నీనిజమయిన వేషముతో నే పోయి యామె మేనత్తతో నీసంగతిని తెలుపుకొని యనుమతినిమిత్తము యి నీతండ్రి పేరుసేరుని కేల వ్రాయరాదు!

విక్రి—మెల్లగా; మెల్లగా. విజయపాలవేషముతో నున్న నాతో లేచి వచ్చునని నాకు దృఢనిశ్చయ మున్నను; గొప్పసంస్థానమునకు నేను కర్తను గాఁగలనని తెలిసికొన్నప్పుడు మేనత్త యంగీకారముతో సరియైన వివాహమహోత్సవములతో కళావతి నన్ను భర్తనుగా వరించుననన్న నిశ్చయము మాత్రము నా కేవిధముచేతను లేదు. తొందర పడఁగూడదు. ఈపని కయి నే నామె మనస్సును క్రమముగా శిక్షితము చేయవలెను. ఇటువంటి సాహస కృత్యము నకుఁ జొచ్చి కార్యము చెడఁగొట్టుకొనుటకంటెముందుగా నే నామెను నాతోడిదే లోక మనుకొనునట్లుగాఁ జేయవలెను.— మంచిది. దర్పసారా! నేఁడు నీవు మాయింటికి భోజనమునకు వచ్చెదవా?

దర్ప—నేను రాలేను. నేఁడు విందులు తినుచుటకు తగినంత యుత్సాహస్థితిలో నేను లేను.

విక్రి—నేను నిన్ను విడిచిపెట్టను. నీ వెంత కామాతురుఁడ వయి యున్నను, పురుషగుణము మాత్రము విడిచిపెట్టఁ బోకు. ధైర్యము పురుషలక్షణము.

దర్ప—అది సత్యమే కాని నే నిప్పుడు విందు లారగించుటకు తగినస్థితిలో లే నని నేనే యొప్పుకొనుచున్నాను.

విక్రి—నీవలె నేనుమాత్రము కాముకుఁడను గానా? మదన వికారము నాకుమాత్రము తల కెక్కి నాచేత సాహసకార్యములు చేయించుచుండుట లేదా? అయినను పనికిమాలిన మూఁడుదానివలె నే నెక్కడకుఁ బోయినను నావెంట లేచిపోని యవమానములను, భయములను, ఆశలను గొనిపోవునా?

దర్ప—నాకువలె నీహృదయ మంతయు తదేకధ్యానముతో నొక్కదానిమీఁదనే నిలిచియుండలేదు. నీ విప్పు డొక్కచోట పెద్ద

గాలము వేసినావు. అది తప్పిపోయిన పక్షమున వేఱొకచోట వేయుదువు. నీవలెఁ గాక నా బ్రతుకంతయు ప్రాణాధికమైన యొక్క పదార్థముమీఁదనే నిలిచి యున్నది. అది జాఱిపోయిన పక్షమున నేను సర్వవిధములఁ జెడిపోవుదును.

విక్ర—ఛీ! ఊరకుండు. ఇట్టిభయమును పెట్టుకొనుటకు నీ కిప్పుడు క్రొత్తగా నేమి హేతువులు వచ్చినవి?

దర్ప—ఏమిహేతువు లున్న వని యడుగుచున్నావా? నా భయమునకు లక్ష హేతువు లున్నవి. ఆమె యుత్సాహ మెట్లున్నదో, ఆరోగ్య మెట్లున్నదో, ప్రాణ మెట్లున్నదో, అని నేను భయపడుచున్నాను. హా! దైవమా! నా వియోగతాపమును, నా సుఖాగమనకాంక్షయు, ఆమె మృదుహృదయము నెంత నొప్పించుచున్నవో కదా! ఆమె యారోగ్యమును గూర్చి ప్రతిక్షణమును నాచిత్తము తత్తరిల్లుచున్నది. ఆమెది నిరుపమాన కోమల సుకుమార శరీరము. రెండు చినుకులు పడినను, కొంచెము చలిగాలి వీచినను, శైత్యమా మె మృదులాంగములను నొగిలింపవచ్చును. మధ్యాహ్న తీక్ష్ణాతపతాపమును సాయంసమయ శీతవాత ప్రకోపమునుగూడ నా ప్రాణములకు ప్రాణమైన యామె ప్రాణముపాలిటి మృత్యుదేవతలు కావచ్చును. తుల్యానురాగముగల కాముకీకాముకు లొండొరుల నెడఁబాసియున్నప్పుడు మలయమారుతము నందును వెన్నెల బయళ్లయందును కదళీలోద్యానముల యందును దేనియందువారి మనస్సులకు భయహేతువు తోచకుండును.

విక్ర—నీవుచెప్పినది సత్యమే కావచ్చును. కానిమ్ము. చారుమతి మనోల్లాసముతో సుఖముగా నున్న దని నీహృదయమునకు దృఢవిశ్వాసము కలిగినపక్షమున, నీమనస్సు సంతుష్టి పొందునా?

దర్ప—నిస్సందేహముగా నపరిమితానందము పొందును. ఆమెక్షేమవార్త తెలియకయే నాయుల్లమిప్పుడు తల్లడిల్లు చున్నది.

విక్ర—అంతే యయినయెడల నీమనస్సంతాపమును క్షణములో చల్లార్చెదను. నీప్రాణవల్లభ చారుమతి సంపూర్ణారోగ్యదశయందున్నది. అంతేకాక యామె యీక్షణమునం దీపీఠికాపురములోనే సుఖురాలయి యున్నది.

దర్ప—ఓయీ! విక్రమసేనా! నన్నెగతాళి చేయకు.

విక్ర—ఎగతాళి కాదు. ఆమె యొకగంటకిందట మామతండ్రి గారితోఁగూడ నిజముగానే యీగ్రామమునకు వచ్చినది.

దర్ప—నిజముగానా?

విక్ర—నిన్ను మోసము చేయుటకు వీరసేనుఁడుగారు నీవెఱుఁగనిక్రొత్తవారు కారుగదా? నీతోడు! నిజముగానే వచ్చినది.

దర్ప—మిత్రుఁడా! ఇప్పుడు నీవు నాచెవుల కమృతము పోసినావు. ఇఁక లోకముమీఁద లోకము పడినను నామనస్సునకు విచారము లేదు.

[రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాము—అయ్యా! దామోదరవర్మగారు యిప్పుడేవచ్చి కిందవున్నారు.

విక్ర—ఈదామోదరవర్మ యిల్లు వీరసేనుఁడుగారి యింటికి మిక్కిలి సమీపము. నీవు విడిచివచ్చినప్పటినుండియు నీప్రాణేశ్వరి యెట్లున్నదో యితఁడు చెప్పఁగలఁడు. కొంచెము సేపు తాళు.— రామా! ఆయనను రమ్మను.

రాము—చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

దర్ప—ఇతఁడు మీయింట చనువు గలిగి మెలఁగుచున్నాఁడా

విక్ర—మిక్కిలి చనవరి యయి సదా మాయింటికిఁ బోవు చుండును. నీవిప్పుడే పోఁగూడదు. ఈతనిచర్య నీకిప్పుడు మహావినోదము గలిగించును.

దర్ప—మంచిది. అతనిని నేనును గొన్నిప్రశ్నలడిగెదను.

విక్ర—ఇతఁడు నాకు ప్రతిపక్షనాయకుఁడుసుమా! అనఁగా నాఅపరావతారుఁ డయిన విజయపాలుని కన్నమాట. తనమిత్రుఁడయినవిక్రమసేనుఁ డెప్పుడయినఁ గళావతినిజూచి యుండవచ్చు నన్నమాటనే యీతనిమనస్సునకు తట్టలేదు. తనశత్రు వయినవిజయపాలుఁడు ప్రచ్ఛన్నవేషముతో తనప్రియురాలివిషయమయి కృషి చేయుచున్నాఁడని యీతఁడు నాతో మొఱ్ఱ పెట్టుకొనుచుండుట యెంతో నవ్వులాటగా—

దర్ప—చాలు. ఊరకుండు. అతఁడు వచ్చుచున్నాఁడు.

[దామోదరవర్మ ప్రవేశించు చున్నాఁడు.]

దామో—ఓహో! నాప్రాణమిత్రుఁడా? విక్రమసేనా! సుఖముగా నున్నావా? నేనింతకుముందే యిక్కడకు వచ్చినాను. మహావేగముగా వచ్చినాను. బెత్తములు గుఱ్ఱములవీపులమీఁదవిఱిగి పోయినవి. గ్రోవపొడుగునను దుమ్ము మేఘములవలె లేచినది.

విక్ర—అవునవును. నీవామేఘములలో మెఱుపులాగునవచ్చి నావు. నిన్నింత వేగముగానిక్కడ కాకర్షించిన యయఃకాంత మేదో నే నెఱుఁగుదును. నీ వీదర్పసారుని నెఱుఁగుదువా? దర్పసారా! ఇతఁడు దామోదరవర్మసుమా!

దామో—మీదర్శనలాభముకలిగినందున నాకు బహుసంతోషముగా నున్నది. మీరునన్ను మీస్నేహితునిగా నంగీకరింపవలెను. విక్రమసేనా! ఈదర్పసారుఁడుగారివృత్తాంతము కొంచెము చెప్పెదవా

విక్ర—ఇతఁడు మనచారుమతి హృదయేశ్వరుఁడు.

దామో—అలాగా? చారుమతియు నీంతండ్రియు నాకంటె రెండడుగులుముందుగా నీగ్రామమునకు వచ్చినారు. ఓదర్పసారా! నీవదృష్టవంతుఁడవు.

దర్ప—చారుమతిని నేనింకను చూడలేదు. ఆమె క్షేమముగా నున్నదిగదా?

దామో—కావలసినంత క్షేమముగా నున్నది. ఆమెముఖవర్చస్సిప్పటికంటె తేటగా మఱి యెప్పుడు నుండలేదు.

దర్ప—ఈమధ్య నామెదేహ మేమో కొంచె మస్వస్థముగా నున్నదని విన్నానే.

దామో—ఎవ్వరు చెప్పినారోగాని మీరువిన్న దబద్ధము. మీమనస్సునకు నొప్పి కలిగించుటకై యూరకే చెప్పి యుందురు. ఆమె యస్వస్థత యన్నమాటయే యెఱుఁగదు.

దర్ప—విక్రమసేనా! చూచినావా? ఆమెమనస్సు నాదానికంటె దృఢ మయినది. నేనిక్కడ నేమియు తోఁచక యస్వస్థముగా నుండఁగా నామె యక్కడ నెంత స్వస్థముగానున్నదో విన్నావా?

విక్ర—నీప్రియురా లారోగ్యము కలిగి యున్నదని నీకు వ్యసనముగా నున్నదా యేమి?

దర్ప—కాదుకాదు. నాయభిప్రాయమును నీవు గ్రహించలేదు. ప్రాణవల్లభు నెడఁబాసి యున్నప్పుడు ప్రియురాండ్రు మనస్సులోఁ గొంచె మస్వస్థముగా నుండుట యసహజము కాదుగదా! ఆమెయంత యారోగ్యముగలదై సంతోషముగా నుండుట యనురాగవిశేషమునకుఁ గొంచెములోప మగునో కాదో నీవే చెప్పుము.

విక్ర—నీ వూరలేనప్పుడు రోగపడకుండుట యామెది గొప్ప తప్పిదమే!

దామో—చక్కగా చెప్పినావు.

దర్ప—చారుమతి యుల్లాసముగా నున్నదని మీరు చెప్పి నారుగదా? ఆమె నిర్విచారముగా నవ్వుచు త్రుళ్ళుచుఁగూడ నుండి యుండును. ఉన్నదా?

దామో—ఆమె యెప్పుడును నవ్వులాట మాటలు చెప్పి యందఱికిని వేడుక కలిగించుచుండును. పదిమందిలో సంభాషణ కెల్ల నామెయే ప్రాణముగా నుండుచు వచ్చెను.

దర్ప—విక్రమసేనా! చూచినావా? నవ్వులాటమాటలట! చారుమతియే సంభాషణకెల్ల ప్రాణమట! నే నూర లేనప్పు డట! వేడుక లట!

విక్ర—అయినదా? నీమాట లసందర్భములుగా నున్నవి. ఇంతకుముందు నీవు చారుమతి వ్యసనముగా నుండినదేమో యని విచారపడినావు. ఇప్పుడు వ్యసనముగా నుండకపోయిన దని విచార పడుచున్నావు.

దర్ప—విక్రమసేనా! పదిమందిలో సంభాషణకు నేనెన్న డయిన ప్రాణముగా నున్నానా?

విక్ర—లేదు. ఎప్పుడును నుండలేదు.

దర్ప—నేనెవ్వరికైన వేడుకను కలిగించినానా?

విక్ర—లేదు. అట్టిపాపము నీవెప్పుడును కట్టుకో లేదు.

దర్ప—నీ వెఱిఁగినంతవఱకు నే నెన్నఁ డయిన నొక్కనవ్వు లాటమాట యయినఁ బలికినానా?

విక్ర—లేనిమాట చెప్పరాదు. నీ వెప్పుడును జడునివలె మొగము ముడుచుకొని యుండెడువాఁడవు గాని యొకప్పుడును నవ్వు వచ్చెడిమాట యొక్కటి యైనను పలికి యుండలేదని నేను ప్రమాణముచేసి చెప్పఁగలను.

దామో—ఈయన యిట్లు మాటాడుచున్నాఁ డేమి?

విక్ర—మఱేమియు లేదు. చారుమతి సుఖముగా నున్నదని విని తన తృప్తిని తెలుపుచున్నాఁడు. అంతే.—అవునా? దర్పసారా!

దర్ప—అవును. ఆమె సుఖవార్త విని నేను సంతోషించుచున్నాను. అవు నవును. ఆమె యెప్పుడును సుఖస్వభావురాలు.

దామో—ఆమాట నిజమే. ఆమె యేడుపుమొగ మెప్పుడును బెట్టదు. బహుకళలయందామె సమర్థురాలు. ఆమె కంఠస్వరము మృదువై యత్యంత మధురమయినది. ఆమెవీణమీఁద మోళ్ళు చిగుర్చునట్లుగాను రాళ్లు కరఁగునట్లుగాను పాడఁగలదు. ఆమె మొన్న త్రిపురసుందరమ్మగారి యింటివద్ద కర్ణసాయనముగా వీణవాయించి పాడునప్పటికి విన్నవా రందఱును చిత్రప్రతిమవలె నిశ్చేష్టులైపోయినారు.

దర్ప—విక్రమసేనా! దీని కేమిచెప్పెదవు? ఆమె తనపాటలేమో వినోదములేమో కాని నాపేరైననుతలపెట్టినట్టు కానరాదు.

విక్ర—ఓయీ! సంగీతము కామోద్దీపకము కాదా?

దర్ప—అయి యుండవచ్చును — అయ్యో! — పాడుపేరు మఱచిపోయినాను. ఈయనపే రేమి?—అప్పుడు చారుమతి పాడిన పాటలేవో మీరు చెప్పఁగలరా?

దామో—నేను చెప్పలేను.

దర్ప—అవియేవో శృంగారగీతములయి యుండును. ఆమె "నీతాళలేన" అన్నపదము పాడినదేమో స్మరణకు తెచ్చుకొండి.

దామో—ఆపదము పాడలేదు.

దర్ప—"ఓశుకములారా! పికములారా!"—ఇది పాడి దేమో! (అని పాడుచున్నాఁడు)

దామో—ఇటువంటి వేవియు పాడలేదు. ఆమె పాడిన పాటలలో నా కిప్పు డొక్కటిమాత్ర మొక్కటి జ్ఞప్తికి వచ్చినది. "ఓ మనసా! నన్నేల బాధించెదవే"—అని పాడినది.

దర్ప—నేను వట్టి బుద్ధిహీనుఁడను. అటువంటి వేశ్యక కత్తెను నమ్మి సుఖపడఁ గోరుచుండుటచేత నేను నిస్సందేహముగా బుద్ధిహీనుఁడనే. పొరుగువారి వినోదము కొఱకు ఇంటింటికిఁ బోయి పెండ్లి పేరంటాలివలె పాటలు పాడుటనుగూర్చి యిప్పుడు నీ వేమి సమాధానము చెప్పఁగలవు?

విక్ర—నీప్రాణవల్లభవలె నాప్రియురాలంత సంతోషముతో పాటలు పాడుచుండిన పక్షమున నేను పరమానందభరితుఁడనై యుందును.

దర్ప—ఆమె సంతోషముగా నుండి పోయినదని నాకు విచారములేదు. ఆవిషయమయి నాకును సంతోషముగా నేయున్నది. ఆమె విచారముగా నుండవలెనని కాని వ్యాధిగ్రస్తురాలు కావలెనని కాని నాకోరిక కాదు. అయినను నాయందనురాగము గల చిన్నది నా విరహదశలో నటువంటి మంచిపాట పాడక, కొంచ మనారోగ్యముగా నుండి, పరిమిత మయిన సంతోషమును పొంది యుండవలసినది. అటువంటిపాట పాడిన చిన్నది కొంచె మభినయము కూడ పట్టియుండక మానదు. అందుకు సందేహము లేదు.

దామో—ఏమి? ఈయన యభినయమునుగూర్చి యేమో యడుగుచున్నట్టున్నాఁడు!

విక్రి—మనమిప్పుడు చెప్పుకొనుచున్న చిన్నదిపాటమాత్రమే కాక యభినయముకూడ పట్టిన దనుచున్నాఁడు.

దామో—చారుమతి మొన్న పాడినప్పుడు పట్టినయభినయము ముద్దులుమూటకట్టినట్టున్నది.

దర్ప—హాదైవమా! నే ననుకొన్నట్లే జరిగినది! విక్రమ సేనా! నీతో నేనన్నానా! నేనన్నయక్షరము లన్నియు నయినవి. అభినయమా? ఎంతపని! ఆమె వర్తన మంతయు నాదానికి ప్రత్యక్ష విరుద్ధముగానున్నది. నేను రేయింబగళ్ళు స్వప్నముగాను, చిరాకు గాను, వ్యసనముగాను ఉన్నాను. ఆచిన్నది స్వస్థముగాను, ఉల్లా సముగాను, నిర్విచారముగాను, ఉన్నది. ఆమె మాటలును పాటలును నాకు తల కంటగించు చున్నవి.

విక్ర—ఓదర్పసారా! నీయవివేకమును వెల్లడిపఱుచుకోకు. పదిమందిమిత్రులుచేరి వినోదముకొఱకు కొకపాట పాడుచున్నప్పుడు, వారిని సంతోషపెట్టుట కయి యొకపాట పాడినమాత్రమున తప్పే మున్నది?

దర్ప—మంచిది. నేనిఁక నోరు విప్పను. మనసువచ్చినన్ని పాటలు పాడి యామె యితరులను సంతోషపెట్టనిమ్ము. -దామో దరా! ఏమి? నీవు చారుమతిపాటలు మిక్కిలి మెచ్చుకొనుచున్నావే!

దామో—హృదయరంజకముగా నుండుటచేత నాకాపాట నా కెంతయైనను మెచ్చుకోఁదగియే యున్నది. ఆచిన్నదాని నేత్రాభి నయ మన్నిటిలోను—

దర్ప—నేత్రాభినయము నీమనసువచ్చినట్లున్నది కాఁబోలును! ఓయీ! విక్రమసేనా! ఈమాట కేమియుఁ జెప్పవేమి? చేతనైన పక్షమున దీనికి సమాధానము చెప్పు నేత్రాభినయ మట! ఇప్పు డెవరిదో తప్పిదము తేటపడినదా? దీనికిని నేను సహించి యుందును గాని—అక్కడ ననేకులుపడుచువాండ్రుండి యుందురు.

విక్ర—అనేకులు నీతాతముత్తాలంత యీడుగల పడుచు వాండ్రు—

దర్ప—అనేకులతోఁ బనిలేదు. దుష్టుఁ డైనపడుచువాఁ డొక్కఁడున్నఁజాలును. వాఁడే యెంతహానినైనను జేయఁజాలును. ఇఁక నేనిక్కడ నుండలేను—నామనసు దడదడ లాడుచున్నది. నా గుండెలు కొట్టుకొనుచున్నవి.—నాస్థితి యీమహానుభావున కప్పుడే పొడకట్టినది. నేను పోయెదను. (అని లేచుచున్నాఁడు)

విక్ర—దర్పసారా! నీవు కొంచెముసేపు తాళినీకీశుభవార్త చెప్పినందుకు దామోదరవర్మకు వందనములు చేసి మరి పో.

దర్ప—అతని శుభవార్త తీసికొనిపోయి తగులబెట్టు మను. (అని వెడలిపోవు చున్నాఁడు.)

విక్ర—అహహాహాహా! పాపము! అయిదునిమిషములక్రిందట దర్పసారుఁ డెంతో సంతోషముగా నున్నాఁడు.

దామో—తనప్రియురాలిని నేను పొగడినందున కాతనికి కోపము రాలేదుగదా ?

విక్ర—నీమీఁద కొంచె మనుమాన పడ్డాఁడు. అంతే.

దామో—అనుమానమా! అహాహాహా! నామీఁదనా? నీవు నన్ను వేళాకోళము చేయుచున్నావు.

విక్ర—అతఁ డనుమానపడుటకు సందేహమేమి? నీవాశ్చాతుర్యమును శరీరసౌందర్యమును యౌవనవతు లయినబిత్తరులచిత్తముల నఱ్ఱూఁత లూఁచక మానవు.

దామో—ఆహాహాహా! నీవు పరియాచక మాడుచున్నావు. ఆహాహాహా! చిత్తముల నఱ్ఱూఁతలూఁచుటా? ఇప్పుడు నాశరీరము నాసొత్తుకాదు. దాని నీవఱకే నాప్రాణేశ్వరి యైనకళావతి దక్కించుకొని తనసొత్తు చేసికొన్నది. పరమఛాందసుఁ డయినమామతండ్రిగారి భయమువల్ల నాగ్రామములో నేను మీసములు గొరిగించుచు వచ్చుటచేత నామొగ మప్పుడు కొంచె మందము తక్కువగాఁ గనఁబడుచు వచ్చెనుగాని యిప్పుడిక్కడ నిర్భయముగా మీసములు పెంచి సంపంగినూనె రాయుటచేత నాముఖమున కెంతయుందమైననువచ్చినది.

విక్ర—అలాగునా?

దామో—మఱేమనుకొన్నావు? సంపంగినూనెమూలమున నాయెదిగీయెదుగనిమీసము లిప్పుడు నిగనిగ లాడుచున్నవి. కని పెట్టినావా?

విక్ర—ఓహో! యువతులు వలచి పయినిబడునట్లుగా నీ విప్పుడు నీరూపమునకు మెఱుఁగు పెట్టుచున్నావు. తెలిసినది.

దామో—ఈ క్రొత్తమీసములతో నాముఖమున కిప్పుడు క్రొత్త పౌరుషముకూడ వచ్చినది ఆవిజయపాలుఁడుగాఁ డిప్పు డొక్కసారి నాకంటఁ బడెనా, నామీసములతోడు! నాపౌరుష మతనికిఁ దేట పడునట్లు చేయుదును.

విక్ర—నీవి యిప్పుడుపౌరుషముగల మాటలవలెనే యున్నవి. అవునుగాని, దామోదరవర్మా! నీ వీక్రొత్తరము లెప్పుడు నేర్చుకొన్నావు?

దామో—అహాహాహా! నీవది కనిపెట్టినావా? ప్రాఁతయొ ట్లిప్పుడు బొత్తిగా పాటి తప్పిపోయినవి. దైవముతోడని, గురువుతో డని, ఎల్లవారును కల్లయొట్టు పెట్టుకొనుటచేత వానిగౌరవముపోయిం దని యొక పెద్దమనుష్యుఁడు మొన్న నాతో ననుటచేత నాయొట్లకు గౌరవము కలుగుటకయి మీాసములతోడని యొట్టు పెట్టుకున్నాను. ఇది బాగున్నదా?

విక్ర—దివ్యముగా నున్నది. ఈ క్రొత్తయొట్లతో నిఁక లోక ములోని ప్రాఁతయొ ట్లన్నియు పడిపోవుటకు సందేహ ముండదు.

దామో—కాలమహిమచేత నేమైనను కావచ్చును. కాల వశముచేత పురాతనాచారములకు గౌరవముతగ్గి నూతనాచారములకు గౌరవము హెచ్చుట స్వభావము. శీఘ్రకాలములోనే యిఁక "దైవముతోఁడు" మొదలయినవాని కాలము పోవచ్చును.

[రాముఁడు ప్రవేశించుచున్నాఁడు]

రాము—అయ్యా! వకపెద్దమనిషి తనకోసం వచ్చి కింద నిలుచున్నారు. ఆయనను పయికి రమ్మనవచ్చునా?

విక్ర—అనవచ్చును,

దామో—యిఁక నేను పోవలెను.

విక్ర—అక్కఱలేదు. ఉండు—రామా! ఆ వచ్చినవా రెవరు?

రాము—మీాతండ్రిగారు.

విక్ర—ఓరిగాడిదా! ఆయనను వెంటనే యెందుకు పయికి రమ్మన్నావు కావు?

రాము—ఇప్పు డంటాను. (అని వెళ్ళుచున్నాఁడు)

దామో—నీవు మీాతండ్రిగారితో మాటాడవలెను

క్కాఁబోలును. నాకు సుభద్రమ్మగారి వద్దనుండి మాయింటికి వర్తమానము రావలసియున్నది. నా మిత్రుఁడైన పురుషోత్తమదేవుఁడుగారిని మాయింటికి రావలసినదని నేను చీటికూడ వ్రాసివచ్చినాను. విక్రమసేనా! ఇప్పటికి నాకు సెలవిమ్ము. మనము సాయంకాలము మరలఁ గలిసికొందము. అప్పుడు నీవు కళావతియొక్క సుఖవార్తను విని సంతోషింతువు గాని లే.

విక్ర—అందుకు సందేహపడకు. నేను మనఃపూర్తిగా సంతోషించెదను.

దామో—సెలవు. (అని పోవుచున్నాఁడు)

విక్ర—(తనలో) ఈయన యిప్పుడు కొడుకుకేదో పెద్ద యుపన్యాసము చదువుటకు వచ్చినారు. నేనిక్కడ కేందుసిమిత్తము వచ్చినానో యీయనకుఁ దెలియకుండిన బాగుండును. ఈయన వాయువునొప్పులచేత స్వగ్రామమును విడిచి రాలేకుండిన యెడల నేను పరమానందమును బొంది యుందును.

[వీరసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విక్ర—తమరి నిక్కడ చూడఁగలుగుటచేత నాకెంతో సంతోషముగా నున్నది. మీరిప్పు డారోగ్యదశయందు దున్నట్లే కనఁబడుచున్నారు. తమ రిక్కడకు హఠాత్తుగా వచ్చినట్టు విన్నప్పుడు మీ దేహస్థితి యెట్లున్నదో యని నాకు భయము కలిగినది.

వీర—నీ మొగము చూడఁగా నీవు భయపడినట్లే తోఁచుచున్నది. నీవిక్కడకు పనిమీఁద వచ్చినావా?

విక్ర—పనిమీఁదనే వచ్చినాను.

వీర—విక్రమా! నీ విక్కడ నుందువని నేనెంతమాత్రము ననుకొనకపోయినను, సమయమునకు నీవు వచ్చుటచేత నాకుసంతోష

ముగా నున్నది. ఒకచిన్న పనియుండి యిక్కడకు రమ్మని నీకు వ్రాయవలె ననుకొన్నాను. నేనంతకంతకు పెద్దవాఁడ నగుచున్నాను; నా కవయవపటుత్వము తగ్గుచున్నది; కాఁబట్టి నేనిఁక చిరకాలము నిన్ను బాధపెట్టుచు బ్రతుకను.

విక్ర—మీవంటిపెద్దలు పైనుండి యాజ్ఞ పెట్టుచుండుటయే సదా నావంటిచిన్నవాండ్రకు క్షేమకరము. అయినను మీరిప్పుడు మంచియారోగ్యదశలో నున్నట్టే కనఁబడు చున్నారు. మీరెప్పుడు నింతకంటె నెక్కువ దృఢముగానుండలేదు. ఎల్లకాలము మీరీప్రకారముగా నుండవలె ననియే నేను దేవుని బ్రార్థించుచున్నాను.

వీర—దేవుఁడు నీప్రార్థన ఫలింపఁజేయవచ్చును. అట్లయిన పక్షమున నీయభీష్టప్రకారముగా నేను దార్ఢ్యముతో చిరకాలము జీవించి నిన్ను బాధించుచునే యుండెదనులే. నీకు జీతము తక్కువ, నీజీతమును నేను పంపెదుసొమ్మును నీయిష్టమువచ్చినట్లు వ్యయము చేసికొనుటకు చాలవని నే నెఱుఁగుదును.

విక్ర—మీకు నాయందుఁగల దయాతిశయమునకు సంతోషించుచున్నాను.

వీర—నేను బ్రతికియుండఁగానే లోకములో నీవు గొప్పవాఁడవు కాగా చూడవలెనని నాకోరిక. కాఁబట్టి తగినస్థితియిచ్చి వెంటనే నిన్ను స్వతంత్రునిగాఁ జేయవలెనని నేను నిశ్చయించుకొన్నాను.

విక్ర—మీకృపాతిశయముచేత నా దేహము పరవశ మగుచున్నది. మీరిప్పుడు చూపఁదలఁచుకొన్న పుత్రవాత్సల్యమువలనఁ గలిగిన కృతజ్ఞత నాహృదయములో చిరకాలమునుండి నిండియున్న పితృభక్తిని ద్విగుణము చేయుచున్నది.

వీర—నీపితృభక్తికి నాకు సంతోషమయినది. కొన్ని వారము లలోనే మనసంస్థానమునకు నిన్ను పెద్దనుగాఁ జేయఁబోవుచున్నాను.

విక్ర—నాకృతజ్ఞత నిప్పుడు మాటలతోఁ జెప్పుట శక్యము కాదు. ముందు మీరంతయు నావర్తనచేతనే చిత్తగించెదరు. నా యుద్యోగము మానివేయవలసినదని మీరు చెప్పరని తలఁచెదను.

వీర—అది నీభార్యయిష్టము.

విక్ర—నాభార్యా!

వీర—ఉద్యోగము మానివేయుట నీ యిష్టము నీ భార్య యిష్టము. మీరిద్దఱు నాలోచించుకొని మీ యిష్టమువచ్చినట్లు చేయవచ్చును.

విక్ర—నాభార్యా! మీ రిప్పు డన్నమాట భార్యయని కాదుగదా?

వీర—అదే. నీభార్యయనియే నే నన్నాను. ఆవిషయమయి యీావఱకు నేను నీతోఁ జెప్పలేదు.

విక్ర—లేదు. ఒక్కమాటయినను జెప్పలేదు.

వీర—ఈవఱకుఁ జెప్పకపోయినను, ఇప్పుడు స్పష్టముగాఁ జెప్పుచున్నాను. నిన్ను స్వతంత్రునిగాఁ జేయఁదలఁచుకొన్నా నని నే నన్నమాట నాయుర్థమదే. భార్య వచ్చుటయే నీకు భాగ్యము పట్టుట. భార్య వచ్చుటవలన నీస్వాతంత్ర్యమునకు భంగమురాదు.

విక్ర—అయ్యా! అయ్యా! మీమాటవలన నాకు మతిభ్రమ కలుగుచున్నది.

వీర—ఓరి బుద్ధిహీనుఁడా! నీకు వెఱ్ఱియెత్తుచున్నదా యేమి? ఇంతకుముందు నీవు కృతజ్ఞతయంతయు నీయందే మూర్తీభవించి నట్లు మాటాడినావే.

విక్ర—నే నట్లే మాటాడినాను. మీ రీవఱకు స్వాతంత్ర్యమనియు భాగ్య మనియు సెలవిచ్చినారు గాని భార్యనుగూర్చి యొక్క మాటయైనను జెప్పలేదు.

వీర—భార్యయని చెప్పుటచేత నిప్పుడు నీభాగ్యమున కేమి నష్టము వచ్చినది? నీకు భాగ్యము వచ్చినప్పుడు దాని కాధారమయిన జీవధన మెట్లు రాకుండును?

విక్రి—నాసౌఖ్యమునకు భంగము వచ్చెడుపక్షమున. నే నెట్టి భాగ్యమునైనను తృణప్రాయముగా నిరాకరించవలసిన దే. నన్ను ధన్యునిగాఁ జేయఁదలఁచుకొన్న యాచిన్నది యెవరు?

వీర—ఆచిన్నది యెవరో నీ కెందుకు? ఆచిన్నది యెవ్వరైనను నీ వా కన్నెను వరించి వెంటనే వివాహ మాడెద నన్నమాట మాత్రము నాతో చెప్పు.

విక్రి—నే నెఱుఁగని కాంతను కామించి వరింపుమని చెప్పుట మీకు ధర్మముకాదు.

వీర—నీ వెఱుఁగని కాంతను వరింప నని నిరాకరించుట నీ కంతకుమును పే ధర్మముకాదు.

విక్ర—అట్లయినపక్షమున మీతో నేనొక్క సంగతి మనవి చేయవలెను. ఈవఱకే నామనస్సు వేఱొక కన్యమీఁద తగిలి యున్నది. నాపాలిటి యీ భాగ్యదేవతను చేపట్టుటకు నాహృదయము కృతనిశ్చయ మయినది.

వీర—ఆనిశ్చయమును మానుకొనుట కేకో సాకు కల్పించుమని నీ హృదయమునకు బోధించు, నీహృదయము మొట్టమొదట కొంత ఖేదపడవచ్చును గాని తరువాత ననివార్య మయిన యాజ్ఞచేత నామెసేవను వదలుకో వలసినదై సమాధాన పడును.—

విక్ర—నే నామెతో నెన్నోశపథములు చేసినాను.

వీర—నీ శపథములకు మాఱుగా నీ భాగ్యదేవతయు నీకంటె నెక్కువశపథములు చేసియుండును గాన, నీ కందువలన వచ్చెడు నష్టము లేదు. కామాతురులు చేసెడు శపథము లెప్పుడును చెల్లింపఁ దగినవి కావు, కాఁబట్టి నీశపథము లామెశపథములలో చెల్లు పెట్టుకొమ్మను.

విక్ర—నే నొక్క విన్నపము చేసెదను. మీరు కోపపడక క్షమించవలెను. ఈయొక్కవిషయములో మాత్రము మీయాజ్ఞను నేను మన్నింపఁజాలను.

వీర—విక్రమా! ఇంతవఱకును నీమాటలు శాంతివహించి విన్నాను. ఇఁక నేను శాంతత వహింపఁజాలను, నామాట కెదు రాడనంతవఱకును నేను శాంతమూర్తిని. నామాట కెదురుచెప్పిన తరువాత నాకు శాంతియు గింతియు నుండదు. నిష్కారణముగా నాకు కోపము తెప్పించఁబోకు.

విక్రి—అయ్యా! ఈవిషయములోమాత్రము మీయాజ్ఞను నేను మన్నింపఁజాలను.

వీర—పో! నాబొందిలో ప్రాణముండఁగా నిన్నిఁక 'విక్రమా' అని పిలిచినపక్షమున, నన్ని పేరునఁ బిలువఁబోకు.

విక్ర—నామనవి చిత్తగింపవలెను.

వీర—ఇఁక నీ మాట వినను. నీనోటినుండివచ్చిన యక్షర మొక్కటి వినను. నేను చెప్పినదాని కొప్పుకొన్నపక్షమున, తల యూఁచు. లేనిపక్షమున—

విక్ర—మొగమైనను చూడకముందె నేను దేనినో కురూపిని గట్టుకొనుట కొప్పుకోనా!

వీర—నోరుమూసికో. పెండ్లికూఁతురు నామనస్సువచ్చినంత కురూపిణిగా నుండనీ. ఆ చిన్నదానికి రెండుభుజములు మీఁదను రెండు. కంతులున్నవనుకో; గడకఱ్ఱలాగున పొడుగుగా నున్ననుకో; కుడికంటిలో కుంకుడుకాయంత కాయ యున్నదనుకో; గడ్డమును మీసములును గలిగి ముడుతలుపడ్డ మురలిచర్మము కలదనుకో. ఇన్ని యవలక్షణము లున్నను నేను వరింపుచున్న చిన్నదానిని నీవు రాత్రిందివములు బట్టువలె పొగడుచు పద్యములుచెప్పి సౌందర్యవర్ణనము చేయవలసినదే.

విక్రి—కుమారుని విషయమై యిట్లు నిర్బంధపెట్టుట తండ్రికి ధర్మముకాదు.

వీర—ఓరిగాడిదా! నీయధికప్రసంగము చాలించు. ఊరక ప్రేలకు.

విక్ర—జన్మమెత్తిన తరువాత నాకింతదుఃఖ మెప్పుడును కలుగలేదు.

వీర—అబద్ధ మాడుచున్నావు, నిజముగా నీమనస్సులో నీవు సంతోషించుచునే యున్నావు. నేను కొంచె మావలికిఁ బోఁగానే నన్ను చూచి పండ్లికిలించి తప్పక నవ్వెదవు. నే నెఱుఁగుదును.

విక్ర—పెద్దలయెడల నెట్లు ప్రవర్తింపవలయునో నే నెఱుఁగుదును.

వీర—అగ్రిపడఁబోకు. కొంచెము శాంతిపడు. నీకోపము గీపము నావద్ద పనికిరాదు.

విక్రి—కోపము లేదు. నాజన్మమధ్యమున నిజముగా నేనింత శాంతత యెప్పుడును వహించి యుండలేదు.

వీర—ఇది శుద్ధాబద్ధము. నీమనస్సులో నీకిప్పుడు కావలసి వంతకోప మున్నది. ఆకోపము నాముందు సాగదు.

విక్ర—దయచేసి నామనవి చిత్తగించవలెను—

వీర—నీమనస్సులో నున్నదంతయు వెడలఁగ్రక్కవలె నను కొనుచున్నావేమి? నావలె కొంచెమునీవు శాంతుఁడవయి యుండ లేవా? కోపమువలన కార్యమేమియు లేదు. ఓరిగాడిదా! ఓరి చండాలుఁడా! కోపమువలన మేలు కలుగునురా ? ఓరిమూర్ఖుఁడా! ఓరినిర్భాగ్యుఁడా! ముగ్ధునివలె మౌనముపూని నీకోపము వెల్లడించు కొనుచున్నావు. నాకు కోపము తెప్పింపఁబోకు. నాశాంతస్వభావ మును జూచి నీవు నిర్భయముగా చెలరేఁగుచున్నావు. నాపరమ శాంతత నీకు లోకువయినది. ఇటువంటిచర్యలవలన పరమశాంతుఁ డయినమహర్షికి సహితము కోపము రాకమానదు. నామాట విను. ఆలోచించుకొనుటకు నీకాఱుగంటలకాలము గడువిచ్చినాను. ఈ గడువులోపల నీవు బుద్ధితెచ్చుకొని మాఱుమాటాడక నేను చెప్పిన దానికెల్ల నొప్పుకొన్నపక్షమున, నేను నిన్ను క్షమించవచ్చును. తొందరపడఁబోకు. నామాటకు సమాధానపడనిపక్షమున, ఇఁక నీవు నాయింట నడుగుపెట్టఁగూడదు. నేను ముందెప్పుడును నీమొగము చూడను. నీపని తీయించివేసెదను. నీకు చిల్లిగవ్వలేకుండ నాసొ త్తితరులకు వ్రాసి యిచ్చెదను. నిన్నీభూమిమీఁద నిలువనియ్యను. నిన్ను సుఖముగా బ్రతుకనిచ్చినయెడల నాపేరు మాఱుపేరు పెట్టు.

(అని వెడలిపోవుచున్నాఁడు.)

విక్ర—ఈయన దొడ్డతండ్రి; పరమశాంతుఁడు. నాయనా! న న్నింతటితో విడిచిపెట్టినందుకు నీకు పదివేలనమస్కారములు. పెండ్లివిషయములో కొడుకునకు బుద్ధిచెప్పుట చక్కగానే యున్నది.

ఎవతెనో పెద్దదానిని ధనవంతురాలిని నా కీయన కట్టిపెట్టఁదలఁచు కొన్నాఁడు. ఈయనమాత్రము చిన్నతనములో నితరవిచారములు మాని యకృత్రిమానురాగముచేత తనమనసు వచ్చినకన్యనే భార్యనుగా కోరి తెచ్చుకొన్నాఁడు! అట్టివాఁడు కన్నకొడుకువిషయములో నన్యథా తలఁచుట వింతగా నున్నది.

[రాముఁడు మరలఁ బ్రవేశించు చున్నాఁడు.]

రాము—అయ్యా! అయ్యా! మీతండ్రిగారు మహాకోపములో వెళ్ళిపోతూవున్నారు. నోట్లోయేమిటో గొనుక్కుంటూ దబదబ మెట్లు దిగి నేను దోవలో అడ్డం వుండేటప్పటికి నానెత్తిమీఁద వక్కచరువు చరిచి కావలిస్తే నీయజమానుడితో చెప్పుకోపొమ్మని. నన్ను తోసుకొని వెళ్ళిపోయినారు. నేనే మీస్థితిలోవుండి నాతండ్రే నామీఁద యిలా కోపపడ్డపక్షానికి, నేనతణ్ని తక్షణం తరిమివేస్తును.

విక్ర—ఈ బ్రాఁగుబోతుప్రసంగముచాలించి నోరుమూసికో. నీవిందుకే వచ్చినావా? మఱి యేదైనపనిమీఁద వచ్చినావా? నా యెదుటనుండి లేచిపో. (అని గెంటి లోపలికిఁ బోవుచున్నాఁడు.)

రాము—సరిసరి! ఇది మరీబాగా వున్నది. ఈయనగారు తన కోపం తండ్రిమీఁద చూపించడానికి చేతఁగాక లోకువయినవాణ్ని నామీఁద చూపిస్తూవున్నారు. వకరు కోపంతెప్పించినప్పుడు ఆకోపం మరివకరిమీఁద చూపడం న్యాయం కాదు. అలాచెయ్యడంచేత—

[ఒకభటుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

భటు—రామా! రామా! నీయజమానుఁడు నిన్ను పిలుస్తూ వున్నాఁడు.

రాము—ఓరిగాడిదా! అలా అరుస్తావేమి? మెల్లిగాపిలిస్తే

నాకు వినబడ దనుకున్నావా యేమిటి? ఇది నీ నీచస్వభావం తెలియ చేస్తున్నది. వట్టినీచ—

భటు—వేగిరం. వేగిరం.

రాము—వేగిర మేమిటి! ఓరిగాడిదా! నీవుకూడా నన్నాజ్ఞాపించడమేనా ? ఓపొగరు మోతుమొండి—(అని భటుని గొట్టుచు వెడలిపోవుచున్నాఁడు.)

---

౨. రంగము—ఉత్తరపువీధి.

---

[మంథర ప్రవేశించు చున్నది.]

మంథ—సరి! నాయజమానురాలి కిప్పుడు విక్రమసేనుఁడని మరివకవరుఁడుకూడా వచ్చినాఁడు. సొమ్ము నాచేతిలో పడితే నేగానివట్టిపొడిమాటలతో నే నతనికి ప్రత్త్యుత్తరాలను జేర వెయ్యను. పాపము! మాదా మోదరవర్మకు తిలోదకాలు చెప్పి సాగనంపినారు. విజయపాలుఁడు యీవూళ్ళోనే వున్నాఁడని చెప్పి. అతనికి నేను చెయ్యవలసినఆఖరుపని చేసివేసినాను. తాను రాధాదేవి అని భ్రమపడుతూవున్నతనప్రియురాలివద్దనుంచి వచ్చేవుత్తరాలు పుచ్చుకోవడానికి పురుషోత్తమదేవుఁడుగారు సరిగా వేళకు యిక్కడ వుండకుండా వుండేవారుకారు. తనప్రియురాలు చిన్నావిడె గాదు పెద్దావిడే అనీ, ఆవిడకు నలభయియేళ్ళువుంటవనీ తెలియచెప్పివేస్తేనాకు వచ్చేలాభం పోతుందని నేను యెరిగినదాన్ని అయినా, యిలా పెద్దమనిషిని మోసం చేస్తూ వుండడంచేత నామనస్సు నన్ను బాధిస్తూ వున్నది.

[పురుషోత్తమ దేవుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పురు—ఓదూతీ! నాప్రాణములు నిలిపెడు దేవదూతిక యింకను రాలేదని నీ నిమిత్తమే నే నెదురుచూచు చున్నాను. గడియసేపటినుండి నే నీవీధియొక్క దక్షిణపుకోన నున్నాను.

మంథ—ఓయి దేవుడా! ఉత్తరపుకోనను మీ నిమిత్తం నే నెదురు చూస్తూ వున్నాను.

పురు—అందుచేతనే కాఁబోలును నీవు నాకు కనఁబడలేదు. నీ వా వైపునుండి వచ్చునప్పుడు నన్ను దాటిపోకుండ నిన్ను పిలిచి పలుకరించుటకే నేను బట్టలకొట్టులో వీధి కెదురుగా నున్న కిటికీలో కూరుచుండి మరి నిద్రపోయినాను.

మంథ—అలాగైతే మీరు నిద్రపోతూవున్న సమయంలో మీదగ్గరనుంచే నేను వెళ్ళివుంటాను.

పురు—అయి యుండును. ఇంత ప్రొద్దెక్కిన దని నిద్రలేచు వఱకును కలలోనైనను నే ననుకోలేదు. మంథరా! నీవు నా కేమియుఁ దీసికొని రాలేదా?

మంథ—యెందుకు తేకుండా వుంటాను? తెచ్చినాను. ఉత్తరం తెచ్చి నా రవికెలో పెట్టుకొన్నాను.

పురు—నీ వెప్పుడును వట్టిచేతులతో రావని నే నీవఱకే యూహచేసినాను. ఏదీ? నా ప్రాణేశ్వరి యేమివ్రాసినదో చూడనీ.

మంథ—ఇదిగో! (అని యుత్తరముతీసి యిచ్చుచున్నది.)

పురు—(చదువుచున్నాఁడు) "ఓ హృదయప్రియా! ఒక నొకప్పుడు మోహవిషయములో నాకస్మికముగా నొకవింత యనురాగము పుట్టి, సంవత్సరముల కొలఁది స్నేహము చేసినవారిలోకఁ కెను ఘనమైన యనుబంధమును కలిగించు చుండును. పురుషోత్తమ

దేవుఁడుగారి ప్రథమసందర్శన సమయమునందే నామనస్సులో నటువంటి గాఢానురాగ ముదయించినది"—మేలు మేలు!—"లజ్జాశీలయైన యువతి యింతకంటె నెక్కువ చెప్పరాదు. అయినను నే నింకొక్కమాట చెప్పెదను. పురుషోత్తమ దేవుఁడుగారు నేను తమ దాస్యమున కర్హురాల నని భావించిన యెడల నేను ధన్యురాల నగుదును. ఇట్లు మీ పాదసేవకురాలు—రాధ."

మంథరా! నీయజమానురాలు భాషయందు మహావిద్వాంసురాలుగా నున్నదే! ఏమి యీపాండిత్యము! ఏమి యీవాగ్ధార!

మంథ—ఆమెకువున్న లోకానుభవానికి యిదివకమహాశ్చర్యం.

పురు—ఏమి! పదునేడేండ్లకే యింత లోకానుభవమా!

మంథ—నిజంగానే ఆవిడకు కావలసినంత లోకానుభవం వున్నవి. ఆవిడ యెన్నో గ్రంథాలు చదివింది.

పురు—ఈప్రకారముగా వ్రాయఁగలుగుట కామె బహు గ్రంథములు చదివి యుండవలెను.

మంథ—వ్రాతకేమి ? మీవిషయంలో ఆవిడ యేలాగు చెపుతూవుంటుందో మీరు వింటేనా!

పురు—ప్రాణ మిచ్చి యాదరించుటలో నావంటి మంచిభర్త లోకములో తనకు మఱియొకఁడు దొరకఁబోడని నీ దేవితో చెప్పుము. అయినను మనము సర్వమును యథావిధిగా చేయవలెను గనుక, ముందుగా వివాహమునకు పెద్దాబిడ సమ్మతి పొందవలెను.

మంథ—పెద్దావిడ వప్పుదల కోరడంచూస్తే, యీ వివాహం వల్ల ధనవంతులు కావడం మీకోరికయునట్టు నే ననుకుంటూను.

పురు—ఓదూతీ! నా యుద్దేశమును నీవు చక్కగా గ్రహించి నావు. నేను బీదవాఁడ నగుటచేత, నే నయోగ్యకార్యమునకు లోఁబడఁజాలను. నాకు ధనమే యక్కఱలేని పక్షమున, నీ యజమానురాలిని తద్ధనమునుగూడ నేనుదొంగతనముగా నే(గ్రహించియుందును. నేను ధనికుఁడను కాకపోయినను లోభిని కాను. ఇదిగో! ఈరూపాయి పుచ్చుకొని నీవు చీర కొని కట్టుకో. పో.

(అని చేతఁ బెట్టుచున్నాఁడు.)

మంథ—మీరు మహాదొడ్డవారు. మీవంటి దాతను నేను యిదివరకు యెక్కడా చూడలేదు. మీవద్ద సొమ్ము పుచ్చుకున్నానంటే అమ్మగారు కోపపడుతా రేమో!

పురు—పయి కనకపోయినను ధనమిచ్చువారియందు స్త్రీలకు లోపల బహుసంతోషము. నీ యజమానురా లడిగినపక్షమున, ఒక రూపాయికాదు నీకు నేను పదిరూపాయ లిచ్చితినని చెప్పు.

మంథ—ఇయ్యనిదే అబద్ధంకూడా చెప్పనా? పాపం కాదూ! ఏ మయినా యివ్వండి. ఆలాగే చెపుతాను.

పురు—మా వివాహ మయినతరువాత నిది నిజ మగునట్లే చేసెదనులే పో. (అని పోవుచున్నాఁడు.)

[రాముఁడు ప్రవేశించు చున్నాఁడు]

రాము—అమ్మా! నన్ను క్షమించవలెను.

మంథ—రామా! యిక్కడకు యెందుకు వచ్చినావను కున్నావు? చీర కొనుక్కోవడానికి—

రాము—నీమాయవేషాలు కొంచెంసేపు కట్టిపెట్టి నాతో నిజం చెప్పు. ఇక్కడయెవరూ లేరులే. నీవు మమ్మల్ని మోసం చేస్తూవున్నావు. నీగుట్టు నేను కనిపెట్టినాను. పురుషోత్తమదేవుడి

గారిచేతికి నీవు వుత్తరం యిస్తూవుండగా నేను కళ్ళారాచూచినాను. నీవు యిలాగు వుత్తరాలు జేరవేస్తూవున్నావుగా? యీసంగతి నేను మాప్రభువుగారితో తప్పకుండా చెపుతాను. ఆయన వూనుకుంటే యీయనపని నేను పట్టిస్తాను.

మంథ—ఓరి తెలివితక్కువవాడా! యేమనుకున్నావు? ఆహాహాహా! ఓరి బుద్ధిహీనుడా! యీవుత్తరం సుభద్రమ్మగారు వ్రాసింది రా. ఆవిడగారు యితణ్ని మోహించి వుత్తరప్రత్యుత్తరాలు జరుపుతూవున్నది.

రాము—ఆహా! యేమివింతలు వినబడుతూవున్నవి! ఆవిడె గుమ్మంవద్దనుంచి నేను యీాభై మాళ్లు నడిచినాను. నాకుయీసంగతి వొక్కమాటూ తెలిసిందికాదూ!—మంచిది చిన్నావిడె యేమంటూవున్నది? నాయజమానుడికి యేమయినాసమాచారం పంపిందా?

మంథ—ఏమి సమాచారం? ఆవిడమనస్సు తిన్నగా లేదు. ఇప్పుడు మీవిజయపాలుడికి పులిమీాద పుట్రలాగు దామోదరవర్మ కంటె పెద్దపోటీదారు వచ్చినాడు. వీరసేనుడుగారు తనకొడుకుకోసం ప్రయత్నం చేస్తూవున్నారు.

రాము—ఏమీా! విక్రమసేనుడిగారికోసమా?

మంథ—అవును. ఆయనకోసమే. ఇదంతా నేను పొంచుండి విన్నాను.

రాము—ఆహాహాహా! మంథరా! ఈశుభవార్తతీసుకుని నేను వేగిరం వెళ్ళిపోవలెను.

మంథ—నీవు నవ్వితేనవ్వు. నేను చెప్పినమాటమాత్రంనిజం. నేను ప్రమాణం చేసి చెపుతాను. (పోవుచు) రామా! యిందువల్ల అధైర్యపడవద్దని నీయజమానుడితో చెప్పు.

రాము—నాయజమానుడి కధైర్యం యెప్పుడూ లేదు.

మంథ—యీ విషయము విక్రమసేనుడితో పోట్లాడ తలంచుకోవద్దని చెప్పు.

రాము—ఆవిషయమై నీవు భయపడవలసినపని లేదు. ఆపని యెప్పుడూ జరగదు.

మంథ—ఇది నీకు నిశ్చయమేనా? విచారం మాని ధైర్యం తెచ్చుకోవలసిన దని చెప్పు.

రాము—మాకిక కావలసినంత ధైర్యం.

(ఇద్దఱును వేఱువేఱుగా వెడలిపోవు చున్నారు.)

---

## తృతీయాంకము.

౧. రంగము—[illegible]

[విక్రమసేనుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

విక్ర—రాము డిప్పుడు చెప్పినమాట నిశ్చయమే యయి యుండును. ఇదంతయు వింతగానున్నది. ఏమీ! నాతో పాఱిపోయి రాఁదలచుకొని యున్నచిన్నదానినే వివాహము చేసికొమ్మని నన్ను మాతండ్రి బలవంతపెట్టఁ గోరుచున్నాఁడు. ఇంకను గొంతకాలము వఱకును నాకున్నసంబంధము మఱిఁ జెఱుగఁగూడదు. ఇటువంటివిషయములలో నతఁడు వ్యవహారము చక్కఁబెట్టువిధము చూడఁగా మహా నిరంకుశముగా కనబడుచున్నది. కానిమ్ము. నేనుమాత్రము వెంటనే నానిశ్చయమును త్రిప్పుకొని యతనియొద్ద నాసమ్మతిని తెలుపవలెను. అత్యాకస్మికముగా నామతి మార్చుకొన్నట్లాతని కొకవేళ తోఁచ

వచ్చును. అయినను నాహృదయము యొక్క మార్పు కృత్రిమమయినది కాదని నేనాతనికి నమ్మకము పుట్టించఁగలను. ఓహో! ఆయనే యిక్కడకు వచ్చుచున్నాఁడు! కోపముచేత ఆయనముఖ మెంత క్రూరముగాఁ గనఁబడుచున్నది! (అని ప్రక్కకుఁ దొలఁగుచున్నాఁడు.)

[వీరసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వీర — ఈ ప్రాణములతో నేను వానిని క్షమింపను. ఇటువంటి యవమానము జరిగినతరువాత నేను భూమిమీఁద బ్రతుకను. ఏమన్నాను! బ్రతుకనన్నానా? కాదు వానిని బాధపెట్టుటకయి యేఁబది యేండ్లయినను నేను తప్పక బ్రతికెదను. ఇందాఁక వాఁడు చూపిన యవిధేయతవలన నామతి చెడినది. వాఁడు కేవల మహంకార మూర్ఖ స్వేచ్ఛావిహారశీలుఁడు. ఈ యవినయ మంతయు వాని కెట్లు వచ్చినది? ఇది యంతయు నేను వానిని తక్కిన యందఱికొడుకుల కంటెను కూఁతులకంటెను ముందుగా కన్నందువలనను జీతము గాక సంవత్సరమున కేఁబదిరూపాయలు లధికముగా పంపుచున్నందువలనను గలిగిన ఫలము. ఇఁక వానికిని నాకును ఋణము చెల్లినది. నాకు కానివాఁడు నాకొడుకే కాఁడు. ఇఁక నేను వానిముఖము చూడను. చూడను. ఎన్నఁడును చూడను.

విక్ర — (ముందునకువచ్చి తనలో) పశ్చాత్తాపపడుచున్నవాని వలె దీనముఖము పెట్టవలెను.

వీర — ఓ నిర్భాగ్యుఁడా! నా కంటఁబడక దూరముగా తొలఁగిపో.

విక్ర — అయ్యా! పశ్చాత్తప్తుఁడయిన కుమారుఁడు మీ ముందు నిలువఁబడినాఁడు.

వీర—నాముందు బుద్ధిమాలిన క్రూరుఁడు నిలువఁబడినాఁడు.

విక్ర—నేను నిజముగా నే పశ్చాత్తప్తుఁడ నయినాను. చేసిన యపచారము నొప్పుకొని తమ చిత్తవృత్తికి లోఁబడ వలె నని నేను వచ్చినాను.

వీర—ఏమిరా?

విక్ర—ఈవఱకు తమరు నావిషయమునఁ గనఁబఱిచిన మంచితనమును దయను పుత్రవాత్సల్యమును చింతించి తలపోసి యాలోచించుకొని బుద్ధి తెచ్చుకొను చున్నాను.

వీర—మంచిది. తరువాత?

విక్ర—అంతేకాక తమరు సెలవిచ్చిన సుతధర్మమునుగూర్చియు విధేయతను గూర్చియు పితృస్వాతంత్ర్యమును గూర్చియుఁ గూడ పదింబదిగ నాలోచించుకొని కర్తవ్యవిచారము చేసికొను చున్నాను.

వీర—ఓరి వెఱ్ఱికుఱ్ఱవాఁడా! ఆపయిని?

విక్ర—నా యాలోచనయొక్క పర్యవసానము తమసంతుష్టి నిమిత్తమయి నాయిష్టములను మఱచి సమస్తవిషయములలోను తమకు భృత్యుఁడనయి నడుచుకోవలెనని నిశ్చయము చేసికొన్నాను.

వీర—ఇప్పుడు నీవు కొంచెము తెలివిగలమాట లాడు చున్నావు. నీవాడిన మాటలలో తెలివిమాలిన మాట యేదియు లేదు. ఇంతకంటె తెలవిగల మాటలు నీ వింతకుముం దెప్పుడును నాముందు పలికి యుండలేదు. నీ విప్పుడు మరల నా కొడుకు విక్రముఁడ వయినావు.

విక్ర—తమ యనుగ్రహమునకు పాత్రుఁడ నగుటచేత నేను కృతార్థుఁడ నయినాను.

వీర—నాప్రాణమా! నాముద్దుకుఱ్ఱా! నిజముగా ఆచిన్నది యెవరో నీ కిప్పుడు చెప్పెదను. నీమూర్ఖత్వమును కోపమును జూచి నే నప్పుడు నీతోఁ జెప్పలేదు. విని నీవిప్పు డత్యుత్ప్రమోదముల పాలు కావచ్చును. కళావతివిషయములో నీయభిప్రాయ మేమి?

విక్రి—ఎక్కడి కళావతి? భీమవరములో నుండెడుకళావతి కాదా?

వీర—భీమవరమా! ఎక్కడిభీమవరము? కాదు. సుభద్రమ్మను, ఆమె మేనకోడలు కళావతిని నీ వెన్నఁడును జూడనే లేదా? నీవుపనిలోఁ బ్రవేశించి వెళ్ళిన తరువాత వారు మనయింటి కొకపర్యాయము వచ్చినారు.

విక్ర—సుభద్రమ్మ! కళావతి! ఈపేరు లెప్పుడును నేను విన్నట్టేజ్ఞప్తి లేదు. ఇప్పుడు కొంచెము నాకు స్మరణకు వచ్చుచున్నది. అవునవును. ఆచిన్నదానిది మెల్లకన్ను. అవునా? కొంచెము రాగి వెంట్రుకలు.

వీర—మెల్లకన్నా రాగివెంట్రుకలా? ఎంతమాత్రమునుగావు.

విక్ర—అట్లయినపక్షమున నేనే మఱచిపోయి యుందును. ఆచిన్నది నేను చూచినచిన్నది కాదు.

వీర—విక్రమా! ఆచిన్నదానిసౌందర్య మేమని చెప్పను! ఆయువతీమణి రెండవ రతీదేవి. పదునాలుసంవత్సరములు దాఁటి పూర్ణ చంద్రబింబమువలె కళావతి యిప్పుడు పదునేడవయేట నిండు యౌవనవతియై యున్నది.

విక్ర—ఆవిషయమయి నా కంత చింతలేదు. మీమనస్సును సంతోషపెట్టుట యొక్కటియే నాకు కావలెను గాని నాకితరములో దేనితోను పని లేదు.

వీర—విక్రమా! అది సత్యమే కాని, ఆచిన్నదిమాత్రము కేవల సమ్మోహనమంత్రాధి దేవతసుమా! ఆమె కన్నులలో లక్ష్మీ కాపురమున్నది. ఆమె కటాక్ష ప్రసారము కొంచెము తగిలెనా, తమజపతపములు చాలించి మౌనికాంతు లయినను దాసు లయి పాదాక్రాంతులు కావలసినదే. ఆహా! ఆ నవ్వుమొగము! ఏమి యాచెక్కుటద్దముల ధాళధళ్యము!

విక్ర—(తనలో) ఇది సత్యము. వృద్ధుఁడయినను, ఇతఁడు సరిగా వర్ణించినాఁడు,

వీర—విక్రమా! ఏమి యామె మల్లెమొగ్గలఁబోలు పలు వరుస!

విక్ర—వర్ణనాంశము చాలును. వారిలో నేనిప్పుడు వరిం పవలసినది మేనత్తనా? మేనకోడలినా?

వీర—ఓరి నిర్భాగ్యుఁడా! నీమనస్సు రాయివలె నున్న దేమి? నాచిన్నతనములో నీవయస్సున నా కిటువంటివర్ణన చెవులఁ బడిన పక్షమున, ఆకాశబాణమువలె పైకెగిరి గంతులు వేసెడి వాఁడను. నీ విప్పుడు కదలనే కదలకున్నావు. మేనత్తనా? ఓరిబుద్ధిహీనుఁడా! నీ తల్లిని నేను లేవఁదీసికొని వచ్చి వరించినసంగతి నీవు విన్నావా లేదా? నాకు చక్రవర్తిత్వము వచ్చినను, నేనయినపక్షమున వయసు జాఱినదానివారన నాకు సోఁకనీయను.

విక్ర—మీ తండ్రిగారిని సంతోషపెట్టుట కయినను, ఆపని చేయరా?

వీర—మాతండ్రిగారిని సంతోషపెట్టుటకా? లోకములో నెవరిని సంతోషపెట్టుటకును నేను చేయను—ఏమన్నావు? మా తండ్రిగారినా! అవునవును. మఱచి పోయినాను. నాతండ్రిగారు

చెప్పినపక్షమున— అది వేరేసంగతి— విక్రమా! ఆయన నావలె కోడుకునకు చన విచ్చెడివాఁడు కాఁడుసుమా!

విక్ర— కాఁడు నిశ్చయము మే.

వీర— విక్రమా! నీభార్య చక్కనిదైనందుకు నీకు విచారము లేదుగదా!

విక్ర— నేనాసంగతి యీవఱకే చెప్పినాను. ఈవిషయములో నాకు కావలసినదెల్లను మిమ్ముసంతోషపెట్టుట యొక్కటియే. మీ కిష్టమయినయెడల చక్కనిదన్న హేతువుచేత నే నేచిన్నదానిని నిరాకరింపను. ఇందాఁక మీరు కంతులని, కాయకన్నని నావధువునం దిటువంటివే మఱికొన్ని శుభలక్షణములనుగూడ వర్ణించియున్నారు. లోకసామాన్యముగా మీ రభివర్ణించినయువగుణములు లేనికన్యను వరించుటయే నాయభిమతమయినను, తమచిత్తానుసారముగా కన్నులందుకాయలుమాత్రమే కాక పువ్వులున్నచిన్నదానిని వరింపుమన్నను నేను వరింపవలసినవాఁడనే.

వీర— ఏమి యీపితృభక్తి! నీ నీతివాక్యము లింతటితో చాలించు. ఆచిన్నదానిసౌందర్యము తలఁచుకొనఁగానే యిప్పుడు నాకే యాచిన్నదానిని వరింపవలె నన్నబుద్ధి పుట్టుచున్నది.

విక్ర— తమయిష్టానుసారముగానే జరగవచ్చును. కళావతిని మీరే వరింపఁదలచుకొన్నయెడల, అప్పుడు నేనామెమేనత్తను వరించుట తమయభిమతమయి యుండవచ్చును. లేదా మీరింతలో మీయభిప్రాయము మార్చుకొని పెద్దామెనే చేపట్టఁ దలఁచుకొన్నయెడల, అప్పుడు చిన్నామెనే నేను వరించుట తమయిష్టము కావచ్చును. మేనత్తయైనను, మేనకోడలయినను, నాకెవ్వరైనను భేదము లేదు. తమయిష్ట మేదో యదే జరగవచ్చును.

వీర — ఓరిదొంగా! నీవిప్పుడిచ్చకములకయి మాయమాటలాడుచున్నావు. నీవిప్పుడాడెడుమాటలు మనఃపూర్వకములైనవి కావు. నీమొగము చూడఁగానే నీవబద్ధము లాడుచున్నట్లు నాకు పొడకట్టుచున్నది. నీదొంగవేషములు నావద్ద పనికిరావు. విక్రమా! నిజ మొప్పుకో.

విక్రమ — నా పితృభక్తియు విధేయతను మీ మనస్సునకు మఱియొకవిధముగా తోఁచినందుకు నాకు విచారము—

వీర — చాలు. నీ పితృభక్తియు గిక్తియు తుంగలో నూరఁదొక్కు. నీమాయమాటలు కట్టిపెట్టి నీవు నా వెంటరా. సుభద్రమ్మపేర చీటి వ్రాసి నీచేతికిచ్చెదను. నీవిప్పుడే పోయి యా చిన్నదానిని చూడ వచ్చును. ఆ భూలోకదేవతయొక్క దివ్యసుందర విగ్రహమును జూచినప్పుడు నీకన్నులు మిఱుమిట్లుగొనక మానవు. ఆ మెముఖసందర్శనముచేత వలపువెఱ్ఱి తలకెక్కి యద్భుతప్రమోదములతో మోహపరవశుఁడవయి నీవు నావద్దకు పరుగెత్తుకొని రాకపోయిన పక్షమున, నన్ని పేరునఁ బిలువఁబోకు. అప్పుడును నీవుదాసీనతనే కనఁబఱిచినయెడల నీకుమారి వేసి యా చిన్నదానిని నేనే పెండ్లి చేసికొనెదను. (అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

---

౨. రంగము — చారుమతియొక్క గది.



[దర్పసారుఁడొంటిగా బ్రవేశించుచున్నాఁడు.]

దర్ప — చారుమతి యిప్పుడే వచ్చునని చెప్పినారు. ఆమె యింకను రాలేదు. నేను స్వస్థచిత్తుఁడనయి యాలోచించుకొన్నప్పుడు

చంచలమైన నాయసంతుష్టస్వభావము నాకే నీచముగాఁ గనఁబడుచున్నది. అయినను నా కీయొక్కదానిమీఁదఁ దక్క మఱి దేనిమీఁదను ధ్యానము పాఱకున్నది. ప్రాణాధికురాలయిన యామెయే నాకు లోకముగా నున్నది. నే నెందుచేతనో నిష్కారణముగా కొఱ కొఱలాడుచు నున్మత్తునివలె చంచలచిత్తుఁడనై యున్నాను. నా తప్పిదము నాకు స్పష్టముగా కనబడుచున్నను దిద్దుకొనుటకు శక్తుడను గాకున్నాను. మే మిద్దఱమును సమావేశ మయినప్పుడామె కన్నులయం దెట్టి యవ్యాజప్రేమమును అకృత్రిమానందమును గనఁబడినవి! ఆమె చూపిన యాదరము మనస్సు నెంత కరఁగించినది! మూఢు మొగమును బెట్టుకొని యామెను నిందింపవలె నన్న నిశ్చయముతోనే నేను వచ్చినను, ఆమెప్రసన్నముఖమును జూడఁగానే యట్లగపడుటకు నాకే సిగ్గు వేసినది. వీరసేనుఁడుగా రెదుటనుండుటచేత నేననఁదలఁచుకొని వచ్చినమాటలనుసహిత మనలేకపోయినాను. అయినను నన్నెడఁబాసి యున్నప్పుడామె నేననుకొన్నంత సంతోషముగా లే దన్నవార్తను తెలిసికొని నామనస్సును తృప్తిపఱచుకోవలెను. అదిగో! ఆమె వచ్చుచున్నట్లున్నది. అవును! దర్పసారుఁడు తనరాకకు వేచి నిమిషములులెక్కపెట్టుచుఁ గూరుచున్నప్పు డెంత మందగమనముతో వచ్చుచున్నదో!

[చారుమతి ప్రవేశించుచున్నది.]

చారు—ఇంతశీఘ్రముగా మీరు మరల వత్తురని నే ననుకోలేదు.

దర్ప—ఓ చారుమతీ! మనప్రథమసమావేశసమయమునందే యథేచ్ఛముగా మాటాడుకొనుటకు ప్రతిబంధకముగా పానకముతో

పుడకవలె మతిరెయొకరు నిలిచియున్నప్పుడు. నేనొక్క సందర్శనముతో తృప్తి నొంది యుండగలుగుదునా?

చారు—ఓ దర్పసారా! నీ విప్పుడు చూపుచున్నయనుగ్రహము నన్నపారసంతోషసాగరమునందుఁ దేల్చుచున్నప్పుడు, ప్రథమ సందర్శనసమయమునందు నీవు చూపితి వనుకొన్నయనాదరమును గూర్చి నేను ప్రస్తావించుట యుచితము కాదు.

దర్ప—చారుమతీ! అది కేవలభ్రమ! నీ వప్పుడు మతిభ్రమ పడినావు. నీవటువంటి యారోగ్యదశలో నుండుటచేత నేను పరమానందభరితుఁడ నయినాను. నే ననాదరముచూపుట కేదియు కారణము లేదు.

చారు—అయినను నీ వేదో మనస్సులో విచారము పెట్టుకొన్నట్టు నాకు స్ఫురించినది. అది యేదో నీవు నాయొద్ద దాఁచఁ గూడదు.

దర్ప—ఇఁక నామనస్సులో నున్నది నీకు చెప్పివేసెదను. నీ క్షేమవార్తలు మొదలయినవి మీపొరిగింటివాఁడైన దామోదరవర్మవలన విన్నప్పుడు, మీయూరిలో నున్నప్పటి నీయుత్సాహమును గూర్చియు నీసంతోషమునుగూర్చియు నీమాటలనుగూర్చియు నీపాటలనుగూర్చియు నతఁడు వర్ణించినదానినిబట్టి నామనస్సునకు కొంచె మాయాసము తోఁచినది. నీవు న న్నెడఁబాసి యున్నప్పుడు నేను నవ్వుచు త్రుళ్ళుచు వేడుక లనుభవించుట ద్రోహముగాఁ దలఁచెడు స్వభావము గలవాఁడ నగుటచేత నాకట్లు తోఁచినది. కాముకీకాముకులొండొరుల నెడఁబాయునప్పుడు కన్నుగొలుకులనుండి పుట్టి చెక్కుల జాలువాఱు కన్నీటికాలువ లొకపట్టున నింకిపోవునవి కాక స్థిరముగా నుండునవి యైనందున, వారు పునస్సమావేశముచేత వానిని తుడిచి

వేయఁగలుఁ వఱకును వారి మొగములయందు మందహాసాంకురము లుదయించవుగదా?

చారు—ఇటువంటి యల్పాంశములను పెద్దచేసి నాప్రాణేశ్వ రుఁడు దర్పసారుఁడు నన్ను బాధించుచుండుట యెల్లకాలమునువహాన కరయేయుండునా? చిరకాలపరీక్షితమైన మనోవల్లభ యొక్క దృఢాను రాగమునకంటెను నీహృదయములో మృగప్రాయుఁడైనయాకుత్సిత పురుషునియొక్క వ్యర్థాలాపము లేయెక్కువ గౌరవనీయము లయినవా!

దర్ప—లేదు లేదు. చారుమతీ! నా కాతనిమాటల యం దెంత మాత్రమును గౌరవము లేదు. నీవట్లుండినందుకు నాకు సంతోషము గానే యున్నది. అయినను నీవప్పు డతఁడు చెప్పినంతహృదయోత్సా హముతో పాటలు పాడలేదని చెప్పితివేని నేను తృప్తి నొందెదను. ఆ వినోదసమయమునందు నీవునీదర్పసారుని మఱచిపోలేదనిమాత్రము చెప్పు. చాలును.

చారు—నీవు దూరముగా నున్నప్పుడు నే నెప్పుడునుసంతో షముపొందఁజాలను. దర్పసారునికి నాయెడఁగల యనురాగవిషయ మయి నాకణుమాత్రమును సంశయము లేనందున, నేను పయికి నవ్వు మొగముతో నుల్లాసముగా నున్నట్లు కనఁబడుదును. నే నెప్పు డయిన విచారగ్రస్తురాల నయి యున్నట్లుకనఁబడినపక్షమున, అసూ యాపరులు తమలోసంతోషించి తన్నువిడిచి దుఃఖములపాలు చేసెడి గుణవంతునినమ్మి యీయామె తనహృదయము నాతనివశము చేసె నని నావిషయమయి చెప్పకొనునట్లు చేయుటకో అకేకాని వేఱుకారణము చేతఁగాదు. దర్పసారా! నిన్నుదూషించుట కయి చెప్పను. నామాట నమ్ము. ఎవరియొక్కయనాదరమువలన నాకు మనస్తాపము కలిగినదో నాచెలికత్తెలు గ్రహించి పోదురేమో యని నేను నిశ్చయముగా

లోపల దుఃఖ మున్నప్పుడుసహితము పద్మికి సంతోషమునే యభినయించు చుండును.

దర్ప—నీ వెల్లప్పుడును నా యెదుట నవ్యాజప్రేమ గలభాగ్యదేవతవే. బద్ధానురాగమయిననీవిషయమున సంశయపడినందున నేనే పశుప్రాయుఁడను.

చారు—నీవలనఁ దగినంత కారణము కలుగని దే నాహృదయములో నీమీఁద గలయనురాగము లేశ మయినను తగ్గుట తటస్థించినపక్షమున, లోకములో నావంటిపరిహాసపాత్రురాలును కృతఘ్నురాలును స్త్రీజాతిలో మఱియొకతె యుండఁబోదు.

దర్ప—ఓ చారుమతీ ! నీ వటువంటిమాట యెన్నఁడు ననఁబోకు. కృతఘ్నురా లన్నమాట నామనస్సునకు నొప్పి కలిగించుచున్నది. నీకృతజ్ఞతకు యోగ్యుఁడను గావలసినంతయుపకారము నీకు నే నేదియుఁ జేసి యుండ లేదు. ఆసంగతి చక్కఁగా పరిశీలించినచో నీహృదయమునకే తేటపడవచ్చును. అతికృతజ్ఞతాబుద్ధి గలదానవయిన నీవు నీసౌజన్యాతిశయమునుబట్టి నీహృదయమునందుఁగల నామీఁది ప్రేమకు కృతజ్ఞతయొక కారణమని భ్రమపడుచున్నావు కాఁబోలును!

చారు—కృతజ్ఞతనుబట్టియే కాకపోయినపక్షమున నీయందలి యేగుణాతిశయమునుబట్టి నీమీఁద నా కనురాగము కలుగవలసినది?

దర్ప—ఏగుణాతిశయమునుబట్టియుఁ గాదు, బుద్ధివిశేషమును బట్టిగాని నీతివిశేషమునుబట్టిగాని నన్ను నీవు ప్రేమించుట నాకు గారవావహము. ఇఁక శరీరసౌందర్య మందువేమో, నాశరీరములోని యేయంగసౌష్ఠవమునుబట్టియు నీప్రేమలో లేశభాగమును నామీఁద నిలువఁగూడదని నీకుఁ జూపుటకయి నేనంగవైకల్యము చేసికొని

కురూపి నగుదునా యని నాలోనాతో నేను పలుమారులు కోయుకొనుచుందును.

చారు—ఈశ్వరుఁడే దేవరవారికైన నొక్క దేహసౌందర్యమును మాత్రమే యనుగ్రహించినపక్షమున, తన విషయమై పరిహాసాస్పద మయిన నేరపాటు జరిగిన దనియట్టివాఁడు చింతిల్లవలసి యున్నది. అట్టి వ్యర్థ మయిన శరీరసౌందర్యమునందు నీకంటెఁ గొంచె మధికు లని చెప్పవచ్చిన వారిని నేను గొందఱిని జూచి యున్నా ననుకొనెదను. అయినను నీవారట్టివా రగుదురా కారా యనుప్రశ్నమాత్రము నా హృదయ మెప్పుడును నాకన్నుల నడిగి యుండలేదు.

దర్ప—ఓ చారుమతీ! ఈవిషయములో నీచర్య నా మనస్సునకు సరిపడి యుండలేదు. పురుషులయందు శరీరసౌందర్యమన్న నాకు పరమ ద్వేషము. నే ననుకొన్నంత యనురాగము నీకు నా మీఁద నుండినపక్షమున, నే నష్టావక్రునివంటి కురూపి నయినను నీవు వేఱొకపురుషుని రూపవంతునిగా భావించియుండవు.

చారు—నీవు న న్నానాదరము చేయవలె నని నిశ్చయించుకొని వచ్చినట్లు కనఁబడుచున్నది. శోచనీయులయిన మాతండ్రిగారు మనల నిద్దఱిని బద్ధులనుజేసి పోయిన యాజ్ఞాబలము చూచుకొని వరులు తమ ప్రియురాండ్రయెడలఁ జూపవలసిన స్వాతంత్ర్యముల నతిక్రమించి నీవు న న్నట్లు చులకన చేయుచున్నావు.

దర్ప—చారుమతీ! నీవిప్పుడు నాసందేహము బలపడి వృద్ధి యగుటకుఁ దగినట్లుగా మాటాడుచున్నావు. నే నధికస్వతంత్రుఁడ నయినపక్షమున—అక్కఱలేదు. ఎప్పుడును తదాజ్ఞాబద్ధుఁడనయి యుండుటయే నాకు పరమసమ్మతము. అయినను—ఒకవేళ నీ తండ్రిగారి యాజ్ఞయందు నీకుఁగల యధికగౌరవమే నీ యిచ్ఛ నిట్లు

నిర్బంధించి యున్నదికాఁబోలును! అది లేకపోయినయెడల నీమనస్సు నాకంటె నర్హతరుఁ డయినవానిని గోరియుండును. నీ వాంఛలయందును వాగ్దానములయందును నీ కట్టి నిర్బంధమే యుండియుండనిపక్షమున, నే నెల్లప్పుడును నీ స్థిరమయిన ప్రేమ కాస్పదుఁడనై యుందునన్న యంశమునందు నే నెట్లు నిశ్చయము కలిగియుండఁగలను?

చారు—అట్లయినపక్షమున నన్ను నేఁటినుండియు శోధించి చూడుము. వెనుకటి దంతయు మఱచిపోయి యేనిర్బంధమును లేక మనము క్రొత్తవారివలె నగుదుము. నా హృదయము మాత్రము తా నెక్కువ స్వాతంత్ర్యమును పొందినట్లు భావింపకున్నది.

దర్ప—అదిగో! అదిగో! చారుమతీ! ఇంత వేగిరపాటు గూడదు. నీవు నీ నిర్బంధమును వదలుకొనుట కెంతతొందర పడుచున్నావు! నీకు నాపయిని గల యనురాగ మవ్యాజ మయి దృఢమయిన దయినయెడల, నే నొక వేళఁ గోరినను నీమనస్సునుండి యది తన పట్టువిడిచి తొలఁగదు.

చారు—ఓదర్పసారా! నీవు నా మనస్సునకు దుర్భర వేదనను కలిగించుచున్నావు. నే నది సహింపలేను.

దర్ప—నీమనస్సునకు నొప్పి కలిగించుట నా యుద్దేశము కాదు. నీ మీఁద నాకింత ప్రేమ లేకుండినపక్షమున, నే నెప్పుడు నణుమాత్రమును నీ కాయాసము కలుగఁజేసి యుండును. నే నొక్క మాట చెప్పెదను విను. నాకు కలిగిన సందేహముల కెల్లను మూల కారణమిది—స్త్రీ లెప్పుడును తమ ప్రేమకుఁగల కారణములను చక్కగా యోచించుకొని వానివాని గుణగౌరవమును నిర్ణయించుకొన నలవాటుపడినవారు కారు! పిత్రాజ్ఞవలనఁగాని కృతజ్ఞతవలనఁగాని లాభదృష్టివలనఁ గాని కలిగిన దాక్షిణ్యమును కొన్ని సమయ

ములయందు నిర్మల మయిన హృదయానురాగమును గా భ్రమిం తురు. ఆత్మస్తుతికూడదు. అయినను చెప్పవలసినది చెప్పకోవలెను. వయస్సునుబట్టి కాని రూపమును బట్టికాని గుణములను బట్టికాని యెవ్వరును నన్నాదరము చేయవలసిన యవస్థలో నేను లేను; నా ధనసంపదనుబట్టి చూచినను నన్ను వరించువారు విచారపడవలసిన స్థితిలో నేను లేను. ఇటువంటి లక్షణములు కలవారిమీఁద వలపు ప్రసరించి నప్పుడది యేకారణమునుబట్టి పుట్టెనాయని బుద్ధిమంతులు సందేహపడుట యసహజముకాదు.

చారు—ఈ యెత్తిపొడుపుమాట లేల యనుచున్నావో నేను నిశ్చయముగాఁ జెప్పఁ జాలను. అయినను నన్నవమాన పఱుచుటకయి యీపుల్లకుట్టుమాటలు నీవనుచున్నట్లు నాకు కనఁబడు చున్నందున. నన్నవమాన పఱిచినందున కయి ముందు నీవు పశ్చాత్తాపపడుట కవకాశము కలుగకుండఁ జేసెదను. ఇట్టి యనుమానము కలిగించుటకు నీకు నే నేమియు దోషము చేసి యుండలేదు.

(అని కన్నీరు పెట్టుకొని లేచి పోవుచున్నది.)

దర్ప—ఓ చారుమతీ! కన్నీరు పెట్టుకొనుచు నన్ను విడిచి పోకు. క్షణకాల మిందు నిలువు. అదిగో తలుపుకూడ లోపల వేసికొన్నది! ఓ చారుమతీ! నాప్రాణమా! క్షణకాలముమాత్రమే! లోపల పెద్దపెట్టున నేడ్చుచున్నది! నాప్రాణములు నిలువకున్నవి. ఆమెను నిష్కారణముగా దుఃఖపెట్టినాను. నేను పశుప్రాయుఁడను. కాకు. ఆమె వచ్చుచున్నట్టున్నది. స్త్రీలకు చిత్తస్థైర్య ముండదు. గొన్ని మంచిమాటలు చెప్పఁగానే వా రుబ్బి తబ్బి బ్బగుదురు. ఏదీ! ఆమె రానేలేదు. ఓప్రాణేశ్వరీ! చారుమతీ! ఒక్కసారి వచ్చి నన్ను క్షమించితి నని యొక్క మాటుమాత్రము చెప్పిపో పగ

సాధించుట కిది సమయముకాదు. అదిగో! వచ్చుచున్నట్టున్నది. నన్నుఁ గొంచెమునే పూరక భ్రమపెట్టుట కయి యీ మిషమీఁద లోపలికి పోయినది. నేను మనస్తాపపడఁగా చూచి క్షణకాల మయి నను సహించి యుండఁగలుగునా? నే నామెను లక్ష్యము చేయనట్టు నటింపవలెను. (అని యేదో గీతము పాడుచున్నాఁడు) ఏమి! యింకను రానేలేదు. ఆమె రాఁ దలఁచుకోనేలేదు కాఁబోలును! ఇది కేవల మూర్ఖతగాని చిత్తస్థైర్యముకాదు. అయినను నాకిట్టి ప్రాయశ్చిత్తము కలుగవలసినదే! అంతకాల మెడఁబాసి యున్న తరువాత స్వల్పాంశమునుబట్టి కలహము పెట్టుకొన్న నే నీ వ్యథ కర్హుఁడనే. నేను వట్టిపశుతుల్యుఁడను మృగప్రాయుఁడను. ఆమె మొగము చూచుటకు నాకిప్పుడు సిగ్గగుచున్నది. ఆమెకోపముకొంత శాంతి పొందువఱకును తాళి వేచియుండెదను. ఈప్రకారముగా నే నామెను మఱియొకసారి యవివేకి నయి బాధపెట్టితినా, శాంత స్వభావురా లయిన నా ప్రాణవల్లభను నేను బోఁగొట్టుకొని సదా పండ్లు పటపటఁ గొఱుకుచుండెడు కోపశీలురాలి నెవ్వతెనో చెట్టఁబట్టి నా యవివేకమునుగూర్చి రాత్రి నాలుగుజాములును పగలు రెండు జాములును పరితపింప వలసినవాఁడ నగుదును.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

3 రంగము—సుభద్రమ్మగారి యిల్లు.

[చేత నొకయుత్తరము పట్టుకొని సుభద్రమ్మయు, విక్రమసేనుఁడును ప్రవేశించుచున్నారు.]

సుభ—విక్రమసేనా! నేను నిన్ను గౌరవించుటకు నీవు వీర

నేనునిపుత్రుఁడ నగుట యొక్కటియే చాలును. ఇప్పుడు నేను నీతో మాటాడినదానినిబట్టి నీగుణగౌరవము విషయమయి యీవఱకువిన్న దానికిని నే నిప్పుడు ప్రత్యక్షముగాఁ జూచిన దానికిని సరిపోయినది.

విక్ర—కళావతిని నేనీవఱ కెన్నఁడును జూడనివాఁడ నైనను నే నాచిన్నదానిని వివాహ మాడఁగోరుటకుఁ గలముఖ్యకారణ మంతయు నీ తెలివితేటలను గుణసంపదను విద్యావివేకములను సర్వ జనులును పొగడుచుండుట విని సుభద్రమ్మగారితోడి బంధుత్వగౌరవ మాశపడుటయే కాని మఱియొకటి కాదు.

సుభ—నీకు నాయెడఁగల యాదరాతిశయమునకు సంతోష మగుచున్నది. దయచేసికూర్చుండుము. (ఇద్దఱును గూరుచున్నారు.) నీవంటిబుద్ధిమంతు లెవ్వరో యొకానొకరుగాని యీకాలమునందు సామాన్యముగా స్త్రీలయందుండెడు వినయవివేకాదులగు గుణ సంపదను కనిపెట్టఁగలపురుషులే లేరు. అల్పమయినను స్త్రీలకు విద్య యెంత యలంకారమో యెవ్వరును ఆలోచింపనే యాలోచింపరు. మనుష్యులు జ్ఞానహీనులగుటచేత నొక్కపసకిమాలినశరీరసౌందర్య పుష్పమును దక్క మఱి దేనిని జూడరు.

విక్ర—నీవు చెప్పినదంతయు పరమసత్యము. అయినను నీ విప్పుడు చెప్పినవిషయములో స్త్రీలదోషముకూడ కొంతవఱకున్నది. మేము పూవువంటి తనుచక్కఁదనమును గాంచి యద్భుతపడుచుండుట చూచి, స్త్రీలుకూడ తమకు విద్యావివేకము లనావశ్యకము లని తలఁచుచున్నారు. అందుచేత వా రారామలతలవలె కాలమహిమచేత తా మాపుష్పమును గోలుపోవువఱకును ఫలములను బొందకున్నారు. చూతలతవలెను సుభద్రమ్మవలెను నేకకాలము నందెవ్వరో కొందఱు

మాత్రమే పుష్పఫలసంపదను రెంటిని బొంది యీలోకములో ప్రకాశించు చుందురు.

సుభ—అబ్బాయీ! నీవు నీసుగుణసంపత్తిచేత నన్నానంద పరవశురాలిని జేయుచున్నావు. (తనలో) పరగుణగ్రహణపారీణత యంతయు నితనిసొమ్ముగా నున్నది! (ప్రకాశముగా) విక్రమసేనా! ఈ తెలివిమాలినది తనమనస్సు నేలాగుననో పొంచులమారి తిరుగు బోతు బిచ్చగాఁడయినవిజయపాలుఁడనువానిమీఁద నిలిపి యున్న సంగతి నీకీవఱకు తెలిసి యుండకపోదు. వాని మొగ మెట్లుండునో మే మీవఱ కెవ్వరమును జూడలేదు; వానివిషయ మయి యెవ్వరికిని ఏమియు తెలియదు.

విక్ర—ఆ నవ్వులాట వ్యవహారమునుగూర్చి నేను గొంచె మెఱుఁగుదును. ఆవిషయమునుగూర్చి నాకామెమీఁద మనస్సులో ననూయ యెంతమాత్రమును లేదు.

సుభ—నీవు మిక్కిలి దొడ్డవాఁడవు; శాంతస్వభావుఁడవు. ఆవ్యవహారమును బయటికి లాగినది మొదలుకొని నాచేతనయినపని యంతయుఁ జేసినాను. ఎప్పుడును వారిని పేరైననుదలపెట్టవలదని నేను చిరకాలముక్రిందటనే దానికి గట్టియుత్తరువుచేసినాను. అటుతరువాత వీరసేనుఁడుగారు చెప్పినవిషయము దానికి చక్కగా బోధపఱిచిచెప్పి నాను. నేనెన్నివిధములఁ జెప్పినను నాకృషి యంతయు బూడిదలో పోసిన పన్నీ రయిపోయినది. నాబుద్ధికిచూడఁగా నానోటినుండివచ్చిన ప్రతివిషయమును నిరాకరించవలెనని యదినిశ్చయము చేసికొన్నట్లు తోఁచుచున్నది.

విక్ర—అందువలన నీమనస్సున కెంతో నొప్పికలిగియుండును.

సుభ—నొప్పి గిప్పి నేను జెప్పలేను. దానిచేష్టలు చూడఁగా

నామనస్సు నుండుకొని పోవుచున్నది. అది వానితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుటకైనను నేఁటివఱకు మానలేదు. నీవు చూడలేదు గాని, వాఁడు వ్రాసినయుత్తరము మఱియొకటి నేను నేఁటియుదయమున నే పట్టుకొన్నాను. అది నాఱవికలో నుండవలెను.

విక్ర—(తనలో) ఓయి దేవుఁడా! అది నాకడపటియుత్తరము కాఁబోలును!

సుభ—ఇదిగో! ఉత్తర మున్నది.

విక్ర—(తనలో) ఇది నిశ్చయముగా నాయుత్తరమే. ఓసి మంథరా! ఎంత మోసము చేసినావే !

సుభ—ఈవ్రాఁత నీవు గుఱుతు పట్టగలవేమో చూడు.

(అని యుత్తరము చేతి కిచ్చుచున్నది.)

విక్ర—ఈవ్రాఁత నేనీవఱకు చూచినట్టేయున్నది. ఇది నేను చూచినదే. అవునవును—

సుభ—కానిమ్ము. అది కొంచెము చదివి చూడు.

విక్ర—(చదువుచున్నాఁడు.) "నాభాగ్యదేవతా ! నా ప్రాణమా! కళావతీ!"-ఈమృదువచనములు నిశ్చయముగాగాఢానురాగమును తేటపఱుచుచున్నవి.

సుభ—మృదువచనములా! వట్టిపనికిమాలినమాటలు.

విక్ర—(చదువుచున్నాఁడు.) "నీవు వ్రాసినవింతసంగతుల వలన నామనస్సున కెంతో భయమగుచున్నది. అందులోను ముఖ్యముగా నానూతనప్రతిపక్షి."—

సుభ—నూతనప్రతిపక్షియనఁగా నీవని వానియభిప్రాయము.

విక్ర—(చదువుచున్నాఁడు.) "విద్యావినయసంపన్నుఁ డని మాననీయుఁ డయినరసికవతంసుఁ డని యెల్లవారును చెప్పుకొను

చుండుటచేత నాభయము మఱింత యెక్కువగుచున్నది.”—ఇం దేదియు నింద లేదు.

సుభ—ఇట్లు వ్రాయుటకు వానికి లోపల నేదో యుద్దేశ మున్నది.

విక్ర—ఉన్నది. ఆవిషయమయి నేను నిశ్చయముగాఁ జెప్పఁ గలను.

సుభ—ఉన్ననింద యంతయు మంచున్నది వింటువుగాని చదువు.

విక్ర—(చదువుచున్నాఁడు.) “నీకు సంరక్షకురాలుగా నున్న యామునలిపిశాచమును—” అతఁ డిది యెవరినిగూర్చి యుసి యుండును ?

సుభ—నన్నుఁగూర్చి. వానియభిప్రాయము నేననియే. వాని విషయమై యిప్పుడు నీయభిప్రాయమేమి? ఇఁకఁ గొంచెము చదువు. ముంఁదు స్వరము తెలియవచ్చును.

విక్ర—కేవలబుద్ధిహీనుఁడు. (చదువుచున్నాఁడు.) “మనము తప్పించుకొనుట కష్టమేయయినను, నాసామర్థ్యవిశేషముచేత దాని జాగరూకత యంతయు విఫల మగునట్లు చేసెదను. ఆముసలిది తన వాడఁబాఱిన చెక్కులకు మెఱుఁగు వచ్చుటకయి వర్ణము వేసికొని తాను పండితురాలని తోఁచుటకయి సంభాషణలో పెద్దపెద్దమాట లుపయోగించెడు వ్యర్థదంభము కలదని విన్నాను—”.

సుభ—అదిగో నామాటల నాక్షేపించుచున్నాఁడు. నీ వేమనుకొన్నావు? అది నాపాండిత్యప్రకర్షముమీఁద దోషారోపణ. అటువంటి మృగప్రాయుఁడు లోకములో మఱియొకఁడు డుండఁబోడు.

నేను నాసంభావణవిషయములో పడునంతజాగరూకత మఱి దేని లోను పడను. వానివ్రాత చూచినావా?

విక్రి—ఈవిషయములో నతఁ డెంతటిశిక్ష కయినసర్హుఁడే. ఏదీ యేమి వ్రాసినాఁడో చూతము. (చదువుచున్నాఁడు.) "ఆముసలిది తనవాఁడఁబాఱిన చెక్కులకు—"

సుభ—నీవు చదివినదె మరల చదువ నక్కఱ లేదు.

విక్రి—పొఱపడినాను క్షమింపవలెను—(చదువుచున్నాఁడు.) "అట్టి వ్యర్థదంభముగలదానిని ముఖస్తుతులతోనుకల్లగౌరవముతోను లోఁబఱుచుకొని మోసపుచ్చి యనాయాసముగా మన కార్యసాఫల్యము చేసికోవచ్చును." —ఆహా! ఏమి యీబుద్ధిహీనత!— "కాఁబట్టి యాముసలిభూతముయొక్క యనుమతితోనే శీఘ్రకాలములో నిన్నుచూచుట కొక్కయుపాయ మున్నది. ఈకామతంత్ర నిర్వహణములో మన యుద్దేశమును సందేశములు గొనిపోవుటకయి యాముసలిదానినే మన మొకదూతికనుగాఁ గూడ నుపయోగించుకోవచ్చును.".— ఆహా! ఏమి యీసాహసము!

సుభ—ఆకండకావరము చూచినావా?తనసామర్థ్యవిశేషము చేత నాజాగరూకత యంతయు విఫలమగునట్లు చేయునఁట! చేయనిమ్ము. ఆహాహాహా! ఈవ్రాఁతనుబట్టి చూడఁగా వాఁడు నిశ్చయముగా మనయింటికి రాకమానఁడు. మనము శ్రద్ధవహించి యెవరియుపాయము చక్కఁగాఁ బాఱునో చూతము.

విక్రి—చూతము మనమిద్దఱమును తప్పక శ్రద్ధవహించి చూతము. ఆహాహాహా! అతని కెంతగర్వము! ఆహాహాహా! నే నొక్కమంచియాలోచన చెప్పెదను. సుభద్రమ్మా! ఈచిన్నదాని కతనిమీఁద నంతమోహ మున్నందున నీవుకొంతకాలమువారియుత్తర

ప్రత్యుత్తరములు చూచియు చూడనట్లు నటించు; ఆచిన్నదానినిష్ట మున్నయెడల నతనితో లేచిపోవుటకుఁగూడ పన్నుగడలుపన్నిమ్ము; ఆచిన్నది పాఱిపోవుచున్నను నీ వుపేక్షించినట్లూరకుండు. ఎఱుఁగన ట్లుండి యాసమయమునకు నే నుట్టిపడి యతనిని తఱిమివేసి, అప్పు డొక మాయోపాయముచేత నతనికిమాఱుగా నేనే పిల్లదాని నెత్తుకొని పాఱిపోయెదను.—ఈయుపాయము బాగున్నదా?

సుభ—దివ్యముగా నున్నది. ఇటువంటిమంచియుపాయము జన్మమెత్తినతరువాత నే నెన్నఁడును వినలేను.

విక్రి—ఇప్పుడాచిన్నదానిని నేనొక్కపర్యాయముముందుగా చూడవచ్చునా? ఈలోపల ముందుగా నే నామెస్వభావము కొంచెము కనిపెట్టవలెను.

సుభ—చూడనేవచ్చును. తాళు ఆచిన్నది యిప్పుడు నిన్ను చూచుటకు సిద్ధముగా నున్నదో లేదో! ఇటువంటివిషయములలో మనము రాజకన్యలలోఁ గలమర్యాదలను కొంచెము చూడవలెను.

విక్రి—ఈమర్యాదల నాచిన్నది నావిషయములో నంత లక్ష్యము చేయదు. విజయపాలుఁడని చెప్పు—

సుభ—ఏమీ!

విక్రి—(తనలో) ఏమి యీకంఠమార్దవము!

సుభ—నీ విప్పు డన్నది విజయపాలుఁ డని కాదా?

విక్రి—అవును పరిహాసార్థముగా నీ వాచిన్నదానితో విజయపాలుఁడు వచ్చినాఁడని చెప్పుమని నీతో ననఁబోవు చున్నాను. ఆమాట చెప్పగానే యామె కిందికి పరుగెత్తుకొని వచ్చును. ఆహాహా! (అని నవ్వుచున్నాఁడు.)

సుభ—దానివిషయములో నిటువంటిమాయ చేయవలసినదే. అంతేకాక వాఁడు నా యనుమతితోనే దానిని చూచెద నని వ్రాసినాఁడు. ఆహాహా! చేతనయినపక్షమున, చూడమను.—ఓకళావతీ! క్రిందికి రా. (పిలుచుచు) వాడు నన్ను తమ యిద్దఱి నడుమను సందేశములు గొనిపోవుటకు దూతికనుగా నుపయోగించునఁట!—ఆహాహా కళావతీ! క్రిందికి దిగిరా. నీవు నవ్వుటకు నా కాశ్చర్యము లేదు. ఆహాహా! వాని పొగరుఁబోతుతనము నిజముగానే పరిహాసాస్పదముగా నున్నది.

విక్రి—అవును. నిశ్చయముగా పరిహాసాస్పదముగానే యున్నది. ఆహాహాహా!

సుభ—ఏమి దాని పొగరు! అక్కడది నామాటే వినిపించుకోదు. నేనే పోయి వచ్చినది యెవరో యిప్పుడే చెప్పెదను. తన్ను చూడవచ్చినవాఁడు విక్రమసేనుఁ డనియే చెప్పి, కన్య కర్హమయిన రీతిని నడుచుకొనునట్లు చేసెదను.

విక్రి—నీమనసువచ్చినట్లు చేయవచ్చును.

సుభ—విక్రమసేనా! ఇప్పటివఱకు నేను నీకు దూతికనయినాను. ఏమి? యింకను నీవు నవ్వుట యయిపోలేదు! వాఁడు నాజాగరూకత యంతయు విఫలమగునట్లు చేయునఁట! ఆహాహాహా!

(అని వెళ్ళుచున్నది.)

విక్రి—ఆహాహాహా! ఇంతట నే నీమాఱువేషము తీసివేసి నిజవేషముతోనే ప్రియురాలిని దక్కించుకో వచ్చునని యితరు లనుకోవచ్చును. కాని కళావతియొక్క చపలచిత్తతనుబట్టి చూడఁగా నిజమయిన వేషమును బయలఁబెట్టినపక్షమున మొదటే చెడిపోవు

నేమో యని నాకు భయ మగుచున్నది. ఆమె నన్ను తెలిసికొనునో లేదో చూతము.

(ఇటునటు నడిచి గోడల పటములవంకఁ జూచుచున్నాఁడు.)

[కళావతి ప్రవేశించుచున్నది.]

కళా—నాకిప్పు డొక్క గొప్ప గొడవ సంభవించినది! ఇష్టములేని క్రొత్తవాఁడు వచ్చి నన్ను వరించుమని చేసెడి యసహ్యములయిన ప్రార్థనలను వినుటకంటె కష్టతరమయినపని మఱి యేదియు నుండదు. నావలెనే బాధపడఁబడిన కన్యలు తమ్ము వరింపవచ్చిన వారితో తమహృదయము వేఱొకరిమీఁద నిలిచియుండుట తెలిపి వారిని ప్రార్థించి పంపివేయుచు వచ్చినట్లు విన్నదానను. కాఁబట్టి యిప్పుడు నేనును నదేప్రకారముగాఁ జేయవలెను. అదిగో! నా నూతనవరుఁడు వెనుకగా నిలిచియున్నాఁడు. అతఁడు గొప్ప యుద్యోగస్థుఁడట! ఇతనికిని మా విజయపాలునికిని ఎంతవ్యత్యాస మున్నది! ఇతఁడు ముందుగా మాటాడకున్నాఁడు! ఇతఁడు చూడఁగా సిగ్గుల పెండ్లికొడుకులవలెఁ గనఁబడుచున్నాఁడు. ఇతఁడు నా వంకనైనను జూడక నిర్విచారముగా నిలుచున్నాఁడు. నేనే మొదట పలుకరించెదను—విక్రమసేనా!

విక్ర—ఆ! (అని యభిముఖుఁడగుచున్నాఁడు.)

కళా—ఏమి యీ యాశ్చర్యము! నా విజయపాలుఁడా?

విక్ర—ప్రాణేశ్వరీ! మెల్లఁగా మెల్లఁగా వింతపడఁబోకు.

కళా—ఒక్క వింతమాత్రమే కాదు నా కపరిమితభయప్రమోదములు కూడఁ గలుగుచున్నవి. నీ విక్కడ కెట్లు రాఁ గలిగి నావు? నాకద్భుతముగా నున్నది.

విక్ర—బహుభాషలతోఁ బనిలేదు. నేను నీ మేనత్తను

హాసము చేసినాను. నాగ్రామాధిపతి యీసాయంకాల మిక్కడకు రాఁబోవుచున్నాఁడని విని, ఒక యుపాయముచేత నాతనిని రాకుండఁజేసి నేనే విక్రమసేనుఁడ నని యీమెవద్దకు వచ్చినాను.

కళా—నీయుపాయము చక్కఁగా పాఱినది. ఆమె నిజముగా నీవే విక్రమసేనుఁడ వనుకొనుచున్నది.

విక్రి—ఆవిషయమయి యీమెకు దృఢనిశ్చయము కలిగినది.

కళా—ఆహాహాహా! తనంత తెలివిగలవారు లేరని గర్వపడుచుండెడి యీమెను నీవు మించిపోవుట తలఁచుకొని నేను నవ్వాపుకొనలేకున్నాను.

విక్రి—అమూల్యమయిన కాలమును మనమిప్పుడు వ్యర్థపుచ్చుచున్నాము. ఇటువంటి మంచిసమయము మనకు మఱియెప్పుడు మరల దొరకదు. ఓ ప్రాణధనమా! నాపాలిటి భాగ్యదేవతవైన నిన్నీయనర్హబాధనుండి రక్షించి యీసేవకుఁడు శీఘ్రముగా నుచితబహుమానమును పొందుటకుఁ దగిన సుముహూర్తమును వెంటనే సిద్ధాంతము చేయుము.

కళా—విజయపాలా! అట్లయినపక్షమున నీవు నాయల్పధనము యొక్క పోకడ కొప్పుకొన్నావా? ఎగిరిపోవుటకు వీలులేకుండునట్లుగా నాయిచ్ఛావిహంగముయొక్క ఱెక్కలమీఁద నిప్పుడా ధనమే మహాభారముగా నిలిచియున్నది.

విక్రి—ఆభారము విడిచివచ్చినీవునన్ను కృతార్థుని జేయుము. నాకు నీ సౌందర్యధనమే చాలును. నీయనురాగసంపదనుదక్క నీవు నాకు మఱేమియుఁ గరణము తీసికొని రానక్కఱలేదు. ఓకళావతీ! ఆయనురాగధనము నీవద్ద మెండుగా నున్నది......

డయిన నీ విజయపాలుఁడు నీ వర్ణించెడి యాయొక్క ధనమును మాత్రమే నీకుఁ మరలఁ దీర్పఁగలఁడు.

కళా—(తనలో) ఈతనిమాట లెంత హృదయాహ్లాదకరము లుగా నున్నవి! దారిద్ర్యదేవతయీతనికంటి కెంత మనోహరముగాఁ గనఁబడుచున్నది!

విక్ర—ఓహో! మన మెటువంటిబ్రతుకు బ్రతుకఁబోవు చున్నాము! అప్పుడు కామదేవుఁ డొక్కఁడే మన కారాధ్యుఁ డయి రక్షకుఁ డగును; అప్పుడుమనము తుచ్ఛములయిన యితరప్రాపంచిక భోగముల నన్నిటిని విడనాడి మనఃకాయకర్మలచేత నాతని నొక్క నినే తదేకచింతతో సర్పించుచు సుఖింతము. కష్టమన్న గర్వపడుచు మన మప్పుడు భాగ్యదేవతయొక్క వైకల్యముఁ జూచి సంతోషసుఖ మనుభవింతము. చుట్టును నావరించి యుండెడువిపదంధకారములో మనయనురాగదీప మన్యోన్యస్నేహరసముచేత మఱింత యసమాన కాంతితో ప్రజ్వరిల్లి వెలుంగుచుండునట్లు చేయుదము. ఈశ్వరుని తోడు! నాజీవధన మయినకళావతిని నాహృదయపీఠమునందు స్థిర ముగాఁ జేర్చుకొనుభాగ్యము నాకబ్బెడుపక్షమున, ఈలోకములో భాగ్యదేవత ప్రసాదించెడు సమస్తసంపదలను దానశూరత గలయీా హస్తములతో తృణప్రాయముగా నెగఁజిమ్మివేసి హృదయేశ్వరి నా నిందుకౌఁగిట నున్నప్పుడు దక్క వేఱొకప్పు డీప్రపంచ మెప్పుడును నాకు సుఖదాయకము కాదని ఘోషింపఁగలను—(అని కౌఁగి లింపఁబోవుచు తనలో) ఈచిన్నదిప్పుడు నన్ను నిరాకరించినపక్షమున ఇఁక నా కాశ లేదు.

కళా—(తనలో) ఇప్పుడు నేనతనితోదిగంతముల వఱకైనను

పాఱిపోవలెనని బుద్ధిపుట్టుచున్నది. అయినను నన్నిప్పుడు వీరు పెట్టుచున్న బాధ యింకను నన్నంత తెంపరిని జేయలేదు.

[చెవియొగ్గి యాలకించుచు సుభద్రమ్మ ప్రవేశించుచున్నది.]

సుభ—(తనలో) ఈ మంకుకుఱ్ఱది యతనియెడల నెట్లు ప్రవర్తించుచున్నదో తెలిసికో వలెనని నా మనస్సు తహతహ పడుచున్నది.

విక్ర—కళావతీ! విచారముగా నున్నావేమి? ఇంతకుమును పున్న నీ యుద్రేక మిప్పుడు తగ్గిపోయినట్లున్నది.

సుభ—(తనలో) ఉద్రేక మిప్పుడు తగ్గిపోయినదఁట! అది యితనిమీఁద నింతవఱకును దురాగ్రహావ్యగ్రురా లయి యున్నది కాఁబోలును!

కళా—లేదు. నా దేహములో ప్రాణ మున్నంతవఱకెప్పుడును తగ్గిపోదు.

సుభ—(తనలో) ఓసి దుస్స్వభావప్రదీప్తభూతమా! ఇది యావజ్జీవమును కోపోద్రేకమును విడువనే విడువదఁట! ఏమి దీని మిడిసిపాటు!

కళా—నా వెఱ్ఱిమేనత్తయొక్క పనికిమాలిన బెదరింపులను నేను లక్ష్యముచేయుదు నని నీవు స్వప్నావస్థయందును తలఁపవలదు.

సుభ—(తనలో) పెద్దదానియందు దీని కెంతభక్తి!

కళా—ఆమె కోరితెచ్చినవాఁడు విక్రమసేనుఁడే కానిమ్ము. నేను విజయపాలునిదక్క వేఱొక్కని వరింపను.

సుభ—(తనలో) దీని సాహసమునకు నాకద్భుత మగుచున్నది. ఇట్లితని మొగము ముందఱనే స్పష్టముగాఁ జెప్పుచున్నది!

విక్ర—(కాళ్ళమీఁదఁబ్రాలి) నీ దాసునిప్రార్థన చెలింపుము.

సుధ—(తనలో) అయ్యో! పాపము! పాదముల మీఁదఁ బడి యీచిన్నవాఁడు దయచూపుమని దీనిని దీనముగా వేఁడుకొనుచున్నాఁడు. ఇఁక నేనిది చూచి సహింపలేను—(ముందుకువచ్చి) ఓసి కొంకనక్కా—మీసంభాషణ యంతయు నేను విన్నాను.

విక్ర—(తనలో) ఓసి నీ జాగరూకత కాలిపోను!

సుధ—విక్రమసేనా! ఈనిర్భాగ్యురాలు నీయెడఁ జూపిన మొఱకుఁదనమునకై నీకు నేనెట్లు క్షమార్పణము చేయవలెనో తెలియఁగ జాలకున్నాను.

విక్ర—(తనలో) ఇఁక భయము లేదు. సర్వమును సురక్షితముగానే యున్నది—(ప్రకాశముగా) కాలమహిమచేత నా కీచిన్నది దక్కవన్న యాశ నన్ను విడువలేదు.—

సుధ—ఇటువంటి మూర్ఖురాలివిషయమయి యూసపెట్టుకొన్న ప్రయోజనము లేదు. గోదావరినదిలో నుండెడు మొసళ్ళకెంత తలబిరుసో దీనికంత తలబిరుసు.

కళా—అత్తా! నాయం దిప్పుడు నీ వారోపింపబోయెడు దోష మేమి?

సుధ—ఓసి సిగ్గుమాలినదానా! నీ ప్రేమ మఱియొక పురుషుని మీఁద నున్నదని నీ విప్పు డితని ముఖముముందు చెప్పలేదా? నీ వితని నెప్పుడును వరింపనని యిప్పుడు చెప్పలేదా?

కళా—చెప్పలేదు. నేనట్లు చెప్పలేదు.

సుధ—ఓయి భగవంతుఁడా! ఏమి యీ సత్యసంధత! కళావతీ! అబద్ధములాడుట మెందుకు కాఁ దలఁచుకొన్న నీవంటి కన్యకకు తగదని నీ వెఱిఁగి యుండవలసినది. నీ హృదయము మా పనికిమాలిన విజయపాలుని మీఁద తగిలియున్నదని నీవింతకుముందనే

లేదా! నేను మరల నడుగుచున్నాను. నామొగమువంకఁ జూచి నా కీయొక్క మాట కుత్తరము చెప్పు.

కళా—అన్నాను. ఒక్క విజయపాలునిమీఁద తక్క—

సుభ—చాలు! చాలు! ఇఁక నోరుమూసికో. ఏమి యీ దుండగము! ఆఁడుదాని కింత యదరిపాటు కూడదు.

విక్ర—సుభద్రమ్మా! ఈచిన్నదానిని చెప్పఁదలఁచుకొన్న దంతయుఁ జెప్పనిమ్ము. ఈమె యేమి చెప్పినను నాకు సంతోషమే. ఈమాటవలన నాకెంతమాత్రమును నష్టము లేదు. నామాట నమ్ము.

సుభ—విక్రమసేనా! నీ వతికఠినాత్ముఁడవు; అతిశాంతుఁడవు. ఓసీ! కట్టుదానా! నీవు నావెంటరా.—విక్రమసేనా! మనము మరలఁ గలిసికొందము. మన మేర్పఱుచుకొన్నది మఱచిపోకు.

విక్ర—మఱచిపోను.

సుభ—ఓసీ! కళావతీ! ఈయనయొద్ద మర్యాదతో సెలవు పుచ్చుకొనిరా.

కళా—నాహృదయేశ్వరుఁడైనవిజయపాలునికి సమస్తశోభములును కలుగునుగాక!

సుభ—ఓసి నీనోరు పడిపోను. పాడురండా! నీచదువు చాలును. ఈపాటి నోరుమూసికొనిరా. (అని నొరునొక్కి కళావతిని బలవంతముగా నీడ్చుకొనిపోఁగా, అందఱును నిష్క్రమించుచున్నారు.)

౮. రంగము—దామోదరవర్మ యిల్లు.

---

[మంచిబట్టలు ధరించుకొని దామోదరవర్మయు. మాధవుఁడును ప్రవేశించు చున్నారు.]

దామో—మాధవా! నే నిప్పు డందముగా నున్నానా?

మాధ—మహారాజులాగు వున్నారు. ఈకొత్తబట్టలవల్ల వెనుకటిరూపమే మారిపోయి యిప్పుడు మీకు యెక్కడలేనిఅందమూ వచ్చింది. వెనుకటిరూపానికీ యిప్పటిరూపానికీ పోలికే లేదు.

దామో—ఈబట్టలవల్ల నంతమార్పు వచ్చిన దేమి?

మాధ—మార్పోగీర్పో నేను చెప్పలేను. మీరుయీ వేషంతో అవ్వగారియింటికి వెళితే ఆవిడ మిమ్మలిని ఆనవాలే పట్టలేదు. మీ గుర్రపువాఁడు మీకు మీపేరు చెప్పినా నమ్మడు; మనదాసీదిమిమ్మలిని చూస్తే యెవరో వింతమనిషి వచ్చినాడని జడుసుకుంటుంది. వెయ్యిమాట లెందుకు? మీకుక్కకూడా మిమ్మల్నిచూస్తే మొరుగుతుంది.

దామో—మాధవా! అలంకారముతో సమాన మయినది మఱియొకటిలేదు. లోపలిరూప మెట్లున్నను పయిమెఱుఁగు ముఖ్యముగా నుండవలెను.

మాధ—అందుచేతనే నాయిత్తడిగిన్నెను మెరుగుపెట్టుమని రోజూకంచరివాడితో చెపుతాను. వాడు నామాట వినడు.

దామో—టపాలో నాకుత్తరము లేమైనవచ్చిన వేమో చూచిరా.

మాధ—చూచివస్తాను. మీముఖం చూస్తే నాకు ముచ్చటవుతూవున్నది. (అని పోవుచున్నాఁడు)

దామో—(ఇటునటు మందగమనముతో నడుగులుపెట్టుచు) ఇది హంసయానములాగున నున్నది. ఈపాదవిన్యాసము నేనునాట్యాచార్యునియొద్ద నేర్చుకొన్నాను. నాట్యాచార్యుఁడు తిన్నఁగా గ్రహింపలేక నాయడుగులు వేయుట నృత్యశాస్త్రానుగుణముగా లేదని తప్పు పట్టినాఁడు. నాకు నడకలు దిద్దుటకు వాని కేమి తెలియును? నా ముద్దునడక యభినయశాస్త్రమును మించి యున్నది. నానడక దివ్యముగా నున్నది. మొన్న గ్రామదేవత జాతరలో అమ్మవారుపూనిన శివశక్తి సరిగా నావలెనే నృత్యము చేసినది.

[మాధవుఁడు మరల ప్రవేశించు చున్నాఁడు.]

మాధ—పురుషోత్తమదేవుడుగారు మీదర్శనంకోసం వచ్చినానని చెప్పుమన్నారు.

దామో—ఆయనతో రావచ్చు నని చెప్పి నీవు పో.

మాధ—మంచిది. (అని మరలఁ బోవుచున్నాఁడు.)

[పురుషోత్తమదేవుఁడుగారు ప్రవేశించు చున్నారు.]

పురు—దామోదరవర్మా! ని న్నిక్కడఁ జూడఁగలుగుటచేత నాకు పరమసంతోషముగా నున్నది.

దామో—నాకంతకంటె సంతోషముగా నున్నది.

పురు—నీవింత యాకస్మికముగా పీఠికాపురమున కేమిపని మీఁద వచ్చినావు?

దామో—కామదేవునిపనిమీఁద వచ్చినాను. కామదేవుఁడు నన్నిక్కడ కాశపెట్టి తీసికొనివచ్చి తుదకు చిక్కులలో పడవేసినాఁడు. నాకిక్కడ గొప్పయవమానము తటస్థించినది. నన్నవమానపఱిచినవారి పేరులుమాత్ర మిప్పుడు చెప్పను. నాకెంత యవమానము సంభవించిన దనుకొన్నావు?

పురు—నీవు నాకు పేర్లు చెప్పవక్కఱలేదు. నీకు తటస్థించిన యవమానమేమో చెప్పుము.

దామో—ఒకచిన్నదానిమీఁద నామనస్సు దృఢముగా తగిలినది. ఆచిన్నదానికి కావలసినవారు నాప్రార్థన కామోదించి యాగ్రామమునకు రమ్మన్నారు. ఎంతో ప్రయాసపడి వచ్చినతరువాత వారిప్పు డాచిన్నదానిని మఱియొకరి కియ్య నిశ్చయించుకొన్నామని వర్తమానము పంపినారు. నేను దీని నవమానముగా తలఁచుచున్నాను.

పురు—ఇది తప్పక యవమానమే. లోకములో నింతకన్న మానవంతునకెక్కువ యవమానమేముండును? దీనికి కారణము నీవేమని యూహించెదవు?

దామో—ఊహ యెందుకు? అది ప్రత్యక్షమే. దీనికంతకును కారణము విజయపాలుఁ డనువాఁడు. ఆచిన్నది వానిని మోహించినదఁట! వాఁ డిప్పు డీయూరనే యున్నాఁడఁట! ఈ యవమానమున కంతకును వాఁడేమూలమయియుండవలెను. అందుకు సందేహము లేదు.

పురు—నీకు ప్రతిపక్షుఁ డొకఁడు బైలుదేఱినాఁడా! ఏమి! చెప్పుము! అతఁ డక్రమమయినమార్గముచేత నిన్ను తొలఁగఁద్రోసినాఁడేమో చెప్పఁగలవా?

దామో—ఆవిషయమయి యింతయాలోచన యెందుకు? అక్రమముగానే వాఁడు నన్ను నిరాకరించునట్లు చేసినాఁడు. క్రమమయిన మార్గముచేత నయిన పక్షమున వాఁడు నన్ను కదలింపఁగలిగియుండునా?

పురు—నీ వికను చేయవలసిన దేమో నీకు తెలియునా?

దామో—నాకు తెలియదు.

పురు—మనవద్ద నిప్పుడు కత్తులు లేవు. నామాటలు నీ కర్థమయినవా?

దామో—ఏమీ! నేను వానితో యుద్ధము చేయవలెనా?

పురు—అవును. చేయవలసినపని యదొక్కటే. అంతకంటె మఱేమియు లేదు.

దామో—వాఁడు నాకు కోపకారణ మేదియుఁ గలుగఁ జేయ లేదే!

పురు—అతఁడు కలుగజేసినంత కోపకారణము మఱియెవ్వరును నీ కెప్పుడును గలుగఁజేసి యుండరు. లోకములో నింతకంటె నధికకోపకారణము మఱి యేదుండును? ఒకఁడు కామించిన చిన్నదాని కడ్డమువచ్చి తాను గామింపఁబూనుటకంటె మనుష్యుఁ డాతని విషయములో నెక్కువ యపరాధము చేయుట సాధ్యమగునా? అటువంటివాఁడు క్షమింపఁదగని గర్భశత్రువు. ఇది స్నేహధర్మమునకు మహావిరోధము.

దామో—స్నేహధర్మమునకు విరోధమా! స్నేహధర్మముండుటకు మొదట వానితో నాకు పరిచయమయినను లేదే! నే నీవఱ కెన్నఁడును వానిని చూడనైనను చూడలేదు.

పురు—నీవాతని మొగ మెఱుఁగకపోవుట యుద్ధము చేయరాదనుటకు హేతువు కాదు. తాను క్రొత్తవాఁ డయినప్పుడు నీ కతఁడు బొత్తిగానే ద్రోహము తలఁపఁ గూడదు.

దామో—అదినిజమే. అందుచేతనే నాకు వానిమీఁద మహాకోపము. తుపాకి కాల్చవలె నేమి? కత్తులుకూడ దూయవలెను కాఁబోలును! ఇట్లు పోరాడుటకు మహాధైర్యము కావలెను కాఁబోలును! అవునా? పెద్దమనుష్యునితో కయ్యము పెట్టుకొను

టకు ముందుగా నాపక్షమున న్యాయమున్నదేమో చూడనక్కఱ లేదా?

పురు—అవమానము సంభవించినప్పుడు న్యాయ మెవరికి కావలెను? పూర్వము హిరణ్యకశిపుఁడును రావణాసురుఁడును విజయ యాత్రబైలు దేఱినప్పుడు న్యాయ మాలోచించియే బైలుదేఱిరా యనుకొన్నావా? లేదులేదు. వారు మహాశూరు లయి యెదిరించిన వారి తలలెల్లకొబ్బరిపుచ్చెలలాగునఖడ్గములతో నఱకవేసిన్యాయము నిమిత్తమయి మనసువచ్చినచోట మొట్టిపెట్టుకొండని పిఱికిపంద లను వదలివేసినారు.

దామో—నీ శూరవాక్యములు ప్రతాపోద్దీపకములుగా నున్నవి. నీ వీరాలాపముల వలన నామనస్సునకుఁగూడ నొకవిధ మయిన ధైర్యమువచ్చి ప్రవేశించుచున్నట్టున్నది! ఇదే వీరావేశము కాఁబోలును! తుపాకులతోను బాకులతోను తక్షణము కదలి వాని నిప్పుడే నాతో ద్వంద్వయుద్ధమునకుఁ బిలిచెదను.

పురు—ఓదామోదరా! నావద్ద నిప్పుడు మా వంశవృక్ష మున్నపక్షమున మా పూర్వులనందఱిని నీకొక్కొక్కరినే వరుసగా పేరిపేరివరుసను జూపియుందును. శూరాగ్రేసరు లయిన మా పెద్ద లలో నొక్క శత్రువునైనను తన ఖడ్గధారతో తల నఱకని వీరుఁ డొక్కఁడును లేఁడుసుమా! వంశక్రమాగత మయిన క్షాత్రమును మాత్రము మన మెన్నఁడును విడువరాదు.

దామో—ఓ పురుషోత్తమదేవా! మీ పూర్వులవలెనే మా పూర్వులును మహాపౌరుషశాలులే. మూలపురుషుఁడు మొదలుకొని నావఱకును మా పెద్దలందఱును యోధానుయోధులే. వారిలో నొకఁడు సేనాధిపత్యము చేసెనఁట! ఆవార్త యటుండనిమ్ము.

యిప్పటి నీ ప్రతాపాగ్నివలన నామనస్సులో శత్రువుమీఁదఁ గల దయారసమంతయు నింకిపోయినది. నేను నిజముగా రణశూరుఁడ నయినాను. నా శరీరము పరవశ మగుచున్నది!

పురు—కోపము తెచ్చుకొని వేగిరపడకు. ఇటువంటి కార్యములలో తొందరపా టెంతమాత్రమును గూడదు. ఇట్టి ఘనకార్యములను సదా శాంతితో చేయవలెను.

దామో—నేను కోపము తెచ్చుకో వలెను. నేను వీరావేశము పొందవలెను. నామానము నిలుపఁదలఁచుకొన్న పక్షమున, నీవు నా కోపముమాత్ర మిప్పుడు చల్లాఱునట్లు చేయకు. ఇదిగో కాగితమును కలమును. (అని వ్రాయుటకుఁ గూరుచుండి) ఇది యెఱ్ఱసిరాదైన బాగుండును! అప్పుడు నా కంటికి నాపోటువలన నెత్తురు వఱదలు కట్టుచున్నట్లు కానఁబడును. నా యక్షరములం చూచి పగవాఁడు భయపడునట్లుగా నుత్తరము వ్రాయవలెను. పెద్ద యక్షరములతో వ్రాయుదునా ఎట్లారంభించవలెనో చెప్పు. ప్రతి పదములోను వీరరస మొలుకుచుండవలెను.

పురు—నీయుత్తరము నీవే యాలోచించుకొని యారంభించు.

దామో—వాని ప్రాణము గొనుటకయి శపథములతో నారంభింతునా? 'ఓనిర్భాగ్యుఁడా!' అని మొదలుపెట్టుదునా?

పురు—అట్లు చేయఁగూడదు. మన మెదుటివానికి గౌరవమును జూపుచు మనము పెద్దమనుష్యులమని తోఁచునట్లుగా వ్రాయవలెను. "అయ్యా!"—అని మొదలుపెట్టు.

దామో—నన్నవమానపఱిచినవాని కంతగౌరవముచేయుదునా? మంచిది! అలాగుననే వ్రాసెదను. వానినే పెద్దవానిని గానిమ్ము.

పురు—"మన మిదఱమును నేకసుందరినిమిత్తమే—"

దామో—ఆవల ఏకసుందరినిమిత్త మన్నమాట దివ్యముగా నున్నది.

పుర—"ప్రయత్నము చేయుచున్నందువలన సంభవింపఁ బోయెడి యుపద్రవమును ముందుగానే తొలఁగించుకొనుటకయి—"

దామో—ఉపద్రవమునా! అవును. అదిమంచిమాటే తరువాత

పుర—"నీవు దయచేసి—"

దామో—దయచేయుమని ప్రార్థించుటకయి నేను వానిని నాయింటికి విందుకుఁ బిలుతునా? ఆమాట సరిగా లేదు.

పుర—తొందర పడఁబోకు. చెప్పినట్లు వ్రాయుము.

దామో—మంచిది వ్రాసెదను. "నీవుదయచేసి" అయినది. అటుతరువాత?

పుర—"ద్వంద్వయుద్ధముచేసి మనలోమనమే యుద్ధముఖమున మనవివాదము పరిష్కరించుకొనుటకయి—"

దామో—ఇది సరి.

పుర—ఇఁక స్థలనిర్ణయము చేయవలెను. ఈపనికిజనోద్యానవన మనుకూలముగా నుండవచ్చును. — "ఊరిబయిల నున్నజనోద్యానవనములో నన్ను కలిసికోవలెను."

దామో—చాలును. ఈయుత్తరముమడిఁచి పయినిలక్కతో ఖడ్గముద్ర వేసి యిప్పుడే పంపెదను.

పుర—చూచినావా! ఈచిన్నయుత్తరమువలన మీలో మీకు సంభవింపఁబోయెడి పెద్దయుపద్రవ మొక్కదెబ్బను తప్పిపోవచ్చును.

దామో—ఉపద్రవము తొలఁగిపోవుటకే కాదా యిప్పుడీయుద్ధము!

పురు—ఇఁక కాలనిర్ణయము నీమనసువచ్చినది నీవే చేసికోవచ్చును. నన్నాలోచన యడిగితివా శుభస్యశీఘ్రమ్మని యుండుటచేత నేనీసాయంకాలమే ముహూర్తము పెట్టెదను. ఇది యెంత శీఘ్రముగా నయిన నంతమంచిది. ఈరాత్రియే సర్వము నివారణమయినపక్షమున జేపు నిర్విచారముగా నుండవచ్చును.

దామో—అవును. నీ వన్నమాట నిజమే.

పురు—నీవీలోపల నాకు వ్రాసినంగాని సాయంకాలములోపల నేను నిన్ను మరలఁ జూడను. నీశుభలేను నేనే కొనిపోయి నాహస్తముతోనే యాతనికిచ్చెదను. నీతో నేనొక్క రహస్యము చెప్పుచున్నాను. నీవునిర్వహింపవలసిన కార్యభారమువంటిదేయొకటి యిప్పుడు నాభుజములమీఁదఁగూడ నిలిచి యున్నది. పిరుఁ డయిన యొకానొక యౌవనపురుషుఁడు కొంతకాలమునుండి నాపౌరుషమును చులకనచేసి నన్ను గేలి చేయుచున్నాఁడు. అతనిని యుద్ధమునకుఁ బిలుచుటకయి యేదో యొకమిష పన్ని కలహము పెట్టుకోవలెను.

దామో—అట్లయినపక్షమున నీవు ముందుగా యుద్ధము చేయుఁగా నాకు చూడవలెనని యున్నది. నీ వతనిని జంపుచుండఁగాఁ జూచి యుద్ధ మేలాగునఁ జేయవలెనో నేనింకను గొంచెము నేర్చుకోవలసి యున్నది.

పురు—నీకస్త్రవిద్యాగురువునగుట నాకును గౌరవమే. ఇప్పటికి నేను సెలవు పుచ్చుకొనెదను.—నీశత్రువు తారసించినప్పుడు నీ వెంతమాత్రమును వేగిరపడక సర్వమును శాంతతతోను నేర్పుతోను నిర్వహింపవలెను. నీమాట లెంత మృదువుగా నున్ననునీకత్తి వలెనే నీ వీరచేష్టలుమాత్రము వాఁడిగా నుండవలెను జుమా!

(ఇద్దఱును నిష్క్రమించు చున్నారు.)

## చతుర్థాంకము.

౧. రంగము—దామోదరశర్మ గృహము.

[దామోదరవర్మయు, మాధవుఁడును ప్రవేశించుచున్నారు.]

మాధ—దేవుడితోడు! నేను యెప్పుడు అటువంటిపని చెయ్యను. నాకు యిష్టంలేనప్పుడు వెయ్యిమంది పురుషోత్తమదేవుళ్లు చేరినా నాచేత పోట్లాడించలేరు. ఈసంగతి వింటే మాముసలావిడె యేమంటుంది?

దామో—ఓమాధవా! ఏమనుకొన్నావు? పురుషోత్తమ దేవునిమాటలు విన్నపక్షమున నీకుఁగూడ నెక్కడిలేనిశౌర్యమును పుట్టుకొనివచ్చును. అతనిమాటలలోనుండి నిప్పులు కురిసినవి.

మాధ—నాకు శౌర్యం పుట్టించడానకి అతనిచేతగాదు. అటువంటి ఖర్జూకోరుల మాట లంటేనే నాకు తలనొప్పి. మీకు పోట్లాడవలె నని వుంటేమాత్రం నేను వద్దని చెప్పను. నేనుమాత్రం మీ పోట్లాటలో కాలుపెట్టను.

దామో—మాధవా! నాగౌరవమునకు భంగము వచ్చును. నా గౌరవమునుమాత్ర మెట్లయినఁ గాపాడుకోవలెను.

మాధ—నా గౌరవం నేనూ కాపాడుకోవలెను. మొట్ట మొదటనన్ను నేను కాపాడుకుంటేనే కాని గౌరవం నిలువదు.

దామో—తగు మనుష్యుఁ డెవ్వఁడును తన గౌరమును పోఁగొట్టుకొనుట కెప్పుడు నిష్టపడఁడు.

మాధ—తగుమనిషి యెప్పుడూ గౌరవాన్ని పోఁగొట్టుకోవడానికి యిష్టపడక పోయినట్టయితే తగు మనిషిని పోగొట్టుకోవడానికి గౌరవం కూడా యిష్టపడకుండా వుండవలెను, అలా చెయ్యకపోయిన

ట్టయితే గౌరవం యను స్నేహితుడివలె నటించి మిత్రద్రోహంచేసిన దవుతుంది. తగుమనిషినని నన్ను యెవరూ అనకపోయినా లోకంలో నాకంటె తగుమనిషి యెవరూ లేరు. నాగౌరవంనన్ను మరివకపెద్ద మనిషితో పోట్లాడుమని బోధిస్తుంది, దాని బోధప్రకారం నేను పోట్లాడుతాను. ఆపోట్లాటలో నేను గెలిచి నాశత్రువును చంపిన ట్టయితే, అప్పుడాలాభం యెవరికి వస్తుంది? నాగౌరవానికివస్తుంది. ఒకవేళ నేనేవోడిపోయి నా శత్రువే నన్ను చంపినట్టయితే, అప్పుడు నాగౌరవం నన్ను నేలపాలుచేసి విడిచిపెట్టి నాశత్రువువద్దకు పరు గెత్తుతుంది.

దామో—మాధవా! నీ వాలాగున ననరాదు. అట్టి సమ యములో నీశరీరము పోయినను భూమిమీఁద శాశ్వతముగా నీపేరు నిలుచును. నీవు స్వర్గమునకు పోయినను నీగౌరవ మక్కడకే నీ వెంట వచ్చును.

మాధ—అట్టి గౌరవం నాకక్కరలేదు. నన్ను స్వర్గానికి పంపి నావెంటబడే గౌరవాన్ని నేను యెప్పుడూ కోరను.

దామో—నీవు వట్టి పిఱికిపందవు. నాకుఁగల పౌరుషమునకు నీమాటలు వినుటసహిత మనర్హము. నీమాటలు విని మాపూర్వుల పౌరుషమునకుఁగూడ నేను భంగము తెత్తునా? భీరుత్వముచూపుట మాపెద్దల కెంత యవమానకరమో యాలోచించు.

మాధ—వారి కంత యవమానకరంగా వుండేటట్టయితే నాలుగు కత్తిపోట్లూ రెండుగుండుదెబ్బలూ తిని శీఘ్రంగా వారి లోకానికివెళ్ళి వారి అవమానం తీర్చండి. మాపూర్వు లటువంటి వాళ్ళుకారు. నేను వేగిరం వారిదగ్గరకు వెళ్ళకపోతే వారికవమానం లేదు. నేను సాధ్యమయినంతకాలం యీలోకంలోనే వుండి నేను

వారి దగ్గిరకు వెళ్ళకుండా తప్పించుకుంటాను, నేను తమ దగ్గిరకు రాకుండా యిక్కడ వుండడమే వారికిష్టం.

దామో—మాధవా! యుద్ధము భయంకర మైనదని నీవను కోకు. లోకములో ననేకులు నిరపాయముగానే యుద్ధముచేయుదురు సుమా!

మాధ—అటువంటివాడు యెక్కడనో నూటికీకోటికీవొక్కడు వుంటాడు. యుద్ధం పేరుచెపితేనే నాకు భయం వేస్తూవున్నది. పెద్ద కత్తీ వాడూ చేతిలో తుపాకీ పట్టుకుని శత్రువు యెదుట నిలవబడితే నా కసలే ప్రాణాలు నిలువవు. ఆపాడుపేరు నాతో చెప్పకండి. చిన్నప్పటినుంచీ నాకు కత్తిపేరంటేనే వళ్ళు వణుకుతుంది.

దామో—నా కటువంటి భయములేదు. కత్తులు! తుపాకులు! ఈమాటలు రెండును నా చెవుల కెంతో యింపుగా నున్నవి. నీవెంత పిఱికి మందు వేసినను భయమన్నది నా దేహములో పుట్టదు. ఇదిగో యుద్ధమునకు రమ్మని నేను నాశత్రువునకు వ్రాసిన యాహ్వానపత్రిక. నాపక్షమున పోయి యుద్ధమునకు రమ్మని యడుగుటకయి నా ప్రాణస్నేహితు డయిన విక్రమసేనునికిఁగూడ వర్తమాన పంపినాను.

మాధ—యీయుత్తర మాయన తీసుకుని పోవలసినదే. నా మొత్తు ధనం గుమ్మరించినా నేనుమాత్రము పోను. ఈ వుత్తరం చూస్తే మామూలు వుత్తరాలలాగు కనపడడంలేదు. ఈవుత్తరం లోనుంచి దూరాన్నుంచే నాముక్కుకు తుపాకిమందువాసనా కత్తుల వాసనా కొడుతూవున్నది. అది యెగిరివచ్చి నామీద పడదుగదా?

దామో—ఓరి దౌర్భాగ్యుఁడా! నీకు లేడిపిల్ల కున్నంత ధైర్యమైన మనస్సు కనఁబడదే!

మాధ—యింక నేను మాట్లాడను. ఈరాత్రి యింటివద్ద నేదో పాడుమాట వింటాను. ఆమాట చెవినిబడ్డప్పుడు ముసలావిడ యెంత దుఃఖిస్తుందో! అయ్యో!

(అని హీనస్వరముతో నేడ్చుచున్నాఁడు.)

దామో—నోరు మూసికో. నీవెంత యేడ్చినను నా ప్రతిజ్ఞ నేను విడువను. నే నీదినమున యుద్ధము చేయవలె నని నిశ్చయము చేసికొన్నాను. ఓ పిఱికిపందా! నాయెదుటనుండి లేచిపో.

[మఱియొక సేవకుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

సేవ—విక్రమసేనుడుగారు వచ్చినారండి.

దామో—ఆయనను పయికి దయచేయమనుము.

సేవ—చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

మాధ—మనకందఱికీ దేముడు రేపీపాటికి ప్రాణాలతో వుంచవలెను.

దామో—ఆయేడు పేమి? మాధవా! నాకు కోపము తెప్పింపకు.

మాధ—తమవద్ద యిదే ఆఖరుకొలవు. (అని వెక్కి వెక్కి యేడ్చు చున్నాఁడు.)

దామో—ఓపిఱికిపశువా! నీయేడుపు చాలించి తక్షణము నావద్దనుండి లేచి పో.

మాధ—పోతాను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[విక్రమసేనుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

విక్ర—దామోదరా! ఇది యేమి?

దామో—వీఁడు పనికిమాలినపిఱికిపీనుఁగు. నాకీయుద్ధకర్తవ్యమును మానినధైర్యము లేకపోయినపక్షమున—

విక్ర—నా కెందుకు వర్తమానము పంపినావు?

దామో—ఇదిగో! చూడు. (అని యుద్ధాహ్వానపత్రికను చేతి కిచ్చుచున్నాఁడు.)

విక్ర—(చూచి చదువుచు తనలో) "విజయపాలునకు"— ఇప్పు డేదో వినోదము నడుచు చున్నది. (ప్రకాశముగా) యేమిటిది?

దామో—యుద్ధాహ్వానపత్రిక.

విక్ర—ఆలాగా? అతనితో యుద్ధము చేయువాఁడవు నీవు కావు కాఁబోలును! అవునా?

దామో—కాదు. నేనే యుద్ధము చేసెదను. పురుషోత్తమ దేవుఁడు నన్ను ప్రోత్సాహపఱిచి యుద్ధమునకు నాకు పౌరుష మెక్కించినాఁడు. అతఁడు నన్ను విడిచి పోవునప్పటికి నాలోపల మితిమీఱిన యాగ్రహము ప్రవేశించినది. అటువంటి యాగ్రహము వచ్చినప్పుడు దానినూరక పోనియ్యరాదు. నేనీసాయంకాలము యుద్ధము చేసెదను.

విక్ర—అవునుగాని యిప్పు డిందులో నాపని యేమున్నది?

దామో—ఆవిజయపాలునిగూర్చి నీకు కొంత తెలిసి యుండ వచ్చును. నీవు పోయి వానిని కనుఁగొని నాకు మాఱుగా నీవీప్రాణాపాయకర మయినయాహ్వానపత్రిక నాతని కియ్యవలెను.

విక్ర—నాచేతికిచ్చి యిది యతనికి ముట్టినట్టే భావించుకో.

దామో—నీవు చేసినయుపకారమునకు నేను నీమేలు మఱచిపోను. మిత్రుఁడా! నీకు నేను మిక్కిలి శ్రమ కలుగఁజేయుచున్నాను గదా!

విక్ర—నాకెంతమాత్రమును శ్రమ లేదు. ఈమాట నీవు మఱియెవరివద్దను తలపెట్టఁబోకు. నామాట నమ్ము. నేను నీవ!

దామో.—నామీఁద నీ కనుగ్రహ మున్నది గనుక స్నేహ ధర్మ మనఁగా నిదేకదా! విక్రమసేనా! నీవు నాకు సహాయుఁడవుగా నుండఁగలవా?

విక్ర—ఈవ్యవహారములోమాత్రము నే నుండఁగూడదు. ఇందులో నే నుండుట యుక్త మయినపని కాదు.

దామో.—అట్లయినపక్షమున నేను నామిత్రుఁ డయినపురుషోత్తమదేవుని నే కోరవలెను. అయినను నీవు నాక్షేమమునయినను కోరుచుండవలెను.

విక్ర—అతఁడును నీవును గలిసికొన్నప్పుడు మఱి యెవ్వరి క్షేమమును గోరను. నామాట నమ్ము.

[సేవకుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

సేవ—వీరసేనుఁడుగారు కిందికివచ్చి యిక్కడ విక్రమసేనుఁడు వున్నాడేమో కనుక్కొని రమ్మన్నారు.

విక్ర—ఇదిగో వచ్చుచున్నానని చెప్పు.

సేవ—చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

విక్ర—(వెళ్లుచు) ఓ రణశూరా! నీకు జయము కలుగునుగాక!

దామో.—విక్రమసేనా! నిలువు ఒక్కనిమిషము తాళు. నీ స్నేహితుఁ డైనదామోదరవర్మ యెటువంటివాఁడని విజయపాలుఁడు నిన్నడిగినపక్షమున, అతఁడు ప్రత్యక్షరాక్షసుఁ డని చెప్పవలెను, ఆలాగునఁ జెప్పెదవు కాదా?

విక్ర—నిశ్చయముగా చెప్పెదను. ముక్కంకండలు కొట్టికెడు మహావ్యాఘ్రమని చెప్పెదను.

దామో.—ఆలాగు చెప్పు. ఆమాటలతోనే యతఁడు భయ పడినపక్షమున, అతఁడు యుద్ధమునకే రాకపోవచ్చును. నేను కూడా

త్రువు వారముదినములు బాధపెట్టి మఱి చంపుము వని చెప్పు. మఱచి పోకుమా!

విక్ర—మఱచిపోను. నాటున నిన్నందఱు నసహాయశూరుఁ డని చెప్పుకొందు రని చెప్పెదను.

దామో—ఈపేరు సరి. ఇది యంతయు ప్రాణాపాయము కలుగకుండుటకయి చెప్పినదే కాని మఱియొకటి కాదు. నాగౌరవము నిలుపుకొనఁ గలిగినపక్షమున, అతనిప్రాణముల కలుగుట నా యిష్టము కాదు.

విక్ర—కాదు. నీవు మహాదయార్ద్రహృదయుఁడవు.

దామో—అతనిని నేను చంపవలెనని నీ కోరిక కాదుగదా!

విక్ర—కాదు కాదు. అయినను నీవు ప్రత్యక్షరాక్షసుఁడవు. అవునా! (అని పోఁ బోవుచున్నాఁడు.)

దామో—అవు నవును. విక్రమసేనా! ఇంకొక్క క్షణకాల మాగుము. నీ వెడలఁగినతరువాత నా కెంత యాగ్రహ మెన్నఁడును రాలే దని చెప్పు. కంటఁబడఁగానె మ్రింగివేయునంత కోపము వచ్చిన దని చెప్పుము.

విక్ర—తప్పక చెప్పెదను.

దామో—ముక్కు కండలు కొఱికెడు పెద్దపులి యన్నమాట మఱచి పోయెదవు సుమా!

విక్ర—మఱచిపోను. నీ వసహాయశూరుఁడ వని కూడ చెప్పెదను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు).

---

౨ రంగము—సుభద్రమ్మగారి యిల్లు.

[సుభద్రమ్మయు, కళావతియు ప్రవేశించుచున్నారు.]

సుభ—ఓముగ్ధురాలా! అతని విషయమయి నీకుంగల యాక్షేపణ మేమో నాకు చెప్పు. అతఁడు సౌందర్యవంతుఁడు కాడా?— ఏమి! మాటాడ వేమి? అతఁడు రసికవరేణ్యుఁడు కాఁడా? పురుషాగ్రగణ్యుఁడు కాఁడా?

కళా—(తనలో) ఈమె తాఁ నెప్పు డెవరిని స్తుతించుచున్నదో కొంచెమయిన నెఱుఁగదు. (బిగ్గరగా) అత్తా! విజయపాలుఁడు నట్టివాఁడే.

సుభ—పోలికలు చెప్పరాదు. ఒకరితో నొకరిని పోల్చుట పడుచుదాని కెప్పుడును కూడనిపని. విక్రమసేనుఁడు నిశ్చయముగా రసికాగ్రగణ్యుఁడు.

కళా—(తనలో) నీవు చూచిన విక్రమసేనుఁడు కాఁబోలును!

సుభ—అతఁడు మంచి గురుజనశిక్షలో పెరిగినవాఁడు. అతని వినయమేమి? చాతుర్యమేమి? రూపరేఖావిలాసము లేమి? మొట్టమొదట నే నతని ముఖమును జూడఁగానే ప్రబంధములలో వర్ణింపఁబడెడు మన్మథుఁడు నాకప్పుడు స్మరణకు వచ్చినాఁడు.

కళా—(తనలో) క్షణకాలములో తాను పడిన భ్రాంతిని కనుగొన్న తరువాత నీమె యప్పు డెంత కోపపడునో!

[సేవకుఁడు ప్రవేశించుచున్నాడు.]

సేవ—అమ్మా! వీరసేనుఁడుగారును విక్రమసేనుఁడుగారును వచ్చి క్రింద నిలిచి యున్నారు.

సుభ—పైకిక్కడకు రమ్మనుము.

సేవ—చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

సుభ—కళావతీ! నీవిప్పుడు బుద్ధిమంతురా లయిన కన్యకు తగినట్టుగా నడుచుకోవలెను. నాయెడలఁ జూపవలసిన విధేయతను మఱచిపోయినను నీవధమపక్షము పెద్దశిక్షలో పెరిఁగినదాన వయిన ట్టయినను మంచిమర్యాద చూపవలెను.

కళా—అత్తా! నామనోనిశ్చయ మేమో నేనీవఱకే నీకుఁ దెలిపియున్నాను. అతనికి నే నిప్పు డాశచూపి ప్రోత్సాహవాక్యములు పలుకక పోవుటయే కాక యతనితో నే నిప్పుడు నోరువిప్పి మాటాడ నైనను మాటాడను; అతనివంక చూడనైనను జూడను.

(అని మొగము త్రిప్పుకొని తలవంచుకొని కూరుచున్నది.)

[వీరసేనుఁడును విక్రమసేనుఁడును ప్రవేశించుచున్నారు.]

వీర—సుభద్రమ్మా! ఇదిగో మేము వచ్చినాము. నీ విటు వచ్చి నిర్దయురా లయిన యీసుందరియొక్క కోపదృష్టిని కొంత శాంతిపఱుచు. వీనిని మనమార్గమునకు తెచ్చుటకు నేనెంత కష్టపడి నాను. వీనిలోపల నేమున్నదో నాకు తెలియదు. నేను నిర్బంధము నుపయోగపఱచక పోయినపక్షమున. వీఁడును తప్పించుకొని జాఱి పోయెడివాఁడే.

సుభ—వీరసేనా! మీరీవ్యవహారములో నపరిమిత మయిన శ్రమ పడినారు. మీకు వృథాశ్రమ కలుగఁజేసినందుకు నాకు సిగ్గగుచున్నది. (కళావతితో మెల్లఁగా) కళావతీ! కళావతీ! నిన్ను బతిమాలుకొనుచున్నాను. లే లే. తలయెత్తిచూచి వీరిని గౌర వించు.

వీర—సుభద్రమ్మా! వీనియొక్క యోగ్యతను గూర్చియు మేన తకుదిరిన సంబంధమునందుఁ జూపవలసిన గణ్యతనుగూర్చియు

నాతోడి బంధుత్వ గౌరవమును గూర్చియు కళావతి తనలో తాను చక్కగా నాలోచించుకొన్నదని నమ్ముచున్నాను. (విక్రమసేనునితో మెల్లఁగా) విక్రమా! ఆచిన్నవానిని పలుకరించి మాటాడు.

విక్ర—(తనలో) ఓయి దేవుఁడా! నాకిప్పు డేమిచేయుటకును తోఁచకున్నది. (వీరసేనునితో రహస్యముగా) అయ్యా! మీరును చూచుచున్నారుగదా! ఆచిన్నది మీయెదుట నా మొగమువంక చూడనైనను చూడకున్నది. ఆచిన్నది నన్ను కన్నెత్తి చూడదని యెఱిఁగినవాఁడ నయి తమతో ముందుగానే మనవిచేసియున్నాను. మీరు దయచేసి మాయిద్దఱిని నొంటిగా విడువవలె నని నాప్రార్థన.

(అని బతిమాలుకొనుచున్నాఁడు.)

కళా—(తనలో) నామేనత్త యెందుచేతనో యింకను తన యద్భుతమును తెలుపకున్నది! ఈమె యతని ముఖము నింకను నిశ్చయముగాఁ జూచి యుండలేదు. ఒకవేళ నుద్యోగస్థు లందఱును నొక్కపోలికగానే యుందురు కాఁబోలును! లేదా, ఈమె దృష్టిలో నేమయిన లోప మున్నదేమో!

వీర—ఇప్పు డప్పుడే మిమ్మొంటిగా విడిచి నే నడుగు దూర మైనను పోను.

సుభ—వీరసేనా! నామేనకోడలు నామాటయం దంత గౌరవ ముంచునది కాదని చెప్పవలసినందుకు చింతిల్లు చున్నాను—(కళావతితో మెల్లఁగా) కళావతీ! ఈవైపు తిరుగు. నీమౌర్ఖ్యము చూచి నేను లజ్జపడు చున్నాను.

వీర—కళావతి నాకుమారుని లభిలషింప నొల్లకుండుట కారోపించు కారణ మేదో తెలిసికొనుభాగ్యము నాకు లభించునుగాక! —

(విక్రమసేనునితో మెల్లఁగా) విక్రమా! ఆరంభింప వేమిరా? ఓరి గాడిదా! మాటాడు.

సుభ—వీరసేనా! కారణ మారోపించుట దీనికి సాధ్యము కాదు. కారణ మున్నదని కళావతి చెప్పను.—(కళావతితో రహస్యముగా) ఓ ముద్దరాలా! అడిగినదాని కుత్తరము చెప్ప నుత్తరము చెప్ప వేమి?

వీర—సుభద్రమ్మా! కారణము లేనియీ చిన్నతనపు వెగిరపాటువలన మా విక్రముని సౌఖ్యమునకు భంగము కలుగ దని నేను నమ్ముచున్నాను.—(విక్రమసేనునితో రహస్యముగా) ఓరి మొద్దా మాటాడ వేమి?

కళా—(తనలో) మాటాడుటకు నాకెంత యిష్ట మున్నదో నా కాముకునకు నంతే యిష్ట మున్నట్టు కనఁబడుచున్నది.—నా వేవత్త యెంత గుడ్డిదిగా నున్నదో!

విక్ర—ఓ-ఓ-కన్యా! ఓ—(మాటాడవలెనని ప్రయత్నించి వీరసేనునివంక తిరిగి) నేను తొందరపడుచున్నాను. నాకుతత్తఱపాటు కలుగుచున్నది. ఇట్లు సంభవించునని నేనీవఱకే యెఱుఁగుదును నేను ముందుగానే తమతో మనవి చేసినాను. నాకుఁ గలమోహాతిశయము నాహృదయస్థైర్యమును పోఁగొట్టు చున్నది.

వీర—అది నీహృదయస్థైర్యమును పోఁగొట్టినది కాని నీనోటిమాటను పోఁగొట్టలేదుగదా! ఓరిబుద్ధిహీనుఁడా! ముందుకుపోయి యాచిన్నదానితో తిన్నఁగా మాటాడు.

విక్ర—ఆచిన్నదానితోనా! (తమ్ము విడిచి పొమ్మని సుభద్రమ్మకు సైగ చేయుచున్నాఁడు.)

సుభ—వీరసేనా! ఇక్కడ వీరినిద్దఱిని విడిచి కొంచెముసేపు మన మావలికిఁ బోదమా?—(కళావతితో మెల్లఁగా) ఓసి మంకు నిర్భాగ్యురాలా!

వీర—ఇప్పు డప్పుడే కాదు.—(విక్రమసేనునితో మెల్లఁగా) నీకు దయ్యము సోఁకినదా యేమి? నీనోటితాళము విప్పు.

విక్ర—(తనలో) ఈశ్వరానుగ్రహమువలన కళావతి నావంకతిరిగి చూడక కోపముతో మూతిముడుచుకొని యుండును గాక! నేను మాఱుగొంతుకతో మాటాడవలెను. (కళావతి చేరువకుఁ బోయి హీనస్వరముతో) కామప్రేరితమైన యీసుస్వరమును కళావతి యొక్కసారి చెవియొగ్గి విన ననుగ్రహింపదా?

వీర—దయ్యము పట్టుకొని నీగొంతు నొక్కుచున్నదా యేమి? నోరు తెఱచి స్పష్టముగా మాటాడవేమి? గుంటలో గోదురుకప్ప లాగున మూలుగుచు నిలువఁబడకు.

విక్ర—నా—నా—నాగామోద్రేకమువలనను, నా—నా—నా సిగ్గువలనను, నా—నా— నానోటినుండి మాట పయికి రాకున్నది.

వీర—ఓహోహో! పోయినసిగ్గు నీకు మరల వచ్చినదే! విక్రమా! నామాట విను. నీవు వెంటనే తిన్నఁగా స్పష్టముగా బిగ్గరగా మాటాడనిపక్షమున, నాకు కోప మాగదు సుమా!— ఓ సుభద్రమ్మా! ఇంతటితో తననేలచూపులు మాని నీమేనకోడలి నొక్కసారి మాయుం దనుగ్రహించి యీవంక తిరుగుమను.

సుభ—కళావతీ! ఇటు తిరుగు. (అని మందలించుచున్నది.)

విక్ర—(తనలో) ఇఁక సర్వమును బయలఁబడక మానదు— (కళావతి చెంతకుఁబోయి మెల్లఁగా) [illegible]

పడఁబోకుము. కొంచెమునేవు నీ యద్భుతమును నీ మనస్సులోనే యడఁచుకో.

కళా—(తనలో) ఓయీశ్వరుఁడా! ఈకంఠస్వరము విజయపాలునిదే. ఇతఁడు నిశ్చయముగా వీరసేనునిగూడ మోసపుచ్చి యుండనేరఁడుగదా! (అని మెల్లఁగా కన్నులువిచ్చి చుట్టును జూచి యులికిపడి) అహా! ఏమి నాకన్నుల కింతభాగ్యము పట్టునా? ఓవిజయపాలా! విజయపాలా! ఇది స్వప్నమా? సత్యమా? ఏమి యీ యాశ్చర్యము!

విక్ర—(తనలో) అక్కటా! అంతయు మాగిసిపోయినది.

వీర—విజయపాలుఁడా? ఎక్కడి విజయపాలుఁడు? ఈచిన్న దానికి మతిభ్రమ కప్పినదా యేమి? వీఁడు నాకొడుకు విక్రముఁడు.

సుభ—ఇది సిగ్గులచేటు. వట్టిసిగ్గులచేటు. ఓసివివేకహీనురాలా! నీమనస్సెప్పుడును విజయపాలునిమీఁదనే యుండుటచేత నీకన్నుల కెప్పుడును సర్వమును విజయపాలమయముగానే కనఁబడుచున్నది. విక్రమసేనునికి క్షమార్పణము చేసికో.

కళా—ఇక్కడ నాప్రాణేశ్వరుఁడైన విజయపాలుఁడు దక్క నాకంటి కేవిక్రమసేనుఁడును కనఁబడుచుండ లేదు.

వీర—సందేహము లేదు. ఈచిన్నదానికి పిచ్చి యెత్తినది. చదువతివిస్తారమగుటచేత మతిపోయినట్టున్నది.

సుభ—నాకును నట్లే తోఁచుచున్నది. ఓసి మతిహీనురాలా! విజయపాలుఁ డన్నమాటకు నీయభిప్రాయమేమి? నీవీవఱకే విక్రమసేనుని జూచి యున్నావు. అదేవచ్చి యతఁ డిప్పుడు నీయెదుట నిలువఁబడి యున్నాఁడు. అతఁడే నీకు భర్త కాఁగలవాఁడు.

కళా—ఇతఁడు భర్తయగుటకు నా కాక్షేపణ యేమియు లేదు. నావిజయపాలుని నేను నిరాకరింతునా?

వీర—నీమేనకోడలికి మతి భ్రమించియైన నుండవలెను; లేదా వీఁడు మాయవేషము వేసి మనలను మోసముచేసి యైననుండవలెను ఓరీ! ఇటు రా. నీ వెవఁడవు?

విక్ర—నాస్థితి నాకే తిన్నఁగా బోధపడకున్నది. నే నెవ్వఁడనో స్మరణకుఁ దెచ్చుకొని చెప్పెదను.

వీర—నీవు నాకొడుక వగుదువా కావా? ఓరి గాడిదా! వేగిరము చెప్పు.

సుభ—నీ వెవరో శీఘ్రముగా చెప్పు. ఇప్పుడు నాకును సంశయము కలుగు చున్నది.

విక్ర—(తనలో) ఓయవివేకదేవతా! నీవు నాకు సహాయపడుము. (బిగ్గరగా) అయ్యా! నేను మీకుమారుఁడనే సందేహింపనక్కఱలేదు.—ఓసుభద్రమ్మా! నే నెప్పుడును నీసుఖసంతోషములను గోరువాఁడనయి యుండి యిప్పుడు నీ మేనకోడలికి భర్తనయి నీతోడిబంధుత్వగౌరవము పొందఁగలుగుటకు గర్వపడు చున్నాను. తానిప్పుడు చూచుచున్నది తనప్రియవల్లభుఁ డయినవిజయపాలుని నే యని నేనిప్పుడు నాకళావతితో వేఱుగ జెప్పనక్కఱలేదు. ఈచిన్నదానియొక్క మనోగతవిశేషమును గుర్తెఱిఁగినవాఁడనయి యీమెకు మనస్సంతుష్టి కలుగుటకయి నేనా వేషభావలను స్థితిగతులను ధరించి యీమెమనస్సుయొక్క నైర్మల్యమును శోధించినాను. ఈమె నిర్మలహృదయము నాపరీక్ష కాగి తనయవ్యాజప్రేమను దృఢపఱిచినందున, ఇక నే నారోపించుకొన్న నీచవేషధారణమును నామధారణమును

విడిచి స్వావేషముతో నున్నతస్థితిని బొంది యూయువ్యాజానురాగము యొక్క ఫలమును స్థిరముగా ననుభవింపఁ గాంక్షించు చున్నాను.

కళా—అలాగునా! (కోపముతో) అట్లయినపక్షమున నీకఁ నే ననుకొన్న ట్లిల్లు విడిచి లేచిపోవుట లేనేలేదా?

వీర—విక్రమా! నీవు నిశ్చయముగా మటుమాయలమారివి. నాకుఁ జూడఁగా నీవందఱినిమించిన నెఱజాణవుగాఁ గనఁబడుచున్నావే!

విక్ర—నన్నూరక మీరు పొగడు చున్నారు. అంత గౌరవమునకు నేను తగను. ఆత్మశ్లాఘన వినుటకు నాకు సిగ్గగుచున్నది. నాస్వభావము దేవరవారు నెఱుఁగుదురుకదా! మొదటినుండియు నా సిగ్గే నన్ను చెఱుపుచున్నది.

వీర—మంచిది. మొట్టమొదట నటించినట్లు నీవు కేవల జడస్వభావుఁడవు కావని తెలిసికొనుటచేత నాకు సంతోషము కలుగుచున్నది. ఓరిగాడిదా! నీవు నీకన్నతండ్రినే వంచించినావుగదరా! నీపశ్చాత్తాపమును, సుతధర్మమును, విధేయతయు, ఇవే కాఁబోలును! అంత యాకస్మికముగా మనస్సు మార్చుకొనుట చూచి నే నిప్పుడే యనుమాన పడినాను. వీరిపేరు లెప్పుడును విన్నట్టే నీకు జ్ఞప్తిలేదు కాదా! భీమవరములో నుండెడుకళావతి అవునా? నామనస్సు సంతోషపెట్టుట యొక్కటియే నీకుఁ గావలెనుగాని నీ కితరముతో దేనితోను పనిలేదు కాదా! ఔరా! నీ వెంత మాయలమారి దొంగవురా! చూడు. (అని వ్రేలితో కళావతిని జూపుచు) ఈచిన్నవానిది తెల్లకన్ను. అవునా! కొంచెము రాగివెంట్రుకలు. అవునా! ఓరి జిత్తులమారినక్కపోతా! నీ విప్పుడు తలయెత్తుకొనుటకుఁగూడ సిగ్గుపడకున్నావు!

విక్ర—నాకు నలుగురిలో తలయెత్తుకొనుటయే కష్టంతో

కష్టముగానున్నది. నామనస్సంతయు కలతనొందినది. నారూపము చేతనే నామతి చెడినట్టు మీరు తెలిసికోవచ్చును.

సుభ—వీరసేనా! ఇప్పుడు క్రొత్తక్రొత్తవింతలు బయలుఁబడు చున్నవి. ఓహో! విక్రమసేనా! అట్లయినయెడల, ఈయుత్తరములు వ్రాసినవాఁడవును నీవేకదా? ముసలిపిశాచ మని నాకు బిరుదు పే రిచ్చినందునకయి నీయెడల నేను కృతజ్ఞురాల నయి యుండవలెను. ఓయిభగవంతుఁడా! నాపాండిత్యవిషయమయి గేలిచేసినదికూడ నీ ఘనుఁడేకదా?

విక్ర—అయ్యా! మీరిప్పుడు నాకడ్డుపడి నన్ను రక్షింపక పోయినపక్షమున నాసిగ్గు నన్ను బ్రతుకనీయదు. ఈలజ్జాభరమునకు నేను తాళఁజాలను.

వీర—సుభద్రమ్మా! మనము పోదము రా. వెనుకజరిగిన దానిని సర్వమును మఱచిపోయి మనము వీరిని క్షమింపవలెను. ఇప్పుడు మన ముద్దేశించినట్లు సర్వమునను కూలముగాముగిసినందున, నే నిప్పుడు కోపము వహించి సంతోషభంగము చేయఁజాలను. సుభద్రమ్మా! నీవో ?

సుభ—వీరసేనా! మీరన్నట్టు గతమును మనమిప్పుడు తల పెట్టఁగూడదు. ఈపసివాండ్రి చిన్నతనపుచేష్టలను లక్ష్యముచేయక మనము ముందుసంగతి యాలోచించవలెను.

వీర—వీరినిద్దఱిని దిగవిడిచి మనము పోదము రా. మనము కాలు కదల్పఁగానే వీరిద్దఱు నొండొరుల కౌఁగిళ్ళలోఁ బెనఁగవలె నని తమకపడుచున్నట్టున్నారు. మన మిక్కడనుండి రసభంగము చేయ రాదు, పోదమురా. విక్రమా! ఈమె కన్నులు నేను చెప్పిన ట్లున్నవా? చెక్కులో? నవ్వుమొగమో? పలువరుసయో? సుభ

ద్రిమ్మా! లే. వీరి కిది సంతోష సమయము. నేనిప్పుడు నా సంతోషము పట్టజాలకున్నాను. మన మావలికేఁ బోయి నవ్వుకొందము రా. (అని పాడుచు సుభద్రమ్మను చేయిపట్టుకొని లాగికొని పోవుచున్నాఁడు.)

కళా—(మొగము ముడుచుకొని మాటాడక కూరుచున్నది)

విక్రి—(తనలో) ఈమె దీర్ఘాలోచన చూడఁగా నాకు శుభసూచకముగా తోఁచదు. (బిగ్గరగా) నాప్రాణేశ్వరీ! కళావతీ! అంత గంభీరముగా నాలోచించుచున్నా వేమి?

కళా—ఏమి!

విక్ర—(తనలో) ఇంతవఱకు వచ్చునని నే నప్పుడే యనుకున్నాను. "ఏమి" అన్న యీచిన్నపదము నాగుండెలు పగుల్చుచున్నది. (బిగ్గరగా) కళావతీ! మన మొఁడంబడులము చేసికొన్న ప్రమాణమువలననే కాక యిప్పుడు మన పెద్దవారి యనుమతి వలనఁ గూడ సుఖభాజనుల మయి ధన్యులము—

కళా—(కోపముతో) పెద్దవారి యనుమతి వలననా? అవును!

విక్రి—ప్రియురాలా! మనము తలపెట్టిన సాహసకార్యమునకు విశ్రాంతి కలిగినది. తుట్టతుద కిప్పుడు సుఖకాల మాసన్నమయినది. అనుభవింతము రా. నీసొత్తు విషయ మయి తరువాత న్యాయవాదులను—

కళా—న్యాయవాదులా? న్యాయవాదియన్న పేరు చెప్పిన నాకు తలనొప్పి.

విక్రి—పోనీ. న్యాయవాదుల నడుగనక్కఱలేదు. మనలో మనమే లిఖితము—

కళా—లిఖితమా? లిఖితమన్న పేరే నాకు పనికిరాదు.

విక్ర—ఓప్రాణేశ్వరీ! నీ కింకరునియెడల నిర్దయత్వము వహింపఁబోకు. నీ యడుగులమీఁద వ్రాలి ప్రార్థించుచున్నాను.

(అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

కళా—లెమ్ము. నేను నీ స్వామ్యగుడునని నీవు నిశ్చయముగా నెఱిఁగియున్నప్పుడు పాదములమీఁదఁ బడవలసినపని యేమున్నది?

విక్ర—(లేచి) ఓకాంతా! నీ స్వాంతమున కంత నిర్బంధమక్కఱలేదు. నీ హృదయము నన్ను విడిచినపక్షమున, తక్కినవానిని నేనపేక్షింపను. (తనలో) నే నిప్పుడు కొంచెము బెట్టుచేసి చూచెదను.

కళా—(లేచుచు) నా మనస్సులో నున్నది స్పష్టముగాఁ జెప్పెదను విను. నీవు నీ కార్యమును నీచమగు పౌరుషహీన మయిన వంచనచేత సాధించుకొన్నావు. అందుచేత మోసముచేసిన శిక్షకు నీవర్హుఁడవు. నా హృదయదౌర్బల్యమును కనిపెట్టి నన్ను నీవు పిల్లదాని నాడించిన ట్లాడించుచున్నావు. నీలోనీవు నన్నుఁజూచి నవ్వుచు నీవు పొందిన విజయమునకు సంతోషించుచున్నావు కాఁబోలును!

విక్ర—కళావతీ! లేనిదోష మారోపించి యిప్పుడు నీవు నాయెడ నపచారము చేయుచున్నావు. నేను చెప్పునది సాంతముగా విని—

కళా—నా బంధువుల నందఱిని మాయ చేయుచున్నా మను భ్రమలోనుండి, వారందఱి కన్నులు గప్పి తప్పించుకొని పాఱిపోయి వారికి కోపము తెప్పించి నా సామర్థ్యము చూపవలె నని నేను కొండంతయాశ పెట్టుకొని యుంటిని. అట్లుండఁగా నా మేనత్త యొక్క యంగీకారమువలనను సమాధానము వలనను నాయాశ యంతయు నిమిషములో భగ్న మయిపోయినది. వారిని మోసపుచ్చుటకు

మూటుగా తుద కిప్పుడు నే నొక్కతెనే మోసపోయిన దాన నయి నాను. (అని కోపోద్రేకముతో నడుచుచు, ఇదిగో పటము—విజయ పాలుని పటము. (పటమును అవికలో నుండి పయికిఁదీసి) న న్నెంత తెన్నివిధముల భయపెట్టుచున్నను దూషించుచున్నను లక్ష్యము చేయక యీ చిత్రపటమును నేనింత కాలము రేయింబగళ్ళు హృదయ మధ్యమున ధరించినాను. నీపట మిఁక నీవే పుచ్చుకొమ్ము. (అని మీఁద విసరివైచి) ఈ ప్రతిరూపమును నాహృదయమునుండి యెంత యనాయాసముగాఁ దీసివేయుచున్నానో యంత యనాయాస ముగానే దీనికి మూలమైన పురుషునిగూడ నేను నా హృదయములో నుండి తఱిఁమివేయఁ గలుగుదు నని నీవు నిశ్చయముగా నమ్ముము.

విక్రి—ఓ కాంతా! ఈవిషయములో నీకును నాకును భేదము లేదు. ఇదిగో కళావతియొక్క పటము. (అని పయికిఁదీసి) ఈప్రతి రూపమునకు నిజరూపమునకును నా కెంత వ్యత్యాసము కనఁబడు చున్నది! ఈదివ్యసుందర విగ్రహముయొక్క కలకలలాడుచున్న యీ నవ్వుమొగమే కదా మొట్టమొదట నన్నాశలపెట్టి నా హృద యము నపారసౌఖ్యానందసుధారాశిలో ముంచినది! ఎన్నడునుతుడిచి వేయుట కసాధ్య మగునట్లుగా కామదేవుని పుస్తకములో శిలాక్షర ములతో వ్రాయఁబడియున్న శపథములను బలికిన యీచిన్న పెదవులే కదా! అవియన్నియు పూర్వపు గాథ లయిపోయినవి. అంతయు నిప్పుడు మరల మొట్టమొదటికి వచ్చినది. ఓ సుందరీ నీ నిరుపమాన సౌందర్యము ముందట నీ ప్రతిబింబ మంత చక్కనిదిగా నుండక పోయినను, నామనస్సునకు మాత్రము దీని మనోహరత్వములు దీని యందలి గౌరవమును దీని నిజరూపమునకంటె తక్కువ పడలేదు.

గాన దీనిని నేనెడఁబాయఁజాలను. (అనిమరల హృదయమున ధరించు చున్నాఁడు).

కళా—(కొంత శాంతతతో) ఇది యంతయు నీదోషమే. స్వయంకృతాపరాధమును దెలిసికొని నీవు తృప్తుఁడవయి యుండ వచ్చును.

విక్ర—నిశ్చయముగా తృప్తుఁడనయినాను. ఇంతకంటె నీవు మొట్టమొదటనే ప్రేమ చూపి యాశపెట్టకున్న నెంతో బాగుండును. ఆహాహా! ఇది యెంత యయినను సరసముగా నున్నది. నూఱుల కొలఁదిబాసలుచేసి వానినెల్ల తప్పుట నీదృష్టికి గొప్పగా కనఁబడు చుండలేదు. ఆవాగ్దానములెల్లను నీదృష్టికి తృణప్రాయము లయినవి. అయినను లోకులుమాత్రము కళావతి తనహృదయమునే తానెఱుఁగ దని చెప్పకొనక మానరు. ఇతరులమాటలతో నీకేమిపని? లోకు లొకవేళ తమదుస్స్వభావముచేత ప్రియుఁడు ప్రియురాలియొక్క యాదరము చూచి 'మొగము మొత్తి విడిచి పోయినాఁడని వాదు వేసినను వేయవచ్చును. ఆయపవాదముసహితము నీమనస్సున కాయాసము తోపించకుండునుగాక!

కళా—ఈయవమానమును సహింపఁజాలను. (అని కన్నీరు పెట్టుకొను చున్నది.)

[అంతట సుభద్రమ్మయు, వీరసేనుఁడును ప్రవేశించుచున్నారు.]

సుభ—బావా! రమ్ము. మనము కొంచెము సేపు వీరికామో న్మాదమునకును శృంగారప్రలాపములకును విఘ్నము కలుగఁజేయ వలెను.

కళా—ఓసీచకృతఘ్నుఁడా! ఇది నీదోహమును వంచన మును మించి యున్నది. (అని పెద్దపెట్టున నేడ్చుచున్నది.)

వీర—ఇదేమి వైపరీత్యము? ఇది చూడఁగా నాకత్యద్భుతమునఁగ నున్నది. సుభద్రమ్మా! ఇటువంటి కామోన్మాదమును శృంగారప్రలాపములును నేనీవఱకెక్కడను వినియు కనియు నుండలేదు. ఈరసాభాసమున కర్థమేమి? నాకు తెలియకున్నది.

విక్ర—ఈచిన్నదాని నడుగుండి.

సుభ—ఓయి దేవుఁడా? నాముట్టుకు నాకత్యాశ్చర్యకరముగా నున్నది. అమ్మా! కళావతీ! దీనికి కారణ మేమి?

కళా—ఈయన నడుగు.

వీర—నాకు కోపావేశముతో దేహము పరవశమగుచున్నది. ఓరీ! విక్రమా! నీవీలోపల నీవఱకు వేసిన వేషములుగాక క్రొత్త వేషము వేసి మాఱిపోలేదుగదా? నిజము చెప్పు.

సుభ—అబ్బాయీ! ఇప్పుడు మఱేమియు మాయ లేదు గదా? నీవు రావణాసురునివలె నిమిషములో నఱియొక మాయా రూపమును ధరించినావేమో చెప్పు.

విక్ర—చెప్పుమని నన్ను నిర్బంధపెట్టకుండి. ఈవిషయమయి యీచిన్నదే నాకంటె చక్కఁగా చెప్పఁగలదు.

కళా—వెనుక నొకసారి యిఁక విజయపాలుని నెప్పుడును తలఁచుకో వలదని నీవు నాకాజ్ఞ యిచ్చినావు. ఆవిజయపాలుఁ డిప్పుడిక్కడ నీయెదుటనే యున్నాఁడు. అప్పటి నీ యాజ్ఞకు నేనిప్పుడు లోఁబడుచున్నాను. ఈనిమిషము మొదలుకొని నీవు చెప్పినట్లు నే నీతని పేరు తలపెట్ట మానుచున్నాను. (అని లేచిపోవుచున్నది.)

సుభ—ఓయి భగవంతుఁడా! ఇది పెద్ద యింద్రజాలము వలె నున్నది! ఇప్పుడు సమస్తము తాఱుమాఱయిపోయినదే? ఓయీ!

విక్రమసేనా! నీవు విరసోక్తులాడి నా మేనకోడలి మనస్సు నొప్పించ లేదుగదా?

వీర—సత్య మిప్పుడు బయటఁ బడినది. ఆ-హా-హా-హా! విక్రమా! కోపావేశముచేత పరవశుఁడ వయి నీ వా చిన్నదాని మనసు నొచ్చునట్లుగా నేవో గర్వోక్తులు పలికినావు.

విక్రి—లేదు. తమ పాదములతోడు—

సుభ—ఛీఛీ! విక్రమసేనా! నీ వేమో యన్నావు.

విక్రి—అమ్మా! నీతోడు—

వీర—ఓరి దొంగా! నీమాట నేను నమ్మను. మాటాడకు. తన చిన్నతనములో నీతండ్రియు నిట్లే చేసెడివాఁడు లే. ఈ వేగిర పాటును క్షాత్రమును మన క్షత్రియకులములోను ముఖ్యముగా పౌరుషభూషిత మైన మనవంశములోను మొదటినుండియు పరంపరగా వచ్చుచున్నవే. ఆహాహా! పాపము! ఎందుకు నీవాచిన్నదానిని నిష్కారణముగా బెదరఁ గొట్టినావురా?

విక్రి—ఈశ్వరసాక్షికముగా—

వీర—నీమాట నేను వినను. నీ ప్రసంగము కట్టిపెట్టు. సుభద్రమ్మ మిమ్మిద్దఱిని సమాధానపఱచును లే.—ఓ సుభద్రమ్మా! నీ వా చిన్నదానిని సమాధానపఱచి వీనిమీఁది కోపము పోఁగొట్ట వలెను. వీని స్వభావమే యిట్టిదని నీవు మీకళావతితో చెప్పు. ఈపౌరుషము మాకుటుంబములో నందఱికిని సహజగుణమే యని కూడ చెప్పు.—ఆహాహాహా! విక్రమా! మనము పోదమురా.— సుభద్రమ్మా! వీడు బొత్తిగా దూరాలోచన లేని దౌర్భాగ్యుఁడు.

(అని విక్రమసేనుని లాగుకొని పోవుచున్నాఁడు)

శుభ—ఓవీరసేనా! మీరు నాతో నింతగాఁ జెప్పవలసిన పనిలేదు.—విక్రమసేనా! విచారపడఁబోకు.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

---

3. రంగము—ఉత్తరవ్రుదీథి

[పురుషోత్తమదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పురు—విక్రమసేనుఁ డెక్కడ నడఁగిపోయినాడో తెలియకున్నది. ఈయుద్యోగస్థు లెప్పుడును స్త్రీలవ్యవహారములలో నితరుల కడ్డము వచ్చుచునే యుందురు. నేను పూర్వ మీలాగుననే వసుమతిని వివాహము చేసికొనుటకు మాటలు జరవుచుండఁగా, ఇంతలో నడుమ నెక్కడనుండియో యొకయుద్యోగస్థుఁ డాకస్మికముగావచ్చి యాచిన్నదానిని నాకంటఁ బడనీక యెగనెత్తుకొనిపోయి తాను వివాహము చేసికొన్నాఁడు. యౌవనవతులైనకన్యలను తమవలలో వేసికొనుట కీయుద్యోగస్థులవద్ద నేమిమంత్రము లున్నవో! వారి యెఱ్ఱతలగుడ్డలుచూచి జవ్వనులువలచి పైఁబడి వెంటపరుగెత్తుదురు కాఁబోలును! ఆవచ్చుచున్నవాఁడు విక్రమసేనుఁడుకాఁడా? అతఁడే. సందేహము లేదు. అతఁడొకవేళ తనకృషిలో సాఫల్యము నొందినాఁడేమో! పొందినపక్షమున నామనస్సున కూఱట కలుగదు. అతఁ డిప్పుడు మాటాడుచున్న దెవరితోనయి యుండును?

(అని ప్రక్కకు నడుచుచున్నాఁడు)

[విక్రమసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విక్ర—(తనలో) నేను పన్నినతంత్రమంతయు నిరర్థకమయినది. ఇటువంటి మహోపాయములు పన్నిన పాపనల మనుభవింప

వలసినదే. ఆమెపౌరుష మిట్టిగతి తెచ్చునని నేను స్వప్నావస్థలోను తలఁపలేదు. ఆమెది వట్టిబూతిగుండె. నేనువుట్టి బుద్ధియెఱిఁగిన తరువాత నిటువంటి దురవస్థను నేనెప్పుడు ననుభవించి యెఱుఁగను. నాగొంతుకనుగాని నాకడ్డువచ్చిన మఱి యెవ్వరిగొంతుకనైననుగాని నేనిప్పుడు నిర్విచారముగా కోయఁగలను.

పురు—ఓహో! ఇప్పుడు నాయదృష్టము ఫలించినది. నా భాగ్యముచేత నేను మంచిసమయమునకు వచ్చినాను. నాపని కనుకూలముగా నితఁ డిప్పటికంటె మంచిస్వభావముతో మఱియెప్పుడు నుండఁడు. కాఁబట్టి యిప్పుడే యితనితో ప్రసంగమారంభించి కలహము పెట్టుకోవలెను.—(అని విక్రమసేనునియొద్దకునడిచి) విక్రమ సేనా! ఆవిషయములో నీయభిప్రాయములో నే నేకీభవింపఁజాలను.

విక్రమ—వాదవిషయములో నీవు మహాపండితుఁడవయినట్టున్నావే. నే నేయభిప్రాయమును తెలుపనిదే నాయభిప్రాయముతో నేకీభవింపఁజాల కున్నావు!

పురు—నీవు చెప్పినది సయుక్తికముగా లేదు. ఒకమనుష్యుడసత్యము లయినమాటలుపలుకఁగలిగినట్లే పయికితెలుపకపోయినను లోపల నసత్యము లయినయభిప్రాయములను గలిగి యుండవచ్చును.

విక్రమ—అది సత్యమేకాని యొకమనుష్యుఁడు తనయభిప్రాయములను పయికి తెలుపకున్నంతవఱకు పరులతో కలహకారణము కలుగదని నేను భావించెదను.

పురు—అట్లయినపక్షమున, ఈవిషయములో నే మనయిద్దఱికి నభిప్రాయభేదము కనఁబడుచున్నది. వివాదమున కిదియే తగినంత కారణము కావచ్చును.

విక్రమ—నీవు పెద్దమనుష్యుఁడవని నేనీవఱ కెఱుఁగనివాఁడ

నయి యుండిన పక్షమున నీవిషయమున నేనిప్పుడు దురభిప్రాయ పడియుండుదును. నాతో వివాదము పెట్టుకొనుటయే నీయభిప్రాయము కాకపోయినపక్షమున, ఇప్పటి నీమాటలయభిప్రాయ మేమో నాకు తెలియకున్నది.

పుఱ—నీవు సూక్ష్మబుద్ధివి. నాయభిప్రాయమును సరిగా కనిపెట్టినావు. (వంగి నమస్కరించి) నా నోటినుండి రావలసినమాట ముందుగాఁ నీనోటినుండియే వచ్చినది. నే నిప్పుడు నిన్ను యుద్ధభిక్ష వేఁడుటకయి వచ్చినాను.

విక్రి—అట్లయినపక్షమున నీ మనోరథమును నేను విఫలము చేయరాదు. మంచిది. నీవు కోరినట్లే చేసెదను. అయినను నీవు నాతో పోరాడఁగోరుటకుఁ గల కారణమేమో యనుగ్రహించిన పక్షమున సంతోషించెదను.

పుఱ—ఆవిషయమయి నీమనస్సు నాయాసపెట్టఁబోకు. ఇప్పుడున్నట్టుగా మన కలహము మహాదివ్యమైన కలహము. దీనికి కారణమును దెలిపి మన మిప్పుడు దీని సారస్యమును చెడఁగొట్ట కూడదు. నీకు మఱపు మిక్కిలి యెక్కువ. కాకపోయిన పక్షమున వారము దినములలోపల నీవు నాకుచేసిన యపకారమును నీవింతలో మఱచియుండవు. ఆవిషయమయి మనకు వాదులాట యక్కఱలేదు. యుద్ధమునకు నీకు స్థల మెక్కడనో యనుకూల మెప్పుడో మాత్రము చెప్పు.

విక్రి—నీవంత యభిలాష పడుచున్నావుగనుక, నీయుబలాట మెంతశీఘ్రముగా తీఱిన నంతమంచిది. అది యీసాయంకాలమే జరగవచ్చును. ఇక్కడనే యీచేరువ పొలములోనే కావచ్చును. ఇక్కడ మనపనికి విఘ్నము చేయువా రెవ్వరు నుండరు.

పురు—ఎవ్వరో తుచ్ఛులుగాన యిటువంటి విషయములలో పెద్దమనుష్యు లెవ్వరును విఘ్నములు చేయరు. కారణ మేమో తెలియదుగాని యీ దేశములో నిటువంటి విషయము కొంచెము పయికి పొక్కఁగానే జనులు పెద్దయల్లరిచేసి పెద్దమనుష్యులను సుఖముగా నెమ్మదితో పోట్లాడనియ్యరు. నా కీసాయంకాల మాఱు గంటల కీరాజుగారి జనోద్యానవనములోఁ గొంచెము పనియున్నది గనుక, నీ కాక్షేపణ లేనిపక్షమున మన మక్కడ కూడుకొనుట నా కనుకూలముగా నుండును. ఏకక్రియాద్వ్యర్థకరీ యన్నట్లు నేను రెండుపనులు నొక్కసారియే చక్కఁ బెట్ట వచ్చును.

విక్రి—ఇది నాకును సమ్మతమే. ఆఱుగంట లయినతరువాత మన మక్కడ కలిసికొని సర్వమును సావకాశముగా నేర్పాటు చేసికొందము.

పురు—నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. అప్పుడు దూరమునుండి తుపాకులతో పోరాడుటకు మంచిసమయము కాక పోయినను చేరువను నిలిచి కత్తులతో యుద్ధముచేయుటకు తగినంత వెలుతురుండును. ఇంతకును వచ్చినపని యనుకూలముగా ముగిసినది. ఇఁక నామన స్సూఱటపొందును.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

విక్రి—మంచిసమయమునకు వచ్చినావు. ఓదర్పసారా! నీ నిమిత్తము నేనే రావలె ననుకొను చున్నాను. నాపాలిటి యదృష్టదేవతయు సర్వభూతములును సమస్తమును నా కిప్పు డెదురుతిరిగినవి. నామనస్సునకు విసుగుపుట్టి నేను నిరుత్సాహుఁడ నయి యున్నాను. నాభుజవీర్యము చూపి వీరశయనము పొందుటకు

నాకిప్పు డవకాశము లభింపకుండిన పక్షమైన, నేనీదుఃఖకథను నీతో జెప్పలేక పోయియుందును.

దర్ప—నీభావ మేమో నాకు బోధపడకున్నది. కళావతి తన మనస్సు మార్చుకొన్నదాయేమి? పెద్దలయొక్క యాజ్ఞకూడ నిప్పు డాచిన్నదానియొక్క యిష్టమునకే యనుకూల పడినదని విన్నానే!

విక్ర—ఆమెయిష్టము నా కనుకూలముగా నున్నప్పుడు పెద్దల యాజ్ఞ ప్రతికూలముగా నుండినది. ఇప్పుడు పెద్దలయాజ్ఞ నా కనుకూలము కాఁగానే యామె యిష్టము ప్రతికూలముగా తిరిగి నన్ను తిరస్కారభావముతోఁ జూచుచున్నది.

దర్ప—నీవిఁకఁ జేయఁదలఁచుకొన్న దేమి?

విక్ర—వేయిమాట లెందుకు? నా కడమాట విను. ఇప్పు డొక్క పెద్దమనుష్యుఁడు వచ్చి తన్ను నాగొంతుక కోయనిమ్మని కోరినాఁడు. నేనాతని కోరిక చెల్లింపఁదలఁచుకొన్నాను. అంతయా నింతే.

దర్ప—ఈవక్రభావములు మాని తిన్నఁగా చెప్పు.

విక్ర—ఇప్పుడు నేను చెప్పినది వక్రభావ కాదు! సత్యమే. నే నెప్పుడు నేదియు నుద్దేశింపక పోయినను నేనేమో తనకేదో యుపకారము తలపెట్టినానని చెప్పి పురుషోత్తమదేవుఁడు వచ్చి నన్నీ సాయంకాల మాఱుగంటలకు తనతో యుద్ధమునకు రమ్మని పిలిచి నాఁడు. ఈవిషయమయియే నేను నీవద్దకు రావలె ననుకొన్నాను. నీవు నాకు తోడురావలెను.

దర్ప—ఇందులో నేదో భ్రమయున్నది. ఈసంగతిని పురు షోత్తమదేవుఁడే వివరముగాఁ జెప్పి సమాధానపడుటకు సందేహ

ముండదు. ఇది మఱియొకప్పుడైన బాగుండును. నీవు చెప్పినది యీ సాయంకాల మనేకదా? మఱియొక సమయమైన ననుకూలముగా నుండును.

విక్రమ—అనుకూలము కాకేమి? అప్పుడు తగినంత వెలుతు రుండును. పురుషోత్తమదేవుఁడు చెప్పినట్లుగా దూరమునుండి తుపాకులతో పోరాడుటకు మంచిసమయము కాకపోయినను చేరువను నిలిచి కత్తులతో యుద్ధము చేయుట కనుకూలము గానే యుండును. తుపాకులతో పోరాట మేఁట! వానితుపాకులు కాలిపోను!

దర్ప—చారుమతితో సంభవించిన వివాదమును బట్టి నా మన స్సిప్పుడు మంచిస్థితిలో లేదు. పీడాకరమైన నా దుస్స్వభావమునుబట్టి నే ననాదరణ చూపి నిష్కారణముగా నా ప్రియురాలి మనస్సు నొప్పించినాను. మా వివాదము తీఱి యామె మనస్సు సమాధానపడువఱకును నేను మరల పూర్వపు దర్పసారుఁడను కాఁజాలను.

విక్రమ—దర్పసారా! నీవు నిజముగానే చారుమతి కర్హుఁడవు కావు.

[ఒక చేటిక యుత్తరము తెచ్చి దర్పసారునిచేతిలోఁ బెట్టి నిష్క్రమించు చున్నది.]

దర్ప—ఓ విక్రమా! ఇది చారుమతి వ్రాసినది. దీనిని విప్పుటకు నాకు భయ మగుచున్నది. ఇదే నీకును నాకును కడపటిసెలవని యింక వ్రాసినదేమో! తాను వ్రాసినయుత్తరముల నన్నిటిని మరల తనవి తనకుఁ బంపుమని వ్రాసినదో!—అహా! నే నిప్పుడు స్వయంకృతాపరాధఫల మనుభవించు చున్నాను.

విక్రి—అది నాచేతికిమ్ము. (అని యుత్తరము పుచ్చుకొని విప్పి) ఇందులోనొక్కటేవాక్యమున్నది. ఇఁక నీ పనియయిపోయినది.

దర్ప—విక్రమా! నన్నూరక బాధింపక యున్న దేమో చెప్పు.

విక్ర—అట్లయినయెడల, చదివెదను విను. (అని చదువుచున్నాఁడు.) "నాయెడలఁ జూపినయనాదరమునిమిత్తమయి నా ప్రియుఁడైనదర్పసారుఁడు నీవటకే తనమనస్సు పరితాపపెట్టి శిక్షించియుండునని నేను నిశ్చయముగా నెఱిఁగినదాననయి నందున, నే నావిషయమై యేమియు ముచ్చటింపక యొక్కసారివచ్చి సాధ్యమయినంతశీఘ్రముగా దర్శనమిచ్చి పొమ్మనిమాత్రము నాహృదయేశ్వరుని వేఁడుచున్నాను. ఇట్లు భవత్పాదసేవకురాలు—చారుమతి.' ఆమె యెట్లు మార్గముపట్టుపట్టి నీమీఁద పగతీర్చుకొనుచున్నదో చూచినావా! (అని యుత్తరమును చేతి కిచ్చి) ఇది విన్నపిమ్మటఁ గూడ నీ వేమియు సంతోషముగా నున్నట్టు కనఁబడకున్నావే!

దర్ప—నేను సంతోషముగానే యున్నాను. కాని—

విక్రి—నీ కానులు గీనులు దూరముగా పెట్టు. ఇతరులవల్ల నుల్లాసకర మయినమాట విన్నప్పుడు సంతోషించి యూరకుండక వెంటనే "కాని" యన్న పనికిమాలినమాట యొకటిపెట్టినీ వెప్పుడును సంతోషభంగమును చేయుచునే యుందువు.

దర్ప—అవునుగాని, విక్రమసేనా! నీవు నాప్రాణస్నేహితుఁడవు గనుక నిన్నొక్కమాట యడిగెదను. న్యాయమైనయుత్తరము చెప్పు. సంధి గోరుచు వ్రాసినయీయుత్తరములో కొంచెము వేగిరపాటును రసహీనతయు నున్నదా లేదా? సమాధానవాక్యము లెప్పుడును మొట్టమొదట పురుషులవద్దనుండి రావలెనుగాని స్త్రీలవద్దనుండి

రాఁగూడదుగదా! పురుషులు ప్రార్థించి దీనాలాపములచేత తమమనస్సులను కరగించుననుకును తరుణులు తా ముదాసీనతను నటింపవలెను. వారివలపువలెనే వారికిష్టమయి సముచితముగా తనంత బయలఁబడఁ గూడదు.

విప్ర—నీమాటలు వినుటకు నాకిష్టము లేదు. ఇఁక నీ వెంత చెప్పినను కార్యము లేదు. ఈవిషయమయి నాతో మాటాడకు. నేనీలోపుగా కొన్ని పనులు చేసికోవలసి యున్నవి. నీవు నేఁడుసాయంకాలములోపల మాయింటికి వచ్చి మఱచిపోక నాతోమాటాడి మరి పో. మనోరథసిద్ధికొఱకెంతో కష్టపడి యెన్నోమాయలు పన్ని విశ్వప్రయత్నములు చేసి తుదకుపరులదోషమువలనఆశాభంగమునొందిన నావంటివాఁడు కొంచెము విచారపడి విసుఁగుకొన్నఁ గొంతయుండమును చందమునుగా నుండునుగాని యేకష్టములేక యప్రయత్నముగా కార్యసిద్ధి యైనప్పుడు సుఖముగా ననుభవింపలేక కుడిచి కూర్చుండి లేనిపోనికష్టములు కల్పించుకొని నీవంటివాఁడు విసుఁగుకొన్న పరిహాసపాత్రుఁడు కాకమానఁడు (అని నిష్క్రమించుచున్నాఁడు.)

దర్ప—ఇతఁ డన్నమాటలు నామనస్సునకు నాటుకొన్నవి. అయినను నాగుణమును మార్చుకొని పరికిమాలినసంతుష్టి పొంది యూరకుండఁజాలను. ద్వంద్వయుద్ధమునకు సహాయుఁడవు కమ్మని ఇతఁ డడుగుటచేత నాకిప్పు డొకయాలోచన తోఁచుచున్నది. నేనీయుద్ధములో ప్రవేశించి యింకుమాలమున చారుమతికి నామీఁద నిజమైనప్రేమ యున్నదో లేదో పరీక్ష చేసి చూచెదను. ఈపరిశోధనవలన నామెవలపు నిర్మల మాయినదిగా తేలినపక్షమున, నేను ధన్యతముఁడనయి నాసందేహములు విడిచి తృప్తినొంది యుందును.

అట్లుగాక యీశోధనలో నొకవేళ చారుమతియొక్క యనురాగము శుద్ధమయినదిగా తేలనిపక్షమున, ఇంతటితో నేనామెసంబంధమును విడిచి యామెను మఱియొక బుద్ధిహీనుని పెండ్లిగమ్మని వదలిపెట్టి యూరకుండుట సర్వోత్తమము. (అని నిష్క్రమించుచున్నాడు.)

## పంచమాంకము



౧. రంగము—చారుమతియొక్క గది.

[చారుమతి ప్రవేశించుచున్నది.]

చారు—ఈయుత్తరము చూడఁగా నాకుభయమగుచున్నది. ఎవ్వరి కేమి యుపాయము సంభవింపవచ్చునో! అతఁ డేమి తలఁచుకొన్నాఁడో! నన్నొంటిగాఁ జూడవలెనని యేలకోరవలెను? ఓ దర్పసారా! నీవు నామనస్సెంత నొప్పించుచున్నావు?

[దర్పసారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చారు—దీనికర్థమేమి? దర్పసారా! ఇంత జాగరూకత యెందుకు?

దర్ప—ఓ చారుమతీ! చిరకాలము నిన్ను చూడఁబోనుగాన నీవద్ద సెలవు పుచ్చుకొని పోవలెనని వచ్చినాను.

చారు—ఓ యీశ్వరా! ఈమాటల కర్థమేమి!

దర్ప—నీయెదుట నిలువఁబడియున్న నేను ప్రాణత్యాగమునకు తెగించియున్న నిర్భాగ్యుఁడను. ఉలికి పడఁబోకు. నా దుర్బలస్వభావము నా కీగతి తెచ్చినది. అప్పుడు నిష్కారణముగా నిన్ను తూలనాడి నీకు కోపము తెప్పించి వెడలి పోయినాను. అనివార్యమైన యొక దుర్దశచేత నాకీలోపల నీకలహము సంప్రాప్త మయినది.

కాబట్టి నేను తత్క్షణమే యీ దేశమును విడిచి లేచి పోవలెను. ఓ చారుమతీ! నాకీ దుర్దశ సంభవించుటకు పూర్వమునందే నిన్నర్ధాంగి నని పూర్ణముగ బిలుచుటకుఁ దగిన భాగ్యమును నేను పొందిన యెడల, నాయీ దేశత్యాగమువలన నాకింత దుఃఖము కలిగియుండక పోను.

చారు——నీకు సంభవించిన యీ దుర్దశయొక్క స్వభావమును చింతించి నామనస్సు చింత నొందుచున్నది. ప్రాణాపాయకరమయిన యీ కారణమువలనఁగాక మఱియొక కారణమువలన నిప్పటి కష్టము సంభవించి యుండినయెడల, నాయనురాగ విషయమున నీమనస్సు లోనున్న సంశయమును తొలగింప నవకాశము కలదు కదాయని నాహృదయము కొంత విశ్రాంతి పొందియుండును. నా హృదయమును నేను చిరకాలము క్రిందటనే నీకు సమర్పించియున్నాను; ఇప్పుడు నాశరీరమును గూడ నీకర్పించెదను. దేశము విడిచి మన మిద్దఱము ను గలిసి పాఱిపోదము. శత్రువులను తప్పించుకొని పాఱి పోయి క్షేమముతోనున్న తరువాత మాతండ్రిగారి యిష్టమును చెల్లింపవచ్చును. నీ సుఖ దుఃఖములలో సమభాగినినిగా నుండుటకు విధ్యుక్తముగా బద్ధురాలనయి నేను నీకు హృదయశాంతి చేయుదాన నగుదును. అప్పుడు నీవు నీ ధర్మ పత్నియైన చారుమతి యొక్క మృదువులయిన యూరువులమీఁద హాయిగా విశ్రమించి సుఖించుచుండఁగా, పాతివ్రత్యభూషితురాలయిన నీ ప్రియురాలు తనమృదుహస్తములతో నీహృదయమునందలి విచార శల్యములను వెకలించి నొప్పిని కలిగించుచున్న విపత్కంటకములను తీసివేయును.

దర్ప——ఓచారుమతీ! నీకృతజ్ఞతాఋణమును తీర్చుకొనుటకు నేను నిఱుపేద నయియున్నాను. ఇప్పుడు కాలమునిలువక పరుగెత్తుచు

వేగముగా మనోనిశ్చయమును చేసికొమ్మని నిన్ను నిర్బంధించు చున్నది. నీకు సంభవింపఁబోయెడునష్టములను గూర్చియు తత్ప్రతిఫల ముగా నొక్క-పేరిమయును దక్క మఱి దేనిని దర్పసారుఁడు సమ ర్పించుకోలేక పోవుటనుగూర్చియు సావకాశము నాలోచించుటకు నీకు కొంత కాలము కావలసి యుండునుగదా?

చారు—నాకొక నిమిషమయిన నవకాశ మక్కఱలేదు. నేనొక్క నీ గుణములకే వలచినదానను గాని యన్యమును దేనిని కామించినదానను గాను. మనము చిరకాలమునుండి కాంక్షించి యున్న యభిమతసిద్ధిని బడయుట కిదే సమయము. ఇఁక నాలస్యము చేయఁగూడదు. ఈ యాలస్యమువలన నొకవేళ—

దర్ప—చీఁకటిపడువఱకు నేను మరల వెలుపలికి రాకుండుట క్షేమకరము. నీసత్స్వభావమునుబట్టి నీకులెక్క-లేని కష్టములువచ్చు నని తలఁచి నేను ఖేదపడుచున్నాను.

చారు—ఈ కార్యమువలన నొకవేళ నీకుఁగల సొత్తు పోవును గాఁబోలును! ఆసంగతి నాకు నిశ్చయముగా తెలియదు. అయినను మనకంతమాత్రముచేత సుఖభంగము కలుగదనిమాత్రము నేను దృఢముగాఁ జెప్పఁగలను. నాకున్న యల్పధనమే మనకిద్దఱ కును జాలును. పరదేశమునం దెప్పుడును భోగము లనుభవించుటకు లభింపవుగదా?

దర్ప—అది సత్యమే కాని యటువంటి హీనదశయందు నా చిరాకు మఱింత యెక్కు-వయయి, నీ వెంత సహనము కలదానవై నను నీకు దుర్భరమగు నేమో! అటువంటి దురవస్థతటస్థమయినప్పుడు నేను నీతో తగవులాడి కోపావేశముచేత మతిపోయి యేమి చేయుదునో!

చారు—నిజముగా నటువంటి దుర్దశయే నీకొకవేళ పట్టుట తటస్థించిన పక్షమున నీకు కోపోపశమనము చేసి మృదుమధురశీతల వచనామృత ధారలతో నీ హృదయములోని శోకాగ్నిని చల్లార్చుట కయి నీ సంరక్షణ భారమును వహింపవలసిన వారొక రప్పుడు మఱింత యావశ్యకముగాఁ గావలసియుండును. నీ దౌర్బల్యమును కనిపెట్టి తగిన యుపచారము చేయుచు భాగ్యలోపమువలనఁ గలుగు కష్టములను ధైర్యముతో నోర్చునట్లు నేర్పఁగల దేహసంబంధులు లేక యట్టికష్టములు నీకెట్లు సహ్యములగును?

దర్ప—చారుమతీ! ఈ పనికిమాలిన పన్నుగడలచేత నీ మనస్సు పరిశోధించి నామనస్సులోని సందేహముల నన్నిటిని నివారణము చేసికొన్నాను. నా దుస్స్వభావముచేతఁ జేసిన యనర్హమయిన యీయపరాధమును మన్నింపుమని నిన్నెట్లు వేఁడుకొనవలయునో తెలియకున్నది.

చారు—నీ వింతవఱకును జెప్పినట్లు నీకేమియు నాపద తటస్థింపనే లేదా!

దర్ప—ఇదియంతయు కేవల కల్పనమని యొప్పుకొనుటకు సిగ్గుపడుచున్నాను. ఇటువంటి యపరాధమును నేనిఁకముందెప్పుడును మరల నీ విషయమునఁ జేయను. కాఁబట్టి నాయందు దయతలఁచి నామీఁద పగ సాధించి చంపక నన్నింతటితో క్షమింపుము. ఈ యొక్కసారిమాత్రము నా ప్రార్థన మంగీకరించి నన్ను మన్నించితివా, ఈశ్వరానుగ్రహమువలన తేపే నీ చేపట్టఁబట్టి నీపాలఁబడి, నీ ప్రాపువలన స్వస్థచిత్తుఁడనయి నీ నిరంతరం సేవచేత నాగతపాపము పరిహరించుకొనెదను.

చారు—ఓదర్పసారా! చాలును. ఇంతవఱకును నీవేదో

ఘోరపాతకము చేసితివని తలఁచుకొని దానిపేరడుగుటకు భయపడు చున్న యీపాపము చేయలేదని తెలియఁజెప్పి నామనస్సున కపార సంతోషమును కలిగించినావు. ఆ విషయమయి నేను మిక్కిలి కృతజ్ఞురాలనయి యివె యానంద బాష్పములను విడుచుచున్నాను. అయినను నీ క్రూరములయిన యీ యనుమానములును మాయలును ములుకులవలెనాటి నా కనిర్వాచ్యమైన మనోవ్యథను కలిగించుచున్నవి.

దర్ప—ఈశ్వరసాక్షికముగాఁ జెప్పెదను. ఓ చారుమతీ—

చారు—నామాట కడతేఱ వినుము. నాతండ్రికి నీయందు పుత్రాధికమైన ప్రేమయుండెను. ప్రేమానిధియైన నాతండ్రియిచ్చిన యీప్రాణమును నీవు కాపాడినావు. అప్పుడాతని గమతిమంను నా హృదయమును నీకర్పింపఁ గలుగుటకంటె ముందుగానే నాహస్తమును సంతోష పూర్వకముగా నీ కర్పించినాను. అటుతరువాత శీఘ్రకాలములోనే యాతండ్రిని నేను పోఁగొట్టుకొన్నప్పుడు, ఈశ్వరుఁ డన్నిటికిని దర్పసారునినే చూపినాఁడని భావించుకొని తక్షణమే నా హృదయమును గూడ సమర్పించి యప్పటినుండియు మరియొకరి విషయమయి యెప్పుడును పడనొల్లని కష్టములకెల్ల నీకయి యోర్చి సంతుష్టురాలనై యున్నాను. అటువంటి నాయవ్యాజానురాగమును చులకనచేసి నీవుచేసినయవజ్ఞలనెల్ల నేకరువుపెట్టి యిప్పుడు నీమనస్సునకు నొప్పి కలిగింపనొల్లను—

దర్ప—అది యంతయు నేనే యొప్పుకొనుచున్నాను. అయినను నామాట విని—

చారు—సంవత్సర కాలము నన్ను శోధించి నాయకృత్రిమానురాగమును కనుఁగొన్నతరువాతఁగూడ నిట్టనుమానపడుట లేనిపోని

దుశ్శంకలచేత నన్ను మరల క్రూరముగా నవమానపఱుతు వని నే నెప్పుడు ననుకోలేదు. తృప్తిగాని ప్రేమించినవారియందు విశ్వాసముంచుటగాని నీస్వభావములో లేదని నా కిప్పుడు స్పష్టపడినది. తత్త్వము బోధపడినతరువాత నే నిఁక నిన్ను నమ్మి మోసపోను. నా యవ్యాజానురాగమువలనను విశుద్ధచరిత్రమువలనను నీకు నాయెడల పూర్ణమైనవిశ్వాసమును కలిగింపఁగలుగుదు నన్నయాశ యున్నంత కాలము, నీకు తృప్తికరముగా ప్రవర్తింపవలెనని నేను సర్వవిధములఁ బ్రయత్నముచేసి చూచినాను. నీకు సంతుష్టి కలుగఁజేయుటయసాధ్యమని యిప్పుడు తేటపడుటచేత, నేనిఁక నీకు వివాహబంధముచేత కట్టుపడి బుద్ధిపూర్వకముగా నెల్లకాలమును నీవలన బాధ లనుభవించుట కయి గృహదాసిని కాఁజాలను.

దర్ప—ఈతప్పు క్షమింపుము. ఈశ్వరునితోడు! ఇఁకముందు నే నెప్పుడయిన—

చారు—ఇంకొక్కమాట యున్నది. ఇది కడతేఱ వినుము. ఈవఱకు నామనస్సును నీ కర్పించితిని గాన, ఇఁక నే నెప్పుడును దాని నన్యపురుషునిపాలు చేయను. ఈశ్వరుఁడు నిన్ను నిత్యసంతుష్టుని జేయునుగాక! మనవివాహబంధము నిప్పుడు ఛేదించిన నీ యసంతుష్టి నిన్ను శీఘ్రముగా విడుచునుగాక! నీ యీచపలతను తలఁచుకొని నీవు చింతిల్లునప్పుడు, నీ నిత్యశంకిత్వమువలన యావజ్జీవమును నీపాదసేవకురాలయి యవ్యాజప్రేమతో సుఖదుఃఖములయందు నీతోడి నీడగా నుండ నిశ్చయించుకొన్న సంపన్నురాలు నిన్నుఁ బాసిన దని మాత్రము విచారపడఁబోకు. (అని నిష్క్రమించుచున్నది.)

దర్ప—నా పాలిటిభాగ్యదేవత నన్ను విడిచి పోయినది. అటువంటి కన్యారత్నము నావంటిమందభాగ్యున కెట్లు దక్కును? ఆమె

మనోవిశ్చయమును దలంచుకొన్న నాకు భయము మగుచున్నది. నేను క్రూరుఁడను; మృగప్రాయుఁడను; వివేకహీనుఁడను; అయోగ్యుఁడ నయినవా కిట్టిభాగ్యలక్ష్మి నీశ్వరుఁ డనుగ్రహించినప్పు డనుభవింప లేక కూలఁద్రోచుకొన్నాను. ఇఁక నాకు భాగ్యాశ లేదు. నాపనికి నేను పోవలెను. ఆయుద్ధములో సహాయపురుషు డనుగాక విక్రమ సేనునికి మాఱుగా నేనే ప్రధానపురుషుఁడ నయిన నెంతయు మేలుగ నుండును.—ఓకాముఁడా! నన్నిట్లేల బాధించెదవు? నీదుస్సహ వేదనకు నేను తాళఁజాలను. నేను ప్రాణత్యాగము చేసికొనెదను.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

[ఒక పరిచారికయు, కళావతియు ప్రవేశించు చున్నారు.]

పరి—నాయజమానురా లింతకుమును యిక్కడనే యున్నది. ఒకవేళ నామె యిప్పుడే యాగదిలోనికిఁబోయి యుండును.

(అని వెడలి పోవుచున్నది.)

కళా—కటకటా! అతఁడట్లు చేసినను నాహృదయ మాతని నుండి మరలకున్నది! నావదినెవచ్చి యిప్పు డొక్కయుపన్యాసము చేసినపక్షమున, మరల నా కాతనిని ప్రార్థింపవలె నన్నబుద్ధికూడ పుట్టునేమో!

[చారుమతి ప్రవేశించు చున్నది.]

కళా—చారుమతీ! నాకిప్పుడు మనశ్శాంతి కావలసి నీవద్దకు వచ్చినాను. (మొగమువంకఁ జూచి) ఓహో! ఇది యేమి? ఏడ్చు చున్నా వేమి? ఆదర్పసారుఁడు నిన్ను దుఃఖపెట్టుచుండలేదుగదా?

చారు—నీ వనుకొన్నది కారణము కాదు. నాకు దుఃఖము కలుగుటకు కారణము వేరేయున్నది. నీవది తెలిసికోలేవు- (తనలో) [illegible] నింద మోపను.

కళా—నీకెంత మనోవ్యధ కలిగి యున్నను నీది నామనో వ్యధకు సమానముకాదు. తుదకు విజయపాలుఁ డెవఁడయినాఁడో విన్నావా?

చారు—అదంతయు దర్పసారుఁడు మొదటనే నాతోఁ జెప్పినాఁడు. విజయపాలుఁడని నీవనుకొనుచుండినవాఁ డెవఁడో నేనెఱుఁగకుండినపక్షమున, ఆతనిమీఁద నీకుఁ గలచాపల్యమును నేనుప్రోత్సాహపఱచి యుండను.

కళా—అట్లయినయెడల నేనందఱివలనను మోసపోయినాను. పోనిమ్ము. ఇఁక నే నాతనిని వివాహ మాడను.

చారు—అవునుగాని, కళావతీ!

కళా—నామాట విను. ఇట్లు చేయుటచేత నాకేగాదు మఱి యెవ్వరికైనను కోపము రాకుండునా? నూకెంతో కష్టమువచ్చు ననియు, ధైర్యసాహసములు చూపవచ్చుననియు, నేనెదురుచూచుచున్నప్పుడు తుదకు కార్యమంతయు చప్పపడి నిస్సారమయిపోయినది. మాఱువేషము వేసికొనుట, త్రాటినిచ్చెనతో గోడలుదాటుట, చీఁకటిలో నాలుగుగుఱ్ఱములబండియెక్కి పాఱిపోవుట, గాంధర్వవివాహమాడుట, అన్నియు చెడిపోయినవి. ఇంత యాశాభంగము కలిగిన తరువాత నేను నలుగురిలో తలయెత్తుకొని యెట్లు బ్రతుకఁగలను?

చారు—నాకిది వింతగా కనఁబడదు.

కళా—తుదకు నాకెంత యాశాభంగము కలిగినదో చూచినావా? పాఱిపోవుట కెంతో సన్నాహము చేసికొన్నతరువాత, కట్టకడపట నేమియు లేకుండ నా మేనత్త యనుమతితో నూఱింట

వు స్తైముడిపెట్టించుకోవలసిన గతిపట్టినది. ఇటువంటి దుర్యోగము నకు సహింపఁగలిగిన నేను ముందేమి చూడనున్నానో!

చారు—పాపము! నీకెంతటి దురవస్థ సంభవించినది!

కళా—అతనితో నర్ధనిమిషకాలము మాటాడఁ గలుగుట కయి పన్నిన యా మాయోపాయమును స్మరణకుఁ దెచ్చుకొనఁగాఁ నాకిప్పుడు దుఃఖము వచ్చుచున్నది. మాఘమాసములో చలిలో నిశీధవేళ నొంటిగా బయలుదేఱి పుష్పవనములో చిత్రప్రతిమవలె నిశ్చేష్టుఁడయి నిలుచున్న యాతనిని కన్నులపండువుగా చూచు చుండెడిదానను. ఆసమయమునందు చలిచేత నతఁడును భయము చేత నేనును వడఁకుచు, పరస్పర శరీరస్పర్శనము చేసి యానందా మృతసాగరమునందు మునిఁగి తేలుచుండెడివారము. అంతటిప్రేమ యిప్పుడింతటికి వచ్చినది.

చారు—నే నిప్పు డుత్సాహస్థితిలో నుండియున్న పక్షమున, నీ యవివేకమునకు పకపకనవ్వి చీవాట్లు పెట్టియుందును. అయినను నీయందట్టి యనురాగాతిశయము గలవానిని పనికిమాలిన నీచపల తనుబట్టి విడనాడి నిష్కారణముగా పరితాపము పాలుచేయవలదని మాత్రము నే నిప్పుడు నిన్ను బతిమాలుకొనుచున్నాను.

కళా—ఓహోహో! ఈసమయములో నా మేనత్తకూడ వచ్చినదేమి?

[సుభద్రమ్మయు, రాముఁడును, మాధవుఁడును ప్రవేశించుచున్నారు]

సుభ—అయ్యో! అయ్యో! కొంప మునిఁగినది. పొలములో హత్యలు జరుగుచున్నవి. నరహత్యలు. ఉపద్రవము తప్పించుట కయి యెక్కడ వెదకినను వీరసేనుఁడుగారు కనఁబడరు.

చారు—అమ్మా! ఏమియుపద్రవము వచ్చినది?

సుభ—ఇతని నడుగు నాతోఁ జెప్పినవాఁ డితఁడే.

కళా—(రామునితో) ఏమితటస్థించినదో చెప్పు.

రాము—తాను ముఖ్యంగా సంబంధించివున్నచిన్నది యింత ఆతురపాటుతో అడుగుతూవున్నప్పుడు జరిగినసంగతి శీఘ్రముగా చెప్పక ఆలస్యం చెయ్యడం నావంటి వివేకం గలవాడికి యెంత మాత్రమూ ధర్మంకాదు.

కళా—శీఘ్రముగాఁ జెప్పు. వేగిరము.

రాము—అమ్మా! తమరు సెలవిచ్చినట్లు యిటువంటిసంగతులు శీఘ్రంగా చెప్పివెయ్యవలెను. ఆలా చెప్పకుండా యేమాత్రం ఆలస్యంచేసినా యీలోపుగా రెండుమూడు ప్రాణాలకు భంగం రావచ్చును.

కళా—నే నీ విలంబము సహింపలేను. అత్తా! ఏమిజరిగినదో నీవైనను జెప్పు.

సుభ—జరుగుట కేమున్నది? నఱకులాట జరుగుచున్నది. హత్యలు జరుగుచున్నవి. చావులు తటస్థించుచున్నవి. ఆవివరము లితఁడు చెప్పఁగలఁడు.

కళా—ఓరామా! నిన్ను ప్రార్థించుచున్నాను. సంగతి యేమో రెండుమూడు మాటలతో చెప్పు.

రాము—నరుకులాట విషయమయి యెవ్వరినెవరునరికినారో నేను చెప్పలేను. నరహత్య నేరం విషయమై ధర్మాధికారులే నిజం కనుక్కొని యెవరియందు దోషంవుంటే వారిని శిక్షిస్తారు.

కళా—ఎవరు? అట్లు పోట్లాడుచున్నవా రెవరు?

రాము—వారిలో వొకరు బహుచిన్నవాడు; మహా దొడ్డ వాడు. ఆయనకు యేవిధమయిన అపాయమూ జరగడం నాకు

యిష్టములేదు. ఆయనకు నామీద యెంతో ప్రేమ. నన్నెప్పుడూ పల్లెత్తుమాట అనలేదు.

కళా—ఆయన యెవరు? ఎవరు? ఎవరు?

రాము—నా యజమానుడు. అమ్మా! నాయజమానుడు. తెలిసినదా? ఆయన నాయజమానుడు.

కళా—ఓ యీశ్వరుఁడా! విక్రమసేనుఁడా యేమి?

సుభ—ఓహోహో! ఇప్పుడు నీవు భయపడుచున్నట్టున్నావే?

చారు—అతనితో నున్న రెండవవా రెవరు?

రాము—తక్కిన సంగతి నాకంటె యితను బాగా చెప్ప గలడు.

చారు—మాధవా! నీవు చెప్పు.

మాధ—అమ్మా! ఆవంకచూడు. జరిగే అనర్థమంతా అక్కడ జరుగుతూవున్నది. వూరికే వినోదంకొరకయితే కత్తులతోనూ తుపాకులతోనూ వెళ్ళరు. వాటినిచూస్తే నాకు వారు కోపంతో వెళ్ళినట్టు తోస్తూవున్నది.

చారు—విక్రమసేనుఁడుగాక యక్కడ మరెవరున్నారు?

మాధ—మందభాగ్యుడైన నా యజమానుడొకడు. అతని యందువుండే దయచేత, అతనిపేరు నేను ముందుగా చెప్పలేక పోయినాను. అమ్మా! నీవు నన్నెరుగుదువుగదా! నేను మాధవుణ్ని. ఇంకా ప్రాణాలతో వున్నపక్షమున నా యజమానుడు దామోదరవర్మ. దర్పసారుడుకూడా అక్కడనే వున్నాడు.

చారు—అమ్మా! మనము వెంటనే యక్కడకుఁ బోయి

సుభ—అటువంటి క్రూరకర్మము జరుగుస్థలమునకుఁ బోవుట స్త్రీలకు తగదు.

మాధ—అమ్మా! మీరు శీఘ్రముగా పోయి కలహం నివారించవలెను. మీరు వెంటనే వెళితే కొన్ని ప్రాణాలైనా దక్కుతవి. వారందరూ తెంపరులై వున్నారు. అందరినీమించిన దయాదాక్షిణ్యాలు లేని పురుషోత్తమదేవుఁడుకూడా వారిలో వున్నాఁడు.

సుభ—పురుషోత్తమదేవుఁడా ? హా ! దైవమా ! ఈపడుచువాండ్రయనను గూడ తమ కయ్యములోని కీడ్చినారుగదా ! అమ్మాయీ! అట్లు నిలుచున్నావేమి? నీహృదయములో నేమాలను దయ లేనట్లున్నది.

కళా—అత్తా! ఇప్పుడు మనము చేయవలసినదేమి?

సుభ—ఎవ్వరికి నపాయము జరగకుండ మాన్పుటకయి మన మక్కడకు శీఘ్రవలె పరుగెత్తుకొని పోవలెను. అన్నా! మాకు నీవా స్థలమును జూపఁగలవా?

రాము—నేను మిమ్మల్ని అక్కడకు తీసుకుపోతాను.—ఓరీ! మాధవా! వీరసేనుఁడుగారిని తీసుకుని రావడానికి నీవువెళ్ళు.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

సుభ—కన్నెలారా! నావెంటరండి. ఇతఁడు మనల నక్కడకుఁ దీసికొని పోవును.—రామూ! నీవు ముందునడిచి మాకు దారి చూపు.

రాము—స్త్రీలను మిమ్మల్ని వెనుకదిగవిడిచి లక్షవరహాలిచ్చినా నేను ముందర పోను.

సుభ—నీవాస్థల మెఱుఁగుదువా? నిజము చెప్పు.

రాము—ప్రయత్నంచేస్తే నేను కనుక్కోగలననుకుంటాను. దారితప్పిపోకుండా వుండడానికి నాకొక్క శుభసూచకం కనపడుతూ వున్నది. తుపాకుల చప్పుడు వినపడడంతోటే, ఆ చప్పుడునుపట్టి మన మార్గానికి తప్పకుండాపోవచ్చును. భయపడకండి. మీకు వచ్చిన భయమేమీలేదు. మీప్రాణాలకు నాప్రాణా లడ్డంవేస్తాను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

౨ రంగము—దక్షిణప్రవీథి.

---

[తనకత్తి బట్టలోఁ బెట్టుకొని విక్రమసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విక్ర—ఈగ్రామములో వీధిలో నెవ్వరిచేతిలోనైన కత్తి కనఁబడినపక్షమున నెల్లవారును వెఱ్ఱికుక్కను జూచినట్లు భయపడుదురు. దర్పసారుఁ డింకను రాలేదు. అతఁ డెప్పుడును వేళకురాఁడు. అతనిని విడిచి తుదకు నే నొక్కఁడనే పోవలసి వచ్చినది. ఓయి దేవుఁడా! ఇప్పుడు వీరసేనుఁడుగారీవంక నే వచ్చుచున్నారే! ఈయనను నే నెట్లు తప్పించుకొను ?

(అని తలవంచుకొని తొలఁగిపోవుటకు ప్రక్కకు తిరుగుచున్నాఁడు.)

[వీరసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వీర—ఆవచ్చెడివా రెవరో దూరమునుండి యానవాలుపట్టుట కష్టముగా నున్నది. అతఁడు మావిక్రమునివలె నేయున్నాఁడు. అవును వాఁడు మావిక్రముఁడే. సందేహము లేదు. ఓరీ! విక్రమా! విక్రమా! (అని సమీపమునకుఁ బోవుచున్నాఁడు.)

[illegible] నను గుఱుతుపట్టినాడుగాని మిమ్ము

నేను గుఱుతుపట్టలేదు. మిమ్ము నేనెప్పుడును జూచియున్నట్లుజ్ఞప్తికి రాలేదు. నాపేరు వర్ధమానుఁడు. నాతో మీకేమైన పనియున్నదా?

వీర—అట్లయిన నన్ను క్షమింపవలెను. నేను భ్రమపడి నాను. మిమ్ముజూచి—ఏమి? వానివలెనే యున్నాఁడే!—నిమిషము నిలువుఁడు. (మొగమువంక తేఱిపాఱఁజూచి) ఓహోహో! వర్ధమానుఁడుగారా తమరు? ఓరి దున్నపోతా! నీ విప్పు డేమి మానా చేయఁ దలఁచుకొన్నావు?

విక్ర—ఏమియు లేదు. నేనిప్పుడూరక నవ్వులాటకన్నాను. నేనన్నది వట్టి నవ్వులాటమాట. తమకొఱకే నేనిక్కడకు వెదకుకొనుచు వచ్చినాను.

వీర—అలాగా? నీవదృష్టవంతుఁడవుగనుక నేను వెంటనే కనఁబడినాను. ఆ వేషమంతయు నేమి—

విక్ర—మరేమియులేదు. ఇది చలిగాత్రి. అంతయు తరువాత తమతో మనవిచేసెదను. నాకు కొంచెము పనియున్నది. నన్నిప్పుడు విడిచిపెట్టుఁడు.

వీర—నిమిషము నిలువు. పోకు. నీవు నాకొఱకే కాదా యిక్కడకు వెదకుకొనుచు వచ్చినావు? ఇంత తొందరగా నీవిప్పు డెక్కడకు ప్రయాణము?

విక్ర—ప్రయాణమా?

వీర—అవును. నీవిప్పు డెక్కడకు పోవుచున్నావు?

విక్ర—నేనెక్కడకు పోవుచున్నానా?

వీర—ఓరి గాడిదా!

విక్ర—ఎక్కడికా? నేను—నేను—ఇప్పుడు నేను కళావతి యొద్దకు వెళ్ళుచున్నాను. ఎందుకా? సాధ్యమైనయెడల, నేనా

చిన్నదానిని ప్రార్థించి సమాధానపఱచుటకు మీకొఱకేల యెదురు చూచుచున్నానా? ఆపనికేమిమ్ము—

వీర—తెలిసినది. నన్ను నీతోఁగూడ వెంటబెట్టుకొని పోవుటకు నేకూడ వచ్చెదను పద.

విక్ర—కాదుకాదు. ఆపనినిమిత్తము కాదు. మఱియెందుకా? ఊరకే మిమ్ముఁ జూచి సెలవుపుచ్చుకొని పోవుటకు. అంతే ఇది చలి రాత్రి. మీరుబైల తిరుగఁగూడదు.

వీర—ఆపనినిమిత్తమే కాదా? ఇది చలిరాత్రియేమి? మంచిది కళావతితో నీవేమని చెప్పెదవు?

విక్ర—ఏమున్నది? ఆచిన్నదానిని నన్ను క్షమింపుమని వేఁడు కొనెదను; మంచిమాటలు చెప్పెదను; ఒట్లు పెట్టుకొనెదను; పాదముల మీఁద బడెదను. అయ్యో! మీ కాలస్య మగుచున్నది. చలిలో నడిచినపక్షమున మీకు జబ్బు చేయును. శీఘ్రముగా నింటికి పొండి.

వీర—నాకాభయము లేదు. నేను పోను. మీవంటికుఱ్ఱవాండ్రకు గుండెలలో చలి సోఁకినప్పుడు—(అని యాతనిగుండెలు తడవుచు)—ఇది యేమి? ఇక్కడ నేదో లోపల చేతికి గట్టిగాతగులు చున్నది!

విక్ర—ఏమియు లేదు. మఱేమియు లేదు.

వీర—ఏమియు లేనేలేదా? నాచేతికి లోహమువలె గట్టిగా సోఁకినదే!

విక్ర—కడియములు. కడియములు. కళావతినిమిత్తము కడియములజత!

వీర—నీ వెటువంటి కడియములు చేయించినావో చూడనీ. (అని పయిబట లాగఁగానే కత్తి (క్రింద పడుచున్నది.) ఇది యెంత

మంచికడి...ములు! కళావతినిమిత్తమా యీకడియములజత! ఈ కత్తితో నీవాచిన్నదాని గొంతు కోయదలచుకో లేదుకదా?

విక్ర—ఆహాహాహాహా! ఇది చివరవఱకు మీతోఁజెప్పకుండ నుండి కడపట దీనితో మీకు వినోదము కలిగింపవలెననుకొన్నాను.

వీర—నాతోఁ జెప్పకపోవలె ననుకొన్నావుగా? ఇది నిశ్చయముగా నాకు వినోదము కలిగించెడు కడియములజతయే! సందేహము లేదు,

విక్ర—ఇఁక మీతో నిజమే చెప్పెదను వినుఁడు. కళావతి స్వభావము మీ రెఱుఁగుదురుకదా? ఆమె నన్ను క్షమింప నన్నపక్షమున, ఈకత్తి పయికిఁదీసి "యిప్పుడు దీనితో గొంతు కోసికొని నీ పాదములముందు పడి ప్రాణములు విడిచెద"నని బెదరించి యామె మనసు కరఁగించి యామెను లోఁబఱుచుకోవలెనని యీఖడ్గము కొనిపోవు చున్నాను.

వీర—నీవు కత్తితోఁ గాదు, పకుతో గొంతు కోసికొనెదవు. ఒకవేళ నీమాయవేషమువల్ల కళావతిమనసు కరఁగవచ్చును. పో.

విక్ర—నావిజయవార్తను కొంతసేపటికి మీరే విని సంతోషించెదరు—ఓకళావతీ! నన్ను క్షమించు. క్షమించనిపక్షమున నీ యెదుటనే నేనీకత్తితో పొడుచుకొని ప్రాణత్యాగము చేసికొనెదను అని చెప్పకును.

వీర—"ఓప్రబుద్ధుఁడా! ప్రాణత్యాగము చేసికోకు కత్తివిడిచి నాచేయి గ్రహించు"—అని యాచిన్నది నిన్నాదరించునులే నీ కడియములజత పట్టుకొని నీవు శీఘ్రముగా పో.

విక్ర—చిత్తము. (అని నిష్క్రమించు చున్నాఁడు.)

[అంతట మాధవుడు పరుగెత్తుకొని వచ్చుచున్నాడు.]

మాధ—అతణ్ని నిలపండి. ఆపండి. చావు నరుకులాట.—ఓవీరసేనా! అతణ్ని నిలపండి. పోనియ్యకండి నరుకులాట! చావులు!

వీర—నరుకులాటా? చావులా? ఎక్కడ?

మాధ—అప్పుడే అతడు కంటికి కనపడకుండా మాయమయి పోయినాడు. నేను నాశాయశక్తులా పరుగెత్తు వచ్చేటట్టుపరుగెత్తుకొని వచ్చినాను. అయ్యా! మీరతణ్ని యెందుకు ఆపినారుకారు? మీరు పట్టుకొని నిలిపి వుంచవలసింది.

వీర—నీకు మతిపోయినదా యేమి? ఆపవలసిన దెవరిని? నిలుపవలసినది మావిక్రముని నా?

మాధ—విక్రమసేనుణ్నే. నరహత్య జరుగుతూవున్నది.

వీర—నరహత్యా!

మాధ—అయ్యో! యెన్నోనరహత్యలు జరుగుతూవున్నవి. ఆపొలాలలో యెన్నోవిధాల నరకులాటలు జరుగుతూవున్నవి. అలా చూస్తారేమి? అక్కడ పోట్లాట జరుగుతూవున్నది. కత్తులతోనూ తుపాకీలతోనూ ఘోరయుద్ధం జరుగుతూ వున్నది.

వీర—ఎవరు పోట్లాడు చున్నారు?

మాధ—అందరూ పోట్లాడుతూవున్నారు. నేను యెరిగినవా రందరూ పోట్లాడుతూ వున్నారు. నాయజమానుడూ పురుషోత్తమ దేవుడుగారూ మీకొమారుడూ—

వీర—ఓహోహో! వానిమాయలు నేనిప్పుడు గ్రహించి నాను.—నీ వాస్థల మెఱుగుదువా?

మాధ—రాజుగారి పొలములు.

వీర—నీ వక్కడకు దారి యెఱుగుదువా?

మాధ—యెరగను. నేను వెళ్ళి తలారులనూ దండాధికార్లనూ గ్రామస్థులనూ అందరినీ తీసుకువస్తాను. అందరమూ చేరితేనేగాని యుద్ధం ఆపలేము.

వీర—నీవు నావెంటరా. మనము పోవునప్పు డెదురుపడిన వారిని తోడు తీసికొని పోదము—ఓరి బొంకులమారి గాడిదా! ఇదా నీకడియాలజతయొక్క వృత్తాంతము? నాకు కోపము వచ్చుచున్నది. నాకంటఁబడ్డ తరువాత నీపని పట్టించెదను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

---

3. రంగము—రాజుగారి పొలములు



[పురుషోత్తమదేవుఁడును, దామోదరవర్మయు తుపాకులు చేతఁబట్టుకొని ప్రవేశించుచున్నారు]

దామో—ఓ పురుషోత్తమదేవా! నా భుజశౌర్యముతోడు! నలువది గజములు మంచిదూరము. అది గుఱికి మంచిదూరము.

పురు—పెద్ద తుపాకులకంత దూరము కావలెనుగాని యీ చిన్న తుపాకుల కక్కఱలేదు. ఆ యేర్పాటులన్నియు నాకు విడిచి పెట్టు. ఇటువంటి విషయములలో నీకంటె నాకెక్కువ యనుభవము. దూరము నీకు చూపెదను చూడు. (అని యడుగులు వేయుచు) ఈ దూరము చాలును.

దామో—చాలదు. ఇంతకంటె మన మిఱుకుగదిలో పోట్లాడవచ్చును. పురుషోత్తమదేవా! నామాటవిను. విరోధి నా కింతదూరములోనున్న నేనంత సూటిగా గుఱిపెట్టఁగలము.

పురు—మేలు మేలు! అతఁడు నీకంటికే కనఁబడకపోయిన మొదల మఱింత యెక్కువ సూటిగా గుఱిపెట్టఁగలవు కాఁబోలును!

దామో—అది కాదుగాని మా యిద్దఱికిని మధ్య నలువదియో యెనుబదియో గజముల దూర ముండవలెను.—

పురు—అక్కఱలేదు. మూఁడు నాలుగడుగుల దూరము చాలును.

దామో—గుండుదెబ్బకా మూఁడునాలు గడుగులదూరము! అంత చేరువనుండి నేను శత్రువును జంపినపక్షమున గొప్పతనమే లేదు. నా మనవి విని నన్ను నా శత్రువును దూరమునుండియే పడ వేయనిమ్ము.

పురు—ఆవిషయము నేనును నీశత్రునియొక్క సహాయుఁడును నిర్ణయముచేసికొందములే. దామోదరవర్మా! ఈయుద్ధములో నీకొక వేళ నపాయము తటస్థించెడుపక్షమున, నేను నీనిమిత్తము చేయవలసినపని యేమి? నీవేమయిన మరణశాసనము వ్రాసినావా?

దామో—నీకు నామీఁదఁగల దయకు సంతోషించినాను గాని నీమాటలకు నాకర్థముకాలేదు.—

పురు—తుపాకులు కాల్చుకొన్నప్పు డుభయయోధులలో నెవ్వరికైనా గుండుదెబ్బ తగిలి ప్రాణాపాయము సంభవింపవచ్చును. ఒకవేళ గుండుదెబ్బ నీకే తగులుట తటస్థించినపక్షమున, గృహకృత్యములను గుఱించి వ్యవహారము చక్కపెట్టుకొనుటకు నీకప్పుడవకాశ ముండదు.

దామో—అలాగుననా?

పురు—నీకు ప్రాణాపాయము సంభవించినపక్షమున, నీశరీర

మును నూనెలో వేసి మీయూరికి పంపవలెనా? ఇక్కడనే పాతి పెట్టించవచ్చునా?

దామో—నూనెలో వేయుటా! పాతిపెట్టుటా! పురుషోత్తమ దేవా! నీవటువంటి యశుభ వాక్యములు బలుకఁగూడదు.

పురు—దామోదరవర్మా! ఈవఱ కెప్పుడును నీ విటువంటి వ్యవహారములలో ప్రవేశించి యుండలేదు కాఁబోలును!

దామో—వెనుక నే నిటువంటి వ్యవహార మెప్పుడు నెఱుఁగను.

పురు—అయ్యో! నీ స్థితి నాకు విచారకరముగా నున్నది. అనుభవముతో సాటియైనది లోకములో మఱియొకటి లేదు. నీప్రతి వీరుని యొక్క గుండుదెబ్బ నెట్లు కాచుకొనదవో నేఁడు చూతము.

దామో—కాచుకొను విధము నాకు తెలియును. ఆవిద్యలో నేను పండితుఁడను. ఇదిగో చూడుము. నేనీలాగున గాచుకొనదను. (అని మూలకు తొలఁగి శరీరము ముడుచుకొని దాఁగుచున్నాఁడు.)

పురు—నీవు బొత్తిగా చాటునకుఁ బోయినావు. చూడుము. (తుపాకి గుఱిపెట్టినట్లు చూచుచు) ఇదిగో నేను గుఱి—

దామో—పురుషోత్తమదేవా! ఆగు. ఆగు. నీ తుపాకికి గుల్లము తగిలించలేదుగదా? తిన్నగా చూచితివా?

పురు—భయపడఁబోకు.

దామో—భయపడలేదు. అవునుగాని—నీకు తెలియును— గుండు తనంతనే లోపలినుండి యెగిరి పైకి రావచ్చును.

పురు—అలాగున నెప్పుడును జరగదు. నీకేమియు భయము లేదు. నేను గుఱిచూచి కాల్చినప్పుడు గుండు నీ యాయువు పట్టున తగులక తప్పిపోయెనా—

దామో—అయిపుట్టా? నాదా!

పుర—మాటాడకు. కదలక నేను చెప్పినట్లు నిలుచుండు. (అని రెండుచేతులతోను బొమ్మ పట్టుకొని నిలువఁబెట్టి) నీవక్షస్థలము ఎప్పుడును శత్రువువంకఁ బెట్టి నిలువఁబడు. ఈవలినుండి యావలికి రెండు మూడు గుండ్లు నీ బొమ్మలోనుండి దూఱిపోయినను, అందువలన నీకు నష్టమేమియు లేదు.

దామో—రెండుమూడు గుండ్లు నాబొమ్మలో నుండి దూఱునా?

పుర—దూఱిపోవచ్చును. అంతకంటె మఱేమియు జరగదు.

దామో—పురుషోత్తమదేవా! నావంకఁ జూడు. ఈవంకర మార్గములు నాకు పనికిరావు ప్రతిపీరుని యొక్కగుండు తిన్నగా వంకరగా వచ్చుచుండఁగా నేనెదురుగా ప్రక్కకు తొలఁగి నిలువఁబడెదను. నాకత్తితోడు! నేనోరసిల్లియే నాశౌర్యమును జూపెదను.

పుర—తుదకు వారు రాక మన కాశాభంగము కలుగఁ జేయరుకదా? రాక మానరు—(ఆవంకఁజూచి) అదిగో! వారు వచ్చుచున్నట్లున్నారు.

దామో—ఏమీ! వచ్చుచున్నారా?

పుర—అదిగో! దూరముగా పొలముగట్టు దిగుచున్నారు.

దామో—వారిద్దఱున్నారు. రానిమ్ము. మనము-మనము-మనము పాఱిపొమ్ము.

పుర—పాఱిపోవుటా!

దామో—కాదుకాదు. నాశౌర్యముతోడు మనము పాఱిపోమనియే నేనన్నాను.

[illegible]

దామో—మఱేమియు లేదు, నేను నిశ్చలముగా నున్నాను. ఎందుచేతనో కాని నావెనుకటిధైర్యముమాత్ర మిప్పుడు నన్ను విడచి పరుగెత్తుచున్నది.

పురు—ఛీఛీ! నీగౌరవమాలోచించుకో.

దామో—నా గౌరవమా! అవునవును. నీవు నడుమ నడుమ నాగౌరవమునుగూర్చి రెండుమూ డుత్సాహవచనము లనుచుండు.

పురు—(ఆవంకఁ జూచి) వారీవంకనే వచ్చుచున్నారు.

దామో—పురుషోత్తమదేవా! నీవు వద్ద లేక పోతివా, భయమువచ్చి నామీఁద పడును. ఇప్పుడు ధైర్యము మాటిమాటి నావద్దకు వచ్చును పోవుచున్నది. నాధైర్యము నన్ను విడిచెనా—

పురు—ఈసారి నీవద్దకు వచ్చినప్పుడు నీధైర్యమును విడువక గట్టిగా పట్టుకో.

దామో—ఓమిత్రుఁడా! నాధైర్యము నన్ను విడిచి పోవుచున్నది. మరల నావద్దకు వచ్చునట్లు లేదు. అవునవును. అంతకంతకు దూరమగుచున్నది. నాచేతులలోని బలమంతయు లాగుకొని మఱి పోయినది.

పురు—నీగౌరవము. నీగౌరవము మాట చూచుకో. వారు సమీపమునకు వచ్చినారు.

దామో—ఓభగవంతుఁడా! నన్ను రక్షించు. ఈసమయము నందు నేను మాయింటియొద్ద నున్న నెంతో బాగుండిపోవును. నే నీమాట లనుచుండఁగానే గుండుదెబ్బ తగిలి నాప్రాణము లెగిరిపోవునేమో!

దర్పసారుఁడును, విక్రమసేనుఁడును ప్రవేశించుచున్నారు.]

పురు—ఓహోహో! విక్రమసేనుఁడుగారా! నా వలెనే

మీరును మీమిత్రునికి సహాయులుగా వచ్చినారు కాఁబోలును! కొట్టమొదట మిత్రునిపని అయినతరువాత కడపట మనసొంతపని కావచ్చును.

దామో—ఏమి నామిత్రుఁడు విక్రమసేనుఁడా? ఓయీ విక్రమసేనా!

విక్ర—దామోదరా! విన్నావా? విజయపాలుఁడు నీవద్దకు వచ్చినాఁడు.

పురు—దామోదరవర్మా! ఇతనిని గౌరవముతో చూచి నందుకు నిన్ను నేను నిందింపను—(దర్పసారునివంకఁ జూచి) ఓవిజయపాలా! మీరు మాయాయుధములు ధరించినపక్షమున, విక్రమసేనుఁడును నేనును దూరము కొలిచెదము.

దర్ప—నాయాయుధములా?

దామో—ఇదేమి? పురుషోత్తమదేవా! నేను దర్పసారునితో పోట్లాడుటకు రాలేదు. వీరిద్దఱును నాప్రాణమిత్రులు.

పురు—అయ్యో! మీరిక్కడకు దామోదరవర్మతో పోట్లాడుటకు రాలేదా?

దర్ప—నేను రాలేదు.

పురు—నాకు మహావిచారముగా నున్నది. దర్పసారా! ఇక్కడకు మనముముగ్గురమును పోరాడ వేడుకపడివచ్చినవారమగుటచేత నీవూరక కూరుచుండి వేడుకను భంగము చేయవని తలఁచెదను.

విక్ర—దర్పసారా! ఈపురుషోత్తమదేవునిమాట తీసివేయక యుద్ధము చేయుము.

దర్ప—దామోదరవర్మ కిష్టమున్నపక్షమున—

దామో—లేదులేదు. నాకిష్టములేదు. నాయవమానమును

నేను ఋషి సెలగహించి శాంతతసహించి యూరకుండఁగలను. వీరితో పోరాడుటకు నా కేమియు నావశ్యకము లేదు. నీకు కూడ లేకపోయిన పక్షమున మానము సుఖముగా వెడలిపోవచ్చును.

పురు—దామోదరవర్మా! నామాట విను. నన్నూరక యవమానపఱుపరాదు. నీవు నిశ్చయముగా నెవ్వరినో యుద్ధమునకు పిలిచి వారితో పోరాడుటకయి యిక్కడకు వచ్చినావు. ఇప్పుడు నీ శత్రువుయొక్క ప్రతినిధిగా వచ్చి యితఁడు యుద్ధము చేయుట కిష్టపడి యున్నప్పుడు, నీవేల యొప్పుకొనఁగూడదో నాకు హేతువు తెలియకున్నది.

దామో—పురుషోత్తమదేవా! నేను చెప్పునది విను. నేను విజయపాలుఁడను వానిని యుద్ధమునకు పిలిచినాను. అతఁడు నాయెదుట తన మొగము చూపుట కొట్లు సాహసింపలేకపోయినాఁడో నీవే చూచుచున్నావుగదా? అతఁ డిక్కడకు వచ్చిన పక్షమున, నేను తక్షణమాతనిని తన కృషిని విడుచునట్లు చేసెదను.

విక్ర—దామోదరవర్మా! నీకు భ్రమ నివారణము చేసెదను విను. విజయపాలుఁడను పేరుగలవాఁ డెవ్వఁడును లేఁడు. ఆ పేరు పెట్టుకొన్న పురుషుఁడిదె యిప్పుడు నీయెదుటనే యున్నాఁడు. ఈ రెండు వేషములలోను గూడ నతఁడు చేయుచున్న కృషి యొక్కటియే యయినందున, అతఁ డా కృషిని విడువక పోరాడుటకయి యిచ్చట సంసిద్ధుఁడుగా నున్నాఁడు.

పురు—నీ వదృష్టవంతుఁడవు. నీ కిప్పుడు మంచి యవకాశము తటస్థించినది—

దామో—లక్షవరహాలిచ్చినను నేను నా ప్రాణసఖుడయిన విక్రమసేనునితో పోరాడుదునా? ఇంతకు నాకు విజయపాలకేసు

ములు వేసినను నేను తగవులాడను. పురుషోత్తమ దేవా! నే నెన్నఁడైన మానుష స్వభావము విడిచి క్రూరకర్ముఁడ నగుదునా?

పురు—దామోదరవర్మా! నీవద్ద పౌరుషము లేదు.

దామో—కావలసినంత యున్నది. నా పౌరుషమును పరీక్షించి చూడవలెనన్న పక్షమున, నీవు ప్రధాన వీరుఁడవుగా నుండి నన్ను నీకు సహాయునిగాఁ జేసికొమ్ము. నీ శరీరము నిక్కడనే పాతిపెట్టవలెనో, నూనెలో వేసి మీ యూరు పంపవలెనో మఱి మఱి యేమి చెయ్యవలెనో చెప్పితివా నేను సంతోష పూర్వకముగాఁ జేసెదను.

పురు—చాలు. చాలు. నీవు వట్టి రణభీరుఁడవు.

దామో—మిత్రులారా! ఇతఁడు న న్నేమనుచున్నాఁడో మీరు వినుచున్నారా? నేను రణభీరుఁడనఁట!

పురు—అవును. ఆమాట నేను నిన్నన్నాను.

దామో—రణభీరుఁడని నీవిప్పుడన్నమాట నేను పాటిగాఁ బట్టను. నీవా మాట కోడిగమున కన్నావు. ఆమాట కాక నీవు నన్ను కల్లరియని పిలిచినపక్షమున—

పురు—పిలిచిన నేమి చేసెదవు?

దామో—నీవు మాటమర్యాద యెఱుఁగని గ్రామ్యుఁడవని తలఁచెదను.

పురు—నేను నీమాటయందు గడ్డిపరకంత గౌరవ ముంచను.

విక్ర—పురుషోత్తమ దేవా! నా మిత్రుఁడయిన దామోదరవర్మకంటె మంచి సహాయుఁడు నీకు మఱియొకఁడు దొరకఁబోఁడు. ఇతఁడు ముక్కుకండలు కోసెడు మహావ్యాఘ్రము! నాటున నితని బందలును నసహాయశూరుఁడని పిలుతురు. ఇతఁ డొక్కొక్క మను

ష్యుని నొక్కొక్క వారము దినములు బాధపెట్టి చంపును.— దామోదరవర్మా నీవట్టి వాఁడవవుదువా!

దామో—అవును. ఇంటివద్దనున్నప్పుడు నేనట్టివాఁడనే.

పురు—మంచిది! విక్రమసేనా! ఇప్పుడుమంచిపనియారంభము కావలెను. నీ విటురమ్ము.—(అని యొఱనుండి కత్తిని దూసి కొని) నీవు యుద్ధము చేయవలసినపని లేక యితఁడా చిన్నదానిని నీకు వదలివేయునో లేదో ముందుగా నడిగి తెలిసికో.

విక్రి—అట్లయిన పక్షమున నీవిటురా—(అని కత్తిదూసి కొని) సంధి నీ కిష్టము లేనట్టున్నందున, ఇదిగో కత్తితో నేను నీ కుత్తరము చెప్పుచున్నాను.

[వీరసేనుఁడును, మాధవుఁడును, సుభద్రమ్మయు, కళావతియు, చారుమతియు, ప్రవేశించుచున్నారు.]

మాధ—ఓవీరసేనా! వాళ్ళనందరినీ పడగొట్టండి. ముఖ్యంగా నా యజమానుణ్ని కొట్టి యిటువంటి కలహాలకు దిగకుండా బుద్ధి చెప్పండి.

వీర—విక్రమసేనా! ఊరకుండు. ఊరకుండక పోయినయెడల నీమీఁద నాకు దురాగ్రహము వచ్చును జుమా!—ఈ ద్వంద్వ యుద్ధము నీకెట్లు తటస్థమైనది?

విక్ర—ఆ విషయమయి యితఁడు నాకంటె చక్కఁగా చెప్పఁ గలఁడు. నన్ను యుద్ధమునకుఁ బిలిచినవాఁడితఁడు. నేను రాజ పుత్రుఁడనని మీరే యెఱుఁగుదురుగదా!

వీర—వీఁడు మహాఘనుఁడు. వీడు కత్తితో నొకరిగొంతు కోయఁబోవుచుండఁగా నేను పట్టుకొన్నప్పుడు నాకు తాను రాజపుత్రుఁడనని చెప్పుచున్నాఁడు—ఓరీ! రాజుగారు జనసంరక్షణము నిమి

త్రము నీకిచ్చిన యీకత్తిని రాజుగారి ప్రజల గొంతుకలు కోయుటకయి నీవేల యుపయోగించుచున్నావు?

విక్ర—అయ్యో! నేను నిజము చెప్పెదను చిత్తగింపుఁడు. కారణమును జెప్పకయే యితఁడు నన్ను తనతోడ యుద్ధమునకుఁ బిలిచినాఁడు.

వీర—నీవు కారణమును జెప్పకయే నాకొడుకు నేల యుద్ధమునకుఁ బిలిచినావయ్యా?

పురు—నా గౌరవమునకు భంగము కలుగునట్లుగా నన్నీకొడుకవమాన పఱచినాఁడు.

వీర—ఓరీ! ఈయన గౌరవమునకు భంగము కలుగునట్లుగా నీవీయన నేల యవమాన పఱచినావు?

సుభ—రండి. రండి. స్త్రీల సమక్షమందు మీరు మీమీ గౌరవముల నిమిత్తము పోరాడఁగూడదు.—విక్రమసేనా! ఇటురమ్మా.—మీరింత నిర్భయముగా మాకేల యాయాసము కలుగఁ జేయుచున్నారు?—నీనిమిత్తమయి భయముచేత కళావతి ప్రాణములు విడువ బోవుచున్నది.

విక్రి—నేను బ్రతికిపోదునన్న భయముచేతనా? చచ్చిపోదు. నన్న భయముచేతనా?

సుభ—కాదు కాదు. వెనుకటిదానినిబట్టి భ్రాంతిపడఁగూడదు. కళావతి యిప్పుడు దృఢనిశ్చయురా లయియున్నది.—అమ్మాయీ! నీవు చెప్పు.

పురు—అమ్మా! మీ సెలవుపొంది నేనొక్కమాట యడుగవలసియున్నది. ఇప్పు డొక్కప్రశ్న వేసి నేనీ చిన్నదాని మానవ్రతమునకు భంగము గలుగఁ జేయవలెను.

కళా—మీరు నన్నేమి యడుగఁదలఁచుకొన్నారు?

పురు—రమ్మురమ్ము. రాధా! ఇటురమ్ము. పరిహాసము మానివేసి మనమిప్పుడు గంభీరముగా మాటాడవలెను.

కళా—అవును మీరు చెప్పినది సత్యము. అందుచేత నే నిప్పుడు నావక్రభావము మానివేసి యీ కరగ్రహణము చేసి నన్ననుగ్రహింప వలెనని యీతనిని వేఁడుకొనవలెను.

విక్ర—నాభాగ్యదేవతా! నీనోటినుండి యిప్పు డమృతోపమానమైన శుభవాక్కు వచ్చినది.—ఓపురుషోత్తమదేవా! నా బుద్ధికిఁజూడఁగా నీకు నేను జేసితి ననుకొనుచున్న యవమానవిషయమయి యేదో భ్రమయున్నట్టు తోఁచుచున్నది. నేను బుద్ధిపూర్వకముగ నీ కేమియు నవమానము చేసి యుండలే దని మాత్రము నేను జెప్పఁగలను. సమయము వచ్చినప్పుడు మానమును నిలుపుకొనుట కయి పోరాడుటకు నేను వెనుకదీయువాఁడను గావున నీవీపని కే కనిపెట్టి యున్నావు. భ్రమ కలిగినప్పుడు నిజ మొప్పుకొనుటకు సహితము నేను సందేహించువాఁడను గా నని నీ విప్పు డెఱుఁగవలెను. కాఁబట్టి నీకిప్పుడు నేను క్షమార్పణము చేయుచున్నాను. అయినను నన్నిప్పు డీచిన్నది యంగీకరించి గౌరవించుచున్నదిగాన, ఈమెను దక్కించుకొనుటకయి యే పౌరుషశాలి నాతోఁ బోరాడఁ బ్రతిఘటించినను నే నాతనితో యుద్ధముచేసి యీమెను విజయలక్ష్మితోఁగూడ వరించుటకు సంసిద్ధుఁడనై యున్నాను.

వీర—విక్రమా! నీ విప్పుడు వీరులు శ్లాఘింపఁదగిన మాట పలికినావు. నేనుగూడ నీపక్షమున నిలిచి నీకు సహాయుఁడనయ్యెదను.

దామో—నే నీ చిన్నదానిని నీకు విడిచిపెట్టుచున్నాను. ఈ ప్రపంచమంతయు వచ్చినను నాకీచిన్న దక్కబోదు. పోరాటము

లేక నాకు భార్య లభింపకపోయెడు పక్షమున, నే నెల్లకాలమును బ్రహ్మచారిగా నే యుండెదను.

పుదు—విక్రమసేనా! నన్నాలింగనము చేసికొమ్ము. చేసిన తప్పు నొప్పుకొని యర్హరీతిని క్షమార్పణము చేసినప్పుడు శత్రుండయినను మిత్రుండగును. ఈచిన్నది స్వహస్తఖితము లయినయీ యుత్తరములు నావిషయమయి తాను వ్రాసిన వగనునో కావనునో—(అని యుత్తరములు బయికి తీయుచున్నాడు.)

సుభ—(తనలో) ఓయి దేవుడా! ఇతం డిప్పుడు నా గుట్టు బయలఁ బెట్టును గాంబోలును!—(ప్రకాశముగా) పురుషోత్తమ దేవా! ఇందులో నేదో భ్రమయున్నది. నీభ్రమను నేను తరువాత సావకాశముగా నివారణము చేయఁగలుగుదు—

పురు—నీతో సంబంధము లేనప్పుడు పెద్దదానవు నీవీవిషయములో మధ్య ప్రవేశింపఁగూడదు—ఓకళావతీ! నీవు నారాధవగదువా? కావా?

కళా—కాను. నిశ్చయముగా నేను నీరాధను గాను.

(అని విక్రమసేనునియొద్దను జేరి నిలుచున్నది

సుభ—ఓ పురుషోత్తమదేవా! నీవెంత నిర్దయుఁడ వయియున్నను నీయందు ప్రేమపూనిన నాయపరాధమును నేనొప్పుకొనెదను. నన్ను క్షమింపుము. నీరాధను నేను.

పురు—ఓసి! నీవా రాధవు? ఇఁక దూరముగా తొలఁగిపో

సుభ—ఓరి కిరాతుఁడా! ఆయుత్తరములు నేను వ్రాసినవి. నీయం దిప్పుడు రసికత్వ మణుమాత్ర మయినను కనఁబడినపక్షము నిను దమునిఁజేయుటకు నేను గొంచె మాలోచించి యుందును.

పురు—ఓసుభద్రమ్మా! నీవు చూపఁదలఁచుకొన్న యనుగ్రహమునుగూర్చి నేను మిక్కిలి కృతజ్ఞుఁడనయి యున్నాను. న న్నట్లు మోసము చేసినది నీవైనను మీ మంథర యైనను, మీ యిద్దఱి యుపకార ఋణమును నేను తీర్చుకోలేను—విక్రమసేనా! ఆచిన్నదానిని నీవు నావద్దనుండి పరిగ్రహించినావు గనుక, నేను కృతఘ్నుఁడను కానని చూపుట కీబేరములో నారాధను గూడ నీకే కొఱకుగా విడిచిపెట్టుచున్నాను.

విక్ర—పురుషోత్తమదేవా! నీ యౌదార్యమునకు సంతోషించినాను. ఐనను నేఁడు భార్య లేకున్నవాఁడు రణశూరుఁడైన నా ప్రియమిత్రుఁడు దామోదరవర్మ—

పురు—ఆహాహాహా! ఓరణశూరా? నీ కిప్పు డేమయిన ధన్యుఁడవు కావలెనన్న తలం పున్నదా?

దామో—ఈముదిముడుతలా? నా కక్కఱలేదు—ఓ పురుషోత్తమదేవా! నన్ను క్షమించు. ఇంకొకసారి నీకు మరల నేను నాశరీరమును నూనెలో వేసి నాపాడుట కవకాశము కలుగఁ జేసిన పక్షమున, న న్నప్పుడు దామోదరవర్మ పిఱికివాఁ డని నీవు పరిహసింతువుగాని లే.

వీర—సుభద్రమ్మా! ఇటు రా! విచారపడఁబోకు. నీ వింకను వయసులోనే యున్నావు.

సుభ—ఓవీరసేనా! మగవాం డ్రందఱును పసుపాత్రులు.

[చారుమతియు, దర్పసారుఁడును తక్క నందఱు
నిష్క్రమించుచున్నారు.]

చారు—(తనలో) ఇతఁడు నిరుత్సాహుఁడయి ఖేదపడుచున్నట్టున్నాఁడు. అయినను కొఱకొఱలాడుచున్నట్టుమాత్ర మేమి లేఁడు.

అతఁడు చెప్పినకథలో కొంతసత్యముకూడ నున్నది.—ఓ యాఁడు స్వభావమా! నీ వింత చంచలమైనదానవై యున్నప్పుడు నీమన నిశ్చయ మెంత న్యాయమైనదిగా నుండవలెను!

దర్ప—చారుమతీ! నేన ర్హుఁడనని యెఱిఁగియు ని న్నిట్లు దయచూపు మని వేడఁగలుగుదును? నిన్ను ప్రార్థించుటకు నాకు సాహసము చాలకపోయినను, నాపశ్చాత్తాపము నన్నాకలపాలు చేయుచున్నది.

చారు—దర్పసారా! ప్రేమాస్పదు లైనవారు తప్పు చేసి నప్పుడు క్షమింపవలెనని నాదానికంటె నన్నాదరము చేసిననీ గొప్పతప్పిదము కాదు. నాదౌర్బల్యమునకుఁ దగినక్షమార్పణమున ప్రేమపూర్వకముగాఁ జేయవలసిన దని నామన స్సిప్పుడు నాకు హితబోధ చేయుచుండఁగా, నీదౌర్బల్యమును నేను క్షమింపనియెడల నేన కృతఘ్ను రాల నగుదును.

దర్ప—నే నిప్పుడు కృతార్థుఁడ నయినాను.

వీర—(ముందుకువచ్చి) ఇక్కడ మీ రేమిచేయుచున్నారు మీరుకూడ మీలో తగవులాడుచున్నారాయేమి? చారుమతీ! ఇట రమ్ము. ఈవఱకు నే నేవిషయములోను నిన్ను నిర్బంధపెట్టలేదు. ఐనను నే నిప్పుడుమాత్రము నిన్నొకవిషయమై బలవంతపెట్టఁబోవు చున్నాను. నే నెఱిఁగినంతవఱ కీదర్పసారుఁడుచేసినతప్పిదములన్నియు నీయం దితనికిఁ గలయత్యనురాగమువలనఁ గలిగినవేకాని వేఱుకారణముచేతఁ గలిగినవి కావు. ఇఁక నామాట కెదురాడక తత్క్షణ మీతనిని వివాహము కమ్ము. ఇఁక నితఁడు తనలోపములను దిద్దుకొను విధమును జూచి నీవే మెచ్చుకొనవలెను.

[తక్కినవారు ప్రవేశించుచున్నారు.]

పురు—రండి. ఒక్కఁడుతప్ప మఱి యెవ్వరు నిక్కడ సంతుష్టులు కానివారు లేరు. నేనుమాత్ర మసంతుష్టుఁడ నయినను మీ యందఱును సంతుష్టు లగుట నేత్రోత్సవముగా చూచి నేనును సంతుష్టుఁడ నయ్యెదను.

దామో—పురుషోత్తమ దేవా! నీవన్నమాట శ్లాఘ్యముగా నున్నది. వీరిసంతోషము చూచి మనము సంతోషింతము.—విక్రమ సేనా! నీకు చిరసౌఖ్యము కలుగుఁగాక!—దర్పసారా! అట్లే నీకును గలుగునుగాక!—ఓ కాంతలారా! మీరందఱునురండి. మీ సౌఖ్యమును జూచి నేనెంతమాత్రమును కోపముగాని యసూయగాని యతృప్తిగాని పొందువట్లు మీకుఁ జూపుటకై నేఁడు మీకందఱకును గీతవాద్యములతో మాయింట విందు చేసెదను. మీరందఱునుతప్పక వచ్చి నన్ను చరితార్థునిఁ జేయవలెను.

వీర—ఓయీ! నీయుత్సాహమునకు నేను సంతోషించినాను. నేటిరాత్రి యీదంపతులయొక్క యాయురారోగ్యములుకోరి మనము విందారగింతము.

దర్ప—విక్రమసేనా! మన ప్రియురాండ్రు మనదోషముల నుండి మనలను విముక్తులను జేసి పరిశుద్ధులనుగాఁ జేసినందునకయి మన మానందపరవశుల మగుదుము. నీహృదయేశ్వరి యిఁకముందెప్పుడును మాయలుపన్నకుండ నీకు బుద్ధిచెప్పి నిన్ను విశుద్ధుని జేసినది. నాప్రాణేశ్వరితనబుజువైనశాంతవర్తనముచేత నాయసంతుష్టికిఁ గారణమైన నాశంకాశీలతను రూపుమాపి న న్నకళంకుని జేసినది.

విక్ర—మన మిద్దఱమును కామదేవునియాగ్రహమును నను గ్రహమునుగూడ సమానముగానే యనుభవించినాము. మనకిరువుర

కును గలభేదము మాత్రమిది, నీవు కష్టములకు సహింపఁ గలిగియుంటివి; నేను—

కళా—గతించినదానిని త్రవ్వుకొని విచారపడుట కిది సమయము గాదు. మన మిప్పుడు గడచినదాని నంతను మఱచి మన సంతోషము నిష్కళంకముగాఁ జేసికొనవలెను.

యశ—ఇప్పుడుమాత్రమే కాక మం దెప్పుడునుగూడ మనము గతించినదానిని మరల తలపెట్టక యఖండసుఖ మనుభవించుచుందము. యోగ్యము లయినహృదయములు వివాహబంధముచేత నొక్కటిగాఁ గూర్పఁబడినప్పుడు కామదేవుఁడు తా నావఱకు శాధించిన తనపుష్ప బాణముల నాదంపతులకు పూసరములుగాఁ జేసి యానందసౌరభ మెల్లప్పుడును గఁబులుకొనునట్లు చేయును. మనవారు మననిమిత్తమయి వేచి యున్నారు. లోపలికిఁ బోదము రండు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

బాన్సు ప్రెస్, రాజమండ్రి 1950.

# మొదటి కూర్పు పీఠిక.



ఈ నాటకము మహాకవియైన కాళిదాసునిచే రచియింపఁబడ నది. ఈతఁడు విక్రమాదిత్యుని యాస్థాన కవీశ్వరులలో నెల్ల నగ్ర గణ్యుఁడు గనుక, ఈనాటకము రచియింపఁబడి యిప్పటికి రమారమి రెండువేల సంవత్సరములుకావచ్చినది. ఇది సంస్కృతనాటకములలో బహు పురాతనమయినది. ఇప్పుడున్న నాటకమునలో నొక్క మృచ్ఛకటిక మాత్రమె దీనికంటె ప్రాచీనమయినది. సంస్కృతకవి సార్వభౌముఁడని యెల్ల వారిచేతను శ్లాఘింపఁబడు కాళిదాసునిగాని, ఒక్క హిందువులుమాత్రమేకాక నాగరీకాగ్రేసరు లయిన యూరపు ఖండపండితులు సహితము నాటకరాజ మని శిరసావహించి గౌర వించు శాకుంతల నాటకమును గాని, నేనిప్పుడిచ్చట శ్లాఘింపవలసిన యావశ్యకము లేదు. గీర్వాణభాషలోఁగల నాటకములలోనెల్ల సర్వో త్కృష్టమయిన యీ యభిజ్ఞాన శాకుంతలమును రసవంతముగా తెనిఁ గింపఁగల సామర్థ్యము నావద్దలేని సంగతి పూర్ణముగా నెఱిఁగినవాఁడ నయ్యును, అట్టి నాటకమును జదివినమీఁదట దానిని తెనిఁగింపవల దున్నని నామనస్సులోఁబుట్టిన బుద్ధిచాపలమును మరలించుకోలేక నాశక్తినివిచారింపక సాహసముచేసి యీమహాకార్యమున కారం భించినాఁడను. ఒకవేళ జనులకీ పుస్తకము సంతోషజనకముగానే యున్నయెడల, ఇందు నాకల్పన మేమియు లేక సర్వమును కాళిదా సునిదే యగుటవలన నా మహాకవిని మెచ్చవలయునేకాని నన్ను శ్లా ఘింపవలసిన పని యెంతమాత్రమును లేదు. ఇట్లని నాలోపమువలన నిన్నఁగా నుండనివిషయములకెల్లను కాళిదాసునే యుత్తరవాదినిగాఁ జేసి తప్పించుకొన నెంచినట్లు దీనిం జదువువా రెంచఁగూడదు. దీని

యుందుఁగల దోషములన్నియు నావియే కనుక తమ కే వేనిలోపములు కనఁబడినచో పండితజనులు నా యసమర్థతను మన్నింతురని ప్రార్థించుచున్నాను. మఱియు నీతెనుఁగునుబట్టియే కాళిదాసుని రచనానైపుణ్యమును నిర్ణయించుకొనక యిది యొకవేళ హృదయాహ్లాదకరముగా నుండకపోయినను మూలగ్రంథమత్యంత శ్లాఘాపాత్రముగా నుండుననియే నమ్మి యామహాకవియెడ పరిపూర్ణ గౌరవము నుంచుదురని నమ్ముచున్నాను. నే నీ గ్రంథమును కొన్ని సంవత్సరముల క్రిందట నారంభించి మొదటి రెండంకములనుమాత్ర మాంధ్రీకరించి తరువాత కొన్ని కారణములచేత నప్పటి కంతటితో నిలిపినాఁడను. కాని రెండు మాసముల క్రిందట నామిత్రులు కొందఱీ నాటకమును తెనుఁగున నాడుట యుచితముగా నుండునని తెలిపినందున, అందు నిమిత్తమయి మరల పనిపూని తక్కిన మైదంకములను కొంత తొందరగా వ్రాయవలసినవాఁడనైనాఁడను. అప్పుడు మొదటి రెండంకములను కొంచెము కఠినశైలితో వ్రాసినను నాటకమాడునప్పు డందఱకును దెలియుట యత్యంతావశ్యక మను నభిప్రాయముతో నిప్పు డీయయిదంకములను మిక్కిలి సులభముగా వ్రాసినాఁడను. నే నీగ్రంథమును తెనిగించుటలో బహు ప్రతులను జూచి మొట్టమొదట నన్ని ప్రతులలోనున్న విశేషాంశముల నన్నిటిని జేర్పవలయునని యెంచి ప్రథమ ద్వితీయాంకములయందు కలకత్తా ప్రతియందు, గల యధిక శ్లోకములనుగూడ జేర్చితినిగాని, తరువాత పరిశీలింపఁగా నట్టివి ప్రక్షిప్తములుగాఁ గానబడినందున తరువాత నట్టివానిని వదలివేసి బహు ప్రతులయందున్న రీతినే తక్కినభాగమును తెనిఁగించినవాఁడను; నాకులభించిన నాలుగు భిన్నదేశ ప్రతులయందును గొన్ని

బుద్ధి కేపాతము సరసముగా: నున్నట్లు తోఁచినదో దాని ననుసరిం
తెనిఁగించుచు వచ్చినాఁడను. విద్వాంసులు దీనియందలి లోపములఁ
గనఁబఱిచినయెడల మరల ముద్రించునప్పుడు వందన పూర్వకముగ
సవరించెదను.

రాజమహేంద్రవరము
దిశ్రీ అక్టోబరు ౧౮౮౩ సం॥ } కందుకూరి వీరేశలింగము

# మూడవకూర్పు పీఠిక.

నేనీ నాటకమును తెనిఁగించి ౧౮౮౩ వ సంవత్సరాంతమునందు మొదటిసారి ముద్రించినాఁడను. ఇది ౧౮౮౯ వ సంవత్సరమునందు రెండవసారి ముద్రింపఁబడినది. ఈసారి ఘనసమానమైన దుమూలగ్రంథానుసారముగా నక్కడక్కడఁ గొన్ని మార్పులను జేసియున్నాఁడను. ఇఁకనైనను దెలుఁగువారు దీనియం దధికాదరమును జూపుదురని నమ్ముచున్నాను.

రాజమహేంద్రవరము<br>
ది ౧౫ ఏప్రిల్ ౧౮౯౬ సం॥ } కందుకూరి వీరేశలింగము



# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు



### పురుషులు:

దుష్యంతుఁడు—కథానాయకుఁ డయిన పూరువంశపు రాజు
మాఢవ్యుఁడు—రాజునకు వేడుక చెలికాఁడు
కణ్వుఁడు—శకుంతలను పెంపుడుకూఁతురుగఁ బెంచిన మహర్షి
వైఖానసులు—కణ్వాశ్రమప్రాంతమునందలి ఋషులు
శార్ఙ్గరవుఁడు—కణ్వశిష్యుఁడు
శారద్వతుఁడు—కణ్వశిష్యుఁడు
మిత్రావసువు—రాజు బావమఱఁది; ఆరక్షకభటాధిపతి
దౌవారికుఁడు—రాజద్వారపాలకుఁడు
కరభకుఁడు—రాజు తల్లి పంపిన భటుఁడు
సోమరాతుఁడు—రాజపురోహితుఁడు
జానుకుఁడు—ఆరక్షకభటుఁడు
సూచకుఁడు—ఆరక్షకభటుఁడు
వాతాయనుఁడు—అంతఃపుర ద్వారపాలకుఁడు
మాతలి—ఇంద్రసారథి
భరతుఁడు—దుష్యంతుని పుత్రుఁడు
కశ్యపుఁడు—మరీచిపుత్రుఁడగు మహర్షి
కుంభీలకుఁడు—బెస్తవాఁడు

### స్త్రీలు:

శకుంతల—దుష్యంతుని భార్య కథానాయిక
అనసూయ—శకుంతల చెలికత్తె
ప్రియంవద—శకుంతల చెలికత్తె

**గౌతమి**—ఒకవృద్ధతాపసస్త్రీ

**వసుమతి**—దుష్యంతుని మొదటిభార్య

**సానుమతి**—శకుంతల చెలియైన యప్సరస

**తరళిక**—వసుమతి పరిచారిక

**చతురిక**—రాజుపరిచారిక

**పరభృతిక**—ఉద్యానవనపాలకురాలు

**మధుకరిక**—ఉద్యానవనపాలకురాలు

**అదితి**—కశ్యపునిభార్య

**సువ్రత**—ఒకతాపసస్త్రీ

వీరుగాక సారథి మొదలగువారు మఱికొందఱు వత్తురు.

---

శ్రీ ర స్తు

అభిజ్ఞాన శాకుంతల నాటకము

# ఉపోద్ఘాతము

1. కవికాలము :

ఈనాటకమును రచించిన మహాకవి కాళిదాసు. ఇతని నామము భారతీయ వాఙ్మయమున కింద్రజాలమునంటిది; కాని యీమహాకవి యెప్పటివాఁడో, యెక్కడివాఁడో, యీతని జననాదికము లెట్టివో యిదమిత్థమని నిర్ణయింపరాక కేవల మూహ్యాములయి మాత్రమున్నవి. ఇతఁ డుజ్జయినికిఁ జెందినవాఁడనియు, విక్రమాదిత్య రాజాస్థానమున నితఁడు వెలసినట్లును బండిత సంప్రదాయము. ఇతఁడు బహుభోగ భాగ్యశాలియయి జీవితము గడపెనని పలువు రంగీకరించిన విషయము.

ఈమహాకవి ఋతుసంహారము, కుమారసంభవము, మేఘ సందేశము, రఘువంశము, అనెడి కావ్యములను, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞాన శాకుంతలము అను నాటకత్రయమును రచించెను.

ప్రాచ్యపండితులుగాని, పాశ్చాత్యపండితులుగాని బాహ్యాంతర సాక్ష్యములను బట్టి కాళిదాసెప్పటివాఁడో చెప్పలేకపోవుట మన దుర దృష్టము. "నవరత్నము" లనఁబడు తొమ్మండ్రు విక్రమాదిత్యు నాస్థానమున వెలసిరని చెప్పెడి "ధన్వంతరి క్షపణ కామరసింహ శంకు। వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః। ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం। రత్నాని వై వరరుచి ర్నవవిక్రమస్య" అను శ్లోకమును బురస్కరించుకొని, శాక్యకులమును నిర్మూలించినట్టి విక్రమశక

స్థాపకుఁడగు విక్రమాదిత్యుకాలము క్రీ. పూ. 56 కావుటచేఁ గాళిదాసప్పటివాఁడని సర్ విలియం జోన్సుగారి యూహ. ఇతర కారణములను జూపి ఆప్టేపండితుఁడు జోన్సుగారి వాదముతో నేకీభవించుచున్నాఁడు. కాశ్మీరమునకుఁ జెందిన శ్రీహర్ష విక్రమాదిత్యుఁడు శాక్యులను బరిమార్చుట క్రీ. పూ. 457 కావున, కాళిదాసు జోన్సు చెప్పినదానికన్న సుమారు నాల్గువందల యేండ్లు మున్నటివాఁడని శ్రీ టి. యస్. నారాయణ శాస్త్రిగారి వాదము. కీత్ పండితుని ప్రకార మీకవి క్రీ. శ. 350 నాఁటివాఁడు. మోక్షమూలరు, ఫర్గూసన్ పండితులు కాళిదాసు క్రీ. శ. 544 ప్రాంతమునకుఁ జెందినవాఁడందురు. శానేపండితుఁడు దాదా పీవాదముతో నేకీభవించుచున్నాఁడు. కాళిదాసునిగూర్చి ప్రప్రథమముగా ద్వితీయపులకేశి వేయించిన అయిహోల్ శాసనమునఁ బ్రశంసగలదు. ఈశాసనము క్రీ. శ. 634 నాఁటిది. అతిప్రసిద్ధమగు మందరసర శాసనమున వత్సభట్టికృతస్తుతి యున్నది. అద్దాన నుత్తమ శ్లోకము లనేకములు కాళిదాస కృతములగు ఋతుసంహార మేఘసందేశముల శ్లోకములకుఁ బోలికలై కన్పట్టును. ఈవత్సభట్టిప్రశస్తి క్రీ. శ. 472 ప్రాంతమునది. కొందఱు విమర్శకులు, మాళవికాగ్నిమిత్రములోని నాయకుఁడు శుంగవంశమునకుఁ జెందిన యగ్నిమిత్రుఁడని నిశ్చయించిరి. ఇట్లు లనేకు లనేక విధములుగాఁ గ్రొత్త క్రొత్త సిద్ధాంతములను వెలిబుచ్చియున్నారు. మొత్తము మీఁద కాళిదాసు క్రీ. పూ. 56 నకుఁ దరువాతివాఁడనియు, క్రీ. శ. 400 లకు బూర్వుఁడనియు మనము నిశ్చయించుటలో విప్రతిపత్తి యుండదేమో!

2. ఈనాటక వ్యాఖ్యాతలు :

శాకుంతల మతి ప్రసిద్ధివడసిన నాటకము కావుటచే దీనికి వ్యాఖ్యాతలు పలువురు వెలసిరి. వారిలోఁ గొందఱు: అభిరామభట్టు, కాటయ వేముఁడు; కృష్ణనాథ పంచాననుఁడు, చంద్రశేఖరుఁడు,

నారాయణ రాఘవుఁడు, రామభద్రుఁడు, శంకరుఁడు, శ్రీనివాసుఁడు. ఘనశ్యాముఁడు ప్రేమచంద్రుఁడు మొదలగువారు. వీరలలోఁ గ్రిగీతలు గల పేళ్లు ఆంధ్ర వ్యాఖ్యాతలవి.

కాటయవేముఁడు: ఇతఁడు కొండవీటి రాజ్యము నేలిన ప్రోలయ వేమారెడ్డికి (క్రీ. శ. 1324 — 1350) దౌహిత్రుఁడు. కుమారగిరిరెడ్డి (1383 — 1400) కి బావయు మంత్రియు నై యుండెను. ఇతఁడు మహా పండితుఁడు. కాళిదాసీయ నాటకత్రితయమునకు వ్యాఖ్యానమును, ఒక నాట్యశాస్త్రమును విరచించియున్నాఁడు. వీనికన్నిటికి "వసంతరాజీయము" లనిపేరు. వసంతరాజని కుమారగిరిరెడ్డికి నామాంతరము.

శ్రీనివాసదీక్షితుఁడు: ప్రత్యంకాంతమునను నున్న "ఇతి శ్రీరమణ శ్రీ వేంకటాచలేశ్వర పాదారవింద సమారాధక వైఖానసకుల తిలక శ్రీ కౌశికగోత్ర శ్రీ తిరుమలాచార్య పుత్రేణ... శ్రీనివాసాచార్యేణ విరచితాయాం శాకుంతల వ్యాఖ్యాయాం..." అనుదానినిబట్టి తిరుపతి శ్రీ వేంకటేశ్వర దేవస్థానమున నితఁ డర్చకుఁడై యుండునని తెలియుచున్నది. ఇతనికి చక్రాయుధ బిరుదముగలదు. ఇతఁడు క్రీ. శ. 1850 ప్రాంతమువాఁడు. ఉన్నవానిలో నితని వ్యాఖ్య దీర్ఘతమము; అతని వైదగ్ధ్యమునకు నిదర్శనము.

3. ఈ నాటకమునందలి కథాసారము:

చంద్రవంశ చక్రవర్తి దుష్యంతుఁడు కణ్వాశ్రమోపాంతమున నొక సారంగమును వెన్నంటి తఱుముచు, నది ఋష్యాశ్రమమని తెలిసి తన యుద్దేశమునుండి విరమించును. అంత నా సమీపమున శకుంతల చెలికత్తెలతో, లేఁదీగెలకు, వృక్షములకు, నీళ్ళు వోయుటను జూచును. ఆమె సౌందర్యమున కచ్చెరువంది యామెతో సంభాషించుట కిచ్ఛగించును. ఆమెకుఁ దనయెడ ననురాగ మున్నదని తెలిసి శకుంతలను గలసికొని వివాహ మాడును. ఆమెకుఁ దన యంగుళీయక మొసఁగి,

తాను పురముచేరుకొన్న క్షణముననే శకుంతలను బిలిపింతునని వాగ్దానముచేసి దుష్యంతుఁడు వెడలును. పరధ్యానములో నుండఁగా శకుంతల దుర్వాసోమహామునిని సత్కరించుట మఱచును. ప్రియుఁ డీమెను విస్మరించునని శాపమిచ్చి యతఁడొసఁగిన యంగుళీయకమును జూపినచో శాపవిమోచన మగునని చెప్పి దుర్వాసుఁడు వెడలిపోవును. కొంతకాల మేఁగినపిమ్మట కణ్వమహర్షి శకుంతలను దుష్యంతునికడ కనుప నిశ్చయించును. శకుంతలయుఁ దనచెలికత్తెలయు, ఆశ్రమ తరులతాగుల్మములయు, లేళ్ళయు ననుజ్ఞగొని బయలుదేరి దారిలో నంగుళీయకమును బోఁగొట్టుకొని, తుదకు రాజసభను జేరును. అచట శకుంతల దుష్యంతునితో నెంతగా వాదించినను వ్యర్థమే కాఁగా దుఃఖముతో రాజసభనుండి బయల్వెడఁగానే మేనక యామెను దేవలోకమునకుఁ దీసికొని వెళ్లిపోవును. శకుంతల పోఁగొట్టుకొన్న యుంగరమొక జెస్తవానికిఁ దొరకి వాఁ డద్దానిని నమ్మఁ జూచుచుండఁ దీస్పుకై రాజసమక్షమునకు నతనిని గొంపోవుదురు. ఉంగరమును జూచుటే తడవుగా, దుష్యంతుఁడు శకుంతలయెడఁ దానొనర్చిన యపరాధమునకు వగచుట కారంభించునుగాని తన పశ్చాత్తాపమునకుఁ బ్రతిఫలము గన్పించదు. ఇట్లుండఁ గొంతకాలమునకు నింద్రుఁడు శత్రుసంహారణార్థము దుష్యంతుని సాయమపేక్షించును ఇంద్రునిరథమును నడపుచుండఁగా నొక బాలుఁడు సింహకిశోరముతోడ నాటలాడుచుంటను జూచి యతఁడు తనకుమారుఁడు భరతుఁడేయని గ్రహించి, శకుంతలాఘనసమాగమము కలుగ నీక నెన్నఁడామెను వదలపెట్టనును.

4. ఇందలి విపర్యాసములు:

కాళిదా సీకథను సంస్కృత భారతమునుండి గ్రహించెను. శకుంతలోపాఖ్యానము మహాభారతమున నాదిపర్వమున 64 అధ్యాయమునుండి 74 అధ్యాయము వఱకుఁ గలదు. ఔచిత్య సంపాదనార్థమై కాళిదాసు

మూలకథకుఁ గొన్ని మార్పులు గావించి మెఱుఁగులు దిద్దియున్నాఁడు. ఇందు ముఖ్యములగు మార్పులివి.

(అ) నాయికానాయకుల యనురాగోత్పత్తి, తత్క్రమాభివృద్ధి విషయము: మూలమున, దుష్యంతుఁడు శకుంతల నొంటిగాఁ జూచి మోహించును. పుట్టఁబోవు కుమారునకు రాజ్యమొసఁగెదనని ప్రతినచేసి యామెను గాంధర్వవిధిని బెండ్లియాడి, తఱువాతఁ బిలికిపలె వెళ్లిపోవును. నాటకమున నాయికానాయకుల ప్రేమ నిర్వ్యాజముగాఁ దోఁచును. అంతేగాదు. అదిసహజముగాఁ బెంపొందినట్లు వేర్వేఱు భాగములందుఁ జూపఁబడినది. వీరి పరస్పరానురాగము, భావోదయము పరిపూర్ణత్వము వడయుటకుఁ గాఁబోలు, ఋషిపుత్రుల ప్రార్థనముపై నాశ్రమమునఁ గొంతకాలముండి వారివలన సెలవుగొని వెడలును.

(ఆ) దుర్వాసశ్శాపము: ఇదికాళిదాసు గావించిన మార్పులలో నతిప్రధానము. మూలకథయందు "పట్టణమున కేను జేరిన వెంటనే నిన్ను బిలిపింతును" అని రాజు శకుంతలతోఁ జెప్పినట్లు గలదు. కాని యట్లు చేయలేదు. తరువాత శకుంతల స్వయముగాఁ బుత్రునితో నెదురవచ్చి నిలువఁగాఁ దానామెనెఱుఁగననియు నిండుసభలో చెప్పెను. ఇట్లు చిత్రించుట నాయకపాత్రకు దోష మారోపించు టగును. తన్నివారణార్థము రాజు శకుంతలా వృత్తాంతము మఱచిపోవుటకుఁ గాళిదాసీ దుర్వాసశ్శాపము కల్పించెను. రాజు నిర్దోషి యని పంచమాంకారంభము స్పష్టము చేయుచున్నది.

(ఇ) పుత్రోత్పత్తి: పుత్రునితో శకుంతల దుష్యంతు నొద్ద కేఁగినట్లు మూలమున నున్నది. శకుంతల గర్భముగా నున్నప్పుడే రాజసభ కేఁగినట్లు, నచట నామె తిరస్కృతి కాఁగా మరీచ్యాశ్రమమునకుఁ గొంపోఁబడి యచటఁ బుత్రుని కన్నట్లు నాటకమున మార్పునేయఁ

డియున్నది. "తల్లిని గుర్తింపకపోయినను చక్రవర్తి చిహ్నాంకితుఁడును, మిత సత్త్వుఁడును, దుష్యంతప్రతిముఁడు నగు సర్వదమనుని రాజు తన పుత్రునిగా గుఱుతింపకపోవుట అసంభవము" కావున కాళిదాసు చేసిన యీమార్పు సరసము. ఈమార్పు చేయకుండినచో నాటకమున సప్త మాంకమునకుఁ బ్రసక్తి లేదు.

(ఈ) శకుంతలాదుష్యంతుల పునస్సమాగమము హేమకూట మునఁ గశ్యపాశ్రమమున జరుగును.

ఇవిగాక ప్రథమాంకమునందలి భ్రమర ప్రకరణమును, రాజును గాఁడ శకుంతల తనకాలికిఁ గుశాగ్రము గ్రుచ్చెననియు, బట్ట చెట్టునకుఁ గుల్కొనె ననియు మిషలు కల్పించి యాఁగుట, చతుర్థాంకమున కుంతల పయనమగునప్పుడు లేడి యడ్డగించుట, పంచమాంక మున హంసపదిగానము, షష్ఠాంకమున ధనమిత్రుని మరణవార్త, మాతలి విదూషకుని బీడించుట, సప్తమాంకమున సర్వదమను కంఠ మునఁగల తాయెతు మాహాత్మ్యము-ఇత్యాదులు నాటకమునకుఁ జెప్ప రాని వన్నెఁగూర్చు కథాసన్నివేశములు. కాళిదాసు "ఈ చిన్న చిన్న వ్యాపారముల వలనఁ గథయొక్క పూర్వాపర సందర్భములను జక్కఁగాఁ దెలుపుటయేగాక మానవునకుఁ దెలియకుండ మానవాంతఃకరణములో నుండునట్టి యుదాత్త భావములను మనోహరముగా వ్యక్తపఱచి యున్నాఁడు. గొప్ప మార్పులకంటె నిట్టి కొలఁది మార్పులలోనే సభావములను జిత్రించునట్టి కవిప్రతిభ యొక్క మనోహరాకృతి గ్గోచర మగును."*

. నాటక ప్రశస్తి:

ఈనాటకము నుద్దేశించి, కాళిదాసుని ప్రశంసించుచు రవీంద్రుఁ డిట్లు వచియించియున్నాఁడు.

* ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము. పుట 202.

"Kalidasa has shown that while infatuation leads failure, beneficience achieves complete fruition, that beauty constant only when upheld by virtue, that the highest form love is the tranquil controlled and beneficient form, that regulation lies the true charm and in lawless excess the speec corruption of beauty. He refuses to acknowledge passion as tl supreme glory of love; he proclains goodness as the final go of love"*

రెండుశతాబ్దములకు మున్నే యిట్ల్యది పాశ్చాత్యవిద్వజ్జనుల గ్ర నాకర్షించినది. జర్మనీకిఁ జెందిన గేటి యనెడి సుప్రసిద్ధ తత్త్వజ్ఞ డీనాటకమును జదివి యానందమును బట్టలేక ఆశువుగా నిట్లు చెప్పెనఁ

Wouldst thou the young year's blossoms and the fruits its decline
And all by which the soul charmed, enraptured, fed,
Wouldst thou the earth and heaven itself in one sc name combine?

I name thee O! Sakuntala and all at once is said.

ఇన్నాటకముంగూర్చి యీక్రింది శ్లోకము పరంపరగా వినవచ్చుచున్నది.

"కాళిదాసస్య సర్వస్వ మభిజ్ఞాన శకుంతలం
తత్రాపిచ చతుర్థోంకో యత్రయాతి శకుంతలా॥"

ఈనాటకమునకున్న ప్రసిద్ధియే దీనికిఁ గల యనేకభిన్నపాఠ ములకుఁ గారణము. నేఁ డీ నాటకమునకు నాల్గుభిన్నపాఠములు గల మొదటిది గౌడీయపాఠము: దీనిని ప్రేమచంద్రతర్కవాగీశుఁడు 18 లోను, డాక్టరు పిశ్చెల్ 1877లోను బ్రకటించిరి. రెండవది దేవనా

* Kalidasa the moralist – Modern Revised xiv.

పాఠము: ఇద్దానిని ఈశ్వర చంద్రవిద్యాసాగరులు, ప్రొఫెసరు మోనియరు విలియమ్స్ ప్రకటించిరి. మూడవది కాశ్మీరపాఠము: ఇయ్యది గోడ్ బోలే, రాజవర్మ యను పండితులచేఁ బ్రకటింపబడ్డది. నాల్గవది దాక్షిణాత్య పాఠము: ఇయ్యది యాంధ్రాక్షరములతోడను తమిళులు సంస్కృతము కయి యుపయోగించెడి "గ్రంథాక్షరము" ల తోడను ప్రకటితమయినది. ఈనాల్గిటిలో దేవనాగర పాఠములకు దాక్షిణాత్య పాఠములకు భేదమంతగా లేదు. ఇవియే నిజమైనపాఠము లయియుండ నోపునని పలువురు పండితుల యభిప్రాయము.

ప్రపంచమునందలి యుత్తమోత్తమ నాటకములలో నిది యొక్కటి. "ఇంగ్లీషుభాషలో నీనాటకమునకుఁ బంద్రెండు భాషాంతరములును, జర్మను భాషలోఁ బదునెనిమిదియు, ఇటాలియనులో నాలుగును, రషియనులో మూఁడును, డ్యానిషులో రెండును, డచ్చిలో రెండును, స్పానిషు, పోలిషు, హంగేరియన్, బొహెమియన్, ఐస్లాండిక్ భాషలలో నొక్కొక్కటియుఁ గలవు"* దీనిని మొట్టమొదట క్రీ. శ. 1789 లో సర్ విలియం జోన్సు అను నాంగ్ల పండితుఁడు ఆంగ్లభాషలోనికి భాషాంతరీకరించెను. నాఁటినుండి నేఁటిదాఁక నెల్లభాషలలోను చర్చాత్మక గ్రంథములు పెక్కులుపుట్టినవి. ఈనాటకమిటీవల బన్సన్ పండితుని యాంగ్లాను వాదము ననుసరించి ఆస్ట్రేలియాలోని రన్‌బోరన్ నగరమున బ్రదర్శితమైనది.

6. ఇందలి వర్ణనములుకొన్ని :

(క) స్వభావోక్తికి నుత్తమోదాహరణ మనఁదగిన దీక్రిందిపద్యము:

"పడి బఱతెంచు తేరిదెసఁ బల్మఱు మార్మెడ వెట్టి చూచుచుం
గడు శరపాతభీతిఁ దనకాయము ముందుకుఁగుంచి యెంతయుం

* ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము పుట 198

బడలిక నోటినిండె దెఱచి మార్గమునిండ నగంబుదిన్న ద
ర్భలుపడ, మింటఁ బాఱెడు ధరంబదమూనక పెద్దదాటులన్"

(పుట. 4)

పై పద్యమున రథవేగమును దప్పించుకొనుటకయి లేడి పరువెత్తుట కన్నులకుఁ గట్టినట్లుగా వర్ణింపఁబడినది.

(ఖ) ఇట్టులే గుఱ్ఱముల వేగముకూడ స్వాభావికముగాఁ జెప్పబడినదనుట క్రింది పద్యము దృష్టాంతము.

"పగ్గములన్ సడల్చుడును వాజులు మేనులు చాఁచిపాఱెడున్
నిగ్గగు చామరాగ్రములు నిశ్చలతన్ వహియింపఁగాఁ జెవుల్
దిగ్గన నిక్కఁబెట్టి తమలేపిన ధూళికి నంటరానివై
జెగ్గిలపాఱు నామృగము వేగము సైపక కూడఁ బాఱునాన్.

(గ) శకుంతల చిత్రమును దాను వ్రాసి యందింకను బూరింపఁదలఁచుకొన్న భాగములనుగూర్చి రాజిట్టులనును.

"పులినములందు హంసయుగముల్ విహరించెడు మాలినీనదిన్
బలుహరిణంబు లున్నతదుపాంత పవిత్రహిమాద్రిపాదమున్
వలువలుగట్టు శాఖలనువర్తిలు వృక్షముక్రింద నిల్చికొ
మ్ముల్మెఁ దనకన్ను గోఁకికొను ముగ్ధమృగిన్ లిఖియింపఁగోరెదన్.

ప్రకృతితో, సృష్టితోఁ, దాదాత్మ్యమునొంది, వానిని నంతశ్చక్షువుతో సూక్ష్మముగాఁ బరికించినఁ గాని యీదృశ్యముగోచరముకాదు.

(ఘ) ఆకాశమునుండి త్వరగాఁ గ్రిందికి దిగువారికి భూమియెట్లు కన్పించునో యనుట క్రిందిపద్యము గమనింపుఁడు :

"అదె మహీప్రస్ఫుటాద్రి శిఖరావళినుండియు డిగ్గునట్టులో
మొదలులు తోఁపఁ జెట్టు డిగ్గ మున్నటు లాకులలో నడంగుటల్

నదులు తొలంగె డాయుట జలంబుకనంబడనట్టి రూపమున్
బదిగనెవండొ భూమి నిటు(పక్కకుఁ ద్రోసెడురీతి తోఁచెడున్"
(పుట 117)

(ఙ) చిన్నపిల్లలను ఎత్తుకొని మురిసిపోవుటలోఁ దలిదండ్రులు పొందెడి యానందమునకు మేరలేదు. ఇది స్వానుభవైకవేద్యము చూడుఁడు :

"హేతువులేనినవ్వులు నోకించుక చూపుచు లేఁతదంతముల్
వాతెఱ చింద నందముగఁ బల్కుచు స్పష్టముగాని వాక్కులన్
భూతలధూళి దేహమునఁ బూయుచు మైలయొనర్చు పుత్రులన్
బ్రీతిని ధన్యులెత్తి తొడమీదను జేర్చి సుఖింతు రెంతయున్"

(vi) నాల్గవయంకమునుగూర్చి శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు గారు వ్రాసిన యీక్రింది వాక్యము లెంతేని మనోహరములయి. సత్యము లయి కాళిదాసు సృష్టించిన కళాపరమార్థమును విశదము చేయుచున్నవి.

"కావ్యములలో నాటకము రమ్యము; నాటకములలో శాకుంతలము; అందు నాల్గవయంకము; అందును నాల్గు శ్లోకములు మిక్కిలి రమ్యములని ప్రఖ్యాతి. ఈనాల్గవ యంకమున కింత రమ్యత, ప్రఖ్యాతి కల్గుటకుఁ గారణమేమి? ఎల్లప్పుడును మన కుటుంబములలో జరుగుచున్న 'ఆడుపిల్లను అత్తవారి యింటికిఁ బంపుట' యనువ్యాపార మును కవి యీయంకమునందు సహజముగ యున్నట్లుగాఁ జిత్రించుటయే యీయంకముయొక్క యోగ్యతాహెచ్చునకుఁ గారణము. ఈయంకము చదివిగాని, చూచిగాని, యేసహృదయుఁడు కంటఁ దడిపెట్టకుండును? జాలిపడకుండును? తాను తనకూఁతు నత్తవారింటికిఁ బంపిన ప్రసంగమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనకుండును? అందఱకును దెలిసినట్టియు, నందఱ మనస్సుల గరఁగించునట్టియు నీ 'కూఁతున త్తవారింటికనుపు ప్రసంగము' కవిపుంగవు నిచే నింత యథార్థముగా వర్ణించుటఁ జూచి యుచ్చుటఁ గవి తనస్వాను

భవమునే వర్ణించెనాయేమి యని మనమూహించిన నూహింపవచ్చును. శ్లోకచతుష్టయములోనిది యగు "కొందలమందె డెందము శకుంతల తానిపుడేఁగుసంచరయో" యన్న పద్య మెవ్వని మనస్సు కరగింపకుండును?

"ఇచ్చటఁ దండ్రి ఋషియైనను, తల్లి లేకపోయినను, ఇల్లు తపోవనమైనను, ఇతర జనులు బ్రహ్మచారులు, బ్రహచారిణులు నయినను, వారిపవిత్రత కేంతయు భంగము రాకుండఁగ సామాన్య గృహస్థునింట సంపకములు జరుగు నట్లుగనే కవి ఛాయారూపమును దింపియున్నాఁడు.

"పిల్లను పతియింటికిఁ బంపునప్పుడామెకు వస్త్రాభరణము లిచ్చుటయు, నొడిపంపుటయు, వెంటఁ దగిన బంధువుల స్త్రీపురుషుల నిచ్చి పంపుటయు, పిల్లకుఁ దగినబుద్ధులు చెప్పుటయు, వెంటఁ జాల దూరము వఱకు వెళ్ళుటయు, ఆఁగవలసినదని యితరులు చెప్పువఱకుఁ బోవుచుండుటయు. పిల్ల బంధువులను కౌఁగిలించుకొని దుఃఖించుటయు, పోలేక పోలేక పోవుటయు, చివరకు 'అత్తవారింటికిఁ బంపితిని. నా భారముతీఱినది. మగఁడుపెండ్లాముసుఖముయున్నఁజాలు' అని తండ్రి యనుకొనుటయు నీయంకమునందు మనయింట జరిగినట్లే చూపఁబడినది. ఈ సందర్భమున నీక్రింది గద్యపద్యములు గమనింపవలసియున్నవి.

శకుంతల : ఇఁకనాకు సఖుల చేతియలంకారము దుర్లభముగదా! (అని కన్నీరు విడుచుచున్నది)

సఖులు : సఖీ! ఇట్లు శుభసమయమునం దేడుచుట నీకుఁదగదు

(పుట 61)

శుభకాలమం దేడ్చుట తప్పని సమాధానము చెప్పుట యిప్పటికిని గలదు.

**వాక్యములు :**

గీ. తొలుత నీ నిమిత్తము నేను దలఁచినట్లు
పుణ్యమున నీకుఁదగు భర్తఁ బొందితీవు
మావిఁ జేపట్టె నెలిమి నీమాధవియును
గాన మీఁకయి యిఁకఁ జింతమానియుండు.

(పుట 66)

కూఁతునకుఁ దగిన సంబంధము దొరకఁగాఁ దండ్రికిఁ గలుగు సంతోషమిచ్చట నుపమానములతోఁ జెప్పఁబడినది.

వాక్యములు :

"గరిమ మహాకులీనుఁడగుకాంతుని పట్టపుదేవివౌచు దు
ర్భర ఘనకార్య వైభవముపైఁబడియుండి ప్రతిక్షణంబు భా
స్కరు నల పూర్వదిక్కువలెఁ గాంచి పవిత్రునిఁ బుత్రు వేగ మ
ద్విరహాభవాతిదుఃఖమును బిడ్డ! గణింపవు నీవు లేశమున్.

(పుట. 69)

గొప్పవారియింటికిచ్చిన యమ్మాయిని దలిదండ్రులు గాని, యన్నదమ్ములు గాని, హాస్యమునకు 'మీయత్తవారి యింటికి వెళ్లిన తరువాత ఆయంతఃపురములో కంటెలు, కాసులపేరులలో మేము జ్ఞాపకముందుమా?' అని అనుచుందురుగదా!

"కన్యయెపుడుఁ బరునిసొత్తె"  (పుట. 71)

ఎన్నిదినములున్నను ఆఁడుపిల్ల యొకని యింటికిఁ బోవలసినదే యని మనవారు చెప్పుమాటయేకదా యిది!*

7. ఔచిత్యప్రశంస :

ఇంకనయి యీనాటకమున కవితీసికొనిన జాగ్రత మిక్కిలి కొనియాడఁ దగినది. సంభాషణములు నడపుటలోఁగాని, వర్ణనలు

* చూ. ఆంధ్రవిజ్ఞాన సరస్వతు పు. 206-207

చేయుటలోఁగాని, మర్యాదాభంగ మేమాత్రమును గలుగనట్లు కాళిదాసీ నాటక రచనమునకుఁ బూనుకొన్నాఁడు. ఇందు వినయమునకు గొప్పనీతికల్పనకు నెక్కువస్థాన మొసఁగఁబడినది. చూడుఁడు. దుష్యంతుఁడు శకుంతలయు నేకాంతమున నుండఁగా నామె వెళ్లఁజూచును. దుష్యంతుఁ డామెను బలవంతమున నాపఁజూచును. ఆసమయమున శకుంతల యన్నమాటలివి: "పౌరవ! వినయమును రక్షింపుము" మఱొక్కసారి శకుంతలాదుష్యంతు లేకాంతమున నున్నప్పుడు రాజామెను ముద్దిడఁజూడఁగా నామె "నాట్యముచేఁ దప్పించుకొనును". తరువాత నానాయికానాయకులకు జరిగిన సంభాషణము, ఆసన్నివేశమునఁ గలుగఁబోవు అశ్లీలము, అనౌచిత్యము వీనిని బరిహరించుట కేర్పఱచెనా యని తోఁచును. ఇందుకయి కావలయు, కవిగౌతమి రాక నాకస్మికముగాఁ బ్రవేశపెట్టుట జరిగినది.

(చూ. పుట. 52)

శకుంతలా జన్మవృత్తాంతమును అనసూయ వచించునప్పటి సంభాషణముకూడ నౌచిత్యముతోఁ గూడుకొన్నది. (పుట 18—రాజు: మహానుభావుఁడగు కాశ్యపుఁడు శాశ్వతబ్రహ్మనిష్ఠుఁడని ప్రసిద్ధి"—నుండి) అనసూయ : అంత నత్యంత రమణీయమగు వసంతకాలమున నున్మాదమును బుట్టించు నామెరూపమును జూచి... (అని సగముచెప్పి లజ్జచే నూరకున్నది)

రాజు : ఆపయిని తెలియనే తెలియుచున్నది. తప్పక యీామె యప్సరస్సంభవయే." దీనినిబట్టి కనఁబడురంగములందే గాక వినఁబడు భాగములందును కవి కడుజాగ్రతి వహించి వాక్పవిత్రతను బ్రకటించినాఁడు. "సగము చెప్పి" యనుటలో నౌచిత్యమెంత సూక్ష్మముగాఁ బాటింపఁ బడినదో యూహించుట సులభము.

8. శకునములు:

శకునములపై జనులకు నమ్మిక యుండుట నేఁటికిని జూచుచున్నాము. వానిపైఁగల నమ్మకములను కవి యొందు రెండు చోటుల వెలిబుచ్చుట కానవగును.

రాజు తపోవనమును బ్రవేశింపఁగనే

"ఇది ప్రశాంతమౌ నాశ్రమపదము చూడ
నదరెడు భుజంబు, ఫలమెట్టులొదవు నిందు
అల్లనగనేల భాగ్యంబు లమరనున్న
కాలమందు సర్వత్రమార్గములు కలుగు"

(పుట. 9)

అని తనకుఁ గలుగఁబోవు లాభమునుగూర్చి యనుకొనును.

నాల్గవయంకమున శకుంతల నత్తవారింటి కనుపునప్పుడొక చక్రవాకి తామరాకు చాటున నున్న తన ప్రియుని గానక తల్లడిల్లుచున్నట్లు కానవచ్చును. ఈశకునమువలన శకుంతలకుఁ గలుగబోవు పతివిరహము సూచ్యము.

మరల సప్తమాంకమున దుష్యంతుఁడు మరీచ్యాశ్రమము ప్రవేశించినప్పు డతని బాహు వదరును. అప్పుడు

రాజు : "కోరను మనోరథంబేను కొంచెమేని
వ్యర్థముగ నో భుజంబ! నీవదరెదేల?
మును నిరాకరించినమేలె పూనియిపుడు
దుఃఖముగ మాఱుచున్నది దుస్సహముగ" అని యనును.

(పుట. 120)

నాయికానాయకుల పునస్సమాగమము త్వరలోనే కానున్నదని యిందు సూచింపఁబడినది.

# పాత్రోన్మీలనము

## దుష్యంతుఁడు:

ఈనాటకమునకు నాయకుఁడు దుష్యంతుఁడు. ఇతఁడు ధీరోదాత్తుఁడు.[1] మంచి యౌవనమున నున్నవాఁ డనియు, వయసు ముప్పది ముప్పదేనేండ్లకుమించదనియుఁ జెప్పవచ్చును.[2] ఇతఁడు గంభీరాకారుఁడు, సత్త్వసంపన్నుఁడు, మృగయాప్రియుఁడు ధనుర్విద్యయందు పినాకపాణి వంటివాఁడు. కర్తవ్యాకులత గలవాఁడు. "జ్యాకిణాంక మీభుజమొకా యరసి యి కీదవ్వు రక్షించునది" యనెడి రాజునుద్దేశించి యన్న ఋషి వాక్యమును బట్టియు, భ్రమరప్రకరణమున అనసూయాప్రియంవదలు శకుంతలతోఁ డ ననిన "నిన్ను కాచుటకు రాజును బిలువు" మనెడి వాక్యమును బట్టియు నరణ్యవాసులయెడ సైతము రా జెంతశ్రద్ధవహించి యుండెనో గోచరమగును.

అయిదవయంకారంభమున రాజునకుఁగల పరిపాలనాదీక్ష వెల్లడియగును.[3] వైతాళికుల గానమువలన దుష్యంతునకుఁగల ప్రజావాత్సల్యము, స్వసుఖమునుజూడమి, దుర్మార్గశిక్షణ, లోకకల్యాణమునందలి యిచ్ఛ మొదలగునవి బయల్పడును.[4] ఇతఁడు పరస్త్రీ విముఖుఁడు. శకుంతల సౌందర్యమును ప్రతీహారి విన్నవింపఁగా "పరకళత్రమును దేటి చూడరా" దని రాజు చెప్పును. (పు. 78) అక్లే తుదియంకమున రాజు "పరదార పేరమగుట న్యాయముకాదు" అనును.

(పుట. 125)

---

1. చూ. నాటకలక్షణ భాగము.

2. చూ. పుట 17 ప్రియంవదా వాక్యము: "చతురగంభీరాకారంబు.

3. చూ. పు. 71, 74 కంచుకి: ఓయీ! రాజునకు...ఇత్యాది

4 చూ. పుట 75 వైతాళికుల ప్రథమద్వితీయుల పద్యములు

దుష్యంతుని ప్రజావాత్సల్య మాఱవయంకమందలి ధనమిత్రుని యాస్తిపంపకమునఁ దేటపడఁగలదు. అంతేగాదు. "ప్రజ లెవరి నెవ్వారిని ప్రాణబంధువులను దారు పోఁగొట్టుకొందురో వారికెల్ల సర్వమునకు దానె" యని రాజు చాటఁ బంపును.

శకుంతలయెడ నితని ప్రేమ సత్త్వప్రధానమైనది. "పరిహరింపఁ దగిన వస్తువుల పయి పౌరవుల మనస్సుపోదు" అని రాజు అభిమాన పూర్వకముగాఁ జెప్పుటలో నతని సౌశీల్యము విశదమగుచున్నది.

రాజునకు చిత్రకళానైపుణి గలదని యాఱవయంకమున స్పష్ట మగును.

శకుంతల :

ఈమె సౌందర్యరాశి. ఈనాటకమునకు నాయిక "ఈమె మొదట రంగముపై నేమాయయు నెఱుఁగని యరణ్యకన్యగాఁ గాన్పించి క్రమముగా నెన్నియో యవస్థాంతరములఁ జెంది తుదను బుత్రవతియైన మహారాజ్ఞిగా మాఱును"[1] వేఱేఁటు "ప్రసంగములయప్పు డామె చూపినట్టి సద్గుణములును, మనోధైర్యమును, శుద్ధాంతఃకరణమును దెల్పు నవ్యాజానురాగమును, మన యంతఃకరణములు గరగించి యామెయెడ సానుభూతిని, గౌరవమును పుట్టించును."[2] శకుంతలకు సృష్టియందు నిసర్గ ప్రీతి గలదు. "ఎవతె జలంబు మీకిడక యెన్నఁడు త్రావదు" ఇత్యాది పద్యములను బట్టి యామె సృష్టిలో నెంతగా తాదాత్మ్యము పొందునో మనకుఁ దెలియును.

శకుంతల సహజభీరువు, లజ్జావతి. ఆర్యస్త్రీకి నుండవలసిన మర్యాద, గౌరవము, వినయశీలత మొదలగువాని నెంతో యధిక

1. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము. పుట 212.
2. అందే—పుట 213.

ముగాఁ గలది యీమె. రా జీమెను ముద్దుపెట్టుకొనఁ బోవునపుడు "పౌరవ, సౌశీల్యమును కాపాడుము. మన్మథ పీడితురాలనైనను నేను స్వతంత్రురాలను గాను" అనెడివాక్యమున హైందవస్త్రీకిఁగల యుత్తమ లక్షణము గాననగును. భర్త తన్ను తిరస్కరింపఁగా, కొంత కోపము తోడ, దుఃఖాశ్రువులనింపుచు వెడలిపోయినను శకుంతల యాతనిపైఁ గల ప్రేమానురాగములఁ గాని, యాతనియెడఁ దా నాచరింపవలసిన ధర్మములను గాని మఱవనేలేదు. తాను యోగినివలె చరింపఁ దొడఁగెను. తల ముడువదు; మంచిచీర కట్టదు; ఆహారము స్వీకరింపదు. అంతే. నిరంతరము తనభర్త విగ్రహమును దన హృదయమునఁ బదిలపఱచికొని తదేక ధ్యానమగ్నయై శకుంతల తన విరహకాలమును గడపినది[1] తా నత్తవారింటి కరుగు సందర్భమునఁ దండ్రి కాశ్యపు లొసఁగిన యుపదేశమును శిరసావహించినది.[2]

ఈమెకుఁ దనచెలికత్తెలగు అనసూయా ప్రియంవదల పయిని గల చెలిమి యనురాగము లపారములు.

అనసూయా ప్రియంవదలు :

వీరలు శకుంతల చెలికత్తెలు. ఆమెను వలెనే వీరిరువురను గూడ కణ్వుఁడు పెంచిపెద్దచేసెను. వీరు కావ్యేతిహాసములను పఠించినవారు. అనసూయా ప్రియంవదలలో అనసూయ పెద్దది కావుటచే నెక్కువ యాలోచనా సామర్థ్యములు కలదిగాఁ దోఁచును. ప్రియంవద సార్థక నామధేయ. దుష్యంతునకు జాబు వ్రాయుటయందు, దుష్యంతునితో సంభాషించుటయందు, దుర్వాసుని శాంతింపఁ జేయుటయందు ననసూయ చూపిన నేర్పు ప్రశంసనీయము. ప్రియంవద చతురోక్తుల యందు నిపుణ.

1 చూ. "మిగుల మాసిన వస్త్రంబు మేనఁ దాల్చి..." పుట. 147.

2. "వరుఁ డలుకన్వహించినను ధర్మవిరుద్ధవు గాకుము" ఇత్యాది. పుట. 68.

కణ్వుఁడు:

ఇతఁడు శకుంతలాప్రియంవదానసూయలకుఁ బెంపుడుఁ దండ్రి. నాల్గవయంక మితనిమహత్త్వమునకు కూఁతురగు శకుంతలయెడఁ గల వాత్సల్యాతిరేకమునకు నిదర్శనములు. తాను మహర్షియేయైనను, శకుంతలా నిర్గమన సమయమున కన్నీరు కార్చును. వనవాసియైనను నితఁడు లోకవ్యవహార జ్ఞానము నధికముగాఁ గలవాఁడు. నాల్గవ యంకమున శకుంతలకు చేసిన బోధనలు, రాజునకుఁ జెప్పిన హితవాక్యములు మఱువఁ దగినవి కావు.

ఇందలి సూక్తులు కొన్ని*

1. ఎంతయుఁ బ్రవీణు లనువారి హృదయమ్మైనఁ జాల నమ్మకమిడ దాత్మశక్తి యందు. 2
2. భాగ్యంబు లమరనున్నకాలమందు సర్వత్రమార్గములు కలుగు. 9
3. ఉద్యానలతల వనలతలె మించవే గుణగణముచేత. 10
4. తలఁపఁగ సుందరాంగులకుఁ దాను విభూషణ మేది కాదు? 12
5. ఎందు సందేహవస్తువులయందు నాత్మగతులె ప్రమాణంబు లార్యులకును 15
6. చటుల ప్రభాతరళమగు తటిల్లత జనింపఁగలదె ధారుణి నెందుఁగా. 19
7. కాముకుఁ డను సర్వమాత్మ విషయముగనే కొనుచుండు నాత్మలోన 27
8. దుఃఖమును చెలులు పంచుకొన్నప్పుడుగదా వేదన సహ్యముగా నుండును! 45
9. కాముకుల కెప్పుడును వివేక ముండదుగదా. 46

* ఇందు తుదిసంఖ్య పుటసంఖ్యను దెలుపును.

# నాటక లక్షణము *

శ్రవ్యకావ్యము లని దృశ్యకావ్యము లని కావ్యములు రెండు తెఱంగులు. అందు చూడఁదగినవి దృశ్యంబులు.

వీనికి రూపకము లనియు పేరు. దుష్యంతాదుల సుఖదుఃఖాదులగు అవస్థ లారోపించుటవలన నివి రూపకము లనఁబడును.

రూపకము పదివిధములు.

1 నాటకము 2 ప్రకరణము 3 భాణము 4 ప్రహసనము 5 డిమము 6 వ్యాయోగము 7 సమవాకారము 8 వీథి 9 అంకము 10 ఈహామృగము.

పై రూపక భేదములకు హేతువులగు వీనిలో ఇతివృత్తములు ముత్తెఱంగులు.

1 ప్రఖ్యాతము 2 ఉత్పాద్యము 3 మిశ్రము.

ప్రఖ్యాతము— ఇతిహాస ప్రసిద్ధమగుకథ ప్రఖ్యాతము.

ఉత్పాద్యము— కవికల్పితగాథ యుత్పాద్యము.

మిశ్రము— ప్రఖ్యాతము కొంత, ఉత్పాద్యము కొంత కలిసినచో మిశ్రము.

నాటకము, ముఖము ప్రతిముఖము మొదలగు పంచసంధుల తోడ నితర రూపకముల కన్నింటికిని ముఖ్యమై, వీరశృంగార రసంబులలో నేదేని యొకటి ప్రధానము గాఁగలిగి ప్రసిద్ధ (ధీరోదాత్త) నాయకునితో నొప్పియుండును. దీనికి ఇతివృత్తము ప్రసిద్ధము.

ఇట్టి నాటకమున అయిదు మొదలు పదియంకము లుండవచ్చును.

* శ్రీమాన్ వంగీపురము కృష్ణమాచార్య రచిత "కావ్యలక్షణ సంగ్రహము" నుండి యీభాగము గ్రహీతము.

ప్రత్యంకమునను ఒక దినమునం దాడఁదగిన ఒక ప్రయోజనమును వర్ణింపవలెను. నాందీప్రస్తావనాదు లవశ్యముగా నుండవలయును.

## పంచసంధులు

ధర్మార్థ కామఫల ప్రయోజనముతోఁ గూడిన కథా విషయములకు వేఱొకప్రయోజనముతోడి సంబంధము సంధి.

(1) ముఖసంధి. (2) ప్రతిముఖసంధి. (3) గర్భసంధి. (4) అవమర్శసంధి. (5) నిర్వహణసంధి — అని యిది పంచవిధములు.

1. ముఖసంధి— అనేకవిధములైన ప్రయోజనములకును రసములకును కారణమైన బీజము కల్పించుటయే ముఖసంధి.

బీజము— మొదట చిన్నదిగానుండియుఁ గ్రమక్రమముగా అనేకప్రకారముల వ్యాపించి త్రివర్గఫలసాధక కావ్యమునకు హేతువైన విషయము బీజము.

2. ప్రతిముఖసంధి— విషయముగాఁ గనఁబడి, వేఱు విషయమునఁ గనఁబడక ఉన్నబీజము ప్రకాశించుట (అనఁగా బిందువు, ప్రయత్నము— వీని చేరిక) ప్రతిముఖసంధి.

బిందువు— ఒక కథాంశము ముగియనుండగాఁ గథ విడిపోకుండునట్లుగా తర్వాతికార్యము కూర్చుటకుఁ గారణమైనది బిందువు.

3. గర్భసంధి— ముఖసంధిలోఁ గల్పింపఁబడిన బీజము ప్రతిముఖసంధిలోఁ గనఁబడి కనఁబడక యుండఁగా దానిని వెదకుటయే గర్భసంధి. (బీజమునకు మొదట అడ్డు, తర్వాత ప్రాప్తి, మరల నపాయము, పిదప ఉపాయము అను హేతువులచేత స్థిరీకరింపఁబడిన ఫలప్రాప్తి కలిగియుండుట: అని భావము)

4. అవమర్శసంధి— కోపము, వ్యసనము మొదలగువానిచే గర్భసంధియందు వెల్లిన బీజము విషయముగాఁ జేయఁబడు పర్యాలోచన

మవమర్శసంధి. (అనగా నపాయరహితఫల ప్రాప్తికి నిశ్చయాలోచ నము అని భావము.)

5. నిర్వహణసంధి— ముఖాది సంధులకు ప్రధానఫల ప్రయోజ నైక్యము నిర్వహణసంధి.

## నాంది

శబ్ద సామ్యములవల్లఁ గాని, అర్థవిశేషములవల్లఁ గాని, రూపకమునందుఁ బ్రవర్తింపఁబడనున్న విషయమును గొంచెముగా సూచించుచు ఎనిమిదిగాని, పంన్రెండుగాని, పదునెనిమిదిగాని, ఇరువది రెండుగాని పదములతో విరాజిల్లు ఆశీర్నమస్క్రియా రూపమగు పద్యము నాంది.

నాటకప్రారంభమున విఘ్నశాంతికై ఇది చేయఁబడును. ఈ కార్యమునకుఁ బూర్వరంగ మని పేరు.

కవులు నటులు సభ్యులు దీనికే ఆనందము నొందుదురు గావున దీనికి నాంది యని పేరు. నాటకమునకు సూత్రధారు లిద్దఱు. వీరిలో మొకటివాఁడు నాంది చదువును. రెండవవాఁడు ప్రస్తావన జరుపును. నాందిలోని పదశబ్దమునకు - పదమని కొందఱు, పద్య పాదమని కొందఱు, వాక్యములని కొందఱు నభిప్రాయ పడుచున్నారు. కొందఱిమతమున పదనియమ మక్కఱలేదు.

## ప్రస్తావన (ఆముఖము)

సూత్రధారుఁడు (రెండవవాఁడు) తాను జరుపనున్న కార్యమును గుఱించి వాక్చాతుర్యముతో నటీ, మారిష, విదూషకులలో నేయొక్క రితో నైన చేయుసంభాషణ ఆముఖమనియు, ప్రస్తావన అనియు ననఁబడును.

దీనికి అంగములు మూఁడు.

(1) కథోద్ఘాతము (2) ప్రవర్తకము (3) ప్రయోగాతిశయము.

ప్రకృతికథకు పోలినట్లుగా సూత్రధారుఁడు ప్రయోగించిన వాక్యార్థమునే చేకొని పాత్రము రంగమున ప్రవేశించుట కథోద్ఘాతము.

సూత్రధారుఁడు చేయు ఋతువర్ణనముచే సూచింపఁబడి పద సామ్యమును బట్టిగాని, ఆ ఋతుసమానమైన ధర్మములు గలిగినట్టిగాని పాత్రము ప్రవేశించుట ప్రవర్తకము.

సూత్రధారుఁడు, స్థిరపఱిచి 'ఇదిగో' 'ఇతఁడు' అని చెప్పి చూపినంతనే తదనుగుణముగ పాత్రము ప్రవేశించుట ప్రయోగాతిశయము. ప్రస్తావనలో ఋతుగానము కవి వంశ సామర్థ్యాదికములు గూడ వచింపఁబడును.

## విష్కంభము

రంగమునఁ బ్రదర్శింప వీలుపడని విషయమును, సూచించుచు జరిగినదియు, జరుగనున్నట్టియు నగు కథను మధ్యమ పాత్రలచే తెలుపుట విష్కంభము. ఇది శుద్ధము, సంకీర్ణ(మిశ్ర)ము నని రెండువిధములు.

శుద్ధవిష్కంభము — ఒకరుగాని, ఇద్దరుగాని మధ్యమ పాత్రలచే సూచింపఁబడినది.

మిశ్ర (సంకీర్ణ) విష్కంభము — మధ్యమాధమ పాత్రలచే సూచింపఁబడినది.

## ప్ర వే శ క ము

ప్రదర్శింపఁ వీలుగాని విషయమును సూచించుచు జరిగినది, జరుగనున్నది యగు కథను కేవలము నీచపాత్రలచేఁ బ్రయోగించిన ప్రవేశకము. ఇది ప్రథమాంకము ముందుండరాదు. నాయకుఁడు, ప్రతినాయకుఁడు, మంత్రి, పురోహితుఁడు విద్యాధికులు, నాయిక — ఉత్తమ పాత్రములు.

విదూషకుఁడు, దూత, దాసదాసీజనులు మధ్యమపాత్రములు. సేవకులు, తోఁటమాలి, చండాలాదులు నీచపాత్రములు.

చూళిక

తెరలోపలనుండు పాత్రముచే సూచింపఁబడిన విషయము చూళిక.

అంకాస్యము

ముందటి అంకముచివరనున్న పాత్రచే తర్వాత యంకప్రారంభ విషయము సూచింపఁబడిన నది అంకాస్యము.

అంకావతారము

విష్కంభముతోఁ గాని, ప్రవేశకముతోఁ గాని, అక్కడ లేకయే ముందంకముచివరఁ బ్రవేశించిన ఒకపాత్రచే, మునుపటి యంకము యొక్క కథ విడిపోవకుండునట్లుగాఁ దరువాతి యంకకథ సూచింపఁబడుట అంకావతారము.

రసము - రసస్వరూపము

విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారి భావముల సమ్మేళనమున నాస్వాదింపఁబడు స్థాయిభావమే రసము

సరస కావ్యబంధమును, నిపుణ నట ప్రదర్శన సామాజికుల (ప్రేక్షకుల) చే భావింపఁబడి విభావాదుల కూడికచే పరిపుష్టమై ఆసాద్యింపఁబడు స్థాయిభావమే రసమని తాత్పర్యము.

స్థాయిభావము

సజాతీయములగు భావములచేఁ గాని, విజాతీయములగు భావములచేఁ గాని, త్రెంపులేక అనుభవించువరకును స్థిరముగానుండు మనోధర్మరూపమగు భావము స్థాయిభావము.

## రసవిభాగము

1 శృంగారము 2 హాసము 3 కరుణము 4 రౌద్రము 5 వీరము 6 భయానకము 7 బీభత్సము 8 అద్భుతము 9 శాంతము *

వీనికిఁ గ్రమంబుగ స్థాయిభావములు:

1. శృంగారమునకు-రతి, 2. హాస్యమునకు - హాసము, 3. కరుణమునకు—శోకము, 4 రౌద్రమునకు-క్రోధము, 5. వీరమునకు—ఉత్సాహము, 6 భయానకమునకు—భయము, 7 బీభత్సమునకు—జుగుప్స, 8. అద్భుతమునకు—విస్మయము, శాంతమునకు—శమము.

రసోత్పత్తికిఁ గారణమైనది విభావము.

రతి, హాసము మొదలగు నాయా స్థాయిభావముల విశేషముగా భావింపఁజేయునది విభావము.

అట్టి విభావము, ఆలంబనవిభావ మని, ఉద్దీపనవిభావమని రెండు విధములు.

1. ఆలంబన విభావము :—

రతి మొదలగు స్థాయిభావముల చేరికకు సంబంధకారణమైనది ఆలంబనవిభావము.

---

* శాంతరసమును త్రోసిపుచ్చి ఎనిమిదియే రసములని ధనికాదుల మతము. శృంగారమొక్కటే రసమని శృంగారరసప్రకాశకర్త. ప్రేయస్సు, శాంతము లతోఁ బదియని రుద్రటుఁడు. దీనితో వాత్సల్యము భక్తియుఁ జేర్చి పండ్రెండని మఱికొందఱు. పైతొమ్మిదే ప్రధానరసములని భరతాదులు. ఈనవరసములును ధర్మార్థకామమోక్షఫలము లొసంగఁ గలవంతులని యర్థము.

ఉదా. నాయికానాయకులు - రతియను స్థాయిభావము పేర్పడు ప్రతివిశేషములకు స్థానమైనవారు నాయికానాయకులు కావున వీరిని ఆలంబన విభావమందురు.

2. ఉద్దీపన విభావము :—

రత్యాది స్థాయిభావముల కాలంబనమైన నాయికానాయకాదుల గుణములు, చేష్టలు, అలంకారములు, తటస్థములగు మలయానిల చంద్రకిరణాదులు ఉద్దీపనవిభావము.

నాయికానాయకాదుల రూపము, యౌవనము మొదలగునవి గుణములు — హావము భావము మొదలగునవి చేష్టలు - వస్త్రములు, నగలు మొదలగునవి అలంకారములు - చంద్రుఁడు ఉద్యానము మలయమారుతము మొదలగునవి తటస్థములు.

సూక్ష్మముగనున్న రత్యాదిస్థాయిభావముల ఉద్దీపింపజేయుట (ప్రేరేఁచుట) చేత ఇది ఉద్దీపన విభావము.

## అ ను భా వ ము

లౌకికములైన రత్యాదిస్థాయుల కార్యములైన క్రీఁగంటి చూపులు మొదలగునవి అనుభావములు. రత్యాదిభావముల అనుభవింపఁ జేయుటవలన వానికిఁ దరువాత నుద్భవించుటచే ఇది అనుభావము.

## సా త్త్వి క ము

పరుల కష్టసుఖములను బలుమాఱులు భావించుటవలన మనంబునకుఁ గల్గు తన్మయత్వము సత్త్వము. అట్టి సత్త్వమువల్ల గలుగునవి సాత్త్వికభావములు.

ఇది యెనిమిది విధములు :

1. స్తంభము, 2. ప్రళయము, 3. రోమాంచము, 4. స్వేదము, 5. వైవర్ణ్యము, 6. వేపథువు, 7. వైస్వర్యము, 8. అశ్రువు,— అని.

## వ్య భి చా రి భా వ ము

(సంచారీభావము)

సర్వత్ర విశేషముగ రత్యాదిస్థాయిభావములకు సహాయకారులగుచు చరించునది. వ్యభిచారిభావము అను నీపదమువ్యుత్పత్తియు నిదియే. ఇది ముప్పదిమూఁడు విధముల నుండును.

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చాపలము, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, బోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము.

ఇవి రసమునకు సహాయ కారకములు.

సముద్రమున అలలు పైకెగయుచు తగ్గుచు ఆసముద్రమునకు ఉత్కర్ష గలిగించుచు తాము నా సముద్రరూపమునే పొందునట్లు ఈవ్యభిచారి భావములు స్థాయిభావములందే పుట్టుచుఁ దగ్గుచు స్థాయి పోషణమునకై తామును తద్రూపమునే పొందును. రసములకు సహాకారులనుట యీ కార్యమే.

## నా య క ల క్ష ణ ము

దోషరహిత కావ్యములందు రసమున కాటపట్టగు నాయకుఁడు ప్రధానము. పుణ్యశ్లోకుఁడగు నాయకుని చరిత్రము వర్ణింపఁ బడని కావ్యము వర్జింపఁదగినదని ప్రాజ్ఞులవచనము. ఉదాత్తనాయక చరిత్రమే ప్రబంధముయొక్క ప్రశస్తికిఁ గారణమని పెద్ద లనుచున్నారు.

ట్టినాయకుఁడు, కులీనత, ఉజ్జ్వలత, భాగ్యము, ఔదార్యము, తేజస్విత, వైదగ్ధ్యము, ధార్మికత్వము మొదలగు గుణములచేత విరాజిల్లును. నాయకుఁడు ప్రబంధఫలభోక్తయగును. ఇవిగాక యితఁడు యశము, ప్రతాపము, చతుర్విధ పురుషార్థములం దనురక్తి, సద్గుణములు గలిగి యుండును.

ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరశాంతుఁడు, ధీరలలితుఁడు అని నలుదెఱంగుల నాయకులు శృంగారాది రసంబుల కాటపట్టయి పఱలుచుందురు.

1. ధీరోదాత్తుఁడు— ధీరుఁడు, గంభీరుఁడు, మహాసత్త్వ సంపన్నుఁడు, కరుణామయుఁడు, ఉదారుఁడు, నిరహంకారుఁడు, ఆత్మస్తుతి దూరుఁడు నయిన నాయకుఁడు ధీరోదాత్తుఁడు.

ఉదా: రాముఁడు, దుష్యంతుఁడు, హరిశ్చంద్రుఁడు, జీమూతవాహనుఁడు మొదలగువారు.

2. ధీరోద్ధతుఁడు— ఎక్కువ బలము గలవాఁడు, భయము గొల్పు నడవడిక గలవాఁడు, ఆత్మస్తుతిప్రియుఁడు, అతికోపనుఁడు, అత్యహంకారి, అగు నతఁడు ధీరోద్ధతుఁడు.

హిరణ్యకశిపుఁడు, రావణుఁడు, శిశుపాలుఁడు, దుర్యోధనుఁడు నగువారు— ఒకప్పుడు ప్రతినాయకులుగఁ బరిగణింపఁ బడుదురు.

3. ధీరలలితుఁడు— నిశ్చింతుఁడు, కళలయం దనురక్తుఁడు, స్మరపీడితుఁడు, భోగాసక్తుఁడు నగు నాయకుఁడు ధీరలలితుఁడు.

శూద్రక మహారాజు మొదలగువారు.

4. ధీరశాంతుఁడు— ధీరుఁడు, శాంతుఁడు, ద్విజుఁడు, శుచి, ధీశాలి, అభిమాని, సుకుమారుఁడు అగు నాయకుఁడు ధీరశాంతుఁడు.

చారుదత్తుఁడు మొదలగువారు.

పై నలువురుగాక (1) అనుకూలుఁడు, (2) దక్షిణుఁడు, (3) ధృష్టుఁడు, (4) శఠుఁడునని శృంగారనాయకులు నల్వురు గలరు.

## నా య క స హా యు లు

శృంగార నాయకులకు నాయికల ననుకూలింపఁ జేయుటకు సహాయులు నల్గురు సచివులుగలరు. వారు— (1) పీఠమర్దుఁడు. (2) విటుఁడు (3) చేటుఁడు. (4) విదూషకుఁడు.

1. పీఠమర్దుఁడు— నాయకునికంటెఁ గొంచెము తక్కువవాఁడై సకల కార్యములను జేయువాఁడు పీఠమర్దుఁడు.

రామాయణమున సుగ్రీవాదులు.

2. విటుఁడు— పీఠమర్దునికంటె తక్కువ వాఁడును, నాయకున కుపయోగించు సంగీతాది విద్యలలో నెదోయొక్కవిద్య నెఱింగినవాఁడు విటుఁడు.

నాగానందమున శేఖరకుఁడు మొదలగువారు.

3. చేటుఁడు— నాయికాసంధాన కుశలుఁడై, మాటలందు నేర్పరియై నాయకునకు సహాయుఁడైనవాఁడు చేటుఁడు.

4. విదూషకుఁడు—మాటల వికారతచేతను, అంగవికారాదుల

చేతను నవ్వించుచు నాయకుని మనస్సును సంతోషపెట్టువాఁడు విదూషకుఁడు.

శాకుంతలమున మాధవ్యుఁడు— మొదలగువారు.

## నా యి క లు

నాయికలు : (1) స్వీయ (2) పరకీయ (3) సామాన్య అను మూఁడు భేదముల నొప్పుచుందురు.

1. స్వీయ — కులవతి, లజ్జావతి, సౌశీల్యాది సకలసద్గుణవతి అగు నాయక స్వీయనాఁబడు.

సీత, రుక్మిణి మున్నగువారు.

2. పరకీయ — పరపురుషుని యందున్న ఆసక్తిని మఱుఁగు పఱచునది పరకీయ.

3. సామాన్య— సంగీతాభినయాది లలితకళలనెఱింగి ఉత్సాహవతివలె మెలంగుచుఁ గపటవిలాసాదులు గలిగి తన యభిప్రాయము నెవ్వరికినిఁ దెలియపఱుపకుండు వెలయాలు సామాన్య.

స్వీయనాయిక : (1) ముగ్ధ. (2) మధ్య. (3) ప్రౌఢ యను భేదముల మూఁడు తెఱంగుల నుండును.

1. ముగ్ధ — అప్పుడప్పుడే పొడసూపు జవ్వనపుఁ బొల్పుతో లజ్జచేత శృంగారచేష్టల మఱుఁగుపఱచునది ముగ్ధ.

2. మధ్య — యౌవనోచిత కామసంపత్తిగలిగి, సమాన లజ్జయు సంగవికాసమును రతియందలి యుత్సాహముగల జవ్వని మధ్య.

3. ప్రౌఢ— ఎక్కువవలపు, సిగ్గువలుచన, కామావేశబుద్ధి, మదనకార్యచాతుర్యము, గల యువతి ప్రౌఢ.

ఈనాటకమునకు నుపోద్ఘాతము వ్రాయుటకు నా కవకాశము కల్గించిన హితకారిణీ సమాజమువారికి, దీని నచ్చొత్తించుటలో ననేక విధములఁ దోడ్పడిన శ్రీ పామర్తి గోపాలకృష్ణ శర్మగారికి, ముద్రాప కులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికి మిక్కిలి కృతజ్ఞుఁడను.

ప్రభుత్వ కళాశాల
రాజమహేంద్రవరము
10 - 7 - 1952

గ. శ్రీ. న. ఆచార్య
ప్రధానాంధ్రోపన్యాసకుఁడు

అ భి జ్ఞా న శా కుం త ల ము

# స ప్త మ ము ద్ర ణ ము

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి యీ భాషాంతరీకరణము నేఁడు సప్తమ ముద్రణము నొందఁ గల్గుటకు తోడ్పడిన యావదాంధ్రలోకమునఁ గల పండితులకు, పామరులకు, రసికులకు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తునకు, శ్రీమాన్ గ. శ్రీ. న. ఆచార్యగారికి మా కృతజ్ఞత మనస్ఫూర్తిగా ప్రకటించుచున్నాము.

హి త కా రి ణీ స మా జ ము

శ్రీ

## అభిజ్ఞాన

# శాకుంతలము.



## ప్రస్తావన.

### నాంది.

ఉ. ఎయ్యది యాద్యమౌ నజునిసృష్టికి, హవ్యము నేది తాల్చుఁ, (
నెయ్యది హోమయాజి, నఁటి యేయవి కాలవిభాగ మిచ్చు రెం,
డెయ్యది తాల్చి శబ్దగుణ మెల్లెడ నుండును, హేతుభూతమౌ
నెయ్యది సర్వభూతముల, కెయ్యది ప్రాణము ప్రాణికోటి కం,
దయ్యతులాష్టదేహముల నందుశివుం డిడు మీకు భద్రముల్.

సూత్రధారుఁడు—(నాంది యైనతరువాత తెరవంకఁ జూ
ఓసీ! అలంకరించుకొనుట పూర్ణముగా నైనపక్షమున, నీవిటురమ్ము

నటి—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో వచ్చితిని. నే నేనియో
మును జేయవలయునో దేవర యాజ్ఞాపింతురుగా!

సూత్ర—ఓసీ! ఈసభ విద్వాంసులతో నిండి యున్న
ఇప్పుడు మనము కాళిదాసునిచేతఁ గ్రొత్తగా రచియింపఁబడిన య
జ్ఞాన శాకుంతలమను నాటకముచేత వీరిని సేవింపఁదగును. కా
సావధానముగా దాని ప్రయోగమును నడపవలెను.

నటి—చక్కఁగా నాడుటయందు సమర్థులైన తమ కేలో
మును రాదు.

సూత్ర—ఓసీ! నేను నీతో సత్యము పలికెదను.

గీ. తలఁప నాదుప్రయోగకౌశలము మంచి
దంచుఁ, బండితుల్ సంతోష మందువఱకు;
నెంతయుఁ బ్రవీణు లనువారి హృదయమైనఁ,
జాల నమ్మకమిడ దాత్మశక్తియందు.

నటి—(వినయముతో) అది యట్టిదే. తరువాతఁ జేయఁ దగినవని నిప్పుడు దేవర యాజ్ఞాపింపవలయును.

సూత్ర—ఈసభవారి కర్ణరంజనముకంటె మఱియొకటి యే మున్నది ?

నటి—ఇఁక నే నిప్పు డే ఋతువునుగుఱించి పాటపాడుదును ?

సూత్ర—ఓసీ! ఇంతకుముందే వచ్చినదియు భోగములకుఁ దగినదియు నైన యీ గ్రీష్మసమయమును గూర్చియే పాడవలెను. ఇప్పుడు—

గీ. హాయిగా స్నానములు చేయ ననువుపడుచుఁ,
బాటల సుగంధయుతవనపవన మమర,
సులభముగ నీడలను నిద్రసుఖముకలిగి,
దినసములు రమ్యమగుఁజాలఁ జివరలందు.

నటి—ఆలాగే, (అని పాడుచున్నది.)

గీ. భ్రమరములచేతఁ జుంబింపబడియు, నింత
మృదువులగు కేసరంబుల తుదలు కలుగు
నల శిరీషపుష్పంబుల నతులనయును
జెలువలు ధరించుచున్నారు శిరసులందు.

సూత్ర—ఓసీ! చక్కఁగాఁ బాడితివి! ఆహా! రంగమంతటను మనస్సులు రాగమందుఁ దగులఁ జిత్తరువువలె నున్నది! కాఁబట్టి యిప్పు డేనాటకము నారంభించి వీరిని సంతోషపెట్టుదము?

నటి—ఓయీ! అభిజ్ఞానశాకుంతల మనుపేరుగల యపూర్వ నాటక ప్రయోగముచేత వ్యవహరింతమని మొదటనే యాజ్ఞ యిచ్చి యున్నావుగదా?

సూత్ర—ఓసీ! చక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చితివి! ఈ క్షణము నేను మఱచిపోతిని సుమా! ఎందుచేతనన—

గీ. రమ్యమగు నీదుమృదు గీతరాగమునను
బలిమిమెయి సమాకర్షింపఁ బడినవాఁడ;
లీల నతివేగవంతమగా లేడిచేత
వడిగ దుష్యంతనృపుఁ డీడ్వఁబడినయట్లు.

ఇది ప్రస్తావన.

---



## అభిజ్ఞాన

# శాకుంతలనాటకము.



## ప్రథమాంకము.

### రంగము—కణ్వాశ్రమారణ్యము.

(విల్లును, అమ్ములను, కేలం దాలిచి, రథముపై నెక్కి, నొక్కజింకను
దఱుముచు సారథితోం గూడ దుష్యంతమహారాజు
ప్రవేశించుచున్నాండు.)

సూతుండు—(రాజువంకను, మృగమువంకను, జూచి) దేవా!

గీ. ఆమృగమును, నధిజ్యశరాసనంబుం
గరమున ధరించుమిమ్ములను, గాంచ నాకు,
యజ్ఞమృగమును వెన్నంటి యరుగునట్టి
యల పినాకపాణిని గన్నయట్ల యయ్యె.

రాజు—సూతుండా! మనల నీసారంగము బహుదూరము గొనివచ్చినది. చూడు! అది మఱి యిప్పుడును—

చ. వడిం బఱతెంచు తేరిదెసం బల్మఱు మార్మెడపెట్టి చూచుచుం
గడు శరపాతభీతిం దనకాయము ముందుకుంగుంచి, యెంతయుం
బడలిక నోటివిం దెఱచి, మార్గమునిండ సగంబుతిన్న ద
ర్భలు పడ, మింటం బాఱెడు ధరం బదమూనక, పెద్దదాంటులన్.

(విస్మయముతో) ఆ! ఏమిది! ఎంతవేగముగా వెంబడించుచున్నను, యింతలోనే యది కనంబడుట ప్రయత్నసాధ్య మయ్యెను!

సూతు—దేవా! నేల మిట్టపల్లములుగా నున్నదని గుఱ్ఱముల పగ్గములు బిగియఁబట్టి రథవేగము మందము నొందించితిని; అందు చేతనే, మృగము మన కెడ మయినది. ఇప్పుడు మనము సమప్రదేశ మునఁ జనుచున్నాము కాఁబట్టి దేవర కిది లభింపక పోదు.

రాజు—అట్లయినఁ బగ్గముల సడలవిడువుము.

సూతు—దేవర వా రాజ్ఞాపించినట్లు కావించెద, (అని రథ వేగము నిరూపించి) దేవా! ఇప్పుడు చూడుండి! చూడుఁడి!

ఉ. పగ్గముల న్సడల్చుడును, వాజులు మేనులు సాఁచి పాఱెడున్
నిగ్గగు చామరాగ్రములు నిశ్చలత న్వహియింపఁగాఁ, జెవుల్
దిగ్గన నిక్కఁబెట్టి తమ లేచిన ధూళికి నంటరానివై,
బెగ్గలిపాటు నామృగము వేగము సైఁపక కూడఁబోవునాన్.

రాజు—(సంతోషముతో) నిజముగా నీహయములు సూర్యా శ్వములను, హారిణములను మించి పరుగెత్తుచున్నవి.

గీ. ఏది కడుఁ జిన్నదై యుండు నిప్పు డదియ
క్షణములోపల గొప్పదై కానుపించు;
నేది నడుమను నెడ ముండి యొసఁగుచుండు
నదియు నొకటిగాఁ గలిసియున్నట్లు తోఁచు;

గీ. ప్రకృతిచేతను నెయ్యది వక్ర మగునొ
పరఁగ నయ్యది సమరేఖవలెనె యుండు;
దూర మిది చేరు విది యని, తేరివడిని
నిర్ణయింపఁగరా దేకనిమిషమునను.

సూతుఁడా! ఇదిగో హరిణంబును మరణంబు నొందించు చున్నాఁడఁ జూడుము. (అని వింట బాణమును సంధించుచున్నాఁడు.)

(తెరలోనుండి) ఓహో! రాజా! ఇది యాశ్రమమృగము. చంపఁదగినది కాదు. చంపఁదగినది కాదు.

సూతు—(ఆకంఠఁజూచి యాలకించి) దేవా! ఇదిగో బాణపాతదూరమున నున్న యీసారంగమునకును మనకును నడుమ నెవ్వరో జడదారులు వచ్చుచున్నారు.

రాజు—(తొట్రుపాటుతో) అట్లయిన గుఱ్ఱముల నిలుపుము.

సూతు—అలాగుననె. (అని రథము నిలుపుచున్నాఁడు.)

(అప్పు డిద్దఱుశిష్యులతో వైఖానసముని ప్రవేశించుచున్నాఁడు.)

వైఖా—(చేయెత్తి) రాజా! ఇది మా యాశ్రమమృగము. చంపకు చంపకుము.

గీ. వలదు వల దల్లబాణంబు వదలఁబోకు
మృదువయిన యీకురంగంబు మేనిమీఁద
దారుణంబుగ మండెడు దహనశిఖను
విరులమొత్తంబుమీఁదను విడుచునట్లు.

గీ. వజ్రసారంబు నిశితనిపాతఘోర
మట్టి నీమార్గణం బేడ? యకటకట!
యరసి చూడంగ నత్యంతతరళ మైన
యీహరిణపోత జీవితం బిదియు నేడ?

గీ. కాన నిప్పుడ, మనుజేంద్ర! కార్ముకమునఁ
జక్కసంధించినశరంబు సంహరింపు;
ఆర్తులను గావఁ బుట్టినయట్టినీదు
శరము నిరపరాధులమీఁదఁ జనఁగఁదగునె?

రాజు—ఇదిగో! ఉపసంహరించినాఁడ. (అని చెప్పినట్లు చేయుచున్నాఁడు.)

వైఖా—(హర్షముతో) ఇది పూరువంశప్రదీపకుండవగు నీకే చెల్లినది.

క. ధరఁ బూరువంశజుండగు
దొరకుండగు నీక యిట్టి దొడ్డగుణంబుల్;
మరి నీవుఁ బడయుము మిటువలె
వరగుణములు గలుగు చక్రవర్తిం బుత్రున్!

శిష్యులు—(చేతులెత్తి) తప్పక చక్రవర్తి యగు కొడుకుం బడయుదువుగాత!

రాజు—(ప్రణమిల్లి) భూసురాశీర్వాదముం బ్రతిగ్రహించినాఁడ.

వైఖా—రాజా! మేమిప్పుడు సమిధలందేర బయలుదేఱినాము. మాలినీతీరమునఁ గులపతులును మాగురువులును నగు కణ్వమహామునుల యాశ్రమ మిదే కానఁబడుచున్నది. కార్యాంతరభంగంబు వాటిలకుండు నేని, అందుఁ బ్రవేశించి యతిథిసత్కారంబుఁ గైకొనఁదగును.

గీ. ఫణ్యాదములును నిర్విఘ్నములును నైన
యుల తపోధనానుష్ఠానములను జూచి,
'జ్యాకిణాంక మీభుజమె కా యరసి యింత
దవ్వు రక్షించునది!' యని తెసరఁగలవు.

రాజు—కులపతు లగు కణ్వమహర్షు లిప్పు డాశ్రమముననే యున్నారుకదా?

వైఖా—లేరు. అతిథిసత్కారార్థము తమకూఁతు శకుంతలను నియోగించి, యామెయొక్క ప్రతికూలదేవతం బ్రశాంతి నొందించు నిమిత్తము వారిప్పుడే సోమతీర్థమునకుం బోయినవారు.

రాజు—కానిండు; ఆమెనే కాంచెద. ఆమెయైన నాభక్తి నమ్మహర్షికి విన్నవింపఁగలదు.

వైఖా—ఇఁక మేము మాపనికిం జనియెదము. (అని శిష్యులతోఁ గూడ నిష్క్రమించె.)

రాజు—సూతుఁడా! అశ్వంబులం దోలుము. పుణ్యాశ్రమ సందర్శనంబున మనగాత్రములం బవిత్రము గావించుకొందము.

సూతు—దేవరయాజ్ఞాప్రకారము చేసెద. (అని రథమును వేగముగాఁ దోలుచున్నాఁడు.)

రాజు—(అంతటఁ గలయంజూచి) సూతుఁడా! ఇది చెప్పకున్నను, తపోవనముయొక్క పరిపూర్ణత యని తెలియ వచ్చుచున్నది!

సూతు—ఏలాగున?

రాజు—నీవు చూడవా యేమి? ఇదిగో—

సీ. చిలుకతొఱ్ఱల కదుపులనోళ్ళనుండి ని
వ్వరిధాన్యములు జాఱెఁ దరులక్రింద,
నింగుదీఫలముల నిందందు నూఱిన
పొలుపుఁ దెల్పెడు నూనె గలుగుశిలలు;
విశ్వాసమునఁజేసి వి తశ్శబ్దము సైఁచి
మెదలక నిల్చె నీమృగచయంబు,
వల్కలాంచలములవలన జాఱిన వారి
ధారాంకితము లేటిదారు లొప్పె,
పవనాప్తిఁ గదలు కాలువనీటఁ దడిసిన
మూలంబులను నొప్పె భూరుహములు,
క్రమ్ముకొన్నట్టి యాజ్యధూమమ్ముచేతఁ
జిగురుటాకులరాగంబు చెన్ను మాసె;

కుశలు గోసినకొనలను గొంకు లేక
మేసెడుఁ గురంగశాబముల్ మెల్లమెల్ల.

సూతు—సర్వమును సరిగా నన్నది.

రాజు—(కొంచెము దూరము పోయి) సూతుఁడా! తపోవన వాసులకు బాధ కలుగరాదు. రథ మిక్కడనే నిలుపుము. నేను దిగియెదను.

సూతు—పగ్గములం బట్టినాఁడను. ఇఁక దేవర దిగవచ్చును.

రాజు—(దిగి తనవేషముఁ జూచుకొని) సూతుఁడా! తపోవనంబులకుం బోవునపుడు వినయవేషంబులతోడనె చనవలయును గదా! వీనిం బట్టుకొమ్ము. (అని ధనస్సును, ఆభరణములును, సూతునిచేత నిచ్చి) నే నాశ్రమవాసులం జూచి మరలి వచ్చునంత లోన గుఱ్ఱములం గడుగుము.

రాజు— (నడిచి యిటునటుఁ జూచి) ఇదే యాశ్రమద్వారము; లోనికిం జనియెదను. (ప్రవేశించి నిమిత్తమును సూచించి)

గీ. ఇది ప్రశాంతమౌ యాశ్రమపదము చూడ;
నదరెను భుజంబు; ఫల మెట్టు లొదవు నిందు?
అట్లనఁగ నేల? భాగ్య బులకుర నన్న
కాలమందు, సర్వత్ర మార్గములు గలుగు.

(తెరమఱుఁగున) నెచ్చెలులారా! ఇక్కడ, ఇక్కడ.

రాజు—(చెవి యిచ్చి విని) ఇదిగో సమీపమునఁ జెట్లచాటునకు దక్షిణముగ మాటలవలె వినఁబడుచున్నవి. అచ్చటికిఁ బోయెదను. (వెళ్ళిచూచి) ఇదె యాతపస్వికన్యలు తమశక్తికిం దగిన నీళ్ళకుండలతో లేతచెట్లకు నీళ్ళుపోయ నీ నైపునకే వచ్చుచున్నారు.

(వారివంకఁ బాఱఁజూచి) ఓహో! వీరిదర్శన మెంత మనోహరముగా నున్నది!

గీ. ఆశ్రమంబున నున్న, యీ యతిజనము
లలితమూర్తి శుద్ధాంతదుర్లభము చూవె
యౌనుగా! యెందునేని యుద్యానలతల
వనలతలె మించవే గుణగణముచేత!

కానిమ్ము. నే నీ చెట్లనీడను నిలిచి వీరివ్యాపారముం గనిపెట్టెదను.

[పూర్వము చెప్పినపనియందే ప్రవర్తించుచు సఖులతో
శకుంతల ప్రవేశించుచున్నది.]

శకుం—నెచ్చెలులారా! ఇక్కడ, ఇక్కడ.

అనసూయ—చెలియా! శకుంతలా! గురువు లగు కాశ్యపులకు నీకంటె నీ వృక్షములే ప్రియతరంబు లని నే ననుకొనెదను. ఎందుచేత నందువేని, ఈ నవమల్లికాకుసుమకోమలి వగు నిన్నును వీనిపాదములకు నీళ్ళు పోయ నియమించెను.

శకుం—ఓ యనసూయా! కేవల పితృనియోగమే గాదు. నాకును వీనియెడల సోదరస్నేహమే.

(అని చెట్లఁ దడుపుట నభినయించుచున్నది.)

ప్రియంవద—సఖీ! శకుంతలా! ఇంతదనుక నీళ్ళు పోసిన యాశ్రమవృక్షము లీ గ్రీష్మకాలమునఁ బుష్పించును. పుష్పించు కాలము గడచిపోయిన వృక్షముల కిప్పుడు నీళ్ళు పోయుదము. అందుచే మన కధికపుణ్యము వచ్చును.

శకుం—ఓ ప్రియంవదా! చక్కఁగా నాలోచించితివి.

(అని మఱలఁ జెట్లుదడుపుట నభినయించుచున్నది.)

రాజు—ఈమె నేలాగునఁ గణ్వపుత్రి యనుకొందును? (విస్మయముతో) ఓహో! ఈమె నిట్టాశ్రమధర్మమునందు నియోగించిన పూజ్యుఁడయిన యా కాశ్యపుఁ డుచితాలోచన లేనివాఁడుగా నున్నాఁడు!

గీ. ఈనిసర్గమనోహరం బైన మేని
నుగ్రతపములపాల్ సేయ నొప్పు నిమ్మ
వార్షి నీలోత్పలదళమ్ము నంచుచేతఁ
దా సమిల్లతలను గోయఁ దలఁపఁ డల్లు?

ఔఁగాక! చెట్లమఱుఁగుననుండియే వీరి నుమానము పుట్టకుండ నీమె జాడలఁ గనిపెట్టుచుండెద.

(అని యాప్రకారము చేయుచున్నాఁడు)

శకుం—అనసూయా! ప్రియంవద యిమా స్తనవల్కలమ్మును గట్టిగా బిగించినది. దీని సడలింపుమా.

అన—అలాగునే. (అని వదలుచేయుచున్నది.)

ప్రియం—(నవ్వుచు) ఇప్పుడు నీ గుబ్బల నుబ్బించున నీ యౌవనప్రాదుర్భావమును నిందించుకొమ్ము. ఊరక నన్నేల నిందించెదవు?

రాజు—ప్రియంవద యథార్థముగా చెప్పినది.

గీ. పండుటాకులతోఁ గప్పఁబడిన పూవు
భంగి, నిజశోభ నంతిన వాంగకంబు
చూడ లేదయ్యెఁ, జిఱుముడీ మూఁపు నొత్తఁగఁ
గవచములయి బ్బ మాటువల్కలముచేత.

ఏమి? ఈమె శరీరమున కీవల్కలము తగనిదే యయినను, అలంకారశోభం బెంపుఁజెందింపకున్నది కాదు.

అంగకముల నెల్ల నమరెను బరువంబు
వలపు గొలుపం దగుచు నలరువోలె.

అన—సఖీ! శకుంతలా! 'వనజ్యోత్స్న' యని నీవు పేర పెట్టుకొన్న యీవనమాలిక యిప్పుడు బాలసాలమునకు స్వయంవరవధు వైనది. దీనిం జూచితివా?

శకుం—(దగ్గఱకుం బోయి చూచి) చెలియా! ఆహా! ఈ రమణీయ కాలమున, ఈ లతాపాదపమిథునము నొండొరులం గలియుటనంభవించినది! నవకుసుమయౌవన యీవనజ్యోత్స్న; పల్లవ రాగంబున నొప్పి భోగార్హ మయినది యీచూతపాదపము.

(అని చూచుచు నిలుచున్నది.)

ప్రియం—(చిఱునవ్వుతో) అనసూయా! ఎందుచేత శకుంతల 'వనజ్యోత్స్న'ను దడవుగం జూచుచున్నదో నీవెఱుంగుదువా?

అన—నేనూహింపంజాలను, నీవే తెలుపుము.

ప్రియం—ఈవనజ్యోత్స్న యేప్రకారముగాం దగినపాదపముతోడం గూడినదో యాప్రకారముగాం దానును తనకుం దగిన వరునిం బొందవలయు నని.

శకుం—(అనసూయతో) ఇది నిశ్చయముగా నీకు నీమనసులో నున్నకోరిక. (అని జలకలశమును వంచుచున్నది.)

అన—ఓ శకుంతలా! జనకులగు కాశ్యపులచే నీవలెనే స్వహస్తముతోం బెంపంబడినమాధవీలత యిది. దీని న్మఱచిపోతివిగదా?

శకుం—నన్ను నేను మఱతునేని, అప్పుడు దీని న్మఱతును. (లతను జూచి) ఆశ్చర్యము! ఆశ్చర్యము! ప్రియంవదా! నీకొక్క ప్రియము చెప్పెదను.

ప్రియం—సఖీ! నాకుం బ్రియ మేది?

శకుం—అకాల మయినను, ఈమాధవీలత యిప్పు డామూలమును మొగ్గ దొడిగినది.

ఉభ —(సత్వరముగా ననుచు) చెలియరో! నిజముగానా? నిజముగానా?

శకుం—నిజముకాదా? మీరు చూడుండి.

ప్రియం—(సంతోషముతోఁ జూచి) సఖీ! దీనిచేతనే నీకు నేనొక్క ప్రతిప్రియము చెప్పెదను.

శకుం—నాకుఁ బ్రతిప్రియ మేది?

ప్రియం—నీకుఁ బాణిగ్రహణము సమీపించుచున్నది—

శకుం—(అసూయతోఁ గూడినట్లుగా) ఇది నీమనసులోని పిచ్చి యూహ, కాబట్టి నీమాట నేను వినను.

ప్రియం—సఖి! నేను పరిహాసముగాఁ జెప్పుచున్న దానంగాను. ఇది నీకల్యాణసూచకమయిన నిమిత్తమని పూజ్యులగు కణ్వమహర్షుల ముఖమువలననే విన్నదానను.

అన—ప్రియంవదా! అందుచేతనక శకుంతల యీమాధవీలత కంతప్రేమతో నీళ్ళు పోయుచున్నది.

శకుం—అది నాకుఁ దోఁబుట్టువు కాఁబట్టి నే నెట్లు నీళ్ళు పోయకుండఁగలను? (అని కలశము వంచుచున్నది.)

రాజు—(మనసులో) నాయీమనోరథము దుర్లభ మేమో! ఈమె కులపతి యగు కణ్వునకు స్వజాతీయ మైన భార్యయందుఁ బుట్టినది కాకుండవచ్చునా? తప్పఁ దలఁచితిని; సందేహింపఁ బనిలేదు.

గీ. నృపపరిగ్రహయోగ్య యీనెలఁత నిజము;
కాక, నామది నిర్దోష మీకై నెట్లు

దవులు? నెందు సందేహాస్పదములయందు
నాత్మగతులె ప్రమాణంబు లార్యులకును.

అయినను, ప్రత్యక్షముగానే యీమె నెఱింగెద.

శకుం—(తొట్రుపాటుతో) నీళ్లుపోయుటచే దుస్థితి, యీ తుమ్మెద నవమాలికాకుసుమమును విడిచిపెట్టి నాసెమ్మోమున వ్రాల వచ్చుచున్నది! (అని భ్రమరబాధ నభినయించుచున్నది)

రాజు—(ఆశమీఱ విలోకించి) మేలు! ఈమెపీడయును రమణీయముగానే యున్నది.

క. ఎందెందుఁ దిరుగుఁ దుమ్మెద,
యందందే బెళుకుఁగనుఁ గడకుఁ జని
చ్చం ద్రిప్పెడు బొమలు భయమున
మందగమన నృత్త్యభిషయము చేసెడునో!

(అసూయ కలిగినట్టుగా)

చ. కదలెడికల్కి బెళుకుఁగడకన్ను లెంటెదు మాటిమాటికిన్;
వదిగి రహస్య మాడుగతిఁ బల్కెదు కర్ణము నంతఁజేరి; కల్
ముదమున కాస్పదం బయినమోవిని గ్రోలెదు కేల్విదల్ప; షట్పద! కృతిపీవ; మేమె చెడువారము తత్త్వవిచార మగ్నతన్.

శకుం—చెలులారా! నీతిమాలిన యీ తుమ్మెదచేత బాధింపఁబడుచున్న నన్ను రక్షింపుఁడు.

ఇద్దఱు—(చిఱునవ్వుతో) ఈ తపోవనంబులు రాజుచే రక్షింపఁబడుచుండ, నిన్ను రక్షించుటకు మే మెవరము? దుష్యంతునిం బిలువుము.

రాజు—(తనలో) బయల్పడుటకు నాకిదియె మంచిసమయము.

(ప్రకాశముగా) భయపడవలదు— (అని నగముచెప్పి మనసులో) ఇట్లయిన రాజభావము వెల్లడియగును. అగుంగాక! ఇట్లు పలికెదను.

శకుం—ఈ దుష్టమధుపము నన్ను వదలకున్నది. మఱియొక చోటికి కేగెద. (మఱియొక యడుగు నడచి నిలిచి చూపులు నిగిడించుచు) హా! హా! ఇదియేమి? ఇక్కడికిని వెంటబడుచున్నది!

రాజు—(సత్వరముగా వచ్చి)

గీ. ఎవడవుర నీవు? ముగ్ధలౌ యాతపస్వి
కన్యకల వేప వచ్చితి కావరమున;
దుర్వినీతుల దండించు నర్తినెల్లఁ
బౌరవుం డేలుచుండఁగ భయము లేక.

(అందఱును రాజుంజూచి తత్తరపడుచున్నారు)

అన—అయ్యా! ఇచ్చట విశేషోపద్రవము మాకేమియు లేదు. మా ప్రియసఖియైన యీకోమలి తుమ్మెదబాధవలన బెగడొందినది.

(అని శకుంతలం జూపుచున్నది)

రాజు—(శకుంతలం గని) చక్కఁగాఁ దపస్సు వర్ధిల్లుచున్నదా?

శకు—(సిగ్గుచేఁ దలవంచుకొని యూరకున్నది)

అన—అతిథి విశేషాభ్యాగతులచేత మఱింత చక్కఁగా వర్ధిల్లుచున్నది.

ప్రియం—దేవరవారికి స్వాగతము. (అని శకుంతలవంకఁ దిరిగి) సఖీ! శకుంతలా! నీవు పర్ణశాలకుఁ బోయి, పండ్లతోడఁ గూడఁ బూజాద్రవ్యంబులం గొనిరమ్ము. ఇంతలో నీయుదకము

రాజు—ఏమియు నక్కఱలేదు. ఇప్పుడు మీ ప్రియవాక్యములచేతనే నా కాతిథ్యము జరిగినది.

అన—అట్లయిన ముహూర్తమాత్రము దేవర యీ చల్లని నీడగల యేడాకులయరటిచెట్టుక్రింది వేదికమీఁదఁ గూరుచుండి యలయికం దీర్చుకోఁ దగును.

రాజు—పని చేసి మీరును నలసి యున్నారు. ముహూర్తకాలము కూర్చుండుఁడు.

అన—సఖీ! శకుంతలా! మన కతిథిసేవయే యర్హకృత్యము. కాఁబట్టి యిందుఁ గూర్చుండము. (అన సందఱుఁ గూరుచున్నారు.)

శకుం—(ఆలోచించి మనసులో) ఇదియేమో కాని యీయనం జూచి తపోవనంబులం గానరాని యొక వికారంబునకు లోనయినదానను.

రాజు—(అందఱిని జూచి) ఓహో! మీస్నేహము సమానమయిన వయస్సుచేతను రూపముచేతను రమణీయముగా నున్నది!

ప్రియం—(రహస్యముగా) అనసూయా! ఈయన యెవరు? చతురగంభీరాకారంబున, మధుర ప్రియవాక్యంబులం బలుకుచు రాజువలెఁ గనవచ్చుచున్నాఁడు.

అన—నాకును గౌతూహలమగుచున్నది. ఈయన నడిగెదను. (ప్రకాశముగా) దేవరవారి మధురాలాపంబులవలనం గలిగినవిశ్వాసము తమ్ముఁ గొన్నిసంగతుల నడుగ నన్నుఁ బ్రేరేచుచున్నది! తమచే నేరాజర్షివంశ మలంకరింపఁబడుచున్నది? ఏదేశమందు జనులు దేవరవియోగమునకుం గుందుచున్నారు? సుకుమారమయ్యు నీశరీర మెందునిమిత్తము తపోవనగమనపరిశ్రాంతిపాలు సేయఁబడినది?

శకుం—(మనసులో) హృదయమా! ఆరాటమున్మానుము. నీ వడుగఁదలఁచినదాని నీయనసూయయే యడుగుచున్నది.

రాజు—(తనలో) నన్ను నేనే మని యిప్పుడు తెలుపుకొందును? ఏలాగున నన్ను నే మఱుంగుపెట్టుకొన్నైన నేర్తును? వినుయింక సాహసము; ఈప్రకారముగాం జెప్పెదను. (ప్రకాశముగా) పూరువంశసంభవుండయిన రాజుచేత ధర్మాధికారమునందు నియోగింపంబడినవాండ నయి, యాశ్రమవాసుల సత్క్రియానుష్ఠానములు నిర్విఘ్నములుగా నెగడుచుండుటం దెలిసికొనన నీధర్మారణ్యంబునకు వచ్చినాండను.

అన—ధర్మమార్గమునం జరించు నాశ్రమవాసులిప్పుడుగదా రక్షకుండు గలవారైరి.

శకుం—(శృంగారలజ్జ నభినయించుచున్నది.)

సఖులు—(ఉభయుల యాకారములం దెలిసికొని రహస్యముగా) సఖీ! శకుంతలా! పూజ్యుండగు కణ్వమహాముని యిప్పు డిచ్చట నుండిరేని,—

శకుం—(రోషముతో) ఉండిన నేమి?

సఖు—శక్యప్రాణము వ్యయమైన ధనమొసంగి యీయతిథిం గృతార్థుం గావింపంగలరు.

శకుం—సఖులారా! వేఱొకటి యేదియో మనసున నుంచుకొని గూఢముగా మాటలాడెదరు. మీపలుకులు వినను.

రాజు—మేము నించుక మీనెచ్చెలివృత్తాంతము నడుగవచ్చునా?

సఖు—దేవర యిట్లు కోరుట మాకనుగ్రహముకదా!

రాజు—మహానుభావుండగు కాశ్యపుండు శాశ్వతబ్రహ్మనిష్ఠుం డని ప్రసిద్ధి. అట్టివాని కీ మీనెచ్చెలి కూంతు రయ్యెనా?

అన—దేవర యాకర్ణింపవలయును. కౌశికుండని వంశ

నామముగల మహాప్రభావసంపన్నుఁ డయినరాజర్షి యొకఁడుకలఁడ కదా!

రాజు—కలఁడు; విని యున్నాము. అనంతరము?

అన—అతఁడే మాచెలియను గన్నవాఁడు. కన్నవారిచే విడువఁబడినయీమెను బెంచుట మొదలుగాఁ గల పనులు నిర్వర్తించుటఁ జేసి పూజ్యులగు కణ్వులును నీమెకు జనకులయిరి.

రాజు—"విడువఁబడి" యను శబ్దశ్రవణముచేతనే వేడుక పొడముచున్నది. మొదటినుండియు వినఁగోరుచున్నాను.

అన—దేవర యవధరింపవలయును. పూర్వ మా రాజర్షి యుగ్రతపస్సు చేయుచుండఁగా, దేవతలు భయపడి యాతని నియమమునకు విఘ్నమాచరింప మేనక యనునప్సరసం బంపిరి.

రాజు—దేవతల కితరతపోభయశీలత యెప్పుడు నున్నదదే. తర్వాత, తర్వాత?

అన—అంత నత్యంతరమునఁ దు మధువసంతకాలమున నున్మాదమును బుట్టించు నామెరూపమును జూచి—(అని సగము చెప్పి లజ్జచే నూరకున్నది.)

రాజు—అవయిని దెలియునే తెలియుచున్నవి. తప్పకయీమె యప్సరస్సంభవయే.

అన—సందేహమేమి?

రాజు—స్పష్టముగుచునే యున్నది.

క. అటువంటిరూప మారయ
నెటువుట్టును మర్త్యచంచలేక్షణలందున్;
చటులప్రభాతిరేక మగు
తటిల్లత జనింపఁగలదె ధారుణి నెందున్!

శకుం—(క్రిందఁ జూచుచుఁ గూరుచున్నది.)

రాజు—(మనసులో) నా మనోరథమున కవకాశ మున్నది. అయినను, చెలికత్తియచేఁ బరిహాసముగా నుదాహరింపఁ బడిన యీమెయొక్క వరవిషయకమైన ప్రార్థనను విని నాడెందము సందేహముచే నాందోళించుచున్నది.

ప్రియం—(చిఱునవ్వుతో శకుంతలవంకఁ జూచి, నాయకాభిముఖియై) దేవరవారు మఱియు నేమో పలుకఁ దలఁపు గలిగి యున్నట్టు కనుపట్టుచున్నారు.

శకుం—(అంగుళిచే నెచ్చెలిని బెదరించుచున్నది.)

రాజు—నీవు లెస్సగాఁ గనిపెట్టితివి. సచ్చరిత్రశ్రవణము నందలి యపేక్షవలన మఱియు నొక ప్రశ్న మడుగవలసియేయున్నది.

ప్రియం—సందేహింపవలదు. తపస్విజనులను సంకోచము లేక యడుగఁదగును గదా!

రాజు—మీసఖినిగూర్చియె యెఱుఁగఁ గోరుచున్నాము.

ఉ. ఈరమణీలలామ హృదయేశున కీఁబడుదాఁకఁ గామువ్యా
పారనిరోధియైనవ్రతిభారము దీనిని బూని యుండునా?
చారువిలోచనప్రభల సామ్యము వచ్చు కురంగభామినీ
వారముతోడ నిచ్చలును వాసము నిత్యము చేయుచుండునా!

ప్రియం—దేవా! ధర్మాచరణమునందు సహిత మీతరుణి పరాధీనయే. అయిన నీమెం దగినవరున కీవలె ననియే యెప్పుడును దండ్రిసంకల్పము.

రాజు—(సంతోషముతో మనసులో) ఆయనసంకల్పము దుర్లభము కాదు.

గీ. హృదయ! సాభిలాషివి గమ్ము యింక నీవు;
సంశయనివృత్తి యిత్తఱి సంభవించె;
నసల మని దేని భ్రమియించి తదియె యిప్పు
డంటఁ గూడినమాణిక మయ్యె జుమ్ము.

శకుం—(రోషముతోఁ గూడినట్లుగా) అనసూయా! నేను వెళ్లెదను.

అన—ఎందునిమిత్తము?

శకుం—ఈ యసంబద్ధప్రలాపములను ప్రేలు ప్రియంవదకథ పూజ్యురా లయిన గౌతమితోఁ జెప్పుటకు.

అన—సత్కారముం బడయని యతిథిప్రశస్తు నిట్లు విడిచి పెట్టి మనసు వచ్చినట్లు పోవుట యాశ్రమవాసిను లగు నాఁడువారికిం దగవుకాదు.

శకుం—(ఏమియు బదులు పలుకక బయలుదేఱినది.)

రాజు—(తనలో) ఆ! ఎట్లుపోవుచున్నది! (కూడఁ జనఁగోరు తన మనసును నిగ్రహించి) కాముకజనమనోవ్యాపారము చేష్టలతో సమాన మయినది గానే యుండును! కావుననే నేనును—

క. మునిపుత్రిక వెంటం బడి
చనఁ జూచియు నిలువఁబడితి సౌశీల్యముచే
త నిపుడ, యిమ్ము గదలకయుఁ
జని క్రమ్మఱ వచ్చినట్టె సరిగాఁ దోఁచున్.

ప్రియం—(శకుంతలంబట్టుకొని) సఖీ! నీవు పోఁగూడదు.

శకుం—(బొమ్మముడితో) ఎందుచేత?

ప్రియం—నీవు నాకు రెండు చెట్లకు నీళ్ళుపోయ నప్పుపడి యున్నదానవు. కాఁబట్టి నాఋణము తీర్చి మఱి పోదువుగాని రా.

(అని బలాత్కారముగా మరలించుచున్నది.)

రాజు—ఓదయాళువులారా! నాకుం జూడ వృక్షములకు నీళ్ళు పోయుటవలననే యీమె యలసిపోయినట్లు తోఁచుచున్నది. ఔను గదా? ఈమెకు,

ఉ. కుండను బూన మూఁపులవి క్రుంగెను, హస్తతలంబు లెఱ్ఱనై
యుండె, వడంకెఁ జొచ్చెఁ గుచయుగ్మము, మిక్కిలియయ్యె శ్వాసముల్,
నిండెను మోమునందుఁ జెమటనిడ్డ శిరీషము వాడెఁ జెక్కటల్,
వెండ్రుకలుం గలంగె ముడి వీడెఁ గదా నొకచేతఁ జిక్కెన్.

కావున నీమెఋణమును నేను దీర్చెదను; కైకొనుఁడు.

(అని చేతియుంగరము నిచ్చుచున్నాఁడు.)

సఖులు—(పుచ్చుకొని నామముద్రాక్షరములఁ జదువుకొని యొకరినొకరు చూచుకొనుచున్నారు.)

రాజు—మమ్ము వేఱువిధముగా భావింపవలదు. రాజపురుషుల మగుటచే, మాకిది రాజువలన లభించినది.

ప్రియం—అందుచేతనే యీయుంగరము దేహమునుండి నెడఁబాయఁ దగదు. తమమాటచేతనే యీమెఋణము తీఱిపోయినది.

అన—సఖీ! శకుంతలా! దయాళువయిన యీమునిచే, లేక, యీమహారాజుచే, నీఋణవిమోచన మయినది. ఇప్పుడు నీవు పోవచ్చును.

శకుం—(మనసులో) నేనే స్వతంత్రురాల నయితినేని—

ప్రియం—ఇంకను వెళ్ళవేమి?

శకుం—ఇప్పుడు నే నేమియు నీయాజ్ఞకు లోఁబడియుండలేను. నాయిష్టము వచ్చినప్పుడు నేను బోయెదను.

రాజు—(శకుంతలం జూచి మనసులో) ఈమెయిందఱ నా

కెట్లున్నదో యీమెకును నామీఁద నట్టి యున్నదేమో! ఏలాగున నయిన నాకోరిక కవకాశ మున్నది. ఎట్లంటేని —

గీ. కలిసి మాటాడకున్న, నాపలుకులకును
వీను లొగ్గెడు నభిముఖియై నిలువక;
కెలఁది నా మోమునకె చూడ్కి నిలుపకున్న,
నన్యవిషయఁ బులకుఁ బోవ దతివదృష్టి.

[తెరలో]

ఓహో! తపస్వులారా! మీరు తపోవనమునందలి జంతువుల రక్షింప సిద్ధముగా నుండుఁడు. మృగయావిహారి యగు దుష్యంత మహారాజు సమీపమున వచ్చుచున్నాఁడఁట.

గీ. కొమ్మలకుఁ గట్టి తడివల్కలమ్ము లున్న
యాశ్రమమహీజముల యందు, హయఖురాళి
నడరు పెనుధూళి పడెను సాయంతనంపు
టరుణరుచిఁ బొల్చు శలభచయంబువోలె.

రాజు—(మనసులో) అక్కటా! సైనికులు నన్ను వెదకుచుఁ దపోవనంబులకు బాధ గలిగించుచున్నారు!

[మరల తెరలో]

ఓహో! తపస్వులారా! వృద్ధులును, స్త్రీలును, బాలురును, వ్యాకులపడ నిదిగో యేనుఁ గొక్కటి సంప్రాప్త మయినది.

చ. అరదముఁ జూచి భీతి నొకహస్తి తురంగసమూహ ముక్కటన్,
దరువుప్రకాండమున్ బొడుచ దంతిముఖంబు బొకఁడించుచు నోవఁగాఁ
జరణములం దగులొనిన చారుల తావళి నీడ్చుకొంచు, న
బ్బురముగఁ జొచ్చెఁ బుణ్యవనమున్, వ్రతవిఘ్నము రూపుదాల్చె నాన్.

(అందఱును విని యించుక సంభ్రాంత లయి లేచుచున్నారు)

రాజు—(మనసులో) అయ్యో! నేను తపస్వుల కపరాధము చేసినవాఁడ నయితిని! కానిమ్ము. నేఁ బోయి నివారించెదను.

సఖులు—దేవా! ఈ కాఁడవియేనుఁగు వృత్తాంతముచేతఁ గలగుండు వడినారము. పర్ణశాలకుఁ జన ననుజ్ఞ యిమ్ము.

అన—సఖీ! శకుంతలా! పూజ్యురా లగుగౌతమి విచారించుచుండును. శీఘ్రముగా రమ్ము. అందఱము నొకటిగాఁ గూడుకొందము.

శకుం—(నడవలేన ట్లభినయించుచు) హా! హా! నడవఁ గాళ్ళాడకున్నవి!

రాజు—(తొట్రుపాటుతో) మీరు యథేచ్ఛముగాఁ బొండు. మే మాశ్రమపీడ తొలఁగుప్రయత్నముం గావించెదము. (అందఱును లేచుచున్నారు)

సఖులు—మీ మహాత్మ్యమును గుర్తెఱిఁగి యుపచారములు చేయకుండఁజేసి యిప్పుడు మీయెడ నపరాధుల మయితిమి. క్షమియింపుఁడు. మాచే నర్హసత్కారముం బడయని దేవరను వెండియుఁ జూడ వేడుక గలదని విన్నవించుటకు మాకు లజ్జ యగుచున్నది.

రాజు—అట్లుకాదు. మీదర్శనముచేతనే మేము సత్కృతుల మయితిమి.

శకుం—అనసూయా! సూదివంటి క్రొత్తదర్భమొలక నా పాదముఁ గ్రుచ్చుకొన్నది. (మఱియొకయడుగు పోయి) చెలులారా! నా నారచీర కురవకవృక్షముయొక్క కొమ్మం జిక్కుకొన్నది. దీనిం దీసికొనువఱకు నిలిచి నన్ను వెంటఁ గొనిపొండు. (అని మిషపెట్టి రాజుం జూచుచు నాలస్యముగా సఖులతో నడచుచున్నది)

రాజు—(నిట్టూర్పు పుచ్చి) అందఱుం జనిరి! కానీ నేనునుం జనియెదను. శకుంతలం బొడఁగాంచినది మొదలు నగరగమనమును గుఱించిన యుత్సాహము తగ్గినవాఁడ నైతిని. వెంట వచ్చినవారిం గలిసికొని తపోవనమునకు సమీపమున విడియించెదను. శకుంతలా వ్యాపారమునుండి నాడెందమును మరలింపఁజాలకున్నాఁడను. —

గీ. నడచుచున్నది ముందుకు నాశరీర;
మాత్మ పరుగువాఱెడు వెన్క కవశ మగుచు,
మంచిగాలికి నెదురుగఁ గొంచుఁబోవు
ధ్వజమునకుఁ గట్టు పట్టువస్త్రంబువోలె.

(అందఱు నిష్క్రమించిరి.)

---

## ద్వి తీ యాం క ము.

•••○●○•••

ప్రదేశము—ఆశ్రమారణ్యము.

[అప్పుడు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—(నిట్టూర్పు విడిచి) హా! దైవమా! మృగయాశీలుఁ డగు నీరాజుచెలిమిచేత మోసపోయితిని గదా! ఇదిగో మృగము, ఇదిగో వరాహము, అదిగో శార్దూలము, అని మిట్టమధ్యాహ్నమున మండువేసవికాల మగుటచేఁ బలుచనినీడలు గల యరణ్యమార్గముల నొకయడవినుండి యొంక యడవికిఁ ద్రిప్పట యగుచున్నది. ఆకులు పడి చెడిపోయిన వెచ్చని కొండయేఱ్ఱ నీళ్ళు త్రాగ నబ్బుచున్నవి. వేళ తప్పి కటికుట్లమాంసము భోజనమునకు సంభవ మగుచున్నది. పక్షులయొక్కయు నేనుఁగులయొక్కయు ధ్వనులచేత రాత్రి

## ప్రస్తావమున వచ్చువారు



విక్రమబాహువు—సింహళేశ్వరుఁడు; రత్నావళితండ్రి; వాసవదత్త పినతండ్రి.

రుమణ్వంతుఁడు—ఉదయనుని సేనాధిపతి.

జయవర్మ—రుమణ్వంతుని తమ్ముఁడు.

---

# పీఠిక.

—: o :—

రత్నావళియను నీనాటిక కాశ్మీరదేశపు రాజైన శ్రీహర్ష దేవునిచే సంస్కృతమున రచియింపఁబడినది. ఈరాజు మరణము నొంది యిప్పటి కేడువందల యేఁబదిసంవత్సరములు దాఁటిపోయినది. శ్రీహర్ష దేవుఁడే దీనిని రచించినట్లు నాటకమువలనఁ గనఁబడుచున్నను, ఆయన యాస్థాన కవీశ్వరుఁడయిన ధావకుఁడను నతఁడు దీనిని రచియించి తనప్రభువు చేసిన ట్లిందు వ్రాసెనని కావ్యప్రకాశికవలనఁ దెలియవచ్చుచున్నది. కథానాయకుఁడయిన యుదయనమహారాజును మిక్కిలి సుప్రసిద్ధుఁడు; పూర్వకాలమునం దీయనకథలను ప్రతిగృహమునందును కూడఁ జెప్పుకొనుచుండినట్టు కాళిదాసుని మేఘసందేశమువలనఁ దెలియుచున్నది;ఆరాజునే నాయకునిగాఁ జేసి వాసవదత్తయను కావ్యమును సుబంధుఁడను కవి చేసియున్నాఁడు; ఈయన చరిత్రము విష్ణుపురాణమునందును, బృహత్కథయందునుగూడ వర్ణింపఁబడియున్నది. ఇతఁడు పాండవులసంతతివాఁడు; ఈతని పూర్వులలో నొకఁడగు నిచక్షువు హస్తినాపురమునువిడిచి కౌశాంబీనగరమును తనకు రాజధానినిగాఁ జేసికొన్నాడు. ఈనాటకము కవిత్వము కాళిదాసుని కవిత్వమంత మనోహరముగా నుండకపోయినను, కథ మిక్కిలి చమత్కారముగానే యుండును. ఇందు చెప్పఁబడిన సంగతులలో స్వభావవిరుద్ధమయిన దేదియు లేదు. దీనివలనఁ బూర్వకాలమునందు హిందూసుందరుల కెంతస్వాతంత్ర్య ముండెడిదియో, వారెంత నాగరికురాండ్రుగాను విద్యావతులుగాను నుండి భర్తలతోఁగూడ సభలకుసహితము వచ్చెడియాచారము కలిగియుండెనో, స్పష్టపడుచున్నది. ఈకవి యీగ్రంథమును రచించిన కాలములో నింద్రజాలవిద్యయం దందఱికిని మిక్కిలి నమ్మకమున్నట్లు కనఁబడుచున్నది.

# రత్నావళి

## ప్రథమాంకము

---

### నాంది.

మ. చరణాగ్రంబులనిల్చి, సారెకు సరోజప్రోన్నతిన్ మ్రొగ్గుచున్,
హరునర్చింపఁగ లోచనత్రయము పదంబాసక్తితోఁ బొంది, హ్రీ
భరతన్ మేన్పులకించి కంపిలి చెమర్పంగా, శిరంబందు నీ
శ్వరిపుష్పాంజలి చిమ్మ, జారి యది క్షిప్తంబై మిముం బ్రోచుతన్!

మ. హృదయౌత్సుక్యము వేగిరింప, సహజహ్రీ క్రమ్మరింపన్, చెలుల్
మృదువాక్యాళిఁ బ్రియాభిముఖ్యమును గల్పింపన్, మనోవల్లభుం
డెదుటన్ దోఁచుట భీతియొప, నగి యాత్మేశుండు తొల్యాటమిన్
బొదుగం గౌఁగిట స్విన్నయౌ గిరిజ యొప్పున్మీకు మేల్గూర్చుతన్! ౨.

మ. సవనధ్వంసమునం దిప్రవహ్నుల దహాంచద్దృష్టిఁ జల్లార్చుటల్,
తివియంగాఁ బ్రమథాళి జుట్టొడిసి భీతిన్ ఋత్విజుల్లూలుటల్,
స్తవముల్సల్పుచు దక్షునాలడలుటల్, ధాత్రీసురుల్పాయుటల్,
శివతోడన్ వివరించు సాంబశివుఁడోలిన్ మీకిడున్ శ్రేయముల్!♦

---

♦ కొన్ని ప్రతులలో దీని కడపట నాందిలోనే యీ క్రిందియర్థమిచ్చు శ్లో-
కమొక్కటి కానఁబడుచున్నది గాని యది ప్రక్షిప్తమనితోఁచుచున్నది.—

గీ. శశిజయమాత! సురలకంజలిఘటింతు.
సత్తమబ్రాహ్మణులకు మేలొదవుఁగాక!
పృథ్వి సమృద్ధసస్యయౌఁగాక సతము!
చంద్రకరుఁడు రాజప్రజాపాలియగుత!

నాంద్యంతమందు సూత్రధారుఁడు

సూత్ర—అతివిస్తారము వలదు. ఇప్పుడు వసంతోత్సవము నిమిత్తము సబహుమానముగా నాహ్వానము చేయఁబడి నానాదిగ్దేశములనుండి వచ్చియున్న శ్రీ శ్రీహర్ష దేవ పాదపద్మోపజీవులయిన రాజులసమూహము "మనస్వామియైన శ్రీ శ్రీ హర్ష దేవు నిచే నపూర్వవస్తు రచనాలంకృతము గా రత్నావళియను నాటిక రచియింపఁబడినదని శ్రోత్రపరంపర చేవినుటయే కాని ప్రయోగింపఁ గాఁ జూచియుండ లేదు కాఁబట్టి సకల జనహృదయాహ్లాదకరులైన రాజుగారియందలి గౌరవముచేతను మాయెడలఁగల యనుగ్రహబుద్ధిచేతను నీవు దానిని ప్రయోగించియాడవలెను." అని నన్నడిగెను. అట్లగుట వలన నేను నేపథ్యరచనను జేసి యిప్పుడు వారియభిలాషమును దీర్చెదను. (చుట్టునుదిరిగిచూచి) ఈ సకలసామాజికులును నిందు మనస్సులతోనున్నారని నేను నిశ్చయముగాఁ దలఁచెదను.

మ. కదు శ్రీహర్షుఁడు ప్రౌఢసత్కవి; గుణగ్రాహుల్స భాస్తారులున్;
బిదమిన్వత్సచరిత్ర సుందరము; మమ్మున్ దక్షులం డ్రాటలో;
నొడఁగూర్పందగు వాంఛితార్థముల నిందొండొండె నా,నిచ్చటన్
వడిఁజేకూరెను సర్వబాధములు మద్భాగ్యంబునం కేమనన్?

కాఁబట్టి నేను గృహమునకుఁబోయి గృహిణిబిలిచి సంగీతముపక్రమించెదను. (అని పరిక్రమించి తెరవంకఁ జూచి) ఇదె నాగృహము. ఇందుఁ బ్రవేశించెదను. (బిగ్గఱగా) ఓసీ! ఇటురమ్ము.

నటి—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో వచ్చితిని. ఏనియోగము ననుష్ఠింప వలయునో యాజ్ఞాపింపుఁడు.

సూత్ర—ఓసీ! ఈ రాజలోకము రత్నావళీ దర్శనోత్సుకమైయున్నది. కాఁబట్టి నీవలంకరించుకొమ్ము.

నటి—(నిట్టూర్పు విడిచి కంపముతో) అయ్యా! మీరిప్పుడు నిశ్చింతులుగా నున్నారు. మందభాగ్యురాలనైన నాకొక్క తెయే కూఁతురు; దానిని మీరేదో దేశాంతరమునకు దియ్యమంటిరి; అందుచేత దూరదేశస్థుఁడయిన భర్తతో దానికి పాణిగ్రహణ మెట్లు కలుగునా యని నాకెప్పుడు నదేచింతగా నున్నది. దీనిని మీరేల తలఁపరు? ఇట్టి విచారముతో నేనెట్లు నాట్యము నిర్వహింపఁగలను?

సూత్రి—ఓసీ! దూరస్థుఁడని విచారపడఁబోకుము. చూడు—

గీ. దైవ మనుకూల మగు నేని, తడవు లేక
యభిమతార్థంబుఁ దెచ్చి ద్వీపాంతరంబు
నుండియైన, దిగంతంబు నుండియైన,
జలధినడుమనుండియునైన, సంఘటించు.

(నేపథ్యమునందు)

సాధు! భరతపుత్రా! సాధు! అదనిశ్చయము. అందుకు సందేహమేమి?

సూత్ర—(ఆలకించి నేపథ్యమువంకఁ జూచి) ఓసీ! ఇంకను కాలవిలంబ మేల చేసెదవు? అదె నాతమ్ముఁడు యౌగంధరాయణ వేషమును ధరించి వచ్చి యున్నాఁడు. కాఁబట్టి నీవురమ్ము. మనమును ననంతరకరణీయు వేషరచనను సిద్ధము చేయుదము.

(అని యిద్దఱును నిష్క్రమించు చున్నారు.)

ఇది ప్రస్తావన.

---

# రత్నావళి

## ప్రథమాంకము

ప్రదేశము — కౌశాంబీనగరము.

[అప్పుడు హృష్టుఁడగుయౌగంధరాయణుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

యౌగం — అది సత్యము. అందుకు సందేహమేమి!

గీ. దైవ మనుకూల మగునేని, తడవు లేక
యభిమతార్థంబుఁ దెచ్చి, ద్వీపాంతరంబు
నుండియైన, దిగంతంబునుండి యైన,
జలధినడుమునుండియు నైన సంఘటించు.

అట్లు కానిపక్షమున, ఆమెను వివాహమాడువాఁడు మహాభాగ్యశాలి యగునని సిద్ధుఁడు చెప్పినమాటను నమ్మి నేనడుగఁబంపిన సింహళ రాజపుత్రిక సముద్రమధ్యమున నోడ పగిలి మునిఁగిపోవునపుడు పలక దొరకి బ్రతుకుట యెక్కడ! సింహళద్వీపమునుండి తిరిగి వచ్చుచున్న కౌశాంబీపురవర్తకుఁడట్టియవస్థలో నున్నయామెను రత్నహారముచే గుఱుతుపట్టి యిచ్చటికి సురక్షితముగాఁ దీసికొనివచ్చి నాకిచ్చుట యెక్కడ! (హర్షముతో) ఏవిధమునఁ జూచినను మనరాజుగారి కిప్పుడు మంచిదినములు వచ్చినట్లు కనఁబడుచున్నవి. (ఆలోచించి) నేనును ఆచిన్నదానిని సగౌరవముగా రాణిగారి సంరక్షణమున నొప్ప గించుట మంచిపనియే చేసియున్నాను. ఆమెను తీసికొనివచ్చుటకయి వెళ్ళిన బాభ్రవ్యుఁడనుకంచుకియు, తోడుగా పంపఁబడిన సింహళ ద్వీపాధిపతిమంత్రి యగువసుభూతియు ఏలాగుననో సముద్రతీరమును జేరి, కోసలరాజును శిక్షించుటకయి మనచేఁ బంపఁబడిన రుమణ్వాం తునితోఁ గలిసికొన్నారనియువిన్నాఁడను. వీనినన్నిఁటిని బట్టి చూడఁగా స్వామికార్యము సఫల మయినట్టే. అయినను, నాకుమాత్రము

గీ. స్వామియభివృద్ధి కీపని సలిపినాఁడ;
సాయపడియెడు దైవంబుఁ జేయియిచ్చి;
అగు నమోఘంబె సిద్ధోక్తి; యట్టు లయ్యు
స్వామి కెఱిఁగింపకునికి నే జడియవలయు.

[తెరచాటున కలకలము]

(ఆలకించి) ఆహా! మధురముగా వాయించుచున్న మద్దెలల మృదు నాదముతో మిళితమయి శ్రావ్యమయినసంగీతముతో పౌరులచర్చరీ ధ్వని యెంత మనోహరముగా బయలువెడలుచున్నది! ఈ మదన మహోత్సవమునందుఁ బ్రవర్తించుచున్న పురజనులయొక్క యత్యధిక సంతోషమును జూచుటకయి రాజుగారిప్పుడు మేడమీఁది కెక్కుదు రని యూహించెదను. (పయివంకఁ జూచి)అదె ప్రభువుగా రప్పుడే మేడమీఁది కెక్కియే యున్నారు.

చ. అమరఁగ విగ్రహంబు విడనాడి, కదుఁ రతిమంతుఁ డొచ్చు, ని
త్యమును జనాళిచిత్తములయందె వసించుచు, వేడ్కతో సుహృ
త్తమును వసంతకుం గలసి, దర్పకుఁడే తనయుత్సవంబునం
దముఁ గనవచ్చెనో యనఁగఁ దా నలవత్సనృపాలుఁ డొప్పగున్.

ఇఁక నేనింటికివెళ్ళి ముందుచేయవలసిన కార్యమునుగుఱించి యాలో చించెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

[వసంతోత్సవమునకుఁ దగినవేషము వేసికొని, పీఠముమీఁదఁగూర్చుండి వసంతకునితోఁగూడ రాజు ప్రవేశించుచున్నాఁడు]

వత్స—(సంతోషముతో) ఓయీ! వసంతకా!
వసం—స్వామీ! ఏమి సెలవు?

వత్స—సీ. రాజ్య మంతయుఁ జాల రాజిల్లు చున్నది
లేశంబు రిపుబాధ లేక యుండ
కార్యభారము నెల్ల గౌరవ మారంగ
యోగ్యుఁడౌ మంత్రియుం దుంచినాఁడ
సత్పాలనముచేత సంతుష్టులై యున్న
వారలు ప్రజలెల్ల బాధలేక
ప్రద్యోతనందన రసికురాలగు భార్య,
సంతోషకర మీావసంత వేళ
నీవు సఖుఁడవు; వీని యన్నింటిచేత
హృదయమునను నానందము వృద్ధి గనెను
నార! మన్మథోత్సవ మనుపేరె కాని.
యిదియు నామహోత్సవ మని యెంతు నేను.

వసం—మిత్రుఁడా! సత్యము. అయినను నేనిట్లు తలఁచెదను. ఇది మీదియుఁగాదు కామదేవునిదియుఁగాదు. ఎవనిరాకచే నిట్లు శోభిల్లుచున్నదని ప్రియమిత్రులయిన దేవరవారు సెలవిచ్చియున్నారో, అట్టిబ్రాహ్మణవటువునయిన నాయొక్కనిదే యీమహోత్సవము. (చూచి) ఇక్కడనేమున్నది? అదిగో ముందుచూడుఁడు. మధుపానముచేత మత్తురాండ్రయిన కామినులు పెనఁగులాడి పుచ్చుకొని చిమ్మనగొట్టములతోఁ గొట్టుచున్న నీటిదెబ్బలకు గంతులువేయుచు నాగరజను లీప్రకారముగా సంతోషించుచున్నారో! అంతట నిండి బోరు కలఁగుచున్న మద్దెలనాదములచే నధికమగు చర్చరీధ్వనులతోను, ఖండొడులు చల్లుకొనుటచే దశదిశలయందును వ్యాపించిన గంధపొడితోను, రాజవీధిదివరను జరుగుచున్న మహోత్సవముయొక్క శోభను అల్లక్కను జూడుఁడు,

వత్స—(సంతోషముతో కలయఁ జూచి) ఓహో! పౌరుల ప్రమోదమునకు పరిమితి గానరాకున్నది!

సీ. అల్లదె కనుగొనుమా ప్రక్కబుక్కాను
జను లొండొరులమీఁదఁ జల్లుకొనుచు
ప్రొద్దుటికెంజాయఁ బోలెడికుంకుము
పొడి దేహములనిండఁ బోసికొనఁగ
భరముచే వంగినశిరసుల నరజాతి
యులరులదండ లుయ్యాల లూఁగ
కాయమునిండ బంగరునీరు పూసిన
పదువునను బసిండివలువ లమరఁ
గనకభూషణసందోహ కాంతు లడర
విత్తపతికోశమును దనవిభవమునను
దెగడి కౌశాంబినగరంబు తేజరిలెడు
నచ్చటనుగన్న నొక్కటే వచ్చనగుచు.

సీ. ఆపైని దిలకింపు మదిగొ ధారాయంత్ర
ములనుండి పైకి జుమ్ముననువెడలి
అంతట నిండు నిరంతర బహునీర
ధారలచేతను దడపఁబడుచు
హాయిగా నృత్యంబు చేయుచు నున్నట్టి
జనసమూహంబుల చరణహతుల
గట్టిగా నలిగినదట్టంపుటడుసు సోచు
నలరారుచున్న దీప్రాంగణంబు
పడఁతులకపోలములనుండి పడెడునట్టి
సాంద్రసిందూరరజమును జనులు త్రొక్క

యరుణ మగుపాదములతోడ నందు నడువ
నెంతయును బురకుట్టిమం బెఱ్ఱనయ్యె.

వసం—(చూచి) మిత్రోత్తమా! ప్రౌఢులయినజనులు బలము కొలఁదిని లాగి విడుచుటచే చిమ్మనగ్రోవులనుండి బుస్సుమని వచ్చు నీటిధారలచేత మనోహర మయి వేశ్యాంగనలచేనొప్పుచున్న యీవైపునకుఁ జూడుము.

వత్స—(చూచి) నీవు చక్కఁగా కనిపెట్టితివి!

ద్విపద. బుక్కాపొడులచేతఁ బొడమినయట్టి
చిక్కనిచీకట్లు మిక్కిలి గ్రమ్మ
మణిమయకాంచన మండన కాంతు
లణుమాత్రము వెలుంగ నాసందునుండి
యెత్తినఫణములమొత్తంబు లనఁగ
నలభుజంగసమూహ మగపడి యిపుడు
తలఁపించెదును రసాతలమును మిగుల.

వసం—(చూచి) చెలికాఁడా! అదిగో మదనోత్సవమునకుఁ దగిన యభినయముతో వర్తించుచు, మదనికయు చూతలతికయు నీవంకనే వచ్చుచున్నారు. దేవరవారు చూడవలెను.

[మదలీలల నటించుచు, ద్విపదీఖండమును పాడుచు, ఇద్దఱు చేటికలు ప్రవేశించుచున్నారు]

మద—(పాడుచున్నది)

ద్విపద. మావిగున్నల క్రొత్తతావులగొంచు
పూవుఁబోఁడులమానములు హరించుచును
మరుదూతయనవొప్పు మలయమారుతము
కరము చల్లగ వీఁవగాఁ జొచ్చె నిపుడు.

చూత—ద్విపద. విరిసినపొగడలు పరిమళింపంగ
కరమును బ్రియులరాకల నపేక్షించి
కాలహరణ మొనర్పఁజాల కియ్యెడను
జాలంగ జవరాండ్రు సంచరించెదరు.

మద & చూత—

ద్విపద. జనులడెందముల వసంతుండె యిపుడు
మునుమున్న మృదులంబు లొనరించి యుంచ,
ప్రసవాస్త్రుఁ డావెన్క వడిగలయట్టి
కుసుమబాణంబులు గొంచు శాసించు.

వత్స—(చూచి) ఓహో! నిర్భయమయిన వీరియాయాట యెంత రమ్యముగా నున్నది!

సీ. మద్యపానముచేత మత్తెక్కియాడెడి
భామినులయురోదభారమునను
వంగిననడుమును వగవుఁగో వీక్షించి
యాబాధకును మూలమయినయట్టి
వక్షస్థ్సలంబును శిక్షించుగతి హార
ములు మాటికిని ఱొమ్ము మోఁదఁదొడఁగ
కమ్మఁగొనఁగాలేక కాంతిహీనము లౌచు
సరగున విరిసరుల్ జాఱఁజొచ్చె
తాఱుమాఱౌచుఁ గేశబంధంబు వీడి
వ్యాకులతఁ జెందఁగాఁజొచ్చె నతిశయముగ
పాదములమీఁద వ్రాలి కంపంబు మిగుల
ద్విగుణముగ వందితులు మొఱపెట్టఁ దొడఁగె.

వసం—(నవ్వుచు) మిత్రుఁడా! నేనుకూడ బద్ధరిశరముల

గలవారి మధ్యను జేరి యాడుచుం బాడి, మదనమహోత్సవమును గౌరవింతువా?

వత్స—(చిఱునవ్వు నవ్వి) చెలికాఁడా! అలాగున నేచేయుము.

వసం—దేవరయాజ్ఞాప్రకారముగా చేసెదను. (లేచి, వారి మధ్యను నృత్యము చేయుచున్నాఁడు) ఓమదనికా! ఓసి చూత లతికా! ఈచర్చరీకమును నాకుఁ గూడ నేర్పెదరా?

మద—ఓయిభ్రష్టా! ఇది చర్చరీకము కాదు.

వసం—మఱి యేమిటిది?

మద—ఇది ద్విపదీఖండము కాదా?

వసం—అలాగే కానిమ్ము. ఈఖండముతో మోదకములు చేసెదరా? లడ్డువులు చేసెదరా?

మద—(నవ్వి) కాదుకాదు. ఇది పాడెడిది కాదఁటయా.?

వసం—(విస్మయముతో) ఇది పాడెడిదా! (విషాదముతో) ఇది పాడెడి దేయయి భుజించెడిది కానిపక్షమున దీనితో నాకుఁ బ్రయోజనములేదు. చక్కఁగా నాప్రియమిత్రునిదగ్గఱకే నేను పోయెదను. (అప్రకారముగా నడిచి యావలకుఁ బోయి కూరుచున్నాఁడు)

ఉభ—(ముందుకు లాగుచున్నారు)

వసం—(వెనుకకు లాగుచున్నాఁడు)

మద—(చేయి పట్టుకొని లాగుచు) ఓయిమహాత్మా! రా. ఎక్కడకుఁ బోయెదవు? ఇక్కడనే యాడుదము. (అనిబహువిధముల గొట్టుచున్నది)

వసం—(చేయి లాగుకొని, రాజుకడకు పడిగఁ బరుగెత్తి) మిత్రుఁడా! నేను నృత్యము చేసితిని.

వత్స—చెలికాఁడా! ఆడితివి.

వసం — కాదు. అది పలాయితుఁడ నయితిని.

చూత — ఓసీ! మదనికా! మనము చాలసేపు నృత్యము చేసితిమి. రాణిగారిసందేశము నిప్పుడు మహారాజుగారికి విన్నవింతము రమ్ము.

మద — చూతలతికా! చక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చితివి! ఆలాగు ననే చేయుదము. (దగ్గఱకు వెళ్ళి) దేవా! జయము గుఁగాక! రాణిగారీప్రకారముగా నాజ్ఞాపించు చున్నారు—(అని సగము చెప్పి, లజ్జ నభినయించి) కాదుకాదు. విజ్ఞాపించు చున్నారు.

వత్స — (హర్షముతో నవ్వి, సాదరముతో) మదనికా! ఆజ్ఞాపించుచున్నా రనుటయే రమణీయముగా నున్నది. విశేషించి యిది మదనమహోత్సవము. దేవిగా రేమి యాజ్ఞాపించినారు.

వసం — ఓసి కానిసకూఁతురా! ఏమి? దేవిగా రాజ్ఞాపించు చున్నారా!

ఉభ — ఈప్రకారముగా రాణిగారు విన్నవించుచున్నారు— నే నిప్పుడు మకరందోద్యానమునకు వెళ్ళి రక్తాశోకవృక్షముయొక్క మొదటను పూజనీయుఁ డయిన మన్మథుని స్థాపించి, పూజ చేయఁ బోవుచున్నాను. అక్కడకు దేవరవారు విజయంచేసి సన్నిహితులయి యుండఁదగును.

వత్స — మిత్రుఁడా! చెప్పవలసిన దేమున్నది? మనకు ఉత్సవములమీఁదనే యుత్సవములు వచ్చుచున్నవి.

వసం — మిత్రుఁడా! అట్లయిన లెమ్ము. మన మక్కడ వెళ్ళుదము. అక్కడ బ్రాహ్మణబాలుఁడ నయిన నాకును స్వస్తివచనిక మీఁదయిన లభింపఁ గలదు.

వత్స—మదనికా! నీవు వెళ్ళి. ఇదిగో మేమును మకరందో ద్యానమునకు వచ్చితిమని రాణిగారితో విన్నవింపుము.

చేటికలు—దేవర సెలవుప్రకారము చేసెదము.

(వెళ్లుచున్నారు.)

వసం—మిత్రుఁడా! దిగుదము రా!

(ఇద్దఱును మేడ దిగుట నభినయించు చున్నారు.)

వత్స—మిత్రుఁడా! మకరందోద్యానమునకు బ్రోవతీయుము.

వసం—దేవా! రండి. రండి. (నడచుచున్నారు.)

వత్స—(ముందుపంకఁ జూచి) అదిగో మకరందోద్యానము. అందుఁ బ్రవేశింతము రండి. (ప్రవేశించుచున్నారు.)

వసం—(విస్మయముతో) ఓ మహారాజా! చూడుము, చూడుము. మలయమారుతముచేఁ గదలుచున్న గుండ్రని తియ్యమామిడి పూగుత్తులను మేలుకట్టును గట్టుకొని, మదించినతుమ్మెదమొత్తముల ఝుంకారములతోఁ గలిసిన కోకిలాలాపములను సంగీతముచే సుఖము నిచ్చుచు, మకరందోద్యానము దేవరరాక కయి యాదరముతో నెదురు చూచుచున్నదానివలెఁ గనఁబడుచున్నది. కాఁబట్టి దేవర యందుఁ బ్రవేశింపఁదగును.

వత్స—(అంతటనుగలయఁజూచి) ఆహా! ఏమి యీమకరందో ద్యానము యొక్క రమ్యత!

చ. పవడపుఁగాంతి నొప్పెసఁగుపల్లవజాతముచేత నెఱ్ఱనై,
తవలను భృంగరావ మనువ్యక్తముకానిచలోక్తు లొప్పఁగాఁ
బవనవశంబునం గదలి వ్రాలెడికొమ్మలఁ గూడి, వృత్తముల్
మివ్వుల మధుప్రసక్తి నవె మించెను మత్తతఁగన్న కైవడిన్.

సీ. మాలంబునను దొల్లి ముద్దియల్ కన్నని
సురనమియుంగ నాపరిమళంబె
నలుగడల నిపుడు వలమెడునో యనం
బుష్పవృష్టుల నొప్పం బొగడచెట్టు
మధుపానమునను దాన్రమణు లైనమోముల
నగుటచేం బూచిననాంటిపూలె
విడువక యుండెనా విరులమొత్తముతోడ
భాసిల్లెడు నిదె సంపంగిచెట్టు
కామిను లశోకవృక్షంబుం గాలు సాంచి
తన్నినప్పటినూపురధ్వనిని వింటుం
జెలంగి యామోాత ననుకరించెడు ననంగ
భృంగపంక్తులు మోాసెడుం బ్రియుండ వినదె.

వస—(ఆలకించి) మిత్రుండా! అది తుమ్మెద లందియు మోాత ననుకరించుట గాదు. రాణిగారియొక్కయు పరిజనము యొక్కయు కేవల నూపురశబ్దమే.

[వాసవదత్తయు, కాంచనమాలయు, పూజోపకరణములను గ్రహించి సాగరికయు, పరివారమును ప్రవేశించుచున్నారు.]

వాస—ఓసీ! కాంచనమాలా! నాకు మకరందోద్యానము నకు మార్గమును గనంబఱుపుము.

కాంచ—దేవీ! ఇదిగో రండి.

వాస—(ముందుకు నడిచి) ఓసీ! కాంచనమాలా! మనము మదనపూజ చేయువలసిన రక్తాశోకవృక్ష మిక్కడ కెంతదూరము నున్నది!

కాంచ—దేవీ! సమీపములోనే యున్నది. అదిగో చూడు మొప్పుడును విడువకుండఁ బుష్పములతో నిండియుండు మీరు పెంచిన మాధవీలత. అకాలమునందు పూచునట్లు చేయుటకయి యనుదినము రాజుగారు తమమనస్సు నాయాసపెట్టుకొనచున్న నవమాలిక కదా యాపయిది? దానిని దాఁటినతోడనే పూజ నిర్వర్తింపవలసిన రక్తాశోకవృక్షము కనఁబడును.

వాస—అట్లయినచో రమ్ము. అక్కడకు శీఘ్రముగాఁ బోదము.

కాంచ—దేవీ! రండి రండి. (అందఱును నడుచు చున్నారు)

వాస—ఇదిగో రక్తాశోకవృక్షముదగ్గఱకు వచ్చితిమి. ఇక్కడ నేను పూజ చేయవలెను. రమ్ము! పూజోపకరణములు తెమ్ము.

సాగ—(దగ్గఱకు వచ్చి) దేవీ! ఇవిగో, అన్నియు సిద్ధముగా నున్నవి.

వాస—(నిరూపించి మనస్సులో) అయ్యో! ప్రమాదము సంభవించినదిగదా! ఇంతకాలము నేనెవరిని రాజుగారియొక్కదృష్టి పథమునందుఁ బడకుండఁ బ్రయత్నముచేతఁ గాపాడుచు వచ్చితినో యామెయే యిప్పుడు రాజుగారికంటఁ బడుట తటస్థించినదిగదా! కానిమ్ము. ఈప్రకారముగాఁ జేసెదను. (ప్రకాశముగా) ఓసీ! సాగరికా! మదనమహోత్సవమునందు పరవశురాండ్రయి యుండు పరిజనమువద్ద శారికను విడిచిపెట్టి యిప్పుడు నీవెందుకువచ్చినావు? పూజోపకరణములను కాంచనమాలచేతికిచ్చి, నీవక్కడకు శీఘ్రముగా వెళ్ళు.

సాగ—దేవిగారియాజ్ఞాప్రకారము చేసెదను. (అలాగునఁ జేసి, కొన్నియడుగులు నడిచి, మనసులో) శారికను సుసంగతచేతి

కిచ్చి వచ్చితిని. ఈపూజ చూడవలెనని నాకు కుతూహలముగాఁ నున్నది. మాతండ్రిగారి యంతఃపురమునం దేప్రకారముగా వర్ణింపఁ బడునో చూచి, అక్కడ పూజాసమయమగులోపల నిక్కడ నేనును పూజచేయుటకయి పూవులను గోసి తెచ్చుకొనెదను. (అని నడచి, పూవులు కోయుచున్నది.)

వాస—కాంచనమాలా! అశోకమునందు కామదేవునిం బ్రతిష్ఠింపుము.

కాంచ—దేవిగారి సెలవుప్రకారముచేసెదను. (అప్రకారము చేయుచున్నది.)

వసం—(ముందుకు నడిచిచూచి) ఓమిత్రుఁడా! అందెలచప్పుడఁడగినది గనుక, దేవిగా రశోకమూలమునకు వచ్చిరని యూహించెదను.

వత్స—చక్కఁగాఁ గనిపెట్టినావు. చూడు మాను దేవియే కదా?

గీ. పుష్పసుకుమారమైనట్టిమూర్తి దాల్చి
తనుతరంబగుమధ్యంబు తనరుచుండఁ
గమ్మవిల్తునిపార్శ్వభాగమున నున్న
కుసుమచాపమో యన దేవి గొమరుమీరె.

దగ్గఱగా వెళ్ళుదము రా. (చేరువకు వెళ్లుచున్నారు.)

వత్స—(సమీపించి) ప్రాణేశ్వరీ! వాసవదత్తా!

వాస—(చూచి) నాథా! దేవరకు జయమగుఁగాక! పీఠమును స్వీకరించి దేవరవారీప్రదేశము నలంకరింతురుగాక! ఇదిగో పీఠము. దేవర యిందుఁగూర్చుండుఁడు.

వత్స—(కూరుచున్నాఁడు.)

కాంచ—దేవీ! స్వహస్తములతో నర్పించిన పుష్పములు కుంకుమము, చందనము, వస్త్రము, వీనిచే నలంకరింపఁబడిన రక్తాశోక వృక్షముదగ్గఱకు వెళ్ళి, భగవానుఁడయిన మన్మథు నర్చింపుఁడు.

వాస—పూజోపకరణములను నాయొద్దకుఁ దీసికొనిరా.

కాంచ—(తీసికొని వచ్చుచున్నది.)

వాస—(పూజ చేయుచున్నది.)

వత్స—ప్రాణనాయికా! వాసవదత్తా!

గీ. క్రొత్తగా మజ్జనంబాడి కొమరుమిగులఁ
దోపుచీరను ధరియించి తుంటవిలుతు
భక్తిఁ బూజించు నీవు ప్రవాళవిటపి
నాశ్రయించిన లతవలె నలరె దిపుడు.

గీ. స్మరునిఁ బూజింప హస్తంబు సాఁచి నీవు
ముట్టుకొనుటచేత నశోకభూజ మదిగో
మృదుతరంబగు! క్రొంజిగు రొదవినట్లు
కాంతిమీఱెడుఁ జూడు మోకలికి మిన్న.

క. నీపాణిస్పర్శన మిటు
ప్రాపింపఁగరామి నిపుడు పద్మాస్త్రుఁడు సం
తాపించుఁజుమీ తప్పక
యీపట్టునఁ దా ననంగుఁ డిలనగు కతనన్.

కాంచ—దేవీ! మన్మథపూజయయినదిగదా? ఇఁక భర్తకును పూజాసత్కారము సల్పుము.

వాస—అవును. పుష్పములను విలేపనములను దీసికొనిరా.

కాంచ—దేవీ! సర్వమును సిద్ధముగా నున్నది.

వాస—(రాజును పూజించుచున్నది.)

సాగ—(పూలు పట్టుకొని) అయ్యో! పువ్వులు గోయుట యందలి లాలసచేత తడవు మసలితిని! ఆసిందువారవృక్షముచాటున దాగియుండిచూచెదను. (చూచి) ఏమీ! అపూర్వముగా మన్మథుఁడు ప్రత్యక్షమే యయినాఁడు! మాతండ్రిగారి యంతఃపురమునందు మన్మథుఁడు చిత్తరువునందు పూజింపఁబడును. ఇక్కడ ప్రత్యక్షమగుచున్నాఁడు. ఇక్కడనేయుంట నేనును భగవంతుఁడయిన యామన్మథుని బూజించెదను. (అని పూవులు వేయుచున్నది) ఓ కామదేవా! నీకు నమస్కారము. నాకు శుభదర్శనము కాఁగలదు. చూడఁదగిన పదార్థమును నేనుజూచితిని. నీవు నాకమోఘదర్శనుఁడవు కాఁగలవు. (అని ప్రణామము చేయుచున్నది.) ఏమి యీయాశ్చర్యము! ఎంతసేపు చూచినను మరలఁజూడదగినవాఁడుగానే యున్నాఁడు! నన్నెవ్వరును జూడకమునుపే నేనిక్కడనుండి పోవలెను. (అని కొన్నియడుగులు నడుచుచున్నది.)

కాంచ—అయ్యా! వసంతకా! ఇప్పుడు నీవునువచ్చి స్వస్తివాచనికముం బుచ్చుకొమ్ము.

వస—(దగ్గఱకు వెళ్ళుచున్నాఁడు.)

వాస—(విలేపన పుష్పాభరణ దానపూర్వకముగా)అయ్యా! ఇదిగో స్వస్తివాచనికముం బరిగ్రహింపుము. (అని యిచ్చుచున్నది.)

[నేపథ్యమునందు వైతాళికుఁడు.]

ఉ. కాంతిసమస్తముం బొలఁగి క్రొన్నవభాస్కరుఁ డస్తమించి సా
యంతనమౌట భూరమణులందఱులందఱు నిందునిఁబోలునీదు కం
జాతరుచిన్హరింపఁగను జాలినపాదము లాశ్రయింప న
త్యంతముఁ గాచియుండెదరు హర్షముతో సభ వత్సభూవరా,

సాగ—(విని, హర్షముతో వెనుకఁదిరిగి రాజునుజూచియు త్తో) ఏమి! మాతండ్రిగాను నన్నిచ్చెదమన్నవత్సమహారాజుగారు యీయన! (నిట్టూర్పు విడిచి) పరులసేవకుకుదుటచే దూషితమయ్యాను, శరీరమీాయనదర్శనముచే సత్కరింపఁబడినది.

వత్స—ఏమి! మనమునన్నులు ఉత్సవములో లగ్నమయిపోయి సంధ్యాసమయము మతిక్రమించినను తెలిసికోఁజాలకున్నాము! దేవీ! చూడుము.

గీ. ఉదయతటముమఱుంగున నొదిగి చంద్రుఁ
డుంటఁ బ్రాగ్దిశ సూచించుచున్న దదిగో
ముందు పాండువర్ణముగలముఖముచేత
వెలఁది హృదయస్థితుండగు ప్రియునివోలె.

దేవీ! మనము లేచి, యింటికి వెళ్ళుదము. (అందఱును లేచి నడుచుచున్నారు.)

సాగ—అదిగో దేవిగారుబయలుదేఱినారు. నేనుత్వరితముగా వెళ్ళెదను. (రాజును ఆశమీాఱఁజూచి నిట్టూర్పువిడిచి) ఏమి! మందభాగ్యురాలయిన నేను యీయనను తనివుచూచుటకయినను వల్లకాకపోయెను! (అని నిష్క్రమించుచున్నది)

వత్స—(నడుచుచు) దేవీ!

సుగంధి. చందురుం దిరస్కరింపఁ జాలు నీముఖాభకున్
గఁది యంబుజంబు చూడు కాంతిహీనమయ్యెమున్;
వందిసీసఖీజనంబుపాట కోడి తుమ్మెదల్
ముందు సిగ్గుచేతఁ ధమ్మిమొగ్గలందు దాఁగెనుఁ.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## ద్వితీయాంకము.

ప్రదేశము — ప్రమదావనము

[శారికాపంజరమును చేతఁబట్టుకొని సుసంగత ప్రవేశించుచున్నది]

సుసం—ఈశారికను నాచేతికిచ్చి, నాప్రియసఖ యైనసాగరిక యిప్పుడెక్కడకు వెళ్లియుండును? (అవంకఁజూచి) అదిగో నిపుణిక యిచ్చటికే వచ్చుచున్నది. దాని నడిగెదను.

[అంత నిపుణిక ప్రవేశించుచున్నది]

నిపు—రాజుగారు చెప్పిపంపిన యీవర్తమానమును నే నిప్పుడే వెళ్ళి రాణిగారితో చెప్పవలెను. (అని నడుచుచున్నది)

సుసం—చెలియా! నిపుణికా! ఇది యేమి? ఎక్కడనో ధ్యానమున్నదానివలె, ఇక్కడ నన్నుఁజూడకనే దాటిపోవుచున్నావు!

నిపు—సుసంగతవా? చెలియా! నీవు చక్కఁగాఁ గనిపెట్టితివి. నాపరాకునకు కారణము చెప్పెదను వినుము. రాజుగారు శ్రీశైలమునుండి వచ్చిన శ్రీకంఠదాసుఁ డనువానివలన అకాలమున పూవుపూచునట్లు చేయు దోహదమును నేర్చుకొని, తాము పెంచిన నవమాలికను పుష్పసమృద్ధిగలదానినిగాఁ జేయఁదలఁచి, ఆవృత్తాంతమును రాణిగారితో చెప్పుమని యిప్పుడు నన్నుఁ బంపిరి. నీవు మరల నెక్కడకు వెళ్ళుచున్నావు?

సుసం—ప్రియసఖ యైనసాగరికను వెదకుటకొఱకు.

నిపు—సఖీ! చిత్రఫలకమును లేఖినిని చేతఁబట్టుకొని తొందరగా కదళీగృహమునకు వెళ్ళుచుండఁగా సాగరిక నిప్పుడే నేను చూచినాను. నీవక్కడకు వెళ్ళుము. నేనును రాణిగారికడకుఁ బోయెదను. (అని నిష్క్రమించుచున్నది.)

ప్రదేశము—కదళీగృహము

[చిత్రపుపలకను తూలికను పట్టుకొని, మన్మథావస్థ నటించుచు సాగరిక ప్రవేశించుచున్నది]

సాగ—ఓహృదయమా! శాంతిపొందుము. శాంతిపొందుము. ఒక్కసారి చూచుటవల్లనే యిట్లు సంతాపము వృద్ధిపొందించుచున్న ఆశామాత్రప్రయోజనముగల ఆదుర్లభపురుషునిమీఁది కోరికచేత ఫలమేమి! (విస్మయముతో) ఆహా! ఏమి నీమూఢత! మరల నతనినే చూచుట కభిలషించుచున్నావు! ఓ పాపహృదయమా! జన్మమెత్తినది మొదలుకొని కలసి యేకముగా బెరిఁగిననన్ను విడనాడి, క్షణమాత్రదర్శనమువలన పరిచితుఁడయినయాతనివెంట వెళ్ళుటకు సిగ్గుపడకున్నావు! ఇందు నీదోష మేమున్నది? మన్మథబాణభీతిచేత నీవిట్లు చేయుచున్నావు. కానిమ్ము. నేనిప్పుడు మన్మథుని వేడుకొనెదను. (కన్నీరు పెట్టుకొని, దోసిలియొగ్గి, మోకాళ్లమీఁదఁగూరుచుండి) భగవంతుఁడ వైనయోయిమన్మథా! సకలసురాసురులను జయించిననీవు స్త్రీజనమును హింసించుట కేల సిగ్గుపడకున్నావు! అదిగాక నీవనంగుఁడవు. ఏవిధముచేతఁ జూచినను మందభాగ్యురాల నయిననాకు ఈనిమిత్తముచేత మరణము సమీపించిన ట్టున్నది. (పలకను చూచి) ఇక్కడికెవ్వరును రాకమునుపే, చక్కఁగాచూచి నేను కోరినపురుషుని వ్రాసెదను. (శద్ధతో నాకరూపమును వ్రాయఁబూని పలక పుచ్చుకొని, నిట్టూర్పు విడిచి) అతిసాహసముచేత నా కుడిచేయి మిక్కిలి వడఁకుచున్నది. అయినను ఆయనరూపమును దర్శించుటకు మఱియొకయుపాయము లేదు. కాఁబట్టి యెట్లాగున నయిన ఆయనను వ్రాసి చూచెదను. (అని వ్రాయుచున్నది)

[శారికాపంజరముతో సుసంగత ప్రవేశించుచున్నది]

సుసం—ఇదె కదళీగృహము. నేనిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి చూచి విస్మయముతో) నాప్రియసఖ యయిన యీ సాగరిక యధికానురాగము కలదానివలె నేమో వ్రాయుచున్నది. అది యగుపడకుండ ఆమెకు కనఁబడకుండ దాఁగియుండి చూచెదను. (ఆమెవెనుకకు మెల్లగావచ్చి నిలుచుండి చూచి సంతోషముతో) ఇది యేమి! రాజుగారిని వ్రాసినది! మేలు! సాగరికా! మేలు! రాజహంసి పద్మాకరమును విడిచి మఱి యెక్కడను క్రీడింపఁబోవదు.

సాగ—(కన్నీటితో) దీనిని నేను వ్రాసిన ప్రయోజనమేమి! ఎడతెగకుండ కాఱుచున్నకన్నీటిచేత, నాదృష్టి చూచుటకుఁ జాల కున్నది. (ముఖము పయికెత్తి కన్నీటిని తుడుచుకొనుచు, సుసంగతను జూచి ఉత్తరీయముతో పలకనుమూసి, చిఱునవ్వుతో) ఏమి! ప్రియసఖీ! సుసంగతా! (అని లేచి చేయిపట్టుకొని) సఖీ! సుసంగతా! ఇక్కడ కూర్చుండుము.

సుసం—(కూర్చుండి బలవంతముగా పలకను పుచ్చుకొని చూచి) సఖీ! నీవిందు వ్రాసిన యీతఁ డెవఁడు?

సాగ—(లజ్జతో) ఇప్పుడు జరిగినమదనమహోత్సవమునందలి పూజ్యుఁడైన మన్మథుఁడు.

సుసం—(చిఱునవ్వుతో) ఆహా! ఏమి నీ నేర్పు! ఇప్పుడీచిత్రము శూన్యమువలెఁ గనఁబడుచున్నది. నేనుకూడ రతిదేవిని వ్రాసి భార్యాసహితునిఁ జేసెదను. (తూలికను పుచ్చుకొని రతిమిషచేత సాగరికను వ్రాయుచున్నది.)

సాగ—(చూచి క్రోధముతో) సఖీ! నీవిక్కడ నన్ను వ్రాసితివేమి!

సుసం—(నవ్వి) సఖీ! నిష్కారణముగా కోపపడెద వేమి! ఎటువంటి కామదేవుని నీవు వ్రాసితివో, అటువంటి రతీదేవి నే నేనును వ్రాసితిని. నన్నన్యురాలినిగా భావించెదవు. ఈమాటలతో నేమి! సర్వవృత్తాంతమును జెప్పుము.

సాగ—(సిగ్గుతో తనలో) అయ్యో! నాప్రియసఖి కంతయుఁ దెలిసిపోయెనే! (ప్రకాశముగా) ప్రియసఖీ! నాకు తగనిసిగ్గు. నే నీలాగునఁ జేసినా నని యీ వృత్తాంతము నెవ్వరికిని దెలియ నీయకుము.

సుసం—సఖీ! సిగ్గుపడకు. ఇటువంటి కన్యారత్నమున కిటువంటి వరునియం దభిలాష మవశ్యకముగాఁ గలుగ వలసినదే. ఈవృత్తాంతము నే నితరుల కెవ్వరికిని దెలియనియ్యను. కాని మేధావినియైన యీశారిక మన మిప్పు డనుకొన్నమాటలను పట్టుకొని యెవ్వరివద్ద నయినను అనునేమో!

సాగ—(తొట్రుపాటుతో) అందుచేత నాకధికతర మయిన సంతాపము కలుగుచున్నది. (అని మదనావస్థ నటించుచున్నది)

సుసం—(సాగరికతొమ్మునీఁద చేయి యుంచి) సఖీ! ఊఱడుము. ఊఱడుము. ఆ కొలనియొద్దకుం బోయి తామరరేకులను తామరతూండ్లను దీసికొని శీఘ్రముగా వచ్చెదను, (వెళ్ళి తిరిగి ప్రవేశించి పద్మములతోను మృణాలయములతోను శయ్యను రచియించి, మిగిలిన తామరరేకులను సాగరికహృదయమును జేర్చుచున్నది)

సాగ—సఖీ! ఇందువలనను నాకధికతర మయిన సంతాపము

వేయుము. ఇంతతో చాలును. నిష్కారణముగా నీవేల ఆయాస పడెదవు!

గీ. దుర్లభజనాను రాగంబు. తొడరె నాకు
నాత్మ వివశ మయ్యెడు లజ్జ యధిక మగుచుఁ
బ్రియసఖీమణి ! విషమంబు ప్రేమసరయు
మరణ మొక్కటియే నాకు శరణ మింక.

(అని మూర్ఛపోవుచున్నది.)

సుసం—(ఖేదముతో) ప్రియసఖీ! సాగరికా లెమ్ము. లెమ్ము.

[తెరలో కలకలము]

చ. అరతెగి క్రిందవేలు మెడయందలి బంగరుగొల్సు నీడ్చుచున్
బరువడి ద్వారము ల్గడచి పాదములం జిఱుగంటచాల్ మనో
హరముగ మ్రోయ స్త్రీలజనియం జెదువానర మశ్వపాలకుల్
తురగవుసాలనుండి వడిఁ ద్రోలఁగ రాజగృహంబుఁ జొచ్చెడున్.

[తెరలోనే మరల]

చ. పురుషులనంగరామి నదె పొల్పటి వర్షవరు ల్త్రొలంగెదర్
దరమున వామనుండొదిగి దాఁగెడుఁ గంచుకి కంచుకంబులో
సరసనిజాభిధానమును సార్థమొనర్చెద రాకిరాతు, లా
యురుకపి తమ్ముఁ జూచునని యూడనిఁ బాడెద రల్లకుబ్జులున్.

సుసం—(అలకించి ముందువంకఁ జూచి తొట్రుపాటుతో లేచి సాగరిహస్తమును పట్టుకొని) సఖీ! లెమ్ము. లెమ్ము. అదిగో దుష్టవానర మీవంకనే వచ్చుచున్నది.

సాగ—మన మిప్డేమిచేయుదము!

సుసం—రమ్ము. ఈతమాలవిటపాంధకారమునందుఁ బ్రవే

శించి యది పోవుదాఁక నుందము. (అని వెళ్ళి యిద్దఱును వెదరి చూచుచు చాటున దాఁగుచున్నారు.)

సాగ—సుసంగతా! నీవు చిత్రఫలకమును విడిచివచ్చితివా యేమి? ఎవ్వరైనను దానిని చూతురేమో!

సుసం—ఓసి సుస్థిరులారా! ఇప్పుడును చిత్రఫలకముతో నేమిచేసెదవు? పెరుగును నన్నమును తినవలె నని యా చెడుకోఁతి శారికాపంజరమును తెఱచి పోయినది. మేధావినియైన యా శారిక మఱియొకవంక నెగిరిపోవుచున్నది గనుక, దాని వెంబడిని వేగిరము వెళ్ళుదము రమ్ము. మనసంభాషణముయొక్క యుత్తరములను గ్రహించిన యా శారిక యెవ్వరిముం దయినఁ బలికి పోవును.

సాగ—సఖీ! అలాగునఁ జేయుదము.

(అని యిద్దఱును వెళ్ళుచున్నారు.)

[తెరచాటున]

ఇహిహీ! ఆశ్చర్యము! ఆశ్చర్యము!

సాగ—(చూచి) సుసంగతా! మరల నాదుష్టవానరమేవచ్చు చున్నది చూచినావా?

సుసం—(చూచి నవ్వి) ఓసిపిఱికిదానా! భయపడకు. అతఁడు ప్రభుపార్శ్వవర్తి యగువసంతకుఁడు సుమా.

(అప్పుడు వసంతకుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

వసం—ఇహిహీ! ఏమి యాశ్చర్యము! ఏమి యాశ్చర్యము! శ్రీకంఠదాస! ధార్మిక! సాధు సాధు!

సాగ—సఖీ! వీనిని చూచుటవలన నేమి ప్రయోజనము? శారిక దూరముగాఁ బోయినది. కనుక, దాని ననుసరించి వెళ్ళు దము రా.

వసం—సాధు! శ్రీకంఠదాస! ధార్మిక! సాధు! ఆతఁడిచ్చినదోహదమాత్రమున నవమాలిక యిటువంటిదయినది. ఎడము లేకుండ వికసించి యున్నపుష్పగుచ్ఛములచేత శోభించు విటపములు గలదై దేవిగారు పెంచుకొన్నమాధవీలతను పరిహాసించుచున్నట్టున్నది. ఇది యంతయు నాప్రియమిత్రునకు వెళ్ళి చెప్పెదను. (ముందుకు నడిచిచూచి) అదుగో నాప్రియమిత్రుఁడు. ఈనవమాలికను చూడనివాఁడయ్యును, అతనిదోహదమునందలి విశ్వాసముచేత నవమాలిక పుష్పితమయి యుండఁగాఁ బ్రత్యక్షమునఁ జూచుచున్నవానివలెనే సంతోషముచేత వికాసము నొందిన కన్నులు గలవాఁడయి యిక్కడకే వచ్చుచున్నాఁడు. ఆతనిదగ్గఱకు వెళ్లెదను.

(అని రాజున కెదురుగా వెళ్ళుచున్నాఁడు)

[అప్పుడు రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—(సంతోషముతో)

సీ. అధికతరోత్కలికాళిచే నలరారి
పాండురవర్ణంబు పరఁగఁ దాల్చి
ప్రారబ్ధజృంభ యై మలుమాటు వెడలెడు
శ్వసనోద్గమంబులఁ జాలఁ దన్ను
నాయాసపఱచుచుకొం చభిరామ యయి యున్న
యీలతకూనను జాలవలపు
గొలిపెడుదానిని గుసుమాయుధావస్థ
నత్యంతమును బూని యలరుచున్న
యన్యకాంతనువలెఁ గన్నులారఁ జూచి
యతిశయంబుగ దేవిముఖాంబుజమును

నిపుడు కోపంబుచేతను నెట్టపడెదు
నట్లుగాఁ జేయఁగలవాఁడ నరయు నేను.

వసు—(వేగముగా సమీపించి) ప్రియమిత్రా! జయ మగుఁగాక! జయ మగుఁగాక! ఓమిత్రుఁడా! అదృష్టముచేత వర్ధిల్లుచున్నావు!

రాజు—మిత్రుఁడా! సందేహమేమి? మణిమంత్రౌషధము ప్రభావ మచింత నీయుముగదా?

చ. కలన నుపేంద్రుకంఠమణిఁ గాంచి విరోధులు నష్టులైరి, పా
ములును రసాతలంబునకుఁ బోయి వసించెను మంత్రభీతిచే,
వెలయఁగ లక్ష్మణుండుఁ గపివీరులుఁ బూర్వము మేఘనాధుచే
బలమఱి చచ్చి యౌషధపుబల్మిని జీవితులైరి క్రమ్మఱన్.

మార్గమును గనఁబఱుపుము. ఇప్పుడు మనము దానిని జూ కన్నులగలఫల మనుభవింతము.

వసం—(ఆటోపముతో) దేవర విజయం చేయుఁడు.

రాజు—నీవు ముందు నడువు.

ఉభయులు—(గర్వముతో) నడుచు చున్నారు.)

వసం—(ఆలకించి భయపడి వెనుకమరలి రాజు చేయిపట్టుకొని తొట్రుపాటుతో) మిత్రుఁడా! రమ్ము పాఱిపోదము.

రాజు—ఎందుచేత?

వసం—ఈవకుళవృక్షముమీఁద నేదో భూత మున్నది.

రాజు—ఛీ! మూర్ఖుఁడా! నిర్భయముగా నడువు. అటువంటి వాని కిక్కడ ప్రభావ మెట్లు కలుగును?

వసం—స్ఫుటాక్షరముతోనే పలుకుచున్నది. నామాటనమ్మ వేని, ముందుకు వెళ్ళి స్వయముగానే వినుము.

రాజు—(ఆలాగు చేసి ఆలకించి)

గీ. స్ఫుటముగా వినఁబడుచు నీసుస్వరంబు
స్త్రీస్వభావమునను గదుఁ దియ్యనగుచుఁ
జూడ నల్పాంగతను జేసి సూక్ష్మ మగుచు
నున్న దది శారిక యటంచు నెన్నువాఁడ.

(పయివంకఁ జూచి) అదిగో శారిక!

వసం—(ఆలోచించి) ఏమీ? సత్యముగా గోరువంకేనా?

రాజు—(చిఱునవ్వుతో) మిత్రుఁడా! అదిగో!

వసం—ఓ చెలికాఁడా! నీవు పిఱికివాఁడవు. ఈశారికను భూతమని తలఁచుచున్నావు.

రాజు—ఓరి మూర్ఖుఁడా! నీవు చేసినదానిని నామీఁద పెట్టుచున్నావు!

వసం—ఆలాగయిన, మిత్రుఁడా! నన్ను వారింపకుము. (రోషముతో దండకాష్ఠమును పయికెత్తి) ఓసి బానిసశారికా! వసంతకుఁడు నిజముగానే భయపడునని నీవెఱుఁగవా? ఒక ముహూర్తకాల మిచ్చట నిలువుము. కొండెములు చెప్పువారి మనస్సువలెనే కుటిలమయిన యీకఱ్ఱతో పరిపక్వమయిన వెలగపంటివలె నిన్నీవకుళ వృక్షమునుండి క్రిందపడఁగొట్టెదను.

(అని కొట్టఁబోవుచున్నాఁడు)

రాజు—(వారించి) ఓమూర్ఖుఁడా! అదియేమో మనోహరముగా పలుకుచున్నది. దాని నెందుకు బెదరఁగొట్టెదవు? పలికెడిదానిని విందము.

ఉభ—(వినుచున్నారు)

వసం—ఈబ్రాహ్మణునకు భోజనము పెట్టు మని పలుకు చున్నది.

రాజు—కుక్షింభరుడు సర్వమును భోజనవిషయమే పర్యవసితము చేయును. శారిక యేమిపలుకుచున్నదో నిజముగాఁ జెప్పుము.

వసం—(ఆలకించి) మిత్రుఁడా! అది యేమి పలుకుచున్నదో విన్నావా? "సఖీ! నీవింపుగ్రాసిన యీతఁ డెవరు?" అని పలికినది. "ఇప్పుడు జరిగిన మదనమహోత్సవమునందలి పూజ్యుఁ డయిన మన్మథుఁడు" అని పలుకుచున్నది. "సఖీ! నీవిక్కడ నన్ను వ్రాసితి వేమి?—సఖీ! నిష్కారణముగా కోపపడెద వేమి? ఎటువంటి కామదేవుని నీవు వ్రాసితివో, అటువంటి రతీదేవి నే నేను వ్రాసితిని. న న్నన్యురాలినిగా భావించెదవు. ఈమాటలతో నేమి? సర్వవృత్తాంతమును జెప్పుము"—ఓమిత్రుఁడా! ఇది యేమయి యుండును?

రాజు—'ఎవ్వతెయో యొకసుందరి యనురాగముచేత కామదేవుఁడను మిష పెట్టి తనహృదయవల్లభుని వ్రాసి చెలికత్తియకడ మఱుఁగు పెట్టినది. ఆచెలికత్తెయ గుఱుతుపట్టి, నేర్పుతో నామె నే వ్రాసి రతియను మిషచేత చూపినది' అని నే నూహించెదను.

వసం—(చిటికె వేసి) మిత్రుఁడా! సరిసరి! అంతే.

రాజు—చెలికాఁడా! ఊరకుండుము. మరల నేమో పలుకుచున్నది వినదము.

ఉభ—(వినుచున్నారు)

వసం—అది మరల నీలాగునఁ బలుకుచున్నది—"సఖీ! సిగ్గుపడకుము. ఇటువంటి కన్యారత్నమున కిటువంటివరునియం దభిలాష

మవశ్యముగాఁ గలుగవలసినదే'' — అట్లయిన, ఈవ్రాయఁబడిన కన్నియ చూడఁదగినదే.

రాజు—ఇప్పు డవహితుల మయి విందము. ఇక్కడమన వేడుకకు కావలసినంత యవకాశ మున్నది.

వసం—ఓమిత్రుఁడా! నీవే పండితుఁడ వని గర్వపడకుము. దాని ముఖమునుండి సర్వమును విని నేను వ్యాఖ్యానము చేసెదను.

ఉభ—(వినుచున్నారు)

వసం—మిత్రుఁడా! అది యేమన్నదో విన్నావా?—"సఖీ! ఇందువలనను నా కధికతరమయిన సంతాపము కలుగుచున్నది. ఈ నళినీపత్రములను మృణాళవలయములను దీసివేయుము. ఇంతతో చాలును. నిష్కారణము నీవేల ఆయాసపడెదవు?"

రాజు—వినుటమాత్రమే కాక యభిప్రాయమును సహితము తెలిసికొన్నాఁడను.

వసం—మిత్రుఁడా! నీచమయిన యీశారిక యింకను కురుకురుమనుచునే యున్నది. అంతయు విని వ్యాఖ్యానము చేసెదను.

రాజు—యుక్తమయినమాట చెప్పితివి. మరల విందము.

వసం—ఓమిత్రుఁడా! కానిగకూఁతురయిన యీశారిక చతుర్వేదములను జదివిన బ్రాహ్మణునివలెనే ఋక్కులు చెప్పుట కారంభించినది!

రాజు—నా మనస్సు మఱియొకదానిమీఁదికిపోయి వినలేదు. ఇప్పుడేమి పలికినదో చెప్పు.

వసం—ఓయీ! ఇట్లు పలుకుచున్నది—

గీ. దుర్లభజనానురాగంబు తొడరె నాకు
నాత్మ వివశ మయ్యెడు లజ్జ యధిక మగుచుఁ,

ప్రియసఖీమణి! విషమంబు ప్రేమ మరయ
మరణ మొక్కటియే నాకు శరణ మింక.

రాజు—(చిఱునవ్వుతో) మిత్రుఁడా! ఇటువంటి దొడ్డబ్రాహ్మణుఁడవు నీవుతప్ప నిట్టిబుక్కులను తెలిసినవాఁడు మఱి యెవఁడున్నాఁడు?

వసం—శారికపోయిన నిదియేమి?

రాజు—అదిగాథిక.

వసం—గాథికా! అది యెవరిచేఁ జెప్పఁబడినది?

రాజు—మిత్రుఁడా! ప్రియతముని బొందలేనట్టియు శ్లాఘ్యయౌవనవతి యైనట్టియు నొకానొకతెచేత జీవితాశ లేకపోవుటచే పలుకఁబడినది.

వసం—(బిగ్గరగా నవ్వి) ఓయీ! ఈ వక్రభాషణము లేల? 'నన్నే పొందలేనట్టి' యని ఋజువుగా నే యేల పలుకరాదు? నీవేగాని యెడల మన్మథుఁ డను మిషచేత మఱుఁగుపఱుపఁదగినవాఁ డన్యుఁ డెవ్వఁ డున్నాఁడు?

(అని చప్పటలుగొట్టి బిగ్గరగా నవ్వుచున్నాఁడు)

రాజు—(పయికిఁ జూచి) ఓరి మూర్ఖుఁడా! నీవు బిగ్గరగా నవ్వుటచేత బెదరి శారిక యెక్కడికో యెగిరి పోయినది.

(అని చూచుచున్నాఁడు)

వసం—(చూచి) మిత్రుఁడా! మఱియొకలాగున తలఁపకుము. అది కదళీగృహమునకే వెళ్ళినది. వెంబడింతము రమ్ము.

(అని వెళ్ళుచున్నారు)

రాజు—గీ. కన్నియలు పుష్పశరబాధఁ గలఁగుచుండి
సఖులముందఱఁ బలికినసంగతులను
చిలుకలును శారికలు నేర్చి పలుకుచుండ
వినెడుధన్యులచెవులకు విందు గొలువు.

వర్ణితదేశము—కదళీగృహము.

[వసంతకుఁడును రాజును ప్రవేశించుచున్నారు.]

వసం—ఓమిత్రుఁడా! ఇదిగో కదళీగృహము. ఇందుఁ బ్ర శింతము. (ఇద్దఱును ప్రవేశించినమీఁదట) ఓయీ! బానిసకూతురై శారికయొక్క యన్వేషణప్రయత్న మిఁక చాలును. మలయమా తముచేఁ గదులుచున్న బాలకదళీదళశీతల మయినయీశిలాతలమ నందు ముహూర్తమాత్రము కూర్చుండి విశ్రమింతము.

రాజు—నీయిష్టప్రకారము చేయుదము. (అని కూరుచుం నిశ్వసించి మరల)—

గీ. కన్నియలు పుష్పశరబాధఁ గలగుచుండి
సఖులముందఱఁ బలికినసంగతులను
చిలుకలును శారికలు నేర్చి పలుకుచుండ
వినెడుధన్యుల చెవులకు విందు గొలువు.

వసం—(ప్రక్కనుజూచి) ఓమిత్రుఁడా! అది దుష్టవానరము తలుపు తెఱచిపోయిన యీశారికయొక్క పంజర మయియుండును.

రాజు—మిత్రుఁడా! చూడుము.

వసం—మీరాజ్ఞాపించినట్లు చేసెదను. (సమీపించి చూచి) అదిగో చిత్రఫలకము. దానిని పుచ్చుకొనెదను. (పుచ్చుకొని చూచి హర్షమును కనఁబఱచుచున్నాఁడు.)

రాజు—(కౌతుకముతో) మిత్రుఁడా! అది యేమి?

వసం—నీవదృష్టవంతుఁడవు. నీవే యిందు వ్రాయఁబడినావు. "నీవే కానియెడల మన్మథుఁ డనుమిష చేత మఱుఁగుపడుపఁ దగినవాఁ డన్యుఁ డెవ్వఁడున్నాఁడు?" అని నేనన్నది నిజమే.

రాజు—(హర్షముతో చేయి సాఁచి) సఖుఁడా! చూపుము చూపుము.

వసం—నీకు చూపను. ఆకన్యకయు నిక్కడ వ్రాయఁబడి యున్నది. ఏమియు పారితోషికము లేకుండ నిటువంటికన్యారత్నము నూరక చూపుదునా?

రాజు—ఇదిగో పుచ్చుకొమ్ము. (అని హస్తకటకము నిచ్చి బలాత్కారముగ పుచ్చుకొని చూచి విస్మయముతో) మిత్రుఁడా! చూడు.

గీ. చిత్రగతమైన యీసరసీరుహాక్షి
పక్షపాతంబు చూపుచు వారిజంబు
నందముగఁ గదల్చుచు రాజహంసివోలె
మానసం బలరించెడు మఱియు మఱియు.

గీ. వారిజభవుండు సుందరివదనమనెడు
నమృతాఖండచంద్రుని నమరఁ జేసి
తనదుపీఠపద్మము ముకుళనము నొంద
దుఃస్థితుండయి యుండును ధ్రువము గాను.

(అంత సాగరికయు సుసంగతయు ప్రవేశించుచున్నారు.)

సాగ—సఖీ!సుసంగతా!ఇఁక శారిక మనకుదొరకదు. అకదళీగృహమునుండి చిత్రఫలకమునైన తెచ్చుకొని వేగిరము వత్తము.

# ద్వితీయాంకము

సుసం—సఖీ! అలాగునఁ జేయుదము. (అని సమీపమున వెళ్ళుచున్నారు.)

వసం—ఓమిత్రుఁడా! ఎందుచేత నామె యవతనముఖి వ్రాయఁబడినది?

సుసం—(ఆలకించి) సఖీ! వసంతకుఁడు మాటాడు దానినిబట్టి రాజునునిక్కడనే యుండియుండునని యూహించెదను. కదళీగృహపు పొదలోపల దాఁగియుండి చూతము. (అని వినుచున్నారు.)

రాజు—మిత్రుఁడా! చూడుచూడు.

గీ. వారిభజవృందు సుందరివదనమనెడు
నద్భుతాఖండచంద్రుని నమరఁ జేసి
తనదుపీఠపద్మము ముకుళనము నొంద
దుస్థితుండయి యుండును ధ్రువముగాను.

(అని మరల పఠించుచున్నాఁడు.

సుసం—సఖీ! నీవదృష్టవంతురాలవు. నీహృదయవల్లభుఁ నిన్నే వర్ణించుచున్నాఁడు.

సాగ—(లజ్జతో) సఖీ!పరిహాసశీలురాలవయి నన్నేలచుల చేసెదవు?

వసం—(రాజును కదిపి) ఓయీ! ఆమె యెందుచేత నవనముఖగా వ్రాయబఁడినదని యడుగుచున్నాను.

రాజు—మిత్రుఁడా! శారికయే సకలమును జెప్పినది.

సుసం—(నవ్వి) సఖీ! శారిక మేధావిత్వమును గనఁబఱిచిన

వసం—నీనేత్రములను దనువు నున్నదా లేదా?

సాగ—(సాధ్వసముతో తనలో) అయ్యో! అతఁడేమి చెప్పుని

కొఱుఁగను. నేను సత్యముగా మరణజీవితముల మధ్యను వర్తించు చున్నదానను.

రాజు—నేత్రములను దనుపుచున్నదా యని యడుగవలెనా!

సీ. అధికకష్టమున మీఁద నక్కట నాదృష్టి
యూరుయుగంబును నొకటదాఁటి
తడవుగాఁగ నితంబతలమున భ్రమియించి
త్రివళీతరంగయుక్తిని గరంబు
విషమమైయుండెడు వెలఁదిమధ్యమునందుఁ
జలియింపక వసించి క్షణములోన
తుంగస్తనములకుఁ దొడరి మెల్లఁగఁ బ్రాఁకి
దగఁగొన్నగతి నందుఁ దడవు నిలిచి
జలకణమ్ములు చిమ్ముచుఁ జెలఁగుచున్న
కన్నుదోయిని నాదట క్షణమునుండి
కాంక్షమీఱఁగఁ జూచుచుఁ గరము నిపుడు
సుఖ మనుభవించుచున్నది సుమ్ము సఖుఁడ.

సాగ—(విని తనలో) హృదయమా! ప్రసన్నత పొందుము. ప్రసన్నత పొందుము. ఊఱడు మూఱడుము. నీ మనోరథ మిప్పు డెక్కినది.

సుసం—సఖీ! విన్నావా!

సాగ—(నవ్వి) నీవే వినుము. నీవ్రాతయొక్క నేర్పేకదా శ్లాఘింపఁబడుచున్నది.

వసం—(పలకనుజూచి) ఓయి మిత్రుఁడా! ఈదృశకన్యయు లాగున నీప్రియసమాగమమును మన్నించుచున్నదే. అటువంటి

నీరూపమునుమీఁద నీ కనాదర మేల? ఇక్కడనే యామెచేత వ్రాయఁబడియున్న నీరూపము నేల చూడవు?

రాజు—(చూచి) మిత్రుఁడా! ఆమెచేత వ్రాయఁబడినందున సత్యముగా నాయందు నేను గౌరవ ముంచుకోవలసినదే. కాఁబట్టి నన్ను నేనేల చూచుకొందును? చూడు—

గీ. భామినీమణి కరతలస్పర్శమునను
నాదు నెమ్మోము చెమరించె నాఁగ దీని
వ్రాయునప్పుడు పడనట్టిపద్మగంధి
బాష్పజలశీకరకణాళి పరిఢవిల్లు.

వసం—(ప్రక్కకు జూచి) ఇదె యామెయొక్క సరసకమలినీదళమృణాలవిరచితశయ్య మదనావస్థను సూచించుచుఁ గనఁబడుచున్నది.

రాజు—మిత్రుఁడా! చక్కఁగాఁ గని పెట్టితివి!

చ. ఘనఘనసారముం గుచయుగంబును సోఁకుట నీవలావలన్
ఘనముగ వాడి, మధ్యఁ జెలువారనివి యంటుట వాడిపోక, చెం
తను భుజమూలమెట్టుట గదల్చుట నల్గడఁ జూలిపోయె, తి
న్ననియరవిందపత్రశయనం బదె తెల్పెడుఁ గాంతతాపమున్.

ఉ. బాలికయొమ్ముఖం దసుపుఁ బష్టవిశాలపుఁ బద్మినీదళం
బాలలితాంగి గోపరి సురంగదళన్ వేలినీమురుండెమన్
జాలిగఁ దాపమందినటు దవ్వుల యోగము చేతఁ గంది తీ
రై లలి నేఁడుపద్మవనమంబును తెల్పుచున్న క్రైవడిన్.

వసం—(గాబ్యము చేత మృణాళములను పుచ్చుకొని) ఓమిత్రుఁడా! ఇది యామె పీనస్తనములనుండి జాఱిన మణియొక్క కోమలమృణాళహారము. దీనిని చూడుము.

రాజు—(పుచ్చుకొని ఆమ్మునఁ జేర్చుకొని యసూయతో) ఓజడస్వభావమా!

గీ. పడఁతికుచకుంభమధ్యంబువలన జాఱి
యోమృణాళహారమ! యెండి యుడికె దేల?
యెడము నీలోనితంతువు కేని లేని
స్తనయుగముమధ్య నీ కెట్లు సంఘటిల్లు.

సుసం—(తనలో) కటకటా! అధికానురాగముచేత మనసు చెదరినవాఁ డయి రాజు అసంబద్ధము లయిన మాటలను పలుకఁ జొచ్చినాఁడు! ఇఁకమీఁద నుపేక్షసేయుటయు క్తము కాదు. కానిమ్ము. ఇట్లు చేసెదను. (ప్రకాశముగా) సఖీ! ఎందునిమిత్తము నీవిక్కడకు వచ్చితివో యావస్తువు నీముందఱనే యున్నది.

సాగ—(అసూయతో) నే నెందుకొఱకు వచ్చితిని? ఏవస్తువు నాముందున్నది?

సుసం—(నవ్వి) ఓసీ! అనుమానపడకుము. చిత్రఫలకముకొఱకు. అదిగో దానిని వెళ్ళి పుచ్చుకొమ్ము.

సాగ—(రోషముతో) ఇటువంటి నీమాటలు గ్రహించుటకు నేను నిపుణురాలను గాను. కనుక మఱియొకచోటికిఁ బోయెదను.

(అని వెళ్ళఁబోవుచున్నది.)

సుసం—ఓసి యసహానురాలా! ఇక్కడ నొకముహూర్త కాలము నిలువుము. ఇంతలో కదళీగృహమునుండి చిత్రఫలకమును పట్టుకొని మరల వచ్చెదను.

సాగ—సఖీ! అలాగునఁ జేయుము.

సుసం—(కదళీగృహమునకేసి నడుచుచున్నది.)

వసం—(సుసంగతను జూచి తొట్రుపాటుతో) మిత్రుఁడా చిత్రఫలకమును కప్పివేయుము. అదిగో దేవిగారిపరిచారిక యై సుసంగత వచ్చుచున్నది.

రాజు—(బట్టలో ఫలకమును దాఁచు చున్నాఁడు.)

సుసం—(దగ్గఱకు వెళ్ళి) దేవా! జయ మగుఁగాక!

రాజు—సుసంగతా! నీకు మేలగుఁగాక! ఇక్కడ కూర్చుండు

సుసం—(కూర్చున్నది.)

రాజు—మేమిక్కడ నున్నసంగతి నీకెట్లు తెలిసినది?

సుసం—(నవ్వి) ఇంతే కాదు. చిత్రఫలకముతోఁగూడనిప్పు దేవరవారి సర్వవృత్తాంతమును నాకుఁ దెలిసినది. దేవిగారితో వెళ్ళి చెప్పెదను. (అని వెళ్ళఁబోవు చున్నది.

వసం—(భయపడి రహస్యముగా) ఓమిత్రుఁడా! ఇది చెప్పి నంతయుఁ జేయును. ఈగర్భదాసి వసరుఁబోతుగదా! దీనినిసంతో పెట్టుము.

రాజు—నీవు యుక్తమయినదానిని చెప్పితివి. (సుసంగ చేయి పట్టుకొని) సుసంగతా! ఇది యంతయు నవ్వులాట సుమీ అకారణముగా నీవు దేవిగారికి వ్యథ పుట్టింపఁ దగదు. ఇదిగో బహు మానము. (అని లేచి యాభరణ మియ్యఁబోవుచున్నాఁడు.

సుసం—రాజా! కర్ణాభరణ మక్కఱ లేదు. చాలును. దే గారియనుగ్రహమువలన నాకు కావలసినవన్ని యున్నవి. ఇది నేనున నవ్వులాటలకే యన్నదానను. నాప్రియసఖి యైనసాగరిక తన్నిచిత్ర పటమునం దేల వ్రాసితి నని కుపితురాలయి యున్నది. అక్కడికి దయచేసి యామెచేయి పట్టుకొని యామెను ప్రసన్నురాలిని జేయుట నా కదియే గొప్పయనుగ్రహము.

రాజు—(తొందరపాటున లేచి) ఆమె యెక్కడ? చూపుము, చూపుము.

సుసం—ఆమె కదళీగృహములోపల నున్నది.

రాజు—(సంతోషముతో) మార్గము చూపుము.

సుసం—రాజా! ఇదె యిదె. (అందఱును కదళీగృహము వంక నడుచు చున్నారు.)

సాగ—(రాజును జూచి సంతోషముతోను సాహసముతోను వడకుతోను తనలో) ఈయనను జూచి యతిభయముచేత నడుగు దీసి యడుగు పెట్టుట కయినను అశక్తురాలనుగా నున్నాను. ఇప్పు డేమి చేయుదును?

వసం—మిత్రుఁడా! చిత్రఫలకమును నేను పట్టుకొనెదను. దానితో మరల నేదియైనను పనివచ్చును. (సాగరికను జూచి) ఇహిహీ! ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఇటువంటికన్యారత్నము మానుష లోకమునందుఁ జూడఁబడదు. కనుక బ్రహ్మసహితమీ మెనునిర్మించి విస్మయము పొందియుండునని యూహించెదను.

రాజు—మిత్రుఁడా! నామనసునందు నాలాగుననే తోఁచినది.

చ. ఇల లలనాలలామ యగు నీమెను బ్రహ్మసృజించి యద్భుతం
బలర నిజేక్షణాళికి నిజాసనపద్మముకన్న విస్మృతిన్
గలుగఁగఁ జేసియుండును దగందలలూఁచియు నుండు నాల్గు మో
ములఁ దగ మేలుమేలనుచు మున్నొకసారిగఁ బల్కియుండెడున్.

సాగ—(అసూయతో సుసంగతను జూచి) సఖీ! ఇటువంటి చిత్రఫలకనా తెచ్చితివి? (అని వెళ్ళఁబోవుచున్నది.)

రాజు—గీ. కోపమున దృష్టి వఱవెదు కొమ్మ! నీవు
కనదు రూక్షభావము ప్రేమకతన నదియు;

చనుము త్వరమని, జాఱెడుచరణములను
నీదుగురునితంబము చాల ఖేదమందు.

సుసం—రాజా! ఈమె యతికోపశీలురాలు గనుక చేయి పట్టుకొని యీమెను ప్రసన్నురాలిని జేయుము.

రాజు—(సంతోషముతో) నీవు చెప్పినట్లు చేసెదను. (అని సాగరికను చేతితోఁ బట్టుకొని స్పర్శసుఖమునునటించు చున్నాఁడు.)

వసం—ఓయీ! నీవపూర్వశ్రీని పొందినాఁడవు.

రాజు—మిత్రుఁడా! సత్యము.

గీ. లక్ష్మియే యీలతాంగి తలంచి చూడ;
పారిజాతపల్లవము లీపాణియుగము,
కాకయుండిన స్వేదమన్ కైతవముగ
నిట్టు లమృతంబు గురియింప నెట్లు గలుగు?

సుసం—సఖీ! నీవు తిన్ననిదానవు కావు. ఇప్పుడీప్రకారముగా రాజహస్తము పట్టుకొన్నను కోపము విడువకున్నావు.

సాగ—(భ్రూభంగముతో) సుసంగతా! ఇంకను నూరకుండకున్నావు.

రాజు—ప్రియురాలా! సాగరికా! సఖీజనముమీఁద నీప్రకారముగా కోపపడుట యుక్తము కాదు.

వసం—అమ్మా! ఆఁకలిగొన్న బ్రాహ్మణునివలె నేల కోపపడియెదవు?

సుసం—సఖీ! నీతో నేను మాటాడను లే.

రాజు—ఓసికోపనురాలా! సమానప్రపత్తి గలసఖులయం దిట్లుండుట యుక్తము కాదు.

వసం—మిత్రుఁడా! ఈమె దేవి యైన కేవల వాసవదత్త కదా!

రాజు—(చకితుఁడగుచు సాగరికహస్తమును విడుచుచున్నాఁడు)

సాగ—(తొట్రుపాటుతో) సుసంగతా! ఇప్పుడేమి చేయుదును?

సుసం—సఖీ! ఈకదళికావీధికి వెళ్ళిపోవుదము.

(అని వెళ్ళుచున్నారు.)

రాజు—(పార్శ్వములఁజూచి విస్మయముతో) వాసవదత్తాదేవి యెక్కడ?

వసం—ఆమె యెక్కడనో నేనెఱుఁగను. అతిదీర్ఘరోషము చేత నీమె రెండవ వాసవదత్తయోయని నేను పలికితిని.

రాజు—ఓరిమూర్ఖుఁడా!

క. ప్రకటానురాగ సమధిక
సుకృతప్రాప్తయునయి తగుచుం గంఠముఁ బొం
దకలదురత్నావళివలె
నకటా పోఁగొట్టితీవు హస్తగతసతిన్.

[అప్పుడు వాసవదత్తయు కాంచనమాలయు ప్రవేశించుచున్నారు.]

వాస—ఓసీ కాంచనమాలా! భర్తగారిచే పెంచఁబడుచున్న నవమాలికయిక్కడికెంతదూరమున నున్నది?

కాంచ—ఈకదళీగృహమును దాఁటినతరువాతకనఁబడును.

వాస—అట్లయిన తోవ చూపుము.

కాంచ—అమ్మా! రమ్ము రమ్ము. (సమీపించు చున్నారు.)

రాజు—మిత్రుఁడా! ఇప్పుడు నాప్రియతమురాలెక్కడ కనఁబడును?

కాంచ—అమ్మా! సమీపమున భర్తగారు మాటాడుచున్నట్టున్నారు. ఆయన దేవిగారికొరకే నిరీక్షించుచున్నారుగనుక దగ్గఱకు వెళ్ళుము.

వాస—(దగ్గఱకు వెళ్ళి) ప్రాణనాయకా! జయ మగుఁగాక!

రాజు—(రహస్యముగా) మిత్రుఁడా! చిత్రఫలకమును దాఁచుము.

వసం—(పుచ్చుకొని చంకను పెట్టుకొనుచున్నాఁడు.)

వాస—దేవా! నవమాలిక పుష్పించినదా!

రాజు—దేవీ! మేము ముందుగా వచ్చినవారమయ్యును నీవు రాలేదని చూడలేదు. రమ్ము కలిసి వెళ్ళి చూతము.

వాస—(చూచి) ప్రాణనాథా! నవమాలిక పుష్పించినదని దేవర ముఖవిలాసమువలననే తెలియుచున్నదిగనుక నేను రాను.

వసం—దేవీ! అట్లయిన నీవే మాకోడిపోతివి. (అని చేతులు సాచి ఆడఁగా చంకనుండిపడినఫలకను జూచి విషాదమును నటించుచున్నాఁడు.)

రాజు—రహస్యముగా (వ్రేలితోఁజూపి వసంతకునిముఖమును చూచుచున్నాఁడు.)

వసం—(రహస్యముగా) మిత్రుఁడా! కోపపడకు ఏమియుత్తరము చెప్పవలెనో నే నెఱుఁదును.

కాంచ—(ఫలకపుచ్చుకొని) దేవీ! ఈచిత్రఫలకమున నేమి వ్రాయఁబడినదో చూడుము.

వాస—(చూచి తనలో) ఇతఁడు నాప్రాణనాయకుఁడు; తరువాతిది సాగరిక. (రాజునుగూర్చి సరోషహాసముతో ప్రకాశముగా రాజా! ఇది యెవరిచేత వ్రాయఁబడినది!

రాజు—(వెఱఁగుపాటుతోడి చిఱునవ్వుతో రహస్యముగా) చెలికాఁడా! ఏమని చెప్పను?

వసం—(రహస్యముగా) ఓయీ! విచారింపకుము. నేను త్తరము చెప్పెదను. (ప్రకాశముగా వాసవదత్తతో) అమ్మా! మఱియొకలాగున తలంపకుము. తన్ను తాను వ్రాయుట కష్టమని నేను పలుకఁగావిని నాప్రియమిత్రుఁడు దీనిఁవ్రాసితననేర్పునుకనబఱిచెను.

రాజు—వసంతకుఁడు చెప్పినది నిజమే.

వాస—(ఫలకమును జూపి) ప్రాణనాథా! తమసమీపమున నెవ్వతెయో యొకతె వ్రాయఁబడి యున్నదే; అది యాయ్యఁడయిన యీవసంతకుని నేర్పా యేమి?

రాజు—(వెఱఁగుపాటుతోడి నవ్వుతో) దేవీ! మఱియొకవిధముగా శంకింపకుము. ఏదో యొకకన్యను నామనస్సుచిత నేకల్పించి యీవిధముగా వ్రాసితిఁను. ఇది మున్నెప్పుడును చూచినది కాదు.

వసం—సత్యము. ఇటువంటి సుందరిని మేము పూర్వ మెప్పుడును చూచి యుండలేదని యీయజ్ఞోపవీతముతోడ ప్రమాణము చేసెదను.

కాంచ—(రహస్యముగా) దేవీ! ఒకవేళ నిటువంటిది ఘుణాక్షరముగా పడియుండవచ్చును. కోపముతో పనిలేదు.

వాస—(రహస్యముగా) ఓసి బుజుమార్గురాలా! ఈతని వంకరమాటలు నీవెఱుఁగవు. ఇతఁడు వసంతకుఁడనుమా! (ప్రకాశముగా రాజునుగూర్చి పాణేశ్వరా! నాకీచిత్రపటమును జూచినతరువాత శిరోవేదనము కలుగుచున్నది. దేవర యుందు సుఖముగా నుండుదురుగాక! నేను వెళ్ళెదను.

(అని లేచివెళ్ళఁబోవుచున్నది)

రాజు—(చీర చెఱఁగు పట్టుకొని) దేవీ!

చ. అతివ! ప్రసన్నురాల వగు మంచన నీ వలుగంగ లేదు ప్ర
స్తుత; మిఁక నట్టుచేయుసన దోషము నొప్పినయట్ల యాను; దు
ష్కృతమును జేయలే దనిన నెంతు నసత్యముగాఁగ నీమదిన్;
ద్రుతగతి నేమిచెప్పుటకుఁ దోఁచకయున్నది నాకు నిర్ద్యోదర్.

వాస—(వినయముతో చీరచెఱఁగు విడిపించుకొని) ప్రాణ
నాయకా! మఱియొకలాగున భావింపకుము. నిజముగానే నేను శిరో
వేదనముచేత బాధపడుచున్నానుగనుక వెళ్లెదను. (అని వెళ్ళుచున్నది)

వసం—నీయదృష్టముచేత క్షేమమును పొందితివి. అకాల
వర్షానుబంధమువలె వాసవదత్త వెళ్ళిపోయినది.

రాజు—ఓరిమూర్ఖా! సంతోషము చాలింపుము. వెళ్లునపుడు
గూఢముగా నున్న దేవిగారికోపానుబంధమును నీవు కనిపెట్టలేదు.

శా. వంచెన్నైన్నపుణిచే శిరంబు వడి భ్రూభంగంబు గాన్పించినన్;
గాంచక్ భేదపుఁ బ్వాసాస్వానను పల్కక్ లేదు పారుష్యముల్;
మించ న్బాష్పములూరఁ జొచ్చినఁ గను ల్విప్పంగలే దొప్పగన్;
గొంచెంబు న్నతి కూర్మి పీడమునుమీ కోపంబు వెల్వర్చెనక్.

వసం—వాసవదత్తాదేవి వెళ్ళిపోయినదిగనుక నీవిప్పుడు వట్టి
యరణ్యరోదనము చేయుచున్నావు.

రాజు—మూఢుఁడా! దేవిగారికోపమును నీవు కనిపెట్టలేవు.
సర్వవిధములచేతను దేవిగారిని శాంతిపఱచుటతప్ప మఱియొక
యుపాయమును వెదకను. దేవిని ప్రసన్నురాలిని జేయుటకయియంతః
పురమునకు వెళ్లుదమురమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు.)

# తృతీయాంకము.



ప్రదేశము — రాచనగరు.

[మదనిక ప్రవేశించుచున్నది.]

మద—(ఆకాశమునందు) కౌశాంబికా! రాజుగారిసమ్ముఖమున నీవు కాంచనమాలను చూచినావా లేదా? (చెవి యిచ్చి యాలకించి) ఏమి చెప్పుచున్నావు? కొంతసేపటిక్రింద వచ్చి మరల వెళ్ళిపోయినదా? ఇప్పుడామె యెక్కడ కనఁబడును? (ముందువంకఁ జూచి) ఏమీ! కాంచనమాల యీవంకనే వచ్చుచున్నది. కావున నామెసమీపమునకు వెళ్లెదను.

[అంతట కాంచనమాల ప్రవేశించుచున్నది]

కాంచ—(నిట్టూర్పుతో) సాధు! వసంతకా! సాధు! ఇప్పుడు సంధివిగ్రహాలోచనచేత నీవు మంత్రియైనయౌగంధరాయణుని మించినవాఁడ వయితివి!

మద—(చిఱునవ్వుతో దగ్గఱకువచ్చి) సఖీ! కాంచనమాలా! నీవింతగా శ్లాఘించుటకయి వసంతకుఁ డిప్పు డేమి చేసియున్నాఁడు?

కాంచ—సఖీ! మదనికా! నీయీప్రశ్నవలన నేమి ప్రయోజనము? నీవు రహస్యమును దాఁచజాలవు.

మద—ఇది యెవరిముందును వెల్లడిచేయనని దేవిగారి పాదములతోడ ప్రమాణము చేసెదను.

కాంచ—అట్లయినఁ జెప్పెదవినుము. నేనిప్పుడు రాజ మందిరమునుండి తిరిగి వచ్చుచుచిత్రశాలయొక్క ద్వారమున వసంతకుఁడు సుసంగతతో మాటాడుచుండఁగా విన్నదానను.

మద—(కౌతకముతో) సఖీ! ఆప్రసంగ మెటువంటిదో చెప్పుము.

కాంచ—వసంతకుఁ డీలాగునఁ జెప్పినాఁడు—"సుసంగతా! నాప్రియమిత్రునియొక్క యస్వస్థతకుఁ గారణము సాగరిక తప్ప మఱి యేదియు లేదు. కాఁబట్టి యిక్కడ ప్రతీకారము నాలోచింపుము.

మద—అప్పుడు సుసంగత యేమన్నది?

కాంచ—అప్పు డామె యిట్లు చెప్పినది.—"చిత్రఫలక వృత్తాంతముచేత శంకితురాలయి సాగరికను పరిరక్షింపవలయు నని నా కొప్పగించి దేవిగారు తమవస్త్రములను భూషణములను నాకు దయచేసినారు. అందుచేత సాగరికకు దేవిగారి వేషము వేసి వెంటఁ బెట్టుకొని నేనును కాంచనమాలవేషమును ధరించి ప్రదోషసమయ మునకు రాజుగారిసమీపమునకు వచ్చెదను. నీవును నిక్కడనేయుండి చిత్రశాలాద్వారమువద్ద కాచుకొని యుండుము; అప్పుడు మాధవీ లతామండపమునందు రాజున కామెతోడిసంగమము కాఁగలదు."

మద—సఖీ! సుసంగతా! పరిజనవత్సలురా లయినదేవిగారి నీవిధముగా వంచించు చున్నావు గనుక నీవు చెడిపోతివి.

కాంచ—సఖీ! మదనికా! నీ విప్పు డెక్కడకు వెళ్ళు చున్నావు?

మద—అస్వస్థశరీరుఁ డయినరాజుగారికుశలవార్తను దెలిసి కొనుటకయి వెళ్ళి నీ వాలస్యము చేసితివని తొందరపడుచు దేవి గారు నీయొద్దకు నన్నుఁ బంపినారు.

కాంచ—ఆమె యతిఋజువర్తనము కలది. దేవి యిప్పుడిది యంతయు నమ్ముచున్నది. (కొంచెము నడచి చూచి) సఖీ! చూడు చూడు. అదిగో రాజుగారస్వస్థతామిషచేత మన్మథావస్థను మఱుఁ

గుపటుచుచు దంతతోరణవలభిమీఁదఁ గూరుచుండి యున్నారు. కాఁబట్టి యీ వృత్తాంతమును రాణిగారితో వెళ్ళి చెప్పుదము రా.

(అని నిష్క్రమించుచున్నారు.)

[అప్పుడు మదనావస్థను గనఁబఱుచుచుఁ గూరుచున్న రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—(సోత్కంఠముగా నిట్టూర్పు విడిచి)

చ. హృదయమ! సైచుకొమ్మి యిపుడీవు స్మరాగ్నికృతాతితాపమున్
మది నరయంగ లేదుపశమంబిఁకఁ జింతిలఁబోకు మెట్టులో
యొదవిన సాంద్రచందనరసోపమమౌ నతిహస్త మప్పుడే
ముదమున నీవయిం దడవు పూన్పక మూఢుఁడ నైతి నక్కటా!

ఆహా! మిక్కిలి యాశ్చర్యము. అట్లేకదా!

గీ. ప్రకృతిచేతనె చంచలం బకట మనసు
మఱియు మర్లత్వ మట్లయ్యెఁ దలఁచి చూడ
మన్మనం బొక్కటను సర్వమార్గణములఁ
గుసుమశరుచేత నేరీతిఁ గొట్టఁబడెడు!

(పయివంకఁ జూచి) ఓ కుసుమధన్వుఁడా!

చ. అరయఁగ నీకుఁ దూవు లయిదంచును వానికి లక్ష్యభూతు లి
ద్దఱ ముబోం ట్లసంఖ్యులని దర్పక! వింటిమిముందు,నీయెడన్
గఱ యు విరుద్ధమయ్యె నది, కామిజనుండగు నేనె పంచతం
బొరయుచునుంటి, నీవయినములక్కలసంఖ్యములౌ మ నాఁబెడన్

(ఆలోచించి) లోపల నిగూఢమయిన కోపముగల దేవిగారికి లోచన గోచర యయి దీనురాలయియున్న యీసాగరికను గూర్చి నేను చింతిల్లుచున్నట్లుగా నిటువంటి యవస్థను బూనియున్న నన్నుఁగూర్చి నేను జింతిలను. అట్లేకదా!

ఉ. విక్కటు! యందఱుం దెలిసి రంచు శిరంబును వంచు సిగ్గుచే,
నెక్కడ నిద్దతేనునిన నెంచుకొనుం దనమాటగాఁగ, నా
చక్కని నెచ్చెలుల్ స్మితము సల్పిన నివ్వెఱఁగొందుఁ బేలమై
యక్కమలాయతాక్షి హృదయంబునఁగల్గు భయంబు పెంపునన్

ఆమెసంగతిని కనుఁగొనివచ్చుటకయి నాచేతఁ బంపఁబడిన వసంతకుఁ డెందుచేతనో యాలస్యము చేయుచున్నాఁడు.

[అప్పుడు హృష్టుఁ డగు వసంతకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వసం—(సంతోషముతో) ఆశ్చర్య మాశ్చర్యము! నేనిప్పుడు వెళ్ళి చెప్పెడి ప్రియవచనము వినుటచేతఁ గలిగెడునంత సంతోషము కౌశాంబీరాజ్యలాభముచేత సహితము నా ప్రియసఖునియొక్క హృదయమునకుఁ గలిగియుండదని నేనూహించెదను. కాఁబట్టి దగ్గఱకుఁబోయి ప్రియమిత్రునకంతయుని వేదించెదను. (వెళ్లిచూచి) ఏమీ! నాప్రియమిత్రుఁ డీ దిక్కునే చూచుచు కూరుచున్నాఁడు. కాఁబట్టి నా రాకకే ప్రతీక్షించుచున్నాఁ డని తలఁచెదను. సమీపమునకు వెళ్ళి కనఁబడెదను. (అని చెంతఁజేరి ప్రియమిత్రుఁడా! జయమగుఁ గాక! జయమగుఁ గాక! మిత్రుఁడా! నీ వదృష్టవంతుఁడ వభీష్టసిద్ధి యయినది.

రాజు—(హర్షముతో) మిత్రుఁడా! ప్రియురా లయిన సాగరికకు కుశలమా?

వసం—(గర్వముతో) మిత్రుఁడా! శీఘ్రముగా నీవే చూచి తెలిసికోఁ గలవు.

రాజు—(సంతోషముతో) మిత్రుఁడా! ప్రియురాలిదర్శనము కూడ లభించునా?

వసం—(గర్వముతో) బుద్ధివిభవమున బృహస్పతి నపహసించెడు నేను నీకు మంత్రినయి యుండఁగా నేల లభింపకుండును!

రాజు—(నవ్వి) ఇఁదు చిత్ర మేమియులేదు. నీకు సాధ్యము కాని దేమున్నది? అయినను నాకు వినవలెనని నని యున్నది గనుక నవిస్తరముగాఁ జెప్పుము.

వసం—(చెవిలో నేమో చెప్పుచున్నాఁడు.)

రాజు—(సంతోషముతో) మిత్రుఁడా! ఇదిగో నీకు పారితోషికము. (అని చేతినుండి తీసి కడియము నిచ్చుచున్నాఁడు.)

వసం—(కడియముధరించి తన్నుఁజూచుకొని సంతోషముతో ఇది బాగున్నది. ఈశుద్ధసువర్ణకటకముచేత ప్రకాశించుచున్న హస్తమును నాభార్యకు పోయి చూపి వచ్చెదను.

రాజు—(చేయి పట్టుకొని వారించుచు) సఖుఁడా! తరువాత చూపవచ్చును. ఇప్పుడు ప్రొద్దెంతయున్నదో చూడుము.

వసం—(కొంచెము నడచి చూచి సంతోషముతో) ఓహో! చూడుచూడు. అదిగో భగవానుఁ డయిన సూర్యుఁ డధికానురాగ తృప్తహృదయుఁ డయి సంధ్యావధువుచే నిర్ణయింపఁబడిన సంకేత స్థలమునకు వెళ్ళునట్టుగా అస్తాద్రి శిఖరారణ్యమునుగూర్చి పోవుచున్నాఁడు.

రాజు—(చూచి హర్షముతో) మిత్రుఁడా! చక్కఁగాఁ జూచితివి. సంధ్యాకాల మైనది. అట్లేకదా!

ఉ. చక్రి మొకండు గల్గు రథసంగతి నెట్లు జగంబునెల్ల ని
ర్వక్రతఁ జుట్టి రేపకడఁ గ్రమ్మఱ రాఁగలనంచు నప్డు ది
క్చక్రమునందుఁ గూర్చెదునొ సంధ్యను నిల్చినయంశుజాల మన్
వక్రిత లేనియూఁతలన భానుఁడు హొలెఁడుఁ బశ్చిమాద్రిపైన్.

మఱియును,

గీ. ఓ జలరుహాస్య! నేఁ జనుచున్నవాఁడఁ
దిరిగి నే రేవు వచ్చి నిద్రించు నిన్ను
మేలుకొల్పెద నంచుఁ బద్మినిని నమ్మఁ
బలుకువిధమున నస్తాద్రి భానుఁ డలరు.

కాఁబట్టి లెమ్ము; ఆమాధవీలతామండపమునకు వెళ్ళి ప్రియురాలి సంకేతసమయమును నిరీక్షింపుచుందము.

వసం—మంచిమాట సెలవిచ్చినారు. (అని లేచి చూచి) ఓమిత్రుఁడా! చూడు చూడు అదిగో పలచగానున్న చెట్లసమూహమును దట్టముగాఁ జేయుచు, బురదలో పొరలిన వరాహముల యొక్కయు మహిషములయొక్కయు నల్లనిరంగుకలిగి తూర్పుదిక్కునంతను గ్రమ్మి చీఁకటిగుంపు వ్యాపించుచున్నది.

రాజు—(సంతోషముతో నంతటను గలయఁ జూచి)

చ. శివునిగళచ్ఛవిం దెగడుచీఁకటి తొల్తను దూర్పుదిక్కునం
గవిసెను; మీఁద నంతటను గ్రమ్మి నగంబు కుజంబు గ్రామముల్
భువిఁగలభేదముల్ చెఱిచెఁ బూర్ణముగాఁ; దరువాతఁ జాలఁ దా
నవిరళమై జనంబులకు నక్షులు గల్గుఫలంబు మాపెడున్.

కాఁబట్టి మార్గమును జూపుము.

వసం—ప్రియమిత్రుఁడా! రమ్మురమ్ము. (అని నడుచుచు చూచి) ఇదిగో విస్తారముగా వృక్షము లుండుటచేత గాంధాంధకార పుంజమువలె నున్నమకరందోద్యానమును సమీపించినాము; ఇఁక నిక్కడ మార్గ మెట్లు కనఁబడును?

రాజు—(వాసనచూచి) మిత్రుఁడా! ముందుమునడువు; ఇక్కడ మార్గము తెలియుచునే యున్నది. ఎట్లందువేని.

మ. ఇది సంపంగులపంక్తి; యీవలివనంబే సిందువారాళి; యి
య్యది చూడన్ వకుళావనీజములగుంపౌ; బాటలశ్రేణి యి
య్యదియే యంచును దావిచేఁ దెలిసె నాహా దారి స్పష్టంబుగా
నిదె వృక్షంబులచేతఁ జీఁకటికడున్ హెచ్చయ్యెఁబూర్వస్తృతిన్.
(అని వెళ్ళుచున్నారు)

వసం—ఓ మిత్రుఁడా! నవత్రిల్లినతుమ్మెదలు వాలుచుండఁగా పొగడపువ్వులపరిమళము దిక్కుల నంతటను కొట్టుచున్నది; నున్నని మరకతమణులతో కట్టఁబడిన నేల పాదసంచారమునకు మెత్తగాఁ దగిలి సుఖము నిచ్చుచున్నది; ఇదే మాధవీలతామండపము మనము వచ్చిచేరినారము. నేను వెళ్ళి దేవీవేషధారిణి యైనసాగరికను వెంటఁబెట్టుకొని వేగిరము వచ్చెదను. అంతవఱకును దేవరవారిక్కడనే యుండవలెను.

రాజు—మిత్రుఁడా! వెళ్ళి సత్వరముగా నిక్కడకు రమ్ము.

వసం—మిత్రుఁడా! తొందర పడఁబోకుము.

(అని వెళ్ళుచున్నాఁడు)

రాజు—నేనంతవఱకును ఈమరకతశిలావేదికయందుఁ గూరుచుండి, ప్రియురాలి సంకేతసమయమును ప్రతీక్షించు చుండెదను. (కూరుచుండి చింతతో) ఓహో! స్వభార్యాసమాగమము సేవగించు కాముకునకు నూతనప్రియురాలివిషయ మయినపక్షపాతము నేమనను!

శా. సంకేతస్థలిఁ జేరుకాంత ప్రియుఁ డాస్యంబు న్విలోకింపఁగా
శంకించున్, మెడ కౌఁగిలించుతఱి వక్షంబంటఁ జన్దోయి యుమ్మ
లింకంబారఁగఁ గ్రుమ్మనోడు; పతి దానిల్పంగఁ బల్మాఱునుమ్మ
జంకుం బాటునఁ బోవఁజూచు; నయునన్ సంతోష మెచ్చయ్యెడిన్.

అయ్యో! వసంతకుం డేల యాలస్యము చేయుచున్నాఁడు? ఈవృత్తాంతము దేవి యైనవాసవదత్తకు తెలిసిన దేమో!

[అప్పుడు వాసవదత్తయు, కాంచనమాలయు
ప్రవేశించుచున్నారు]

వాస—ఓ కాంచనమాలా! సాగరిక నావేషమును ధరించి నిజముగానే రాజుగారిదగ్గరకు వెళ్ళనా?

కాంచ—నిజము గాకపోయిన నేను దేవిగారితో విన్నవింతునా? చిత్రశాలాద్వారమున నుండువసంతకుఁ డయినను నీకు నమ్మకము పుట్టించును.

వాస—అట్లయిన నక్కడకే వెళ్ళుదము.

కాంచ—దేవీ! రండి రండి. (అని వెళ్ళుచున్నారు)

[అప్పుడు ముసుఁగు వేసికొని వసంతకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసం—(చెవి యిచ్చి) చిత్రశాలద్వారమున పాదముల చప్పుడు వినఁబడుచున్నది; సాగరిక వచ్చిన దనుకొనియెదను.

కాంచ—దేవీ! చిత్రశాల యిదే కనుక, ఇక్కడనే యుందము. నేను వసంతకునకు సంజ్ఞ చేసెదను.

(అని చిటిక వేయుచున్నది)

వసం—(కాంచనమాలను చూచి సంతోషముతో దగ్గఱకు వచ్చి చిఱునవ్వు నవ్వి) సుసంగతా! నీవు వేసిన కాంచనమాల వేషము సరిగా నున్నది. ఇప్పుడు సాగరిక యెక్కడ నున్నది?

కాంచ—ఇదిగో. (అని వ్రేలితో చూపుచున్నది)

వసం—(చూచి యద్భుతపడి) ఈమె నిశ్చయముగా దేవి యయిన వాసవదత్తయే.

వాస—(సంశయపడి తనలో) నన్నితం డెట్లు ఆనవాలుపట్టి నాఁడు! నేను వెళ్ళెదను. (అని వెళ్ళఁబోవుచున్నది)

వసం—అమ్మా! సాగరికా! రా.

వాస—(నవ్వి కాంచనమాలవంక చూచుచున్నది)

కాంచ—(రహస్యముగా విదూషకుని బెదరించుచున్నది) ఓరి చెడుగా! ఈమాట మఱచిపోకుము.

వసం—సాగరికా! త్వరతో రమ్ము. త్వరతో రమ్ము. అదుగో చంద్రుఁడు తూర్పుదిక్కున నుదయింపఁబోవుచున్నాఁడు.

వాస—(తొట్రుపాటుతో రహస్యముగా) ఓచంద్రుఁడా! నీకు నమస్కారము. ముహూర్తముసేపు నీరూపము కనఁబడకుండ నుండుము. ఆయన భావానుబంధమును కనిపెట్టెదను.

(అందఱును నడుచుచున్నారు)

రాజు—(చింతతో తనలో) ప్రియురాలిసమాగమమునదూరాపించుచున్నప్పటికిని, నామన సెందుచేతనో మిక్కిలి మండుచున్నది.

గీ. తనకుఁ బ్రియురాలొదవనున్న తఱిని బోలె
స్మరుని తాపంబు మొదట దుస్సముగాదు
కాఁక తొంటికంటెను హెచ్చు గాంచుగాఁదె
వర్షపాత మాసన్నమౌ వాసరమున!

వసం—(ఆలకించి) ఓసాగరికా! అదుగో నాప్రియమిత్రుఁడు నిన్నుద్దేశించియే వేడుకతో మాటాడుచున్నాఁడు. ఇక్కడనుండుము. రాకను నేను నివేదించెదను.

వాస—(తల యూఁచుచున్నది)

వసం—(రాజుదగ్గఱకు వెళ్ళి) ఓమిత్రుఁడా! నీవదృష్టవంతుఁడవు. నేను సాగరికను తీసికొని వచ్చినాఁడను.

# తృతీయాంకము

రాజు—(సంతోషముతో తొందరపడి లేచి) ఆమె యెక్కడ
ఆమె యెక్కడ?

వసం—(భ్రూభంగముతో) అదిగో!

రాజు—(సమీపించి) ప్రియురాలా! సాగరికా!

చ. వదనము చందురుండు; కలువల్నయనంబులు; పాణు లబ్జములే
కదళిక లూరువుల్; భుజయుగంబును దామరతూండ్లు నీకు నో
సుదతిరో! కౌఁగిటం జొనిపి నూనశరాగ్నిని గాలియున్న నా
ప్రిదిలినయంగకంబులను ప్రేమను జల్లపడంగఁ జేయుమా.

వాస—(కన్నీటితో రహస్యముగా) కాంచనమాలా! ఇట
వంటి యీయన యింకముందు మరల నాతో నెట్లు మాటాడ
గలడాయని నే ననుకొనియెదను. ఆహా! ఏమి యాశ్చర్యము!

కాంచ—(రహస్యముగా) దేవీ! అవునది నిజమే. సాహసి
లయిన పురుషులకు మరల నేమిచేయుటకు దుష్కరము కాదు.

వసం—అమ్మా! సాగరికా! ధైర్యము తెచ్చుకొని ప్రియ
మిత్రునితో నేల మాటాడవు? ఇప్పుడయినను దేవివైన వాసవద
సదా కోపముతో పలుకుచుండు దుర్వచనములచేత కటువులయి
చెవులకు నీమధురవచనోపన్యాసముచేత సుఖము కలుగఁ జేయుము

వాస—(రోషముతోడి చిఱునవ్వు నవ్వి రహస్యముగా
ఓసీ! కాంచనమాలా! నేనిప్పుడు కటుభాషిణినఁట! పూజ్యుఁడయి
యీవసంతకుఁడు తానేమో మహాప్రియంవదుఁడఁట!

కాంచ—(రహస్యముగా వేలితో బెదరించుచు) ఓరి చెడుగా
ఈమాట తరువాత నీవు తలఁచుకొనియెదవు.

వసం—(చూచి) ఓమిత్రుఁడా! చూడుము చూడుము,

తురా లయిన కామినిరియొక్క చెక్కిలివలెనే తూర్పుదిక్కును ప్రకాశింపఁ జేయుచు చంద్రుఁ డుదయించుచున్నాఁడు.

రాజు—(చూచి యాశతో) ప్రియురాలా! చూడుచూడు.

గీ. నీదువదనాపహ్నుతకాంతినిచయుఁ డగుచుఁ
దా బ్రతిక్రియ చేయంగఁ దలఁచినట్టు
లెదుటఁ గాన్పించుచున్నవాఁ డుదయగిరిని
గరములను జాఁచి యల్లదె కమలనైరి.

ప్రియురాలా! ఈయన పయినుదయించుట జడత్వమేసుమా. ఎట్లన—

మ. హరియింపంగను లేదె తమ్మిసిరి? నేత్రానందముం గూర్పదే?
స్మరతాపంబును బాపదే మిగుల పీయూషమాత్ర? నీమోము చం
దురుఁ డుండ న్మఱిచంద్రుఁ డేటికి దివిం దోఁచుం? విధుండాసుధా
కరతన్ గర్వము నొంద నద్ది కలుగుంగా నీకు కెమ్మోవిలోన్.

వాస—(రోషముతో) మేలిముసుఁగుతీసివేసి) ఓరాజా! నేను సత్యముగానే సాగరికను. నీవు సాగరికచే నాకర్షింపఁబడిన మనస్సు గలవాఁడవయి సర్వమును సాగరికామయముగాఁ జూచుచున్నావు.

రాజు—(చూచి యద్భుతపడి రహస్యముగా) హా! ఇది యేమి! ఓరిదుష్టా! దేవి యైనవాసవదత్తనే తీసికొని వచ్చినావు!

వసం—(విషాదముతో) మిత్రుఁడా! మఱి యేమున్నది? నాకిప్పుడు జీవితసంశయము సంభవించినది.

రాజు—(చేతులు జోడించి) ప్రియురాలా! వాసవదత్తా! రక్షించు.

వాస—(ఆయనవంకఁ దిరిగి కన్నీరు విడుచుచు) దేవా! ఇతరులసొమ్మయిపోయిన యీ మాటనిప్పుడు నావిషయమున నుపయోగించకుము.

వసం—(తనలో) నేనిప్పు డేమి చేయుదును! కానిమ్ము. ఈప్రకారముగఁ జేసెదను. (ప్రకాశముగా) అమ్మా! నీవు మహాను భావురాలవు. న ప్రియమిత్రునియొక్క యీ యొక్కయపరాధమును క్షమింపుము.

వాస—అయ్యో! వసంతకా! ఈయపరాధము ప్రథమసంగ మమునందే విఘ్నము కలుగఁజేసిన నాదేకాని రాజుగారిది కాదు.

రాజు—ఈవిధమున నేరము ప్రత్యక్షముగా కనఁబడుచుండఁగా నేనేమి చెప్పఁగలను? అయిన నొక్క విజ్ఞాపనము చేసికొనెదను.

చ. లలనరో! నీదు పాదముల లత్తుకచే నయినట్టి రక్తిమన్
దొలఁచఁగనోపుదున్ శిరసుతోఁ దను నే నిట; నీము ఖేందుమం
డలమున రోషరాహుగ్రహణంబునఁ గల్గినయట్టి తామ్రతన్
జెలువరో! నీదయామహిమచేతను గాక యడంపనేర్తునే?

(అని పాదములమీఁద పడుచున్నాఁడు.)

వాస—(చేతితో లేవఁదీయుచు) ప్రాణేశ్వరా! లెమ్ము లెమ్ము నేను సిగ్గుమాలినదానను. దేవరవారిహృదయమిటువంటిదని యెఱిఁగి యుండియు మరల కోపము వహించు చున్నాను. దేవరవారు సుఖ ముగా నుందురుగాక! నేను వెళ్లెదను. (అని వెళ్లఁబోవు చున్నది.)

కాంచ—దేవీ! అనుగ్రహింపుము. ఈప్రకారముగా కాళ్ళ మీఁద పడినమహారాజును విడిచి వెళ్ళినతరువాత నీవే పశ్చాత్తాప పడెదవు.

వాస—పో మూర్ఖురాలా! ఇక్కడ పశ్చాత్తాపమునకు కారణ మేమున్నది? వెళ్ళుదము. రా. (అని వెళ్లుచున్నది.)

రాజు—దేవీ! క్షమించు క్షమించు. ("లలనరో నీదు పాదముల" అనుపద్యము మరలఁ జదువు చున్నాఁడు.)

వసం—మిత్రుఁడా! లెమ్ము. వాసవదత్తాదేవి వెళ్ళిపోయినది. ఇఁక నిక్కడ నరణ్యరోదన మేల చేసెదవు?

రాజు—(ముఖమెత్తి) నాయందు ననుగ్రహము చూపకయే దేవి వెళ్ళిపోయినదా?

వసం—అనుగ్రహము చూపకపోవుట యెట్లు? మనమిప్పుడు శరీరమున గాయములు లేకుండ నున్నాము.

రాజు—ఛీ! మూర్ఖుడా! నీవే నన్నేల పరిహసించుచున్నావు? నీమూలముననే నిష్కారణముగా నా కీయనర్థము సంభవించినది.

ఉ. అంతకు నంతకుం బెరుగు నర్మిలిచేతను బ్రేమ హెచ్చ; ని
ట్లింతకుమున్ను నేను దన కెన్నఁడుఁ జేయనియప్రియంబుచే
నింతయుఁ దాళలేక త్యజియించును వాసవదత్తప్రాణముల్
వింతగఁ బ్రేమ హెచ్చిన భువిం జిఱుతప్పును దుస్సహంబగున్.

వసం—చెలికాఁడా! దేవి మిక్కిలి కుపితురాలయి యున్నది. అందుచేత నామె నేమిచేయునో తెలియదు. ఇఁక సాగరిక జీవించుట దుష్కర మని నేననుకొనిమెదను.

రాజు—మిత్రుఁడా! నేనును అలాగున నేయనుకొనుచున్నాను. అయ్యో! సాగరికా! నాప్రియురాలా!

[అప్పుడు వాసవదత్తావేషధారిణి యైనసాగరిక
ప్రవేశించు చున్నది.]

సాగ—(భయముతో) ఈ దేవీవేషముతో నదృష్టవశముచేత నెవ్వరికిని గనఁబడకుండ సంగీతశాలను దాఁటి వచ్చితిని. ఇఁక నిప్పుడిక్కడ నేమి చేయుదును? (అని కన్నీటితో చింతిల్లుచున్నది.)

వసం—మిత్రుఁడా! మూర్ఖునివలె నూరకున్నావేమి? ఇక్కడ ప్రతీకారము నాలోచింపుము.

రాజు—చెలికాఁడా! నేనదియే యాలోచించు చున్నాను. దేవిగారియనుగ్రహసంపాదనము తప్ప నాకు మఱియొకయుపాయ మేమియుఁ గనఁబడకున్నది. కాఁబట్టి యక్కడకే వెళ్ళుదము రమ్ము.

(అని నడచు చున్నారు.)

సాగ—ఇప్పుడు స్వయముగానే యురిపెట్టుకొని ప్రాణత్యాగముచేయుట యుత్తమము. మాసంకేతవృత్తాంతము తెలిసి దేవిగారిచేత నుసంగత పరిభవపఱచఁబడినట్టే నేనును పరిభవింపఁబడుదును. కాఁబట్టి యీలోపలనే నేనశోకవృక్షమువద్దకు వెళ్ళి నాకోరికను నెఱవేర్చుకొనెదను. (అని వెళ్ళుచున్నది.)

వసం—(ఆలకించి) నిలువు; కొంచెమునిలువు. కాలిచప్పుడు వినఁబడుచున్నది. ఒకవేళ పశ్చాత్తాపము తెచ్చుకొని దేవిగారే మరల నిటవచ్చియుందురని నేను భావించెదను.

రాజు—మిత్రుఁడా! అయి యుండవచ్చును. దేవిమహాను భావురాలుకదా! వేగిరము వెళ్ళి చూచి రా.

వసం—దేవరయాజ్ఞాప్రకారము చేసెదను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

సాగ—(సమీపించి) కాఁబట్టి నేనీమాధవీలతతో పాశము చేసికొని, అశోకవృక్షమున నురిపెట్టుకొని చచ్చెదను. (అని లతాపాశమును చేయుచు) హాపితా! హామాతా! మందభాగ్యురాలనైన నేనిప్పుడనాథనై దిక్కుమాలి చచ్చుచున్నాను.

(అని కంఠమునందు లతాపాశమును చుట్టుకొను చున్నది.)

వసం—(చూచి) ఏమీ! మరల దేవియైన వాసవదత్తయే వచ్చినది! (తొట్రుపాటుతో బిగ్గరగా) ఓమిత్రుఁడా! వాసవదత్తాదేవి యురిపోసికొని చావఁబోవు చున్నది. రక్షింపుము. రక్షింపుము.

రాజు—(తొట్రుపాటుతో సమీపించి) చెలికాఁడా! ఆమె యెక్కడ? ఆమె యెక్కడ?

వసం—అదిగో.

రాజు—(కంఠమునుండి పాశమునుతీయుచు) ఓసాహసికురాలా! ఏమి ఈయకార్యమును జేయుచున్నావు?

క. నీమెడను బాశముండఁగ,
భామా! కంఠగతమయ్యెఁ బ్రాణంబులు నా
కేమందు నిపుడు? మానుము
నీమృతికే కాదుగనుక నీయుత్నంబుల్.

సాగ—(రాజునుజూచి తనలో) ఆశ్చర్యముగా నున్నది! ఇది యేమి రాజేయిక్కడకు వచ్చినాఁడు! (సంతోషముతో) ఈయనను జూడఁగానే నాకు మరల జీవితాశ కలుగుచున్నది! అయినను, ఈయన దర్శనముచేత కృతార్థురాలనయి, నేనురిపోసికొని సుఖముగా ప్రాణములు విడిచెదను. (బిగ్గరగా) రాజా! నేను పరాధీనురాలనుగనుక నన్నువిడువుము విడువుము; మరణము నొందుటకు నాకిటువంటి యవసరము మరల దొరకదు. నీవును దేవిగారివిషయమున నాపరాధివి గాకుము.

(అని మరల కంఠమునందు పాశముచు బెట్టుకొనఁబోవుచున్నది.)

రాజు—(నిరూపించి సంతోషముతో) ఏమీ! నాప్రియురాలయిన సాగరిగా? (అని కంఠమునుండి త్రాడు లాగి)

గీ. ఇంతిరో! యింతసాహసం బేల నీకు?
వేగ మీలతాపాశంబు విడిచి నీవు
విడలనుంకింప నాప్రాణవితతిఁ గావ
నిలువు నీబాహుపాశ మీఁగళమునందు.

(అని యామె బాహుపాశమును లాగి కంఠమునం దుంచుకొని స్పర్శసుఖము నభినయించుచు వసంతకునితో) సఖుఁడా! ఇది మబ్బు లేనివర్షముగా నున్నది!

వసం—మిత్రుఁడా! అకాలవాయువై వాసవదత్తాదేవి రాక పోయినపక్షమున, ఇది యటువంటిదే.

[అప్పుడు వాసవదత్తయు, కాంచనమాలయు ప్రవేశించుచున్నారు.]

వాస—ఓసీ! కాంచనమాలా! ఆప్రకారముగా పాదముల మీఁదఁబడిన ప్రాణవల్లభుని దిరస్కరించివచ్చి నేనతినిష్ఠురముగ జేసినదానను. కాఁబట్టి యిప్పుడు నేను నాయంతనేవెళ్ళి భర్తగారి నూఱడించెదను.

కాంచ—దేవిగారుతప్ప మఱియొక రెవ్వరీవిధముగాఁ బలుక నేర్తురు? మంచిది. అతఁడే దుర్జనుఁడు కానిమ్ము; దేవిగారు కావలదు. కాఁబట్టి దేవీ! రమ్ము రమ్ము. (అని నడుచుచున్నారు.)

రాజు—ఓసి ముగ్ధురాలా! ఏమి? నీ యుపేక్షవలన మేమిప్పుడును విఫలమనోరథుల మగుచున్నాము!

కాంచ—(చెవి యొగ్గి విని) దేవీ! సమీపమున రాజుగారు మాటాడుచున్నారు. అందుచేత నిన్నోదార్చుటకే యాయన వచ్చుచున్నారని నేనూహించెదను. దేవీ! ఎదురుగా వెళ్ళుము.

వాస—(సంతోషముతో) ఆయన చూడకుండ వెనుకనుండి వెళ్ళి కంఠమును కౌఁగిలించుకొని యాయనను మన్నించెదను.

వసం—ఓసాగరికా! ధైర్యమువలంబించి నాప్రియమిత్రునితో మాటాడుము.

వాస—(విని విషాదముతో) కాంచనమాలా! ఏమీ! సాగరికకూడ నిక్కడనే యున్నది! కాఁబట్టి యామాటలు విను

వలెనున వెనుకకు వెళ్ళుదము. (అని తొందరలాగునఁ జేయు చున్నది.)

సాగ—రాజా! ఈ లేని దాక్షిణ్యము నేలకనఁబఱచెదవు? నీజీవితముకంటెను నతిప్రియురా లయిన దేవిగారికి మరల నీవప రాధి వేల యయ్యెదవు?

రాజు—నీ వన్నమాట సత్యము కాదు.

సీ. శ్వాసముచే దేవి స్తనయుగంబు చలింప
నించుక నేనుఁ జలించినాఁడ
ఆమె నాతోడ మాటాడకూరకయున్నఁ
బ్రియవాక్యు లాడితి వినయముగను
భ్రూభంగ మాయమముఖమునఁ గాన్పింపఁ
బదములమీఁద నేఁబడినవాఁడ
సర్వాంశమున రాణి జననమొందినదాట
చేతను నే సేవఁ జేసినాఁడ
నంతెకాని యామెయందుఁ గల్గినయట్టి
ప్రేమ నిక్కమైనప్రేమ గాదు
నీరజాక్షి నాకు నీమీఁది ప్రేమంబె
స్నేహగరిమచేత నెగడుఁ జుమ్ము.

వాస—(చేరఁబోయి రోషముతో) ప్రాణేశ్వరా! మంచిపని. ప్రాణేశ్వరా! ఇది మంచిపని.

రాజు—(చూచి వెఱఁగుపాటుతో) దేవీ! నిష్కారణముగా నన్ను నీవు నిందింపఁగూడదు. వేషసాదృశ్యమువలన నీవే యని భావించి మే మిక్కడకు వచ్చినాము. కాఁబట్టి క్షమింపుము.

(అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

వాస—(రోషముతో) ప్రాణేశ్వరా! లెమ్ములెమ్ము. ఇప్పుడును నేను సర్పాంశమునందుఁ బుట్టితి నను హేతువుచేతనే నేవా దుఃఖము ననుభవించుచున్నావా యేమి?

రాగా—(తనలో) ఏమి! దేవి యీమాటయు విన్నది! అందుచే నే నన్నివిధముల చేతను దేవిని శాంతపఱుచు నుపాయమును నిరాశచేసుకొన్నాఁడను. (అని క్రిందు చూచుచున్నాఁడు.)

వసం—అమ్మా! ఉరిపెట్టుకొని నీవు ప్రాణత్యాగము చేసికొనుచున్నా వని వేషసాదృశ్యమువలన భ్రమపడి నేను నాప్రియమిత్రుని నిక్కడకుఁ దీసికొనివచ్చినాను. నామాటయందు నీకు నమ్మకము లేనిపక్షమున, ఇదిగో లతాపాశమును చూడు.

(అని లతాపాశమును చూపుచున్నాఁడు.)

వాస—(కోపముతో) ఓసీ! కాంచనమాలా! ఈ లతాపాశముతోనే యీ చెడుబ్రాహ్మణుని కట్టి తీసికొనివచ్చి, యీ దుర్వినీతురాలైన కన్యకను ముందు నడువుమను.

కాంచ—దేవియాజ్ఞాపించినట్లు చేసెదను. (అని లతాపాశమును వసంతకుని మెడకుఁ జుట్టి కొట్టుచు) ఓరి చెడుగా! వెనుకటినీ మిడిసిపాటుఫల మనుభవించు. అప్పుడు దేవిగారి దుర్వచనములచేత చెవులు కటువు లయిన వన్నమాట జ్ఞప్తికిదెచ్చుకో — సాగరికా! నీవును ముందుండుము.

సాగ—(తనలో) పుణ్యవిహీనురాల నైన నేను స్వేచ్ఛగా మరణము నొందుట కయినను చాలకపోయితిని!

వసం—(విషాదముతో) ఓమిత్రుఁడా! దేవిగారిచేత కట్టఁబడి విపత్తులోనున్న దిక్కుమాలిన నన్ను మఱవకుము.

(అని రాజును చూచుచున్నాఁడు.)

వాస—(రాజువంకఁ జూచుచున్న సాగరికను వసంతకుని తీసికొని కాంచనమాలతోడఁగూడ వెళ్ళుచున్నది.)

రాజు—(ఖేదముతో) అయ్యో! కష్టము!

చ. అలుకతోయి స్వవర్ణయయినట్టి కులాంగనకై తపించనా?
జలుకునరాణికిం బెగడు సాగరికం గని దుఃఖ మొందనా?
చలమున రాణి కట్టికొనిచన్న వసంతకుఁ గూర్చి కుందనా?
యలజడినొంది యొక్క క్షణమైనను స్వస్థత జెంద నన్నిటన్.

ఇప్పు డిక్కడ నుండుటవలన నేమి ప్రయోజనము? దేవిని శాంతపఱచుట కయి యంతఃపురమునకు వెళ్లెదను.

(అందఱును వెళ్ళుచున్నారు.)

## చతుర్థాంకము.



(స్థలము— రాజనగరు.)

[రత్నహారమును పట్టుకొని, కన్నీరువిడుచుచు సుసంగత ప్రవేశించుచున్నది.]

సుసం—(శోకముతో నిశ్వసించి) హా! ప్రియసఖీ! హా సాగరికా! హా లజ్జాళుకా! హా! సఖీజనవత్సలా! హా! ఉదారశీలా! హా! సౌమ్యదర్శనా! నీ వెక్కడకు వెళ్ళినావో నాకు ప్రతివచనమిమ్ము. (పయివంకఁజూచి నిట్టూర్పు విడిచి) కరుణలేని యో దైవమా! నీ వటువంటి యసామాన్యరూపశోభావిరాజిత యగుకాంతను సృజించి మరల నిటువంటి యవస్థాంతర మా మె కేల కల్పించి నావు? ఆమె తనజీవితమందలి నిరాశచేత నెవ్వని కయిన నొకబ్రా

హ్మణుని కిమ్మని యీరత్నహారమును నాచేతి కిచ్చినది. నేను దీని నే బ్రాహ్మణున కియ్యను? (తెరవంక జూచి) అదుగో బ్రాహ్మణుఁ డయిన వసంతకుఁ డీవంకనే వచ్చుచున్నాఁడు. కాఁబట్టి నేనతనిచేతి కిచ్చెదను.

[అప్పుడు హృష్టుఁడగు వసంతకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసం—ఆహాహా! ఇప్పుడు నాప్రియమిత్రుని యనుగ్రహము చేత పూజ్యురాలైన వాసవదత్తాదేవి నాకట్లువిడిపించి తనచేతిలోనే నాకు లడ్డుకములను మోదకములును పెట్టఁగా వానితో నేను కడుపు నిండించుకొన్నాను. ఆమె నాకు రెండుపట్టువస్త్రములను కర్ణాభరణ మునుగూడ నిచ్చినది. ఇప్పుడు వెళ్ళి నాప్రియమిత్రుని దర్శించెదను.

(అని కొంచెము నడచుచున్నాఁడు)

సుసం—(కన్నీరు విడుచుచు వేగముగావచ్చి) అయ్యా! వసంతకా! ముహూర్తమాత్రము నిలువుము.

వసం—(చూచి) ఏమి! సుసంగతా! ఇక్కడ నీవెందుకేడ్చు చున్నావు? సాగరిక కేమియు నపాయము సంభవించలేదుగదా?

సుసం—అయ్యా! వసంతకా! నేనది నివేదించుటకే వచ్చి నాను. భీతురా లయినయామెను దేవిగా రుజ్జయినికిఁ బంపినట్లు ప్రవాదము గలుగఁజేసి యర్థరాత్రమునందుఁ దీసికొనిపోయినారు. ఆమె యెక్కడకు పంపబడినదో తెలియదు.

వసం—(తొందరపాటుతో) హా! సాగరికా! హా! అసామాన్యరూపశోభావిభవా! హా! మృదుభాషిణీ! నీవిప్పు డెక్కడ నున్నావో నాకు మాఱుపలుకుము. దేవిగారు చేసినపని మిక్కిలి దయాగహీనముగా నున్నది.

సుసం—అయ్యా! వసంతకా! ఇదిగో రత్నమాల. ఆమెజీవి తముపందు నిరాశురాలయి పూజ్యుఁడయినవసంతకున కిమ్మని యీ రత్నహారమును నాచేతి కిచ్చినది. ఇదిగోదీనిని పుచ్చుకొమ్ము.

వసం—(శోకముతో కన్నీరు విడుచుచు కన్నుల నద్దుకొని) ఓసీ! ఇట్టివేళలో దీనిని పుచ్చుకొనుటకు చేతు లెట్లాడును! (అని యిద్దఱు నేడ్చుచున్నారు)

సుసం—(చేతులు జోడించుకొని) అయ్యా! ఆమెయం దైన ననుగ్రహించి, అంగీకరింపుము.

వసం—(కొంచెము చింతించి) కానిమ్ము. దీనిని తీసికొని వెళ్ళి సాగరికావిరహదుఃఖితుఁడయి యున్నప్రియమిత్రుని నైనమాటడించి యతనికి వినోదము గలిగించెదను.

సుసం—(వసంతకునిచేతిలో రత్నహారమును పెట్టుచున్నది)

వసం—(పుచ్చుకొని చూచి విస్మయముతో) సుసంగతా! ఇటువంటియమూల్యాలంకార మామె కెక్కడనుండి వచ్చినది?

సుసం—అయ్యా! నాకును కుతూహలము గలిగి యామె కీప్రశ్నయే వేసితిని.

వసం—ఆమె యేమని చెప్పినది?

సుసం—అప్పు డామె మీఁదు చూచి నిట్టూర్పు విడిచి, సుసంగతా నన్నిప్పు డాకథ యేల యడిగెదవని యేడ్వ మొదలు పెట్టినది.

వసం—ఆమె చెప్పకపోయినను, సామాన్యజనులకు దుర్లభ మైనయీహార మామెకుఁ గలిగి యుండుటచేతనే నిస్సందేహముగా నామె మహావంశసంభూతురాలయి యుండవలెను. సుసంగతా! నాప్రియమిత్రుఁ డిప్పు డెక్కడ నున్నాఁడు?

సుసం—అయ్యా! రాజుగారు దేవిగారి గృహమునుండి వచ్చి యుదె స్ఫటిక శిలామండపము నధిరోహించి యున్నారు; నీవక్కడకు వెళ్ళుము. నేనును వాసవదత్తాదేవి పరిచర్యనిమిత్తముయి వెళ్లెదను.
(అని నిష్క్రమించుచున్నది)

[అప్పుడు పీఠముమీఁదఁ గూరుచుండి రాజు
ప్రవేశించుచున్నాఁడు]

రాజు—(ఆలోచించి)

చ. కపటపుబాసలం బ్రియముగప్పుడుమాటలఁ జిత్తవృత్తిన్
గృపరయొదవించువర్తనల నిం డగుసిగ్గునఁ గాళ్ళ గ్రాలుటన్
నిపుణసఖీసుబోధముల నెమ్మదికోపము పోదు రాణికిన్
జపలతరస్వకీయనయనంబుల నీటనుబోలె నేమిటన్.

(విచారముతో నిట్టూర్పువిడిచి) ఇప్పు డింతవఱకు దేవినే నేను శాంతపఱుచు చుండినను, కేవలమును సాగరికావిషయమయిన చింతయే నన్ను బాధించుచున్నది. ఎట్లన—

గీ. మించుననురాగమునఁ గౌఁగిలించినపుడు
మరుఁడు తొలుత వేసినబాణమార్గమునను
నంబురుహగర్భసుకుమార యైనకాంత
చని మదీయహృద్గత యయ్యెనని తలంతు.

(ఆలోచించి) నాయూఱట కునికిపట్టు వసంతకుఁడు; అతఁడు దేవిచే కట్టఁబడి యున్నాఁడు. ఇఁక నే నెవరిముందఱఁ గన్నీరు విడుతునో!
(అని నిట్టూర్పు విడుచుచున్నాఁడు)

[అప్పుడు వసంతకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసం—(వెళ్ళి చూచి విస్మయముతో) నిరంతరమనో వేదనచేత చిక్కినవాఁ డయ్యును శ్లాఘనీయ మగుచునలావణ్యముతో నుద

యించిన రెండవచంద్రునివలెనే నాప్రియసఖుఁడదె యధికతరముగా ప్రకాశించుచున్నాఁడు. కాఁబట్టి నేనాయనవద్దకు వెళ్లెదను. (అని చేరఁబోయి) ఓమిత్రుఁడా! నీకు శుభ మగుఁగాక! నీవదృష్టవంతుఁడవు. దేవిగారిచేతఁ జిక్కినవాఁడ నయ్యుయు మరల నేను నిన్నికన్నులతోఁ జూడఁగాంచితి.

రాజు—(చూచి హర్షముతో) ఓహో! నా వసంతకుఁడు నాకు లభించినాఁడు. మిత్రుఁడా! నాకు నీ కౌఁగిలి యిమ్ము.

వసం—(కౌఁగిలించుకొని) ఓ మిత్రుఁడా! దేవిగారిచే నే ననుగ్రహింపఁ బడినాఁడను.

రాజు—నీవు దేవిగారి యనుగ్రహమునుపొందినసంగతి నీ వేష చెప్పుచున్నది. కాఁబట్టి యిప్పుడు సాగరికావృత్తాంతమును జెప్పుము.

వసం—(వెఱఁగుపాటుతో క్రిందుచూచుచు కూరుచున్నాఁడు)

రాజు—మిత్రుఁడా! ఏమి! చెప్పకున్నావు?

వసం—అప్రియమును నీకు చెప్పఁజాలను.

రాజు—(తొందరతోను తొట్రుపాటుతోను) మిత్రుఁడా! అప్రియమేలాగు? ఏమి? నిజముగానే యామె ప్రాణము విడిచినదా? హాప్రియురాలా! సాగరికా! (అని మూర్ఛపోవుచున్నాఁడు)

వసం—(తొట్రుపాటుతో) ప్రియమిత్రుఁడా! ఊరడు మూఁడుము.

రాజు—(మూర్ఛ తేఱి కన్నీటితో)

గీ. వేగ ప్రాణములార! న న్విడచి మీరు
పొందు దక్షిణమునకు నాబుద్ధివించు
వేగఁ బోలేని, మిమ్మామె విడలలాగు;
దవ్వుగా నేను నిప్పుడా దంతిగమన.

వసం—మఱియొకవిధముగాఁ దలఁపఁ బోకుము. భీతురా లయిన యూమెను దేవిగా రుజ్జయినీనగరమునకుఁ బంపిరని విన్నాను. అందుచేత నే నప్రియ మని చెప్పినాను.

రాజు—ఏమి! ఉజ్జయినికి పంపినదా? రాణి యేమియు నాతోఁ జెప్పకయే చేసినది. మిత్రుఁడా! ఈసంగతి నీతో నెవరు చెప్పినారు?

వసం—సుసంగత. అంతేకాక యెందు నిమిత్తమో కాని యూమె యీ రత్నమాలను నాచేతి కిమ్మని పంపినది.

రాజు—మఱియెందునిమిత్తము? నా కూఱట కలుగునిమిత్తమే. కాఁబట్టి, మిత్రుఁడా! అది యిటు తెమ్ము.

వసం—(ఇచ్చుచున్నాఁడు.)

రాజు—(పుచ్చుకొని చూచి రత్నమాలను హృదయమునం దుంచుకొని) ఆహాహా!

గీ. పూర్వ మూమెకంఠాశ్లేషమునఁ జెలంగి
యిపుడు ప్రభ్రష్ట మయి యుంట నెంచిచూడ
రత్నమాల తుల్యావస్థ రహిఁ వహించి
సఖ యగుచు నాకు నూఱట సలుపుచుండు.

మిత్రుఁడా! ఇది నీకంఠమున ధరింపుము. దీనిఁ జూచుచున్నను నేను ధైర్యముతో నుండెదను.

వసం—దేవరవా రాజ్ఞాపించినట్లే చేసెదను.

(అని కంఠమున ధరించుకొనుచున్నాఁడు.)

రాజు—(కన్నీటితో నిట్టూర్పువిడిచి) మిత్రుఁడా! ప్రియురాలిపునర్దర్శనము దుర్లభము.

వసం—(భయముతో దిక్కులు చూచి) ఈమాట బిగ్గరగా

ననకుము. ఇక్కడ దేవిగారి పరిచారిక లెవ్వరైనను తిరుగు చుందురు.

[అప్పుడు వసుంధరయను వేత్రహస్త ప్రవేశించుచున్నది]

వసుం—(దగ్గఱగా వచ్చి) మహాప్రభూ! జయమగుఁగాక! జయమగుఁగాక! రుమణ్వంతుని మేనల్లుఁ డయిన విజయవర్మ దేవర వారి కేదో నివేదించుటకయి వచ్చి వాకిట నిలిచి యున్నవాఁడు.

రాజు—వసుంధరా! వేగిర మతని పిలుచుకొనిరా.

వసుం — దేవరవారి యాజ్ఞాప్రకారముగాఁ జేసెదను. (అని వెళ్ళి విజయవర్మతో మరలఁ బ్రవేశించి) విజయవర్మా! అదుగో రాజుగారు, ఆయనదర్శనము చేసికొమ్ము.

విజయ—(సమీపమునకు వచ్చి) దేవా! మీకు విజయమగుఁగాక! విజయమగుఁగాక! రుమణ్వంతుని విజయముచేత దేవరవారదృష్టవంతులు.

రాజు—(సంతోషముతో) విజయవర్మా! కోసలరాజు జయింపఁబడినాఁడా?

విజయ— దేవరవారియనుగ్రహమువలన.

రాజు—మేలు! రుమణ్వంతా! మేలు! అచిరకాలములోనే మహాకార్యమును సాధించితివి!— విజయవర్మా! మాకు వినవేడుకగానున్నది గనుక, ఆకథ సవిస్తరముగా వినిపింపుము.

విజ—దేవరవారు చిత్తగించవలెను. దేవరవారి యాజ్ఞచొప్పన మేమిక్కడనుండి కొన్నిదినములలోనే యనేక గజతురగపదాతులచేత ననివార్య మయిన గొప్ప సేనా సమూహమును గూర్చుకొని వెళ్ళితిమి. రుమణ్వంతుఁడు వింధ్యదుర్గమం దున్న కోసలపతి యొక్క ద్వారమున నిలిచి, సేనలతో ముట్టడివేయుట కారంభించెను.

రాజు—తరువాత తరువాత.

విజ—అప్పుడు కోసలేశ్వరుఁడును అతిదర్పముచేత రుమ ణ్వంతునివలని పరాభవమును సహింపలేక, గజసమూహబాహుళ్య మయిన తనసైన్యము నంతను యుద్ధమునకు సిద్ధము చేసెను.

వసం—నాహృదయము కంప మొందుచున్నది. వేగిరము చెప్పు.

రాజు—అనంతరము.

విజ—అతఁడు కృతనిశ్చయుఁడయి,

మహాస్రగ్ధర.

సమరంబున్ జేయ వింధ్యాచలము వెడలి, చంచన్మదేభాళియున్ విం
ధ్యము వేటొక్కండనంగా దశదిశ లలమన్, తత్క్షణంబే పవాళి
న్గుమిగాఁద్రొక్కించి యేనుంగులవితతులచే, నూల్పఁగా బాణవృష్టి
న్సుమహోగ్రుండై రుమణ్వంతుఁడు రిపుకడమిన్జూచి రెట్టింపుధాటిన్
కవిసె నప్పుడు మఱియును—

చ. శిరములు బాణఘాతములచేత శిరస్త్రచయంబులోఁ బడన్
శరములు తాఁకి గాయములజాడను రక్తము జాలువాఱఁగా
నరభసలీల శస్త్రకవచంబుల తాఁకున నగ్ని పుట్టఁగా
దుర మొనరించెఁ గోసలుఁడు తూలి ప్రధానబలంబు రూపఱన్.

రాజు—ఇది యేమి! మనబలంబులుసహితము భగ్నము లగుచున్నవి!

విజ—గీ. మన రుమణ్వంతుఁ డొక్కఁడు మొనసి తాఁకి
కుంజరస్థుఁడై పోరాడుకోసలేంద్రు
నుత్తమాంగంబు ఖండించె నొక్కపెట్ట
నిశితవిశిఖశతంబులు నిగుడఁ జేసి.

వసుం—జయము కలిగినది! జయము కలిగినది! మనకే జయము కలిగినది! (అని గంతులు వేయుచున్నాఁడు.)

రాజు—మేలు! కోసలరాజా! మేలు! శత్రువులుసహిత మీ పరికారముగా నీపౌరుషమును వర్ణించుచుండుటచేత నీవు మృతుఁడ వయ్యును శ్లాఘ్యుఁడవే. తరువాత; తరువాత.

విజయ—దేవా! అనంతరము రుమణ్వంతుఁడును కోసలదేశ పరిపాలనమునకయి నాజ్యేష్ఠభ్రాత యయినసంజయవర్మను నిలిపి, గాయపడినగజబాహుళ్యము గలసేన నంతను వెంట నడిపించుకొని మెల్లమెల్లఁగా వచ్చుచున్నాఁడు.

రాజు—వసుంధరా! యౌగంధరాయణునికడకుఁ బోయి ప్రియవార్తను దెచ్చినందున కీతనికి మేము బహుమతి నిమ్మన్నా మని చెప్పు.

వసుం—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను. (అని విజయ వర్మతోఁగూడ నిష్క్రమించు చున్నది.)

[అప్పుడు కాంచనమాల ప్రవేశించు చున్నది]

కాంచ—'ఓసీ! కాంచనమాలా! నీవువెళ్ళి యీయైంద్రజాలి కుని రాజుగారిదర్శనము చేయించు మని దేవిగారు నా కాజ్ఞయిచ్చిరి. (అని కొంచెము నడిచిచూచి) అదుగో రాజుగారు, ఆయనదగ్గఱకు వెళ్ళెదను. (దగ్గఱకువెళ్ళి) దేవరకు జయ మగుఁగాక! జయ మగుఁ గాక! దేవా! ఉజ్జయినీనగరము నుండి సంవరణసిద్ధి యనునైంద్రజాలి కుఁడు వచ్చి యున్నాఁడని దేవిగారు తమతో విన్నవించు మన్నారు. దేవరవా రాతనికి దర్శన మిత్తురుగాక!

రాజు—మాకు వేడుకగా నున్నది. ఇప్పు డైంద్రజాలికుని శీఘ్రముగా తీసికొనిరమ్ము.

కాంచ—దేవరవారి యాజ్ఞ చొప్పునఁ జేసెదను. (అని వెళ్ళి నెమలిపింఛము చేతఁ బట్టుకొని యున్నయైంద్రజాలికునితోఁగూడ మరల ప్రవేశించుచు)—అయ్యా! రండిరండి.

సంవరణ—(వచ్చుచున్నాఁడు.)

కాంచ—అదుగో ప్రభువువారు. వారిసన్నిధికి వెళ్ళుము.

సంవ—(దగ్గఱకు వెళ్ళి దేవా! జయ మగుఁగాక! జయ మగుఁగాక! (నెమలిపింఛము నాడించుచు నవ్వుచు)

గీ. ఇంద్రజాలనామము గల్గె నెవనివలన
నట్టియింద్రునిచరణంబు లాశ్రయింతు;
విదితయశుఁ డయి మఱి జాలవిద్యలకును
గురువయినయట్టి శంబరుఁ గొలుతు నేను.

దేవా! ఏమి కావలెను?

గీ. అవనిమీఁదను జంద్రుఁడో, దివిని నగమొ,
జలములో నగ్నియో, ప్రదోషంబొ పగలు,
ప్రభువువారికి దేనిపై వాంఛ గలదొ
యదియు సిద్ధించు నానతీయంగవలయు.

గీ. హరిహరబ్రహ్మ లాదిగా నఖిలసురల
మింటఁ జూపింతు నిప్పుడ మీకు నేను;
సిద్ధవిద్యాధరామరస్త్రీసమూహ
నృత్యమును మీరు చూడుఁడీ నింగిమీఁద.

వసం—మిత్రుఁడా! జాగ్రత్తగానుండుము. ఇటువంటిగర్వము గలవానికి సర్వము సంభావ్యమేయగును.

సంవ—దేవా! పలుమాటలేల? దేవరవారు మనసులో దేనిని

చూడఁగోరుదురో దానినెల్లను నాగురువుయొక్క మంత్రప్రభావము చేతఁ జూపఁగలను.

రాజు—ఓయీ! దేవివచ్చినదాఁక నుండుము—కాంచనమాలా! దేవిగారికడకుఁ బోయి యీయైంద్రజాలికుఁడు నీవాఁడు; ఈప్రదేశము విజనముగా చేయఁబడినదిగనుకర'మ్మని చెప్పు.ఆమెతో గలిసియే మేమీవినోదమును జూచెదము.

కాంచ—ఏలినవారాజ్ఞాపించినట్లు చేసెదను.(అని వెళ్లి వాసవదత్తా సహితముగా మరల ప్రవేశించుచున్నది.)

వాస—కాంచనమాలా! ఉజ్జయినీనగరమునుండి వచ్చినాఁడన్నమాత్రముచేతనే నా కాయైంద్రజాలికునియందు పక్షపాతము కలుగుచున్నది.

కాంచ—పుట్టినింటివంకవాఁడు గనుక దేవిగారిచే నితఁడాదరింపఁబడఁ దగినవాఁడు. దేవీ! రమ్ము రమ్ము. (అని నడచుచు) అదిగో రాజుగారు, సమీపమునకు వెళ్ళుము.

వాస—(దగ్గఱకు వెళ్ళి) భర్తా! జయముగుఁగాక! జయముగుఁగాక!

రాజు—దేవీ! ఇతఁడు బహువాక్యములు పలికినాఁడు. కాఁబట్టి యిక్కడనే కూరుచుండి యిది చూతము.

వాస—(కూరుచున్నది.)

రాజు—ఓయీ! వివిధములయిన నీయింద్రజాలమును గనఁబఱుపుము.

వసం—దేవరవారి సెలవుప్రకారము చేసెదను. (అని బహువిధముల చిందులుత్రొక్కుచు నెమలిపింఛము నాడించుచు 'హరిహర

బ్రహ్మ''లను పద్యమును మరలఁ జదువుచున్నాఁడు. అప్పుడందఱును విస్మయపడి చూచుచున్నారు.)

రాజు—(పయివంకఁజూచి పీఠమునుండి లేచి) ఆశ్చర్యము !

వసం—ఆశ్చర్యము! ఆశ్చర్యము!

రాజు—దేవీ! చూడుము—

సీ. పద్మాసనస్థుఁడై బ్రహ్మదేవుండదె యొక
చోట వెలుఁగొందుచున్నవాఁడు
శంకరుండల్లదె చంద్రకళావతం
సుండయి యొకవంక సొగబు మీఱు
దైత్యారి యతఁడె గదాచక్రఖడ్గశా
ర్ఙ్గకములతో నాల్గుభుజములందు
నైరావతంబెక్కి యతఁడె దేవేంద్రుండు
తిన్నగాఁ గన్పడుచున్నవాఁడు
చరణములనూపురములు సుస్వరము లీన
దేవతాసుందరులతోడ దివమునందుఁ
దక్కఁగలయట్టి యమరబృందంబు లివిగొ
నృత్యమొనరించెదును గడు నేర్పుమీఱ.

వాస—ఆశ్చర్యము! ఆశ్చర్యము!

వసం—ఐంద్రజాలికా! మేలుమేలు! నీవు నీ నేర్పునంతను గనఁబఱిచితివి! (రహస్యముగా) ఓరితొత్తుకొడకా! ఐంద్రజాలికా! ఈచూపఁబడిన దేవతలతోడను, అప్సరసలతోడను మాకుపని యేమి! ఈయనమనసంతోషపెట్టఁ గలుగుదువేని, సాగరికను జూపుము.

[అప్పుడు వసుంధర ప్రవేశించుచున్నది.]

వసుం—(రాజు సమీపమునకువచ్చి) భర్తా! జయమగుఁగాక! జయమగుఁగాక! మంత్రియైన యౌగంధరాయణుఁడు దేవరవారి చరణసన్నిధానమున "సింహళేశ్వరుఁడయిన విక్రమ బాహువుచేతఁ బంపఁబడిన యాతని ప్రధానమంత్రియగు వసుభూతి మనకించుకిఁయైన బాభ్రవ్యునితోఁగూడ వచ్చియున్నాఁడు; ఆతని కీమంచిముహూర్త మున నే యేలినవారు దర్శన మియ్యఁదగును. నేనును కార్య శేషమును ముగించి దర్శనమునకు వచ్చెదను." అని విన్నపము చేయుమన్నాడు.

వాస—దేవా! కొంచెము సే పింద్రజాలమును చాలింప నియ మించి, మాపినతండ్రిగారి యొద్దనుండి ప్రధానమంత్రియైన వసుభూతి వచ్చియున్నాఁడు గనుక ముందుగా దేవరవారాతనికి దర్శన మియ్య వలెను.

రాజు—దేవిచెప్పినట్లు చేసెదను. (ఐంద్రజాలికుని గూర్చి) ఓయీ! నీవిప్పుడు కొంచెము తాళుము.

వసుం—(మరల పింఛముత్రిప్పుచు) దేవరవారి యాజ్ఞాప్రకా రము చేసెదను. (అని వెళ్ళుచు) దేవరవారవశ్యముగాఁ జూడఁదగి నది నావద్ద నిఁక వేడుటమాత్రి మున్నది.

రాజు—మేమది తరువాతఁ జూచెదము.

వాస—కాంచనమాలా! ఈతనిని తీసికొనివెళ్ళి పారితోషిక మిప్పింపుము.

కాంచ—దేవిగారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని యైంద్ర జాలికునితోఁగూడ వెళ్ళుచున్నది.)

రాజు—(వసంతకునివంక తిరిగి) నీ వెదురుగావెళ్ళి వసుభూ తిని తీసికొని రమ్ము.

వసం—దేవర యానతిచ్చినట్లు చేసెదను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

[వసంతకుఁ డెదురుగా వెళ్ళి తీసికొనిరాఁగా వసుభూతియు బాభ్రవ్యుఁడును ప్రవేశించుచున్నారు.]

వసం—మంత్రివరా! రమ్ము రమ్ము.

వసు—(అంతటనుగలయఁజూచి) ఆహా! ఉదయనమహారాజు ప్రభావము!

సీ. విజయగజంబుల వీక్షించి ముందుగా
ముఖశాలవాకిట మోదమంది
తరువాత నుత్తమతురగచయంబులఁ
గన్నులపండువు గాఁగఁజూచి
యావలఁ గడుశ్రావ్యమౌ గానరవమున
కాత్స్న్యో నెంతయు హర్షమొంది
యటుపిమ్మటను దర్శనార్థము వేచెడి
క్ష్మాతలపతులతో క్షణము నిలిచి
వాకిటనె సింహళేశ్వరు వైభవంబు
నెల్ల మఱచితి క్షణములో నిప్పు డేను
ద్వారగతుఁడనై కౌతుకగౌరవమున
గ్రామ్యగతినైతి నగరశ్రేష్ఠు కనినయట్లు.

బాభ్ర—వసుభూతీ! చిరకాలమున కిప్పుడు ప్రభువును చూడఁగలనను సంతోషాతిశయముచేత నేనో క్రొత్తయవస్థ ననుభవించుచున్నాను. ఎట్లన—

చ. ముదిమిని బుట్టుకంపము ప్రపూర్ణభయంబున వృద్ధిగాంచెడున్
గడరెడుఁ జీకటుల్ మసక గ్రమ్మినదృష్టికి బాష్పవారిచే

స్గదలికఁ బెంచె గద్గదిక నాదగుస్పష్టము కానివాణికిన్
మ్ముదిమికి సాయ మయ్యెడును భూధవుఁజూచెదు వేడ్క నాకిటన్.

వసం—(ముందుకు వచ్చి) మంత్రివరా! రమ్ము రమ్ము.

వసు—(వసంతకుని మెడలో రత్నహారము చూచి రహస్యముగా) బాభ్రవ్యా! ఇది మనము బయలుదేఱినప్పుడు మహారాజుగారు తమ కొమార్తెకిచ్చిన రత్నమాలలాగుననే యున్నది.

బాభ్ర—అమాత్యా! పోలిక యాలాగుననే యున్నది. ఆ మెహారము వసంతకుని కెట్లు వచ్చినదో యడిగి తెలిసికొనదను.

వసు—బాభ్రవ్యా! అడుగవలదు. గొప్పరాజులవద్ద బహురత్నము లుండును గనుక, దానినిపోలినది మఱియొక భూషణముండుట దుర్లభము కాదు. (అని నడచుచున్నాఁడు.)

వసం—(రాజునుద్దేశించి) వత్సరాజా! అడుగోమంత్రి. ఎదురుగా వెళ్ళుము.

వసు—(దగ్గఱకు వెళ్ళి) దేవా! జయ మగుఁగాక!

రాజు—(లేచి) అభివాదముఁ జేయుచున్నాను.

వసు—దేవరకు గొప్ప శ్రేయస్సు కలుగునుగాక!

రాజు—మంత్రికి పీఠము పీఠము.

వసం—(పీఠము తెచ్చి) అమాత్యా! ఇదిగోపీఠము కూరుచుండుము.

వసు—(కూరుచున్నాఁడు.)

బాభ్ర—దేవా! బాభ్రవ్యుఁడు ప్రణామము చేయుచున్నాఁడు.

రాజు—(వీపుమీఁద చేయివైచి) బాభ్రవ్యా! ఇక్కడ కూరుచుండుము.

బాభ్ర—కూరుచుండి) దేవీ! బాభ్రవ్యుఁడు ప్రణమిల్లు చున్నాఁడు.

వసం—అమాత్యా! అదిగో వాసవదత్తాదేవి ప్రణమిల్లు చున్నది.

వాస—అయ్యా! నమస్కారము చేయుచున్నాను.

వసు—దేవీ! వత్సరాజుతో తుల్యుఁ డయిన సుపుత్రుని గనుము. (అందఱును కూరుచున్నారు.)

రాజు—అయ్యా! వసుభూతీ! మహానుభావుఁ డయిన సింహళేశ్వరునకు కుశలమా!

వసు—(ప్రయవంకఁజూచి నిట్టూర్పు విడిచి) దేవా! మంద భాగ్యుఁడ నయిన నే నిప్పు డేమని చెప్పుటకును తెలియకున్నది. (అని క్రిందు చూచుచున్నాఁడు)

వసం—(తనలో) ఇతఁ డేమిచెప్పునో తెలిసికోలేకున్నాను.

వాస—(విషాదముతో తనలో) అయ్యో! వసుభూతి యిప్ప డేమి చెప్పునో గదా!

రాజు—వసుభూతీ! ఈవిధముగా నీవేల వ్యాకులపడుచు న్నావో నాకుఁ జెప్పుము.

బాభ్ర—(రహస్యముగా) ఆలస్యమేల? చెప్పదగినదేమో యిప్పుడే చెప్పివేయుము.

వసు—(కన్నీటితో) దేవా! చెప్పుట యశక్యమే యయినను మందభాగ్యుఁడ నయిన నేను దేవరవారికి విన్నవించెదను. సింహళేశ్వరుని కొమార్తె సౌభాగ్యవతి యగు రత్నావళి నేరాజు తనభార్యగ ముచేత వివాహమాడఁ గాంచునో యాతఁడు సార్వభౌముఁ డగునని యొకసిద్ధుఁ డానతిచ్చెను.

రాజు—తరువాత; తరువాత.

వసు—సిద్ధదేశమునందలి విశ్వాసముచేత యౌగంధరాయణుఁడు దేవరవారి నిమిత్తము పలుమారులు ప్రార్థించినను వాసవదత్తకు మనఃఖేదము కలదు నని సింహళేశ్వరుఁడా మె నిచ్చుట కొప్పుకొనకపోయెను.

రాజు—(రహస్యముగా) దేవీ! నీ పినతండ్రి మంత్రి యిప్పు డేమి యీలాగున నబద్ధము చెప్పుచున్నాఁడు?

వాస—(ఆలోచించి) ప్రాణేశ్వరా! ఇక్కడ నెవ రబద్ధ మాడు చున్నారో నేను తెలియఁజాలను.

వసం—ఆమె కేమి సంభవించినది?

వసు—అనంతరము లావణకమునందు వాసవదత్తాదేవి కాలి చచ్చిపోయినదని జనప్రతీతిని కలిగించి, సింహళేశ్వరునికడకు బాభ్రవ్యుని బంపి యాకన్య నిమ్మని మరల నడిగించెను. తరువాత మారాజు కొంతచింతించి, దేవరవారితోడి తమసంబంధము లోపించరా దని యారత్నావళిని దేవరవారి కిచ్చుటకుఁ బంపఁగా, మేమామెను వెంటఁబెట్టుకొని వచ్చునప్పుడు సముద్రములో నోడ పగిలి యామె మునిఁగిపోయినది. (అని యేడ్చుచు తల వంచుకొను చున్నాఁడు.)

వాస—(కన్నీటితో) అయ్యో! నేను చెడితిని! హా! మంద భాగ్యురాలా! హా! సోదరీ! రత్నావళీ! నీ విప్పు డెక్కడ నున్నావు? నాకు ప్రతివచన మిమ్ము.

రాజు—ఊరడుము, ఊరడుము, దైవగతి మానవుల దురవగాహము. ఓడ పగిలి మునిఁగిపోయినవారును మరల లేచివత్తు రనుటకు వీరు వీరే నిదర్శనముగా నున్నారు. (అని వసుభూతిని బాభ్రవ్యుని జూపు చున్నాఁడు.)

వాస—ప్రాణేశ్వరా! అట్లే యగునుగాక! నా కంతటిభాగ్య మేలాగునఁ గలుగును?

రాజు—(రహస్యముగా) బాభ్రవా! దీనివాస్తవ మేమి? నా కేమియుఁ దెలియకున్నది.

బాభ్ర—దేవా! వినుండి.

[ తెరలోపల గొప్పకలకలము ]

ఉ. జ్వాలలగుంపు హర్మ్యముల బంగరుశృంగవుటింపు నింపంగాఁ,
గీలలనిండు వేఁడిమి నొగిం టువుఁదోఁటలచెట్లు వాడఁగా,
నీలపయోదశోభ నిడ నిక్కని ధూమము కృత్రిమాద్రికిన్,
స్త్రీలు తలంక నంతిపురిఁ జేరె హతాత్తుగ నగ్ని యియ్యెడన్.
గీ. లావణకముచెంత దేవి కాలి గతించె
నన్నయాప్రవాద మరయ నిపుడు
సత్యమా నసంగ జ్వాలానమూహంబు
పొదివి యొకట నంతిపురిని గ్రమ్మె.

(అందఱును తొందరపడి చూచుచున్నారు)

రాజు—అంతఃపురమున నగ్ని పుట్టినదాయేమి? (తొట్రుపాటుతో లేచి) అయ్యో! వాసవదత్త కాలిపోయినదేమో! హా! వాసవదత్తా! హా ప్రియురాలా!

వాస—ఇది యేమి విభ్రాంతి? నేను మీపార్శ్వమునందే యున్నాను. ఓరాజా! కాపాడుము. కాపాడుము.

రాజు—దేవీ! తత్తరపాటువలన పార్శ్వస్థురాలవయి యున్నను నిన్ను చూడలేకపోయితిని! (అని యామెచేయి పట్టుకొని) దేవీ! యోడకుము.

వాస—ప్రాణేశ్వరా! ఈమాట నన్నుఁగూర్చి నేను చెప్ప లేను. దయమాలినదానన యి నేనక్కడ సాగరికను గొలుసులు వేసి కట్టిపెట్టి యుంచినదానను. అది విపత్తు నొందుచున్నదిగనుక దానిని కాపాడుము.

రాజు—ఏమీ! సాగరిక విపత్తులో నున్నదా? అక్కడకు వెళ్లెదను.

వసు—దేవా! ఏమి? నిష్కారణముగా మిడుతవలె నగ్ని హోత్రముమీఁది కుఱుక సాహసించుచున్నావు!

బాభ్ర—దేవా! వసుభూతి యుక్తమయినమాట చెప్పినాఁడు.

వసం—(రాజు నుత్తరీయముతో పట్టుకొని) మిత్రుఁడా! సాహసము చేయకుము.

రాజు—(ఉత్తరీయమును లాగుకొని) ఓరిమూర్ఖుఁడా! సాగరిక విపత్తు నొందుచున్నది. ఇప్పుడును నేను ప్రాణములను దాఁచు కొందునా? (అని యగ్నిప్రవేశమును నటించి, పొగలో బాధపడు చున్నట్లభినయించుచున్నాఁడు)

బాభ్ర—ఏమి? ఈస్వల్పవిషయమున భరతకుల మింతటితో నశింపవలసినదా? వట్టిమాటలతో నేమి ప్రయోజనము? నేనును స్వామిభక్తికిఁ దగినట్లు నడచెదను.

రాజు— [మూర్ఛపోయి;

చ. జ్వలన! ప్రశాంతిఁ బొందుము; ప్రశాంతిని బొందుము; ధూమ
నిలువక మంటగుంపులను నీవిటు లేటికిఁ జేర్చె దేవు మైఁ?
దలఁచఁ బ్రియావియోగశిఖదగ్ధుఁడఁగాక చెలంగు నన్ను నీ
విల నిఁక నేమిచేయఁగల వీప్రళయాగ్నిశిఖాసమృద్ధిచేన్?

వాస — ఏమీ! దుఃఖభాజన మయిననావచనముచేత నే ప్రాణేశ్వరున కీవిధావస్థ సంభవించినది! ఇక్కడనుండి నేనేమి చేయుదును! నేను ప్రాణేశ్వరునితోడనే చనియెదను.

వసం — అమ్మా! నేను నీకు ముందుగా దారి తీసెదను.

వసు — ఏమీ! వత్సరాజు వహ్నిలోనే ప్రవేశించినాఁడు! రాజపుత్రికయొక్క విపత్తును జూచి యిక్కడనే దేహము విడుచుట నాకును యుక్తము.

బాభ్ర — హా! మహారాజా! ఏమి? నిష్కారణముగా భరతకులమునకు సంశయస్థితిని దెచ్చినావు! నేను ప్రభుభక్తికి దగినట్లు ప్రవర్తించెదను. (అని యందఱును అగ్నిప్రవేశమును నటించుచున్నారు)

రాజు — (కుడిభుజ మదరుటచూచి) ఈయవస్థలోనున్న నాకు దీనివలన నేమిఫలముకలుగును? (ముందుకుచూచి హర్షముతోడి తత్తఱపాటుతో) అదిగో వహ్నిజ్వాలలు సమీపింపఁగా సాగరిక కనఁబడుచున్నది. నేను వేగిరము వెళ్ళి యామెను కాపాడెదను.

[అప్పుడు సంకెళ్ళతో సాగరిక ప్రవేశించుచున్నది]

సాగ — (అంతటను గలయఁజూచి) నాభాగ్యముచేత నగ్నిహోత్రుఁడంతటను ప్రజ్వరిల్లుచున్నాఁడు. ఇప్పుడు నాకు దుఃఖావసానము కలుగును.

రాజు — (వేగముగాచేరఁబోయి) ఓప్రియురాలా! ఏమి? ఇప్పుడు సహితము ప్రాణము నుపేక్ష సేయుచున్నావు!

సాగ — (రాజునుజూచి తనలో) ఏమీ! నాప్రియతమునిజూచి

మరల నాకు జీవితాశ కలుగుచున్నది! (ప్రకాశముగా) భర్తా! రక్షింపుము; రక్షింపుము.

రాజు—ఓసి పిఱికిదానా! భయపడకుము.

గీతపద్యము—క్షణము సహింపు మీధూమసంచయంబు;
(ముందువంకఁజూచి) అకట! మండెడు స్తనగళితాంశుకంబు;
(నిపుణముగాఁజూచి) తలఁకెదేటికి? సంకిళ్ళు దాల్పనేల?
పడిగ నినుఁగాతు; నన్నీవు పట్టుకొమ్ము.

(అని కంఠమును కౌఁగిలించుకొని కన్నులుమూసికొని స్పర్శసుఖము నభినయించుచు) ఆహా! నాసంతాపమంతయు క్షణములో పోయినది. ఓప్రియురాలా! ఊఱడుము; ఊరడుము.

గీ. సుదతిరో! నిన్ను స్ఫుటముగాఁ జుట్టుకొనియు
నగ్నిహోత్రుఁడు నిను గాల్పఁడయ్యె నిపుడు;
తలఁచిచూడంగ నాతనితాపమునను
నీదు స్పర్శమె హరియించు నిక్కముగను.

(కన్నులు తెఱచిచూచి) ఓహో! మహాశ్చర్యము! ఈయగ్నిహోత్రమేమయిపోయినది? అంతఃపురముయొక్క యిప్పటియవస్థ యేమయినది? (వాసవదత్తను జూచి) ఏమి? ఈమె యవంతిరాజతనయా?

వాస—(సంతోషముతో రాజశరీరమును తడివి చూచుచు) ప్రాణేశ్వరా! భాగ్యవశమున మీరు రక్షితశరీరులుగా నున్నారు.

రాజు—ఇతఁడు బాభ్రవ్యుఁడా!

బాభ్ర—మహారాజా! మీకు జయమగుఁగాక! పుణ్యవశమున దేవర తిన్నగా నుండుటచేత మేము మరల ప్రాణములు గలవారమయితిమి.

రాజు— ఇతఁడు వసుభూతియా?

వసు— దేవా! అదృష్టముచేత వర్ధిల్లుచున్నావు.

రాజు—మిత్రుఁడా!

వసం— దేవరకు జయమగుఁగాక!

రాజు —(ఆలోచించి వితర్కముతో) ఇది స్వప్నమా! మతి భ్రమా? లేక యింద్రజాలమా?

వసం—మిత్రుఁడా! సందేహింపఁబనిలేదు. ఇదియింద్రజాలమే తొల్లికొకడు కాశ్మైంద్రజాలికుఁడు వెళ్లునప్పుడు దేవరవారింకొక వినోదము నవశ్యముగాఁ జూడవలెనన్నాఁడు. అదేయిది.

రాజు— దేవీ! నీమాటలనుబట్టి సాగరికనిప్పుడీవలకుఁదీసికొని వచ్చినాఁడను.

వాస—(నవ్వి) ప్రాణేశ్వరా! నాకంతయుఁ దెలియును.

వసు—(సాగరికను జూచి రహస్యముగా) బాభ్రవ్యా! ఈమె మనరాజపుత్రికవలె నున్నది.

బాభ్ర—అమాత్యా! నాకును నాలాగుననే కనఁబడుచున్నది.

వసు—(ప్రకాశముగా రాజుతో) దేవా! ఈకన్యక యెక్కడిది?

రాజు— దేవి యెఱుఁగును.

వసు— దేవీ! ఈకన్యక యెక్కడిది?

వాస—అమాత్యా! ఈచిన్నది సముద్రమున దొరకినదని చెప్పి మంత్రియైన యౌగంధరాయణుఁడు నాకొప్పగించినాఁడు. అందుచేతనే యిది సాగరిక యనఁబడుచున్నది.

రాజు—(తనలో) ఏమి? యౌగంధరాయణుఁడు నాతోఁ గొంచెమయినను జెప్పక పోయెను! అతఁడీమెను రాణి కేలయర్పించి యుండును?

వసు—(రహస్యముగా) బాభ్రవ్యా! ఈపోలికయువంసతకుని కంఠమునందలి రత్నమాలయు నీమె సాగరమునుండి దొరకుటయు విచారింపఁగా నీమె సింహళేశ్వరపుత్రిక యయినరత్నావళియయినట్లు స్పష్టమగుచున్నది. (అని సమీపమునకు వెళ్ళి బిగ్గరగా) అమ్మా! రత్నావళీ! రాజపుత్రీ! నీవిటువంటియవస్థను పొందియున్నావా?

సాగ—(వసుభూతిని జూచి కన్నీటితో) అయ్యో! మంత్రీ! వసుభూతీ!

వసు—అహా! చెడితిని! నేను మందభాగ్యుఁడను. (అని భూమి మీఁద పడుచున్నాఁడు.)

సాగ—హా! మందభాగ్యురాల నయిననేను చెడితిని. హా తండ్రీ! హాతల్లీ! మీరెక్కడనున్నారు? నామాటకు మాఱుపలుకుఁడు. (అని సంతాపించుచు మూర్ఛపోవుచున్నది.)

వాస—(తొట్రుపాటుతో) బాభ్రవ్యా! ఈమె నాతోఁబుట్టినపడుచైన రత్నావళియా?

బాభ్ర—అవును. ఈమె నీచెల్లెలే.

వాస—(రత్నావళిని కౌఁగిలించుకొని) సోదరీ! ఊఱడుము; ఊఱడుము.

రాజు—ఏమీ! గొప్పవంశమునందుఁ బుట్టినసింహళేశ్వరుఁడయినవిక్రమబాహునికూఁతురా యీమె!

వసం—(తనలో) రత్నమాలను చూచినప్పు డిటువంటిరత్నమాల సామాన్యజనుల కుండదని నేను మొట్టమొదటనే తెలిసికొన్నాఁడను.

వసు—రాజపుత్రీ! ఊఱటపొందుము. ఊఱటపొందుము

పెద్దదయినసీయక్క నీకొఱకు దుఃఖించుచున్నది; ఆమె సాంత్వనము చేసికొమ్ము.

రత్నా—(ఊఁటడిల్లి క్రిందిచూపున రాజును జూచి తనలో) నేనపరాధము చేసియున్నదాననుగనుక దేవికి ముఖమును చూపఁ జాలకున్నాను. (అని యధోముఖ యగుచున్నది.)

వాస—(బాహువులుసాఁచి కన్నీటితో) రమ్ము. అతినిష్ఠురురాలనైన నా ప్రియసోదరీ! ఈలాగునవచ్చి నీస్నేహమును గనఁబఱుపుము. (అని కంఠమును కౌఁగిలించుట నటించి, రాజుతో రహస్యముగా) ప్రాణేశ్వరా! నేను చేసినక్రూరకృత్యముచేత నాకు సిగ్గగుచున్నది. కాఁబట్టి యీమెయీబంధమును శీఘ్రముగావిడిపింపుము.

రాజు—(సంతోషముతో) దేవిచెప్పినట్లు చేసెదను. (అని సాగరికకట్లు విప్పుచున్నాఁడు.)

వాస—ప్రాణేశ్వరా! మంత్రియైన యౌగంధరాయణుఁడే నన్నింతకాలము క్రూరురాలినిగాఁ జేసినాఁడు. అతఁడు నిజము తెలిసినవాఁడయ్యును చెప్పినవాఁడు కాఁడు.

[అప్పుడు యౌగంధరాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

యౌగం—

ఉ. నావచనంబునం గలిగె నాథువియోగము రాణి కెంతయున్;
దేవికి సంభవించు సవతింగనుదుఃఖము; నందుచేత నే
న్నావరుఁ డొందు సర్వమహీ; మన్ననసేయ నెవప్పు దేవి న
న్నావిధమయ్యు నాదుమొగ మాపెఱుఁజూపఁగ లజ్జయయ్యెడున్.

అట్లు కాకపోయిన మఱి యేమి చేయను! నిశ్శంకముగా కార్యనిర్వాహణము చేయువాఁడు మానసీయులయెడలసహింత్ర బుటువంటిస్వామి

భక్తివ్రతమును నెఱపనేవలయును. (చూచి) అదె మహారాజుగారు సన్నిధికి వెళ్ళెదను. (సమీపించి) దేవా! జయ మగుఁగాక! జయ మగుఁగాక! దేవరవారికి నివేదింపకుండఁ జేసినకార్యమున కయి నన్ను క్షమింపుఁడు. (అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

రాజు—మాకు నివేదింపకుండ నీవే కార్యమును జేసితివి?

యౌగం—దేవరవారు పీఠమును పరిగ్రహింపుఁడు. సమస్తమును విజ్ఞాపనము చేసెదను.

[రాజుతోఁగూడ నందఱును స్వస్థానములఁ గూరుచున్నారు.]

యౌగం—దేవా! వినుఁడు. ఈమె సింహళదేశాధీశ్వరుని కొమార్తె. ఈమెను పాణిగ్రహణము చేసికొన్నవాఁడు సార్వభౌముఁడగు నని యొకసిద్ధునివలన నెఱిఁగి యాతనివచనమునందులినమ్మకము చేత నేను పలుమాఱు దేవరవారి కీమె నిమ్మని సింహళేశ్వరునిఁ బ్రార్థించినను వాసవదత్తా దేవికి మనోవ్యథ కలుగునని యాతఁడిచ్చిన వాఁడు కాఁడు.

రాజు—తరువాత నేమి జరిగినది?

యౌగం—(లజ్జతో) అప్పుడు లావణకమున దేవి కాలిపోయిన దని ప్రవాదము కలిగించి యాతనిసమ్ముఖమునకు బాభ్రవ్యునిఁ బంపినాఁడను.

రాజు—యౌగంధరాయణా! తరువాతిసంగతి మేము విన్నారము. ఏమి యాలోచించి యీమెను దేవిగారి కొప్పగించినావు?

వసం—మిత్రుఁడా! ఈతఁడు చెప్పకయే యీతనియభిప్రాయము నాకు తెలిసినది. ఈమె యంతఃపురమున నుండినచో మీ రంతఃపురమునకు వెళ్ళినప్పుడు మీకు సులభముగా కనఁబడునని,

రాజు—యౌగంధరాయణా! వసంతకుఁడు నీయభిప్రాయమును తిన్నగా గ్రహించినాఁడా?

యౌగం—దేవర వా రన్నట్టే.

రాజు—ఐంద్రజాలికుని కృత్యముసహితము నీపనియే యని తలఁచెదను.

యౌగం—అట్లుగాకపోయినయెడల, అంతఃపురమున బంధింపబడియున్న యీ మెకు దేవరవారి సందర్శన మెట్లు కలుగును? ఈమె కనఁబడకున్న వసుభూతి యీమె నెట్లానవాలు పట్టగలుగును? (నవ్వుచు) ఇప్పుడు సంగతి తెలిసినది గనుక, ఇఁకమీఁద చెల్లెలి విషయమయి యేమి జరగవలయునో యిప్పుడు దేవి నిర్ణయింపవలసి యున్నది.

వాస—(చిఱునవ్వుతో) అయ్యా! అమాత్యా! రత్నావళిని రాజుగారి కిమ్మని స్పష్టముగానే చెప్పరాదా?

వసం—అమ్మా! మంత్రియభిప్రాయమును సరిగానే కని పెట్టినావు.

వాస—(చేతులు సాఁచి) రమ్ము. రత్నావళీ! రమ్ము. ఇప్పుడు నా తోఁడఁబుట్టినదాన వయినందుకు తగినట్లుకమ్ము. (అని రత్నావళిని తననగలతో నలంకరించి చేయి పట్టుకొని రాజుదగ్గరకు వెళ్ళి) దేవా! ఈరత్నావళిని ప్రతిగ్రహింపుము.

రాజు—(సంతోషముతో చేతులు చాఁచి) దేవిగారి ప్రసాదము నెవరు మన్నింపకుందురు? (అని సాగరికను పరిగ్రహించుచున్నాఁడు.)

వాస—ప్రాణేశ్వరా! ఈమె బంధువులు దూరమున నున్న వారు; కాఁబట్టి యీమె తన బంధుబృందము నిప్పుడును దలంచ కుండునట్లుగా నీమెవిషయమున నడుచుకొమ్ము.

రాజు—దేవి యాజ్ఞాపించినట్లే నడుచుకొనెదను.

వసం—(సంతోషముతో నృత్యము చేయుచు) ఆహాహా! ఓహో! దేవరకు జయమగుఁగాక! భూమండల మంతయు నిప్పుడు నాప్రియమిత్రునియొక్క హస్తగత మైనది.

వసం—రాజపుత్రీ! వాసవదత్తాదేవికి నమస్కారము చేసి గౌరవింపుము.

రత్నా—(ఆప్రకారముగా చేయుచున్నది.)

బాభ్ర—(వాసవదత్తనుగూర్చి) దేవీశబ్దధారణమునకు నీవే తగినదానవు.

వాస—(రత్నావళిని కౌఁగిలించుకొని దేవీశబ్దముచేత ప్రసాదము చూపుచున్నది.)

బాభ్ర—నేను పడ్డ శ్రమయంతయు నిప్పుడు సఫల మైనది.

యౌగం—దేవా! నేను దేవర కింకరను నేమి ప్రియముచేయ వలయునో సెలవిండు.

రాజు—ఇదిగాక యింకను బ్రియ మేమి గలదు!

ఉ. విక్రమబాహుతో నొదవె వియ్యము; రాజ్యమునున్ లభించె; భూ
చక్రము చేపడం దొరకె సాగరికానతి సారభూతమై;
యాక్రియఁ జిల్లలిం బడసి యెంతయు మోదముఁ జెందె రాణి; న
ర్వక్రతఁ గోసలుల్ గడుఁబరాజితులైరి; మ రేమి కోరుదున్!

అయినను,

పంచపాది.

గీ. వసుధ సస్యాఢ్య యగుఁగాక! వాసవుండు
వాన లిచ్చుఁగాక! సదనుష్ఠానములకు
ద్విజులు తనియింపుదురుగాక త్రిభువనముల!
సుఖ మగునుగాక సతతంబు సుజనతతికి!
దుర్జనకఠోరభావలు దొలఁగుఁగాక!

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము.

శాకు. ముద్రాక్షరశాల. రాజమండ్రి—1950.

# మాళవికాగ్నిమిత్రము

ఇది

కాళిదాస ప్రణీతమైన సంస్కృతగ్రంథమునుండి

రావుబహదూర్

కందుకూరి వీరేశలింగము పంతులు గారిచే

ఆంధ్రీకరింపబడినది.



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

# మొదటి కూర్పు పీఠిక



మాళవికాగ్నిమిత్రము కథ మిక్కిలి యింపయినది. ఈనాటకము గీర్వాణకవిమండలాగ్రగణ్యుఁడైన కాళిదాసునిచే రచియింపఁబడినది. ఇదియభిజ్ఞానశాకుంతలమును రచియించిన కాళిదాసునిచేతఁగాక మఱియొక కాళిదాసునిచేత రచియింపఁబడినదని కొందఱు చెప్పుదురుగాని యందుకు తగిననిదర్శన మేదియు లేదు. ఇందలి కథానాయకుఁ డగ్నిమిత్రుఁడు. ఇతఁడు శుంగవంశపురా జయినపుష్పమిత్రుని కుమారుఁడు. ఈపుష్పమిత్రుఁడు మొదట మగధదేశపురా జయినబృహద్రథుని సేనాధిపతిగా నుండి యతనిని చంపి, మౌర్యమంత్రిని చెఱయందుఁ బెట్టించి, ఆతనిరాజ్యము నాక్రమించుకొని విదిశానగరము తనకు రాజధానిగాచేసికొనెను. అందుచేతనే యాతనికి సేనాధిపతి యని పేరుండెను. ఇతఁడు విక్రమార్కశకమునకు పూర్వము నూటయిరువదిరెండుసంవత్సరములక్రిందట సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు సింధునది సమీపమున గ్రీకుదేశస్థులతో యుద్ధము చేసి వారిని జయించెను. ఇతఁడు తనవార్ధకదశయందు తన కుమారుఁ డయినయగ్నిమిత్రునకు రాజ్య మిచ్చి తానాధ్యాత్మిక విషయమున కాలము గడుపుచుండెను. ఈకాలములో తండ్రికిని కొమారునికినికొన్నివిషయములయందుపడకపోయెను. అగ్నిమిత్రుడు ముప్పదియాఱుసంవత్సరములు రాజ్యము చేసి మృతినొందఁగా, అనంతర మతనికొమారుఁడు వసుమిత్రుఁడు రాజ్యమునకువచ్చి యెనిమిది సంవత్సరములు పాలనము చేసెను.

ఈమాళవికాగ్నిమిత్రము నాకు మూఁడుప్రతులు లభించినవి. ఈదేశపుప్రతికిని వంగదేశపుప్రతికిని బహుస్థలములయందు భేదము కనఁబడుచున్నది. నేను దీనిని తెనిగించుటలో విశేషభాగము వంగదేశపుపండితుఁ డయిన తారానాథ తర్కవాచస్పతి ప్రతి ననుసరించినను, అక్కడక్కడ కొన్నిస్థలములయం దీదేశపుపాఠము ననుసరించి కొన్నిమార్పులనుసహితము చేసినాను. గుణగ్రహణపారీణులు దీనియందలిదోషములను మన్నించి గుణమును గ్రహింతురుగాక!

రాజమహేంద్రవరము<br>
ది ౧౨ ఏప్రియల్ ౧౮౮౫ సం॥ } కందుకూరి వీరేశలింగము

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.



## పురుషులు.

అగ్నిమిత్రుఁడు—కథానాయకుఁడైన విదిశానగరపురాజు.

వాహతకుఁడు—మంత్రి.

గౌతముఁడు—విదూషకుఁడు.

హరదత్తుఁడు—నాట్యాచార్యుఁడు; ఇరావతి గురువు.

గణదాసుఁడు—నాట్యాచార్యుఁడు; మాళవిక గురువు

మౌద్గల్యుఁడు—కంచుకి.

వీరసేనుఁడు—ఒక సేనానాయకుఁడు; రాణితమ్ముఁడు.

ధ్రువసిద్ధి—విషవైద్యుఁడు.

యజ్ఞసేనుఁడు—విదర్భదేశపురాజు.

మాధవసేనుఁడు—మాళవిక యన్న; విదర్భదేశపురాజు.

వసుమిత్రుఁడు—అగ్నిమిత్రుని కొమారుఁడు.

పుష్పమిత్రుఁడు—అగ్నిమిత్రుని తండ్రి.

సుమతి— మాధవసేనుని మంత్రి.

సారసకుఁడు—కుబ్జుఁడు.

## స్త్రీలు.

ధారణి—అగ్నిమిత్రుని పట్టపుదేవి.

ఇరావతి—అగ్నిమిత్రుని భోగభార్య.

కౌశికి(పరివ్రాజిక)—సుమతిచెల్లెలు, రాణికి ధర్మకథలు చెప్పునది.

మాళవిక—కథానాయకురాలు; మాధవసేనుని చెల్లెలు.

బకుళావళిక—మాళవిక చెలికత్తె.

నిపుణిక—ఇరావతి పనికత్తె.

చంద్రిక—ఇరావతి పనికత్తె.

జయసేన—అంతఃపుర ద్వారపాలకురాలు.

మధురిక—వనపాలకురాలు.

వసులక్ష్మి—రాజుకూఁతురు.

కౌముదిక—రాణిగారి పనికత్తె.

సమాహితిక—పండితకౌశికి పనికత్తె.

రజనిక—విదర్భదేశమునుండి వచ్చిన పాటకత్తె.

జ్యోత్స్నిక—విదర్భదేశమునుండి వచ్చిన పాటకత్తె.

# మాళవికాగ్నిమిత్రము



## ప్రథమాంకము.



### నాంది.

చ. ఎవఁడు మహేశుఁడై ఫలము లిచ్చి నతాళికిఁ దోలుదాల్చెఁదా,
నెవఁడు జితేంద్రియుండయియతీశుఁడగుస్సతి మేనఁదాల్చియుఁ,
ఎవఁ డలయిష్టమూర్తులను నేలుచు లోకము గర్వికాఁడు తా,
నవఁడు వివేక మిచ్చి హృదయంబులఁ దామసవృత్తిఁ బాచుతన్

సూత్రధారుఁడు—అతివిస్తారము పనిలేదు. (తెరవంకఁజూచి) అయ్యా! కొంచె మిటురమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) బావా! ఇదిగో వచ్చినాను.

సూత్ర—శ్రీకాళిదాసకృతమైన మాళవికాగ్నిమిత్ర మను పేరుగల నాటకము నీవసంతోత్సవమునం దాడవలసిన దని యీ సభవారిచే నేనాజ్ఞాపింపఁబడినాను. కాఁబట్టి సంగీత మారంభింతము.

పారి—అదికూడదు. సుప్రసిద్ధు లయిన ధావక సౌమిల్ల కవిపుత్రాదులు కల్పించిన నాటకములను మాని వీరు వర్తమానకవి కాళిదాసునికృతి నేల బహుమానించుచున్నారు?

సూత్ర—ఓవివేకీ! నీవు చెప్పినది సరికాదు. చూడు.—

గీ. సర్వమును బ్రాఁత దని యొందు సాధుగాదు
క్రొత్తదని యొకావ్యమునకుఁ గొఱఁత రాదు

యోగ్యులు గ్రహింతు రారసి యుత్తమంబు
మూఢుఁ డన్యులనే నమ్ము బుద్ధిలేక.

పారి—అందున కీసభవారే ప్రమాణము.

సూత్ర—అట్లయిన నీవు త్వరపడుము.

గీ. అతులసేవాసమర్థురా లైనయట్టి
యల్ల ధారణిసేవకురాలి వలెనె
యేను దొలుతను శిరసావహించినట్టి
యీసభికనియోగ మొనర్ప నిచ్ఛగింతు.

(అని యిద్దఱును బోవుచున్నారు.)

ఇది ప్రస్తావన.



[అప్పుడు వకుళావళిక ప్రవేశించుచున్నది.]

వకు—క్రొత్తగా నేర్చుకొనుచున్న చలిక మను నాటకము నందు మాళవిక యెట్లున్నదో నాట్యాచార్యుఁడయిన గణదాసు నడిగి రమ్మని ధారణీదేవి నా కాజ్ఞ యిచ్చినది. కాఁబట్టి నేను సంగీతశాలకు వెళ్ళెదను. (అని నడచుచున్నది.)

[అంతట ఆభరణమును చేతఁబట్టుకొని రెండవచేటిక
ప్రవేశించుచున్నది.]

ప్రథమ—(రెండవదానిని జూచి) ఒసీ! కౌముదికా! నీ కీ ధైర్యమేమే! నాదగ్గఱనుండియే దాఁటిపోయెదవు, నన్ను కంటఁ జూడకున్నావు.

ద్వితీయ—ఓహో! వకుళావళికా? ఇప్పుడే నేను శిల్పివద్ద నుండి తీసికొనివచ్చుచున్న దేవిగారి యీ సర్పముద్రగల ముద్దు

టుంగరమును గుఱించి యాలోచించుచు నీచేత దూషణ పడవలసిన దాన నైతిని.

వకు—(చూచి) నీదృష్టి తగినదానిమీఁదఁ బడినది! మెఱుఁగులు గ్రక్కుచున్న యీ యుంగరముచేత నీ హస్తశాఖ పుష్పించి నట్టున్నది.

కౌము—ఓసీ! నీ వెక్కడకు వెళ్ళుచున్నావు?

వకు—చెప్పినదానిని మాళవిక యెట్లు గ్రహించుచున్నదో యడుగుట కయి దేవిగారి యాజ్ఞాప్రకారముగా నాట్యాచార్యుఁడైన గణదాసునియొద్దకు వెళ్ళుచున్నాను.

కౌము—సఖీ! ఆమె యిటువంటివ్యాపారముచేత దూరస్థురాలుగా నున్నను రాజుచేత నెట్లు చూడఁబడినది?

వకు—అతఁడామెను దేవిగారిపార్శ్వమునందుఁజిత్తరువులోఁ జూచినవాఁడు.

కౌము—ఏలాగున?

వకు—విను. దేవి చిత్రశాలకుఁబోయి, అప్పుడే శిల్పాచార్యుఁడు రంగువేసి తెచ్చిన చిత్రలేఖను జూచుచు నిలుచుండెను. ఇంతలో రాజును వచ్చెను.

కౌము—అటుతరువాత?

వకు—ఉపచారముయినతరువాత నేకాసనమునందుఁ గూరుచుండి, రాజుగారు చిత్రఫలకమునందు పరిజనమధ్యమున రాణిగారికి సమీపముగానున్న పరిచారికను జూచి దేవిగారి నడిగిరి.

కౌము—ఏమని?

వకు—దేవికి దగ్గఱగా వ్రాయఁబడిన యపూర్వరాలయిన యీమె పేరేమని.

కౌము—సుందరరూపములమీఁద నాదరము కలుగుట యుక్తమే. తరువాత?

వకు—సదుత్తరము రాక యనాదరము కలుగఁగా రాజుగా రనుమానపడి దేవిగారిని గ్రుచ్చిగ్రుచ్చి యడిగిరి. అప్పుడు కౌమారై యగు వసులక్ష్మి—"అయ్యా! ఈమె మాళవిక"—అని చప్పునఁ జెప్పివేసెను.

కౌము—(చిఱునవ్వు నవ్వి) ఇది బాల్యావస్థకుఁ దగియే యున్నది. తరువాత నేమిజరిగినదో చెప్పు.

వకు—మరియేమున్నది? ఇప్పుడు మాళవిక రాజుగారి దృష్టిపథమునఁ బడకుండ భద్రముగాఁ గాపాడఁబడుచున్నది.

కౌము—ఓసీ! ఇఁక నీకు నియమించినపనిమీఁద నీవు పొమ్ము నేనును దేవిగారి కీయుంగరమును దీసికొనిపోయెదను.

(అని నిష్క్రమించుచున్నది.)

వకు—(కొంచెమునడచి చూపునిగిడించి) ఇదిగో నాట్యాచార్యుఁడు సంగీతశాలనుండి బయలుదేఱి వచ్చుచున్నాఁడు. నేనిప్పుడీయన దర్శనము చేసికొనెదను. (అని నడుచుచున్నది.)

గణదాసుఁడు—(ప్రవేశించి) ఎల్లవారికిని కులవిద్య నిశ్చయముగా నాదరణీయముగానే యుండును. అయినను నాకు నాట్యవిద్య యందున్న గౌరవ మనర్థమయినదికాదు. ఎట్లగును?

చ. ఇది యమరాళికిన్ గనులకింపగు యజ్ఞమ యండ్రు మౌను, లి
  య్యది ద్వివిధం బొనర్చె శివుఁ డర్ధసతీ సహితాత్మ దేహమం;
  దొదవు రసంబులెల్లఁ ద్రిగుణోద్భవలోకచరిత్రలం దిటన్,
  వ్వొదిఁ దనియించు నాట్య మిల నెల్లరనున్ రుచిభేదచిత్తులన్.

వకు—అయ్యా! నమస్కారము.

గణ—సుమంగళీ! దీర్ఘాయుష్యమస్తు!

వకు—చెప్పినదానిని గ్రహించుటలో శిష్యురాలయినమాళవిక మీకు విశేషాయాసము కలుగఁజేయుచున్నదేమో దేవిగారు మిమ్మడిగిరమ్మన్నారు.

గణ—కళ్యాణీ! మాళవిక పరమనిపుణురాలనియు మేధావినియనియు దేవిగారికి విన్నవింపుము. వేయిమాట లేటికి!

క. ఏయది భావము తెల్పెడి
యీయభినయవిషయ మామె కే నేర్పెదనో,
యాయది విశేష మగపడఁ
జేయుచు నాకెదురు నేర్పు చెలువున నుండున్.

వకు—(తనలో) ప్రజ్ఞయందిరావతిని మించునట్లున్నదే! (ప్రకాశముగా) గురుజను లీవిధముగా సంతోషించుచున్నారుగనుక మీశిష్యురాలిప్పుడు కృతార్థురాలు.

గణ—ఇటువంటివారు లభించుట దుష్కరముగనుక, అడుగుచున్నాను. దేవిగారీమె నెక్కడనుండి రప్పించినారు!

వకు—దేవిగారికి తక్కువవర్ణమువాఁడయిన వీరసేనుఁడను పేరుగలతోఁడఁబుట్టినవాఁడొకఁడున్నాఁడు. రాజుగారతనిని నర్మదాతీరమునందు సరిహద్దుననున్నకోట కధికారినిగా నిలిపియున్నారు. అతఁడీచిన్నది ధారణీదేవికి వినోదము కలిగించుట కర్హురాలుగా నుండునని యెంచి తనయప్పగారికిఁ గానుకగాఁ బంపినవాఁడు.

గణ—(తనలో) రూపవిశేషమునుబట్టి చూడఁగా నాకీమె సత్కులమునందుఁ బుట్టినదిగాఁ దోఁచుచున్నది. (ప్రకాశముగా) కళ్యాణీ! నేను నిశ్చయముగాఁ బ్రసిద్ధుఁడ నగుదును.

గీ. నీరదజలంబు పయినుండి వారిరాశి
యందు శుక్తిలోఁబడి ముత్యమైనయట్లు
యువని నుత్తమపాత్రమునందుఁ బడిన
శిక్షకునివిద్యయు గుణవిశేష మొందు.

వకు—అయ్యా! ఇప్పుడు మీశిష్యురా లెక్కడ నున్నది?

గణ—ఇప్పుడే పంచాంగాభినయమును నేర్పి యింక విశ్రాంతి పొందవలసినదని నేను జెప్పఁగా దిగుడుబావి కెదురుగానున్న గవాక్షములో మంచిగాలి ననుభవించుచుఁ గూరుచున్నది.

వకు—ఇంక దేవరవారు నాకనుజ్ఞ యియ్యవలెను. ఇప్పుడ మీసంతోషమంతయు నివేదించి దేవిగారికుత్సాహము వృద్ధిపొందించెదను.

గణ—నీవు మీదేవి దర్శనమునకుఁబొమ్ము. కొంచెమవకాశముచేసికొని యిప్పుడు నేనును మాయింటికిఁ బోవుచున్నాను.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు)

ఇది మిశ్రవిష్కంభము.

---

[అప్పుడు పరిజను లందందునిలువ, వెనుకఁజేరి లేఖ చేతఁబట్టుకొని మంత్రి సేవింప, రాజు ప్రవేశించు చున్నాఁడు.]

రాజు—(లేఖ చదువుచున్నమంత్రిని జూచి) వాహతకా! విదర్భరాజు యజ్ఞసేనుఁ డేమి తలఁచుకొన్నాఁడు?

మంత్రి—దేవా! ఆత్మవినాశము.

రాజు—ఇప్పుడు నేనాతనియుత్తర మంతయుఁ దెలియఁగోరెదను.

మంత్రి— ఇప్పు డతఁ డీప్రత్యుత్తరము నిచ్చినవాఁడు— "మాతో సంబంధము చేయ నుద్దేశించిన మీపినతండ్రికొమారుఁడయిన మాధవసేనుఁడు మావద్దకు రావలెనని బయలుదేఱి వచ్చుచుండఁగా దారిలో మీయెల్లపాలించు నధికారి యతనిని ముట్టడివేసి పట్టుకొనెను. కన్ను విచారించి యాతనిని భార్యాసోదరీసహితముగా విడిచిపెట్టఁదగును" అని తమరు నాకాజ్ఞ యిచ్చుచున్నారు. ఇటువంటివిషయములో సమానవంశమునందుఁ బుట్టినరాజులలో నాచరింపఁబడు వ్యవహారము తమ రెఱుఁగనిది కాదు. కాఁబట్టి యిందులోఁ దమరే మధ్యస్థులుగా నుండ నర్హులు. అతని తోడఁబుట్టినపడుచు ముట్టడించినప్పుడు పుట్టినసంక్షోభములోఁ దప్పిపోయినది. మనుష్యులను బంపి యామెను వెదకించెదను. మీరవశ్యముగా మాధవసేనుని నాచేత విడిపింపఁ గోరినయెడల, విడుపుధనమును వినుఁడు.

"గీ. కార్యమంత్రి యైనట్టి మామఱఁదిఁ దారు
బంధమునునుండి విడిపించి పంతురేని,
వేగ మాధవసేనుని విడుచువాఁడ
నిచటఁ జెఱసాలయందుండి యేచు నవల."

రాజు—(రోషముతో) ఎట్టూ! అతఁడు తనతర మెఱుఁగక నాతోఁ గార్యపరివర్తనమునకు బేరమాడుచున్నాఁడుగా! వాహాతకా! స్వభావముచేతనే శత్రువైన యీవైదర్భుఁడు మనకుఁ బ్రతికూలుఁడు గాఁగూడ నగపడుచున్నాఁడు. శత్రుపక్షమువాఁడుగా నున్న యీతనిని పూర్వము సంకల్పించుకొన్న ప్రకారముగా నున్మూలనము చేయుటకొఱకు వీరసేనుని వశమున నున్న సేనాచక్రమున కాజ్ఞాపింపుము.

మంత్రి—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

రాజు—మరి యీవిషయమున నీయభిప్రాయమేమి!

మంత్రి—దేవరవారు సెలవిచ్చినది శాస్త్రదృష్టముగానున్నది. ఎట్లన—

"గీ. క్రొత్తగా రాజ్యభరముఁ గైకొన్నరిపుఁడు
ప్రజలలో వేరుదిగి దృఢపడఁడు గానఁ
గాఁతుకొనని క్రొత్తగ నాటుపాదపంబు
వలెనె యున్మూలనము చేయ సులభుఁ డగును."

రాజు—అట్లయిన రాజ్యతంత్రకారుల వచనము వ్యర్థము కాదు. ఈవచనము ప్రమాణము చేసికొని సేనాపతిని త్వరపెట్టుము.

మంత్రి—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

[పరిజనులు తమతమ వ్యాపారములనుబట్టి రాజుచుట్టును తగిన చోట్ల నుండఁగా విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విదూ—"గౌతమా! ఆకస్మికముగాఁ బటమునందుఁ జూడఁ దటస్థించిన మాళవికను బ్రత్యక్షముగాఁ జూడఁగాంచు నుపాయము నిన్వు డాలోచింపుము" అని మహానుభావు లయిన రాజుగారు నా కాజ్ఞాపించి యున్నారు. నే నాప్రకారముగాఁ జేసివచ్చిన సంగతి యిప్పుడే యాతనికి నివేదించెదను. (అని నడుచుచున్నాఁడు)

రాజు—(విదూషకుని జూచి) ఇదిగో! కార్యాంతరమందలి సాయపరమంత్రి వచ్చుచున్నాఁడు!

విదూ—(దగ్గఱకుఁబోయి) మీరు వర్ధిల్లుదురుగాక!

రాజు—(తలయూఁచి) ఇక్కడఁ గూరుచుండుము.

విదూ—(కూరుచున్నాఁడు)

రాజు—నీప్రజ్ఞానేత్రమున కేఁఱయినయుపాయము పొడకట్టినదా?

విదూ—ఇప్పుడు ప్రయోగించిన యుపాయసిద్ధి నడుగుఁడు.

రాజు—(సంతోషముతో) ఏలాగున?

విదూ—ఈలాగున (అని చెవిలో నేకాంతముగాఁ జెప్పు చున్నాఁడు.)

రాజు—మిత్రుఁడా! మేలుమేలు. నీవు బహునిపుణముగా నారంభించినావు, కార్యసిద్ధి దుర్లభమేయయినను, ఈనీకార్యారంభమునుబట్టి యిప్పుడయినట్టే సంభావించెదను. ఎట్లన—

గీ. సత్సహాయసంపన్నుఁడె సంఘటింపఁ
కలుగుఁ బ్రతిబంధములు గల్గు కార్యములను
కన్నుగలవాఁడు సహితము గానలేఁడు
వస్తువులఁ జీఁకటిని దీపబలము లేక.

తెరలోపల—చాలు. ఈపెద్దడంబపుమాటలు చాలు. రాజుగారిసమక్షముననే మనయిద్దఱలో నెవ రధికులో యెవ రధములో స్పష్టము కాఁబోవుచున్నది.

రాజు—(ఆలకించి) మిత్రుఁడా! ఇదిగో నీనీతివృక్ష మప్పుడే పూఁతపట్టిన ట్టున్నదే!

విదూ—త్వరలోనే నీవు దానిఫలమునుం జూడఁగలవు.

[అప్పుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా! ప్రభువుగారి యాజ్ఞ జరిగించినాఁడ నని మంత్రి విజ్ఞాపనము చేయుచున్నాఁడు. అంతేకాక యభినయాచార్యులైన హరదత్తగణదాసు లిరువురును బరస్పర జయకాంక్షతోఁ దమ దర్శనము నపేక్షించి రూపమును ధరించిన సాక్షాత్కోపదేవతలవలె నున్నారు.

రాజు—వారిని లోపలికి రమ్మను.

కంచు—దేవర సెలవిచ్చినట్లు చేసెదను. (అని నిష్క్రమించి వారితో మరలఁ బ్రవేశించుచున్నాఁడు.)

కంచు—ఆచార్యులారా! ఇటు, ఇటు.

గణ—(రాజును జూచి) ఓహో! రాజమహిమ దురాసదము గదా!

గీ. అపరిచితుఁడుగాఁ డితఁ డుగ్రుఁ డయినఁ గాఁడు;
భయపడెద నట్టులయ్యుఁ బార్శ్వంబుచేర
జలధివలె నీనృపుఁడు ప్రతిక్షణము నాదు
కన్నులకుఁ గ్రొత్తక్రొత్తగఁ గానిపించు.

హర—పురుషాకారమున నున్న యీ జ్యోతి మహత్తరమయినదిగదా!

ఉ. ద్వారమున న్నియుక్తపరివారము సమ్మతిమీఁదఁ జొచ్చి, ధా
త్రీరమణాంతికానుచరు లేవరి చెంతకుఁ బోవుచుండియున్
మేరకుమీఱి దృష్టి మిఱుమిట్లిటు గొల్పెడి రాజుతేజముం
జేరి మరల్పఁగాఁబడిన చెల్వు వహించితి మాట లేటికిన్.

కంచు—ఇదె ప్రభువువారు, మీరు సన్నిధానమునకుఁ బొండు.

ఉభయులు—(దగ్గఱకుఁ బోయి) దేవా! విజయోస్తు!

రాజు—మీకు స్వాగతము. (పరిజనులను జూచి) వీరికిఁ బీఠములను బెట్టుఁడు.

[ఇద్దఱును పరిజనులు తెచ్చిన పీఠములమీఁద కూరుచున్నారు.]

రాజు—ఇదియేమి! శిష్యురాండ్రకు విద్యోపదేశము చేయవలసినకాలమునం దాచార్యు లిరువురు నొక్కసారిగా నిక్కడకు విజయము చేసినారు?

గణ—దేవా! చిత్తగింపుము. నేను సద్గురుముఖమున నభినయవిద్యను జక్కఁగా నభ్యసించితిని. దేవరవారు నాకు నాట్యా

భినయాధికారమును దయచేసినారు. దేవిగారును నన్నాదరించు చున్నారు.

రాజు—ఇది మాకుఁ దెలియును. అపయు నేమి?

గణ—అట్టి నన్నీహరదత్తుఁడు పెద్దమనుష్యులయెదుట "నీవు నా కాలిధూళితోనైనను సమానుఁడవుగావు" అనియాక్షేపించినాఁడు.

హర—దేవా! "వానికిని నాకును సముద్రమునకును బిల్లకాలువకునుగల తారతమ్యమున్నది" అని యితఁడే నన్ను మొట్టమొదట దూషించినవాఁడు. కాఁబట్టి యిక్కడఁ దమరే యీయనను నన్నును శాస్త్రమునందును బ్రయోగమునందును బరీక్ష చేయుఁడు. దేవరవారే మాయుభయవిశేషజ్ఞ వివాదమును నిర్ణయింపఁ దగినవారు.

విదూ—ఈప్రతిజ్ఞ చక్కఁగా నున్నది.

గణ—ఈసంకల్ప ముత్తమ మయినది. దేవరవారు సావధానముగా వినవలయును.

రాజు—కొంచెము తాళుఁడు. ఇక్కడఁ బక్షపాతము జరిగినట్లు దేవి యెంచుకొనును. కాఁబట్టి పండితకౌశికీసహితులరా లయిన యామెసమక్షమునందే యీ వ్యవహారము తీర్పవలెను.

విదూ—దేవరవారు సెలవిచ్చినది దివ్యముగానున్నది.

ఆచార్యులు—దేవరవారిచ్చవచ్చినట్లు చేయవచ్చును.

రాజు—(కంచుకిని జూచి) మౌద్గల్యా! ఈప్రస్తావనని వేదించి పండితకౌశికీ సహితముగా దేవిగారిని బిలుచుకొని రమ్ము.

కంచు—దేవరవారియాజ్ఞ చొప్పునఁ జేసెదను.

[అని నిష్క్రమించి సపరివ్రాజికయైన దేవితో మరల ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—అమ్మా! ఇటు, ఇటు.

ధార—(పరివ్రాజికనుజూచి) అమ్మా! ఈహరదత్తగణదాసుల కలహవిషయమున మీకేమి తోఁచుచున్నది?

పరివ్రా—నీపక్షమున కపజయము కలుగునని శంకింపకుము. గణదాసుఁడు ప్రతివాదికిఁ దీసిపోవువాఁడు కాఁడు.

ధార—అది యట్టిదే యయినను, రాజు చేకొనినవాఁడగుట చేత హరదత్తున కాధిక్యము హెచ్చును.

పరివ్రా—అమ్మా! నీవును రాజ్ఞీశబ్దమున కర్హురాలవై యున్నమాట చిత్తమం దుంచుకొమ్ము.

గీ. భాస్కరపరిగ్రహతఁజేసి పావకుండు
తాను మహనీయభాసురత్వంబు గన్న,
వలనిశాపరిగ్రహణమువలన శశియు
మహిమఁ గాంచఁడె యెల్లెడ మహిని దాను?

విదూ—చూడు! చూడు! సహచారిణియైన పండితకౌశికిని ముందుంచుకొని ధారణీదేవి వచ్చుచున్నది.

రాజు—ఆమెను జూచుచున్నాఁడను.

క. యతివేషమైనకౌశికి
యతులగతిం జేయ మంగళాలంకృతఁగా,
నతి యాధ్యాత్మికవిద్యా
యుతమైన త్రయీస్వరూపమో యన నలరున్.

పరి—(దగ్గఱకువచ్చి) దేవా! విజయోస్తు!

రాజు—అమ్మా! నమస్కారము.

పరి—గీ. వరమహాసారసుప్రసవత్వ మొంది
లలి సమానతమను యలరునట్టి
ధారణీభూతసంతానధారిణులకు
వత్సరశతంబు భ ర్తవై వఱలు మీవు.

ధార—ప్రాణేశ్వరా! మీకు శుభమగుఁగాక!

రాజు—దేవికి స్వాగతము. (పరివ్రాజికనుజూచి) అమ్మా! పీఠమును స్వీకరింపుము.

(అందఱును గూరుచున్నారు)

రాజు—అమ్మా! పరస్పరవిజ్ఞానవిషయమున ఘర్షణపడు చున్న యీహరదత్తగణదాసులను మీరిప్పుడు పరీక్ష చేయవలెను.

పరి—(చిఱునవ్వు నవ్వి) ఈపరిహాసము చాలును. పట్టణ మొద్దనుండఁగా, పల్లెయందా రత్నపరీక్ష?

రాజు—అట్లుకాదు. నీవు పండితకౌశికివిగదా? నేనును దేవియుఁగూడ నిందుఁ బక్షపాతులము.

ఆచార్యులు—దేవరవారు సెలవిచ్చినది బాగుగ నున్నది. మధ్యస్థురాలయిన యీమెయే మాగుణదోష నిర్ణయమును చేయుట కర్హురాలు.

రాజు—అందుచేతనే యీవివాద మీమెయే విమర్శింప నారంభింపవలెను.

పరి—దేవా! నాట్యశాస్త్రమునం దాటప్రధానము. కేవల వాగ్వ్యవహారముచేత నేమిప్రయోజనము? ఇందు దేవిగారియభిప్రాయ మేమో!

ధార—నాయభిప్రాయ మడిగితిరా, మొదలవీరిద్దఱివివాదమే నాకు రుచింపకున్నది.

గణ—దేవీ! విద్యయందు సమానుఁడని నాకవమానము వచ్చునట్లు చేయుట నీకు ధర్మముకాదు. నన్ననుగ్రహింపవలెను.

విదూ—అమ్మా! ఈశిక్షింభరుల సంవాదమును విందము. వీరికి జీతము లిచ్చి వృథాగాఁ గూరుచుండఁబెట్టనేల?

ధార—నీవు కలహప్రియుఁడవుగా నున్నావే.

విదూ—అమ్మా! అట్లుకాదు, రెండు మదపుటేనుఁగు లన్యోన్య కలహప్రియము లయినప్పుడు వానిలో నేదో యొకటి పరాజయము పొందక శాంతి యెట్లుకలుగును?

రాజు—అమ్మా! మీ రుభయులయొక్క నాట్యకౌశలము నీవఱకే చూచియున్నవారుకదా?

పరి—అవును. చూచినదానను.

రాజు—అట్లయిన వీరిప్పుడంతకంటె నధికముగాఁ దెలుపఁగలదేమున్నది?

పరి—నేను నదే చెప్పఁదలంచి యున్నాను.

ఉ. కొందఱు విద్య నన్ములకుఁ గోవిదులయ్యును నేర్పలేరిలన్;
కొందఱు బోధసేయుదురు గొప్పగఁగొంచెము తాము నేర్చియున్
బొందుగ రెండిటం దెలివిఁ బొంది వెలింగెడుబుద్ధిశాలులే
యెందును నగ్రగణ్యుఁ లని యెన్నికఁగాంతురు శిక్షకాళిలోన్.

విదూ—పూజ్యురాలయిన యామెవాక్యము విన్నారుకదా! దాని పిండితార్థమిది—వీరు నేర్పినది చూచుటవలననిర్ణయింపవలెనని.

ధార—నా కిది పరమసమ్మతము.

గణ—దేవా! అలాగున జరిగింపవలెను.

దేవి—మందమతియైన శిష్యురాలు ఉపదేశించినది తిన్నగా గ్రహింపనియెడల, అదియు గురువుదోషమేనా?

రాజు—దేవీ! అవునది యట్టిదే. చెప్పినది తెలిసికొలేనివానిని స్వీకరించుటలోఁగూడ బుద్ధివైభవము వెల్లడియగును.

దేవి—(తనలో) ఇప్పుడేమిచేయుదును! (గణదాసునిజూచి ప్రకాశముగా) నాప్రాణేశ్వరుని కుత్సాహకరమైన యీమనోరథ పరిపూర్తి యింతటితోఁ జాలును. ఇఁక నిరర్థక ప్రయత్నమును మానుఁడు.

విదూ—దేవిగారు సెలవిచ్చినది బాగున్నది. ఓగణదాసా! సంగీతాచార్యత్వము పొంది సరస్వతికి నైవేద్యముపెట్టు మోదకము లను భక్షించుచుఁ గూరుచుండెదు నీకీపరాభవకరమయిన శుష్క కలహముతో నేమి ప్రయోజనమయ్యా!

గణ—సత్యముగా దేవిగారివాక్యమున కదేయర్థము. సమ యోచితమయిన యీవాక్యమును వినుఁడు—

గీ. పడసితిని గొల్వు నేనని వాదమునకు
జడిసి యొరుదూషణము నోర్చి చదువు నొక్క
జీవనోపాయముగ నె తాఁ జేసికొనెడు
వాఁడు జ్ఞానవిక్రయుఁ డగువణిజుఁ డగును.

దేవి—శిష్యురాలు మీవద్ద విద్యనారంభించియెంతో కాలము కాలేదు. తిన్నఁగా మనసునఁ బట్టనివిద్య పరీక్షయిచ్చుట యనర్థ దాయకము.

గణ—ఎంతోకాలము కాలేదు గనుకనే నేను నింత నిర్బంధ పడుచున్నాను.

దేవి—అట్లయిన నిరువురును మీయుబదేశమును బూజ్యారా లైన యీమెకే కనఁబఱుపుఁడు.

పరి—దేవీ! అది న్యాయముకాదు. సర్వజ్ఞునకైనను నొంటరిగా నుండి న్యాయము తీర్చుట యుక్తముకాదు.

దేవి—(జనాంతికముగా) ఓ తెలియనిదానా! పరివ్రాజికా! మేలుకొని యున్నను నన్నునిద్రపోవుచున్నదానివలెఁ జేయుచున్నావు!

(అని యసూయతో రాజునుండి ముఖము త్రిప్పుకొనుచున్నది)

రాజు—(దేవిని బరివ్రాజికకుఁ జూపుచున్నాఁడు)

పరి—గీ. చంద్రవదనరో! నీవు నిష్కారణముగ
విముఖ వయ్యెద వేటికి విభునినుండి?
సతుల కయి నెంతప్రభుతను బడసి యున్న
హేతువున్న నె కోపింతు రిలను సతులు.

విదూ—అమ్మా! హేతు వున్నది. స్వపక్షమువారిని రక్షింప వలయును. (గణదాసునివంకఁ జూచి) ఓయీ! అదృష్టశాలివి గనుక దేవిగారికోపవ్యాజముచేత నీవిప్పుడు బ్రతికిపోయినావు. తామెంత మంచిశిక్ష పొందినవారయినను దమవిద్యఁ జూపవలసివచ్చినప్పుడందఱును జంకుపడుదురు.

గణ—దేవీ! వినుము. ఈ విధముగా నితఁ డెంచుకొను చున్నాఁడు. అందుచేత నిప్పుడు—

గీ. నేను జెప్పినవిద్యను గానిపింపఁ
దలఁచి యున్నాఁడ నీవివాదంబునందు,
నందు కీవనుమతి యియ్యకుందు వేని.
విడువఁబడినాఁడ నీచేత వెలఁది నేఁడు.

(అని పీఠమునుండి లేవఁబోవుచున్నాఁడు)

దేవి—(తనలో) ఇఁక నేమిగతి? (ప్రకాశముగా) గురువులే శిష్యజనులమీఁద సర్వాధికారులు.

గణ—దీర్ఘాయుష్మంతురాలవుకమ్మా. ఇది వ్యాజ మన్నశంక యింతటితోఁ జాలును. (రాజును జూచి) దేవిగారనుజ్ఞ యిచ్చినారు. కాఁబట్టి యీయభినయరూపమునందు విద్య కనఁబఱుపవలయునో దేవర యాజ్ఞాపించవలెను.

రాజు—ఈమె సెలవిచ్చినదానియందు.

పరి—దేవిగారిమనసులో నేమో యున్నది. అందుచేత నేను శంకించు చున్నాను.

దేవి—శంకవదలి పలుకవచ్చును. నాపరిజనమునీఁదను ప్రభువుగారి కధికార మున్నది.

రాజు—నాకని చెప్పు.

దేవి—అమ్మా! ఇప్పుడు చెప్పు.

పరి—దేవా! శర్మిష్ఠచేత రచియింపఁబడి పాదచతుష్టయ సహిత మయినచలిక మనునాటక మభినయించుట కష్టమని చెప్పు చున్నారు. ఆయొక్కదానినె యుద్దతిచేతను పట్టించి మాత్రము, దాని వలననే వీరి యుపదేశతారతమ్యమును దెలిసికో వచ్చును.

ఆచార్యులు—అమ్మగా రాజ్ఞాపించునట్లు చేయుదుము.

విదూ—అట్లయిన మీరిరువురును నాటకశాలయందు సంగీత రచనచేసిరాజుగారియొద్దకు దూత నంపుఁడు. అట్లుకానియెడల మద్దెల చప్పుడే మమ్ము లేవఁదీసికొని వచ్చును.

హర—అలాగే. (అని లేచుచున్నాఁడు.)

గణ—(ధారిణివంకఁ జూచు చున్నాఁడు.)

దేవి—(గణదాసునిజూచి) అయ్యా! మీకు విజయము కలుగునుగాక! నేనెప్పుడును మీకు మేలు కోరుదాననే సుమా!

(ఆచార్యులు లేచుచున్నారు.)

పరి—కొంచె మిటు రండు.

ఆచా—(దగ్గఱకుఁబోయి) ఇదిగో వచ్చినారము.

పరి—తారతమ్యనిర్ణయాధికారము పొందితిని గనుకఁ జెప్పు చున్నాను. అన్ని యవయవముల సౌష్ఠవమును చక్కఁగాఁ గనఁబడుటకై యలంకారము విశేషముగాఁ జేయుక పాత్రలను దీసికొని రండు.

ఇద్దఱు—ఈసంగతి తమరు మాకు బోధింప నక్కఱలేదు.

(అని నిష్క్రమించుచున్నారు.)

దేవి—(రాజునుజూచి) ఇటువంటి నేర్పు తమరు రాజకార్యములయందుఁ బ్రయోగించినయెడల, ఎంతో మేలు గలుగును.

రాజు—న న్నన్యథా భావింపకుము. ఓ మనోనాయికా! ఇది నేను పన్నినది కాదుగదా ? సమానవిద్యగలవారు కీర్తికొఱకొకరినొకరు తప్పులు పట్టుకొనుట సాధారణమే.

[నేపథ్యమునందు మృదంగధ్వని వినఁబడఁగా నందఱు నాలకించుచున్నారు.]

పరి—ఆహా! సంగీతమారంభ మయినది.

గీ. మేఘగర్జనశంకచే మిసలనెత్తి
మద్దెలరవంబుతోడ నెమళ్లు కూయ
మధురముగ బర్హిణాంగనల్ మలసి చేయు
మధ్యమస్వర మలరించె మనుల నిపుడు.

రాజు—దేవీ! మనమక్కడ సభికులమగుదము రమ్ము.

దేవి—(తనలో) ఆహా! ఏమి ప్రాణనాయకుని యవినయము!

(అందఱును లేచుచున్నారు.)

విదూ—(రహస్యముగా) ఓయీ! ధీరత్వముతో నడువుము. ధారిణీదేవి మఱియొకవిధముగా భావించుకొనును.

రాజు—గీ. ధైర్యము వహించియున్నను దగఁగ నన్నుఁ
గర్వముఁ ద్వరపెట్టుచున్న దీమురజరవము
సిద్ధిపథమున నడచుచుఁ జెలఁగునట్టి
స్వసుమనోరథశబ్దంబు చందమునను.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---

## ద్వితీయాంకము



రంగము — సంగీతశాల

[అప్పుడు పీఠముమీఁదఁ గూరుచుండి మిత్రునితోఁ గూడ
రాజును, ధారిణియుఁ, పరివ్రాజికయు, అర్హపరివారమును
బ్రవేశించుచున్నారు]

రాజు—అమ్మా! పూజ్యులయిన యాచార్యులయుభయులలో
నెవ్వరి యుపదేశనైపుణ్యమును ముందుగాఁ జూతము?

పరి—పాండిత్యప్రభావముచేత నిద్దఱును సమానులే యయి
నను, వయోవృద్ధగుటవలనగణదాసుని నేముందుగా గౌరవింపఁదగును.

రాజు—అట్లయిన, మౌద్గల్యా! ఆపూజ్యుల కీసంగతి తెలిపి,
నీవు నీ పనిమీఁదఁ బొమ్ము.

కంచు—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని పోవుచున్నాఁడు)

గణ—(ప్రవేశించి) దేవా! మధ్యలయుగలిగి శర్మిష్ఠచేత
చేయఁబడిన చలికనాటకములో నాలుగుపాదములు గల కృతియొకటి
కలదు. దేవరవారు దాని ప్రయోగ మేకాగ్రచిత్తతతోఁ జిత్తగింపఁ
దగును.

రాజు—ఆచార్యా! మేము మిక్కిలి యనుగృహీతుల మయి యున్నాము. పాత్రములను దీసికొని రమ్ము.

(గణదాసుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(జనాంతికముగా) మిత్రుఁడా!

గీ. అల యవలంకారమందిరమందు నున్న
కన్నె దర్శింపఁగోరి నాకన్నుదోయి
క్షణముఁ గాలవిలంబము సైఁపలేక
తెరనుదీయంగ నుంకించుకరణి నుండె.

విదూ—(రహస్యముగా) నీయభీప్సితమూర్తి విశేషము దృష్టి పథమునఁ బడఁబోవుచున్నది. కనుక నీవిప్పు డప్రమత్తుఁడ వయి యుండుము.

[అప్పుడు తన యంగసౌష్ఠవమును జూచుచున్న యాచార్యునితో మాళవిక ప్రవేశించుచున్నది]

విదూ—దేవా! చూడుము. పరాధీనురా లయి యున్నను, ఆమె సౌందర్యమునకుఁ గొఱఁత యేమియు లేక యున్నదిగదా!

రాజు—(రహస్యముగా) మిత్రుఁడా!

గీ. చిత్రపటమున నాఁడు వీక్షించినప్పు
డట్టి సొగసుండదని సంశయంబు వొడమె
నేఁడు ప్రత్యక్షముగ నీమెఁ జూడ నింక
శిల్పి యప్రౌఢుఁడంచుఁ దోఁచెడిని మదికి.

గణ—బిడ్డా! భయము విడిచి స్వస్థచిత్తురాలవు కమ్ము.

రాజు—(తనలో) ఓహో! ఈరూపము సర్వావస్థలయందును నిర్దోషముగా నున్నది!

సీ. నిడువాలుఁగన్నులఁ గడునొప్పి వదనంబు
శరదిందు కాంతిని జానుమీఱు
అంసభాగంబుల నందంబుగా వంగి
బాహువు లెంతయు బాగుమీఱు
ఘనమైననిక్కఁ జన్గవచేత వక్షంబు
పార్శ్వమం దడఁగినభాతి మీఱు
మధ్యప్రదేశంబు మానుగఁ బిడికిటఁ
బట్టంగఁదగియుండి వన్నెమీఱు
జఘన మెంతయు నమితమై పాటిమీఱు
వంపులై యొప్పు నంగుళు ల్పాదములను
హృదయమున నర్తనాచార్యుఁ డెట్టులుండ
నభిలషించునో యట్లుండె నంగగరిమ.

మాళ—(ఉపగానముచేసి, చతుష్పాదగీతమును బాడుచున్నది)

* చ. హృదయమ! దుర్లభుండు ప్రియుఁడీయనపై నిఁక నాశమానుమీ;
యదరెదు వామనేత్ర మహహా యిపుడేమొకో నాకువింతగా;
నొదవెదు నెట్లు క్రమ్మఱ నయో చిరదగ్ధితు నీయనంగనా!
సదయతఁ బ్రేమచేఁ బరవశాత్మగ నన్ను నెఱుంగు నాయకా!
(అని రసోచితముగా నభినయించుచున్నది)

(మాళవిక జంకి నిలుచున్నది)

---

* ఘంటారాగము—ఆదితాళము.

పల్లవి—ఏలవలచితివి వ్యర్థా! యేలాగుదరియింతు నయ్యయ్యో!
అనుపల్లవి—ఈలాగౌట తెలియనైతి* నిలపయి వెతలపాలయితి.
౧. మనస! నీవు కోరునట్టి* మనుజుఁ డెంతో దుర్లభుఁడు సుమ్మీ.
కనుక, నీవు నామీఁది* కటాక్ష మానుము నేఁడు... ఏలవలచితి.

విదూ—(రహస్యముగా) ఓహో! మిత్రుఁడా! ఈమె యీ నాలవపాదార్థము నభినయించుమిష పెట్టి తన్ను నీకర్పించుకొనుచున్నట్టుగా నున్నది!

రాజు—సఖుఁడా! మాయిరువురహృదయములు నట్లేయున్నవి.

చ. అయమ 'ప్రేమచే వివశురాలనుగా నిదె నన్నెఱుంగు మో
నాయక' యన్నవాక్యమును నాకడ సాభినయంబుగాఁగఁ దా
నీయెడఁ బాడుచో నరస నీవల ధారణియుంట నొక్కటేఁ
బ్రాయము నేఁడుమిషఁ బ్రార్థనచేసెను నన్ను కూరిమిన్.

[మాళవిక గీతము పాడినతరువాత వెనుకకుఁ బోఁబోవుచున్నది]

విదూ—అమ్మా! పోకనిలువుము. నీవాటయందొకక్రమము మఱచిపోతివి. నేను దానినిప్పుడే నీకుఁ దెలిపెదను.

గణ—బిడ్డా! నే నుపదేశించిన విద్యయందు లోపముండదని కనఁబఱుతువుగాని క్షణమాత్రము నిలువుము.

రాజు—(తనలో) ఆహా! ఈమెరూపముసర్వావస్థలయందును వింతసోయగమును నింపుచున్నది. ఎట్లన,

మ. వలయంబుల్ మణిబంధమంటఁ గటినొప్పించేర్చి డాకేలు, ని
శ్చలతన్ రెండవకేలువాల్చి దిగువన్ శ్యామాలతంబోలఁగా,

౨. ఎడమకన్నదేమోకాని* యిస్సుడేఁలో తనయంత,
వడిగ నదరఁజొచ్చె నిదిగ* భాగ్యమేమొ మేలుహాహా...ఏలవలచితి.

౩. ఇన్నినాళ్లకిందు నాకు* నిటులు లభించిన నరనాథుఁ
గన్నులారఁజూడనెట్లె* క్రమ్మఱంగఁ గలుగునో?...ఏలవలచితి,

౪. అవుర నీవితంగికొమ్మ* యను నీవయిప్రేమచే
వివశురాలనంచు నన్ను* వేవేగ నద్దయ ఫూని...ఏలవలచితి,

సలుకన్నీటుచు నేలచూపులను బాదాంగుష్ఠమాత్రంబునన్
నిలుచున్నప్పుడె నృత్యకాలమునకంటెం జెల్వ చెల్వొందెడున్.

దేవి—ఈయాచార్యులు గౌతముని మాటను సహితము పాటిగాఁ బట్టుచున్నారుగదా!

గణ—దేవీ! అట్లనఁగూడదు. రాజవిశ్వాసమువలన గౌతమునికి సూక్ష్మదర్శిత్వము కలుగుచున్నది. చూడుము—

గీ. చిల్లగింజలపొడితోడఁ జేరుకతనఁ
కల్మషజలంబు స్వచ్ఛతఁ గాంచునట్లు
పండితులతోడి సహవాసబలముచేత
మందుఁడైనను గడు బుద్ధిమంతుఁ డగును.

(విదూషకునిజూచి) మీ యభిప్రాయమును వినఁగోరుచున్నాము.

విదూ—(గణదాసునిఁజూచి) ముందుగాఁ బండితకౌశికి నడుగుఁడు. నేను గనిపెట్టిన క్రమభంగమును దరువాతఁ జెప్పెదను.

గణ—అమ్మా! గుణమునుగాని దోషమునుగాని నీవు కనిపెట్టినది సెలవిమ్ము.

పరి—నేను జూచినంతవఱకు సర్వమును నిర్దుష్టముగానున్నది. ఎందుచేతనన—

చ. పలుకులయర్థ మంగములఁ బాగుగఁ గన్పఱుపంబడెన్; రసం
బుల లయతోడ నైక్యమునుబొందెఁ బదంబులుపెట్టురీతి; యిం
పలరెను గొంచెమై మృదుకరాభినయంబు వరానువృత్తులన్;
వెలసె మనోహరంబగుచు నింతగ భాగము రాగబద్ధమై.

గణ—దేవరవా రెట్లుభావించుచున్నారు?

రాజు—మాకు స్వపక్షమువారియెడఁ గలయభిమానము తగ్గిపోయినది.

గణ—నే నిప్పుడు నర్తనాచార్యుఁడ నయినాను.

గీ. జగతి నిపుణపాత్రులౌ సాధుజనులె
శిక్షకునివిద్యశుద్ధత చెప్పఁగలరు;
వహ్నియందును బంగారువలెనె మీఁదు
సన్నిధిని వన్నెకెక్కె మా చదువుకూడ.

దేవి—అయ్యా! మీరదృష్టవంతులు. ఈపరీక్షకులచేత మెప్పు పొందినారు.

గణ—దేవీ! మీయనుగ్రహమే నావృద్ధికి హేతువు. (విదూషకునిఁ జూచి) గౌతమా! నీమనస్సులో నున్నదేమో యిప్పుడు చెప్పుము.

విదూ—ప్రథమోపదేశ దర్శనసమయము నందు ముందుగా బ్రాహ్మణపూజ చేయవలెను. మీ రాపూజను మఱచిపోయినారు.

పరి—ఓహో! ఇది ప్రయోగములోపలిప్రశ్నగదా! (అందఱును నవ్వుచున్నారు. మాళవికయుఁ చిఱునవ్వు నవ్వుచున్నది.)

రాజు—(తనలో) కన్నులు గలిగినందునకుఁ జూడవలసినసారమును జూడఁగాంచితిని! ఎట్లన—

గీ. పల్వరుస యింత కానఁగఁబడఁగ మంద
హాస మొనరించు నీవిశాలాక్షి మోము
కేసరంబు లొక్కింత లక్షింప నయిన
కమలముకుళముబోలి యందమై కానిపించు.

గణ—ఓదొడ్డబ్రాహ్మణుఁడా! ఇదివరకు కాని యాటకాదు గదా! అటయే యయినపక్షమున, బూజార్హుఁడ వయినననిన్నుఁ బూజింపకుందుమా!

విదూ—నేను నిశ్చయముగా నీరు త్రాగవలె నన్నయాశతో

వట్టియుఱుములు గలయాకాశమును గనిపెట్టుకొని యున్న చాతకపక్షి వయినాను.

పరి—అలాగుననే యయినావు.

విదూ—అట్లయినఁ బండితుల సంతోషమువలన లాభము పొందవలెనని నమ్మియున్న నావంటివారు కేవల మూఢులు. పూజ్యురా లయినయీపరివ్రాజిక మెచ్చినది గనుక నేనీమునకు బహుమాన మిచ్చెదను. (అని రాజుచేతినుండి బంగారుమురుగును దీయు చున్నాఁడు.)

దేవి—నిలువుము. రెండవవారి గుణ తారతమ్యముకూడఁ దెలియనమునుపే నీ వీయాభరణ మేల యిచ్చెదవు?

విదూ—ఇది మఱియొకరిసొత్తు గనుక.

దేవి—(ఆచార్యునివంకఁ జూచి) అయ్యా! గుణదాసా! మీ శిష్యురాలు విద్య కనఁబఱుచుట యయినదిగదా?

గణ—బిడ్డా! మన మిఁక వెళ్ళుదము రా. (ఆచార్యునితోఁ గూడ మాళవిక పోవుచున్నది.)

విదూ—(రహస్యముగా) దేవర సేవచేయుటలో నాబుద్ధి వైభవ మింతే.

రాజు—'ఇంతే' యన్నమాట చాలింపు.

గీ. ఆమె తెరచాటునను మఱుంగగుట నాదు
కనులకును భాగ్య మస్తమించినవిధంబు
హృదయమున కుత్సవసమాప్తి యొదవినట్లు
మార్గమునకు ద్వారము మూసినట్లుఁ దోఁచు.

విదూ—(రహస్యముగా) మేలు! దరిద్రాతురునివలె వైద్యునినే యౌషధము చేసి పెట్టు మనుచున్నావు!

[హరదత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

హర — దేవా! ఇప్పుడు నాయొక్క విద్యోపదేశమును జిత్తగించుట కనుగ్రహింపుఁడు.

రాజా — (తనలో) నేను జూడఁగోరినది సమాప్తమయినది. (దాక్షిణ్యము కనఁబఱుచుచుఁ బ్రకాశముగా) మేము చూడ వేడుక గలవార మయియే యున్నాము.

హర — నేను ధన్యుఁడ నయినాను.

[తెరలో వైతాళికుఁడు.]

దేవా! జయ మగుఁగాక! జయ మగుఁగాక! మధ్యాహ్న మగుచున్నది. అందుచేత నే—

ఉ. అంచలు కన్నుమూసికొను నంబుజపత్రమునీడ డిగ్గియున్,
మించిన వేఁడిఁ, జేర నవె మేడల చూరులు పావురంబులున్,
కాంచి నెమళ్లుపోయెడు దగన్ జలయంత్రము చేర నీటికై,
మించెఁ బ్రతాపపూర్ణుఁడయి మీవలెనే రవియు న్నృపాలకా.

విదూ — అయ్యో! అయ్యో! మాకు భోజనవేళ యయినది. వేళ తప్పినయెడలఁ బ్రభువువారికి జబ్బుచేయునని వైద్యులు చెప్పుచున్నారు. హరదత్తా! నీవేమి చెప్పెదవు?

హర — ఇప్పుడు నాకేమి చెప్పుటకును నవకాశము లేదు.

రాజా — (హరదత్తునివంకఁ జూచి) అట్లయిన మీయుపదేశమును రేపు చూపవచ్చును. ఇప్పటికిఁ జాలింపుఁడు.

హర — దేవరవా రాజ్ఞ యిచ్చినట్లు చేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

దేవి — దేవరవారు మాధ్యాహ్నికకృత్యములనుదీర్పవలెను.

విదూ—దేవీ! అన్నపానములు నేఁడు త్వరపెట్టివి శేషముగా జేయింపుము.

పరి—(లేచి) మీకు శుభ మగుఁగాక! (అని దేవితోఁగూడ పోవుచున్నది.)

విదూ—ఓహో! కేవల రూపమునందే కాక నాట్యమునందుఁ గూడ మాళవిక యనమానురాలుగా నున్నదే!

రాజు—మిత్రుఁడా!

గీ. విద్యచేతన సౌందర్యవిభవమునను
ధాత యిట్టియవ్యాజసుందరిని జేసి
విషముపూసినబాణంబు వేఱొకండు
పంచబాణున కిపుడు కల్పించెఁ దాను.

పలుపలుకు లేల? నేను నీవారయవలసినవాఁడ నయినాను.

విదూ—నేనును నీ కారయవలసినవాఁడ నయినాను. అంగడిలోని మంగలము వలె నిశ్చయముగా నాకడుపు మండుకొని పోవుచున్నది.

రాజు—అందుకు సందేహములేదు. నీవు మిత్రకార్యమునందుఁ ద్వరపడవలెను.

విదూ—నేను కృతనిశ్చయుఁడ నయినాను. కాని, మేఘములచాటున నున్న వెన్నెలవలెనే పరాధీనురాలయిన మాళవిక దర్శనమే శీఘ్రసాధ్యము కాదు. నీవో కటికివానిసమీపమున నున్న మాంసమునందత్యాశ గలిగి చేర భయపడుచున్న గృధ్రము వలె నున్నావు. అత్యాతురునివలెఁ గార్యసిద్ధిఁ గోరుచున్న నిన్నుఁ జూడఁగా నాకు వేదు కగుచున్నది.

రాజు—నే నాతురుఁడను గాక యెట్లుండ గలను!

క. అంతఃపురమునఁ గలిగిన
యింతుల వ్యాపారములకు నెద విముఖుఁడై
యెంతయు నీసుందరిపయి
సంతతసుస్నేహమునకుఁ స్థానంబయ్యెన్.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## తృతీయాంకము

[అప్పుడు పరివ్రాజికయొక్క పరిచారికయైన సమాహితిక ప్రవేశించుచున్నది.]

సమా—“సమాహితికా! నీవు పోయి రాజుగారి తోఁటలో నిమ్మపండొకటి తీసికొనిరమ్ము.” అని పూజ్యురా లయిన పరివ్రాజిక నా కాజ్ఞాపించినది. అందుచేత నే యుద్యానవనపాలకురా లయిన మధురికను వెదకఁబోయెదను. (కొంచెము నడిచి చూచి) అదిగో కాంచనాశోకమును జూచుచు మధురిక నిలుచున్నది. దానివద్దకుఁ బోయి కుశలవార్త యడిగెదను.

[అప్పు డుద్యానవన పాలకురాలయిన మధురిక ప్రవేశించుచున్నది.]

సమా—(సమీపించి) సఖీ! ఉద్యానవనవ్యాపారమునందు నీవు సుఖముగా నున్నావా?

మధు—ఓహోహో! సమాహితికవా? సఖీ! నీకు స్వాగతము.

సమా—ఓసీ! “నావంటివారు రాజుగారిని రిక్తహస్తములతోఁ బోయి చూడఁ గూడదు గనుక, దర్శనము చేయఁగోరు నా

కొక నిమ్మపండు కావలసి యున్నది.” అని పూజ్యురా లయిన పరివ్రాజిక నీ కానతిచ్చుచున్నది.

మధు—ఇదిగో నిమ్మపండు సమీపముననే యున్నది. కాని, పరస్పర వివాదము లాడుచున్న నాట్యాచార్యుల యుపదేశమును జూచి, ఆ పూజ్యురా లెవరిని మెచ్చినదో చెప్పు.

సమా—ఇద్దఱును పాండిత్యమును బ్రయోగనైపుణ్యమును గలవారే. అయినను శిష్యురాలి గుణవిశేషముచేత గణదాసుఁడే యధికుఁ డని చెప్పఁబడినాఁడు.

మధు—అటుతరువాత మాళవికవిషయ మయిన రహస్య వ్యాపారమును నీ వేమయిన విన్నావా?

సమా—రాజు ఆమెయందు గాఢానురాగము కలవాఁడై యున్నాఁడు. కాని కేవలము ధారణీదేవియొక్క మనస్సునొప్పించుట కిష్టములేక తన ప్రభుత్వమును గనఁ బఱుపకున్నాఁడు. ఈదినముల యందు వాడిపోయిన మాలతీమాలవలెనే మాళవికయు శోషిల్లి కనఁబడుచున్నది. అంతకంటె నాకుఁ దెలియదు. నన్ను విడిచిపెట్టుము.

మధు—ఈకొమ్మయందు వ్రేలాడుచున్న నిమ్మపండు తీసికొని పొమ్ము.

సమా—(కోసికొన్న ట్లభినయించుచు) సఖీ! ఈసాధుజన శుశ్రూషచేత నీ వింతకంటెను మంచిఫలమును బొందుము.

(అని బయలుదేఱుచున్నది.)

మధు—సఖీ! మనము కలిసిపోవుదము. నేనుగూడవచ్చి చిరకాలమునుండి పూఁతపట్టకున్న యీకాంచనాశోకవృక్షమునకు

దోహదము చేయించునిమిత్తమయి దేవిగారితో మనవి చేసెదను.

సమా—అవును. అది నీపనియే కదా?

(అని యిద్దఱును బోవుచున్నారు.)

ఇది ప్రవేశకము



[అప్పుడు కామావస్థలో నున్న రాజును విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

రాజు—(తన్నుఁ జూచుకొని)

ఉ. కాయము చిక్కిఁ జెల్లు నలకామినికౌఁగిలిసౌఖ్య మబ్బమిన్;
బాయక కన్ను నీరు విడువంగనగున్ క్షణమేని చూడమిన్;
దోయజనేత్ర నించుకయుఁ ద్రోచిలోలంగనియట్టి నీవు న
త్యాయతతాప మొందెదవహో యిదియేమిటి కిందు? డెందమా!

విదూ—మీరు ధైర్యమువిడిచి దుఃఖించుట యింతటితో జాలును. నేను మాళవికకు బ్రియసఖి యైనవకుళావళికను జూచి దేవరవారిసందేశమును జెప్పినాను.

రాజు—అప్పు డది యేమున్నది?

విదూ—"ఈయాజ్ఞచేత నేను కృతార్థురాల నయినాను. అయినను భాగ్యహీనురా లయినయామె నిప్పుడు నిధిని రక్షించునట్లుగా దేవిగారు మఱింత పదిలముగాఁ గావలియుంచి కాపాడుచున్నారు గనుక, ఆమెవద్దకుఁ బోవుటయే సుఖసాధ్యము కాకున్నది. అట్లయ్యును నేను బ్రయత్నము చేసెద నని రాజుగారితో విన్నవింపుము" అన్నది.

రాజు—ఓ దేవా! ఓ సంకల్పసంభవా! ప్రతిబంధములతో

నిండిన విషయముల యందుఁ బ్రవేశ పెట్టి, నన్ను క్షణకాలమైన సహింప శక్యముకానట్లుగాఁ గొట్టుచున్నావు. (విస్మయముతో)

గీ. పరమకోమలమగు నీయు బాణమేడ?
హృదయభేదక మగు పీడయేడ? మదన!
మృదువుఁ దీక్ష్ణంబు నగునన్న మేటివింత
వసుధ నీయందుఁ గానంగఁబడెను నేడు.

విదూ—ఈ కార్యసాధన విషయమయి నేనొక యుపాయ ప్రయోగము చేసినా నని దేవరకు విన్నవించుచున్నాను. కనుక నీమనస్సు దృఢముగా నుంచుకొమ్ము.

రాజు—ఓయీ! ఉచితవ్యాపారములయందు విముఖమయి యున్న యీ హృదయముతో నేనీ దిన శేష మెక్కడఁ గడపుదును?

విదూ—క్రొత్తగాఁ బూచిన మనోహరములయిన రక్తకురవకపుష్పములను గానుకగాఁ బంపి, ఈశుభినవ వసంతసమయము నందు దేవరవారితోఁగూడ డోలాధిరోహణసుఖ మనుభవింప మనసుపడుచున్నానని యిరావతి యిప్పుడేనిపుణికచేతఁ దమకు సమాచారము పంపినదిగదా? దేవరవారును అందు కొప్పుకొన్నారుగనుక మన మా ప్రమదవనమునకే పోదము.

రాజు—అది సరిపడదు.

విదూ—ఎందు చేత?

రాజు—మిత్రుడా! స్త్రీలు సహజముగా బుద్ధికౌశలము కలవారు. నేను బయి కెంతలాలనము చేయుచున్నను నామనస్సు మఱి యొకతెయందుఁ దగిలియున్నసంగతి నీసఖ యెట్లు కనిపెట్టకుండును?

ఉ. నెయ్యము త్రెంప హేతువు లనేకము కూర్పఁగవచ్చుఁగాన, నే
నియ్యెడ మానుటర్హమగు నిప్పు డిరావతినీఁది కూరిమిఁ,

నెయ్యము లేనిచో వ్రాదిని, నేర్పునఁ బూర్వముకంటె హెచ్చుగాఁ
జతుర్యానఁ జేయు సేవ యుపచారము కాదు వివేకురాండ్రికిన్.

విదూ—దేవర యంతఃపుర కాంతలమీఁది దాక్షిణ్యము నొక్కసారిగా వెనుక పట్టించుట తగదు.

రాజు—(ఆలోచించి) అట్లయినచోఁ బ్రమదవనమార్గము కనఁబఱుపుము.

రాజు—దేవా! ఇదె యిదె.

(ఇద్దఱును నడచుచున్నారు.)

విదూ—ఈ ప్రమదవనము వాయుబలముచేతఁ గదలుచున్న చిగురుటాకులను వేళ్ళతో దేవరవారిని ప్రవేశింపఁ ద్వరపెట్టుచున్నట్లున్నది.

రాజు—(స్పర్శసుఖము కనఁబఱిచి) వసంతము వచ్చినదికదా? మిత్త్రుఁడా! చూడు.

చ. కదసిన గండుఁగోయిలల కర్ణసుఖావహ కూజితంబుచే
సదయతఁ గాముబాధ కెటుసైపు మనం చనునట్లు లోప్పెదుర్;
పదిగ వసంతుఁ డామ్రమునువాసనలం దగు చల్లగాలిచే
మృదువగు చేతితో నిమురురీతిని దోఁచెడు మచ్ఛరీరమున్.

విదూ—తాపోపశమనము కలుగుటకయి యిందుఁ బ్రవేశింపుము. (ఇద్దఱును ప్రవేశించుచున్నారు.)

విదూ—అవధానముతోఁ జూడుము. ఇదిగో ప్రమదవనలక్ష్మి నిన్నాకర్షించుటకో యనునట్లు యువతీవేషమును లజ్జపఱుచు పుష్పాలంకారము ధరించి యున్నది.

రాజు—నేనును విస్మయముతోనే చూచుచున్నాను.

సీ. బింబాధరాలక్తకంబును మించెడు
నసమరక్తాశోకకుసుమవితతి
మకరికాపత్త్రాది మండనంబును మించు
నరుణశుభ్రవిసీలకురవకాళి
చంచరీకసమాశ్రియాంచిత తిలపుష్పగరిమ
మించును దిలకంబుఁగూడ
బహువిధశృంగార భావంబులనుమించి
వింతగానున్న వసంతలక్ష్మి
పౌఢయువతీజనంబుల రమ్యమైన
మోములనుజేయు సింగారములను మించి
వానికి నవజ్ఞచేసెడువరుస నిదిగొ
వఱలుచున్నది నేత్రోత్సవంబుగాఁగ.
(అని యుద్యానశోభను నిరూపించుచున్నారు.)

[అప్పుడు సంభ్రమముతో మాళవిక ప్రవేశించుచున్నది.]

మాళ—రాజుమనసు తెలియక నేనాయనను గామించుచున్నందుకు లజ్జపడుచున్నాను. నేనీవృత్తాంతమును నాప్రియసఖకెట్లు చెప్పఁగలను! మన్మథుఁడు నాకీ యప్రతీకారమైనతీవ్రవేదన నెంతకాలము పెట్టునో తెలియఁజాలకున్నాను. (కొన్నియడుగులు నడిచి) నేనెక్కడకు బయలుదేఱితిని! (ఆలోచించి) "గౌతముని చపలత్వముచేత నుయ్యాలనుండి పడి నాకాలు నొప్పిపట్టి యున్నది. అందుచేత నేను బోవుట కశక్తురాలనుగా నున్నాను. కాఁబట్టి నీవు పోయి కాంచనాశోకమునకు దోహదము నిర్వర్తింపుము. అది యైదురాత్రులలోపలఁ బూఁతపట్టినపక్షమున, నీమనోరథపూర్వకమయినయనుగ్రహమును నీకుఁ జేసెదను." అని దేవిగారు నన్నుఁ

బంపి యున్నారు. నేనిప్పుడు నియమించినస్థలమునకు వచ్చియున్నాను. నాపాదాలంకారమును బట్టుకొని నావెంటనే బయలుదేరిన వకుళావళిక యింకను రాకున్నది. నే నీలోపల ముహూర్తకాల మొంటిగా దుఃఖపడియెదను. (అని యిటునటు తిరుగుచున్నది.)

విదూ—(చూచి) అహాహా! ఇదిగో మద్యపానవిహ్వలుఁడై యున్నవానియొద్దకుఁ బానకపుఁగుండ తీసికొని రాఁబడినది!

రాజు—ఓయీ! అది యేమి?

విదూ—అదిగో మాళవిక విశేషాభరణములు లేకముఖము నందు విచారము కన్పడ నొంటిగా సమీపమునసే నిలిచి యున్నది.

రాజు—(సంతోషముతో) ఏమీ! మాళవికా?

విదూ—నిస్సందేహముగా.

రాజు—ఇప్పుడు నాకుఁ బ్రాణములు నిలుపుకొనుటకు శక్య మగును.

చ. దగగొనియున్నపాంథుఁ డటుతన్ విని సారసపక్షికూఁత, దా
నొగిఁ దరువాటిక్రేవ నది యున్నదటం చలరారుమాడ్కి, మే
లగుప్రియురాలు చెంతఁ గలదంచును నీవు వచింపఁ జింతచేఁ
బొగిలెడు నామడెందమును బొందెడు నిందు సమందమోదముల్.

ఆమె యెక్కడ ?

విదూ—అదిగో చెట్లచాలునడుమనుండి వెలువడియీవంకకే మరలి కనఁబడు చున్నది.

రాజు—ఆమెను జూచినాను.

గీ. ఘనవితంబము నిటుపేద కౌనుఁ గలిగి
యటువు లైనట్టి గబ్బిగుబ్బలను దనరి

గిడుదలా వాలుఁగన్నులు నెఱయు నిటకె
చేరవచ్చెడు నదిగో నాజీవితంబు.

మిత్రుఁడా! ఆమె పూర్వముకంటెఁ గ్రొత్తయవస్థ పొంది యున్నది. ఎట్లన—

గీ. రెల్లుపువుఁబోలెఁ జెక్కులు తెల్లవాఱి
పరిమితము లైనభూషణావళులఁ దాల్చి
వఱలెడు వసంతమునఁ బాండుపత్రవితతి
మాఁగఁ బూఁతపట్టెడు మల్లెతీఁగెఁ బోలి,

విదూ—ఈమెయు నీవలెనే మన్మథవ్యాధిచేత నే బాధనొందుచుండి యుండును.

రాజు—నామీఁదిప్రేమచేత నీక ట్లగపడుచున్నది.

మాళ—ఈవృక్షమును లలితసుకుమారదోహదము నపేక్షించి పుష్పాలంకారము లేక యుత్కాతుర నయి యున్న నావలెనే శోక మనుభవించుచున్న ట్లున్నది. కాఁబట్టి దీనినీడచేతఁ జల్లఁగా నున్న యీరాతిమీఁదఁ గూరుచుండి వేడుకతోఁ బ్రొద్దు పుచ్చెదను.

విదూ—ఆమె యుత్కాతుర నయి యున్నానని చెప్పుచున్నది విన్నావా?

రాజు—ఇంతమాత్రముచేత నీయూహ సరియైన దని నే నెంచను. ఎందుచేత నన—

క. కురువకసుమరజముం గొని,
వరశీకరముల ధరించి, వంచి చిగుళ్ళన్,
దరుణుల నిష్కారణముగ
మరి యాతురఁ బెట్టవచ్చు మలయానిలుఁడున్!

మాళ—(కూరుచున్నది)

రాజు—మిత్రుఁడా! మన మీతీఁగెలచాటున దాఁగియుందము రమ్ము.

విదూ—దూరమున యిరావతివలెఁ గనఁబడుచున్నది!

రాజు—పద్మలతను జూచినయేనుఁగు మొసలిని లక్ష్యము చేయదు. (అని చూచుచున్నాఁడు)

మాళ—ఓహృదయమా! నేను నిరాధారను గనుక దుర్లభమైన యీకోరికను విడువుము. నన్నేల నీవాయాస పెట్టెదవు?

విదూ—(రాజువంకఁ జూచుచున్నాఁడు)

రాజు—ప్రేమయొక్కమహిమ చూడుము.

గీ. పలుకవునిమిత్త మామనోవ్యధకు నీవు,
తత్త్వమరయంగ నూహకుఁ దరముకాదు;
లలనరో! యట్లయిన నీవిలాపమునకుఁ
గారణము నేనయంచు నిక్కముగఁ దలఁతు.

విదూ—దేవా! ఇప్పుడే మీసంశయము నివర్తియగును. నేను మీమదనసందేశమును జెప్పినవకుళావళిక యొంటిగా నీలాగున వచ్చుచున్నది.

రాజు—అది నాప్రార్థన మఱచిపోయినదేమో!

విదూ—ఇప్పుడా బానిసకూఁతురు మహాత్తరమయిన దేవరవారి సందేశము నేలమఱచును?

[పాదాలంకారములతో వకుళావళిక ప్రవేశించుచున్నది]

వకు—నాసఖికి క్షేమమా?

మాళ—ఓహో! వకుళావళికా! వచ్చితివా? నీకుస్వాగతము. కూరుచుండుము.

వకు—(కూరుచుండి) ఓసీ! నీవిప్పుడు యోగ్యమయిన పనికి నియమింపఁబడినావు. నీ కాలొకటి నావంకఁజూపుము. లత్తుకపెట్టి నూపురము తొడిగెదను.

మాళ—(తనలో) ఓహృదయమా! యీవైభవములభించిన దని సంతోషింపఁబోకుు. నాకీదుర్దశ యెట్లుతొలఁగును? కానిమ్ము నాకిదే మరణాలంకారముకాఁగలదు.

వకు—నీలో నీవేమియాలోచించుచున్నావు? దేవిగారీకాంచ నాశోకమెప్పుడు పుష్పించునాయని యాతురపడుచుందురుగదా?

రాజు—ఏమీ! ఈ ప్రయత్నమంతయు నశోకవృక్షదోహదము నిమిత్తమా?

విదూ—ఏమి? దేవిగారు కారణములేక యీయంతఃపురా భరణములతో నీమె నలంకరింప నియమించి యుండదని మీకుఁ దెలియదా?

మాళ—(కాలుచాఁచి) సఖీ! ఇప్పుడు కాలికి నొప్పికలుగ నీకుము.

వకు—సఖీ! నీవు నాశరీరమవేకదా?

(అని పాదాలంకారము చేయునట్లు నటించుచున్నది)

రాజు—గీ. సఖుఁడ! చూడుము ప్రియురాలిచరణమునకు
లేఁతగానిడ్డ లత్తుకలేఖ యదిగొ
హరునిచే దగ్ధమైన యనంగవృక్ష
మునకుఁ దొల్లిపల్లవం బన మురువుచూపు.

విదూ—దేవిగారీమెకు నియమించినపని యీపాదమునకుఁ దగియున్నది.

రాజు—నీవు చక్కఁగాఁ జెప్పినావు.

చ. వరసఖ కాంతినొప్పి నవపల్లవ రాగము చేత సార్ద్రిమా
తరుణిప్రశస్తపాదమునఁ దన్నఁగవచ్చును రెంటి నింకఁ; గ్రొ
వ్విరు లవిలేక దోహదము వేఁడునశోకమునైన; లేనిచో,
శిరమునువంచి నేరమును జేసినకాంతునినైన, మిత్రుఁడా!

విదూ—నీవే యీ మొదట నేరము చేసినవాఁడవగుదువేమో.

రాజు—అమోఘకార్యసిద్ధుఁడవయిన నీబ్రాహ్మణ వాక్యమును శిరసా వహించెదను.

[అప్పుడు మత్తుగొనియున్న యిరావతి చేటికతోఁగూడ
ప్రవేశించుచున్నది]

ఇరా—సఖీ! నిపుణికా! స్త్రీలకిటువంటిమత్తత విశేషాలంకారమని నేను బలుమాఱు వినుచువచ్చినాను. ఈలోకోక్తి సత్యమేనా?

నిపు—ఇది మొదట లోకప్రవాదమే కాని యిప్పుడు సత్యమే యయినది.

ఇరా—ఓసీ! నాయందలిప్రేమ నటుండనిమ్ము. ఉయ్యెల యున్నగృహమునకు భర్త నాకంటెముందుగాఁ బోయియుండునని నీవిప్పుడెట్లు తెలిసికొంటివో నాకుఁజెప్పు.

నిపు—అమ్మా! నీయందలి యఖండప్రేమచేతఁ బోయియుండునని తెలిసికొంటిని.

ఇరా—ఈయుపచారవృత్తి చాలించి మధ్యస్థతను వహించి చెప్పుము.

నిపు—వసంతోత్సవమునందలి నైవేద్యములకు మరగినగౌతముఁడు నాతోఁ జెప్పినాఁడు. అమ్మగారు త్వరపడవలెను.

ఇరా—(అవస్థకు తగినట్టుగాకొంచెమునడిచి) సఖీ! మత్తుచేత

బాధపడుచున్న నన్ను రాజుగారి దర్శనమునిమిత్తము చిత్తము త్వర పెట్టుచున్నదికాని కళ్ళుమాత్రము సాగకున్నవి.

నిపు—మనమిప్పు డుయ్యేలయున్నవసంతగృహమునకు వచ్చి యున్నారము.

ఇరా—నిపుణికా! భర్తగారిక్కడఁ గనఁబడరే.

నిపు—అమ్మగారు తిన్నఁగాఁజూడవలెను. పరిహాసార్థముగా రాజుగారిం దేతిఁగెలలోనో గూఢముగా దాఁగియుందురు. మనమును బ్రేంకణపులతాపరివృత మయిన యీయశోకవృక్షముక్రిందిశిలాపట్టమునకుఁ బోవుదము.

ఇరా—ఆలాగే.

నిపు—(చూచి) అమ్మా! చూడుము. క్రొమ్మావిగున్నను వెదకుచున్న మన కిప్పు డెఱ్ఱచీమ కానఁబడుచున్నది.

ఇరా—అది యేమి?

నిపు—ఇదిగో యశోకవృక్షముయొక్క నీడను వకుళావళిక మాళవికకుఁ జరణాలంకారము చేయుచున్నది.

ఇరా—(శంకను గనఁబఱిచి) ఇది మాళవిక యుండవలసిన చోటు కాదు. నీవేమని యూహించెదవు?

నిపు—ఉయ్యేలనుండి పడుటచేతఁ గాలునొప్పి పెట్టిన దయి దేవిగా రశోకదోహదకార్యమునకు మాళవికను నియోగించి రని యూహించెదను. అట్లు కానియెడల దేవి తాను ధరించుకొనెడి యీ యందెలజతను బరిజనము పెట్టుకొనుట కెట్లు నియమించును?

ఇరా—ఇది దీనికి గొప్పగౌరవము.

నిపు—నీవు రాజుగారి నేల వెదకవు?

ఇరా—సఖీ! నాపాదములు ముందుకు నడువకున్నవి. నా

మనస్సు కళవళపడుచున్నది. ఈలోపల నాజంకు దీర్చుకొనియెదను. (అని మాళవికను జూచి తనలో) నామనస్సులో భీతి కలుగుటకు హేతువు లేకపోలేదు గదా!

వకు—(పాదమును జూచి) ఏమి? ఈలత్తుక రేఖలనుదీర్చుట నీకింపుగా నున్నదా!

మాళ—నా కాలిమీఁద నుండుటచే దీనిని నేనుప్రశంసించుటకు లజ్జపడుచున్నాను. ఈ శిల్పకళాకౌశలమును నీవెవరివద్ద నేర్చుకొన్నావు!

వకు—నే నిప్పుడు రాజుగారి శిష్యురాలను.

విదూ—నీ విప్పుడు గురుదక్షిణ పొందుటకు వేగిరమురమ్ము.

మాళ—అదృష్టవంతురాల నని గర్వపడఁబోకు.

వకు—ఉపదేశమునకుఁ దగినపాదము లభించినది గనుక నే నిప్పుడు గర్వమునే పొందెదను. (లత్తుకరచనను చూచి తనలో) నాపని నేను జక్కఁగా నిర్వహించితిని. (ప్రకాశముగా) సఖీ! నీ పాదమున కొకదానికి లత్తుకపెట్టుట యయినది. ఇఁక నోటితో నూఁది తడి యార్చవలెను. అక్కఱలేదు. ఆపని యిక్కడిగాలియే చేయుచున్నది.

రాజు—మిత్రుఁడా! చూడుచూడు.

గీ. పచ్చిలత్తుకచేఁ దడిపాయకున్న
పాద మాఱంగ నాముఖవాయువునను
జక్కఁగానూఁది తగుసేవ సలుప నాకు
నుత్తమంబైన యవకాశ మొదవె నిపుడు.

విదూ—మీ కీచింత యెందుకు! ఈసేవ మీకు చిరకాల మనుభవింప లభించును లెండి.

వకు—సఖీ! నీపాదము కెందామరవలె శోభిల్లు చున్నది. నీ విప్పుడు సర్వదా రాజుగారియొడిలోఁ జేరుదానివలె నున్నావు.

ఇరా—(వకుళావళికముఖము కేసి చూచు చున్నది.)

రాజు—ఇది నా కాశీర్వాదము.

మాళ—ఓసీ! అవినయవాక్యములు పలుకకు.

వకు—నేను బలుకఁదగినదానినే పలికినాను.

మాళ—అట్లయిన, నేను నీకుఁ బ్రియురాలనుగానా?

వకు—నాకుమాత్రమే కాదు.

మాళ—మఱియెవరికిఁగూడ?

వకు—గుణగ్రాహులయిన రాజుగారికిఁగూడ?

మాళ—నీవు మాయమాటలు చెప్పుచున్నావు నాయందట్టి గుణ మేదియు లేదు.

వకు—సత్యము. నీయందుఁ గాదు. నాకది కృశించి తెల్లపాఱిన రాజుగారి సుందరాంగములయందుఁ గనఁబడు చున్నది.

నిపు—మొదట గుణించుకొనివచ్చినట్లే యీ చెడుపడఁతుక యుత్తరము చెప్పుచున్నది!

వకు—అనురాగ మనురాగముచేతనే పరీక్షింపఁ దగిన దన్న సుజనవాక్యమును బ్రమాణము చేసికొమ్ము.

మాళ—నీ వేల యిచ్చవచ్చిన ట్లెల్లను వదరెదవు?

వకు—కాదు కాదు. ప్రేమచేత మృదువులయిన యివి మఱియొకరి నోటినుండి వచ్చిన రాజుగారి వాక్యములే సుమా?

మాళ—సఖీ! దేవిని దలఁచుకొని నా హృదయ మీమాటలను విశ్వసింపకున్నది.

వకు—ఓసిముద్దరాలా! తుమ్మెదబాధ యున్న దని వసంత

కాలమునఁ గలిగినకోర్కెయ్యూనిపూ వలంకరింపఁబడునోఁ గూడదా యేమి!

మాళ—దుర్లభపదార్థాపేక్ష పొందియున్న నాకు నీవు సహాయురాల వగుదువా?

వకు—నేను మర్దించినకొలఁదిని బరిమళించు వకుళావళికను జుమా.

రాజు—మేలు! వకుళావళికా! మేలు!

ఉ. భావమెఱుంగ నై నపిదపం దగఁ బ్రస్తుతవాక్యయుంబులన్,
కేవలముం దిరస్కృతి జనించినచో నుచితోత్తరంబులన్,
జేవమెయి నివేదనము చేసె మదీయనిదేశ మిచ్చుటన్;
జీవములిట్లు దూతికలచేతనె యుండును గామశాలికిన్.

ఇరా—సఖీ! వకుళావళిక మాళవికచేత నీకార్యమునం దడుగుపెట్టించినది చూచితివా?

నిపు—అమ్మా! నిర్వికారుల కయినను సమయోచితమైన యుపదేశము వాంఛను బుట్టించును.

ఇరా—నాహృదయము యొక్క శంక తప్పక పొందవలసిన దే. ఇప్పుడు సంగతి తెలిసినందునఁ గర్తవ్య మాలోచించెదను.

వకు—ఇదిగో నీరెండవపాదముకూడ నలంకరింపఁబడినది. ఇప్పుడందెలను నీ రెండుకాళ్ళకును దొడిగెదను. (అందెలు పెట్టుటనభినయించుచున్నది.) సఖీ! లెమ్ము, అశోకమును పుష్పింపఁ జేయుటకయియుఁక దేవిగారియాజ్ఞ నడుపుము. (ఇద్దఱును లేచుచున్నారు.)

ఇరా—దేవిగారి నియోగమని వింటిని. ఇప్పుడది జరగనిమ్ము.

వకు—ఇదిగో రాగాధిక్యము గల నీవనుభవింపఁదగిన వాని రూపము నీ యెదుటనే యున్నదే.

మాళ—(సంతోషముతో) భర్తా యేమి ?

వకు—(చిఱునవ్వుతో) భర్త కాఁడు. ఈయశోకమున వ్రేలు చున్నయీ ద్రాఁకజిగురుజొంపములను కర్ణాభరణముగాఁ జేసికొమ్ము.

మాళ—(విషాదమును నటించు చున్నది.)

విదూ—ఏమి? దేవరవారు విన్నారా ?

రాజు—మిత్రుఁడా ! ఇంతతోనే కాముకుల యభీష్టము సంపూర్ణ మగును.

చ. ఒకరికిఁ బ్రేమ యుండి మఱియొక్కరికిం దగుప్రేమ లేనివా
రికి వడిఁ బొందు కల్గినను శ్రేష్ఠము కాదది; యంతకంటెనుఁ
బ్రకటసమానురా లగువారల కామరణంబు నొందుటఁ
వికలతఁగూడ నబ్బియుఁ బెద్దయు మేలుగ నెంతు నామదిన్.

మాళ—(చిగురాకును కర్ణాభరణముగా ధరించికొని విలాపముతో నశోకమును దన్నుటకుఁ బాద మెత్తుచున్నది.)

రాజు—మిత్రుఁడా !

గీ. పాదపమునుండి గ్రహియించి పల్లవంబు
మరలఁ బాదపల్లవ మిడె మ్రానుకును;
కోరి యుభయులు నిటు మాఱ్చుకొనుటచేత
వంచితుఁడ నైతి నిప్పు డేనంచుఁ దలఁతు.

మాళ—ఈయశోకముపూఁచుటకయి చేయవలసిన దోహదము నేను జేసితినిగదా! ఇట్లు చేసినతరువాతఁగూడ నిది పుష్పింపకుండు నేమో!

వకు—సఖీ! ఇఁక నీలోప మేదియు లేదు. నీచరణసత్కారమును బొందియు శీఘ్రముగాఁ బూఁత పట్టకపోయినపక్షమున నీయశోకవృక్షమే నిర్గుణ మగును.

రాజు—

ఉ. ఈతనుమధ్యయందియల కింపగునాదము పుట్టఁగా నవా
బ్జాతసమానకోమలపాదమున న్నిను సత్కరించినం
బూఁతనుబట్టకున్న, నిటఁబొల్చి యశోకమ! చారురూపశో
భాతులనాయకార్హ మగునాదరమున్ వృథగాదె నీయెడన్.

మిత్రుఁడా! నేనుబోయి యవకాశము చేసికొని మాటాడ గోరుచున్నాను.

విదూ—రమ్ము. నేనిప్పుడు వారిని భయపెట్టెదను

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.

నిపు—అమ్మా! అమ్మా! రాజుగారు ప్రవేశించుచున్నారు

ఇరా—నేనిది మనస్సులో మొదటనే యాలోచించినాను.

విదూ—(చేరఁబోయి) అమ్మా! రాజుగారెదుట నుండఁగ దేవిగారికిఁ బ్రియమయిన యీయశోకవృక్షమును ఎడమకాలితో దన్నుట నీకుఁ దగునా?

ఇద్దఱు—(తొట్రుపాటుతో) అయ్యో! రాజుగా రిక్కడనే యున్నారే!

విదూ—వకుళావళికా! ఈమె తెలియక యవినయకార్యము చేయుచుండఁ దెలిసినదానవు నీవు దాపుననుండి యెందుకు వారింప వైతివి?

మాళ—(భయము కనఁబఱుచు చున్నది.)

నిపు—అమ్మా! మహానుభావుఁడైనయీగౌతముఁ డేవి చేయుచున్నాఁడో చూడు.

ఇరా—ఇట్లు కాకపోయిన మఱియె ట్లీబ్రాహ్మణాధముఁడు జీవనము చేయఁగలుగును?

వకు—అయ్యా! ఈమె దేవిగారియాజ్ఞాప్రకారమే చేయుచున్నది. ఈయతిక్రమమునం దీమె పరాధీనురాలు. రాజుగారు క్షమింతురుగాక! (అని తాను మ్రొక్కి మాళవికచేత మ్రొక్కించుచున్నది)

రాజు—అట్లయిన పక్షమున నీయందుఁ దప్పిదము లేదు. కళ్యాణీ! లెమ్ము. (అని చేతితోఁ బట్టుకొని మాళవికను లేవఁదీయుచున్నాఁడు)

విదూ—ఇది తగును. దేవిగారు మాననీయురాలుగదా!

రాజు—క. జవ్వనిరో! కఠినంబగు
నివ్వసుధారుహము మొదల నిటు మోఁపుటచే
నొవ్వదె కిసలయకోమల
మివ్వామపదాంబుజాత మిప్పుడు నీకున్?

మాళ—(లజ్జ నభినయించుచున్నది)

ఇరా—(అసూయతో) ఓహో! భర్తగారు నవనీతకోమలహృదయులుగదా!

మాళ—వకుళావళికా! తమ నియోగమును నడిపితి మని దేవిగారికి నివేదింతము రమ్ము.

వకు—సెలవు పుచ్చుకొనియెద నని రాజుగారికి విన్నపము చేయుము.

రాజు—కళ్యాణీ! నీవు పోవచ్చును. సమయము దొరికినది గనుక ముందుగా నీవిప్పుడు నా ప్రార్థనను వినుము.

వకు—అవహితురాల నయి వినుము— దేవర వా రానతిత్తురుగాక!

రాజు—గీ. ఈవిధమునఁ దని యింతిరో! యీశరీర
మల రొందవకుండెఁ జిరకాల మంచునుండి;
నీదు స్పర్శామృతంబున నెఱపు మిందు
నన్యమొల్లనినాకు దోహదము నిపుడు.

ఇరా—(వేగముగా సమీపించి) ఈయన కవశ్యముగాదోహదము చేయుము. అశోకము పూలనుమాత్రమే యిచ్చునుగాని యీయన పూవులను ఫలములనుగూడ నిచ్చును.

[అందఱును ఇరావతినిజూచి తత్తఱపడుచున్నారు]

రాజు—(రహస్యముగా) మిత్రుఁడా! ఇప్పు డేమిగతి?

విదూ—మఱి యేమున్నది? పిక్కబలమే.

ఇరా—మేలు! వకుళావళికా! మేలు! ఇప్పుడు నీవు మంచి పనికిఁ బూనుకొన్నావు. మాళవికా! భర్తగారికోరికను సఫలము చేయుము.

ఇద్దఱు—అమ్మా! క్షమింపుము, రాజుగారి ప్రణయపరిగ్రహణమునకు మే మెవరము? (అని వెడలిపోవుచున్నారు)

ఇరా—పురుషులను నమ్మఁగూడదు. నీ మాయామాటలు నమ్మటచేతఁ బ్రియభార్య నయియుండి తిరస్కృతురాల నయిన నాకిప్పు డిది హృదయశల్యమయినది. వేటకాని గీతముచేత ననుమానపడక యాకర్షింపఁబడిన లేడివలెనే నా వినాశము నేను దెలిసికొనకపోతిని.

విదూ—(రహస్యముగా) మిత్రుఁడా! ఏదో యుత్తరము నాలోచింపుము. నీకుఁ జెప్పవలసిన దేమున్నది? సీటిసమీపమున దారితో పట్టుపడిన దొంగవలెనే యిప్పుడు సంధి చేసికొనుటయే కర్తవ్యమని తోఁచుచున్నది.

రాజు—సుందరీ! నాకు మాళవికతోఁ గొంచెమయినను బని లేదు. నీ వాలస్యము చేసినందున, వీరితో నేను గొంచెము వినోదముగాఁ బ్రొద్దుపుచ్చుచున్నాను.

ఇరా—మిమ్ము నమ్మఁగూడదు. భర్తగారి కిటువంటి వినోదము దొరకినసంగతి నాకుఁ దెలిసినది కాదు. అట్లు తెలిసియుండిన యెడల నే నీవిధముగా మీకు వినోదభంగమును జేసి యుండను.

విదూ—ఇప్పుడు రాజుగారి దాక్షిణ్యము చెడఁగొట్టుకొనుము. సమీపమునఁ గనఁబడినప్పుడు రాణిగారి పరిచారికలతోడ సంభాషించుట కూడఁ దప్పగునా? నీవే చెప్పు.

ఇరా—వారితోడి సంభాషణమే జరగనిమ్ము. నేను నా మనస్సు నేల యాయాస పెట్టుకోవలెను?

(అని రోషముతో బయలుదేఱుచున్నది.)

రాజు—(వెంబడించి) ప్రాణేశ్వరీ! శాంతింపుము.

ఇరా—(ఒడ్డాణమూడి కాలికిఁ దగులుకొనఁగా నడుచుచున్నది.)

రాజు—సుందరీ! ప్రేమగలవారిని నిరాదరించుట యుక్తము కాదు.

ఇరా—ధూర్తా! నీవు నమ్మఁదగినవాఁడవు కావు.

రాజు—గీ. 'ధూర్తా' యనుమాటతోన యో తోయజాక్షి!
యనుఁగుసైన నాపయి కోప మాఱఁజెల్లు;
కాళ్ళపయివ్రాలి నిన్ను మేఖలయును వేఁడఁ
జండి! కోపంబు విడువంగఁ జాలవేమి?

ఇరా—ఈ చెడు మేఖలయును నిన్నే యనుసరించుచున్నది.

(అని మొలనూలువుచ్చుకొని దానితో రాజును గొట్టఁబోవుచున్నది.)

రాజు—మిత్రుఁడా! ఈ యిరావతి

గీ. కాలునుండి యుపేక్షతోఁ గరముజాఱు
పసిఁడి మొలనూలితోడ బాష్పములు గాఱ
నుగ్రురాలయి నన్నుఁ గొట్ట నుద్యమించె
మొయిలు మెఱుపుతో వింధ్యాద్రి మోఁదునట్లు.

ఇరా—ఏమి? ఈవిధముగా నన్ను మరలఁ దిరస్కారము చేయుచున్నావు. (అని మొలనూలితోడి చేయి తీసుకొనుచున్నది.)

రాజు—క. అపరాధినైన నాపయి
నిపుడెత్తినదండ ముడిపెదేల? లతాంగీ!
యిపుడు విలాసము పెంచియుఁ
గుపితత్వము నాసుఖంబుఁ గూర్చెద వకటా.

ఇప్పుడు నీకోపము తగ్గింపుము.

(అని పాదములమీఁదఁ బడుచున్నాడు.)

ఇరా—నీకు సంతోషకర మయిన దోహదము చేయుట కివి మాళవిక పాదములు కావు.

(అని చేటికతోఁగూడఁ బోవుచున్నది.)

విదూ—లెమ్ము. నీ వనుగ్రహింపఁ బడినావు.

రాజు—(లేచి యిరావతిని గానక) ఓహో! నాప్రియురాలు వెడలిపోయినదా?

విదూ—మిత్రుఁడా! దైవవశముచేత నవినయుఁడవైన నిన్నిప్పుడు విడిచిపోయినను దానికోపమింకనుదీఱలేదు. అంగారరాశివలె నీమె మరల రాకమునుపే మనము శీఘ్రముగాఁ బాఱిపోవుదము రమ్ము.

రాజు—ఆహా! కాముని వైషమ్యము!

గీ. మనసు ప్రియురాలిపైఁ జిక్కికొనిన నేను
సేవగని యెంతొ మ్రొక్కినఁ జేకొనమియు;
కూర్మిగలదయ్యు నామీఁదఁ గుపితయగుట
చేత నేను నిష్ఫలుఁడ నైతి చేయునదియు.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

---

చతుర్థాంకము



[అప్పుడు విచారగ్రస్తుఁడయి రాజును, ప్రతీహారియుఁ
ప్రవేశించుచున్నారు]

రాజు—(తనలో)

చ. చెవులను బడ్డ కాంతపయి చేసిన వేదన నాటి గాఢచే,
నవలను రాగపల్లవము నందును దృష్టికిఁ గానిపించుటం,
దవిలి కరంబు పూచి విధబంధురంబుల కాంకురాళిచే,
జవమునఁ గామవృక్షము రసజ్ఞుని కీ ఫలమొందఁ జేయుతన్

(ప్రకాశముగా) మిత్రుఁడా! గౌతమా!

ప్రతీ—దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! గౌతము డిక్కడ లేఁడు.

రాజు—(తనలో) అయ్యో! అతఁడు మాళవిక వృత్తాంతము దెలిసికొనివచ్చుటకయి నాచేతఁ బంపఁబడినాఁడుగదా!

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విదూ—మీకు జయమగుఁగాక! జయమగుఁగాక!

రాజు—జయసేనా! ధారిణీదేవి యెక్కడనున్నదో కాలినొప్పి పోవుట కెట్లువినోద పెట్టఁబడుచున్నదో తెలిసికొనిరమ్ము.

ప్రతీ—దేవరయాజ్ఞాప్రకారము చేసెదను.

(అని పోవుచున్నది)

రాజు—గౌతమా! నీసఖురాలగు నయామె వృత్తాంత మేమి?

విదూ—పిల్లచేతఁ బట్టుపడిన గోకిల వృత్తాంతమువలెనున్నది.

రాజు—(విషాదముతో) ఎందుచేత?

విదూ—ఖిన్నురాలయియున్న యామె కన్నుల నిప్పులొలుకు దేవిచేతఁ బాతాళగృహమునఁ ద్రోయింపఁబడినది.

రాజు—నన్నుఁ దారసించినందుకుఁ గాఁబోలును.

విదూ—అవును.

రాజు—ఈవిధముగా శత్రువులెవరు దేవిగారికిఁ గోపము తెప్పించినారు?

విదూ—దేవా! వినుము. కాలినొప్పిచేత బాధపడుచున్న దేవిగారి క్షేమవార్త యడుగుటకయి యిరావతి యక్కడికిఁబోయి యుండినదని పరివ్రాజిక నాతోఁ జెప్పినది.

రాజు—అటుతరువాత?

విదూ—మన ప్రియవల్లభుఁ డేల దర్శనమియ్య లేదని దేవి యడిగినది. "మన ప్రియవల్లభుఁ డేమి? ప్రియవల్లభత్వము మన పరిజనముపాలయినట్టు మీకింకను దెలియ నేలేదా!" అని దాని కామె యుత్తరమిచ్చినది.

రాజు—అయ్యో! ఈయుపన్యాసమువలన మాళవికమీఁద నే యనుమానము పోయిన దని చింతిల్లుచున్నాను.

విదూ—అటుతరువాత దేవి నిర్బంధపెట్టి యామెవలన నీ యవినయ మంతయుఁ దెలిసికొన్నది.

రాజు—ఏమి దాని దీర్ఘరోషము! అటుపిమ్మట జరిగినది చెప్పు.

విదూ—ఇంకి యే మున్నది? మాళవికయు వకుళావలికయుఁ గాళ్ళసంకెళ్ళతో నాగకన్యలవలెఁ సూర్యకిరణములుచొరనిపాతాళ గృహనివాసము ననుభవించు చున్నారు.

రాజు—అయ్యో! పాపము!

గీ. మధురముగఁ గూయుపికమును మధుపసఖియుఁ
పెద్దగాలితోడి యకాలవృష్టి చేతఁ
గుసుమితంబగు క్రొమ్మామిడి గున్న విడిచి
తొఱ్ఱచేరంగ వలసెఁగా తోడులేక.

మిత్రుఁడా! ఇక్కడ మన మేమైనఁ జేయుట కవకాశ మున్నదా?

విదూ—ఏమి యవకాశ మున్నది? నాముద్రయుంగరమును నీకుఁ జూపినంగాని మాళవికను వకుళావలికను విడువవల దని దేవిగారు చెఱసాలకుఁ గావలిపెట్టిన మాధవికకు గట్టియుత్తరువు చేసినారు.

రాజు—(నిట్టూర్పు విడిచి విచారముతో) మిత్రుఁడా! ఇక్కడ జేయవలసిన పని యేమి?

విదూ—ఇప్పు డొక్కయుపాయ మున్న.

రాజు—అది యేది?

విదూ—(అన్నివైపులనుజూచి) మనకుఁ గనఁబడక యెవ్వరైనను విందురు, నీచెవిలోఁ జెప్పెదను. (సమీపించి చెవిలోఁ జెప్పి) ఈలాగునసే చేయవలెను.

రాజు—(హర్షముతో) ఈయుపాయము చక్కఁగా నున్నది. కార్యసిద్ధికొఱకు దీనిని బ్రయోగింపవలెను.

[ప్రతీహారి ప్రవేశించు చున్నది.]

ప్రతి—దేవా! రక్తచందనజలముతోఁ గలిపినమంచిగంధమును గాలికిఁ జేతులతోఁ బరిజనులు పట్టించు చుండఁగా మంచిగాలి వచ్చెడిచోటఁ బరుండి దేవిగారు పరివ్రాజిక చెప్పుకథలు వినుచుఁ బ్రొద్దుపుచ్చు చున్నారు.

రాజు—అట్లయినయెడల మనము పోయి చూచుట కిది మంచి సమయము.

విదూ—మీరు వేంచేయుఁడు. నేనును దేవిగారికిరిక్తహస్తములతోఁ జూడఁగూడదు గనుక నేదయినసమకూర్చుకొనివచ్చెదను.

రాజు—ఇది యంతయు జయసేనకుఁ జెప్పి మఱీ పొమ్ము.

విదూ—ఆలాగే. (చెవిలోఁ జెప్పి) ఈలాగునఁ జేయవలెను.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

రాజు—జయసేనా! గాలిలో వేయఁబడిన దేవియొక్క శయనమునకు దారి చూపుము.

ప్రతి—దేవా! ఇటు. ఇటు.

[అప్పుడు పాన్పుమీఁద ధారణీదేవియు, పరివ్రాజికయు యుక్తపరివారమును బ్రవేశించు చున్నారు.]

దేవి—అమ్మా! కథ బహురమణీయముగానున్నది. ఆపయిని—

పరి—(చూపు నిగిడించి) ఆపయిని దరువాతఁ జెప్పెదను. ప్రభువు లైనవిదిశాపురాధీశ్వరులు వచ్చుచున్నారు.

దేవి—ఆహా! భర్తగారా! (అని లేవఁబోవు చున్నది)

రాజు—లేవఁబోకు, ఉపచారగౌరవ మింతతోఁ జాలును.

గీ. అఁదియలఁ బాయుటకు నోర్వ కందమొదలి
పసిఁడిపీఠముపై మోపఁబడినయట్టి
నీదుకాల్నొవ్వఁగాఁజేసి నాదుమదికి
బాధ గలిగింపఁబోల దోభవ్యవాణి.

దేవి—ప్రాణేశ్వరా! జయము జయము.

పరి—దేవరవారికి విజయ మగునుగాక !

రాజు—(పరివ్రాజికకు నమస్కరించి కూరుచుండి) దేవీ! నొప్పి సహింపఁదగి యున్నదా?

ధార—కొంత గుణముగా నున్నది.

[అప్పుడు బొట్టన వ్రేలు జన్నిదముతోఁ గట్టుకొని తొట్రుపాటుతో విదూషకుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

విదూ—రక్షింపుఁడు. రక్షింపుఁడు. నన్నుఁబాముకఱచినది.

(అందఱును విషాదము నొందు చున్నారు.)

రాజు—అయ్యో! నీవెక్కడఁ దిరిగినావు?

విదూ—దేవిగారి దర్శనము చేయవలెనని యాచారము చొప్పునఁ బుష్పములనిమిత్తము నేనుద్యానవనమునకుఁ బోయినాను.

ధార—అయ్యో! పాపము! నేనే యీబ్రాహ్మణుని ప్రాణసంశయమునకు హేతుభూతురాల నయినాను.

విదూ—అట్లు పోయి పుష్పమునిమిత్తమయి కుడిచేయి యశోకవృక్షముమీఁదికిఁ జాఁచునప్పటికి, మృత్యుదేవత సర్పరూపమునఁ దొఱ్ఱలోనుండి వెడలివచ్చి కాటు వేసినది. ఇదిగో నావ్రేలిమీఁద రెండుకాట్లును జూడుఁడు. (అని చూపు చున్నాఁడు)

పరి—గీ. పాముకఱచినవారలబ్రతుకువకుమ
[illegible]

గాల్చుటొండెను రక్తంబు గంటునుండి
తీయుటొండెను శీఘ్రింబ చేయవలయు.

ఇప్పుడు విషవైద్యులు తమపని చేయవలెను.

రాజు—జయసేనా! ధ్రువసిద్ధిని వెంటనే పిలుచుకొనిరమ్ము.

ప్రతి—దేవరవారియాజ్ఞాప్రకారము చేసెదను.

(అని పోవుచున్నది.)

విదూ—అయ్యో! నేను బాపపుచావు చచ్చుచున్నాను.

రాజు—భయపడఁబోకు. ఒకానొకప్పుడు పాముకాటుకువిష ముండదు.

విదూ—నే నెట్లు భయపడకుండఁగలను? నాసర్వావయవములును దిమ్మిరెక్కుచున్నవి. (అని విషోద్రేకమును జూపుచున్నాఁడు.)

ధార—అయ్యో! అయ్యో! ఇతఁడువిషవికారముచేతపడఁకుచున్నాఁడు. పట్టుకొనుడు.

పరి—(తొట్రుపాటుతో పట్టుకొనుచున్నది.)

విదూ—(రాజును జూచి) నీకు నేను బాల్యమునుండియుఁ బ్రియమిత్రుఁడనుగా నున్నాను. ఇప్పటిప్రేమను మాన్పక పుత్రహీనురాలయ్యెడుమాతల్లి యోగక్షేమములకు భారమువహింపుము.

రాజు—బెదరఁబోకు. ఇప్పుడే వైద్యుడు చికిత్సచేసి నిన్ను బాగుచేయును. స్థిరచిత్తుఁడవు కమ్ము.

జయ—(ప్రవేశించి) ఓ మహారాజా! ధ్రువసిద్ధి దేవరవారియాజ్ఞను విని గౌతమునిచక్కడకే పంపవలయునని విన్నపము చేయుచున్నాఁడు.

రాజు—అట్లయినఁ గంచుకి సహాయములో నీతనిని ధ్రువసిద్ధియొద్దకుఁ జేర్పుము.

జయ—అలాగే.

విదూ—(దేవివంకఁ జూచి) అమ్మా! నేను జీవించినను జీవింపకపోయినను రాజుగారిసేవకుఁడ నగుటచేత మీవిషయమునఁ జేసిన యపరాధములను క్షమింపవలెను.

ధార—నీవు దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

(విదూషకుఁడును ప్రతీహారియు నిష్క్రమించుచున్నారు)

రాజు—ఖిన్నుఁడై యున్నయితఁడు స్వభావముచేతనే పిరికి వాఁడు. ధ్రువసిద్ధి సార్థకనామము కలవాఁడయినను గుదురు నని యెంచకున్నాఁడు.

జయ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక! జయ మగుఁ గాక! నీటికుండలో వేసి చికిత్సచేయుటకయి సర్పముద్ర గలయుంగర మెక్కడ నైనను వెదకి సంపాదింపవలెనని ధ్రువసిద్ధి యేలినవారితో మనవి చేయుచున్నాఁడు.

ధార—సర్పముద్రగలయుంగర మిక్కడనే యున్నది. ఇదిగో దీనిని బని తీఱినతరువాత మరలఁ దెచ్చి నాచేతి కిమ్ము.

(అని జయసేన కిచ్చుచున్నది)

రాజు—జయసేనా! పని కాఁగానే శీఘ్రముగాఁ దీసికొనిరమ్ము

జయ—దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని వెడలిపోవుచున్నది

పరి—గౌతమునికి విషము దిగినదని నామనస్సునకుఁ బోఁ కట్టుచున్నది.

రాజు—అట్లే జరగునుగాక!

జయ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక! జయ మగు

గాక! గౌతమునికి విషవేగము తగ్గినది. అతఁడు ముహూర్తకాల ములో మరల నెప్పటివాఁ డయినాఁడు.

ధార—భాగ్యవశముచేత నేను నిందనుండి విముక్తురాల నయినాను.

జయ—ఆలోచింపవలసిన రాజకార్యము లనేకము లున్నవి గనుక దర్శన మనుగ్రహింపఁ గోరుచున్నానని మంత్రియైన వాహతఁ కుఁడు దేవరవారితో విన్నపము చేయుమన్నాఁడు.

ధార—దేవరవారు కార్యపర్యాలోచనముకొఱకు విజయం చేయవలెను.

రాజు—దేవీ! ఈప్రదేశమున నెండసోఁకుచున్నది. ఈబాధకు శీతలోపచారము ప్రశస్తము. కాఁబట్టి నీపాన్పును మఱియొకచోట వేయించుకొమ్ము.

ధార—ఓపరిచారికలారా! మీరు భర్తగారు సెలవిచ్చిన ప్రకారము చేయుఁడు.

పరిచారికలు—మంచిది. (అని ఆప్రకారముగానే చేయు చున్నారు)

[ధారణీదేవియు, పరివ్రాజికయు, పరివారమును, పోవుచున్నారు]

రాజు—జయసేనా! గూఢమార్గమునఁ బ్రమదవనమునకుఁ దీసికొనిపొమ్ము.

జయ—దేవా! ఇటురండు.

రాజు—జయసేనా! గౌతముఁడు తనయభీష్టమును నెఱవేర్చి నాఁడుగదా!

జయ—నిస్సంశయముగా,

రాజు—క. ఇష్టావాప్తికిఁ గడు ను
త్కృష్టం బీక్రియ యటంచు నెఱిఁగియుఁ గష్టం
బిష్టార్థసిద్ధి యంచును
స్పష్టముగా మనసు జంకు వడియెడు నాకున్.

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాడు.]

విదూ—మీకు జయమగుఁగాక! జయమగుఁగాక! దేవర వారిమంగళకార్యములు సిద్ధిపొందినవి.

రాజు—జయసేనా! నీవుకూడ నీపనికిఁబొమ్ము.

జయ—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని పోవుచున్నది.)

రాజు—గౌతమా! ఇప్పుడు క్షుద్రురాలయిన మాధవిక కొంచెమయిన ననుమానపడలేదా?

విదూ—దేవిగారి ముద్రయుంగరమును జూచి యెట్లనుమానపడును?

రాజు—నేనుంగరమునుగూర్చి మాటాడలేదు. దేవి యేహేతువుచేత వీరిద్దఱిని విడిపించినది, తనపరిజనమును మాని నిన్నేలపంపినది, అని యది యడిగి యుండవలెను.

విదూ—నన్నది యాప్రశ్న లడిగినది. నేను మందుఁడనయినను వెంటనే సమయోచిత మయిన ప్రత్యుత్తరములిచ్చినాను.

రాజు—ఏమని?

విదూ—జ్యోతిష్కులు రాజుగారినక్షత్రమునకుఁ గ్రూరగ్రహబాధ గలిగినదనియు, అందుచేత నవశ్యముగాఁ జెఱలో నున్నవారి నందఱిని విడిచిపెట్టింప వలయు ననియు, రాజుగారితో విన్నపము చేసిరని నేను జెప్పితిని.

రాజు—(హర్షముతో) అటుతరువాత.

విదూ—ఆసంగతి విని దేవి యిరావతి మనస్సునకు నొప్పి కలుగకుండుట కయి "రాజుగారే విడిపింపుమన్నా" రని నన్నుఁ బంపిన దని చెప్పినాను. అయి యుండవచ్చు నని యందుమీఁద మాధవిక కార్యసాఫల్యము చేసినది.

రాజు—(విదూషకుని గౌఁగిలించుకొని) మిత్రుఁడా! నా యెడల నీకుఁ బ్రేమ యున్నది కదా!

గీ. బుద్ధి గుణమున నే మిత్రములకు నిలను
గార్యదర్శన మెప్పుడుఁ గాదు సుమ్ము
స్నేహమునఁగూడ లభియించి నెగడుఁజూవె
కార్యసిద్ధికి సూక్ష్మమార్గంబు సఖుఁడ!

విదూ—మీరు త్వరపడవలెను. సఖీసహితురాలయిన మాళవికను సముద్రగృహమునం దుంచి మీనిమిత్తమయి యెదురుగా వచ్చినాను.

రాజు—నే నామెను గౌరవించెదను. నీవు ముందునడువు.

విదూ—దేవా! రండి రండి. (అని కొంచెము నడిచి) ఇదిగో సముద్రగృహము.

రాజు—(భయముతో) మిత్రుఁడా! అదిగో చేతులతోఁ బూవును కోయుచు నీ యిష్టురాలయిన యిరావతి పరిచారిక చంద్రిక మన వైపునకే వచ్చుచున్నది. ఇప్పు డది పోయినదాఁక మన మీ గోడచాటున దాఁగుకొందము.

విదూ—ఓహో! చోరులకును జారులకును చంద్రిక సరిపడదుగదా!

(ఇద్దఱును చెప్పినట్లు చేయుచున్నారు)

రాజు—మిత్రుఁడా! నీ చెలి నానిమిత్తమయి యెదురుచూచు చుండును. ఈగవాక్షమును జేరి యామెను జూతము రమ్ము.

విదూ—అలాగే.

(ఉభయులను నిలుచుండి చూచుచున్నారు.)

[అప్పుడు మాళవికయు వకుళావళికయుఁ ప్రవేశించుచున్నారు.]

వకు—సఖీ! భర్తగారికి మ్రొక్కుము.

మాళ—ఓభర్తా! నీకు నమస్కారము.

రాజు—వకుళావళిక నాప్రతిరూపమును నిర్దేశించి పలుకుచున్నదని శంకించెదను.

మాళ—(హర్షముతో ద్వారమువంకఁ జూచి) సఖీ! నన్ను మోసపుచ్చుచున్నావా? (అని విషాదము చూపుచున్నది.)

రాజు—ఆమె హర్షవిషాదములకు నేను ప్రీతుఁడ నయినాను.

గీ. సూర్యుఁ డుదయించుచోఁ గ్రుంకుచోఁ గరంబు
జలజము వికాససంకోచములను దాను
బూనునట్లుగ నీపద్మముఖముఖంబు
క్షణములోపల రెండవస్థలను దాల్చె.

వకు—అదుగో భర్త చిత్రపటమునం దున్నాఁడు.

ఇద్దఱు—(మ్రొక్కి) దేవా! మేలుకలుగుఁగాక! మేలు కలుగుఁగాక!

మాళ—సఖీ! అప్పుడు తొందరలో నిలుచుండి చూచుటచేత రాజుగారిరూపమునందు నా కాశ యెట్లు తీఱలేదో, అట్లే యిప్పుడు రాజుగారిరూపము తృప్తికరముగా నుండలేదనియే నేనుభావించెదను.

విదూ—వినుచున్నావా? నీవు కనఁబడునట్టుగాఁ జిత్రపట ముఖం బుండలేదని యీామె తలఁచుచున్నది. పెరెముణునవి నగు

రాళివలెనే యిప్పుడు నీవు యౌవనగర్వము వహించుట వ్యర్థ మగు చున్నది.

రాజు—మిత్రుఁడా! కుతూహలము గలవారయినను స్త్రీలు సహజముగా సిగ్గు గలవారుగా నుందురు. చూడు—

చ. తరుణులు వేడ్కతోఁ బ్రథమదర్శనకాలమునందుఁ దద్దయున్
బురుషులరూపముల్ నయనము ల్తనియంగను జూడఁగోరియున్
ధరఁ దరళాయతాక్షులు మనఃప్రియులం దిలకించుపట్టులన్
గరమును విప్పి గ్గొరుగా కనుదమ్ములనిండ నెప్పుడున్?

మాళ—సఖీ! మొగము ప్రక్కకుఁ ద్రిప్పుకొని భర్తగారిచే బ్రేమగలచూపులతోఁ జూడఁబడుచున్నయామె యెవరు?

వకు—పార్శ్వమునందున్న యిరావతికదా యామె?

మాళ—సఖీ! పట్టపు రెవుల నింపటిం విడిచిపెట్టి యొక్క యీ మెవంకనే తెప్పవాల్చక చూచుచుండుట చూడఁగా నాకు రాజు గారు దాక్షిణ్యము లేనివారుగాఁ గనఁబడు చున్నారు.

వకు—(తనలో) చిత్రపటములో నున్నరాజును నిజమయిన వానినిగా భావించుకొని యీమె యసూయను గనఁబఱుచుచున్నది. కానిమ్ము. నేను దీనిచేఁ గొంచెముసేపు వినోదించెదను. (ప్రకాశ ముగా) సఖీ! భర్తగారి కీమె యత్యంతప్రియురాలు.

మాళ—అట్లయిన నేనిప్పుడు నాహృదయము నేల యాయాస పెట్టుకోవలెను! (అని యసూయతోఁ దిరుగుచున్నది.)

రాజు—మిత్రుఁడా! చూడు చూడు.

చ. బొమముడిచేత బొట్టుచెడ, మోవియు నించుక సంచలింపఁగా,
రమణి యసూయతో మరలి పక్కకు వంగెదు పెంపు వొల్చెదు

ప్రియుణుఁడు తప్పుచేయ నిటు నాయికి కోపము చూపఁజెల్లు నం చమర గురుండు నేర్పు లలితాభినయంబును బట్టనట్టుగన్.

విదూ—ఇప్పుడు నీవామె ననునయించుటకు సిద్ధముగా నుండుము.

మాళ—ఇక్కడఁ బూజ్యుఁడయిన గౌతముఁడుకూడ నీమెను సేవించు చున్నాఁడే.

(అని మరల మరియొకవంకకు మరలఁ బోవుచున్నది.)

వకు—(మాళవికను నివారించి) మరలవలదు. నీవిప్పుడు కుపితురాలవయి యున్నావు.

మాళ—నీవు నన్ను దీర్ఘక్రోధము కలదానినిగాఁ దలఁచెదు పక్షమున, నాకోపము నిప్పుడే విడిచెదను.

రాజు—(సమీపమునకుఁ బోయి)

గీ. అతివ! ప్రత్యక్షదాసుఁడ నగుచు నీకు
నే ననన్యసాధారణవృత్తి నుండఁ
జిత్రగతుఁడనై యున్న నాచేష్టఁ జూచి
యిపుడు కోపంబు వహించె దేల నీవు?

వకు—దేవా! జయమగుఁగాక! జయ మగుఁ గాక!

మాళ—(తనలో) చిత్రపటములోనున్న భర్తగారియెడల నే నేల యసూయపడితిని?

(సిగ్గుతోఁ దలవంచుకొని చేతులు జోడించుచున్నది.)

రాజు—(కామచాంచల్యమును గనఁబఱుచుచున్నాఁడు.)

విదూ—నీ వుపేక్షాపరునివలెఁ గనఁబడుచున్నా వేమి?

రాజు—నీ సఖురాలియొక్క యవిశ్వసనీయతవలన.

విదూ—నీ కీమెయెడ నవిశ్వాస మేలకలిగినది!

రాజు—

చ. నయనపథంబుఁ జేరియు క్షణంబున నిప్పు డదృశ్యయౌను, నీ
ప్రియసఖి చేతికిం దగలభించియుఁ జిక్కక వేగఁబాఱు, నే
రయమునఁ గామపీడ నిటులగ్గఁగ సమాగమమాయచేత, నో
ప్రియుఁడ! మదీయచిత్తమెటు వేగము యీమెను విశ్వసించెదుః?

వకు—సఖీ ! రాజుగారు పలుమాఱు మోసపోయినారు. కాఁబట్టి నీవిప్పుడు విశ్వసనీయురాలవు కమ్ము.

మాళ—మందభాగ్యురా లయిన నాకు రాజుగారిపొందు స్వప్నములో సహితము దుర్లభమాయెను.

వకు—రాజా ! ఈమె కుత్తర మిమ్ము.

గీ. ఉత్తరంబియ్య నేల? కామోజ్జ్వలాగ్ని
సాక్షిగా నన్నుయిపుడు నీసఖికి నేను
నర్పణము చేసికొనద రహస్యముగను
సేవ్యుఁడనుగాను నేనింక సేవకుండ.

వకు—నే ననుగ్రహింపఁబడిన దాన నయినాను.

విదూ—(కొంచెము నడిచి తొట్రుపాటుతో) వకుళావళికా! కీడి యశోకపల్లవములను దాటఁబోవు చున్నది. దానినిదోలివత్తము మ్ము.

వకు—మంచిది. (అని బయలుదేఱు చున్నది.)

రాజు—అవిధముగానే మీరు మమ్ము సహితము రక్షింప లయును.

విదూ—గౌతముఁడు మిమ్ముసహితము కాచుచుండును.

వకు—(రహస్యముగా) అయ్యా! గౌతమా! నేను కనఁబడక గాగియుండెదను. నీవు ద్వారరక్షకుఁడవు కమ్ము.

విదూ—మంచిది.

వకు—(నిష్క్రమించుచున్నది.)

విదూ—ఇంతలోపల నే నీస్ఫటికశిలావేదికమీఁదఁ బరుండెదను. ఓహో! ఈశిలావిశేష మెంతసుఖస్పర్శనిచ్చుచున్నది!

(అని కూరుచుండినిద్రపోవుచున్నాఁడు.)

మాళ—(భయముచేత వడఁకుచున్నది)

రాజు—గీ. భయము విడువుము ననుఁగూడ, భానురాంగి!
తడవు నీపయిఁ బ్రణయంబు తగిలియుండి
నేను సహకారతను నిందుఁ బూనినాఁడ;
నల్లుకొను మాధవీలత వగుచు నీవు.

మాళ—దేవిగారివలనిభీతిచేత నాకుఁ బ్రియమైనపని నేనును జేసికొనఁజాలకున్నాను.

రాజు—నీవు భయపడవలసిన పనిలేదు. భయపడవలసిన పనిలేదు.

మాళ—నన్ను భయపడవలదని యుపదేశించెడు భర్తగారి ధైర్యమును వెనుక నేరిరావతియెదుటఁ జూచియున్నాను.

రాజు—గీ. కీరవాణిరో! వినుము దాక్షిణ్య మెపుడు
క్షితినినాయకులకుఁ గులవ్రతము సుమ్ము;
యట్టులయ్యు, నాప్రాణంబు లాయతాక్షి!
నిన్నె యాశించుకొని నిల్చియున్న విపుడు.

కాఁబట్టి చిరానురక్తుఁడనయియున్న నన్ననుగ్రహింపవలెను.

(అని కౌఁగిలించుకొనఁబోవుచున్నాఁడు.)

మాళ—(తప్పించుకొనుచున్నది.)

రాజు—(తనలో) శ్రోత్రకామినుల మదనవిషయమయిన యవస్థ మిక్కిలి రమణీయముగా నుండునుగదా?

మ. రశనాబంధము విప్పఁ బ్రేళ్ళదఁదు కార్పం చేయి కంపించు, ర
మ్యాళయంబుల్ చనుకప్పులా బలిమిమై నాశ్లేషముం జేయఁబో,
భృశము న్మద్దిడఁబోవఁ గన్నులకుఁ గం ద్రిప్పు న్ముఖంబోరగా,
వశమయ్యె న్సుఖమిచ్చు కెక్కుదుర క్రీనీవ్యాజంబుచేనై ననుఁ.
(అప్పుడిరావతియు నిపుణికయుఁ బ్రవేశించుచున్నారు.)

ఇరా—ఓసీ! నిపుణికా! సముద్రగృహముయొక్క తలవాకిట గౌతముఁడు కనఁబడినాఁడని చంద్రిక నీతో నిజముగాఁ జెప్పినదా?

నిపు—చెప్పకపోయినయెడల అమ్మగారితో నేనేలవిన్నపము చేయుదును?

ఇరా—అట్లయినచోఁ, బ్రాణసంశయమునుండి విముక్తుడయిన భర్తగారి ప్రియమిత్రుని క్షేమవార్త యడుగుటకును మన మక్కడకుఁ బోదము.

నిపు—మీమాటవలన మఱియేదో వసికూడ కలననితోఁచుచున్నది.

ఇరా—అవును. చిత్రపటమునందున్న భర్తగారిని బ్రసన్నునిగాఁ జేసికొనుటకును.

నిపు—నీవు కేవల భర్తగారినే యేల ప్రసన్నుని జేసికొనరాదు?

ఇరా—ముద్దరాలా! మనసు మఱియొకరిమీఁదికిఁ బాఱియున్నభర్తగారు చిత్రపటమునం దెట్లున్నారో యట్లే యున్నారు. ఇప్పటి నాప్రయత్నమంతయు నుపచార మతిక్రమించి వచ్చిననాలోపమును బాపుకొనుటకొఱకే.

నిపు—అమ్మా! ఇటు, ఇటు. (ఇద్దఱును నడుచుచున్నారు)

[ఒకచేటిక ప్రవేశించుచున్నది]

చేటి—అమ్మా! నీకు శుభమగుఁగాక! "ఇది మనకు మత్సరమునకుఁ గాలముకాదు. నీయెడఁ గలగౌరవమును గనఁబఱుచుట కొఱకే నేనిప్పుడు సఖీసహితముగా మాళవికకు సంకెళ్ళు వేయించియున్నాను. వారిని విడిపించి భర్తగారికిఁ బ్రియము చేయుటకు నీవనుమతించినయెడల, ఆప్రకారముగాఁ జేసెదను. నీయిష్టమేమో నాకుఁ జెప్పి పంపుము" అని దేవిగారు మీతోఁ జెప్పుచున్నారు.

ఇరా—నాగరికా! 'దేవిగారి నీప్రకారముచేయుమని నియోగించుటకు నేనెంతటిదానను? పరిజనులను శిక్షించుటచేత దేవిగారు నాయందు గొప్ప యనుగ్రహము చూపినారు. నేనుమాత్ర మెవరి యనుగ్రహమువలన వర్ధిల్లినదానను?' అని దేవిగారికి విన్నపము చేయుము.

చేటి—అలాగే. (అని నిష్క్రమించుచున్నది)

నిపు—(కొంచెము నడచిచూచి) అదుగో గౌతముఁడుసముద్ర గృహద్వారమునందు అంగడిలోని యాఁబోతువలెనే కూరుచుండి నిద్రపోవుచున్నాఁడు.

ఇరా—ఇతనికిఁ దిన్నఁగాఁ గుదురలేదాయేమి? ఇంకను విషవికారమున్నవానివలెనే కనఁబడుచున్నాఁడు.

నిపు—ముఖవర్ణము ప్రసన్నమయియే కనఁబడుచున్నది. అంతే గాక ధ్రువసిద్ధి చికిత్సచేసినాఁడు. అందుచేత మనమితని కొఱకేమికే గునని శంకింపవలసిన పనిలేదు.

విదూ—(పలవరించుచున్నాఁడు) అమ్మా! మాళవికా!

నిపు—అమ్మా! విన్నావా? ఈతఁడెవరి కాప్తుఁడు? ఈత్ప

ఘ్నుఁడు కేవల కుక్షింభరణపరాయణుఁడు. ఎల్లప్పుడును మనవద్ద స్వస్తివచనమోదకములచేతఁ గడుపు నింపుకొనుచు, ఇప్పుడు మాళ వికయని పలవరించుచున్నాఁడు.

విదూ—మాళవికా! ఇరావతిని మించినదానవు కమ్ము.

నిపు—ఏమియీ ప్రలాపము! పామన్న భయపడెడి యీ బ్రాహ్మణాధముని బామువలె వంకరగానున్న యీకఱ్ఱతో స్తంభము చాటున దాఁగియుండి భయపెట్టెదను.

ఇరా—కృతఘ్నుఁడు పాము కఱువవలసినవాఁడే.

నిపు—(విదూషకునిమీఁద దండకాష్ఠమున్ను బడవేయుచున్నది)

విదూ—(ఉలికిపడిలేచి) అయ్యో! మిత్రుఁడా నామీఁద బాముపడ్డది.

రాజు—(తొందరపడివచ్చి) భయపడకు! భయపడకు.

మాళ—(వెనుకనుండి) భర్తా! పామనుచున్నాఁడు. సాహసముచేసి పోవలదు.

ఇరా—అవురా! భర్తకూడ నీలాగుననే వచ్చుచున్నాఁడు.

విదూ—(పెద్దపెట్టుననవ్వి) ఇదియు దండకాష్ఠమేనా? నే నప్పుడు మొగలిముండ్లతో గీచుకొని పాముకఱచినదని బొంకినదానికి ఫలమే యిప్పుడు కలిగినదనుకొన్నాను.

[అప్పుడు తెరవెనుకనుండి వకుళావళిక ప్రవేశించుచున్నది]

వకు—భర్తగారు రావలదు. ఇక్కడ సర్పమువలెనే కుటిల వర్తనముకలిగి యేదో కనఁబడుచున్నది.

ఇరా—(వేగముగా రాజుగారివద్దకువచ్చి) దంపతులయొక్క విహారసంకేతము నిర్విఘ్నముగా నెఱవేఱినదా?

[ఇరావతినిజూచి యుండలును భ్రాంతులగుచున్నారు.]

రాజు—ప్రియురాలా! ఈయుపచార మపూర్వమయినదికదా!

ఇరా—వకుళావళికా! భర్తగారిదూతిక వయిన నీప్రతిజ్ఞ యిప్పుడు సంపూర్ణ మయినదా?

వకు—అమ్మా! శాంతింపు. నేనేమిచేసితినో రాజుగారి నడుగవచ్చును. కప్పలు కూయునని దేవుఁడు భూమిమీఁద వర్షము కురిపింప కుండునా?

విదూ—నీ వీలాగునఁ జేయఁబోకు. పాదములమీఁదఁబడినను నీవతిక్రమించి పోయినసంగతి దర్శనమాత్రముచేతనే యీయన మఱచిపోయినాఁడు. నీవిప్పుడయినను ప్రసాదమును జూపకున్నావు.

రాజు—ఈపరిహారము నిష్కారణముగాఁ గోపపడుట నీకుఁ దగదు.

గీ. నిర్నిమిత్తంబ కుణమేని నీముఖంబు
పడఁతి! యెప్పుడు నను కోపపాత్ర మయ్యె?
పర్వమునఁగాక చంద్రబింబంబు రాహు
కలుష మొల్లానొకో రాత్రి తెలుపు మీవు.

ఇరా—నిష్కారణముగా నని భర్తగారు చక్కఁగాసెలవిచ్చినారు! నాభాగ్య మత్యల్పమా లయినప్పుడు నేను మరలఁ గోపపడిన పక్షమున, నేనే హాస్యాస్పదురాల నగుదునుగదా!

రాజు—నీవన్యథముగాఁ గల్పించుకొనుచున్నావు. నాకు నిజముగానే కోపమునకు హేతువు కనఁబడకున్నది. ఎట్లన—

గీ. పండుగుదినంబునందునఁ బరిజనంబు
తప్పుగల్గియుఁ జెఱఁనుండఁ దగ దటంచు

వీరి నే విడిపింప, నట జేరి మ్రొక్క-
వీరు వచ్చి రింతియుకాని వేఱు లేదు.

ఇరా—నిపుణికా! నీవుపోయి. మీపక్షపాతము కనిపెట్టితినని దేవిగారితో విన్నవింపుము.

నిపు—అలాగే. (అని పోవుచున్నది.)

విదూ—(తనలో) అనర్థము సంభవించినది. బంధమునుండి తప్పించుకొన్న యింటిపావురము పిల్లికంట బడినదిగదా!

నిపు—(మరలఁ బ్రవేశించి) అమ్మా! దైవికముగా నాకిప్పుడు మాధవిక కనఁబడి దీనికి హేతువిది యని చెప్పినది.

(అని చెవిలోఁ జెప్పుచున్నది.)

ఇరా—(తనలో) నాకంతయు బోధపడినది. ఇదియంతయు నీతుచ్ఛబ్రాహ్మణుఁడు పన్నినపన్నుగడః (విదూషకునిజూచిబిగ్గరగా) ఇప్పుడిది యీ కామతంత్ర మంత్రిగారు ప్రయోగించిన నీతి.

విదూ—అమ్మా! నేను నీతియం దొకయక్షరమయినను జదివి యుండినయెడల, ఇట్లు రాజుగారి నాశ్రయించుకొనితిరుగుదునా?

రాజు—(రహస్యముగా) అక్కటా! నేనిప్పు డీచిక్కునుండి యెట్లు విముక్తి నొందుదును?

[వేగముగా జయసేన ప్రవేశించుచున్నది.]

జయ—దేవా! మీకొమార్తె వసులక్ష్మి బంతినిమిత్తమయి పరుగెత్తుచు, పంకుకోఁతి వచ్చి బెదరింపఁగా మిక్కిలి జడిసికొన్నది. ఆమెను దేవిగారు తమయొడిలోఁ బెట్టుకొని కూరుచున్నను గొంచె మయినను జ్ఞప్తిరాక పెద్దగాలిలోఁ గడలుచున్న చిగురాకువలెవడకు చున్నది.

రాజు—అయ్యో! అయ్యో! పసిపిల్లలెంతపిఱికివారు!

ఇరా—(తొట్రుపాటుతో) ఆచిన్నదాని నోదార్పుటకయి భర్తగారు వేగిరము విజయుంచేయువలెను. ఆమెకు సంతాపజనిత మయిన వికారము వృద్ధిపొందకుండ వారింపవలెను.

రాజు—నేను బోయి జ్ఞప్తివచ్చునట్లు చేసెదను. (అని వేగ ముగాఁ బోవుచున్నాఁడు)

విదూ— మేలు! ఓరిపింగళవానరా! మేలు! నీవు స్వకుటుము వారిని రక్షించినావు.

[రాజును, విదూషకుఁడును, ఇరావతియు, నిపుణికయు నిష్క్రమించుచున్నారు]

మాళ—దేవిని దలఁచుకొని నాహృదయము కంపమొందు చున్నది. నాకిప్పుడేమి సంప్రాప్తము కానున్నదో తెలియకున్నాను.

తెరలో—ఆశ్చర్యము! ఆశ్చర్యము! దోహదముచేసి యయిదు రాత్రులయినను గడవకమునుపే కాంచనాశోకము మొగ్గలతో నిండిపోయినది. ఈసంగతి దేవిగారికి నివేదించెదను.

ఇద్దఱు—(విని సంతోషించుచున్నారు)

వకు—సఖీ! ఊఱటపొందుము. దేవి తాను జేసినప్రతిజ్ఞ తప్పదు.

మాళ—అట్లయిన మన ముద్యానవనపాలికల వెనుకనే పోవుదము.

వకు—అలాగే చేయుదము.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

---

# పంచమాంకము



[అప్పు డుద్యానవనపాలకురాలు ప్రవేశించుచున్నది]

ఉద్యా — నేను గౌరవపూర్వకముగాఁ గాంచనాశోకము చుట్టును గోడయరఁగును వేసినాను. నాకు నియోగించిన యీపనిని జేసితినని దేవిగారికి నివేదించెదను. ఇఁకవిధి మాళవికయందు దయ చూపవచ్చును. ఆప్రకారముగాఁ గుపితురాలయియున్న దేవి యిప్పు డీసంతోషమయిన యశోక దోహదవృత్తాంతముచేతఁ బ్రసన్నురా లగును. దేవి యిప్పు డెక్కడనుండియుండును? ఆహా! ఇదిగో దేవి గారి పరిచారకుఁడయిన కుబ్జుఁడొకఁడు చతుశ్శాలనుండి వచ్చుచున్నాఁడు. అతని నడిగెదను.

[అప్పుడు చేతియందుఁ బెట్టెపట్టుకొని కుబ్జుఁడు ప్రవేశించుచున్నాఁడు]

(ముందుకు నడిచి) సారసా! ఎక్కడకుఁ బోవుచున్నావు?

సార — మధురికా! విద్వాంసులయిన బ్రాహ్మణుల కియ్యవలసిన నెలదినముల నిత్యదక్షిణను పూజ్యుఁడయిన పురోహితునిచేతి కిచ్చి వచ్చుటకయి పోవుచున్నాను.

మధు — అది యెందునిమిత్తము?

సార — రాజుగారి కుమారుఁడు యజ్ఞాశ్వమును రక్షించుటకయి సేనాపతిచేత నియోగింపఁబడినాఁడని వినినప్పటినుండియు; అతని యాయుర్వృద్ధికొఱ కష్టశతసువర్ణపరిమాణధనము దక్షిణగా నిచ్చుటకు దేవిగారు ప్రతిజ్ఞచేసినారు.

మధు — ఇప్పుడు దేవి యెక్కడనున్నది?

సార — మంగళగృహమునందుఁ బీఠముమీఁదఁ గూరుచుండి

విదర్భదేశమునుండి తనతమ్ముఁడయిన వీరసేనుఁడు పంపినకమ్మను లిపికారులచేతఁ జదివించి వినుచున్నది.

మధు—మరల విదర్భరాజవృత్తాంతమేమయినఁ దెలిసినదా?

సార—విదర్భరాజు వీరసేనునకిందనున్న సేనాచక్రము చేత లోఁబఱుచుకొనఁబడినాఁడు; అతని దాయాదుఁడయిన మాధవ సేనుఁడును జెఱనుండి విడిపింపఁబడినాఁడు. అతఁడు దూతవెంట ముందుగా శ్రేష్ఠము లయినరత్నవాహనములను శిల్పవిద్యాప్రవీణత గల పరిజనమును, రాజుగారికిఁ గానుకగాఁ బంపి, తాను వెనుకవచ్చి ప్రభువువారి దర్శనము చేసికొనఁ బోవుచున్నాఁడు.

మధు—నీవుపోయి నీపనిని జేయుము. నేనును దేవిగారిని సందర్శింపఁబోయెదను. (అనియిద్దఱునుబోవుచున్నారు)

ఇది ప్రవేశము

---

[అప్పుడు ప్రతీహారి ప్రవేశించుచున్నది.]

ప్రతీ—అశోకసత్కారోత్సుకురాలయి యున్నదేవి "భర్త గారితోఁగలిసి నేనశోకవృక్షముయొక్క పుష్పసంపదను జూడఁగోరు చున్నాను" అని రాజుగారికి విన్నవింపుమని నాకాజ్ఞయిచ్చినది. కాఁబట్టి ధర్మాసనమునకు విజయంచేసెడు రాజుగారి రాకకయి నేను బ్రతీక్షించి యుండెదను. (అని తిరుగుచున్నది.)

తెరలోవైతాళికులు—ఓహో! రాజుదండముచేత శత్రుశిర స్సుమీఁద వర్తించుచున్నాఁడు!

ప్రథముఁడు—

చ. పరభృతసుస్వరంబు తనుపక విదిశానదిపొంతఁదోఁటలో
వరరతితోడ రూపమదుపంచశరుండునుబోలె హాయిగా

విదిశవ సంత మీా తనుభవింపఁగ సిద్ధబలుండ వైన నీ
యరి వరదానదీ పరిసరాటవులన్ భవదీయభద్రకుం
జరములఁ గట్టినట్టిమహిజంబులతో వహియించు నమ్రతన్.

ద్వితీయుఁడు—

ఉ. ధరణి విదర్భునిన్ జయము తాఁకున గెల్చిననీచరిత్రముల్,
పరిఘులవంటి బాహులబల్మిని రుక్మిణిఁగొన్నకృష్ణు స
చ్చరితముఁ, బద్యరూపమున సల్పి సురోపములైన వందితుల్
కరము! పఠింతు రల్ల క్రథకైశికధిక్కృతి వీరతుష్టికిన్.

ప్రతీ—అదె జయశబ్దము ప్రస్థానమును దెలుపఁగా రాజుగా రిచ్చటికే విజయంచేయుచున్నారు. నేను గొంచెమాయనయెదుట నుండి తొలఁగి, ముఖద్వారతోరణము నాశ్రయించి నిలిచెదను.

(అని చాటునవిలుచున్నది.)

(అప్పుడు మిత్రసహితముగా రాజు ప్రవేశించుచున్నాఁడు.)

రాజు—గీ. అకట! ప్రియురాలు దుర్లభ యాటతలఁచి,
బలముచే విదర్భుఁడు గెల్వఁబడుట వినియు,
వానచే నెండచేఁ గొట్టఁబడినతమ్మిఁ
బోలి, దుఃఖమును సుఖంబుఁ బొందు మనసు.

విదూ—నీవత్యంతసుఖవంతుడ వగుదువని నామనస్సునకుఁ బొడకట్టుచున్నది.

రాజు—ఎలాగున!

విదూ—ఇంతకుముందే ధారణీదేవి ''అమ్మా! నీవలంక రించుటయందు సాటిలేనిదానవని గర్వపడు చుంటివుగదుక విషాహ

లంకార రచనయందలి నీనేర్పు నిప్పుడు మాళవిక శరీరముదీఁదఁ గనఁబడుచున్నది” అని పండితకౌశికితోఁ జెప్పినది. అందుచేత నామె విశేష కౌతూహలముతో మాళవిక నలంకరించినది దేని నీమనో రథము నెఱవేర్చునేమో!

రాజు—మిత్రుఁడా! ఎప్పుడును నాయిష్టము ననుసరించెడు ధారణీదేవియొక్క పూర్వచరితమును విచారింపఁగా నీవు చెప్పినట్టు జరగనే వచ్చును.

ప్రతీ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! కాంచనాశోకముయొక్క పుష్పోద్గమసంపదను భర్తగారితోఁ గూడ సందర్శింపఁ గోరుచున్నానని దేవిగారు విన్నపము చేయుమన్నారు.

రాజు—దేవి యక్కడనే యున్నదా?

ప్రతీ—అవును. వారివారి కర్హమైనసమ్మానముచేసి యంతః పురజనమును బంపివేసి పరిజనముతో మాళవిక ముందు నడువఁగా దేవి తాను దేవరవారిరాకకయి, నిరీక్షించుచున్నది.

రాజు—(సంతోషముతో విదూషకునివంకఁజూచి) జయసేనా! నీవు ముందు నడువు.

ప్రతీ—దేవా! రండి రండి. (అని నడుచుచున్నది)

విదూ—(చూచి) ఓమిత్రుఁడా! వసంతుఁ డీయుద్యానవనమునందుఁ గొంచెము యౌవనదశను బొందినవానివలెఁ గనఁబడుచున్నాఁడు.

రాజు—నీవన్నమాట సత్యము.

గీ. వంగి కురువకఫలజాలభారమునను
బాలభూజహ మల్లదె చూడు మిపుట

రహిని నీబుతుయౌవనారంభ మనఁగ
మదికి నుత్కంఠ గొలిపెడు మఱియు మఱియు.

విదూ—మిత్రుఁడా! అదిగో కాంచనాశోక మలంకారము చేసికొన్నదానివలెనే పూవుగుత్తులచేత నొప్పుచున్నది. దేవరవారు చిత్తగించవలెను.

రాజు—ఇప్పు డిది యనన్యసాధారణ మయిన శోభనువహించుచున్నది. గనుక, ఆలస్యముగాఁ బూతఁబట్టుటయే యుక్తముగా నున్నది. చూడు—

గీ. మొదలను వసంతవిభవంబు పూనినట్టి
సకలసుందరాశోకవృక్షములసొంపు
దోహదము నొందియున్న యీద్రుమమునందె
సంక్రమించె ననఁగ మొగ్గచాలు పొలుచు.

విదూ—నిశ్చయముగా నీవు సంతుష్టుఁడవుకమ్ము. మన మీప్రకారముగా సమీపమునకు వచ్చియున్నను, ధారణీదేవి తన పార్శ్వమునందున్న మాళవిక నిలుచుట కనుమతించుచున్నది.

రాజు—(సంతోషముతో) సఖుఁడా! చూడు చూడు.

క. వినయమునం బ్రియురా లటు
వెనుకఁ గరాబ్జములు వేడ్కను నిలువన్
నను దేవి యెదుర్కొనియెడుఁ
బొనరఁగ నృపలక్ష్మితోడి భూదేవి యనన్.

[అప్పుడు ధారణీదేవియు, మాళవికయు, పరివ్రాజికయు, అర్ఘ్యపరిచారమును, ప్రవేశించుచున్నారు]

మాళ—(తనలో) నాకీతు కాలంకారమునకు హేతు వెఱుఁ

గుదును. అయినను నాహృదయము తామరాకుమీఁదనీటివలెఁ దల్లడిల్లుచున్నది. నాయెడమకన్ను బలుమారు అదరుచున్నది.

విదూ—ఓహో! మిత్రుఁడా! వివాహాలంకారముచేతఁ బూజ్యురా లయినయీమాళవిక మిక్కిలి శోభిల్లుచున్నదిగదా!

రాజు—ఆమెను జూచుచున్నాను.

గీ. చాలఁ బ్రేలని పట్టువస్త్రంబు గట్టి
మితవిభూషణములతోడ మెఱయు నీమె
హిమము గ్రమ్మని నక్షత్రసమితితోడఁ
బ్రబలచంద్రికగల చైత్రరాత్రిఁబోలి.

ధార—(సమీపించి) ప్రాణేశ్వరా! జయ మగుఁగాక! జయ మగుఁగాక!

విదూ—అమ్మా! వర్ధిల్లుము.

పరి—దేవా! విజయ మగుఁగాక!

రాజు—అమ్మా! నమస్కరించుచున్నాను.

పరి—అభీష్టసిద్ధి యగుఁగాక!

ధార—(చిఱునవ్వునవ్వి) ప్రాణేశ్వరా! తరుణీజనసహాయుఁడవయిన నీకీయశోకవృక్షము మాచేత సంకేతగృహముగాఁ జేయఁబడినది.

విదూ—మిత్రుఁడా! నీవు సత్కరింపఁబడినావు.

రాజు—(సిగ్గుతో అశోకమువంకఁ దిరిగి)

గీ. అలవసంతనియోగ మనాదరించి
యాదరించె నీమప్రయత్న మలరుఁబూని
కావునను నిట్టిదేవిసత్కారమునకు
నియ్యశోక మర్హత నేల యొనయకుండు!

విదూ—ఓయీ! పరువము గలదానిని జూడుము.

ధార—ఎవతెను?

విదూ—నేను గాంచనాశోకముయొక్క పుష్పశోభనుగూర్చి చెప్పుచున్నాను. (అందఱును గూర్చుచున్నారు.)

రాజు—మాళవికనుజూచి(తనలో) సన్నిధినుండియు వియోగ మనుభవించుట కష్టముగదా!

క. ఏను రథాంగముమాడ్కిని
గానంగాఁ జక్రవాకిగతిఁ బ్రియురాలున్
మానుటపోం బోదవింపని
తా నీధారిణి నిళవలెఁ దనరెద మిచటన్.

కంచు—దేవా! జయ మగుఁగాక! "అప్పుడు మార్గాయాసముచేత దేహములు బడలియున్నారని విదర్భరాజు కానుకగాఁ బంపిన శిల్పవిద్యాప్రవీణ లయినయిద్దఱు కాంతలను దమదర్శనమునకుఁ బంపలేదు. వారిప్పుడు దేవరవారిని సందర్శింప శక్తి గలవారుగా నున్నారు. కాఁబట్టి దేవరయాజ్ఞ దయచేయువలెను" అని మంత్రి విన్నపము చేయు చున్నాఁడు.

రాజు—వారిని దీసికొని రమ్ము.

కంచు—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను. (అని నిష్క్రమించి వారితోఁగూడఁ బ్రవేశించి) అమ్మలారా! ఇటు. ఇటు.

ప్రథమ—(రహస్యముగా) ఓసీ! రజనికా! ఈయపూర్వమయినరాజకులమును జేరఁగా నామనస్సూరట పొందుచున్నది.

ద్వితీయ—జ్యోత్స్నికా! నాకును నాలాగుననే యున్నది. "హృదయముయొక్కయవస్థయే రాఁబోవుసుఖమునుగాని దుఃఖమునుగాని తెలుపు" నని యొకలోకోక్తి సుమా.

ప్రథమ—అది యిప్పుడు సత్య మగుముగాక!

కంచు—అదె రాజుగారు దేవితోఁగూడ నుండియున్నారు. మీరాయనయొద్దకుఁ బొండు. (ఇద్దఱు సమీపమునకుఁ బోఁగా మాళవికయుఁ బరివ్రాజికయు వారిని జూచి యొకరినొకరు చూచుకొనుచున్నారు)

ఇద్దఱు—(ప్రమాణముచేసి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! దేవీ! జయమగుఁగాక! జయమగుఁగాక!

రాజు—కూరుచుండుఁడు.

ఇద్ద—(కూరుచున్నారు)

రాజు—మీ కేవిద్యయం దభిని వేశము గలదు?

ఇద్ద—దేవా! సంగీతవిద్యయందు.

రాజు—దేవీ! వీరిలో నొకరిని నీవు తీసికొమ్ము.

ధార—మాళవికా! వీరిలో సమర్థురాలయిన యెవరిని సంగీతమునందు సహాయురాలినిగాఁ దీసికొనుటకు నీకిష్టముగానున్నది?

ఇద్ద—(మాళవికనుజూచి) ఓహో! రాజపుత్రికా! రాజపుత్రీ! జయమగుఁగాక! జయమగుఁగాక! (అని నమస్కరించి యామెతోఁ గూడఁ గన్నీరు విడుచుచున్నారు)

అందఱు—(అద్భుతపడి చూచుచున్నారు)

రాజు—కాంతలారా! ఈమె యెవరు?

ఇద్ద—ఈమె మా రాజుగారి కొమార్తె.

రాజు—ఏలాగున?

ప్రథమ—దేవా! దేవరవారు దండనాథులచేత విదర్భరాజును లోఁబఱుచుకొని చెఱసాలనుండి విడిపించినమాధవసేనుఁ డనురాకుమారునకుఁ జెల్లెలయినమాళవిక యీమె.

రాజు—ఏమీ! ఈమె రాజపుత్త్రికా? మంచిగంధపుకఱ్ఱనాచేఁ పాదుకగా నుపయోగింపఁబడి దూషిత మయినది.

రాజు—ఈమె కీదశ యెట్లు సంభవించినది?

మాళ—(నిట్టూర్పు విడిచి తనలో) విధినియోగముచేత.

ద్వితీయ—దేవరవారు వినవలెను. మా రాజకుమారుఁడయిన మాధవసేనుఁడు దాయాదునివశమునఁ జిక్కఁగా నాతని మంత్రియైన సుమతి మాతోఁటిపరిజనమును విడిచిపెట్టి యీమెను రహస్యముగాఁ దీసికొనిపోయినాఁడు.

రాజు—ఇంతవఱకు మేమీవఱకే విన్నాము. అటుతరువాత?

ద్వితీ—దేవా! అటుతరువాత జరగినది మాకుఁ దెలియదు.

పరి—అటుతరువాత జరగినది మందభాగ్యురాల నయిననేను వినిపించెదను.

ఇద్ద—రాజపుత్త్రీ! ఈకంఠస్వరము పూజ్యురా లయినకౌశికిది వలె నున్నది. ఆమె కాదుగదా?

మాళ—అవును. ఆమెయే.

ఇద్ద—యతివేషధారిణియై యున్నయీమె నిప్పు డానవాలు పట్టుటయే కష్టముగా నున్నది.—అమ్మా! నీకు నమస్కారము.

పరి—మీయిద్దఱకు శుభమగుఁగాక!

రాజు—అమ్మా! మీకు వీ రాప్తవర్గములోనివారా?

పరి—అవును.

విదూ—అట్లయిన మీరిప్పుడు పూజ్యురాలయిన యీమె వృత్తాంతము నంతను బూర్ణముగాఁ జెప్పివేయుఁడు.

పరి—(విచారముతో) అంతయు వినుఁడు. మాధవసేనుని మంత్రియైన సుమతి నా కన్నగారు. తెలిసినదా?

రాజు—తెలిసినది. అటుతరువాత!

పరి—ఈమెతోడఁబుట్టినవాఁడావిధమయి పోఁగా గూఢముగా నీమెను వెంటఁబెట్టుకొని తమతో సంబంధముచేయవలెనను కోరికతో నతఁడు విదిశానగరమునకు వచ్చుచున్న సార్థవాహులతో బయలు దేఱినాఁడు.

రాజు—అటుపిమ్మట!

పరి—అతఁడును దారినడిచిన వణిగ్జనమువలెనే యడవిలోఁ బ్రవేశించి విశ్రాంతి పొందుట కారంభించెను.

రాజు—ఆపయిని!

పం—ఆపయిని మఱి యేమున్నది!

ఉ. బాహులమధ్యఁ దూణములపట్టము లిట్టటు కట్టియుండ, ను
త్సాహముపుట్టఁ బాదములదాఁకను వ్రేలఁగ బర్హిబర్హముల్,
సాహసలీల నార్చుచును జాపములన్ ధరియించి, చోరసం
దోహము చేరుమాత్రమున దుస్సహమై కనుపట్టె నవ్వడిన్.

మాళ—(భయము కనఁబఱుచు చున్నది.)

విదూ—అమ్మా! భయపడఁబోకు. ఈమె యీవఱకు జరగినకథనే చెప్పుచున్నది.

రాజు—తరువాత. తరువాత.

పరి—అప్పుడు బద్ధాయుధు లయిన సార్థవాహయోధులు ముహూర్తకాలములో దొంగలచేత తఱుమఁగొట్టఁబడినారు.

రాజు—అమ్మా! పాపము! ఇఁకఁ జెప్పఁబోవునది కష్టకథ కాఁబోలును!

పరి—అటుతరువాత నాసోదరుఁడు—

గీ. అదుగాత్ములచేతఁ గీడడరు నంచు
భయపడుచు నున్నయీమెఁ గాపాడుకొఱకుఁ
దాను బ్రభుభక్తి మెఱయ దుస్త్యజము లైన
ప్రాణముల నిచ్చి తీర్చెఁ బో స్వామిఋణము.

ప్రథమ—కటకటా! సుమతి హతుఁ డయ్యెనా!

ద్వితీయ—అందుచేతనే యీరాజపుత్రిక కిటువంటియవస్థ పట్టినది.

పరి—(కన్నుల నీరు విడుచుచున్నది.)

రాజు—అమ్మా! శరీరముల కాశ పడనివారి లోకయాత్ర యిటువంటిదే. తాను దిన్నప్రభువునన్నము సఫలము కావించుకొన్న యీ పుణ్యాత్మునికొఱకు శోకింపవలసినపని లేదు.

పరి—నేనప్పుడు మూర్ఛపోయి మరలఁ దెలివి తెచ్చుకొను లోపల నీమె కంటి కగపడకపోయినది.

రాజు—అప్పు డమ్మగారు పొందినకష్టము మహత్తరమయిన దయి యుండును.

పరి—అప్పుడు నేనన్నగారిశరీరమున కగ్నిసంస్కారము చేసి, మరలఁ గ్రొత్తగాఁ దోఁచినవైధవ్యదుఃఖముతోఁ గాషాయవస్త్రములను ధరించి మీ దేశమున బ్రవేశించినాను.

రాజు—సజ్జనుల కీమార్గము యుక్తమయినదే. అవయిని!

పరి—అవు యీమె యాకిరాతులనుండి వీరసేనునివద్దకును, వీరసేనునినుండి దేవిగారియొద్దకును వచ్చినది. దేవిగారిగృహము నకును బ్రవేశము దొరకినతరువాత నాకీమె కానఁబడినది. నాకథ యింతటితో సరి.

మాళ—(తనలో) భర్త యిప్పు డేమి చెప్పునో!

రాజు—ఓహో! ఆపద లెప్పుడును బరాభవమును దెచ్చును గదా! ఎట్లనిన—

గీ. అకట! దేవి కా నర్హురా లయినయీ మె
దాసిగాఁ జేయఁబడె నింతదనుక నిందు
జిలుగుఁదెలిపట్టుపుట్టంబు తెలివిమాలి
వడిఁ దలంటుగుడ్డగఁ జేయఁబడినట్లు.

ధార—అమ్మా! మాళవిక గొప్పవంశమునఁ బుట్టిన దని యింతవఱకును జెప్పక నీవు తప్పు చేసితివి.

పరి—పాపము శమించునుగాక! నేను గారణ ముండియే యీసంగతి రహస్యముగా నుంచినాను.

ధార—ఆకారణ మేది?

పరి—ఈమె తండ్రిజీవించి యుండఁగాఁ దీర్ఘయాత్రాపరుఁడయి సిద్ధాదేశముచేత వచ్చిన యొకసాధు వీమె సంవత్సరమాత్రము దాస్యము ననుభవించి తరువాతఁ దగినభర్తను బొందునని చెప్పెను. అది యవశ్యముగా ననుభవింపవలసినదని యెఱిఁగి మీపాదసేవతో నంతమయ్యెడి యీమెయొక్క యాకాలవధిని బ్రతీక్షించుచుంటిని. అట్లు చేయుట మంచిదనియే నేను భావించెదను.

రాజు—అట్లు ప్రతీక్షించుట మంచిపనియే.

కంచు—దేవా! విదర్భదేశవ్యవహారవిషయమునఁ జేయవలసిన దేమో ప్రభువువారియభిప్రాయము వినఁగోరుచున్నానని మంత్రి మనవిచేయు చున్నాఁడు. మీరు ప్రసంగాంతరములో నుండుటచేత నాకు విన్నవించుట కవకాశము చిక్కినది కాదు.

రాజు—మౌద్గల్యా! అన్నదమ్ము లయిన యీయజ్ఞసేన

మాధవసేనులకు రాజ్యము రెండుభాగములుగాఁ బంచియిచ్చియిప్పుడు వారినిద్దఱిని రాజ్యమునందు నిలుపఁగోరుచున్నాను.

గీ. వరద నుత్తర దక్షిణభాగములను
వారు పాలించుకొననిమ్ము వేఱువేర
వరుసగా నలచంద్ర భాస్కరులు తాము
రేయి పగలును బాలించు రీతిగాను.

కంచు—దేవా! నేనిది మంత్రిసభకు విన్నపము చేసెదను.

రాజు—(ప్రేరితో ననుమతిని గనఁబఱుచు చున్నాఁడు.)

కంచు—(నిష్క్రమించుచున్నాఁడు.)

పరిధమ—(రహస్యముగా) ఓ రాజపుత్రీ! భాగ్యవశముచేత నీయన్నగారర్థరాజ్యమునఁ బ్రతిష్ఠింపఁ బడుచున్నాఁడు.

మాళ—జీవితసంశయదశనుండి విడిపింపఁబడి నందునకే మనము సంతోషింప వలయును.

[కంచుకి మరలఁ బ్రవేశించు చున్నాఁడు.]

కంచు—దేవా! విజయ మగునుగాక! దేవరవారియాజ్ఞ మంగళప్రదమయిన దని మంత్రి మనవి చేయుచున్నాఁడు. మంత్రి సభవారును తా మీప్రకారముగా నిశ్చయించినారు.

చ. సరిఁ గయికొన్నయాతఁ డలశ్రీని దయ న్మరలంగ నిచ్చినన్,
బరువు రథాశ్వముల్ మొదలపైని వహించెడునట్లు, దాల్చి వీ
రిరువురు నింకమీఁద నితరేతర వైరము మాని, యోనరే
శ్వర ! భవదీయశాసనముఁబట్టి మెలంగుచు నుందు రెప్పుడున్.

రాజు—అట్లయినపక్షమునసేనానియైనవీరసేనున కీవిధము గా జేయుమని లేఖ వ్రాసి పంపవలసినదని మంత్రిసభకుఁ జెప్పు.

కంచు—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను. (అంపెడలి

పోయి, ఒకలేఖయుఁ గానుకయుఁ బట్టుకొని మరలఁ బ్రవేశించుచున్నాఁడు) ప్రభువుగారియాజ్ఞ జరపఁబడినది. ఇదిగో సేనాపతియైనపుష్పమిత్రునియొద్దనుండి బహుమానముగాఁ బంపఁబడినయుత్తరీయముతోఁగూడ నీలేఖ వచ్చినది. ప్రభువారు దీనిని జిత్తగింతురుగాక!

రాజు—(లేచి, బహుమానము నుపచార పూర్వకముగా గ్రహించి, పరిజనముచేతి కిచ్చి, లేఖను విప్పుచున్నాఁడు)

ధార—అహా! నామన స్సాలేఖమీఁదనే యున్నది. గురుజనక్షేమము తెలిసికొన్నపిమ్మట వసుమిత్రుని వృత్తాంతము వినెదను. సేనాపతి నాపుత్రునిమీఁద నతిభారమును మోపినాఁడు.

రాజు—(కూరుచుండి చదువు చున్నాఁడు) శ్రీరస్తు! విదిశానగరమునందున్న చిరంజీవి యైనమాపుత్రుఁ డగునగ్నిమిత్రుని సేనాపతి యైనపుష్పమిత్రుఁడు ప్రేమపూర్వకముగా నాలింగనము చేసికొని యజ్ఞశాలనుండి పుత్తెంచిన పత్రిక. నేను రాజసూయ దీక్షితుఁడనయి యుండి నూఱుగురు రాజపుత్రులను దోడిచ్చి మనవసుమిత్రునిఁ దురంగరక్షణార్థము సంవత్సరముక్రిందట నియోగించి తనమనసువచ్చినట్లుగా సంచరించుట కయి గుఱ్ఱమును విడిచిపెట్టితిని. అది సింధునది దక్షిణతీరమునఁ దిరుగుచుండఁగా దాని నశ్వసేనాధిపతి యైన యొకయవనుఁడు పట్టుకొనెను. అప్పు డుభయసేనలకును ఘోరయుద్ధము సంభవించెనని తెలియునది.

ధార—(విషాదమును గనఁబఱుచుచున్నది)

రాజు—ఏమీ! ఈవిధముగా జరిగినదా?

“గీ. అతులధన్వి యౌ వసుమిత్రుఁ డడరి యుద్ధ
చెదరఁగాఁ దోలి శత్రుల సిగ్గుపఱిచి

వడిగ నాయు త్తమాశ్వంబు బలిమితోడఁ
దాను మరలించి తెచ్చె నిత్తావునకును."

ధార—ఈ వాక్యముచేత నాహృదయము చల్లబడినది.

రాజు—(మిగిలిన లేఖను జదువు చున్నాఁడు) అంశుమంతుఁడు వగరున కశ్వమును దెచ్చి యిచ్చినట్లుగా నాపౌత్రుఁడు నాకు యజ్ఞాశ్వమును దీసికొనిరాఁగా నేనిప్పుడు చేయఁ బూనినయీయజ్ఞమునకు రోషము విడిచి నీవు వధూజనసహితముగా యుక్తసమయమున రాఁదలెను.

రాజు—నా కిది యనుగ్రహము.

పరి—భాగ్యవశమునఁ బుత్రవిజయము చేత దంపతులు వర్ధిల్లుచున్నారు. (ధారణివంకఁ జూచి)

గీ. భర్తచేతను దగ వీరపత్నులందుఁ
ప్రథమగణ్యవై శ్లాఘ్యతఁ బడసితీవు;
మఱియు నిప్పుడు నీదుకుమారువలన
వీరమాతవునైతి వోవెలఁదిమిన్న.

ధార—అమ్మా! కొడుకు తండ్రినిబోలినవాఁడయినందుల కానందభరితురాలనయినాను.

రాజు—మార్గల్యా! ఏనుఁగుపిల్ల యూథపతి ననుకరించినది సుమా.

కంచు—గీ. అంబువులఁ బీల్చునగ్నికి నౌర్వునట్ల
జననకారణ మీవైనఘునతచేత
నితని వీరవిచేష్టిత మేము చూచి
డెందమున విస్మయంబును బొంద మిందు.

రాజు—మౌద్గల్యా! చెఱసాలలోనున్న యజ్ఞసేనునిమఱంది మొదలయినవారినందఱిని విడుదల చేయింపుము.

కంచు—దేవరవారానతిచ్చినట్లు చేయించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

ధార—జయసేనా! నీవు పోయి యిరావతి మొదలయిన యంతఃపుర కాంతల కందఱికిని నాపుత్రునివిజయవార్తను దెలుపుము.

ప్రతీ—అలాగునఁ జేసెదను. (అని బయలు దేఱుచున్నది.)

ధార—కొంచె మిటురమ్ము.

ప్రతీ—(వెనుకమరలి) ఇదిగో వచ్చినాను.

ధార—(రహస్యముగా) నేనశోకదోహదమునకు నియోగించినప్పుడు మాళవికకుఁ జేసిన నాప్రతిజ్ఞను, ఆమెసద్వంశసంభవతయుఁ జెప్పి, నాసత్యము నీమూలమున నిలువవలెనని యిరావతిని నామాటలుగా నూఱడింపుము.

ప్రతీ—దేవియాజ్ఞాపించినట్లు చేసెదను. (అని వెడలిపోయి మరలఁ బ్రవేశించి) అమ్మా! నీపుత్రవిజయనిమిత్తమున సంతోషించి యంతఃపురకాంత లిచ్చినయాభరణములకు నేను బెట్టెనయినాను.

ధార—చాలును. ఇందాశ్చర్యమేమున్నది? ఈయభ్యుదయము నాకును వారికిని సామాన్యమయినదే.

ప్రతీ—(రహస్యముగా) అమ్మా! "పెద్దవారయిన మీనోటినుండి వచ్చినమాట యోగ్యమయినది. మీసంకల్పమును మార్చుకొనుట యుక్తముకాదు" అని యిరావతి మనవిచేయుచున్నది.

ధార—అమ్మా! ప్రథమమునఁ బూజ్యుఁడయిన సుమతిచేత నియ్యసంకల్పింపఁబడిన యీమాళవికలు భర్తగారి కిచ్చుటకొఱకు మీయనుమతమును గోరుచున్నాను.

పరి—ఇప్పుడు సహితము నీవే యీమెకు యజమానురాలవు.

ధార-(మాళవికను జేతితోఁబట్టుకొని) నాకుఁబ్రియవార్తను దెలిపినందుకయి భర్తగారీమెను బారితోషికముగా నంగీకరింతురు గాక!

రాజు—(సిగ్గుపడుచున్నాఁడు.)

ధార—(చిఱునవ్వుతో) చేసినప్రియుని వేదనమునకీపారితోషికము తగదని భర్తగారు తిరస్కరించుచున్నారా యేమి?

విదూ—అమ్మా! క్రొత్తపెండ్లికొడుకు లందఱును లజ్జపడుదు రన్న లోకప్రవాదము విన్నదేకదా?

రాజు—(విదూషకునివంకఁ జూచుచున్నాఁడు.)

విదూ—దేవిగారే యీమెకుఁ దమతో సమానముగా దేవీ సంజ్ఞ నిచ్చినతరువాతనే యీయన మాళవికను బ్రతిగ్రహింపఁ గోరుచున్నాఁడు.

ధార—దేవీనామము రాజపుత్త్రికయైన యీమెకు సత్కులోద్భవత్వముచేతనే యియ్యఁబడినది. పునరుక్తిచే నేమిప్రయోజనము?

పరి—అట్లుకాదు.

క. గనిలోఁ బుట్టిన దయ్యును,
నొనరంగా సానఁబట్టకున్నను మణియున్
గనకముతో సంయోగం
బౌనఁగూర్పఁగ నర్హమానె? యోకళ్యాణీ!

ధార—అమ్మా! ఈ యభ్యుదయకథచేత మొదట నీమె మేలిముసుఁగు సంగతిచూడలేదు క్షమింపుము. నీవు పోయి మేలిముసుఁగునకయి పట్టువస్త్రమును దీసికొనిరమ్మా.

ప్రతీ — దేవిగారాజ్ఞాపించినట్లు చేసెదను. (అనిపోయి ముసుంగుచీరను దీసికొని మరలఁ బ్రవేశించి) దేవీ! ఇదిగో.

(అని యిచ్చుచున్నది.)

ధార — (మాళవికకు ముసుఁగువేసి) ప్రాణేశ్వరా! ఈమెను బరిగ్రహింపవలెను.

రాజు — నేను నీశాసనమును మీఱరాదుగనుక నీదానమును స్వీకరించినాఁడను.

విదూ — ఆహా! ఏమి యీధారణీదేవి యనుకూలత!

ధార — (పరిజనమువంకఁ జూచుచున్నది.)

పరిజనము — (మాళవికనుసమీపించి) అమ్మా! జయమగుఁగాక! జయమగుఁగాక!

ధార — (పరివ్రాజికవంక జూచుచున్నది.)

పరి — దేవీ! ఇది నీకు వింతకాదు.

గీ. పతులసేవింత్రు ప్రతిపక్షసతుల నిచ్చి
యైనఁ బతిభక్తితత్పరలై నసతులు,
నదు లనేకములగు నేటియుదకములను
గొంచుఁ బోయి సముద్రునిఁ గూర్చునట్లు.

[నిపుణిక ప్రవేశించుచున్నది.]

నిపు — దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! "అప్పుడుపచారాతిక్రమణముచేత నేను భర్తగారియెడ నపరాధము చేసినాను. అయినను నేనటుతరువాత భర్తగారికి స్వయముగానే యానుకూల్యమును జేసినాను. ఇప్పుడు భర్తగారు సంపూర్ణమనోరథులయినారుగనుక, నన్నుఁగూడఁ బ్రసాదమాత్రముచేత సంభావింపఁదగును," అని యిరావతి విన్నపముచేయుచున్నది.

ధార—నిపుణికా! "భర్తగారు నీవుచేసిన సేవకుఁ దగిన ఫలమును బ్రసాదింతురు" అని యిరావతితోఁ జెప్పుము.

నిపు—నాకిది పరమానుగ్రహము.

(అని నిష్క్రమించుచున్నది.)

పరి—దేవా! మీతోడివిడువని సంబంధముచేతఁ గృతార్థుఁడయిన మాధవసేనునిఁ దమసెలవుమీఁదఁబోయి సందర్శించి నేత్రసాఫల్యమును బొందఁగోరుచున్నాను.

ధార—అమ్మా! మీరు మమ్ము విడిచిపెట్టుట తగదు.

రాజు—అమ్మా! నీక్షేమవార్తను మాలేఖలలో లిఖించి యాతనితావునకు మా సభాజనులను బంపెదను.

పరి—మీయిరువుర యాదరముచేతను నేను ధన్యురాలనయినాను.

ధార—ప్రాణేశ్వరా! నేనింకను దమకేమి చేయవలెనో యాజ్ఞాపింపుఁడు.

రాజు—నాకిదియే ప్రియము.

ఉ. దేవి! ప్రసన్నురాలవయితి దివ్యముచూపు సతంబునాపయిన్;
నే వచియింతు నియ్యదియు నీపరిపక్షజనంబుఁబట్టి యో
పావని! యగ్నిమిత్రుఁ డిల పాలనచేసెడు నంతకాలమున్
భూవలయంబునం బ్రజకుఁ బుట్టకయుండుత మీతిబాధలున్.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము

శ్రీ

# ప్రబోధచంద్రోదయము.



ఇది

కృష్ణమిశ్ర విరచితమైన సంస్కృత నాటకమునుండి

గద్య పద్యాత్మకముగా

## కందుకూరి వీరేశలింగము పంతులుచే

తెనిఁగింపఁబడినది.

నాల్గవ కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.



వివేకుఁడు—కథానాయకుఁడగు రాజు. మనస్సునకు నివృత్తిదేవి వలనఁ బుట్టినవాఁడు.

వస్తువిచారుఁడు, సంతోషుఁడు—వివేకుని సేనానాయకులు.

మనస్సు—వివేకునికిని; మహామోహునికిని తండ్రి.

క్షమ—వివేకుని, సేనానాయకురాలు.

మతి—వివేకుని భార్య.

ఉపనిషద్దేవి—వివేకుని భార్య.

శ్రద్ధ—శాంతియొక్క తల్లి.

శాంతి, కరుణ, మైత్రి—వివేకునిపక్షమునఁ బనిచేయుపరిచారికలు.

సంకల్పుఁడు—మనస్సు కొడుకు.

వైరాగ్యుఁడు—మనస్సు కొడుకు.

ప్రబోధచంద్రుఁడు—వివేకుని కుపనిషద్దేవివలనఁ బుట్టినపుత్రుఁడు.

విద్య—వివేకున కుపనిషద్దేవివలనఁ బుట్టినకూఁతురు.

సరస్వతి—విష్ణుభక్తిదేవి యాజ్ఞవలనమనస్సునోదార్పవచ్చిన దేవత.

విష్ణుభక్తి—వివేకుని యిష్టదేవత.

పురుషుఁడు—జీవుఁడు.

మహామోహుఁడు—ప్రతినాయకుఁడు. మనస్సునకు ప్రవృత్తిదేవి వలనఁ బుట్టినవాఁడు.

కాముఁడు, క్రోధుఁడు, లోభుఁడు—మహామోహుని సేనానాయకులు.

రతి—కాముని భార్య.

హింస—క్రోధుని భార్య.

తృష్ణ—లోభుని భార్య.

డంభుఁడు—లోభుని కొడుకు.

అహంకారుఁడు—లోభుని తండ్రి.

నాస్తికత—మహామోహుని భోగభార్య.

అసత్సంగుఁడు—మహామోహుని భృత్యుఁడు.

వటుఁడు—డంభుని శిష్యుఁడు.

చార్వాకుఁడు, దిగంబరసిద్ధాంతుఁడు, బుద్ధాగముఁడు, సోమసిద్ధాంతుఁడు—మహామోహుని పరివారములోనివారు.

నిదిధ్యాసనుడు—విష్ణుభక్తిదేవి యుపనిషద్దేవికడకుఁ బంపినదూత.

వీరుగాక ప్రస్తావనమునం దనేకపురుషులును స్త్రీలును వత్తురు.



# ఉపోద్ఘాతము



ఈనాటక మేకాలమునందు రచియింపఁబడినదో నిశ్చయముగాఁ దెలిసికొనుట కాధారము లేవియుఁ గానరావు. గ్రంథకర్తయైన కృష్ణమిశ్రుఁడు షష్ఠాంకమునందుఁ గుమారిల భట్టుయొక్క పేరు నుదాహరించుటచే నిది యాతని కాలమునకుఁ దరువాతదగుట నిశ్చయము. కుమారిలభట్టు క్రీస్తుశక మేడవ శతాబ్ద మధ్యమునందుండి, పూర్వమీమాంసావార్తికము మొదలయిన గ్రంథములను రచియించి, బౌద్ధమతమును భంజించుటకయి మహాప్రయత్నముచేసి ప్రసిద్ధి కెక్కినవాఁడు. ఈనాటకముయొక్క యుద్దేశ మద్వైతమును స్థాపించుటయే యయినను, ఇందెందును దన్మత స్థాపకుఁడయిన శంకరాచార్యులవారిపే రుదాహరింపఁబడి యుండలేదు. శంకరాచార్యులవారు హూణశకము ౭౮౮ వ సంవత్సరమునందుఁబుట్టి తొమ్మిదవశతాబ్దారంభమునఁ బ్రబలియున్నారని యిప్పుడించుమించుగా నిశ్చయింపఁబడినది. కాఁబట్టి యీనాటకము క్రీస్తుశక మేడవ శతాబ్దమునకును తొమ్మిదవ శతాబ్దమునకును మధ్యను జేయఁబడినదని చెప్పవచ్చును. మఱియును శంకరాచార్యుని కాలమునందు మండనమిశ్రుఁడు మొదలైన మిశ్రజాతి బ్రాహ్మణు లనేకులు మహావిద్వాంసులగుటయు, గ్రంథకర్త మిశ్రజాతివాఁ డగుటయుఁగూడ కాలనిర్ణయమునకుఁ గొంత తోడుపడుచున్నది. అంతేగాక యీనాటకమును కీర్తివర్మ యను రాజుసమ్ముఖమునఁ బ్రయోగించినట్లు ప్రస్తావనవలనఁ దెలియవచ్చుచున్నది. కీర్తివర్మ యను చాళుక్యరాజొకఁడు హూణశకము ౭౪౭ వ సంవత్సరము మొదలుకొని ౭౫౭ వ సంవత్సరమువఱకును కళ్యాణి నగరమునందు రాజ్యముచేసి యున్నాఁడు. నాటకప్రస్తావన

యం నుదాహరింపఁబడిన కీర్తివర్మ యితఁడే యయినపక్షమున, ఈ ప్రబోధచంద్రోదయనాటకము సంస్కృతమున హూణశకము ౧౦౫౦, ౧౧౧౦ సంవత్సరములమధ్యను రచియింపఁబడి యుండును. కాశికా పురమును రాధాపురమును వర్ణించుటచేతఁ గవి వంగదేశపువాఁ డయినట్టు కానఁబడుచున్నను, ఈనాటకము దక్షిణహిందూదేశము నందే విస్తారముగా వ్యాపించియుండుటచేతను నాటకమునం దక్కడక్కడ దక్షిణహిందూస్థానమును గూర్చిన ప్రస్తావన కానఁబడు చుండుటచేతను గ్రంథకర్త కళ్యాణనగరమునందే యుండి యచ్చటనే గ్రంథరచన చేసినట్టూహించవలసి యున్నది. ఈనాటకము హూణశకము ౧౪౫౦ వ సంవత్సరమునకుఁ దరువాతను ౧౫౧౦ వ సంవత్సరమునకుఁ బూర్వమునందును నంది సింగయ్య గంట మల్లయ్య యను కవులచేఁ దెనుఁగున ప్రబంధరూపమున నయిదాశ్వాసముల పద్యకావ్యముగా రచియింపఁబడినది. కాఁబట్టి నాటకము పదునేనవ శతాబ్దాంతమునకే మిక్కిలి ప్రసిద్ధమయి యప్పటికే మిక్కిలి పురాతనమైనదిగాఁ గానఁబడుచున్నది.

నేనీనాటకమును ౧౮౮౫ వ సంవత్సరమునందుఁ గొంత తెనిఁగించి యుందలి ప్రథమాంకము నాసంవత్సరమునందు వివేకవర్ధనిలోఁ బ్రకటించితినిగాని యప్పుడు కొన్నికారణములచేత గ్రంథమును ముగింపక యిటీవల నామిత్రులు కొందఱీనాటకమును శీఘ్రముగా ముగించి ప్రచురించవలసినదని నాకు వ్రాయుచువచ్చుటచేత గతసంవత్సరమునందు మరల నారంభించి చింతామణిపత్రిక కప్పుడప్పుడు వ్రాసి గ్రంథమును నేటికి ముగించినాను. ఈభాషాంతరము యొక్క యోగ్యతాయోగ్యతలను దీనిఁజదువువారే నిర్ణయింప వలయుఁగాన నేనావిషయమునుగూర్చి యిచ్చట వ్రాయవలసిన పని

లేదు. భాషాంతరము నందేను సాధ్యమైనంతవఱకు మూలగ్రంథాను సారముగానే చేసి యున్నాను. * * *

ఈనాటకము నందలి కథ వేదాంతవిషయమే యయినను కృష్ణమిశ్రుఁడు దీనిని హృదయరంజకముగాను, సుబోధకముగాను; జేసి యున్నాఁడు. ఇందు వివేకము (జ్ఞానము) నకును మహామోహము (అజ్ఞానము) నకును పోరాటము జరగఁగా మొదల నజ్ఞానమే ప్రబలముగానున్నను గడపట జ్ఞానముచేతఁ బరాజితమయి యడఁగిపోయి నట్లు చెప్పఁబడెను. ఇందు సుగుణ దుర్గుణములు పురుషులుగాను స్త్రీలుగాను జెప్పఁబడి యాయాపక్షములయందు వానివాని ప్రభావముతో మిక్కిలి మనోహరముగా వర్ణింపఁబడినవి. ఈవిషయ మిందలికథను జదివినను పాత్రములను బరిశీలించినను బోధపడును గాన నేనీవిషయమును బెంచి వ్రాయక, ఈనాటకము నాంధ్రీకరించుటలోఁ గలిగిన నాప్రమాదములను దీనింజదువువారు మన్నింతు రని వేఁడుచు నీయుపోద్ఘాతమును ముగించుచున్నాను.

రాజమహేంద్రవరము.
ది ౨౨ జూన్ ౧౮౯౨ వ సం॥ } కందుకూరి వీరేశలింగము.

## రెండవకూర్పు.



మొదటికూర్పునఁ బ్రస్తావనలో గోపాలునిగూర్చి మార్చిన విషయ మీకూర్పున మూలగ్రంథానుసారముగా సంస్కరింపబడినది.

చెన్నపురి.
10—10—98. }  కం-వీ

శ్రీ

# ప్రబోధచంద్రోదయము



## ప్రథమాంకము.



మ. రవిరశ్మిన్ దినమధ్యమందు జలపూరంబుల్ బలెన్ దృష్టికిన్
భువి నజ్ఞానముచేత భౌతికజగంబుల్ దేనఁ దోఁచుం దగన్,
బువుదండన్ ఫణియన్నభ్రాంతివలెఁ బోవున్ దేనఁ బ్రాజ్ఞాళి క
య్యావి, యానిర్మలబోధముందలఁతు సాంద్రానందమున్ మన్మదిన్.

ఉ. నిండుమనంబు శాంతిఁ గన నేర్చినయప్పుడు బ్రహ్మరంధ్రమం
దుండి సుషుమ్నరుద్ధపవనోద్గతిమై సుఖసాంద్ర మౌచు ను
ద్దండలలాటనేత్రమిషఁ దాఁ బ్రకటీకృత మైనయట్లు బ్ర
హ్మాండమునిందు నీశ్వరుచిదాత్మక తేజము మిమ్ముఁ బ్రోచుతన్.

(నాంద్యంతమున.)

సూత్రధారుఁడు—అతివిస్తార మేల? చాలును, సకలసామంతచక్రచూడామణిమరీచిమంజరీనీరాజితచరణరాజీవుండును, బలవదహితనివహావటుస్తటకవాటపాటనప్రకటితనరసింహాయువుండును, ప్రబలతరనరపతికులప్రళయమహార్ణవమగ్నమేదినీసముద్ధరణమహావరాహుండును, నిఖిలదిగ్విలాసినికర్ణపూరీకృతకీర్తిలతాపల్లవుండును, సమస్తాశాస్తంబబేరమకర్ణతాలాస్ఫాలనబహుళతరపవనసంపాతనర్తితప్రతాపానలుండును, నగుగోపాలుండు—"మాకు సహజసుహృదు లైన

శ్రీకీర్తివర్మమహారాజులవారిదిగ్విజయవ్యాపారము చేత బ్రహ్మానంద రసానుభవమును కెడము లేక మేము వివిధవిషయములందగిలి వ్యర్థముగా దినములు గడపినారము. అయినను మేమిప్పుడు కృతకృత్యుల మైనారము.

గీ. జయము నొందిరి క్ష్మావిభు శత్రునృపులు;
మహి సురక్షిత యయ్యె సన్మంత్రిగరిమ;
రాజమకుటార్చితాచ్ఛసామ్రాజ్యలక్ష్మి
యబ్ధిమేఖలయగుక్షితి వతనిఁ జేరె.

అందుచేత మేము శాంతరసప్రధాన మయిన ప్రయోగాభినయముచేత మనస్సును వినోదపెట్టఁ గోరుచున్నాము. కాఁబట్టి యింతకుఁబూర్వమే పూజ్యు లయినకృష్ణమిశ్రులవారు రచియించి మీకు సమర్పించిన ప్రబోధచంద్రోదయ మనునాటకము మీరిప్పుడు శ్రీ కీర్తివర్మమహారాజులవారి సన్నిధానమందుఁ బ్రయోగింపవలెను. 'రాజుగారికిని సభవారితోఁగలిసి దానినిజూడవలెనని వేడుకగలదు.''— అని నాతో సెలవిచ్చెను. అవుఁగాక! నేనింటికిఁబోయి నాగృహిణిని బిలుచుకొనివచ్చి సంగీతకర్మమున కుపక్రమించెదను. (అని కొంచె ముతిరిగి తెరవంకఁ జూచి) ఓసీ! ఇటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఇదిగోవచ్చినదానను. నే నేనియోగము ననుష్ఠింపవలెనో దేవరవారు సెలవియ్యవలెను.

సూత్ర—ఓసీ! నీకును దెలిసియే యున్నది.

మ. కలఁడుద్యద్రివుభూరిపృతనాకాంతారగమార్భచ్ఛత్రప్రతా
పలసత్పావకకీలికాక్రమితవిశ్వవ్రాతుఁ డాశాంతవి
శ్ఛలవిశ్రాంతయశుండు ఖడ్గతికాసంఛిన్నకంఠారి రా
ట్కులభూస్థాపితకీర్తివర్ముఁడు తగఁగా గోపాలుఁ డుర్వీస్థలిన్.

మఱియును,

మ. రణరంగస్థలు లిప్పుడున్ మనుజభుగ్గ్రామాకరాస్ఫాలనో
ల్బణవల్గన్నకృపాలతాళరవము ల్వ్యాపింప, ఝుంఝూసమీ
రణసంక్షోభితకుంభికుంభకుహర ప్రవ్యక్తనాదంబులన్
బ్రణుతింపం దదపూర్వకీర్తుల, నటింపంగాఁ బిశాచాంగనల్.

ఆతఁ డిప్పుడు శాంతపదస్థితుఁడయి యాత్మవినోదార్థముగాఁ బ్రబోధచంద్రోదయనాటక మాడవలెనని యాజ్ఞాపించియున్నాఁడు. నటుల నిప్పుడు వేషములు ధరించి వచ్చునట్లు నియమింపవలెను.

నటి—(విస్మయముతో) ఆర్యపుత్రా! ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఇట్లు నిజభుజబలవిక్రమైకనిర్భర్త్సితసకలరాజమండలుండైన యతం డాకర్ణాకృష్టకఠినకోదండదండ బహుళవర్షచ్ఛరనికరజర్ఝరీకృతతురంగతరంగకరిగ్రాహంబును నిరంతరనిపతత్తీక్ష్ణనిశిత ప్రశస్త్రసహస్రపర్యస్తోత్తుంగమాతంగమహామహీధరసహస్రంబును భ్రమదుద్భుజదండచండమందరాభిఘాతఘూర్ణత్సకలపదాతి సలిలసంఘాతంబును నగుకర్ణసైన్యసాగరంబును మధుమథనుండు క్షీరపారావారంబును బోలె నిర్మథించి సమరవిజయలక్ష్మిం జేకొని వీరచరితుండై యిప్పుడిటువంటి సకలమునిజనశ్లాఘనీయమైన యుపశమ మెట్లుపొందెను!

సూత్ర—ఓసీ! బ్రహ్మజ్యోతి యెప్పుడును స్వభావముచేత సౌమ్యమయినదే. అయినను, అది యేదో కారణముచేత వికారమును బొందినను మరల స్వభావమునందే నిలుచును. ఆప్రకారముగానే సకలభూపాలకులప్రళయకాలాగ్నిరుద్రుఁడైన చేదిపతిచేత నున్మూలింపఁబడిన చంద్రాన్వయపార్థివపృథ్వీరాజ్యమును స్థిరీకరింపుటకయి యీయనకీసంరంభము కలిగినది. చూడుము—

గీ. ప్రళయకాలసముద్భూత వాయువశతఁ
బర్వతంబుల లంఘించువారిరాశి
నిశ్చలంబయి స్వచ్ఛమై నిలువలేదె
యిపుడు మేరమీఱక స్వభావేద్ధగరిమ!

అంతేకాక శ్రీమన్నారాయణాంశసంభూతులయిన యిటువంటి పౌరుషభూషణు లగు పురుషులు భూతహితముకొఱకు భూమియం దవతరించి విహితకృత్యములను నిర్వహించి మరల శాంతిని బొందుదురు. ఇప్పుడు పరశురాముని కథ వినుము—

మహాస్రగ్ధర

ఎవఁ డీధాత్రీస్థలిన్ ముల్ నృపులఁగెడపి ముయ్యేడునూఱుల్ ద్వాపన్నాం
నవసామ స్త్రిష్కపంకాచ్ఛరుధిరనదులన్ స్నానముం జేసెఁ; జేదో
యువధిం చెన్నిర్దయుండై యెవఁడువనితలల్ వృద్ధులల్ బాలురల్ మా
నవపాలాంచద్భుజాఖండనచణగుణనండత్కుఠారోగ్రధారన్.

గీ. అట్టి జామదగ్న్యుఁడు స్వవీర్యమున భూమి
భారమునుడించి, నృపకులాన్వయముఁ ద్రుంచి,
కోపపావకు నాపయి రూపడంచి,
తపముబలిమిని బరమశాంతత వహించె.

అలాగుననే యితండును కర్తవ్యమును నెఱపి యిప్పుడు పరమోపశమనిష్ఠుఁ డయి యున్నవాఁడు.

గీ. పుడమిపైని వివేకుండు మోహజయముఁ
బడయునట్లుగఁ గణ్వన వడిజయించి
యుల ప్రబోధునకుంబలె నభ్యుదయము
నితఁడు శ్రీకీర్తివర్మభూపతికి నొసఁగె.

[తెరలో]

ఓరీ! పాపీ! నటాధమా! ఏమీ? నా దేహములోఁ బ్రాణములుండఁగానే మాస్వామియైన మహామోహునకు వివేకునివలనఁ బరాజయము నుదాహరించుచున్నావు!

సూత్ర—(తొట్రుపాటుతోఁ జూచి) ఓసీ! చూడు.

చ. మదనుఁడు వచ్చె నిచ్చటికి మంజులవీనకుచద్వయంబు పై
రెద ఘటించుచున్ రతి రహిన్ బులకాంచితబాహువల్లులన్
గదిసి కవుంగిటంబొదువగా, మదఘూర్ణితనేత్రపద్ముఁడై
యదె నయనాభిరామసుభగాకృతి లోకము మోహపెట్టుచున్.

అతఁడు నామాటలవలనఁ బుట్టిన క్రోధము మూర్తీభవించినట్లు కనఁబడుచున్నాఁడు. ఇక్కడనుండి మన మతనిని విడిచి పాఱిపోవుటయే శ్రేయము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన

[వెనుకఁ జెప్పినరీతిని కాముఁడును, రతీదేవియుఁ,
ప్రవేశించుచున్నారు]

కాము—(కోపముతో) ఓరీ! పాపీ! నటాధమా! ఏమీ! నాబొందిలోఁ బ్రాణము లుండఁగానే మాస్వామియైన మహామోహునకు వివేకునివలనఁ బరాజయము నుదాహరించుచున్నావు! ఔరా! భరతాధమా!

గీ. పృథివి నిందీవరాక్షులదృష్టివిశిఖ
సంతతులు పర్వకుండెడు నంతవఱకె
మహితవిద్వాంసులకునైన మనసులందు
శాస్త్రజన్యవివేకంబు సంభవిల్లు.

ఉ. సుందరమందిరంబులును, సోయగపుంజవరాంగ్రుం, షట్పదా
మందరవోల్లసల్లతలు, మల్లెలతావుల నొప్పుగాడ్పులున్,
జందురుఁడున్న రేలు, నెటఁ జేకు నమోఘబలంబులౌట గ
ల్పొందఁగ, నన్వివేకుఁడేటులుండుఁ? బ్రబోధుఁడు నెట్లుపుట్టెడున్?

రతి—ఓప్రాణేశ్వరా! మహామోహ మహారాజుగారి శత్రు వయిన వివేకుఁడు సామాన్యుఁడు కాఁడని తలఁచుచున్నాను.

కాము—ఓప్రియురాలా! స్త్రీ స్వభావముచేత వచ్చిన పిఱికితనము బయలఁ బడునట్లుగా, నీ వావివేకున కేలభయపడెదవు? చూడు.

క. శరములు విల్లును నా కో
సరసిజముఖి! పూలెయైన, క్షణమేన్ ససురా
సురమగు సర్వజగంబును
దెరలక నాయాజ్ఞమీఱి ధృతి నిల్చెడునే?

చ. సురపతి జారతం గలసెనుద్దిన యహల్యను, బ్రహ్మదేవుఁడున్
వరతనయ న్వరించె, గురుపత్నినిగూడి రమించెఁ జంద్రుఁడున్·
బరుఁడిఁకఁ గానిమార్గమును బట్టనిపాఁడెవఁ డస్మదాజ్ఞచే?
నరయ మతేవి మచ్చరములట్లు భ్రమింపఁగఁజేయు లోకమున్?

రతి—ఓప్రాణేశ్వరా! అదియంతయు సత్యమేకాని, శత్రుఁడు సహాయసంపన్నుఁడు గనుక శంకింపవలసి యున్నది. యమ నియమ ప్రముఖు లయిన యాతని మంత్రులు మహాబలవంతు లని వినుచున్నాను.

కాము—ఓప్రియురాలా! నీవొక్కబలవంతుఁ డయిన యా వివేకమహారాజుయొక్క యమాదిమంత్రులనే తలఁపున నిలుపుచున్నావుకాని మమ్ము విచారింపకున్నావు. మేము పూనికతోఁ దార

సించినంతమాత్రముచేతనే వారందఱును నిమిషములోఁ జెల్లాచెదరగుదురు సుమా!

గీ. ఇచటిక్రోధునియెదుర నహింస యెంత!
బ్రహ్మచర్యాదు లెంత నాపజ్జఁ జూడ!
వినుము సత్యుండు నస్తేయుఁడు నపరిగ్ర
హుండు నెంతవా రాలోభునొద్దఁ జెపుమ.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు నిర్వికారచిత్తులకడనే కాని యుండరుగాన వారిని సులభముగానే నశింపఁజేయవచ్చును. అంతేకాక వారిపాలిటిమృత్యుదేవతలైన స్త్రీలను నాకధీనురాండ్రయి మెలఁగుచున్నారు.

ఉ. వారివిలోకనంబులును వారిసుభాషణముల్ విలాసమున్,
వారల కౌఁగిలింతలును వారలహాసముఁ గ్రీడ లేల! య
వ్వారలనామసంస్మరణభాగ్యమె చాలు హృదంతరంబులం
దారయ నిర్వికారులకు నైన వికారము పుట్టఁజేయఁగన్.

విశేషించి వీరు మనప్రభువువారి యాప్తులయిన మద, మాత్సర్య, దంభాదులకు లోఁబడినవారయి మనరాజుగారి మంత్రియైన యధర్మునినే యాశ్రయింతురు.

రతి—ఓహృదయేశ్వరా! మీకును శమ, దమ, వివేకప్రభృతులకును జన్మస్థల మొక్కటియే యని విన్నదానను.

కాము—ఓహో! ప్రియురాలా! ఒక్కజన్మస్థలమే యేక మని చెప్పనేల! మాకు జనకుఁడును నొక్కఁడే సుమా! ఎట్లన—

ఉ. ఈశ్వరసంగమంబునను నెంతయుఁ బొత్తను మాయయందు నీ
విశ్వములో మనస్సనెడువిశ్రుతుఁడౌ సుతుఁ డుద్భవిల్లె; నా

యీశ్వరసూతియే మొదట నెల్లజగమ్ములుఁ జేసి మీఁదటన్
శాశ్వతకర్త యై వ్యాసు బొసంగఁ గులంబులు మావిరెంటికిన్.

అతనికిఁ బ్రవృత్తియుఁ, నివృత్తియు, నని యిద్దఱు ధర్మపత్నులు గలరు. వారిలోఁ బ్రవృత్తివలన మహామోహుఁడు మూలపురుషుఁడుగాఁగల మా వంశము పుట్టినది. నివృత్తివలన వివేకుఁడు మూలపురుషుఁడుగాఁగల యారెండవవంశము పుట్టినది.

రతి—ఓప్రాణనాయకా ! అట్లయిన సహోదరులయ్యును మీలో మీకిటువంటి పరస్పర విరోధమెందుకు ?

కామః—

మ. ఇలనేకామిషసంభవత్వముననే యెందు న్మహావైరముల్
వెలచ న్నర్థిలు నన్నదమ్ములకుఁ; బృథ్వి న్వింతయే యాగతుల్!
కలుగన్ లేదె జనత్రుఁబయినసంగ్రామంబు మున్నీమహీ
స్థలిలోఁ బాండవకౌరవోత్తములకున్ ధాత్రీనిమిత్తంబునన్!

ఈజగత్తుసర్వమును మాపిత్రార్జితము. ఐనను నను మాయందుఁ బతుపాగటచేత జగత్తంతయు మేమాక్రమించుకొనఁగా, నిలువలేక యుదాయదలై నతనవారితో వివేకుఁ డండందుఁ దిరుగుచు నెక్కడనో యడఁగియున్నాఁడు. ఇప్పుడాపాపాత్ము లందుచేతఁ దండ్రిని మమ్మును గూడ నిర్మూలము చేయుట కుద్యోగించుకొని యున్నారు.

రతి—పాపము శాంతించునుగాక ! పాపము శాంతించునుగాక! ఓ ప్రాణేశ్వరా! విద్వేషమాత్రముచేతనే వారిప్పుడీ పాపవ్యవసాయమునకుఁ బూనినారా? లేక యిప్పుడు వారాలోచించిన యుపాయ మేదియైనఁగలదా?

కామః—దీనికిఁ గొంచెము గూఢకారణమున్నది.

రతి—ఓ ప్రాణేశ్వరా ! అది నాకేల చెపుఁగ ?

కాము—నీవు స్త్రీస్వభావముచేతఁ బిఱికిదానవని నీకాపాపాత్ముల దారుణ ప్రయత్నమును జెప్పఁజాలకున్నాను.

రతి—ప్రాణనాథా! అది యెటువంటిది?

కాము—ఓ ప్రియురాలా! భయపడఁబోకు. వారివి కేవల మాతాకు లయినవారి కోరికలేసుమా! ఇప్పుడు కాళికాశక్తితో సమానురా లయినవిద్య యనురాక్షసియొక్కతె మనవంశమునందుఁ బుట్టునని లోకప్రవాద మొకటి పుట్టినది.

రతి—(భయముతో) ఏమిగతి! మనకులమునందు రాక్షసి యెట్లు పుట్టునా యని నాహృదయము కంప మెత్తుచున్నది.

కాము—ప్రియురాలా! జడియకు జడియకు. ఇది వట్టిశంకవదంతియే సుమా.

రతి—తరువాత నారాక్షసి చేయఁగలపని యేమి?

కాము—ప్రియురాలా! బ్రహ్మదేవునిభార్య సరస్వతి యనియొకతె యున్నదికదా! ఆమె యీప్రకారము చెప్పినదఁట.

స్రగ్ధర

సంగంబుల్ లేని మాయాశ్వరునివలన సంసర్గముల్ లేకయే లీలం గాంచెన్ భార్యమాయాలలన మనసనన్ శ్లాఘ్యపుత్రుల్ జగంబుల్
పొంగారన్: వీరివంశంబునను పొడమెడున్ బుత్రియు న్విద్యనాఁగన్;
ద్రుంగుం దద్విద్య తండ్రిన్ బ్రియజననిని భ్రాతృప్రజంబుల్ గులంబున్.

రతి—(భయోత్కంపముతో) ఓప్రాణవల్లభా! రక్షింపుము. రక్షింపుము. (అని భర్తను గాఁగిలించుకొనుచున్నది)

కాము—(స్పర్శసుఖ మభినయించి తనలో)

చ. పులకలుగూడఁ జూపులను బొల్పుగఁ దారకలాడఁ బైపయిన్
వలుదకుచద్వయంబు భయభావమునన్ వడఁకాడఁ గంకణా

బలి చిలుపాటపాట, భుజవల్లుల నీతరళాక్షి కౌఁగిటన్
చెలువుగఁ జేర్చు సొంపలరఁ జేసి, నను న్వివశాత్ముఁ జేసెడున్.
(గాఢాలింగనము చేసికొని ప్రకాశముగా) ప్రియురాలా! బెదరకు బెదరకు. మేము జీవించియున్నంతవఱకును విద్య యెక్కడఁబుట్టును?

రతి—ఆరాక్షసి పుట్టుట మీ ప్రతిపక్షులకు సమ్మతమా యేమి?

కాము—అవును సమ్మతమే. అవిద్య వివేకున కుపనిషద్దేవి యందుఁ బ్రబోధచంద్రుఁ డను సోదరునితోడఁ గూడఁ బుట్టబోవుచున్నది. శమదమాదు లందఱు నందులకు మహాప్రయత్నము చేయుచున్నారు.

రతి—ఓ హృదయేశ్వరా! ఆత్మవినాశహేతు వయిన విద్య యొక్క యుత్పత్తి కాదుర్వినీతు లెట్లు సంతోషించుచున్నారు?

కాము—ఓ ప్రియురాలా! కులక్షయప్రవృత్తు లయి యున్న పాపకర్ములు ప్రత్యపాయము నెట్లు గణింతురు? చూడు.

చ. అరయ స్వభావదుష్టకుటిలాత్ములసంభవ మెల్లఁ దప్పకున్
గరము వినాశహేతువగుఁగా తమకుం దమకుఁగన్నవారికిన్!
ధరణిని ధూమసంచయము తా నలమేఘపదంబు నొంది స
త్వరముగ నగ్ని నార్చి తరువాతను దానును నాశ మొందదే!

[ తెరలో ]

ఓ పాపీ! దురాత్మా! ఏమిరా పాపకర్ముల మని మమ్మే యాక్షేపించుచున్నావు! ఔరా!

గీ. "గర్వితుం డైన, దుర్మార్గగామియైనఁ,

కానివాఁడైన, గురునేని కార్య మెంచి
వసుధలోపలఁ ద్యజియింపవలయుఁ జుమ్ము."

అను పౌరాణికగాథను బురాణవేత్త లుదాహరించి యున్నారు. అది గాక యీ మాజకుఁడే యహంకారునితోఁ జేరి తనతండ్రి యైన జగత్పితను బంధించి యున్నాఁడు. అతనిని మోహాదులుకూడ దృఢపాశబద్ధుని జేసి యున్నారు.

కాము—ఓప్రియురాలా! అదె మాకులవృద్ధుఁడైన వివేకుఁడు భార్య యగు మతిదేవితోఁగూడ నిక్కడకే వచ్చుచున్నాఁడు.

మ. వనితా! చూడుము చిక్కి మానసమనుఁ డావంక న్వివేకుండు తె
ల్విని గన్పట్టెడుఁ గాంతి కోల్పడి, కడుఁ స్వేచ్ఛానుసంచారులౌ
ఘనరాగాదులచేఁ గలంగిన మతిన్స్వాత్మభృత్యుక్చం గూడి, కా
ల్నాకను పెన్నంచునఁ గాంతివాసినశశాంకుంబోలి భీతాత్ముఁడై,

ఇఁక మన మిక్కడ నిలువఁగూడదు. (అని నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము

---

[అప్పుడు వివేకమహారాజును మతిదేవియుఁ బ్రవేశించుచున్నారు]

వివే—(ఆలోచించి) ఓప్రియురాలా! దుర్వినీతుఁ డయిన యీబ్రహ్మచారియొక్క గర్వోక్త మయినమాటను నీవు విన్నావు గదా? వీఁడు పాపాత్ముల మని మనలనే యాక్షేపించుచున్నాఁడు!

మతి—ప్రాణేశ్వరా! లోకులు తమదోషముల నేల యెఱుఁగ జాలరు?

వివే—ప్రియురాలా! చూడు.

శా. ఆహా! పాశముల న్నిరంజనుని జ్ఞానానందు నయ్యీశ్వరున్
మోహాంభోనిధిలోఁ

ధానాంకారపరుల్ దురాత్మకులు నాయాదుర్మదాదుల్ మహో
త్సాహం బొప్పఁగ నీకు దీనదశ నొందంజేసి రత్యంతమున్.

అట్టివారు పుణ్యాత్ములఁట! ఆదురాత్ములచేతఁ బరాభవింపఁబడిన యీశ్వరుని విముక్తుని జేయుటకయి ప్రవర్తించు చున్నమన మేమో పాపకారుల మఁట!

మతి—ఓ ప్రాణేశ్వరా! పరమేశ్వరుఁడు సహజానందసుందర స్వభావుఁ డనియు నిత్యప్రకాశుఁ డనియుఁ సకలభువనప్రచారుఁడనియు వినుచుందుము. అట్టివాఁడేల యీ దుర్వాసనలచే బంధింపఁబడి మహా మోహసాగరమునందు మునిఁగి పోయినాఁడు?

వివే—ఓ ప్రియురాలా!

సీ. సతతమహోన్నత ధృతిమంతుఁ డయ్యును
సదమలసంపూర్ణ శాంతుఁడయ్యుఁ
బ్రబలతరైశ్వర్యభాసమానుండయ్యు
మహితసంతతనీతిమంతుఁడయ్యు
నసమానఘనని శ్చలాంతఃకరణుఁడయ్యు
సమగ్రానుగుణధీవిశాలుఁడయ్యుఁ
దరుణులమాయలఁ దగులొందుపురుషుండు
త్యజియింపఁడే తనధైర్యగరిమ?
నట్లె యీమహాపురుషుండు నరయ నిపుడు
వఱలుమాయామహాదేవిపలలఁ దగిలి
చిరతరానూనసంబంధగరిమ కతనఁ
దన్నుఁ దా నెఱుఁగంగఁ జాలకున్న వాఁడు.

మతి—ఓప్రాణేశ్వరా! అట్లు సంభవింపదు. సహస్రకిరణుఁ డైన సూర్యుఁ డంధకారరేఖచేతఁ గప్పఁబడుట సంభవించునేని,

అప్పుడు కేదీప్యమానప్రకాశసాగరుఁ డైన యీదేవుఁడును మాయ చేత నడఁగియుండుట తటస్థింపవచ్చును.

వివే—ఓప్రియురాలా! ఆమెజాడ యిట్టిదని యూహించుట మనకు శక్యము కాదు. పారకాంతవలెనే యీమాయాదేవి యసత్యము లయినభావములను గనఁబఱుచుచుఁ దానా పరమపురుషుని వంచించుచున్నది. చూడు చూడు.

చ. స్ఫటికమణి భంగి స్వచ్ఛరుచి భాసిలుదేవు స్వయంప్రకాశునిన్
గటకట! యల్పురాలయి వికారవిధేయునిఁ జేసె మాయ; ప్రా
కటమగు దానిసంగతిని కాంతి నొకింతయుఁ గోలుపోఁ డతం
డటు లయియుం, ఘటించెడును నాతని కామె యధీరతంగడున్.

మతి—దుర్విదగ్ధురా లయిన యీమె యేకారణముచేత సుదారచరితుఁ డయిన యీమహాపురుషుని వంచించుచున్నది?

వివే—ప్రయోజనమునుగాని కారణమునుగాని విచారించి మాయ వర్తించుచుండ లేదు. స్త్రీపిశాచముల కది స్వభావము. చూడు.

చ. నరులదయార్ద్రకోమలమనంబులు లోఁగొని వామలోచనల్
సరగున నేమిచేయుటకుఁ జాలరు తారు ధరాతలంబునన్?
పురుషుల మోహపెట్టెదరు, బుద్ధిగలంతురు, విషాదపెట్టుదుర్
మరి వెఱపింతు రాసలఁ గరంతురు, చేయుదు రాత్మదాసులన్.

మఱియొక కారణముగూడఁ గలదు.

మతి—ప్రాణేశ్వరా! అదియేది?

వివే—పురాతనురా లయిన యీమె "నేనిప్పుడు యౌవనముపోయి యేండ్లు చెల్లినదాన నయి యున్నాను. ఇతఁడును పురాణపురుషుఁడు; స్వభావముచేతనే విషయసుఖవిముఖుఁడు, కాబట్టి నా

తనయునినే పరమేశ్వరపదమునందు నిలిపెదను'' అని యాలోచించి నది. తల్లియభిప్రాయము నెఱిఁగి భేద మేమియు లేక యామెనే పోలిన మనస్సును నవద్వారములు గలపురములను నిర్మించెను.

గీ. ఒక్కఁడయ్యును వహియించి పెక్కురూపు
లలశరీరపురంబుల నతఁడు చొచ్చి,
స్ఫటికమణిఁబోలి యాత్మచేష్టలను దాను
వానివానికిఁ దగ నలవఱ్చుకొనియె.

మతి—(ఆలోచించి) ఓప్రాణేశ్వరా ! తల్లి యెటువంటిదో పుత్రుఁడు నటువంటివాఁడే పుట్టునుగదా!

వివే—అప్పుడు మనస్సుయొక్క జ్యేష్ఠపుత్రుఁడును దనమున్న నుముఁడునునయిన యహంకారుఁడు వచ్చి తన్నుఁగౌఁగిలించుకొనఁగాఁ బరమాత్ముఁడు—

చ. భ్రమసి, యవిద్యచేయునిదురంబడి, యీశ్వరుఁ డామనస్సుచే
యుమహితకల్పనం దగిలి, 'యుద్భవమందితి; వీరు నాపితల్;
విమతులుఁ బుత్రమిత్రులును వీరె; కులంబు బలంబు విద్య ద్ర
వ్యము నివె; భార్య యీమె' యని స్వప్నములీయువి పెక్కు
లొందెడున్.

మత్రి—ఓప్రాణేశ్వరా! ఈప్రకారముగానతిదీర్ఘతర మయిన నిద్రచేతఁ బ్రబోధము చెడియున్న పరమేశ్వరునియందుఁ బ్రబోధ సంభవ మెట్లు కలుగును?

వివే—(లజ్జతో నధోముఖుఁడయి యున్నాఁడు.)

మతి—ప్రాణేశ్వరా! గురుతరలజ్జాభరముచేత శిరస్సు వంచు కొని యూరకున్నారేమి ?

వివే—ప్రియురాలా! స్త్రీలహృదయములు సహజముగా నీర్ష్య

నుబొందును. అందుచేత నేను సాపరాధుఁడ నగుదునుగదా యని శంకించుచున్నాను.

మతి—ప్రాణేశ్వరా! అన్యాశ గలిగిన స్త్రీలు మాత్రమే తన కనురక్తుఁడయి ధర్మార్థవ్యాపారములందుఁ దగిలి యున్న భర్త యొక్క మనోభీప్సితములకు విఘ్నములు చేయుదురు.

వివే—ఓప్రియురాలా!

శా. ఉగ్రోత్యద్విరహార్తయా నుపనిషద్యోషిన్మణీయోగ మ
య్యుగ్రశ్లాఘ్యుల శాంతిముఖ్యులనుసాహాయ్యాప్తి నాకబ్బినన్
జాగ్రత్తక్షణకాలమీవు విషయేచ్ఛల్ మానివర్తించినన్,
జాగ్రత్స్వప్నసుషుప్తిధామవిరతిన్ గల్గుం బ్రబోధుండిలన్.

మతి—ఓప్రాణవల్లభా! అహంకారాభిమానిమైనను గులప్రభునకు బంధమోక్షము గలిగెడు పక్షమున, అప్పుడు దేవరవారికాకుఁ దోడి నిత్యానుబంధము కలుగునుగాక యనియే నాకోరిక.

వివే—అలాగున నయినపక్షమున, నామనోరథము లచిరముగాఁ బ్రసన్నములును సిద్ధములు నయినట్టే. అట్టేకదా—

సీ. జగముల కాదియు శాశ్వతుండుఁ బ్రభువు
నై వెలుఁగొందుమహానుభావు
బహువిధంబులఁ దాము భాగించి, దేహాది
వేశంబులందుఁ బ్రవేశపెట్టి
బద్ధులఁగాఁ జేసి, పరమమృత్యుపదంబు
ప్రాపించునట్లుగఁ బదిలపఱిచి,
యడరుబ్రహ్మద్రోహులై నయవ్వారికి
మరణాంతికంబయి మఱియు శాస్త్ర

విహితమైన ప్రాయశ్చిత్తవిధిని నేను
మహితవిజ్ఞానమహిమచే మహి నొనర్చి,
మరల స్థాపించువాఁడఁబో స్థిరముగాను
బూని బ్రహ్మైకభావంబుఁ బుడమిమీఁద.

అట్లగుటంగాక! ప్రస్తుత కార్యసిద్ధికై యిఁక ప్రబోధోత్పత్తినిమిత్తము శమాదులను సమకూర్తము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయాంకము

[అంతట దంభుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దంభు—"వత్సా! దంభా! అమాత్యసహితుఁడయి వివేకుఁడు ప్రబోధోదయార్థముగా శమదమాదుల నాయాతీర్థములకుఁ బంపియున్నాఁడని విన్నాఁడను. అవన్నమగుచున్న మనవంశముల క్షయమును మాన్పుటకయి మీరు శ్రద్ధ వహించి ప్రతిక్రియ చేయవలెను. భూమండలములోఁ బరమముక్తిక్షేత్రమయి వారణాసీనగర మున్నది. నీ వందుఁబోయి నాలుగాశ్రమములవారియొక్కయు మోక్షకార్య విఘ్నమునిమిత్త మతిప్రయత్నము చేయవలెను." అని మహామోహ మహారాజుగారు నాకాజ్ఞాపించియున్నారు. కాఁబట్టి నాకు వశ్యులయిన వారితో నిండియున్న యీ వారణాసీపురమునందు నేనిప్పుడు మా ప్రభువువారు సెలవిచ్చినట్లుగా వారియాజ్ఞలను నిర్వహించితిని. ఇప్పుడిక్కడ నయాశ్రితులు (దాంభికులు)

చ. గణికలయిండ్లఁ గంపొదవు కాంతలయాసవసీధు పానముల్,
బరిణతరతోత్సవంబులను రాత్రులు వెన్నెలలోనఁ బుచ్చి, ప్రా

వ్యాసులు మటంచు దీక్షితులమంచుఁ దపస్వులమంచుఁ బండితా గ్రణులమటంచు ధూర్తులజాలంబును మోసమొనర్తురెంతయున్.

(చూచి) భాగీరథినిదాటియిప్పుడీవంక నేవచ్చుచున్నాఁడు. ఈపాంథుఁడెవఁడయియుండును?

గీ. ఒకట నభినూపనమున మంచుచున్నయట్లు;
మించి లోకత్రయంబును ద్రిమ్మరునట్లు,
పృథులవాగ్జాలమున బెదరించునట్లు,
ప్రజ్ఞచే నఘ్వనట్లుఁ, గన్పడెడు నతఁడు.

ఇతఁడు దక్షిణరాధాదేశమునుండి వచ్చియుండు నని నేనూహించెదను. కాఁబట్టి నేనితనివలనఁ బూజ్యుఁడయిన యహంకారునివృత్తాంతమును దెలిసికొనెదను.

[అప్పుడు పయినిచెప్పినట్లహంకారుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అహం—ఓహో! ఈనగర మంతయు మూర్ఖమయ మయి యున్నది. ఎట్లన—

చ. గురుమాతమా న్వినంగఁడు; గోష్ఠికుమారిలశాస్త్రరీతిఁ గానరు; ఘన రాప్రభాకరేఁ డోనర్చునబోధ; యుఁకేల దేవతాగురుకథ? శేషుభాష్యమును గోరరు; సూక్ష్మపదార్థతత్త్వముల్ నరపశువుల్ గ్రహింపరు; తలంపరు పాశుపతంబు స్వప్నమై.

(చూచి) వీ రర్ఘజ్ఞానశూన్యులు; కేవల స్వాధ్యాయపరులు; వేదములను నీటఁ గలుపు చున్నారు. (మగలి మఱియొక చోటికినడచి) వీరు భిక్షులలో అనేకవిధములను గ్రహించినారు; శిరోముండనమును చేసికొన్న యీపండితంమన్యులు వేదాంతశాస్త్రమును బాడుచేయుచున్నారు. (నవ్వి)—

గీ. మహిని బ్రత్యక్షముఖ్య ప్రమాణసిద్ధ
ఘనవిరుద్ధార్థములు వీరు జనములకును
బోధ చేయుచునుండఁగఁ, బుడమిమీఁద
బౌద్ధవాదులకడఁ గలపాప మేమి?

ఇట్టి వీరిసంభాషణము విన్నను మహాపాతకము సంభవించును. (మరల మఱియొకచోటికి నడచి) వీరు కష్టపడి తర్కమతము నభ్యసించిన శైవపాశుపతాదులు ఈపాషండులు కేవలపశువులే. వీరితో సంభాషించినవారు సహితము నరకమునపా లగుదురు. అందుచేత వీరిని దృష్టిపథమునుండి దూరముగాఁ బరిహరిం పవలయును. (మరల మఱియొక చోటికి నడచి)—

ఉ. అల్లదె గంగయొడ్డు శిలలందుఁ గుశాస్తరణోపవిష్టులై,
యల్లన దర్భముష్టియుతహస్తము లొప్పఁగఁ, బూజపెట్టె ల
ల్లల్లన నిల్పి, పూస లెగయుం గొనవ్రేళుల నక్షమాలికల్
పెల్లుగఁ ద్రిప్పుచున్, ధనికవిత్తములన్ హరియింత్రు దాంభికుల్.

(మరల మఱియొకచోటికి నడచి) వీరు త్రిదండి వేషములచేత జీవనము చేసెడు ద్వైతాద్వైతమార్గపరిభ్రష్టులు. (మరల వేఱొకచోటికి నడచి చూచి) ఓహో! ద్వారసమీపమునందు నాటిన నిడుదలగు వెదురుగడలకుఁ గట్టియున్న తెల్లనిసూక్ష్మవస్త్రసహస్రములు పయిని తాండవ మాడుచుండఁగా, క్రిందనందందుఁ గృష్ణాజినములును సన్నకండ్లును యజ్ఞపాత్రములును జపాలములును ఱోళ్లును రోకళ్ళును బ్రకాశింపఁగా, నిరంతరహుతాజ్యవాసనతో నిండినధూమములచేత గగనమండల మంతయు నల్లపడఁగా గంగాసమీపమునందు బ్రకాశించుచున్న యీయాశ్రమపద మెవ్వరిదయి యుండును? ఇది నిశ్చయముగా నెవ్వరిదో యొకవృద్ధగృహస్థుని గృహమై యుండును.

కానిమ్ము. అతిపవిత్రమైనయిది నేను రెండుమూడుదివసములు వాసము చేయుటకు యోగ్యమైయునదిగాం గప్పడు చున్నది. (అని ప్రవేశించి చూచి) ఆహా!

చ. ఉదరమునన్ భుజంబులను నూరువులన్ గళమందు బొమ్మునన్
బెదవులఁ జెక్కులన్ నుదుట వీపున గడ్డమునందు జానులన్
బదునుగ బొట్లుపెట్టి, కటిఁ బాణులఁ గర్ణములందు జుట్టునం
దుదుటున దర్భలుంచి, యితఁడొప్పెడు దంభము రూపమొందెనాన్.

మంచిది. నేనతనిసమీపమునకుఁ బోయెదను. (సమీపమునకుఁ బోయి) నీకు శుభ మగునుగాక!

దంభు—(హుంకారముచేత నాతని నదలించు చున్నాఁడు.)

వటుఁడు—(ప్రవేశించి తొట్రుపాటుతో) ఓబ్రాహ్మణుఁడా! దూరముగా నిలుచుండు. పాదప్రక్షాళనము చేయక యీయాశ్రమ పదములు ద్రొక్కఁగూడదు.

అహం—అయ్యో! నేనెక్కడనో పాపతురుష్క దేశమునకు వచ్చినాఁడను. ఇక్కడ శ్రోత్రియు లయినయతిథులను గృహస్థులాసనపాద్యాదులచేత నయిన నెనరుగాన రున్నారు.

దంభు—(చేసైఁగచేత నూఱడించుచున్నాఁడు.)

వటు—దూరదేశమునుండి వచ్చిన మీకులశీలాదికమును జక్కఁగా విచారింపు మని మాగురువులవారాజ్ఞాపించుచున్నారు.

అహం—ఏమీ! ఇప్పుడు మాకులశీలాదికమునుగూడఁ బరీక్షింపవలయునుగా? వినుము—

ఉ. ఉత్తమమువ్వ గౌడమహిం; యుత్తమమందును రాఢికాపురం;
బుత్తమమందు శ్రేష్ఠికుల; ముత్తముఁ డందును నాదుతండ్రిః స

ర్వోత్తము లెన్నఁ దత్తనుజు; లుత్తముఁడంగదు నేను వారిలో
నుత్తమబుద్ధిధైర్యవినయోరువివేకసుశీలతాదులన్.

దంభు—(వటునివంకఁ జూచుచున్నాఁడు.)

వటు—(తామ్రకలశమునుపట్టుకొని వచ్చి) దేవా! పాదశౌచ
మును జేసికొండు.

అహం—(తనలో) కానిమ్ము. ఇట్లు చేసికొనుటవలన దోష
మేమున్నది? (అలాగునఁ జేసి దాపునకు వచ్చుచున్నాఁడు.)

దంభు—(పండ్లుకొఱికి) నీవు దూరముగా నిలుచుండు. గాలి
తోఁ గలిసి చెమటబిందువులు మామీఁదికి వచ్చును.

అహం—ఓహో! ఈబ్రాహ్మణ్య మపూర్వ మయినదిగా
నున్నదే.

వటు—ఓబ్రాహ్మణా? అందును సందేహమేమి? వీరి
సన్నిధిని—

గీ. పూజ్యపాదాబ్జయుగళంబు ముట్టుకొనక,
భక్తిఁ బీఠాంతభూతల భాగమునకె
స్వీయచూడామణి మరీచివితతిచేత
నృపతివరులు నీరాజనం బిడుదు రెపుడు.

అహం—(తనలో) ఈ దేశము కేవలదాంభికుల కనుకూల
మయినది. కానిమ్ము. ఈపీఠముమీఁద గూరుచుండెదను.

(అని కూరుచుండఁ బోవుచున్నాఁడు.)

వటు—ఆరాధ్యపాదులవారి యీపీఠము నన్యులాక్రమింపఁ
గూడదు.

అహం—ఓరి పాపాత్ముఁడా! దక్షిణరాఢాదేశమునప్రసిద్ధుల

యిన మా వంటి పరిశుద్ధులుసహిత మీ పీఠము నెక్కఁదగరా? ఓరి మూర్ఖా! మా కులశీలములు వినుమా—

ఉ. మాత మహాకులీన ; మఱి మత్సతి శ్రోత్రియపుత్రి; యాటనే
బూతుఁడఁ దండ్రికంటె; విన పూర్వము మత్సతియన్న మిత్రుఁస
న్మాతులపుత్రిమీఁద సనుమాత్రిమబద్ధపునింద రా, నప
ఖ్యాతపుబాంధవం బసి ప్రియాంగనఁ బోనిడి నైతి శుద్ధుఁడన్.

దంభు—ఓబ్రాహ్మణా! అదియంతయు నట్లేయయియుం డును, అయినను నీకు మావృత్తాంతము తెలియదు.

చ. మను పొకసారి బ్రహ్మపురముం గనివచ్చుట కేను బోవఁగా,
మునివరులాత్మ పీఠచయముం డిగి రెల్లరు నన్నుఁ జూచి; యా
వనజభవుండు నన్నుఁ బ్రియభాషలఁ దేఁటిచి, శుద్ధిగాఁగ ది
గ్గున నుపవిష్టుఁ జేసె నవగోమయలిప్తనిజోరుపీఠికన్.

అహం—(తనలో) ఆహా! ఏమి యీ దాంభికబ్రాహ్మణుని యత్యుక్తి (ఆలోచించి) ఇతఁ డొకవేళ దంభుఁడే యేమో? అయి నంగానిమ్ము. (కోపముతో బిగ్గరగా) ఓరీ! నీ వేల గర్వపడెదవు!

చ. శతముఖుఁ డెంతవాఁడు? మఱి సారసగర్భుఁ డనంగ నెంత? యీ
క్షితిపయి నేమిలెక్క మునిసింహులు? లెఱుంగవు నీవుమత్తప
స్సతమహిమంబు వాసవశతంబును బ్రహ్మశతంబు పోనిరా
ట్సతమును గూలలేదె వరుసన్ గతిగానక నేను జూడఁగన్.

దంభు—(చూచి సంతోషముతో) ఓహో! అయ్యా! మీరు నాపితామహులైన యహంకారులు. దేవా! లోభుని యాత్మజుఁడ నయిన దంభుఁడను నేను మీకు నమస్కారము చేయుచున్నాను.

అహం—వత్సా! దీర్ఘాయుష్మంతుడవుకమ్ము. నేను ద్వాపరాంత్యమునందుఁ జూచినప్పుడు నీవు బాలుఁడవు. చిరకాలమైనందున

యుండుటచేతను వార్ధక్యగ్రస్తుఁడ నగుటచేతను నిన్నిప్పుడు తిన్నగా గుఱుతుపట్టలేక పోయినాఁడను. మఱి నీకుమూఁడయిన యసత్యునకుఁ గుశలమా?

దంభు—అతఁడు క్షేమముతోనున్నాఁడు. అతఁడును మహామోహమహారాజుగారి యాజ్ఞననువర్తించుచు నిక్కడనే యున్నాడు. అతనిని విడిచి నేనొక్క ముహూర్తకాల మయినను బ్రాణములు నిలుపఁ గలుగుదునా?

అహం—నీతల్లిదండ్రులయిన తృష్ణయు లోభుఁడును గుశలులయియున్నారా?

దంభు—వారును నిక్కడనే యున్నారు. వారులేక నేనుక్షణమయినను నిలువలేను. పూజ్యులయిన తమరిక్కడ కేమిపనిమీఁద దయచేసినారు?

అహం—వత్సా! వివేకునివలన మహామోహున కేమోయుపద్రవము కలుగనున్నదని విని యాతని వృత్తాంతమును దెలిసికొనవలెనని వచ్చినాను.

దంభు—తమరాక మేలయినది. మహామోహమహారాజుగారిందిరలోకమునుండి నేటరేపటనిచ్చటకే వచ్చుచున్నారని విన్నాను. ఆయన యీవారణాసీనగరమునే రాజధానిగాఁ జేసికొందురనియు నొకలోకప్రవాదము పుట్టినది.

అహం—సమస్తాత్మలయందును వాసముచేసెడు మహామోహుఁడీవారణాసియం దుండఁగోరుటకుఁ గారణమేమి?

దంభు—మఱియేమున్నది? వివేకుని నడ్డగింపవలయుననియే.

గీ. శాశ్వతబ్రహ్మపురి కాశి, జన్మభూమి
యువని విద్యాప్రబోధోదయముల కరయఁ;

గులవినాశనవిధి కెత్తుకొన్నయావి
వేకుఁడింటకుండఁ గోరెదు విడువ కెపుము.

అహం—(భయముతో) అట్లయినపక్షమున దీనికిఁ బ్రతీకార మవశ్య మైనదే. ఎట్లనిన—

క. పురహరుఁడు హరుఁడు కరుణం
బరమపదజ్ఞానశూన్యమానవతతి కి
ప్పురి భవభయహర తారక
మురవుగ నవసానవేళ నుపదేశించున్.

డంభు—అది సత్యమే. అయినను గామక్రోధాద్యభిభూతుల కది లభింపదు. దానినిబట్టియే త్రైర్థికు లిట్లు చెప్పుచున్నారు—

క. విద్యా తపో యశస్సుల
హృద్యముగఁ గరంబు లంఘ్రుఘు లెదయు నెవని క
య్యాద్యుని శివుఁ జేరునో యన
వద్యత నాతండె తీర్థఫలమును బొందున్.

[ తెరలో ]

ఓహో! జనులారా! ఇదె మహామోహమహారాజుగారు వచ్చుచున్నారు.

చ. స్ఫటికమణీవితర్దికలఁ జల్లుఁడు చందనగంధతోయముల్;
పటుగతి యంత్రమార్గములు పన్నుఁడు వారిగృహాంతరంబులన్;
స్ఫుటముగఁ గట్టుఁ డెల్లెడల భూరిలసన్మణితోరణావళుల్;
చిటుకున నింద్రచాపసమచిత్రపతాకల నెత్తుఁ డంతటన్.

డంభు—అయ్యా! మహారాజుగారు సమీపమునకువచ్చినారు. కాఁబట్టి మీరాయన కెదురుగాఁబోయి గౌరవింపవలయును,

అహం—అలాగుననే చేయుదుము.

(ఇద్దఱును నిష్క్రమించు చున్నారు.)

ఇది ప్రవేశకము.



[అప్పుడు మహామోహమహారాజుగారు మహావైభవముతోఁ బరివారసహితముగాఁ బ్రవేశించు చున్నారు.]

మహామోహుఁడు—(నవ్వి) ఓహో! మూఢులు నిరంకుశులు గదా!

చ. కలదఁట! యాత్మయొక్కటి జగంబున దేహముకంటె వేఱుగా!
ఫలమది మీఁదఁగాంచునఁట! భద్రముగాఁ బరలోకమందహో!
వలవని యూదుఃరాశియు నభస్తరురాజము పూచి స్వాదున
త్ఫలముల నిచ్చునన్న భ్రమవంటిది కాదె తలంచి చూడఁగన్!

ఇటువంటి స్వకపోలకల్పనముచేత లేనిపదార్థము నొకదానిని నిర్మించి దుష్పాండిత్యము గలప్రబుద్ధు లీప్రపంచమును వంచించు చున్నారు.

శా. అహ! లేనిపదార్థ మున్నదని మిథ్యల్ పల్కనయ్యాస్తిక
ద్రోహుల్ నాస్తికులంచు దూష్యులనుచున్ దూషింత్రు సత్యా
మాహాత్మ్యస్థితిఁ బంచభూతపరిణామంబౌచు జైతన్యసం [ధ్యులన్
దోహం; బెవ్వరు దేహభిన్నునిఁగ నెందుం జూచిరే జీవునిన్!

వీరు తమ్ముమాత్రమే కాక లోకమునంతను వంచించు చున్నారు.

మ. తనువుల్ వక్త్రముఖాంగసంచయముచేతన్ దుల్యముల్ కాఁగ, వే
అన నేలా కులముల్! పరాంగన యిదన్యార్థం బిదన్ భేదముల్
గనరా వింతయు నాకు! హింసఁ బరకాంతాస్వాపతే యాక్రమం
బును దోషంబని కల్పనల్ సలిపిరింపుల్ పుట్ట నిష్ఫారుషుల్,

(ఆలోచించి శ్లాఘనతో) ప్రత్యక్షమే ప్రమాణమగుటనుబట్టిసర్వవిధములచేతను లోకాయతశాస్త్రమే శాస్త్రము. "పృథివ్యాపస్తేజోవాయువులు తత్త్వములు; అర్థకామములు పురుషార్థములు; భూతములే జ్ఞానజనకములు; పరలోకము లేదు; మృత్యువే మోక్షము" అని యీశాస్త్రము నస్మదీయాభిప్రాయానుసారముగా వాచస్పతి రచియించి చార్వాకునికి సమర్పించెను. అతఁడు శిష్యోపశిష్యమార్గమున దానిని లోకమున వ్యాపింపఁజేసెను.

[అంతటఁ జార్వాకుఁడును శిష్యుఁడును బ్రవేశించుచున్నారు.]

చార్వా—వత్సా! నీవెఱుగుదువు దండనీతియే విద్య; దానిలో నంతర్భూతమయిన దేవార్త. త్రివేదములును ధూర్తప్రలాపములు చూడుము—

గీ. యజ్వలకు ద్రవ్యనాశక్రియాదికంబు
వలన స్వర్గఫలంబది వచ్చునేని,
ధరణిలో దావవహ్నిదగ్ధంబులైన
పాదపంబులవలనను ఫలము లొదవు.

మఱియును,

గీ. పుడమిలో యజ్ఞమునఁ జంపఁబడెడునట్టి
పశువునకు స్వర్గసౌఖ్యంబు వచ్చునేని,
యజ్ఞపశువునుగాఁ జేసి యజ్ఞకర్త
స్వర్గసుఖమందఁ దనతండ్రిఁ బనుపరాదె!

క. మరణము నొందిననరులకుఁ
గరమును శ్రాద్ధంబు తృప్తిఁదలిగించెడుచో,
ధర నాఱిన దీపంబున
కురుకాంతిని దైలదానము త్పాదించున్.

శిష్యు—ఆచార్యా! ఈప్రకారముగాఁ బురుషులకుఁ దినుటయుఁ ద్రాగుటయునే పరమార్థములయినపక్షమున, ఈ తైర్థికులు సంసారసుఖమును విడిచి యేల తాము ఘోరతరములయిన పారాక సాంతపనషష్ఠకాలాదు లగుదుఃఖములచేత శ్రమ పడుచున్నారు?

చార్వా—వంచకప్రణీతములయిన యాగములచే మోసపోయిన యీమూర్ఖుల కాశామోదకములచేతనే యిట్టితృప్తికలుగుచున్నది. చూడు—

గీ. భుజపీడితఘనబాహుమూలభుగ్న
కుచయుగాభోగకాంతోపగూహ మేడ?
భ్రష్టబుద్ధులభిక్షోపవాసనియమ
సూర్యకరతాపమున దేహశోష మేడ?

శిష్యు—ఆచార్యా! దుఃఖమిశ్రితమయిన సంసారసుఖము పరిహసింపఁ దగనిదని యీవిధముగాఁ దైర్థికులు చెప్పుచురుగదా?

చార్వా—(నవ్వి) ఇది యీనరపశువులయొక్క దుర్బుద్ధివిలసనము.

చ. అవనిని దుఃఖమిశ్రితములౌటను నింద్రియజన్యసౌఖ్యముల్
తివిరి త్యజింపఁబోలు ననుధీరులు మూర్ఖులె కాతలంపఁగన్
జవిగల తెల్లబియ్యమున సారతరంబగుశాలిధాన్యమున్
దవులఁ ద్యజించునే యుముకఁ దాల్చునటంచు వివేకియెవ్వఁడున్

మహామోహు—ఓహో! చిరకాలమునకుఁ బ్రామాణికములయిన వచనములు కర్ణసుఖమును గలిగించుచున్నవిగదా! (చూచి యానందముతో) ఇతఁడు నాప్రియసఖుఁడయిన చార్వాకుఁడా?

చార్వా—(చూచి) ఇతఁడు మహామోహమహారాజు. (సమీపమ

మునకుఁబోయి) జయమగుఁగాక! జయమగుఁగాక ! ఓమహారాజా !
ఇదిగో చార్వాకుఁడు ప్రణామము చేయుచున్నాఁడు.

మహా—చార్వాకా! నీకు స్వాగతము. ఇక్కడఁ గూరుచుండుము.

చార్వా—(కూరుచుండి) ఇది కలియొక్క సాష్టాంగ ప్రణామము.

మహా—అచ్చటఁ గలి కవ్యాహతకుశలమా ?

చార్వా—దేవరవారి ప్రసాదమువలన సర్వత్ర కుశలమే. అతఁడు కార్యశేషమును గూడఁ దీర్చి మఱి దేవరపాదములనుసందర్శింపఁగోరుచున్నాఁడు.

చ. ఎవఁడు, మహత్తరంబయిన యేలికయాజ్ఞనుబూని దాని శా
స్త్రవహనంబుఁ గొన్న నపి, తత్కృపాలబ్ధసుఖ ప్రసాదుఁడై,
యవిరళహర్షపూర్ణహృదయంబున దర్శనమిచ్చుస్వామిపా
దవనజవందనంబిడు, నతండతిధన్యుఁడు భృత్యకోటిలోన్.

మహా—ఇప్పుడా కలి యేమేమి చేసియున్నాఁడు?

చార్వా—దేవా! చిత్తగింపుము—

చ. శ్రుతివిహితార్థమార్గములచొప్పు తొలంగి మహాజనుల్ యథే
ష్టతఁ జరియించువారయిరి జంకును గొంకు నొకింత లేక; యీ
గతికిని హేతువా కలియుఁగాఁడు, మదీయబలంబుఁ గాదు, వి
శ్రుతముగఁ బౌరుషంబుఁ బెనుచుం బ్రభుమన్ననయే భటాళికిన్.

అక్కడ నుత్తరపథికులును బాశ్చాత్యులును వేదములనే త్యజించినప్పుడిఁక శమదమాదులకథ యేల? ఇతరస్థలములయందు సహితము వేదములు తఱుచుగా జీవికామాత్రఫలములే యైనవి.

గీ. అగ్నిహోత్రంబు, వేదత్రయంబు, మఱి త్రి
దండమును. దేహమున భస్మధారణంబుఁ,
బ్రజ్ఞయును బౌరుషము లేనిపందలకును
జీవిక లని బృహస్పతి చెప్పె మున్ను.

కాఁబట్టి కురుక్షేత్రాదులయందు విద్యా ప్రబోధచంద్రోదయ మగునని దేవరవారు స్వప్నావస్థయందును శంకింపవలయు.

మహా—చక్కఁగా సాధించినారు. అతీర్థమును వ్యర్థమయిన వానినిగాఁ జేయుట గొప్పపనికదా?

చార్వా—దేవా! దేవరవారికి విన్నవింపవలసినది మఱి యొకటియున్నది.

మహా—అది యేది?

చార్వా—విష్ణుభక్తియను పేరుగల మహానుభావురాలయిన యోగిని యొకతెయున్నది. ఆమె సర్వత్ర సంచారము చేయకుండఁ గలిచేత నిలుపఁబడిన దయ్యును, తదనుగ్రహీతులయినవారిని దేఱి చూచుటకును మేము శక్తులము కాకున్నాము. కాఁబట్టి దానికిఁ బ్రతీకారమును దేవరవారే సావధానముగా నాలోచింపవలయును.

మహా—(భయముతోఁ దనలో) అక్కటా ప్రసిద్ధమహాప్రభావ మైన యాయోగిని మాకు స్వభావవిద్వేషిణి; దుస్సాధ్యురాలు. గానిమ్ము. (ప్రకాశముగా) ఓయీ! మనకీశంకతోఁ బనిలేదు. కామ క్రోధాదులగు శత్రువులముందఱ దానిపని యెక్కడసాగును?

చార్వా—అట్లయ్యును శత్రుఁడల్పుఁడని జిగీషుఁడైనవాఁ డుపేక్షించియుండఁగూడదు.

క. అరి యల్పుఁడయ్యు, మర్మము
లరసి మహాబాధఁ దెచ్చు నవనీశునకున్;

గర మల్ప మయ్యా, ముల్లది
చగణమున కపారమైగ్రమ మొనరించున్.
మహా—(తెరవంకఁజూచి) ఓరీ ఎవఁ డక్కడ!

[దౌవారికుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దౌవా—స్వామీ! ఏమియాజ్ఞ?

మహా—ఓరీ! అసత్సంగా! "ఏమఱియుండక యోగినియైన విష్ణుభక్తిని మీరే హతముచేయవలెను" అని కామక్రోధమదమాన మాత్సర్యాదులతో నేనాజ్ఞాపించినట్లు చెప్పుము.

దౌవా—దేవర సెలవిచ్చినట్లు చేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అప్పుడు పత్రహస్తుఁడై యొకపురుషుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

పురు—(తనలో) సముద్రతీరమునందలి పురుషోత్తమసంజ్ఞ గల దేవాలయమునందున్న మద మాన నామధేయులగు ప్రభువులు మహారాజసన్నిధానమునకుఁ బంపఁగా నేనిప్పు డుత్కలదేశమునుండి వచ్చినాఁడను. (చూచి) ఇదివారణాసి; ఇదిరాజమందిరము. ఇంకుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి) ఈప్రభువువారు చార్వాకునితో నేదో మంత్రాలోచన చేయుచుఁ గూరుచున్నారు. వీరిసమీపమునకుఁ బోయెదను. (సమీపమునకుఁబోయి ప్రకాశముగా) దేవా! జయ మగుఁగాక! జయమగుఁగాఁక! తమకుఁ బంపఁబడిన యీపత్రికను దేవరవారు చిత్తగింపవలయును.

మహా—(పత్రికపుచ్చుకొని) నీవెక్కడనుండి వచ్చినావు?

పురు—పురుషోత్తమాలయమునుండి వచ్చినాఁడను.

మహా—(తనలో) ఇది యేదో ప్రాణాంతక మయినకార్య మయి యుండును. (ప్రకాశముగా) చార్వాకా! ఇప్పుడు నీవు పొమ్ము.

కర్తవ్యమునందు నీవవహితుఁడవయి యుండవలెను.

చార్వా— దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

మహా— (పత్రికను జదువుచున్నాఁడు)— "స్వస్తి! శ్రీవారణాసీపురవరాధీశ్వరు లైనమహారాజాధిరాజ రాజపరమేశ్వర మహామోహ మహారాజులవారి పాదపద్మములకు శ్రీపురుషోత్తమాలయమునుండి మదమానులు సాష్టాంగప్రణామములు చేసి చేయఁగల విన్నపము. ఇక్కడ మేము నిరంతరక్షేమముతో నున్నాము. తరువాత శాంతి దేవి తనతల్లియైనశ్రద్ధతోఁగూడ వివేకునిదౌత్యమును బూని యుపనిషద్దేవిని వివేకునితోడి సంగమమునకై యహర్నిశమును బ్రబోధించుచున్నది. మఱియు ధర్ముఁడు కామసహచరుఁడయ్యును వైరాగ్యాదులచేత వేఱుపఱుపఁబడినవానివలెఁ గానఁబడుచున్నాఁడు. అందుచేత నతఁడు కామునినుండి విడిపోయిరెయి కానొకప్పుడు నిగూఢముగాఁ దిరుగుచున్నాఁడు. కాఁబట్టి యీసంగతిని దేవర దివ్యచిత్తమునకుఁ దేవలెను"— (క్రోధముతో) ఆహా! ఏమిది? ఈయతిముగ్ధులు శాంతికిసహితము భయపడుచున్నారు! ఈశాంతి యెక్కడనుండి పుట్టినది?

చ. అజుఁ డగు సృష్టిమాత్రనిరతాత్ముఁడు; దక్షమఖాంతకుండు శై
లజకబిడోపగూహనములన్ సుఖయించు విఘూర్ణితాక్షుఁడై;
ఋజువుగ శ్రీకపోలమకరీదళలాంఛితవక్షుఁడై యధో
క్షజుఁడు వసించు నంబుధి; నిఁకన్ బెఱవారికి శాంతి యబ్బునే?

(పురుషునిగూర్చి) ఓజాల్మా! నీవు సత్వరముగాఁ గామునిదొద్దఁకుఁబోయి, "ధర్ముఁడు దురాత్ముఁడని మేమిప్పుడు దెలిసికొన్నారము, అతఁడు మహాపాతకాల మయిననునమ్మఁదగినవాఁడు కాఁడు,

కాఁబట్టి నీ వాతనిని దృఢముగా బంధించి కట్టివేయుము" అని మాయాజ్ఞను జెప్పెను.

పురు—దేవర సెలవిచ్చినట్లు జేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

మహా—(ఆలోచించి తనలో) శాంతిని సాధించుట కేమియుపాయ మున్నది? ఉపాయాంతరములోఁ బసిలేదు. ఈపని కిక్కడ క్రోధలోభులే సమర్థులు. (ప్రకాశముగా) ఎవ రక్కడ?

దావా—(ప్రవేశించి) దేవా! ఏమియాజ్ఞ?

మహా—ఇప్పుడే క్రోధునిని లోభునిని బిలుచుకొని రా.

దావా—దేవర సెలవిచ్చినట్లు చేసెదను.

[అంతట క్రోధుఁడును లోభుఁడును బ్రవేశించు చున్నారు.]

క్రోధు—శాంతి శ్రద్ధా విష్ణుభక్తులు మహారాజుగారితో వైరమును వహించినారని విన్నాఁడను. నేను జీవించి యుండఁగానే తమప్రాణములమీఁదికి వచ్చెడి యీపని యేల?

ఉ. చేయుదు లోక మంధముగఁ; జేయుదు ధీరుల శ్రోత్రహీనులన్;
జేయుదుఁ జేతనంబుల నచేతనరీతిని; నాదుశక్తిచే
నేయెడఁ గృత్యముల్ గన రొకింత, హితంబు వినంగఁజాల, రా
మ్నాయము లభ్యసించి మతిమంతులు తాము స్మరింపరర్థమున్.

లోభు—ఓయీ! నన్నాశ్రయించువారు మనోరథనదీపరంపరలనే తరింపఁ జాలరు. అట్టివారు శాంత్యాదుల నెట్లు చింతింపఁ గలుగుదురు? మిత్రుఁడా! చూడు—

చ. మదజలసిక్తగండగజమండలియున్, ఘనవాయువేగమున్
గొదవరయొనర్చు పర్వఁగలగుఱ్ఱములున్, గల నెన్నొ మాకు, నర్థ

బద యిది చాలదంచు, మఱివచ్చిన నింకను నింకఁ గోరుచుఙ్
బాదలుచురాశ హృద్భ్రమముఁ బొందెడువారికి శాంతిగల్గునే!

క్రోధు—ఓ మిత్రుఁడా! నాప్రభావము నీకుఁదెలియునుగదా!

చ. చదివెను వృత్రుఁద్వష్టసుతు శక్రుఁడు; త్రుంచెవిరించిమూర్ధమున్
మదనవిరోధి; కౌశికుఁడు నామ మడంచె వసిష్ఠపుత్రులఙ్;
మ దసమశక్తి పండితుల మాన్యయశస్కుల సచ్చరిత్రులఙ్
సదమలపౌరుషాఢ్యుల వెసం గులనాశ మొనర్చి త్రేల్మిడిఙ్.

లోభు—ప్రియులారా! తృష్ణా! ఇటు రమ్ము.

[తృష్ణాదేవి ప్రవేశించు చున్నది.]

తృష్ణ—ప్రాణేశ్వరా! ఏమి యాజ్ఞ!

లోభు—ఓ ప్రియురాలా! వినుము.

చ. పొలమును గ్రామముఙ్ వనముభూద్రముఁబట్టణముం బురంబుదీ
వులు మహిమండలం బనెడుప్రోత్థితవాంఛితసూత్రబద్ధబు
ద్ధుల కతికాంక్ష నంగములు, తోరముగాఁగ భవత్ప్రసన్నతన్
బలిసినఁ, బుట్టునే శమము ప్రాణులయాశ కజాండలక్షలన్.

తృష్ణ—ఓప్రాణనాయకా! స్వాయముగానే నిత్యమును నే నీవనియం దభిరుక్తురాలనయి యున్నదానను. అందుమీఁద నిప్పుడు తమయాజ్ఞచేత బ్రహ్మాండకోటులచేతనైనను నాయుదరమునిండదు.

క్రోధు—ఓహింసా! ప్రియురాలా ఇటు రమ్ము.

[హింసాదేవి ప్రవేశించు చున్నది.]

హింస—ఇదిగో వచ్చినదానను. భర్తగారిసెల వేమి!

క్రోధు—ప్రియురాలా! నీవు సహధర్మచారిణి వగుటచేత నాకుఁ బితృవధసహితము సుకర మయినది. నాకు—

ఉ. ఎంత పిశాచి మాత! పిత యెంత! సహోదరు లెంత కీటముల్!
వంతుగ సర్వబంధువులు వధ్యులు వక్రవిటాభసౌహృదుల్;
(చేతులు పిసికికొనుచు)
శాంతిని బొంద వీరియెడల సంతతకోపశిఖిస్ఫులింగముల్,
సంతతితోడఁ బూర్ణముగ జ్ఞాతికులంబు నడంచునంతకున్.
(చూచి) వీరె మనప్రభువువారు. వారిదర్శనము చేసికొందము.

అందఱు—(సమీపమునకుఁబోయి) దేవా! జయమగుఁగాక!

మహా—మాకు శత్రురాలయిన శ్రద్ధకూతును శాంతిని మీరు నిగ్రహింపవలెను.

అంద—దేవరయాజ్ఞాప్రకారము చేసెదము.

(అని నిష్క్రమించుచున్నారు)

మహా—శ్రద్ధకూఁతురని పలుకుటచేత నామనస్సున కొక్కయుపాయాంతరముసహితము పొడకట్టుచున్నది. శాంతి తనతల్లియైన శ్రద్ధకుఁ బరతంత్రురాలు. కాఁబట్టి యిప్పుడు మన మేయుపాయము చేతనైనను శ్రద్ధ నుపనిషద్దేవిసమీపమునుండి యాకర్షించి బంధించి వేయవలెను. అప్పుడందువలన మాతృవియోగదుఃఖముచేత నత్యంత మృదుస్వభావ యయిన శాంతి బలముడిగినదయి కృశించి నశించును. శ్రద్ధ నాకర్షించి యెడఁబాటు చేయుటకు నాస్తికతావిలాసిని యే పరమసమర్థురాలు, కాఁబట్టి యామె నీ యాపనికి నియోగింపవలెను. (ప్రక్కనుజూచి) విభ్రమావతీ! నీవుసత్వరముగా నాస్తికతాదేవిని బిలుచుకొనిరా.

విభ్ర—ఏలినవారి సెలవుప్రకారము చేసెదను. (అని నిష్క్రమించి నాస్తికతాసహితయై మరలఁ బ్రవేశించుచున్నది)

నాస్తి—సఖీ! చిరకాలమునుండి చూడకున్న మహారాజు

ముఖమును నేనిప్పు డెట్లుచూతును? అతఁడు న న్నెగ్గులాడు నేమో!

విభ్ర—సఖీ! నీముఖదర్శనముచేత మహారాజు తనదేహమే తా నెఱుఁగకుండును. అట్టిస్థితిలో నిన్నెట్లెగ్గులాడఁ గలుగును?

నా స్తి—సఖీ! నామిథ్యాసౌభాగ్యము నెంచి పరిహసించుచున్నావా?

విభ్ర—సఖీ! నీ సౌభాగ్యముయొక్క మిథ్యాత్వమును నీ విప్పుడే తెలిసికోఁగలవు. సఖీ! నీకన్నులు నిద్రచాలక కలతనొందినట్లు కానఁబడుచున్నవి. ఇట్లు నాప్రియసఖనేత్రములకు నిద్రతక్కువగుటకుఁ గారణమేమో?

నా స్తి—సఖీ? ఏకవల్లభయైన స్త్రీకిసహితము నిద్ర దుర్లభమగుచుండఁగా, బహువల్లభనైన నాకెట్లుండును?

విభ్ర—నాప్రియసఖికి వల్లభు లెవ రెవరో?

నా స్తి—ఈ మహారా జొకఁడు. ఆపయుని గామక్రోధలోభాహంకారులు. అతివిస్తారము చెప్పఁబస లేను. ఈవంశమునందుఁబుట్టిన పురుషుఁడు పసివాఁడైనను ముసలివాఁ డయినను బహుగువాఁడయినను రాత్రిందివము లొక్కఁడును హృదయవాసినినైన నన్నువిడిచి యుండఁడు.

విభ్ర—సఖీ! కామునకు రతియు, క్రోధునకు హింసయు, లోభునకుఁ దృష్ణయు, పరమప్రియురాండ్రని వింటిమి. తమ ప్రియతములతో నిత్యమును రమించుచుండెడు నీపయుని వారి కీర్ష్య యెట్లు కలుగకున్నది?

నా స్తి—సఖీ! ఈర్ష్య యని యేలపలికెదవు? వారుసహితము నన్ను విడిచి ముహూర్తకాల మయినను నిలువలేరు.

విభ్ర—సఖీ! నీసౌభాగ్యమువలన మనోవ్యాకులత నొందు

వలసిన సవతులు సహితము నీయనుగ్రహమును గోరుచుండుటచేత నీ భూమిమీఁద నీవంటిసౌభాగ్యవతి లేదని చెప్పుచున్నారు. సఖీ! ఇం కొకమాట చెప్పెదను. ఈవిధముగా నీవు నిద్రాకులహృదయవయి తొట్రిలుకాళ్ళనుండి యందియలుజాఱి గల్లుగల్లుమని మ్రోఁగఁగా నడచుచు మహారాజును గౌరవించినప్పు డతఁడు మనస్సులో శంక పడునేమోయని నే నూహించెదను.

నాస్తి—ఇక్కడ శంకింపవలసినదని యేమున్నది? మహారాజు గారి నియోగానుసారముగానే నేనీవేషమును ధరించితిని. సఖీ! అంతే కాక దర్శనమాత్రముననే ప్రసన్నులగు పురుషులకు భయపడ నేల?

మహా—(చూచి) ఇదిగో నాప్రియురాలు నాస్తికత సమీ పించినది!

చ. నడలు నితంబగౌరవమునన్ జడనొందఁగఁ గొప్పువూసరం
బెసఁగుఁగఁ జెయ్యి నేడ్కఁ గరమెత్తి కుచోజనఖాంకముల్ బయ
ల్పడఁ, గడునల్లగల్వసఖుల న్నగుచూపు లెదం గలంపఁగా,
నడవఁగ నూఁగుకంకణరుచిచ్ఛ్యుతితో నదె కాంత వచ్చెడున్.

విభ్ర—అదిగో మహారాజు ప్రియసఖీ! ఆయన సన్నిధాన మునకుఁ బొమ్ము.

నాస్తి—(దగ్గఱకుఁబోయి) మహారాజా! జయమగుఁగాక! జయమగుఁగాక!

మహా—ఓప్రియురాలా!

క. అంకమునఁ జేరి, ప్రకటన
ఖాంక స్తనముల నొసంగు మాలింగనమున్
శంకయనొడిలో నుండిన
శాంకరిశోభావిలాససంపదఁ గనుమన్.

నాస్తి—(చిఱునవ్వుతోఁ గౌఁగిలించుకొనుచున్నది)

మహా—(ఆలింగనసుఖము నభినయించి) ఓహో! ఈ నీ కౌఁగిట నాదరించుటవలన నాకిప్పుడు మరల నవయౌవనము కలుగుచున్నది. ఓవిలాసినీ!

ఉ. నాదువయోనువిభ్రమమునన్ మును పెప్పుడొ కల్గి, మానసో
న్మాద మొనర్చి, యింద్రియకదంబసుఖైకరసాత్మఁ జేసి, ప్రే
మాదరమున్ జెనంచినయనంగవికారము నేఁడునీవు నన్
గాదిలిఁ గౌఁగిలించుటను గ్రమ్మఱఁ బుట్టి, మదాత్మ నిండెడున్.

నాస్తి—ఓమహారాజా! నేనిప్పుడు నవయౌవనదశలోనున్నను, నామనస్సులో నాటియున్న నీమీఁదిప్రేమము కాలము గడచుటచేత నహితము పోలేదు సుమా? ఏనిమిత్తముచేత దేవరవారు నన్నుఁ దలంచితిరో సెలవిండు.

మహా—ప్రియురాలా!

క. పడతీ! తలఁపఁగఁ జను మది
కెడముగ నున్నట్టివారి నెందైనను నీ
వెడఁబాయకుండు మెప్పుడు
చెడ కస్మచ్ఛత్రఛత్రచిత్రము పోలెన్.

నాస్తి—నాకిది మహాప్రసాదము. ఓమహారాజా! నాపని యేమో యాజ్ఞాపింపుఁడు.

మహా—ఈప్రకారముగాఁ బ్రకాశితములైన యంగములతో నీవు సర్వత్ర సంచరింపవలయును. ఇదిగాక తొత్తుకూఁతురు శ్రద్ధాకాంత వివేకునితో నుపనిషద్దేవిని గూర్చుటకయి దూతికాభావమును వహించినది.

గీ. మఱియుఁ బ్రతికూల; పాపుల మైత్రిఁ దిరుగు;
నకులజ; కరంబుఁ బాపాత్మురాలు శ్రద్ధ;
యిపుడె తలపట్టి యీ రండ నీడ్చి తెచ్చి
కినుకఁ బాషండులకు నొప్పగింపు మీవు.

నాస్తి—ఇంతమాత్రపుఁబనికిఁ బ్రభువువారికి శ్రమ యక్కఱ లేదు. వచనమాత్రముచేతనే దేవరవారిసేవకురాలగు శ్రద్ధ తమ యాజ్ఞను జెల్లించును. "ధర్మము మిథ్య; మోక్షము మిథ్య; వేదమార్గము మిథ్య; సుఖభంగకరము లయిన శాస్త్రప్రలాపములు మిథ్యలు; స్వర్గఫలవిద్య మిథ్య" అని నాచేత బోధింపఁబడి యీమె శీఘ్రకాలములో వేదమార్గమును పరిహరింపఁగలదు. ఇఁక నుపనిషత్తుమాట చెప్ప నేటికి! అంతే కాక విషయానందవిముక్తమని మోక్షవిషయమున దోషములు చూపి యచిరకాలములోనే శ్రద్ధను నే నుపనిషత్తునుండి విరక్తమగునట్లు చేసెదను.

మహా—ఇదియంతయు నిట్లు చక్కఁబడినపక్షమునఁ బ్రియురాలు నాకు గొప్పప్రియము చేసినదగును (అని మరల నాలింగనము చేసి ముద్దు పెట్టుకొనుచున్నాఁడు.

నాస్తి—అయ్యో! భర్తగారిట్లు బహిరంగముగాఁ బ్రవర్తించుటచేత నేను సిగ్గుపడుచున్నాను.

మహా—కానిమ్ము. మనము నివాసగృహమునకే పోవుదము రమ్ము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

# తృతీయాంకము



[అప్పుడు శాంతిదేవి కరుణతోడఁగూడఁ బ్రవేశించుచున్నది.]

శాంతి—(కన్నీరు విడుచుచు) హా! మాతా! శ్రద్ధా! నీవెక్కడ నున్నావు? నాకొక్కసారి నీప్రియదర్శనమిమ్ము.

మ. మృగముల్ భీతిఁదొలంగియుండువనులన్, హృద్యస్రవంతీలస
న్నగరాజంబుల, దేవతాగృహములన్, సన్మౌనిసద్మంబులన్,
జగతి న్వాసముచేయునీ వెటు లికన్, జండాలవేశ్మస్థమై
వగలంబొందెదుగోవుమాడ్కి, మనదే పాషండగేహంబులన్?

నాకామె జీవముతో నున్నదని యాశ లేదు.

క. ననుఁజూడక తా స్నానం
బొనరింపదు కూడుకుడువ దుదకముత్రాగన్
జన దట్టిశ్రద్ధ కటకట!
మనియుండదు నన్నుఁబాసి మహి నిమిషంబున్.

అందుచేత శ్రద్ధలేక శాంతియొక్క జీవనము ముహూర్తకాలమయినను నిరర్థక మయినదే యగును. కాఁబట్టి, ఓసఖి! కరుణా! నీవు నానిమిత్తమయి సొదపేర్పుము. అగ్నిహోత్ర ప్రవేశముచేత నేనచిరకాలములోనే యామె సహచరినయ్యెదను.

కరుణ—(కన్నీటితో) ఓసఖి! భయంకరాగ్నిజ్వాలలవంటికర్ణకఠోరములయిన దుస్సహవాక్యములు పలుకుచు సర్వవిధములచేతను నాప్రాణములు పోవునట్లు చేయుచున్నావు. ఓప్రియసఖీ! కొంతశాంతతవహించి ముహూర్తకాలము జీవము నిలుపుకొమ్ము. ఇంతలో నేనక్కడ మునిజనసమాకులములయిన పుణ్యాశ్రమములయం

మహామోహములనియెడి భీతిచేతఁ బ్రచ్ఛన్నయయి యామె యెక్కడ నైన దాఁగియుండును.

శాంతి—సఖీ! నీవేల వెదకెదవు?

శా. నీవారాంకితసైకతంబులు, సరిద్వంతీప్రతికూలంబులున్,
శ్రీవైఖానసవాసముల్, చమసబర్హిర్వ్యాప్త యజ్ఞస్థలుల్,
నే వీక్షించితి; నాలుగాశ్రమములన్ వేర్వేర శోధించితిన్;
దేవిన్ శ్రద్ధనుగాన నెందును; వినన్ లేదెందుఁ దన్నామమున్.

కరు—సఖీ! నేను జెప్పెడిదానిని వినుము. ఆ శ్రద్ధాదేవి సాత్త్వికురాలే యయినపక్షమున, ఆమె కటువంటిదుర్గతి పట్టునని నేను భావింపను. ఆమెవంటిపుణ్యాత్ము రాండ్రిటువంటిసంభావింపఁదగని విపత్తు ననుభవింతు వారు కారుగదా?

శాంతి—ఓచెలీ! విధి ప్రతికూలుఁడయినప్పుడేది సంభావింపఁదగని దగును?

మ. జనకేంద్రాత్మజ యాదశాస్యుకడ సాక్షాల్లక్ష్మి మున్నుండదే!
దనుజుల్ తొల్లి యిడంగ లేదె బలిసద్మంబందు వేదత్రయిన్!
ఘనగాంధర్వి మదాలసం గొనఁడె మున్ బాతాళకేతుండు నాఁ
జనుదైత్యేంద్రుఁడును మోసపుచ్చి? విధిచేష్టల్ తద్దయున్ విక్రముల్
కానిమ్ము. మనమిప్పుడు పాషండగృహములనే యనుసరించిపోదము.

కరు—సఖీ! అలాగుననే చేయుదము.

ఇద్దఱు—(నడుచుచున్నారు.)

కరు—(భయముతో) సఖీ! రాక్షసుఁడు.

శాంతి—ఏఁడీ రాక్షసుఁడు?

కరు—సఖీ! చూడుము. కాఱుచున్నమలపంకముచేత దట్టము

త్తుమ్మలైన కేశములతోను, దిసమొల యగుటచేఁ జూడఁగూడని రూపముతోను, చేత నొక నెమలిపింఛము పట్టుకొని వాఁడీవంకనే వచ్చుచున్నాఁడు.

శాంతి—సఖి! వీఁడు రాక్షసుఁడుగాఁడు. మిక్కిలిబలహీనుఁడుగా నున్నాఁడు.

కరు—వీఁడెవఁడయి యుండును?

శాంతి—సఖి! పిశాచమని శంకించెదను.

కరు—దేదీప్యమానమైన కిరణసముదాయముతో మార్తాండమండల మాకాశమధ్యమునఁ బ్రచండముగా వెలుఁగుచుండఁగా బిశాచముల కవకాశమెట్లు కలుగును?

శాంతి—అట్లయినయెడలనీతఁడిప్పుడేనరకబిలమునుండి వెడలి వచ్చిన యెవ్వఁడో నరకలోకవాసి యయియుండును, (చూచి యాలోచించి) ఆహా! ఇప్పుడు తెలిసినది. వీఁడు మహామోహునిచేతఁ బంపఁబడిన దిగంబరసిద్ధాంతుఁడు. కాఁబట్టి వీనిరూపమును సర్వవిధములచేతను దూరమునందే సంహరింపవలయును. (అని మోముత్రిప్పుకొని నిలుచున్నది.)

కరు—సఖి! ముహూర్తమాత్రము నిలువుము. ఇక్కడిక్కడనేను శ్రద్ధను వెదకెదను.

[అట్లిద్దఱును నిలువఁబడి యుండఁగా వెనుకఁజెప్పినరీతిని దిగంబరసిద్ధాంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దిగంబర—నమోఽర్హద్భ్యో నమోఽర్హద్భ్యః.

గీ. మహి నవద్వారయుతగృహమధ్యమందుఁ
ప్రజ్వలించుచు దీపంబుపగిది నాత్మ

యీ జినవరసుభాషితమె పరమార్థ
మధికతరమోక్షసౌఖ్యదాయకము సుమ్ము.
(అని కొంచెము నడచుచున్నారు.)

(ఆకాశమునందు) ఓశ్రావకులారా! వినుండు.

క. మలమయశరీరపిండము
కలజములనెల్లఁ గడుగఁ గాంచున శుద్ధిన్?
దెలియఁగఁదగు ఋషిసేవా
ఫలమున నాత్మ విమలస్వభావం బనుచున్.

ఏమనుచున్నారు? ఋషిపరిచర్య యెట్టిదనుచున్నారా? చెప్పెదను వినుండి.

క. కని కాళ్ళకెరఁగి దవ్వులన్,
దనుపఁగఁదగు నిష్టభోజనంబుల వారిన్;
చన దీర్ఘ్యాముల మొందఁగ
ఘను లాఋషివరులు తమను కాంతలఁ బొందన్.

(తెరవంకఁజూచి) ఓశ్రద్ధా! ఇటురమ్ము.
శాంతియు, గరుణయు—భయముతోఁ జూచుచున్నారు)

[అప్పుడు తదనురూపవేషముతో శ్రద్ధ ప్రవేశించుచున్నది]

శ్ర—ఓరాజబాంధవా! ఏమి సెలవు?

శాంతి—(మూర్ఛపోవుచున్నది)

దిగంబ—శ్రావకసముదాయమును నీ వొక్కముహూర్తమయినను విడిచి యుండఁగూడదు.

శ్రద్ధ—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను.
(అని నిష్క్రమించుచున్నది)

కరుణ—ఓప్రియసఖి! ఊరడిల్లుము. నాసుమాత్రముచేతనే

నీవిట్లు భయపడఁగూడదు. పాషండులయొద్ద సహితము తమస్సు యొక్క కూఁతురైన శ్రద్ధ యొక్కతె యున్న దని యహింసవలన నేను మున్ను విన్నదానను. కాఁబట్టి యిది యాతామసీ శ్రద్ధయయి యుండును.

శాంతి—(ఊటాడిల్లి! సఖీ! అవును. ఇది యదే. ఎట్లన—

క. భూరిదురాచార సదా
చారనుగాఁగను, కురూప సద్రూపనుగా,
నూరక భ్రమపడి దీసిక్
గూరిమిజననిఁగ దురాశఁగొంటిని జుమ్మా.

కానిమ్ము మనమిప్పుడు బౌద్ధులకడనే శ్రద్ధను వెదకుదము.
(అని శాంతికరుణలు ముందునకు నడుచుచున్నారు.)

[అప్పుడు పుస్తకహస్తుఁడయి బుద్ధాగముఁడు, భిక్షురూపమునఁ బ్రవేశించుచున్నాఁడు]

బుద్ధా—(ఆలోచించి) ఓయుపాసకులారా!

ఉ. ఇప్పుడు వాసనాసమితి యేమియు నంటమి, ధీపరంపరల్
తప్పక వెల్గెడుక్ విషయతత్త్యనురాగవివర్జితంబులై;
యప్పటిబుద్ధికల్పితము లయ్యును బాహ్యములట్ల తోఁచుఁగ
న్గప్పి నిరాత్మకంబులు క్షణక్షయశీలము లౌపదార్థముల్.

(కొంచెము నడచి మరలశ్లాఘనపూర్వకముగా) ఓహో! భోగమును మోక్షమును జేరియున్న యీ బౌద్ధధర్మ మెంత మేలయినది!

చ. చెలువగుమందిరంబుల వసింపఁగవచ్చు విలాసినీతతిన్
గలయఁగవచ్చు; భోజనమొనర్పఁగవచ్చు నభీష్టవేళలన్;
దెలిమ్మనుశయ్యలందు శయనింపఁగవచ్చుఁ గృతాంగరాగలై
వలచుప్రియాళితోఁ గడపవచ్చును రాత్రులు పండువెన్నెలన్.

కరుణ—సఖీ! కాషాయవస్త్రముమీఁదినుండి దిగ వ్రేలఁగాఁ అంటగొరిగిన తలకాయమీఁది జుట్టుపిలక యల్లలలాడఁగా పొడుగుగాఁ దాఁటిచెట్టువలె నవ్వేఁజో తరుణవయస్కుఁ డీవంకకు వచ్చుచున్నాఁడు. అతఁ డెవఁడు!

శాంతి—సఖీ! వాఁడు బుద్ధాగముఁడు.

బుద్ధా—(ఆకాశమునందు) ఓయుపాసకులారా! ఓభిక్షులారా! భగవంతుఁడైన బుద్ధునియొక్క వాక్యామృతమును వినుఁడు. (పుస్తకమునుజూచి చదువుచున్నాఁడు) "నేనిప్పుడు లోకములోని సుగతియు దుర్గతియు దివ్యచక్షుస్సుచేత జూచుచున్నాను. సమస్తసంస్కారములును క్షణికములు; ఆత్మ నిత్యముకాదు. కాఁబట్టి మీభార్యల నాక్రమించెడు భిక్షులయెడ మీరీర్ష్యను బొందఁగూడదు. ఈర్ష్యయే చిత్తమలము" (తెరవంకఁజూచి) ఓశ్రద్ధా! ఇటురమ్ము.

శ్రద్ధ—(ప్రవేశించి) రాజకులవారి యాజ్ఞ యేమి?

బుద్ధా—ఉపాసకులను భిక్షులను నీవు తడవుగ నాలింగనము చేసికొనుచుండుము.

శ్రద్ధ—దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించుచున్నది)

శాంతి—సఖీ! ఈమెయుఁ దామసీశ్రద్ధయే.

కరు—అవును. అట్టిదే.

దిగంబ—(బౌద్ధునిజూచి పెద్దగొంతుతో) ఓరీ! భిక్షుకా! ఇటురమ్ము. నిన్ను నేనొకప్రశ్న యడుగవలెను.

బుద్ధా—(కోపముతో) ఓరీ! పాపపిశాచా! అట్లడుగెడిదేమిరా!

దిగం—ఓరీ! కోపము మానుము. నేనొక్క శాస్త్రవిషయము నడిగెదను.

బుద్ధా—ఓక్షపణకా! నీవు శాస్త్రకథసహిత మెఱుఁగుదువా? కానిమ్ము. (సమీపమునకుఁబోయి) ఏమి యడిగెదవు?

దిగం—క్షణవినాశియైన నీ వెవరినిమిత్త మీవ్రతమును బూనితివో నాకుఁ జెప్పు.

బుద్ధా—ఓరీ! వినుము. మా సిద్ధాంతము ననుసరించినవాఁ డొకానొకఁడు క్షణికవిజ్ఞానమొంది వాసనాబంధములను దెగఁగోసి ముక్తుఁ డగును.

దిగం—ఓరిమూర్ఖా! ఏదో మన్వంతరమునం దెవ్వఁడో ముక్తుఁ డయ్యెడు పక్షమున, ఇప్పుడే నశించెడు నీకందువలన నేమి యుపకారము కాఁగలదు? ఇంకొకప్రశ్న మడిగెదను నీ కిటువంటి ధర్మము నుపదేశించినవాఁ డెవఁడు?

బుద్ధా—నా కీధర్మము సర్వజ్ఞుఁడయిన బుద్ధదేవునిచే నుపదేశింపఁబడినది.

దిగం—ఓరీ! బుద్ధుఁడు సర్వజ్ఞుఁడని నీ కెట్లు తెలిసినది?

బుద్ధా—ఓయీ! బుద్ధుఁడు సర్వజ్ఞుఁడని మా బుద్ధాగమముల వలననే ప్రసిద్ధము.

దిగం—ఓరిబుద్ధిహీనుఁడా! ఆతని కాతని మాటలవలననే సర్వజ్ఞత్వము సిద్ధించెడుపక్షమున, అప్పుడు నేనును సర్వజ్ఞుఁడనే. నీ పితృపితామహప్రభృతిప్రపురుషులతోఁ గూడ నీవు నాకు దాసుఁడవని నాకును దెలిసినది.

బుద్ధా—ఓరి పాపపిశాచమా! మలపంకధరా! నే నెట్లు నీకు దాసుఁడనురా?

దిగం—ఓరి వేశ్యాభుజంగా! ఓదుష్టభిక్షుకా! ఇది నీలోకదృష్టాంతరముగాఁజూపినానురా. ఇఁక నీకు విశ్వసింపఁ దగినప్రియవాక్యమొకటి చెప్పెదను. నీవు నీబుద్ధమతము విడిచి మాయార్హతశాసనము నవలంబించి దిగంబరవ్రతమును ధరింపుము.

బుద్ధా—ఓరిపాపుఁడా! నీవు పాడగుటయేకాక యితరులను గూడఁ బాడుచేయఁ జూచుచున్నావా?

క. పావనసత్త్వాస్వతంత్ర్యము
భావింప ననింద్య మద్ది వర్జించి వెసన్
నీవలెను బిశాచత్వము
నీవసుధను లోకనింద్య మెవ్వఁడు కోరున్?

యీయార్హతమతధర్మ మెవ్వఁ డవలంబించును?

దిగం—గ్రహనక్షత్రవారచంద్రసూర్యోపరాగ శుక్రాహుపరమార్థజ్ఞానసంవాదశాస్త్రముచేత నీభగవంతుఁడైనమాయర్హాతుని సర్వజ్ఞత్వము నిరూపిత మైనది.

బుద్ధా—(నవ్వి) అనాదిసిద్ధమయిన జ్యోతిశ్శాస్త్రమువలని యింద్రియాగోచరజ్ఞానముచేత మోసపోయి నీ వీయతికష్టవ్రతము నాశ్రయించు చున్నావు.

చ. పరిమితమైన దేహమునఁ బాయక లోపలనుండుజీవుఁ డే
సరణి నెఱుంగనేరుచు నసంగతి మై భువనత్రయంబు బాగిన్!
కరము జ్వలించుచున్న, ఘటగర్భమునం దిడినట్టిదీప మే
కరణిని జూపనోవు గృహగర్భమునం గలవస్తుసంతతిన్!

కాఁబట్టి లోకద్వయవిరుద్ధమయిన యార్హతమతముకంటె బుద్ధమతమే శ్రేష్ఠమయినదిగాను, కేవల సుఖావహ మయినదిగాను, మిక్కిలి రమణీయ మయినదిగాను, నాదృష్టికి గోచరమగుచున్నది.

శాంతి—సఖీ! మనము మఱియొకచోటికిఁ బోవుదము.

కరుణ—అలాగుననే చేయుదము.

(అని ముందుకు నడుచు చున్నారు.)

శాంతి—(ముందువంకఁజూచి) మనముం దున్నయీపురుషుఁడు సోమసిద్ధాంతుఁడు. కానిమ్ము మన మక్కడకుఁగూడఁ బోవుదము.

[అప్పుడు కాపాలికరూపధారి యైన సోమసిద్ధాంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సోమ—(ముందుకు నడిచి)

మ. సముదారోగ్రనరాస్థిమాలికలు భూషల్ గా, శ్మశానంబె వి
శ్రమవాసస్థలిగాఁగ, భోజనపుఁబాత్రల్ పుఱ్ఱలై యొప్ప, ను
త్తమయోగాంజనశుద్ధదృష్టి మెయి నేదగ్గంతు నన్యోన్యభి
న్నము లీలోకము, లీశుకంబె నవిభిన్నంబుల్ గదా యం చెదన్.

దిగం—ఓహో! ఈపురుషుఁడు కాపాలికవ్రతమును ధరించుచున్నాఁడు. ఈతనినిగూడ నొకప్రశ్న యడిగెదను. (సమీపించి) ఓరీ! కాపాలికా! నరాస్థికపాలధారీ! నీధర్మ మెటువంటిది? నీమోక్ష మెటువంటిది?

సోమ—ఓరీ! క్షపణకా! ఇప్పుడు నాధర్మమును శ్రద్ధతో వినుము.

శా. మస్తిష్కాక్తవసాభిఘారిమహామాంసంబు వ్రేల్తున్ శిఖిన్;
శస్త్రబ్రహ్మకపాలపూరితసురన్ సద్భక్తి సేవింపుదున్;
బ్రిస్తుత్యగ్రనికృత్తకంఠవిగళద్రక్తోగ్రధారాతతిన్
హాస్తద్వంద్వకృతోపహార మిడి నే నర్చింతు నాభైరవున్.

బుద్ధా—(చెవులు మూసికొని)కటకటా! ఈధర్మచర్య మహాఘోరముకదా!

దిగం—అర్హాత! అర్హాత! ఘోరపాపకారి యెవ్వఁడో యీ బుద్ధిహీనుని వంచించెను.

సోమ—(కోపముతో) ఓరీ! పాపాత్మా! పాషండాధమా! బోడీ! చండాలా! కేశోల్లుంఛకా! చతుర్దశభువనోత్పత్తి స్థితిప్రళయ ప్రవర్తకుఁడును వేదాంతసిద్ధాంతప్రసిద్ధప్రభావుండును భగవంతుండును నగుభవానీవల్లభుండు వంచకుఁడు రా! ఆయన ధర్మమహిమను నే నిప్పుడు కనఁబఱచెదను.

మ. హరిరుద్రాబ్జభవాదినిర్జరసమూహంబెల్ల రావించెదన్;
సరిగా మింటఁజరించుతారకలసంచారంబు నే నిల్పెదన్;
బుధశైలాదులతోడ నిమ్మహి పయఃపూర్ణంబు గావించి యీ
వరతోయంబునుద్రావెదన్ క్షణములో భాండంబుల న్సర్వముల్.

దిగం—ఓరీ! కాపాలికా! నీ విందుచేతనే నిన్నెవ్వఁడో యైంద్రజాలికుఁడు మాయలుచూపి మోసముచేసెనని చెప్పియున్నాను.

సోమ—ఓరి పాపీ! పరమేశ్వరుఁడైంద్రజాలికుఁడని యింకను నాక్షేపించుచున్నావా? నీని దుష్టత్వము కోపోద్రేకము కలిగించుచున్నది. (కత్తి యొరనుండి తీసి)

ఉ. ఈనిశితోగ్రఖడ్గవినికృత్తభవద్గళనాళికోచ్ఛలత్
ఫేనిలబుద్బుదాఘయుతభీకరశోణితభూరిధారలన్
నే నిదె తృప్తిచేసెద వినిశ్చలభక్తిని దుర్గకిష్ట క్రీ
డానినదోల్లసడ్డమరుఢాంకరణాగతభూతవర్గమున్.

(అని కత్తి పయి కెత్తుచున్నాఁడు.)

దిగం—(భయముతో) ఓమహానుభావా! అహింస పరమ ధర్మము సుమా. అని బుద్ధాగముని మఱుఁగు చొచ్చుచున్నాఁడు.)

బుద్ధా—(సోమసిద్ధాంతుని వారించుచు) ఓ మహానుభావా!

వినోదార్థముగా జరపఁబడినయీ శాక్యులహాసమునుబట్టి యీ తాపసుని గొట్టుట యుక్తము కాదు.

సోమ—(ఖడ్గము నొరలో వేయుచున్నాఁడు.)

దిగం—(ఊఱటనొంది) ఓ మహానుభావా! ఇప్పుడుమీకుద్భవిల్లినఘోరరోషము శాంతిపొందినపక్షమున, నేను మిమ్ముఁ గొన్ని ప్రశ్న లడుగఁదలఁచి యున్నాను.

సోమ—అడుగు. అడుగు.

దిగం—మీయుత్తమధర్మమును నేను విన్నాఁడను. ఇఁక మీమోక్ష మెట్టిదో చెప్పుఁడు.

సోమ—వినుము—

మ. తమి నేరేన్ విషయానుభోగములచేఁ దక్కన్ సుఖంబందిరే?
యమలానందవిమూఢజీవదశ రమే యామోక్షమౌనేని, ధీ
భ్రమ లే కెవ్వఁడు కోరి వేఁడుకొనుఁ దత్పాషాణముక్తింగసక్?
ప్రమదాళిన్ సతిఁగాఁగఁ దన్ను శివుఁగా భావించి యాలింగనం
బమరం జేసి సుఖింప ముక్తియగునం చాశర్వుఁ డాడెం జుమీ.

శాంతి—పాపము శాంతిల్లునుగాక! పాపము శాంతిల్లునుగాక! భగవంతుఁ డయినభవానీపతి యిటువంటిశాస్త్రమునకుఁ దానెప్పు డయినను గర్త యగునా? ఇదియెవ్వరోదురాత్ములుకల్పించిరి.

బుద్ధా—ఓ మహానుభావా! రాగరహితులుకానివారికిముక్తి కలుగు నన్నయీమాట యాదరణీయము కాదు.

దిగ—ఓయీ! కాపాలికా! నీకుఁ గోపము రానిపక్షమున నే నొక్కమాట చెప్పెదను. రాగయుక్తుఁ డయినదేహధారి ముక్తుఁ డగుననుట వేదవిరుద్ధము.

సోమ—(తనలో) అయ్యో! వీరిమనస్సులు శ్రద్ధారాహిత్య

ము చేతఁ జెడియున్నవి. కానిమ్ము. (తెరవంకఁజూచి ప్రకాశముగా) ఓ శ్రద్ధా! ఇటురమ్ము.

[అప్పుడు కాపాలినీరూపధారిణియైన శ్రద్ధ ప్రవేశించుచున్నది]

కరుణ—సఖీ! చూడు. రజస్సుయొక్క కూఁతురైనయా శ్రద్ధను జూడు. ఈమె—

చ. విరిసినవల్లగల్వలను వీఁక యడంచువిలోలనేత్రముల్,
నరవిమలాస్థినిర్మితకనత్కమనీయవిభూషణావళుల్,
గురుజఘనస్తనాతిభరకుంఠితకోమలమందయానముల్,
సురుచిరపూర్ణచంద్రనిభసుందరవక్త్రము నొప్ప నొప్పెడున్.

శ్రద్ధ—(ముందుకు వచ్చి) ఇదిగో వచ్చినదానను. స్వామీ! ఏమి యాజ్ఞ?

సోమ—ప్రియురాలా! దురభిమానియైన యీభిక్షుని ముందుగాఁ గౌఁగిలించుకొమ్ము.

శ్రద్ధ—(బుద్ధాగముని నాలింగనము చేసికొనుచున్నది)

బుద్ధా—(సంతోషముతో నాలింగనము చేసికొని రోమాంచలు గగుర్పొడువఁగా జనాంతికముగా) ఓహో! ఏమి యీ కాపాలినీసుఖస్పర్శ!

చ. చండతరానురాగమునఁ జన్నులు పాణులనొత్తి పల్వురన్
రండలఁ గౌఁగిలించితి ఘనస్తనభారలఁ దొల్లి; యెందు నీ
చండికచోపగూహభవసౌఖ్యముతో సరిగాన నంచు నే
దఁడిగ నూఱుసార్లు శపథంబులు చేసెద బుద్ధుతోడుగన్.

ఓహో! కాపాలికచరిత మెంతపుణ్యప్రదమయినది! ఓహో! సోమసిద్ధాంత మెంతశ్లాఘ్యమయినది! ఈధర్మ మాశ్చర్యకరమయినది. ఓమహానుభావా! సర్వవిధములచేతను నేను బుద్ధానుశాసనమును

విడిచి నీ పరమేశ్వర సిద్ధాంతమునందు ప్రవేశించెదను. ఇప్పుడు నీవాచార్యుఁడవు: నేను శిష్యుఁడను. కాఁబట్టి నన్నిప్పుడే పారమేశ్వరదీక్షయందు ప్రవేశపెట్టుము.

దిగం — ఓరీ! భిక్షుకా! నీవు కాపాలినీస్పర్శనముచేత మయిల పడినాఁడవు. కాఁబట్టి దూరముగా నుండుము.

బుద్ధా — ఓరి పాపాత్మా! కాపాలినియొక్క పరిరంభణమహోత్సవముఁ గానక నేనింతవఱకును వంచితుఁడ నయితిని.

సోమ — ఓ ప్రియురాలా! నీవిప్పుడీ క్షపణకునిఁగూడ నాలింగనము చేసికొమ్ము.

శ్రద్ధ — (దిగంబరసిద్ధాంతుని గాఁగిలించుకొనుచున్నది)

దిగం — (గగుర్పాటుతో) ఓహో! అర్హంత! అర్హంత! ఓహో! ఏమి యీ కాపాలినీ సుఖస్పర్శనము! ఓసుందరీ! నీవింకొకసారి నన్ను మరలఁ గాఁగిటఁ జేర్పుము. (తనలో) ఔరా! నే నిప్పుడు మహాత్తరమయిన యొకయింద్రియవికారమునకు లోఁబడినాఁడను. ఇఁక నేమి యుపాయము! ఇప్పుడేదియు క్షమము! కానిమ్ము. ఇప్పుడీ నెమిలిపింఛము కప్పుకొనెదను. (అని అట్లు చేయుచున్నాఁడు)

క. ఓ పీనఘనస్తని! ఓ
కాపాలిని! భీతహరిణకమనీయాక్షీ!
మాపటి కీవు రమించిన,
నాపయిఁ జేయుఁగలదేది యా శ్రావకిచేత!

ఓహో! కాపాలికశాస్త్ర మొక్కటియే భోగమోక్షసాధనము! ఓ యాచార్యా! నేనిప్పుడు నీదాసుఁడ నయినాఁడను. నన్నుఁగూడ శ్రీమహాభైరవానుశాసనమునందు దీక్షితుని జేయుము.

సోమ — కూర్చుండుఁడు.

ఇద్దఱు—(కూరుచున్నారు.)

సోమ—(పాత్రము చేతఁబట్టుకొని ధ్యానము నభినయించుచున్నాఁడు.)

శ్రద్ధ—ఓ దేవా! ఈ పాత్రము సురాపూరిత మయినది.

సోమ—(చూచి తాను గొంత త్రాగి మిగిలినదానిని బుద్ధాగమ దిగంబర సిద్ధాంతుల కిచ్చుచున్నాఁడు.)

క. ఇది పావన మిది యమృతం
బిది యఘరోగౌషధ మిది యీశ్వర ఘటితం
బిది భవపాశచ్ఛేదక
మిది యాస్వాదింపుఁ డిపుడు తృప్తిగ మీరల్.

ఇద్దఱు—(ఆలోచించుకొనుచున్నారు.)

దిగం—మా కార్హతాశాసనమునుబట్టి మద్యపానముకూడదు

బుద్ధా—కాపాలికుఁ డెంగిలిచేసినకల్లు నేనెట్లు త్రాగగలను!

సోమ—(ఆలోచించి జనాంతికముగా) ఓశ్రద్ధా! నీ వాలోచించుచున్నావేమి? పశుత్వ మిప్పుడును వీరిని విడువలేదు. నావదన సంసర్గదోషమువలన సుర యపవిత్ర మయినదని వీరెంచుకొనుచున్నారు. కాఁబట్టి ఓపూజ్యురాలా! నీవక్త్రాసవముచేత దీనిని శుద్ధి చేసి వీరికిమ్ము. స్త్రీలనోరు సదా శుచి యని త్రైర్థికులు సహితము చెప్పరు.

శ్రద్ధ—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను. (అని పానపాత్రము పుచ్చుకొని తాను గొంత త్రాగి మిగిలినదానిని వారిదాపునఁ బెట్టుచున్నది.)

బుద్ధా—ఇది మహాప్రసాదము. (అని పానపాత్ర మందుకొని త్రాగుచున్నాఁడు) ఆహా! ఏమి యీసురయొక్క సువాసన!

చ. సకియలపొత్తునన్ వెనుకఁ జక్కఁగ నెన్నియొసార్లు గ్రోలనే
వకుళసువాసనామధురవార సతీవదనాసవంబు! ని
య్యకలుషసుందరీముఖసుహాసవ మానరుగాక దేవతల్,
పకటసుధారసంబుపయి వాంఛయొనర్తురె దీనిఁ గ్రోలినన్!

దిగం—ఓరీ! భిక్షుకా! అంతయు నీవే త్రాగకు. కాపాలినీ వదనోచ్ఛిష్టమయిన యీమద్యమును నాకుఁగూడఁ గొంత యిమ్ము.

బుద్ధా—(పానపాత్రము దిగంబరసిద్ధాంతుని ముందుంచుచున్నాఁడు.)

దిగం—(త్రాగి) ఓహో! ఏమి యీమద్యముయొక్క మాధుర్యము! ఏమి రుచి! ఏమి గంధము! ఏమి పరిమళము! అర్హదనుశాసనములోఁబడి చిరకాల మిటువంటి సురారసము లేక మోసపోతిని. ఓభిక్షుకా! నాయంగములు తిరుగుచున్నవి. నేను శయనించెదను.

బుద్ధా—అటు చేయుము. (ఇద్దఱును బరున్నారు.)

సోమ—ఓప్రియురాలా! మనకిప్పుడు వెలలేకయిద్దఱు దాసులు లభించినారు. కాఁబట్టి మనము నృత్యము చేయుదము.

(ఇద్దఱు నృత్యము చేయుచున్నారు.)

దిగం—ఓ భిక్షుకా! ఈకాలపాలికుఁడు—కాదుకాదు, ఈ యాచార్యుఁడు కాపాలినితోఁగూడ మంగళనృత్యము చేయుచున్నాఁడు. కాఁబట్టి వీరితో మనముకూడ నృత్యము చేయుదము.

బుద్ధా—అలాగుననే చేయుదము. (అనిమదముచేతసోలుచు నృత్యము చేయుచున్నారు.)

దిగం—క. "ఓ పీనఘనస్తని! ఓ
కాపాలిని! భీతహారిణకమనీయాక్షీ!

మా పటి కీవు రమించిన,
నాపయిఁ జేయఁగలదేది యాత్రావకిచేఁ!"

(అని పాడుచున్నాఁడు.)

బుద్ధా—ఆచార్యా! ఈశాస్త్రమత్యద్భుతమయినది! ఇక్కడ గష్టపడ నక్కఱలేకయే యభిమతార్థసిద్ధులుసంపాద్యములగుచున్నవి.

సోమ—ఇది యెంత యాశ్చర్యము! చూడు—

మ. తనియం బొందురు దీప్సితార్థవిషయత్యాగంబులే కీమతం
బున మోక్షప్రియు లష్టసిద్ధులఁ గరంబున్, యోగవిఘ్నంబులై
యునికిం బ్రాకృతమంత్రసిద్ధులను పశ్యోచ్చాటనాకర్షమో
హనవిక్షోభణమారణాదులఁ దృణంబల్గెంతు రత్యంతమున్.

దిగం—ఓయి కాపాలికా! (ఆలోచించి) ఓరి యాచార్యా! ఓ రాజబాంధవా! (అని తూలుచుఁ దిరుగుచున్నాఁడు.)

బుద్ధా—మున్నులవాటు పడనివాఁ డగుటచేత నీతపస్వి మధుపానాధిక్యమువలన మిక్కిలి మత్తెక్కియున్నాఁడు. కాఁబట్టి యిప్పుడితనిమత్తు పోవుపని చేయవలెను.

సోమ—అలాఁగునే చేయుదము. (అని తననోటిలోనితమ్మి దిగంబర సిద్ధాంతుని నోటిలోఁ బెట్టుచున్నాఁడు.)

దిగం—(స్వస్థుఁడయి) ఓయాచార్యా! నిన్నొక్కటి యడిగెదను. నీకిప్పుడు సురనాకర్షించుటయందున్నశక్తిస్త్రీపురుషులనాకర్షించుటలోఁగూడఁ గలదా?

సోమ—ఇది యేమిగొప్పయని యడుగుచున్నావు? చూడు—

మ. ఖరవిద్యాధరకాంతలన్, సురసతీవారంబు, నాగేంద్రసుం
దరులన్, యక్షవిలాసినీమణుల, మద్వాంఛానుసారంబుగా

మరియెవ్వారలనైన, ముజ్జగములన్ మద్గోప్యసంశ్లాఘ్యదు
ష్కరవిద్యాబలగౌరవంబున సమాకర్షింపఁగాఁ జాలుదున్.

దిగం—ఓయీ! మనమందఱమును మహామోహునికింకరుల మని యిప్పుడు నేను గణితముచేతఁ దెలిసికొన్నాఁడను.

ఇద్దఱు—నీవు తెలిసికొన్నదంతయు సత్యమే.

దిగం—అట్లయినయెడల మనమిప్పుడు రాజకార్యమొకటి యాలోచింపవలెను.

సోమ—అది యేది?

దిగం—సత్త్వపుత్త్రియైనశ్రద్ధను రాజుగారి యాజ్ఞాప్రకారముగా మనము పట్టితేవలెను.

సోమ—ఆతొత్తుకూఁతు రెక్కడ నున్నదో నాకు జెప్పుము. నేను వెంటనే దానిని నావిద్యాబలముచేత నాకర్షించి తెప్పించెదను.

దిగం—నేనిప్పుడు లెక్క వేసి నీకుఁజూపెదను. (అని బలపము పుచ్చుకొని భూమిమీఁద స్థానములు వేసి గణించుచున్నాఁడు.)

శాంతి—సఖీ! ఇప్పుడుహతాశులయినవీరిమాటలు మాతల్లిని గూర్చినవైనట్లు వినబడుచున్నవి. మనము సావధానముగా విందము.

కరుణ—సఖీ! ఆలాగుననే చేయుదము. (అని యిద్దఱు నాలకించుచున్నారు.)

దిగం—గీ. జలమునను లేదు; లే దెందు స్థలమునందు;
శైలముల లేదు; లేదు పాతాళమందు;
శ్రద్ధ యయ్యది హరిభక్తి సహిత యగుచు
నున్న దిపుడు మహాత్ముల యుల్లములను.

కరుణ—(ఆనందముతో) సఖీ! నీవుభాగ్యశాలినివి. శ్రద్ధ విష్ణుభక్తిదేవియొక్క పార్శ్వవర్తినియై యున్నది.

శాంతి—(హర్షము నటించుచున్నది.)

బుద్ధా—వా శ్రీకాముని విడిచిపోయిన ధర్ముఁడెక్కడ నున్నాఁడు?

దిగం—(మరల సంకెలు గణించి)

గీ. జలముననులేఁడు; లేఁ డెందుస్థలమునందు;
శైలముల లేఁడు; లేఁడు పాతాళమందు;
విష్ణుభక్తితో ధర్ముండు వేడ్కఁ గూడి,
యున్నవాఁడు మహాత్ముల యుల్లములను.

సోమ—(విషాదముతో) అక్కటా! మనమహారాజునకు గొప్పకష్టము వచ్చినది.

చ. తలఁపఁగ విష్ణుభక్తియె నిదానము శాశ్వతహర్షసిద్ధికిన్;
గలసెను దానితో నిపుడు క్రన్నన సత్త్వకుమారి శ్రద్ధయున్;
జెలియగు శాముని న్విడిచి చేరెను ధర్ముఁడుగూడ నచ్చటన్;
దలఁతు వివేకకార్య మిఁకఁ దద్దయు సిద్ధిని బొందినట్లుగన్.

అయినను మనము ప్రాణాంతోపద్రవము వచ్చినను వెనుక తీయక స్వామికార్యమును జేయవలెను. ఇప్పుడు ధర్మశ్రద్ధలను బట్టి తెచ్చుటకయి మహాభైరవీవిద్యను బంపుజేసెదను.

(అని ముగ్గురును నిష్క్రమించు చున్నారు.)

శాంతి—సఖి! ఇప్పుడు మనమును హతాశు లయిన వీరి దుర్వ్యవసాయమును దేవియైనవిష్ణుభక్తికి నివేదింతము రమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు.)

---

# చతుర్థాంకము.



[అప్పుడు మైత్రి ప్రవేశించుచున్నది.]

మైత్రి—మహాభైరవియొక్క వార్తఁ బడకుండ ధర్మునితోఁ గూడ నా ప్రియసఖయైన శ్రద్ధను విష్ణుభక్తి కాపాడెనని ముదితవలన నేను విన్నదానను. కాఁబట్టి యాతహాతహ పడుచున్నమనస్సుతో నా ప్రియసఖ నెక్కడఁ జూడఁ గలుగుదును?

(అని ముందుకు నడుచుచున్నది.)

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది.]

శ్రద్ధ—(నలుగుదిక్కులను జూచి భయోత్కంపముతో)

మ. వెనుకన్, మర్త్యకపాలఖండలపతిన్, విద్యుచ్ఛటావిస్ఫుర
ద్ఘనదృష్టిన్ శిఖికీలికారుణకచాత్యంతోగ్ర, బాలేందుర
శ్మినిరోద్యత్థరదంష్ట్రికాంతరచలజ్జిహ్వన్, మహాభైరవిన్
గనుచున్నట్లు వడంకెఁ జిత్తమిపుడున్ రంభాదళప్రక్రియన్.

మైత్రి—(తనలో) అయ్యో! నా ప్రియసఖయైన శ్రద్ధాదేవి భయసంభ్రమోద్భ్రాంతహృదయయయి గాలిచేఁ గదలుచున్న కదలీతరుప్రకాండమువలెఁ గంపమొందుచున్నయంగములతోఁ దనలోఁ దానే యాలోచించుకొనుచు, దాపునకువచ్చినను నన్నుఁ జూడకున్నది. కాఁబట్టి నేనే యీమెను బలుకరించెదను. (ప్రకాశముగా) ఓ ప్రియసఖీ! శ్రద్ధా! ఇదేమి? నీవు మనస్తాపముచేత నన్ను సహితము చూడకున్నావు!

శ్రద్ధ—(చూచి నిట్టూర్పుతో) ఓ ప్రియసఖీ! మైత్రి

క. చెలి! కాళరాత్రినోటను
బలుకోఱలనడుమఁ జిక్కి ప్రాణముతో డన్

వెలవడుచు నేను గనుఁగొనఁ
గలిగితి నీజన్మమందె క్రమ్మఱ నిన్నున్.

కాఁబట్టి నీవు దగ్గఱగా వచ్చి నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

మైత్రి—(ఆలింగనము చేసికొని) సఖీ! అట్లు విష్ణుభక్తి మహాభైరవియొక్క ప్రభావము నడఁచివేసినను, నీయంగములింకను గంప మొందుచున్న వేమి!

శ్రద్ధ—

మ. వెనుకన్, మర్త్యకపాలకుండలవతిన్, విద్యుచ్ఛటావిక్షిప
ద్ఘనదృష్టిన్, శిఖికీలికారుణకచాత్యంతోగ్ర, బాలేందుర
శ్మిభోద్యత్ఖరదంష్ట్రికాంతరచలజ్జిహ్వాన్, మహాభైరవిన్
గనుచున్నట్లు వడంకుఁ జిత్తమిపుడున్ రంభాదళప్రక్రియన్.

(అని మరలఁ బఠించుచున్నది.)

మైత్రి—(భయముతో) హా! హతాశురాలయినయామె ఘోరరూపము కలదిగదా! ఆప్రకారముగా వచ్చి యామె యేమి చేసినది!

శ్రద్ధ—సఖీ! వినుము—

చ. ధరణికి డేగడిగ్గెడువిధంబున భైరవి డిగ్గి, నన్ను దు
ర్భరచరణద్వయిం బొదివి, వామకరంబున ధర్ముఁ బట్టి, యుం
బరమున కేగ వేగఁ, బెనుమాంసపుముద్దలు రెండు గృధ్రభీ
కరనఖరాగ్రకోటి నిడి గ్రక్కున నింగికిఁ బాఱు కైవడిన్.

మైత్రి—అయ్యో! అయ్యో! (అని మూర్ఛిల్లుచున్నది.)

శ్రద్ధ—సఖీ! ఊఱడిల్లుము.

మైత్రి—(తెలివితెచ్చుకొని) తరువాత. తరువాత.

శ్రద్ధ—తరువాత నాయార్తనాదమువలన దయార్ద్రహృదయ యయి—

మ. పొరి గద్దింపుచు విష్ణుభక్తి యటటన్ భ్రూభంగకౌటిల్యభీ
కరమై నిర్భరకోపపాటలము నా కంటన్విలోకింపఁగా,
ధరణిం గూలెను, వజ్రపాతహతిచేతన్ భూమిపైఁద్రెళ్లు న
స్థిరభూభృచ్ఛిలయట్లు, భైరవి శిరోస్థిప్రాతముల్ నుగ్గుగాన్.

మైత్రి—ప్రియసఖీ! దైవవశముచేతఁ బులినోటఁ బడి వెలువడినకురంగాంగనవలెనే నీవును నీభాగ్యముచేతఁ బ్రతుకఁగంటివి. తరువాత. తరువాత.

శ్రద్ధ—తరువాత విష్ణుభక్తిదేవి "నన్నుసహితమవమానింప బ్రవర్తించుచున్న దురాత్ముఁ డయినయీమహామోహాప్రేతమును నేను సమూలముగా నిర్మూలము చేసెదను" అని కోపావేశముతోఁ బలికి, నావంకఁజూచి "ఓశ్రద్ధా! నీవుపోయివివేకునితోనిట్లు చెప్పుము. నీవు కామక్రోధాదులను నిర్జించుటకయి ప్రయత్నింపుము. అప్పుడు వైరాగ్యోదయము తప్పక గలుగును. నేనును సమయమువేచిప్రాణాయామాదుల కుత్సాహము పుట్టించి నీసైన్యము ననుగ్రహించెదను. ఋతంభరాది దేవులు శాంత్యాదులకౌశలముచేత నుపనిషద్దేవీసంగమమువలనఁ బూజ్యుఁడ వయిన నీకుఁ బ్రబోధచంద్రుఁ డుదయించు సాధనమును జేయుదురు" అని సెలవిచ్చినది. కాఁబట్టి నేనిప్పుడు వివేకుని సన్నిధికిఁ బోవుచున్నాను. ఇప్పుడు నీ వేపనిమీఁదనిమిలు వచ్చుచున్నావు?

మైత్రి—అక్కచెల్లెండ్రము మేము నలువురమును విష్ణుభక్తియొక్క యాజ్ఞచేత వివేకుని కార్యసిద్ధికొఱకు మహాత్ముల యాత్మల యందు నివసించెదము.

చ. నను సుఖజీవులందుఁ, గరుణన్ ఘనదుఃఖితులందుఁ, బుణ్యకా
ర్యనిరతులందు సమ్ముదిత, భ్రష్టబుద్ధులయందు నుపేక్ష, వా
రనుపఁదలంతురి; మేమటనుండుట నాత్మలు రాగలోభము
ఖ్యాఖిలదోషదూషితము లయ్యును గాంచును నిర్మలత్వమున్.

కాఁబట్టి యీవిధముగాఁ దోఁబుట్టువులమైన మేము నలువురమును వివేకాభ్యుదయము కొఱకైన వ్యాపారముచేత వాసరములు గడపుచున్నాము. ఓప్రియసఖీ! నీవిప్పుడెక్కడ వివేకమహారాజును గనుఁగొనగలవు?

శ్రద్ధ—"రాధాదేశ మని యొకటి యున్నది అక్కడభాగీరథీ సముద్రదేశమున కలంకారభూతమయిన చక్రతీర్థమునందు మీమాంసానుగతమైన మతిదేవితోడఁ గూడ నెట్లో ప్రాణములు నిలుపుకొని వ్యాకులహృదయముతో నుపనిషద్దేవీసంగమార్థముగా వివేకుఁ డహర్నిశమును దపస్సు చేయుచున్నాఁడు" అని దేవియైన విష్ణుభక్తియే నాతో సెలవిచ్చినది.

మైత్రి—ఓప్రియసఖీ! నీవచ్చటికిఁ బొమ్ము. నేనును నాపనికిఁ బోయెదను.

శ్రద్ధ—అట్లు చేయుము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము

---

[అప్పుడు వివేకమహారాజును బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—ఓరి మహామోహా! ఓరిదోసకారివీవుఁగా! ఈమహాజనులెల్ల నీవల్ల సర్వవిధముల చేతను జెడిపోయిరి.

శా. జ్ఞానానందము నిస్తరంగము మహాశాంతంబు పోద్యన్మహా
త్యానూనంబు మహామృతాబ్ధిజల మాహా! తాగ్రకరందుండియున్;
వే నిస్సారమరీచికాజలమునం దే మున్గుచుం దేలుచుక్
బానస్నానము లాచరించెదరు విభ్రాంతి స్వమూఢాత్మకుల్.
సంసార చక్రవాహకుండై యున్నమహామోహునకజ్ఞానమే మూలము.
ఆయజ్ఞానము తత్త్వబోధమువలననే నివృత్తి కాఁగలదు. ఎట్లన—

గీ. అవని నజ్ఞానమూలక మైనయట్టి
పృథులసంసారవృక్షంబు పెల్లగించి
పరముఁ గూర్ప విశ్వేశ్వరోపాసనాఖ్య
బీజజన్యావబోధంబె వెరవుసుమ్ము.

తలుచుగా మంచివారు పూనినకార్యములకు దేవతలు తోడుపడుదు రని తత్త్వవేత్తలు చెప్పుదురు. అందుచేతనే విష్ణుభక్తిదేవి యిప్పుడు "నీవు కామాదులను గెలుచుట కుద్యోగింపుము; నేనును నీపక్షమవ లంబించెదను" అని సందేశము పంపినది. అక్కడఁ బ్రధానవీరుఁడై యున్న కాముని వస్తువిచారుఁ డొక్కఁడే జయింపఁదగినవాఁడు. కానిమ్ము. వానిని నిర్జించుటకయి యిప్పు డతనినే నియమించెదను. ఓ వేదవతీ! నీవు వస్తువిచారుని బిలుచుకొనిరమ్ము.

ప్రతి—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించి వస్తువిచారునితోఁగూడఁ బ్రవేశించుచున్నది)

వస్తు—అయ్యో! నిర్విచారసౌందర్యాభిమానవర్ధిష్ణుఁడైన కామపిశాచునిచేతను ముఖ్యముగా దురాత్ముఁడైన మహామోహుని చేతను లోకము చెడిపోవుచున్నది.

ధ. కలికి యటంచునున్, గలువకంటి యటంచును, సుభ్రువంచు మం
జులసుముఖాబ్జ యంచు. రుచు స్తనియంచు, బృహన్నితంబ యంచు

చెలివిఁ దలంచుఁ గాంచుఁ బ్రమియించు రమించు బుధుండు సార! చ
ల్వ లశుచిభస్త్రిలంచును దలంపఁడు మోహవిచేష్టితంబునన్.

చక్కఁగా వస్తువిచారము చేయఁగలనూత్నబుద్ధులకు సహితము మాంసాస్థిపంజరములైన స్త్రీలు స్వభావదుర్గంధనిలయము లనియు భీభత్సవేష లనియు వైరాగ్యము కలుగకున్నది. అట్లయినప్పుడు వారియం దితరగుణారోపణము చేయుట స్పష్టమే.

మ. వరముక్తామణిహారముల్ వరకిరణతస్వర్ణాంగదంబుల్, సితాం
బరచిత్రోరుదుకూలముల్, ఘుసృణపున్నెత్రపూఁతలున్, దానిపూ
సరముల్, పైపయిఁ జూచి యల్పమతు లిచ్చం గాంత్రు సమ్మో[హమున్
ధర నారుల్ నరకార్థనామ లనుచుం దర్కింతు రుద్యన్మతుల్.

(ఆకాశమువంకఁ జూచి) ఓపాపీ! చండాలా! ఓరి కామా! అనావలంబనముగా వచ్చి నీవీలాగున జనులను వ్యాకులపెట్టుచున్నా వేమిరా? ఓహో! కామావిష్టుఁడు—

మ. ననుఁ గామించెను బాల యీమె, యెలమిన్ సన్నిమ్మ గాంకాన్య[మా
చెను, నీయుత్పలనేత్ర కౌఁగిటను జేర్చెన్ న, న్ననున్ గామి: యో
ఘనమూర్ఖా! నినుఁ గాంచె నెవ్వతె? నినుం గామించె నెవ్వర్తె? యం
గన మాంసాస్థులబుంగ; లోపలి నిరాకారుండ వీక్షించెదున్.

ప్రతీహారి—ఓమహానుభావా! ఇటురమ్ము.

ఇద్దఱు—(ముందుకు నడుచుచున్నారు.)

ప్రతీ—అదె మహారాజాసీనుఁడయి యున్నాఁడు. సీఘ్రముగ సన్నిధికిఁ బొమ్ము.

వస్తు—(దావునకు బోయి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! వీఁడె వస్తువిచారుఁడు దేవరకుఁ బ్రణమిల్లుచున్నాఁడు.

వివే—వస్తువిచారా! ఇక్కడఁ గూర్చుండుము.

వస్తు—(కూరుచుండి) దేవా! మీ సేవకుఁడు వీఁడిదె వచ్చియున్నాఁడు. ఆజ్ఞయేమో యనుగ్రహింపవలెను.

వివే—మహామోహునితో మనకు యుద్ధము సంప్రాప్తమయినది. అక్కడఁ బ్రధానవీరుఁడు కాముఁ వానికిఁ బ్రతివీరునిఁగా మేము నిన్ను నిరూపించినాము.

వస్తు—దేవరవారు నన్నిట్లు సంభావించుటచేత నేను ధన్యుఁడనయినాఁడను.

వివే—ఇఁక నీ వేయాయుధముచేతఁ గాముని జయించెదవు?

వస్తు—ఓహో! పంచశరుఁడా? వానికున్నవి యైదమ్ములు. పూవిల్తుని గాముని జయించు టెంతపని? ఇక్కడఁగూడ శస్త్రగ్రహణ మపేక్షింపవలెనా దేవరవారు చిత్తగింపుఁడు.—

ఉ. ఇంద్రియమార్గమందు మనసేగకయుండఁగ దారిమూసెదన్
చంద్రనిభాస్యలం దలఁచినన్, ముఖదర్శన మాచరించినన్
సాంద్రవికారముల్ గలుగు; నాతులు గోఁతలకిమ్ము లంచు, రా
జేంద్ర! ప్రతిక్షణంబు మదినెంచుచుఁ గాముని దూపుమాపెదన్.

వివే—మేలు! మేలు!

వస్తు—అంతేకాక,

చ. తతపులినస్రవంతులఁ, నితాంతపతజ్ఝరచిక్కణోపలాం
చితగిరులన్, సుసాంద్రతరుశీతలపుణ్యవనప్రదంబులన్,
యతిబుధసంగతిం దనరి, వ్యాసవినిర్మితశాంతివాక్యముల్
ధృతిఁ బఠియింప నబ్బిన, నిఁకెక్కడి కాముఁ డిఁకేటి నామనుల్?

నారీమణియే కామునికిఁ బ్రధానాస్త్రము. అట్టినారియొక్కతె జయింపఁబడినపక్షమున, తత్సహాయు లందఱును విఫలప్రయత్నులయి భంగమును బొందుదురు. ఎట్లన—

ఉ. గందముఁ, గౌముదీశకలఁ, గల్వలరాయఁడు, బూవుఁదోఁటలం
దందపుఁబాటపాడు మధుపాళుల నొప్పు వసంతకాలమున్,
మందకదంబవాయువులు, మంద్రరవాబ్దలసద్దినంబులున్,
డిందనికామమిత్రములు; నిర్జితు లిందఱు స్త్రీల గెల్చినన్.

ఇఁకఁ గాలవిలంబము చాలును. ఇప్పుడు దేవరయాజ్ఞ యేమి?

క. ఉరుతరవిచారశరముల
నరిబలములఁ గూల్చి సేన యడఁచెదఁ గామున్;
గురుసేనఁ ద్రుంచి పార్థుఁడు
శరధారల సింధురాజుఁ జంపినకరణిన్.

వివే—(ప్రసాదపూర్వకముగా) మంచిది. నీవు శత్రువిజయమునకు సన్నద్ధుఁడవు కమ్ము.

వస్తు—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను. (అనిప్రణమిల్లి నిష్క్రమించుచున్నాఁడు)

వివే—వేదవతీ! నీవు పోయి క్రోధుని జయించునిమిత్తము క్షమను బిలుచుకొని రమ్ము.

ప్రతీ—దేవరయాజ్ఞాపించినట్లు చేసెదను. (అని నిష్క్రమించి క్షమతోఁగూడఁ బ్రవేశించుచున్నది)

క్షమ—

ఉ. క్రోధమహాంధకారఘనదుర్వికటభ్రుకుటీతరంగరా
డ్రాధికు లుగ్రసాంధ్యకిరణారుణదృష్టులు నా మహావిప

క్రోధమదూవణోక్తులకు నల్గక సైతురు, వీరులో యనన్,
సాధులు నిశ్చలాత్యమలసాగరతుల్యగభీరు లెంతయున్.
(శ్లాఘనపూర్వకముగాఁ దన్నుఁ జూచుకొని)
ఉ. లేదు వచోధికక్రమము; లేదు శిరఃపరిపీడనంబునున్;
లేదు మనోపతాపమును; లేదు శరీరవిమర్దనంబునున్;
లే దలహింస యాదిగ గణింపఁగఁ గల్గుననర్థయోగమున్;
క్రోధిగ నేన కద్దయును గ్రోధజయంబున శ్లాఘ్య నయ్యెదన్.
(ఇద్దఱును ముందుకు నడుచుచున్నారు)

ప్రతీ—అదె మహారాజుగారు. ప్రియసఖీ! ఆయనను సందర్శించుకొమ్ము.

క్షమ—(సందర్శించి) దేవా! జయ మగుఁగాక! జయ మగుఁగాక! ఇదిగో దేవరవారి దాసురా లయినక్షమ సాష్టాంగప్రణామము చేయుచున్నది.

వివే—ఓ క్షమా! ఇక్కడఁ గూరుచుండుము.

క్షమ—(కూరుచుండి) దేవా! ఈసేవకురా లెందునిమిత్తము పిలిపింపఁబడినదో యాజ్ఞ యిండు.

వివే—ఓ క్షమా! మా కిప్పుడు సంప్రాప్త మయినయుద్ధము నందు దురాత్ముఁ డయినక్రోధుని నీవు జయింపవలెను.

క్షమ—దేవరవారి యనుగ్రహమువలన నేను మహామోహుని నైనను జయించుటకు సమర్థురాల నగుదును. ఇఁక నాతని యనుచరమాత్రుఁ డైన క్రోధుఁ డెంత! నేనాపనిని శీఘ్రముగానే నిర్వహించెదను.

ఉ. అన్నిట దేవతాయజ్ఞపితృయజ్ఞతపోధ్యయనక్రియాదు లా
మాకొ ... నిరాకరణంబ నమయించెడువానిని ...

గన్నుల నిప్పుకల్ గురయుచుఁ గ్రొక్కఁడువాని వధింతుఁ గ్రోధునిన్
మున్నలభద్రకాళి యదయుండ్ మహిషాసురుఁ జంపినట్లుగన్.

వివే—ఓక్షమా ! ఇప్పుడు క్రోధవిజయోపాయము నాకు వినిపింపుము.

క్షమ—దేవా! విన్నవించెదను వినుఁడు.

చ. పురుషుఁడు క్రుద్ధుఁ డౌటనగు మోహము, దురాగ్రహము చేఁ బ్రసాదముం
బరుషవచస్కుఁ డౌఁ గుశలవార్త, ప్రమోదము తాడనోగ్రుఁ డౌ,
నరకముఁ గఁ జెల్లుఁ ? బొందుదు రనిర్జితచిత్తులు దైవికాపదు
త్కరమున క్రోధభావ మెటుకల్గు దయాగసమానసంబులన్ !

వివే—సాధు! సాధు!

క్షమ—దేవా! క్రోధుని జయించుటవలననే హింసాపారుష్య మానమాత్సర్యాదులు సహితము జయింపఁబడినవారగుదురు.

వివే—మంచిది నీవు శత్రువిజయమునకు సంసిద్ధురాలవు కమ్ము.

క్షమ—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించుచున్నది.)

వివే—వేదవతీ! లోభునిజయించుటకయి సంతోషునిబిలుచుకొనిరమ్ము.

ప్రతీ—దేవర సెలవిచ్చినట్లు చేసెదను. (అని నిష్క్రమించి సంతోషునితోడఁ గూడఁ బ్రవేశించుచున్నది.)

సంతో—(ఆలోచించి జాలితో)

చ. ప్రతివనమందు స్వేచ్ఛముగఁబండ్లు లభించును భూరుహంబులన్
హితవుగ నెల్లచో వారము నిర్ఝరు జలని సొంపులో యుండగా :

ప్రతిలతయందుఁ జిక్కి మృదుపల్లవముల్ సుఖశయ్య కింపుగా;
నతికృపణుల్ శ్రమంపడుదు రట్లయి యున్ ధని శాంగణంబులన్.

(ఆకాశమువంకఁ జూచి) ఓరి మూర్ఖా! లుబ్ధా! నీయీ వ్యామోహము దురుచ్ఛేదము గదా!

చ. ధనము గతృష్ణికాబ్ధి జలధార వృథా దగఁగొన్ననీవు దా
వునఁ గన, నెన్నిసార్లు చెడిపోవఁగలేదు భవత్ప్రయత్నముల్?
మనుజమృగంబ! యాశవిటుమాన వటయ్యెను; నేఁడుమాఱు గా
దనుఁగదు నీమనం బశనితో శిలతో నదిచేయఁగాఁబడెన్.

లోభాంధకారహతుఁడవైన నీయీ చేష్టితము మనస్సున కాశ్చర్యము కలిగించుచున్నది.

ఎట్లనిన—
మ. ధనమార్జించెద నందుఁ, బ్రాప్తమగువిత్తంబింక హెచ్చింతు నం
చును లాభంబును వృద్ధిఁ గూర్చెద నంచున్ సామ్మెధ్యానింతు నీ
వనిశంబున్; గన వన్నిటిందినడియాయాశాపిశాచంబు గ్ర
క్కున లోభాంధతమోవృతున్ నినున్ బల్మినం జక్కటా!
మఱియును,
చ. ధనము గడించులే మొదటఁ దద్దయుఁ గష్టము; కల్గు కాపయున్
ధనమునకున్ ... విచారము రెండు వియోగమార్గముల్;
ధనము నశింపఁ గల్గును వ్యథల్; సిరిఁ గూర్పఁగఁ గల్గవా వ్యథల్;
ధనమును గూర్పఁబూనుటయె దారిగూర్చఁగా మేలు చెప్పుమా.
అంతేకాక,

మ. అనయంబున్ నటియించు మృత్యువు శిరంబందున్; జరాపన్నగం
బును మింగున్నది; విశ్వమున్ విమవధూపుత్రామలోగ్రభ్రమముల్

ఘనబోధాంబులఁ జొచ్చి లోభదండమున్ గాఢాజ్ఞతాజన్యమున్,
క్షణ మానందసుధాంబుధిన్ మునుఁగుమా శశ్వత్సుఖంబబ్బెడున్

ప్రతీ—వీరె ప్రభువువారు. ఓ మహానుభావా! ఈయన సన్నిధానమునకుఁ బొమ్ము.

సంతో—(సమీపమునకుఁబోయి) స్వామీ! జయము గాక! జయము గాక! వీఁడె సంతోషుఁడు. (అని ప్రణమిల్లుచున్నాఁడు.)

వివే—ఇక్కడ గూర్చుండుము. (అని సన్నిధానమునందుఁ గూరుచుండఁ బెట్టుకొనుచున్నాఁడు.)

సంతో—(వినయముతోఁ గూరుచుండి) ఈ భృత్యజనునిచేత నేమి దేవర యాజ్ఞాపింపవలెను.

వివే—నీ ప్రభావము లోకవిదితము యైనది. కాఁబట్టి యిప్పుడు బహుభాషలతోఁ బని లేదు. నీవు లోభునిజయించుటకయి వారణాసికిఁ బోవలెను.

సంతో—దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను.

చ. కలయ మెలంగుచున్ బహుసుఖంబుల ముజ్జగము ల్జయించి లో
నలరుచు, దేవభూసుర మహావధబంధనలబ్ధవృద్ధియై
వెలసినలోభునిన్ బరిభవించి జయించి యొనర్తు భస్మమున్,
బలము వ ముఖ్న దాశరథి పంక్తిముఖున్ నుఱుమాడినట్లుగన్.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అప్పుడు పిసీత వేషుఁడైన యొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పురు—దేవా! పదముపరిమాణము గతములు జరపఁబడినవి. మహామాత్రులు పెట్టిన విదము యాత్రానమయము సమీపించినది.

వివే—అట్లయినయెడల సేనాపతులు సైన్యములను బయలు

[illegible]

పురు—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

[తెరలో]

చ. పటుకటదానమత్తమధుపంబులఁ గూర్చెదఁ సద్విపంబులన్;
బటిమ నిడుండు తేరులకు వాయుజవంబుల వాహవంబులన్;
భటులొనరింపుఁ డీటెల నభ మ్మసిశాఙ్గ్రయుహావన మ్మనన్;
జటులకృపాణపాణుల వెసం జనుఁ డాశ్వికులార! శ్రేణులై.

వివే—మంచిది! మంగళస్నానాము లాచరించి, నేనును ప్రయాణమయ్యెదను. (పారిపార్శ్వకునితో) సంగ్రామోచితమయిన రథము నాయత్తపఱిచి తీసికొనిర మ్మని సారథి కాజ్ఞాపింపుము.

పారి—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

[అప్పుడు యుద్ధరథమును సిద్ధముచేసికొని సారథి
ప్రవేశించు చున్నాఁడు.]

సార—దేవా! ఇదిగో రథము సిద్ధముగా నున్నది. దేవర వారు రథారోహణము చేయవచ్చును.

వివే—(మంగళవిధులను నిర్వర్తించి రథారోహణము నభినయించుచున్నాఁడు.)

సార—(రథవేగము నిరూపించి) దేవా! చిత్తగింపుఁడు. చిత్తగింపుఁడు.

మ. పరిచరోద్ధూతరజశ్ఛటానుమితకుంభద్యానధావత్తురా
గ్రిచయేమత్పరిచుంబితోర్వ్యపరిభాగంబుల్ మహావాహముల్
ప్రచలన్మంథరమథ్యమానజలధిధ్వానోగ్రఘోషంబుగా
నుచితప్రౌఢినివ్యోమమార్గమున, నోహో! తెరుఁగొంపో మెదుర్.

ఇదిగో సమీపమునఁ ద్రిభువనపావనమైన వారణాసీనగరము దృష్టిపథమునఁ బడినది.

శా. ధారాయంత్రపతజ్జలోదితసితాంతిధ్వానసంయుక్తముల్,
సీరేజారికరప్రభాధవళముల్, శుభ్రాంబు సౌధాగ్రముల్,
భూరిప్రేత్యములై శరద్ఘనళజీమూతాంతరాజత్తటి
చ్ఛీరమ్యంబు లవే పతాక లెసఁగున్ జిత్రద్యుతి స్ఫూర్తులన్.

ప్రతిముకుళలగ్నమధుకరనికర ఝుంకారముఖరంబులును వికసితకుసుమ వికరవిగళన్మకరంద వర్షాతిశయ ధురంధరంబులును నానాప్రసూన సుగంధబంధురంబులును శ్యామాయమాననిబిడచ్ఛదచ్ఛాయావనీరుహ మనోహరంబులును నగరపురోద్యానప్రదేశంబు లవిగో సమీపంబునఁ గానవచ్చుచున్నవి. ఈవాయువులుసహిత మిక్కడఁ బాశుపతవ్రతమును గ్రహించిన దాపసులవలెనే కానఁబడుచున్నవి.

ఎట్లన—

చ. సురనదినీటఁ దేలి, సురజోభసితంబు కరంబుఁ దాల్చి, యీ
శ్వరునకు నర్చనల్ సలుపుచాద్భుత మీఁదను బూలు రాల్చి, ని
ర్భరమధుపస్వరంబునను బాటలు చాలఁ జెలంగ, వాయువుల్
కరమును నృత్యము ల్సలుపుఁ గంపమునొందులతాభుజంబులన్.

వివే—(ఆనందముతోఁ జూచి)

మ. హృదయాకర్షక మయ్యెఁ జంద్రమకుటుండిందుంట నీకాశి, తాఁ
బదమై ముక్తికి విద్యయట్లు, తమ మార్పన్ స్వప్రభానందమై;
యిదె భూదేవికి వేల్లుముత్యసరమై యింపొందెరున్ వంగి స్వ
ర్ణది, వక్రేందుకళన్ కదున్ నగుచు ఫేనవ్యాజహాసంబునన్.

సారథి—ఓ దేవా! చూడుఁడు, చూడుఁడు, ఇది గంగాతీరమున కలంకారభూతమును ద్రిభువనపావనమును నైన శ్రీమత్త్రిలోకగురు విశ్వేశ్వరాఖ్యమహాదేవుని యాలయము.

వివే—(హర్షముతో) ఓయీ!

క. మును జెప్పిరి యీ దేవుం
డనఘుండు క్షేత్రాధినాథుఁ డని క్షేత్రజ్ఞుల్;
తనువు లిట విడిచి వింతగ
ఘనపుణ్యులు భక్తజనులు కలియుదు రితనిన్.

సార—దేవా! చూడుఁడు, చూడుఁడు. అదిగో మనలను జూచినమాత్రముననే కామక్రోధలోభాదు లిక్కడనుండి దూరముగాఁ దొలఁగుచున్నారు.

వివే—వా రట్లే యగుదురు. కానిమ్ము. నేనీయాలయము వంటుఁ బ్రవేశించి యభీష్టసిద్ధికై యీ భగవంతునికి నమస్కరించెదను. (అని రథమునుండి దిగి గుడిచొచ్చి చూచ్చి నిగిడించి) ఓ మహాదేవా! నమస్కారము నమస్కారము. నన్ను దయచూడుము.

క. కావింతు నమస్కృతు లివె
యోవిమలజ్ఞానదేహ! యోచంద్రధరా!
యో వేదత్రయలోచన!
సేవకున కొసంగు నాకు శ్రేయఃప్రాప్తుల్.

(అని నమస్కరించుచున్నాఁడు)

సార—దేవా! ఇది త్రిభువనగురుఁడైన యాదికేశవస్వామి యాలయము.

వివే—అక్కడకు రమ్ము. (అని వెళ్ళి యాదికేశవస్వామికిఁ బ్రదక్షిణముచేసి) ఓ భగవంతుఁడా! జయమగుఁగాక! జయమగుఁగాక!

దండకము. అమరచయచమూచక్ర చూడామణిశ్రేణినీరాజితోపాంత పాదద్వయాంభోజ! రాజన్నఖద్యోతకిమ్మీరితస్వర్ణపీఠా!

స్ఫురద్వైత విభ్రాంతిసంతాన సంతప్తవందారుసంసార నిద్రాపహా
రైకదక్షా! కుష్మాండలోద్ధార సంభారసంఘట్టదంష్ట్రాగ్ర కోటి
స్ఫురచ్చైలచక్రా! క్రమాక్రాంతలోకత్రయా! బాహుబలప్రోద్ధృ
తాభీలగోవర్ధనచ్ఛత్ర నిర్వారితాఖండ లోద్యోజితాకాండచండాం
బువాహాతి వర్షత్రసద్గోకులత్రాణవిస్మాపితాశేషవిశ్వా! ప్రభూత్తంస!
దైతేయసీమంతినీవర్గసీమంతసిం దూరసంధ్యామయూఖచ్ఛటోన్మార్జ
నోద్దామధామాధిపా! త్రిస్తదైత్యేంద్రవక్షస్తటీపాటనాకుంఠభాస్వ
న్నఖశ్రేణిపాణిద్వయస్త్రస్త విస్తారిరక్తార్ణవామగ్నలోకా! త్రిలోక
ద్విషత్త్రైకటభోద్దండకంఠాస్థికూటస్ఫుటోన్మార్జితోద్దామ చక్రిస్ఫుర
జ్జ్యోతిరుల్లాసితోద్దామ రోద్దండదోర్దండ! ఖండేందుచూడప్రియా!
ప్రౌఢదోర్దండవిభ్రాంతమంథాచలక్షుబ్ధదుగ్ధాంబుధి ప్రోత్థితశ్రీభుజా
వల్లిసంశ్లేష సంక్రాంతపీనస్తనాభోగపత్రావళీలాంఛితోరస్థలా!
స్థూలముక్తాఫలోదారహారప్రభామండల ప్రస్ఫురత్కంఠ! వైకుంఠ!
సద్భక్తసందోహసంసారమోహచ్ఛిదం బైన బోధోదయం బిమ్ము నా
కో మహాదేవ! దేవా! నమస్తే నమస్తేనమః॥

(అని సాష్టాంగప్రణామము చేసి బయలుదేరి చూచి) మంచిది! ఇదియే మనకు నివాసార్హమయిన ప్రదేశము. ఇక్కడనే మనసేనలను విడియించెదను.

(అని యుద్ధమును నిష్క్రమించుచున్నారు)

---

## పంచమాంకము



[అప్పుడు శ్రద్ధ ప్రవేశించుచున్నది]

శ్రద్ధ—(ఆలోచించి) ఈవిధము సుప్రసిద్ధమయినదే కదా!

గీ. జ్ఞాతివైరంబువలనను సంభవిల్లు
క్రోధశిఖ నిర్దహించును గులము నెల్లఁ;
ఘనసమీరాహతమహీజఘట్టనమునఁ
గలుగుదహనంబు వనమెల్లఁ గాల్చునట్లు.

(కన్నీరు విడుచుచు) అక్కటా! దారుణమయిన సోదరమరణము వలనఁ గలిగిన శోకానలము దుర్వారమయినదిగా నున్నది. అది వివేకమేఘశతములచేత నయినను జల్లారదు. ఎట్లన—

చ. స్థిరగురువస్తువుల్ గిరులు సింధువులున్ నదులున్ నశింపఁగా,
నరులన నెంత, యల్పులు కనత్తృణకల్పులు మృత్యుదృష్టికిన్!
పొరిఁబొరి బంధుదుఃఖభవమోహము దేహి వివేకమార్పఁగా,
నెరియుచు శోకవహ్నిదహియించెడుఁ జిత్తము నట్టులయ్యెనున్.

క్రూరస్వభావులయినను గామక్రోధాదులగు సోదరులు కథాశేషులగుటవలన నాగతి యిట్లయినది.

క. భీకరశోకాగ్నిశిఖా
నీకము శిథిలములొనర్చు నెఱుఁకుల నెల్లన్;
పైకొలుపు దేహశోషముఁ;
బ్రాకటముగ నంతరాత్మ వడిగ దహించున్.

(ఆలోచించి) "బిడ్డా! శ్రద్ధా! నేనిక్కడనుండి హింసాప్రధానమయిన యుద్ధమును జూడలేను. కాఁబట్టి నేనీకాశికాపురమునువిడిచి సాలగ్రామ మనుపేరుగల విష్ణుక్షేత్రమునందుఁ గొంతకాలము గడపెదను. నీవక్కడకువచ్చి వృత్తాంతమును జరిగిన క్రమమున నాకు నివేదింపుము" అని విష్ణుభక్తిదేవి నాకాజ్ఞాపించినది. కాఁబట్టి యాదేవిసన్నిధానమునకుఁబోయి యీసమరవృత్తాంతము సర్వమును నేనామెకు విన్నవించెదను. (ముందుకునడిచిచూచి) ఇది యాచక్రవర్తి

ర్థము, ఇందుసంసారసాగరోత్తారకమయిన నావకుఁగర్ణధారుఁడైన భగవంతుఁడగు శ్రీహరి ప్రత్యక్షముగా వాసముచేయుచున్నాఁడు. (ప్రణమిల్లి) ఇదిగో మునులచే నుపాస్యమానురాలైనవిష్ణుభక్తిదేవి శాంతితో నేదో యాలోచించుచున్నది. నే నామె సమీపమునకుఁ బోయెదను. (అని ముందుకు నడుచుచున్నది.)

[అంతట విష్ణుభక్తియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు.]

శాంతి—అమ్మా! మీరు ప్రబలచింతాకులహృదయ లయి యున్నట్టు కానఁబడుచున్నారు.

విష్ణు—బిడ్డా! మహావీరవరక్షయకర మయిన యీ ఘోర యుద్ధమునందు బలవంతుఁడైన మహామోహునితోఁ బ్రతిఘటించిన పుత్రపౌత్రయుఁడైన వివేకుని వృత్తాంత మేమయినదో తెలియకపో యెనని నామన స్సిప్పు డస్వస్థముగా నున్నది.

శాంతి—దేవీ! ఇక్కడ విచారింపవలసినపని యేమున్నది! దేవిగారి యనుగ్రహ మున్నందున, వివేకమహారాజునకు విజయము నిశ్చయ మని నే నెఱుఁగుదును.

విష్ణు—బిడ్డా!

క. ఘనధర్మపక్షబలమున
ననివార్యంబుగ లభించు నభ్యుదయంబుల్;
విను మట్లయ్యును, సుహృదుల
మన సెపుడు నపాయశంక మఱిమఱి పూనున్.

అంతేకాక శ్రద్ధ యింతతడవు రాకుండుట మనస్సునకు సందేహము పుట్టించుచున్నది.

శ్రద్ధ—(సమీపమునకుఁ బోయి) భగవతీ! ప్రణమిల్లు చున్నాను.

విష్ణు—శ్రద్ధా! నీవు క్షేమముతో వచ్చితివా!

శ్రద్ధ—దేవిగారి యనుగ్రహమువలన.

శాంతి—అమ్మా! ప్రణామము చేయుచున్నాను.

శ్రద్ధ—పుత్రీ! నన్నాలింగనము చేసికొమ్ము.

శాంతి—(తల్లిని కౌఁగలించుకొనుచున్నది)

శ్రద్ధ—బిడ్డా! విష్ణుభక్తి దేవిప్రసాదముచేత మునిజనమనోనివాసమును బొందుము.

విష్ణు—అక్కడ నేమిజరిగినది?

శ్రద్ధ—దేవిగారికిఁ బ్రతికూలముగాఁ బ్రవర్తించువారికిఁ దగినట్లు జరిగినది.

విష్ణు—అవి సవిస్తరముగాఁ జెప్పుము.

శ్రద్ధ—దేవీ! అవధరింపుము. దేవి యట్లాదికేశవాలయము నుండి వెడలఁగానే తనపాటలవర్ణములగు గొంచెము పిడిచి సూర్యుఁడు ప్రకాశించుచుండఁగా విజయఘోషాహూయమానానేకవరవీరబహుశిసింహనాదబధిరితదిగంతంబునుసతతరథతురగఖరతరఖురఖండితభూమండలోచ్చలద్విపులరజఃపటలాంతరితభాస్కరబింబంబు ప్రబలతరకర్ణతాళాస్ఫాలనోచ్చలత్సుదికరికుంభసిందూరసంధ్యాయమానదశదిశంబును బ్రళయజలధరధ్వానభీషణంబునునగువారియొక్కయును నయొక్కయు సైన్యసాగరము సన్నద్ధమయి యున్నప్పుడు వివేకమహారాజు మహామోహమహారాజునకడకు నైయాయికదర్శనుని దూతనుగాఁ బంపెను. అతఁడుపోయి మహామోహునితో నిట్లనియెను—

ము. చను, విష్ణ్వాలయపుణ్యకాననదీసాన్నిధ్యభక్త్యంతరం
గలివాసంబు త్యజించి, మ్లేచ్ఛమహిఁ గ్రుంకన్ భృత్యవర్గంబుతో;

చనఁకున్నన్, గరవాలదాడితభవత్సర్వాంగధారాకరత్
ఘనరక్తంబులు త్రాగఁగూఁతలిడుచక్కల్ క్రిందుమీమాంసముల్.

విష్ణు—తరువాత, తరువాత.

శ్రద్ధ—దేవీ! తరువాతఁ గోపము చేత వికటలాటతట తాండవితభ్రుకుటిన్యై మహామోహుఁడు—"ఈదుర్ణయపరిపాకఫలమువివేక ప్రీత మనుభవించునుగాక!"—అని పలికి, తానే మొట్టమొదటఁ బాషండాగమబృందములను బాషండశాస్త్రసహితముగా యుద్ధమునకు బురికొల్పెను. ఈలోపల మనసైన్యముఖమునందు,

గీ. వేదవేదాంగతతు లుపవేదసమితి
స్మృతిపురాణేతిహాసాదు లెలమిఁ గొలువఁ,
జంద్రసమకాంతితో సరస్వతి సరోజ
కర [illegible] నిల్చె నాకస్మికముగ వచ్చి.

విష్ణు—తద[illegible]తరము.

శ్రద్ధ—దేవీ! అప్పుడు వైష్ణవ శైవ సౌరాదు లయిన సర్వాగమబృందములును సరస్వతీదేవి సకాశమునకు వచ్చెను.

విష్ణు—అటుతరువాత.

శ్రద్ధ—తదనంతరమున—

శా. మీమాంస, సరస్వతీసతిపురోవీథిన్ రణోత్సాహయై,
ప్రాముఖ్యస్థితి న్యాయకాపిలమహాభాష్యాదిసద్దర్శన
స్తోమంబు లొక్కటవంగ, ధర్మముఖయై, శుద్ధాయుతన్యాయనో
ర్భిమాకారణి నిల్చె, దుర్గకరణిన్, వేదత్రయీనేత్రయై.

శాంతి—స్వభావప్రతిపక్షము లయినయాగమన్యాయశాస్త్రబృందము లొక్కటిగాఁ గలియుట యెట్లు సంభవించినది?

శ్రద్ధ—పుత్రీ!

కం. ఇతరేతర వైరమునన్
సతము మెలఁగు నేకవంశజాతులు తమకున్
క్షితిలోపల నవమానం
బితరులచేఁ గల్గు నోట నేకము కారే!

వేదప్రసూతములయిన తమలో లోలోపల విరోధమున్నను, వేదసంర క్షణమునకొఱకును నాస్తికపక్షాధిక్షేపమునకొఱకును శాస్త్రసంఘముల కైకమత్యము కలుగును. అగమసముదాయములో సహితము విరోధము తత్త్వవిచారులకుఁ గనరాదు. ఎల్లన—

శా. శాంతం బద్వయ మవ్యయం బజము శశ్వద్బ్రహ్మ, మాదత్త్వమ
శ్రాంతం బాగమపఙ్క్తిచే సగుణతన బ్రహ్మచ్యుతేశాఖ్యలన్
వంతొప్పన్ బహుధా స్తుతింపగఁబడున్, నానాగమశ్రేణి సం
క్రాంతంబౌ నొకబ్రహ్మమందు నె,సముద్రంబందు నేఱ్లున్ బలెన్.

విష్ణు—తరువాత? తరువాత?

శ్రద్ధ—దేవీ! తరువాతనిరువాఁగుసందును నిరంతరశరనికర ధారాసంపాతోపదర్శిత దుర్దినులగు కరితురగరథపదాతులకును నుభయపక్షయోధజనులకును సంకులసమరంబు సంప్రాప్తంబయ్యెను. అప్పుడు,

మ. ప్రవహించె న్నదులస్రితోయములుఁ, గ్రవ్యస్ఫారపంకంబులున్
వివిధోద్యద్ఘనకంకరంకనివహాభీలావకీర్ణంబులున్,
నవనారాచవిభిన్నహస్తిగిరిశీర్ణభ్రష్టవేగోల్లస
ద్ధవళచ్ఛత్రసమూహహంసములునై తద్యుద్ధరంగంబునన్.

ఆమహాదారుణసంగ్రామంబునందుఁ బరాపరపక్ష విరోధిత్వముచేతఁ బాషండాగమబృందమును ముందుంచుకొని వచ్చిన లోకాయతికతంత్రసముదాయము మన్యోన్యసైన్య విమర్దనముచేత వినష్టమయ్యెను;

అనంతరము పాషండాగమజాలము పర్యాల మగుటచేత సదాగమ సాగరప్రవాహముచేత, గొట్టుకొనిపోయెను; తదనంతరము సౌగతా గమసముదాయములు సింధు గాంధార మగధాంగపారశీకవంగకళిం గాదిమ్లేచ్ఛప్రాయదేశములఁ బ్రవేశించెను; పాషండ దిగంబర కాపాలికాద్యాగమసంచయంబులుపామరబహుళంబు లైనపాంచాల మాళవాభీరావర్తసాగరానూపదేశములయందు నిగూఢముగా సంచ రించుచున్నవి; న్యాయాద్యనుగతయైన మీమాంసచేత గాఢప్ర హారజర్జరీకృతములైన నాస్తికతర్కసమూహంబులు తమ యాగమ సందోహంబులు పోయినదారినే పోయినవి.

విష్ణు—అటుతరువాత?

శ్రద్ధ—అటుతరువాత వస్తువిచారునిచేతఁ గాముఁడు హతుఁ డైనాఁడు; క్షమచేతఁ గ్రోధపారుష్యహింసాదులు హింసింపఁబడి నారు; సంతోషునిచేత లోభ తృష్ణాదైన్యానృతవాద పైశున్య స్తేయ పరిగ్రహులు నిగ్రహింపఁబడినారు; అనసూయచేత మత్సరుఁడు జయింపఁబడినాఁడు; పరోత్కర్ష సంభావనునిచేత మదుఁడుసంహరింపఁ బడినాఁడు; పరగుణాధిక్యునిచేత మానుఁడు ఖండింపఁబడినాఁడు.

విష్ణు—(హర్షముతో) చక్కగా జరిగినది. ఇఁక మహామో హునికథ యేమయినది?

శ్రద్ధ—దేవీ! మహామోహుఁడు యోగవిఘ్నసహితుఁ డయి యెక్కడనో యడఁగి యుండుటచేత నాతనిజాడ తెలియరాకున్నది.

విష్ణు—అట్లయినచో మహానర్థశేష మింకను నిలిచియే యున్నది. అతఁడు పరిహరణీయుఁడు. ఎట్లన—

క. పరమాదరపరుఁ డగుచుఁ,
పిరసంపదఁ గోరు శేముషీమంతుం డెం

దరిశేష మగ్ని శేషము
గురుతరఋణశేష ముంచఁ గూడదు సుమ్మా.
ఇఁక మనస్సుయొక్క వృత్తాంత మేమి?

శ్రద్ధ—దేవీ! పుత్రపౌత్రాదిమరణ జాతశోకావేశముచేత నాతఁడును బ్రాణత్యాగము చేయ నిశ్చయించుకొన్నాఁడు.

విష్ణు—(చిఱునవ్వునవ్వి) ఇది యంతయు నిట్లయ్యెనేని మనము కృతార్థత నొందినారము; పురుషుఁడును బరమానందమును బొందును. అయినను దురాత్ముఁ డయిన యతఁడు ప్రాణత్యాగ మేల జేసికొనును?

శ్రద్ధ—ఉపనిషద్దేవి ప్రబోధోదయముకొఱకు గృహీతసంకల్పురా లయియున్నందున నతఁ డీవిధముగా శరీరముతోఁ జిరకాల ముండఁడు.

విష్ణు—అగుఁగాక! వైరాగ్యోత్పత్తికొఱకు వైయాసికియైన సరస్వతిని నే నాతనికడకుఁ బంపెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రవేశకము

---

[అప్పుడు మనస్సును, సంకల్పుఁడును ప్రవేశించుచున్నారు]

మన—(కన్నీటితో) హా! పుత్రకులారా! ఎక్కడకుఁ బోయినారు! ఒక్కసారి మీప్రియదర్శనమిండు. ఓరోరి కుమారులారా! రాగ ద్వేష మద మాన మాత్సర్యులారా! నన్ను గౌఁగిలించుకొండు. నాయంగములు నొచ్చుచున్నవి. అయ్యో! అనాథుఁడను వృద్ధుఁడను నయియున్న నన్నొక్కఁడయిన నాదరింపఁడేమి! ఓయనసూ

యాదులైన కన్యకలారా! మీ రెందుఁబోయినారు! ఆశా హింసా తృష్ణాదులైన కోడండ్రా! మందభాగ్యుఁడనైన నా కొక్కఁడను దక్కకుండ దైవహతకుఁడు మిమ్మందఱ నేక కాలమునం దెల్లెత్తుకొని పోయినాఁడు! (తడఁబాటుతో)

మ. తనువెల్లన్విషవహ్నియట్లలముదున్, దాఁగాల్చెడు న్మర్మముల్
పెనుపొందించెడుఁ దీవ్రవేదనల; మైపెంపెల్ల మర్దించెడున్;
ఘనమోహం బెదఁగూర్చెడున్; నరవివేకంబెల్లఁ బోకార్చెడున్;
మనుమాన్ జీవితమున్ గ్రసించెడు, వెసన్ శోకజ్వరంబక్కటా!

(అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

సంక—ఓరాజా! తెప్పిఱిలుము.

మన—(తెప్పిఱిల్లి) ఇట్టియవస్థను బొందియున్న నన్ను దేవియైన ప్రవృత్తిసహిత మోదార్పకున్న దేమి?

సంక—(కన్నీరువిడుచుచు) దేవా! ఇంకను నీకుఁ బ్రవృత్తి దేవి యెక్కడిది. కుటుంబమరణసంజాతశోకానలదగ్ధహృదయయయి యామె గుండెలుపగిలి మృతినొందినదని విన్నాఁడను.

మన—హా! ప్రియురాలా! నాకొక్కప్రియమయిన ప్రతివచనమీలయియ్యవు? కటకటా!

ఉ. దేవిరో! నన్నుఁబాసి మునుత్రిమ్మరవెన్నఁడు స్వప్నమందునన్;
నీ వెడఁబాసియుంటను నేమృతకల్పుఁడనైని నిత్తఱిన్;
దైవవిచేష్టితంబునను దవ్వయియుండియు నీవు, నేఁ దహా!
జీవముతోడనుండెద; నిసీ! యసుకుల్ కరముఁ దురంతముల్.

(అని మరల మూర్ఛపోవుచున్నాఁడు.)

సంక—ఓరాజా! ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

మన—(తెలివితెచ్చుకొని) ఇఁక నాకు జీవితాశ చాలును.

ఓసుఁకల్పా! ఓతిపేర్చుము. ఇప్పుడు నేను నీ ప్రవేశము చేత శోకాన లము నార్చుకొనియెదను. (అని సన్నాహపడుచున్నాఁడు.)

[అప్పుడు వ్యాససరస్వతి ప్రవేశించుచున్నది.]

సర—"సఖీ! సరస్వతీ! అపత్యమరణఖిన్నుఁడయి యున్న మనస్సునొక్క ప్రబోధముకొఱకుఁ బొమ్ము. అతనికి వైరాగ్యోత్పత్తి యెట్లు కలుగునో యట్లు చేయుము" అని భగవతియైన విష్ణుభక్తిదేవి నన్నుఁ బంపినది. కానిమ్ము. నేనిప్పు డాతని సన్నిధికేపోయెదను. (సమీపమున కరుగి) వత్సా! ఈవిధముగా నీ వతిపరితాపము నేల పొందెదవు? పదార్థము లనిత్యములని నీకీ వఱకుఁ దెలిసినదే కదా! ఇతిహాసములను, ఉపాఖ్యానములను, నీ వీవఱకుఁ జదివినవే.

చ. అరయువిరించి యింద్రుఁడు సురాసురులుం బ్రముఖ్యులున్మనుల్
ధరణియు వార్ధులిట్టివగులట్టులు కల్పశతాయువు లైగన్,
బొరసెద రార శోకకరమోహము! స్వీయులబుద్బుదోపమా
స్థిరతనుసంహతుల్ తెగి నశించినయప్పుడు మూఢులేమనన్?

కాఁబట్టి పుట్టినపదార్థములయనిత్యత్వమును భావించుకొమ్ము. నిత్యానిత్యవస్తుదర్శి యగువానిని శోక మంటదు.

గీ. బ్రహ్మ మొక్కటియే సత్యవస్తు వగుచు
నిరత మెల్ల వికల్పిత మెప్పు డగునొ,
యప్పు డేకత్వమును జూచు; నట్టివాని
కెక్కడివి మోహశోకంబు లెంచిచూడ?

మన—భగవతీ! శోకావేగదూషితమయి యున్నా మనస్సునం దిప్పుడు వివేకమునకే యవకాశము లేదు.

సర—వత్సా! ఇది స్నేహదోషము. స్నేహము సర్వానర్థమూలక మన్నయీయర్థము సుప్రసిద్ధమే కదా!

మ. ప్రియనామంబునఁ గ్లేశదుర్విషలతాబీజంబుల న్నాటఁగాఁ,
బయికిన్ స్నేహమయాంకురంబు లడఁగన్ వజ్రాగ్నిగర్భంబులై;
బయలం బ్రాఁకుచు శోకవృక్షములిటుల్ బహ్వర్తిశాఖాశిఖల్
దయివారన్ శతముల్ తుషాగ్నిగతి మెల్లంగాల్చు దేహంబులన్.

మన—దేవీ! ఇది యంతయు సత్యమే అయినను శోకానల దగ్ధుఁడ నయిన నేను ప్రాణములు నిలుపుకొనుటకు శక్తుఁడను గాకున్నాను. అంత్యకాలమునందు మీదర్శన మగుట మేలయినది.

సర—ఓయీ! ఈయాత్మహత్యాప్రయత్నము మిక్కిలి యకృత్యము. అంతేకాక యీయుపకారులనిమిత్తము నీకీవేగిరపా టేల! ఆలోచించి చూడుము—

చ. ధరపయి వెన్కముం దిపుడు దారసుతాదిపరిగ్రహంబుచేఁ
బురుషసుఖార్థమై కలుగఁబోవదు మేలది నీకు నేరికిన్;
మరణమునొంది వారెపుడు మర్మవిభేదమొనర్తు రార్తిచే
నరు లటులయ్యుఁ గాంతురు ఘనశ్రమ వర్థముగాఁదదర్థమై.
చ. కటకట! వారికై శరులు గాంచనకష్టము లేని యీభువినిన్!
పటుగతి నెన్నికొండ లెగఁబ్రాఁకరు? వాఁకలదాఁట రెన్నిటన్!
దటుకున నెన్ని ఘోరవిపినంబులు ద్రొక్కరు? విత్తమత్తులన్
గుటిలవివర్ణవక్త్రిలను క్షుద్రనరేశులఁ జూడ రెందఱన్?

మన—దేవీ. ఇది నిశ్చయమే అయినను.
క. తనవలనఁ బుట్టి లాలన
మనయుంబును గనుచు మనసునందే యెపుడున్
మనియెడువారలఁ బాయుట
తనప్రాణముపోకయట్ల తలకొల్పు వ్యథన్.

సర—వత్సా! ఈవ్యామోహము మమకార వాసనామూల మయినది.

గీ. ఇంటికోడిని మార్జాల మీడ్చి తెచ్చి
మ్రింగునప్పుడు కలిగెడు మేటిశోక
మెలుకనో పిచ్చుకనో భుజియించునప్పు
డొదవమి తలంప మమత లేకున్కి గాదె?

కాఁబట్టి సర్వవిధములచేతను సర్వానర్థబీజ మైయున మమత్వమును రూపుమాపు ప్రయత్నము చేయవలయును. చూడు—

చ. జననమునొందు దేహమున జంతువు లెన్నియొ మర్త్యకోటికిన్;
తనువుననుండి యత్నమునఁ దాను వెలార్చును నందుఁ బెక్కటిన్?
విను మిఁక నందు బిడ్డలని పేరిడి కొన్నిటికిన్, దదర్థమై
దినమును గష్టపెట్టు నిజదేహము లోకము మోహ మేమనన్?

మన—దేవీ! అది యట్లేయగుగాక! అయినను మమత్వ గ్రంథి దురుచ్ఛేదమయినది. కాఁబట్టి యీసంగతిని దేవిగారు దృఢముగా మనసునం దుంచుకొనవలెను.

క. నిరతాభ్యాసదృఢీకృత
పరమస్నేహోరుసూత్రపరిగుంభితని
ష్ఠురమమతాపాశం బే
వెరవున నేరుతురె నరులు విడిపించుకొనన్?

సర—వత్సా! పదార్థములయొక్క యనిత్యతాభావమే మమత్వచ్ఛేదమునకుఁ బ్రధమోపాయము.

మ. చనలేదే బహుకోట్లు నీకును మహాసంసారము లెందఱో
జననుల్ తండ్రులు తాతలాత్మభవులున్ జాయల్ పితృవ్యాగ్రజుల్;

విను మష్లాట, సుహృత్తులెల్లఁ బుడమిఁ బిడ్డత్ప్రికాశాఛఙీ
వనులంచుం దలపోసిపోసి మదిలో భాస్వత్సుఖం బందుమా.

మన—భగవతీ! నీప్రసాదమువలన నావ్యామోహము పోయి
నది. కాని,

గీ. త్వన్ముఖశశాంకదీధితిప్రభవమైన
నిర్మలోపదేశామృతనిర్ఝరమున
క్షాళితం బయ్యె, మరల నాస్వాంత మకట!
మలిన మయ్యెడు శోకోర్మ్మ లలయుకతన.

కాఁబట్టి భగవతీ! ఈతడియాఅనిశోకప్రవణములు మానుట
కేదైన మందుగలదేమో యానతిమ్ము.

సర—వత్సా! దానినీవటకుమునులుపదేశించియే యున్నారు.

గీ. ఖాణపాతంబు లేకయెప్రభవ మొంది
భీకరాప్రి బులైన మర్మభేదులైన
గాఢశోకప్రహారసంఘాంతములకు
నరయఁగ నచింతయే పరమౌషధంబు.

మన—భగవతీ! అదిసత్యమే. అయినను జిత్తము దుర్వార
మయినది. ఎట్లన—

గీ. ఒక్కచింతను మరలింప, నోలి మదిని
గదిసి చింతాపరంపరల్ కప్పి వేయుఁ;
బల్మఱును వాతధూతాభ్రపటల మడరి
యిందుబింబంబు గప్పి మాయించునట్లు.

సర—చిత్తమున కీనికాశమున్నదే! అట్టిచోఁ జిత్తము నొక
శాంతవిషయమునందుఁ బ్రవేశ పెట్టవలయును.

మన—భగవతీ! ఆశాంతవిషయమేదో ప్రసాదింపుము.

సర—వత్సా! అది రహస్యమైనది. అయినను శోకార్తుల నుపదేశించుటలో దోషములేదు.

చ. స్థిరమతి నీలనీరధర దేహుని శ్రీహరినొండెఁ, గామసం
హారు వనజారిఖండధరు సాహరునొండెఁ, దలంపు; లేనిచో,
నిరతిని గ్రీష్మవేళ వలినీటికొలంకును బోలె నాత్మ న
ప్పురము నిరస్తశోకమును బ్రహ్మముఁ జొన్పి భజించు నిర్వృతిన్.

మన—(ఆలోచించి నిట్టూర్పుతో)సర్వవిధములచేతను నేను దేవిగారిచేత రక్షింపఁబడినాఁడను.

(అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

సర—వత్సా! నీహృదయమిప్పటి కుపదేశమమయినది. కాఁబట్టి నీకు మఱియొకటికూడ నుపదేశించెదను.

మ. జనకుండో సుతుండో తనువుం జాలింప, ధీశూన్యులి
మ్మనశోకాగ్నిఁ దపింతురెంతయు నురమ్ముల్మోఁదుకొంచొక్కటన్
కన సంసార మసారమంచు శమసౌఖ్యంబుం గడుం బెంచుచున్
ఘనధీమంతుల కావియోగచయమే కల్గించు వైరాగ్యమున్.

[అప్పుడు వైరాగ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వైరా—(ఆలోచించి)

మ. నవనీలోత్పలకోమలచ్ఛదముకన్నన్ సూక్ష్మమౌత్వక్కు మా
నవదేహంబులపై విధాతృఁడిటు నిండ న్మూయకున్నన్, సదా
స్రవదస్రాంబువిమిశ్రమాంసవిసరగ్రాసాగతధ్వాంక్షగృ
ధ్రవృకశ్వానములన్ మరల్పఁగను సాధ్యంబౌనె యెవ్వారికిన్!

మఱియును.

మ. తటిదాలోలము కల్మిజాలము: రజోద్యద్దేహము ల్దేహముల్;
స్ఫుటసంభోగరసంబు లంతవిరసంబుల్; లోకముల్ శోకముల్;

ఘటితాంచద్ధనము ల్మహానిధనముల్; వామ ల్విపత్సమ, ల
క్కట! యట్లయ్యుఁ, జరింతు రాత్మవిరతు ల్గాకీకుపంథాజనుల్.

సర—వత్సా! ఇదె వైరాగ్యుఁడు నీదగ్గఱకువచ్చుచున్నాఁడు. ఈతనిని గారవింపుము.

మన—నాపుత్రుఁడు వైరాగ్యుఁడా?

వైరా—(సమీపమునకుఁ బోయి) అయ్యా! నేను నమస్కారము చేయుచున్నాను.

మన—వత్సా! పుట్టఁగానే నీవు నన్ను విడిచిపోతివి. నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

వైరా—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

మన—పుత్రా! నిన్నుఁ జూచుటవలననే నాశోకావేశము ప్రశాంత మయినది.

వైరా—ఓతండ్రీ! ఇక్కడ శోకావేశమున కవకాశ మెక్కడ నున్నది?

ఉ. వారిని బాంధు, లేటివఱదన్ దరుకాండము, లాకసంబునన్
వారిదముల్, సముద్రమున నావికులుం, బడిఁగూడిపాయు న
ట్లారయఁ దల్లిదండ్రులును నాత్మజులున్ సఖులున్ సహోదరుల్
చేరుచుఁ బాయుచుండు టిది సిద్ధము; ప్రాజ్ఞుల కేడ శోకముల్?

మన—(ఆనందముతో) దేవీ! నాకుమారుండు చెప్పిన దిది యథార్థమే.

చ. అలసవయోవనల్ లలన, లాయువినాడలసత్కుజవ్రజం,
బలనవమల్లికాసురభిశీతానిలకందళముల్, తలంప ని
ర్మలను వేకమూర్జితతమంబగు మన్మతి కివ్వెఁ డెండమా
వుల జలమట్లు మిథ్యలయిపోల్పఁటితోఁ జెడుఁ బొంటివన్నియున్.

నర—వత్సా! ఇది యంతయు సత్యమేయయినను గృహస్థు(లకాశ్రమధర్మమును విడిచి ముహూర్తకాల మయిన నుండ(గూడదు. కా(బట్టి నే(డు మొదలు కొని నివృత్తిదేవియే నీకు సహధర్మచారిణి కా(గలదు.

మన—(లజ్జతో) దేవియాజ్ఞకు బద్ధు(డను.

నర—శమదమసంతోషాదు లయినపుత్రులు నీ కుపచారములు చేయుదురు; యమనియమా దులు మంత్రు లగుదురు; వివేకు(డును నీయనుగ్రహమువలననే యుపనిషద్దేవితో(డ(గూడి యావ రాజ్యసుఖ మనుభవించును గాక! మైత్రి మొదలయిననీతో(బుట్టువులు నలువురును నీయనుగ్రహముకొఱకు భగవతియైన విష్ణుభక్తి దేవిచేత( బంప(బడినారు. వారిని బ్రసాదపూర్వకముగా నంగీకరింపుము.

మన—దేవి యాజ్ఞాపించినట్లు చేసెదను. మీయాజ్ఞల నన్నిటిని శిరసావహించినా(డను. (అని హర్షముతో( బాదప్రణామము చేయుచున్నా(డు.)

నర—ఈయమనియమాసనప్రాణాయామాదులను జిరంజీవి వైన నీచే నాదరపూర్వకముగా( జూడ(దగినవారు. వీరితో(గూడి నీవుసామ్రాజ్య మధిష్ఠింపుము. నీవు స్వాస్థ్యమును బొందినప్పుడు జీవాత్ము(డును దనప్రకృతిని బొందును.

మ. రవిబింబంబు పయోధివీచులబలెన్, బ్రహ్మం బాకం డత్యాసం
భవనాశాదులుపొందితోచు బహుతన్ ద్వత్సంగతిన్ వృత్తులన్;
దివుటన్ వృత్తులడంచి నీవి(క నివృత్తిం గూడితే, నాత్మయున్,
రవిబింబం బురుదర్పణంబునబలెన్, హార్దైకతాచ్ఛం బగున్.

కానిమ్ము. జ్ఞాతుల కుదకప్రదానము చేయుటకొఱకు మనము నదికి బోవుదము.

మన—దేవి సెలవిచ్చినట్లు చేయుదము.

(అందఱును నిష్క్రమించు చున్నారు.)

---

## షష్ఠాంకము.

[అప్పుడు శాంతి ప్రవేశించు చున్నది.]

శాంతి—"పుత్రీ! నీకంతయుఁ దెలిసిన దేకదా!

చ. కొడుకులు పంచతం గనఁగ, గూఢముగాఁ జని మోహుఁ డేడనో
యడఁగుటచే విరక్తుఁడయి యుల్లమనన్ను బ్రశాంతి నొందఁగా,
వడిగను గ్లేశపంచకము పాయుటచేఁ బురుషుండు నొక్కటన్
గడుకొని తత్త్వబోధమునఁ గాంతుఁడయెన ర్చెడు నెల్లయప్పుడున్.

కాఁబట్టి నీవతిత్వరితముగా నుపనిషద్దేవి ననునయించినాసమ్ము
ఖమునకుఁ దీసికొనిరమ్మా" అని వివేకమహారాజుగారు నాతో సెల
విచ్చినారు. (చూచి) ఇదిగో తనలోఁ దా నేదో సంతోషముతో
నాలోచించుకొనుచు నాతల్లి యీవంకనే వచ్చుచున్నది.

[అంతట శ్రద్ధ ప్రవేశించు చున్నది.]

శ్రద్ధ—ఓహో! రాజకుల మారోగ్యమును బొందఁగాఁ జూచి
యిప్పుడుగదా చిరకాలమునకు నాకన్నులమృతరసపూర్ణములయినవి.

గీ. కలిగె ఖలవిగ్రహము రాజకులమునందుఁ;
బూజ్యులైరి శమాదిసత్పురుషులెల్ల;
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నాఁడు సర్వలోకేశ్వరుండు.

శాంతి—(చేరఁబోయి) అమ్మా! నీవు నిలుచుండి యేమి యాలోచించుచున్నావు?

శ్రద్ధ—బిడ్డా! రాజకుల మారోగ్యమును బొందఁగా జూచి చిరకాలమున కిప్పుడుగదా నాకన్ను లమృతరసపూర్ణము లయినవి!

గీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందుఁ ;
పూజ్యులైరి శమాదిసత్పురుషు లెల్ల;
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నాఁడు సర్వలోకేశ్వరుండు.

(అని మరలఁ బఠించుచున్నది.)

శాంతి—ఇప్పుడు మనస్సువిషయమున స్వామియైన పురుషుని ప్రవర్తన మెట్లున్నది?

శ్రద్ధ—వధ్యునివిషయమునను నిగ్రాహ్యుని విషయమునను నెట్లుండవలయునో యట్లున్నది.

శాంతి—అట్లయిన, స్వామియే సామ్రాజ్యము నలంకరించునా యేమి?

శ్రద్ధ—దానికి సందేహమేమి? ఆత్మానుసంధానము చేసిన యెడల, స్వామియే స్వారాట్టును సమ్రాట్టును నగును.

శాంతి—ఇఁక జీవేశ్వరునకు మాయయం దెట్టియనుగ్రహము గలదు?

శ్రద్ధ—నిగ్రహమని చెప్పవలెను. అనుగ్రహ మెట్లుశక్యమగును? పురుషుఁ డిప్పుడు సర్వానర్థబీజభూత యయిన యీమాయ సర్వథా నిగ్రాహ్యురాలని తలఁచుచున్నాఁడు.

శాంతి—అట్లయినపక్షమున, రాజకులముయొక్క స్థితి యిప్పు డెట్లున్నది?

శ్రద్ధ—వినుము. పురుషునకు—

శా. నిత్యానిత్యవిమర్శ యిష్టసతి; సన్మిత్రుండు వైరాగ్యఁ; డా
త్మాత్యంతాగ్రహితుల్ యమాదులు; సహాయాప్తు ల్శమాదుత్త
[ముల్
మైత్ర్యాదు ల్పరిచారికల్; సహచరీమత్తల్లి మోక్షేచ్ఛ; దు
ష్కృత్యుల్మోహమమత్వముఖ్యరిపులుచ్ఛేద్యుల్బ లాత్కారతన్.

శాంతి—మఱి ధర్ముని యెడల స్వామి కెట్టి ప్రీతికలదు?

శ్రద్ధ—పుత్రీ! వైరాగ్యసన్నికర్ష మయినది మొదలుకొని స్వామి యిహపరఫలభోగములయందు నితాంతమును విరసుఁడయియే యున్నాఁడు. అందుచేత నే యతఁడు

గీ. నరకహేతువౌ పాపంబునకును బోలె,
నశ్వర మని పుణ్యఫలంబునకును వెఱచు;
శుద్ధనిష్కామతను జేయుసుకృతకర్మ
మునకు నెట్టులో తా నియ్యకొనుచు నుండు.

ఇట్లు స్వామియాత్మైకనిష్ఠుఁ డయి యుండుట కనిపెట్టి ధర్ముఁడు తాను గృహకృత్యుఁ డయిన ట్లెంచుకొని తనకుఁ దానే దనవ్యాపారమును వదలుకొన్న వాఁ డయ్యెను.

శాంతి—అప్పుడు యోగవిఘ్నులను వెంటఁగొని మహామోహుఁ డదృశ్యుఁ డయ్యెనే, వారి వృత్తాంత మేమి?

శ్రద్ధ—పుత్రీ! అట్టి దురవస్థను బొందినవాఁ డయ్యును; మహామోహహతకుఁడు స్వామిని మోసపుచ్చుటకయి మధుమతి యనువిద్యతోడఁగూడ యోగవిఘ్నులను బంపెను. స్వామి వారి యందుఁ దగులుకొన్న యెడల, వివేకుఁ డుపనిషచ్చింతనైనను జేయ కుండునని వానియభిప్రాయము.

శాంతి—ఔరా! తరువాత? తరువాత?

శ్రద్ధ—తరువాత వారుపోయి స్వామికొక యైంద్రజాలికవిద్యను జూపిరి. వారొక యత్యాశ్చర్యకరరూపమును జూపి సంభ్రమముతో నిట్లనిరి. ఓస్వామీ!

చ. అచిరముగా నితండు వినుచు నబ్రిపడన్ శతయోజనధ్వనుల్;
ప్రచురము చేయు మున్వని భారత వేదపురాణగాథలన్;
రచనయొనర్చు శుద్ధపదరమ్యత స్వేచ్ఛను గావ్యశాస్త్రముల్;
ఖచరగతిం జరించును జగంబుల; మేరుమణిస్థలు ల్గనున్.

అతఁడు మధుమతీవిద్యచేతఁ గల్పింపఁబడిన ప్రదేశమును జేరఁగా స్థానాభిమాన దేవత లాశవుట్టునట్లుగా నిట్లనిరి.—అయ్యా! ఇందుఁ గూరుచుండుము; ఇక్కడ జననమరణములు లేవు; ఈప్రదేశము సహజసుందర మయినది: వివిధవిలాస వేషలావణ్యవతులును బుణ్యమయులును మంగళార్ఘ్యవ్యగ్రపాణులును బ్రణయకృత్యచతురలును నగువిద్యాధరకాంతలు వీరెసియొద్దనున్నారు. కాఁబట్టి యిటురమ్ము.

గీ. కనకసికతిలస్థలములు గలుగునదుల,
ఘనజఘనలు పరోరులా కమలముఖుల,
మరకతదళమ్ము నవనాళిఁ బొరయు మీవు
పుణ్యసముపార్జితాఖలభోగములను.

శాంతి—అటుపిమ్మట?

శ్రద్ధ—పుత్త్రీ! ఆమాటలువిని మాయ యిది శ్లాఘ్య మయినదని చెప్పెను; మనస్సును మోదించెను; సంకల్పుఁడును బ్రోత్సాహపఱిచెను; స్వామి యంగీకారమార్గమును బొందినవానివలెనుండెను.

శాంతి—(ఖేదముతో) అయ్యో! స్వామి మరల సంసారవాగురలోఁ దగులుకొనుచున్నాఁడు!

శ్రద్ధ—లేదు. లేదు.

శాంతి—ఆవల నేమిజరగినది?

శ్రద్ధ—అప్పుడు పార్శ్వవర్తియైన తర్కుఁడు వారినందఱిని క్రోధావేశకషాయితలోచనుఁడయి చూచి, స్వామినిగూర్చి యిట్లనియెను:—"ఓస్వామీ! విషయామిషగ్రాసాభిలాషులును సభాప్రతారణధూర్తబకులును నైన వీరిల్లు నిన్నుమరల దుస్సహవిషయాగ్నిజ్వాలలయందుఁ బడఁద్రోయుచుండఁగాఁ దెలిసికోలేకున్నా వేమి!

క. భవసాగరముం దాఁటఁగ
నవలీలం బ్రాప్తమైనయులయోగతరిన్
దవుల విడనాడి వెస నివు
డవగాహన మేల చేసె దంగారనదిన్?"

శాంతి—అటుతరువాత?

శ్రద్ధ—అప్పు డాతనిమాటవిని, 'విషయసుఖములకు నమస్కార' మని పలికి, పురుషుఁడు దుర్మతిని దిరస్కారము చేసెను.

శాంతి—మేలు! మేలు! నీవిప్పుడెక్కడకు బయలుదేఱినావు?

శ్రద్ధ—"నేను వివేకుని జూడఁగోరుచున్నాను. కాఁబట్టి నీ వాతనిని శీఘ్రముగాఁ గొనిరమ్ము" అని స్వామి నాకాజ్ఞయిచ్చెను. కాఁబట్టి నేనిప్పుడు మహారాజసన్నిధికి బయలుదేఱినాను.

శాంతి—నాకును మహారాజుగా రుపనిషద్దేవిని దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చినారు. పోఁగాక! మనము స్వామిని యోగమును నెఱవేర్తము.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రవేశకము



[అప్పుడు పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పురు—(ఆలోచించి హర్షముతో) ఓహో! ఏమి యీవిష్ణు భక్తిదేవిమాహాత్మ్యము! ఆమెయనుగ్రహముచేత నేను—

మ. వడిఁ గ్లేశోర్ము లతిక్రమించి, మమతావర్తంబులన్ దాఁటితిన్;
గడకున్ మిత్రకళత్రబంధుమకరగ్రాహంబులన్ దోలితిన్;
జెడఁగా నార్చితిఁ గ్రోధబాడబశిఖన్; దృష్ణాలతల్ ద్రెంచితిన్;
గడు సంసారసముద్రతీర మిపు డేఁ గంటిన్ సమీపింపఁగన్.

[అంతట నుపనిషద్దేవియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు]

ఉప—సఖీ! అట్లు నిర్దయుఁడయి యుండినభర్తయొక్క ముఖమును నే నెటు చూడఁగలను? అతనిచేత నేను జిరకాలము పరదారవలె విడిచిపెట్టఁబడి యేకాకినినయి యుంటిని.

శాంతి—దేవీ! ఆవిధముగా నాపదలపాలయినభర్తగారి నేల నిందించెదవు?

ఉప—సఖీ! ఇట్లు చెప్పెదు నీ వప్పటి నాకష్టదశను జూడలేదు. వినుము—

చ. అకట! వివేకుఁ డట్లు విధియత్నమునన్ నను దవ్వొనర్చుటన్;
సకలఖలుల్ కుబుద్ధిమెయి నన్ దమదాసిగఁ జేయ నీడ్వఁగా
శకలములై మణుల్పడల జంకి చెడెం గరకంకణావళుల్;
ప్రకట శిరోమణుల్గొనఁగ లాగుటచేఁ దెగెఁ గేశపాశముల్.

శాంతి—సఖీ! ఇది యంతయు నామహామోహుని దుర్విలసితము. ఇందు భర్తగారి యపరాధ మేమియు లేదు. వానిచేతనే మనస్సు కామాదులద్వారమున మోహపెట్టఁబడుటచే వివేకుఁడు నిన్నుండి దూరము చేయఁబడినాఁడు. ఇట్లువిపన్నుఁడయిన నిజవల్లభుని సమయముప్రతీక్షించియుండుట కులస్త్రీలకు నైసర్గికశీలము. కాఁబట్టి

నీవువచ్చి దర్శనముచేతను బ్రియాలాపముచేతను భర్తను సంభావింపుము. ఇప్పుడు శత్రులు హతముచేయఁబడినారు; నీమనోరథములు సంపూర్ణములయినవి.

ఉప—సఖీ! నే నిప్పుడిట వచ్చునప్పుడు నాకూఁతురైన గీతాదేవి రహస్యముగా 'స్వామియైన పురుషుఁడును భర్తయు నన్నడిగిన ప్రశ్నల కుత్తరములు చెప్పి నీవువారిని సంభావింపవలయును; తన్మూలమునఁ బ్రబోధోత్పత్తి గాఁగలదు" అని చెప్పినది. నేనెట్లు గురుజనులముందు ప్రాగల్భ్యమును జూపఁ గలను?

శాంతి—దేవీ! భగవతియైన గీతాదేవియొక్క యీవాక్యమునకు విచారింపఁ బనిలేదు. ఈయర్థమునే భగవతియైన విష్ణుభక్తిదేవి వివేకస్వామితోడఁ జెప్పినది. కాఁబట్టి వచ్చి భర్తను, ఆదిపురుషుని, నీదర్శనముచేత సమ్మానింపుము.

ఉప—ప్రియసఖి చెప్పినట్లు చేసెదను.

(అని ముందుకు నడుచుచున్నది)

[అప్పుడు వివేక మహారాజును, శ్రద్ధయుఁ బ్రవేశించుచున్నారు]

వివే—ఓవత్సా! శ్రద్ధా! శాంతి నాప్రియురాలైన యుపనిషత్కాంతను జూచునా?

శ్రద్ధ—దేవా! మీయాజ్ఞను దలఁదాల్చిపోయిన శాంతి యామె నెట్లుచూడకుండును?

వివే—ఎక్కడఁజూచును?

శ్రద్ధ—దేవా! మందరపర్వతమునందు మధుసూదనాలయములో నామె తర్కవిద్యాభయముచేత గీతాదేవిముఱుఁగు చొచ్చియున్నదని యీవఱకే విష్ణుభక్తిదేవి చెప్పినది.

వివే—తర్కవిద్యల కేల భయపడవలెను?

శ్రద్ధ—దేవా! ఈసంగతి మీకామెయే వివరముగాఁ జెప్పఁగలదు. కాఁబట్టి దేవరవారు విచ్చేయుఁడు. ఇదె పురుషుఁడు మీయాగమనమునే తలఁచుకొనుచు నొంటిగా నున్నవాఁడు.

వివే—(చేరువకుఁ బోయి) స్వామీ! అభివాదము చేయుచున్నాను.

పురు—వత్సా! ఈశిష్టాచారము ప్రక్రమవిరుద్ధ మయినది. జ్ఞానవృద్ధుఁడ వైననీవే నా కుపదేశదానముచేతఁ బితృభావమును బొందితివి. ఎట్లన—

గీ. మున్ను ధర్మమార్గము తప్పి భూమిసురులు
తనయులను వేఁడుకొని రల్లదారి చూప:
శిష్యులఁగ వారి జ్ఞానంబుచే గ్రహించి,
సుతులు 'సుతులార! వినుఁ' డని పితలాననిరి.

కాఁబట్టి నీవును మాయెడలఁ బితృత్వముచేత వర్తింపవలయును. అదియే ధర్మము.

శాంతి—దేవీ! ఇదె వివేకునితోడఁ బురుషుఁ డొంటిగా నున్నాఁడు. సన్నిధికిఁ బొమ్ము.

ఉప—(సమీపమునకుఁ బోవుచున్నది)

శాంతి—స్వామీ! ఉపనిషద్దేవి యిదిగో మీపాదవందనము చేయ వచ్చి యున్నది.

పురు—అట్లుకాదు. అట్లుకాదు. తత్త్వావబోధోదయముచేత నీవెయే నాకు మాత. కాఁబట్టి నేనేయామెకు నమస్కరింపవలెను. అంతేకాక,

క. జననికి దేవికిఁ గల దిల
ననుగ్రహముఁ జూపుటంద నంతర మెంతో;

జనని భవబంధములఁ గడుఁ
బెనఁచును; బంధముల దేవి విడిపించుఁ గదుఁగా.

ఉప—(వివేకునిజూచి నమస్కరించి దూరముగాఁ గూరు చున్నది.)

పురు—అమ్మా! నీవింతవఱకును దినము లెట్లు గడపితివో చెప్పుము.

ఉప—స్వామీ!

ఉ. పుచ్చితిఁ బెక్కునాళ్ళు ఘనమూర్ఖులతోడను నేమఠంబులన్,
రచ్చల, శూన్యదేవభవనంబుల, వ్యర్థవచఃప్రసంగతిన్.

పురు—మఱి వారు నీచేతఁ దత్త్వము నేమైనఁ దెలిసి కొన్నారా?

ఉప—లేదు. లేదు. వారు—

మచ్చిక ద్రావిడాంగనలమాటలకట్లు గ్రహింప కర్థమున్,
జెచ్చెర నస్మదుక్తులకు స్వేచ్ఛ నొనర్చి రపార్థకల్పనల్.

వారికి నావాక్యార్థవిచారమువలని ప్రయోజన మంతయుఁ గేవల పరధనగ్రహణార్థమే.

పురు—తరువాత? తరువాత?

ఉప—తరువాత నేనొకచోట

మ. పరిపూర్ణాజ్యజుహూముఖాగ్నిసమిద్వహ్నిస్రువోపేతమై,
వరసోమేష్టిపశుప్రభృత్యుఱుమఖవ్రాతోల్లసత్పార్శ్వమై,
సరతప్రావృతకర్మకాండబహుధానిర్దిష్టమార్గాళియై,
సరసం గ్రుమ్మరుయజ్ఞవిద్యఁ బొడగాంచం గంటి మార్గంబునన్.

పురు—అటుతరువాత?

ఉప—తరువాతఁ బుస్తకభారవాహిని యైనయామెకు నా

తత్త్వ మేమయినఁదెలిసి యుండు నని యెంచి నేనామెసన్నిధిని గొన్నిదినములు గడపవలె నని తలఁచితిని.

పురు—తదనంతరము?

ఉప—తదనంతరము నే నామె సమీపమునకుఁ బోఁగా, "ఓసుమంగళీ! నీకోరిక యేమి?" అని యామె నన్నడిగెను.అమ్మా! నేనిప్పుడనాథనయి యున్నదానను. కాఁబట్టి నీయొద్ద నుండఁగోరు చున్నాను." అని నేను జెప్పితిని.

పురు—అటుపిమ్మట?

ఉప—అటుపిమ్మట "ఓసుమంగళీ! నీవు చేయుపని యేమి?" అని యామె నన్నడిగెను.

పురు—అటువెనుక?

ఉప—అప్పుడు నే నిట్లంటిని—

చ. ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు, నీజగం
బెవ్వనికాంతిచే వెలుఁగు, నెవ్వని తేజము సత్సుఖోజ్జ్వలం,
బెవ్వనిఁగొల్చి ద్వైతతమమేగఁ బునర్భవ మొంద రెప్పుడున్
నెవ్వడిఁ బుణ్యు, లాపురుషు నిత్యుని శాంతు స్తుతింతునక్రియన్

అంతట యజ్ఞవిద్య యాలోచించి యిట్లనియెను—

"గీ. అక్రియఁ దగువా డీశ్వరుం డగుట యెట్లు?
సత్క్రియలు గాని వస్తువిచారబుద్ధి
యరయ భవబంధనాశనకరము గాదు;
జనుఁడు భవనాశకరకర్మ లొనరఁ జేసి
వత్సరశతంబు శాంతుఁడై బ్రతుకఁగోరు.

కాఁబట్టి నేనిన్నుఁ జేకొటవలనఁ బ్రయోజనములేదని తలఁచె దను. అయినను నీవు కర్తయు భోక్తయు నగుపురుషునిఁ బ్రస్తుతిం

చుచుఁ గొంతకాల మిచ్చట వసింపఁగోరెదుపక్షమున నాకాక్షేప మేమియు లేదు."

వివే—అహా! ఏమి ధూమాంధకార శ్యామలితనయన యయిన యజ్ఞవిద్యయొక్క దుష్ప్రజ్ఞత్వము! ఆమె యీప్రకారము గాఁ గుతర్కముచేతఁ జెడిపోయినది.

ఉత్సాహ. సహజముగ నచేతనంబు జడము నైన లోహ మి
మ్మహిని జుంబకోపలంబుముందటం జలించు న
ట్లహహా! మాయయున్ సృజించునఖిలలోకములను ని
స్పృహాత విశ్వసాక్షియైన యీశుదృష్టి ప్రేరణన్.

కాఁబట్టి తమోంధు లయినవారిదృష్టి యీవిధముగానే యుండును. అజ్ఞానసంభవ మయిన సంసారమును గర్మలచేత నశింపఁ జేయఁ గోరెడు యజ్ఞవిద్య నిశ్చయముగా గాఢాంధకారమును సహిత మంధకారముచేతఁ బోఁగొట్టఁబూనును. ఎట్లన—

గీ. నశ్వరములు నజ్ఞానజన్యములు నైన
యేదులోకంబులఁ బ్రకాశ మెవఁ డొనర్చు
నతఁడెఁ బొందును విబుధాళి మృతిని గెలిచి;
యితర మెంటలేదు భవముక్తి హేతుసరణి.

పురు—తరువాత! తరువాత!

ఉప—తరువాత యజ్ఞవిద్య మరల నాలోచించి "ఓసఖి! నీవిచ్చట నుండుటవలన దుర్బుద్ధిగ్రస్తు లయిన నాశిష్యులు కర్మలయం దాదరము తగ్గినవా రగుదురు. కాఁబట్టి, ఓతల్లీ! నీవు నాయందనుగ్రహించి నీయిచ్చవచ్చిన దేశమునకు విజయం చేయుము." అనెను.

పురు—పిమ్మట!

ఉప—పిమ్మట నేనామెను విడిచి బయలుదేఱితిని.

పురు—అటుతరువాత?

ఉప—తరువాత కర్మకాండసహచరి యైన మీమాంస నాకుఁ గనబడినది. ఆమీమాంస—

చ. కరమధికారయోగ్యముగఁ గర్మముల న్విభజించి మించి, సు
స్థిరఘనగౌరవంబున శ్రుతిప్రముఖప్రబలిప్రమాణముల్
వరుసను వెంటనంటి కొలువన్, సువిచిత్రితరాంగయుక్తయై,
పరగెఁ, గృతోపదేశమయి భాసిలునయ్యతి దేశరాజితోన్.

పురు—అనంతరము.

ఉప—అనంతరము నేనామెను సహితము పూర్వమువలెనే యాశ్రయమును వేడితిని. అప్పు డామెయు "ఓసుమంగళీ! నీవు చేయుపని యేమి?" అని యెన్నడిగెను. అంతట నేను దొంటివలెనే "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" మొదలుగాఁ గల వాక్యమును జెప్పితిని.

పురు—అవల?

ఉప—అవల మీమాంస పార్శ్వవర్తులముఖమును జూచి "లోకాంతరఫలోపభోగయోగ్యుఁడైన పురుషుని బ్రతిపాదించుట చేత మన కీమెవలనఁ బ్రయోజనము గలదు. కాఁబట్టి కర్మోపయుక్తయైన యీ మెను స్వీకరింపుఁడు" అని పలికెను. అక్కడ వారిలో నొకశిష్యుఁడు దాని కనుమోదించెను ప్రసిద్ధప్రతిష్ఠుఁడైన కుమారిలస్వామియును మఱియొకఁడు మీమాంసాభ్యుదయాధిదేవత యోయనునట్లుగా "దేవీ! ఈమె కర్మోపయుక్తుఁ డయిన పురుషునిఁ బ్రతిపాదింపదు; కర్తయు, భోక్తయుఁగాని యీశ్వరునిఁ బ్రతిపాదించును. ఈమె కర్మలక్షించుకయు నుపయోగపడునది కాదు." అనెను.

అప్పు డింకొకఁడు "లౌకికపురుషునికంటె నన్యుఁడయి యీశ్వరుఁడని యొకఁ డున్నాఁడా!" యని యడిగెను. అంత నతఁడు నవ్వి "ఉన్నాఁడు" అని మరల నిట్లనియెను.—

చ. ఒకఁడు కనున్ జగత్క్రియల, నొక్కఁడు మోహమయాంధబుద్ధియా
నొకఁడిడుఁ గర్మజాలఫల, మొక్కఁడు తత్ఫలవాంఛఁ జేయుఁ; డా
నొకఁడు శరీరుల న్నడుపు, నొక్కఁడు కర్మములన్నియుక్తుఁడౌ;
నిఁకను వినంగుఁ డౌపరము నెట్లగు, జెప్పఁగఁ గర్మభోక్తఁగన్!

వివే—(హర్షముతో) మేలు! కుమారిలస్వామీ! మేలు! నీవు మంచిప్రజ్ఞ గలవాఁడవు. నీవు దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

క. సహవాసులుఁ జెలులును నా
విహగంబులు రెండు నేకవృక్షమె చేరన్;
విహగ మొకటి తిను ఫలముల;
నహహా! రెండవది తినక యాలోకించున్.

పుర—తరువాత?

ఉప—తరువాత నేనుమీమాంసవద్దసెలవుగైకొని వెడలితిని.

పుర—అటుతరువాత?

అప—అటుతరువాత నేను శిష్యులుపలువుండ్రచేత నుపాస్యమానలైన తర్కవిద్యలను బొడగాంచితిని. అందు,

మ. తెలుపు న్వైశ్వవిశేష మో; స్తోకతె వాదించుఁ వితండావృతిన్
లలి జాతిచ్ఛలనిగ్రహాదికమహాన్యాయాళితో జల్పముల్;
వెలుచన్ వాగ్నుఁ బూరుషప్రకృతిసంభేదంబు లొక్కర్తు, సం
ఖ్యలచే నెన్నుచుఁ దత్త్వముల్ మహదహంకారాదిసర్గంబులున్.

పుర—తరువాత? తరువాత?

ఉప—పూర్వరీతినే నేనును వారిసమీపమునకుఁ బోయి, వా

రడిగినదానిఁదట "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" ఇత్యాది వాక్యముచేత మునుపటియట్లే నా కార్యమును జెప్పితిని. అప్పుడు వారు నన్నుఁ బ్రత్యక్షముగాఁ బరిహాసించి "ఓ వాచాలు రాలా! విశ్వము పరమాణువులవలనఁ గలుగుచున్నది. ఈశ్వరుఁడు నిమిత్తకారణము" అని పలికిరి. అం దింకొకతె కోపముతో "ఓసి పాపాత్మురాలా! ఈశ్వరునే సవికారునిఁ జేసి వినాశధర్మము నాపాదించుచున్నా వేమి?" అనెను. మఱియొకతె "ఓసీ! విశ్వోత్పత్తి ప్రకృతివలనఁ గలిగె"నని పలికెను.

వివే — ఓహో! తర్కవిద్య లెంతదుర్మతులు! ఘటాదికము వలెనే ప్రమేయజాతము సర్వమును గార్యమనిసహిత మింతమాత్రము తెలిసికొనఁజాలకున్నారు. పరమాణువులును బ్రకృతియు నుపాదాన కారణము లనుటయు నుపేక్షణీయమే.

మ. జలచంద్రుంబలె నంతరిక్షనగరస్వప్నేంద్రజాలంబు ల
ట్లలవిశ్వంబును మిథ్య, మేయమును గార్యంబౌటసాద్యంతతన్;
కలుగున్ శుక్తిని వెండియట్లు శివుగాఁగం దెల్వఁ నజ్ఞానమిన్;
పొలియుగా స్రక్కునఁబన్నగభ్రమువలెన్ బోధోదయప్రాప్తిచేన్.

ఇఁక వికారశంకయు ముగ్ధవధూమానసవిలసితమే. ఎట్లన —

ఉ. శాంతము నిర్మలంబును నజంబు ననంతము నిష్కలంబు నౌ
సంతతతేజ మీభువనసంభవమందు వికార మొందునే?
కాంతిని నల్లగల్వల నగంగలమబ్బులచాలు పుట్టునో,
వింతయు నాకసంబు వహియించునె తాను వికారలేశముల్!

పురు — సాధు! సాధు! ప్రజ్ఞావంతుఁడవయిన యీసీవిమర్శ ము నాడెందము నానందపెట్టుచున్నది. (ఉపనిషద్దేవినిగూర్చి తద ంతరము ?)

ఉప.—తదనంతరము వారందఱును మండిపడి, "ఓహో! విశ్వవిలయముచేత ముక్తి కలుగునని ప్రేలుచు, నాస్తికమార్గము నవలంబించుచున్న దీనినిబట్టి బంధింపవలెను" అని యందఱును ససంరంభముగా నన్ను నిగ్రహించుట కుద్యుక్తులైరి.

పుర—(భయముతో) ఆపయిని?

ఉప—అపైని నేను మిక్కిలి త్వరితముగాఁ బఱచి దండకారణ్యములోఁ బ్రవేశించితిని. అంతట మందరగిరికి సమీపమునఁగట్టఁబడిన మధుసూదనాలయము చేరువను—

ఉ. బాహులకంకణావళులు భగ్నముచేసిరి రాల రత్నముల్;
ద్రోహమతిన్ శిరోమణుల దొంగిలఁ ద్రెంచిరి కేశపాశముల్;
దేహళిఁ దారహారములు ద్రెంచి, హరించిరి కట్టుబట్టయున్;

పురు—తరువాత? తరువాత?

ఉప—అప్పుడు దేవాలయములోనుండి వెడలివచ్చి గదాపాణులైన పురుషులు వారి నతినిర్దయముగా మోదఁగా భీతులై యందఱును దిగంతములకుఁ బాఱిపోయిరి.

వివే—(హర్షముతో) పూజ్యురాల వయిన నిన్నతిక్రమించువారిని విశ్వసాక్షియైనభగవంతుఁడు క్షమింపఁడుగదా?

పురు—తరువాత? తరువాత?

ఉప—

దేహముఃతూల, వందియులు ద్రెళ్ళఁగ, గీతగృహంబుచొచ్చితిన్, అక్కడ నాకూఁతురైన గీతాదేవి చేరవచ్చిననన్నుఁ జూచి, సంభ్రమముతో "అమ్మా! అమ్మా!" అని కౌఁగిలించుకొని కూరుచుండఁబెట్టెను. అప్పుడామె నావృత్తాంతమును విని, "అమ్మా! నీవు మనస్సులో ఖేదమును బొందకుము. వీరులు నిన్నప్రామాణికులార్తి

గాఁ జేసి యభీష్టముగా నాసురబుద్ధులయి చరింతురో వారి నీశ్వ
ఁడే శిక్షించును. అట్టివారినిగూర్చి భగవంతుఁడు గీతలయందు—

"గీ. అట్టిక్రూరుల౯ బాపుల వధమనరుల
ద్వేషయుక్తుల౯ ద్రోయుదు౯ దీవ్రగతిని
సంతతము నేను సంసారసాగరముల
లోన నొక్కట నాసురయోనులందె."

నెను.

పురు—(సకౌతుకముగా) దేవీ! ఆయీశ్వరుఁ డెవఁడో నీ
యనుగ్రహమువలనఁ దెలిసికొనఁ గోరుచున్నాను.

ఉప—(కోపించినదానివలె) ఎవ్వఁడు తన్నుఁదాఁ దెలిసికో
క యంధునివలెఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడో యతఁడే.

పురు—(హర్షముతో) ఏమి! నేనే యాపరమేశ్వరుఁడనా!

ఉప—అవును.

గీ. పరుఁడు నీకంటెఁ గాఁ డల్లపరమపురుషుఁ;
డన్యుఁడవు గావు నీ వామహాత్మ్రకంటె;
నన్యుఁగా మాయచేఁ దోఁచె దతనికంటె,
నంబువులయందు సూర్యబింబంబు పగిది.

పురు—(వివేకునితో) దేవా! ఈదేవిచెప్పినమ, జేనీయర్థ
మును జక్కఁగా గ్రహింప లేకున్నాను.

క. భిన్నుని కుశరీరావ
చ్ఛిన్ను జరామరణాభిన్నుఁ జెన్నుగ సన్నున్
సన్నుతిచేసెదు నీయుమ,
యున్నన్నా! నిత్యసచ్చిదానందునిగా,

వివే—పదార్థపరిజ్ఞానము లేకపోవుటవలన నీకీవాక్యార్థము బోధపడలేదు.

పురు—అది నాకు బోధపడుటకు మీరుపాయము తెలివియ్యవలెను.

వివే—ఇదిగో చెప్పుచున్నాను—

మ. కడు నీయందుఁ జిదాత్మముంగని, యహంకారుండఁ గానంచు నె
ప్పుడుఁ జిత్తంబు నడంచి, తత్త్వసమితిం బోకార్చి కావింతువే
న్గడకం దత్త్వమసీతి సంస్మరణ, కన్పట్టున్ భవోద్యత్తమం
బడఁగన్ శాంతము స్వప్రకాశ మగునిత్యజ్యోతి సాక్షాత్మకన్.

పురు—(ఆనందముతో విన్నయర్థము నాలోచించుకొనుచున్నాఁడు)

[అప్పుడు నిదిధ్యాసనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

నిది—"నాయభిప్రాయమును నీవు వివేకునితో నున్న యుపనిషద్దేవికి నిగూఢముగా బోధపఱుపవలయును, నీవు పురుషునిలోఁ బ్రవేశింపవలెను" అని భగవతియైన విష్ణుభక్తిదేవి నాకానతిచ్చినది. (చూచి) ఇదిగో దేవి వివేకపురుషులతోఁ గూడి సమీపముననే యున్నది. ఆమె సన్నిధికిఁ బోయెదను. (చేరవచ్చి యుపనిషద్దేవితో జనాంతికముగా) అమ్మా! "దేవతలు సంకల్పమాత్ర సంభవులు, నీవు గర్భమును ధరించియున్న దానవని నేను యోగధ్యానముచేతఁ దెలిసికొన్నాను. క్రూరసత్త్వమైన విద్యయను కన్యకయుఁ బ్రబోధచంద్రుఁడును నీగర్భమునందున్నారు. అందువిద్యను సంకర్షణవిద్యచేత మనసునందు సంక్రమింపఁజేసి, ప్రబోధచంద్రుని బురుషునికి సమర్పించి, నీవు వివేకునితోఁ గూడ నాయొద్దకు రావలసినది" అని విష్ణుభక్తిదేవి యాజ్ఞ యిచ్చినది.

ఉప— దేవి యాదేశించినట్లు చేసెదను. (అని వివేకునితోడ విగ్రహమించుచున్నది)

నిది—(పురుషునిలోఁ బ్రవేశించుచున్నది)

పురు— (ధ్యానము నటించుచున్నాఁడు)

(నేపథ్యమునందు) ఆశ్చర్యము! ఆశ్చర్యము!

మ. ఉరుకాంతిచ్ఛటలన్ దిశావళుల విద్యుల్లీల వెల్గింపుచున్,
ఖరదీప్తాస్థివిశాలమూ మననువక్షంబుచ్చిపోఁ బుట్టి, త
త్పరివారంబును మోహుని న్మనవి, విద్యాకన్య తోడ్తోనగో
చరయై పోయెఁ; బ్రబోధచంద్రుఁడును దా జన్మించె జీవు న్ననన్.

[అప్పుడు ప్రబోధచంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ప్రబో—

ఉ. స్వ్యాతమొ, వ్యాప్తమో, మఱియుపోహితమో, యుపసారితంబో, సం
భూతవిలాపితంబొ, హ్రృతమో, యనుతర్కము లేక, యేని సం
జాతముచేఁ బ్రపంచము వెసం జెడునో సహజప్రకాశలీ
నాతతరూపమై యలమహాత్ముఁడ నేను బ్రబోధచంద్రుఁడన్.

(ముందుకు నడిచి) ఇతఁడె పురుషుఁడు. ఈతనిదాపునకుఁబోయెదను. (సమీపించి) దేవా! ప్రబోధచంద్రుఁడను నేనునమస్కారము చేయుచున్నాను.

పురు—(ఆహ్లాదముతో) వత్సా! రమ్ము. నన్ను గౌఁగిలించుకొమ్ము.

ప్రబో—(ఆలింగనము చేయుచున్నాఁడు)

పురు—(ఆనందముతో) ఓహో! ఇప్పుడు విధూతతిమిరజాతము ప్రభాతము సంజాతమైయున్నది!

చ. ఒకటఁ బ్రబోధచంద్రమహితోదయ మాటను జేసి యిద్దఱ
బ్రకటవికల్పనిగ్రహము బ్రస్ఫుటమోహహతమంబుఁ బాయఁగాఁ,
జకచక నేన శ్రద్ధ మతి శాంతి వివేక శమంబుఁ లాదిగా
సకలజగన్మయుండయి యెసంగెదువిష్ణువుగా స్ఫురించెదుఁ.

సర్వవిధములచేతను నేను విష్ణుభక్తి దేవి ప్రసాదమువలనఁ గృతి కృత్యుఁడ నయినాఁడను. అట్టి నేనిప్పుడు—

చ. విడిచి సమస్తసంగములు, వేఁడక విశ్వము గోని దేనియుఁ;
గడలనో మూలలందో ఫలకాంక్షయొనర్పక సంచరించుచుఁ,
సుడివడుకోపమున్ భయము శోకము మోహము నుజ్జగించి, యి
ప్పుడె మునినైతి శాంతి భృంశముంగని, రాత్రియెనిల్పు తావుగన్

[అంతట విష్ణుభక్తి దేవి ప్రవేశించుచున్నది]

విష్ణు—(హర్షముతో సమీపించి) శమితారాతివైయున్న నిన్నిప్పుడు చూచుచున్నానుగాన. చిరకాలమునకుఁగదా నామనో రథము లన్నియు సంపూర్ణములయినవి.

పురు—దేవిగారిప్రసాదమున్నప్పుడు దుష్కర మేదియుండును!

(అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు)

విష్ణు—(పురుషుని లేవనెత్తుచు) వత్సా! లెమ్ము. ఇంకను నేను నీ కేమి ప్రియము చేయుదును!

పురు—ఇంతకంటె నాకుఁ బ్రియ మేమున్నది!

క. కృతకృత్యుం డయ్యెను దా
హతవిమతస్తోముఁ డగుచు నల్లవివేకుం;
డతిదళితరజస్కుఁడనై
యతులసదానందపద మందితి నేనుఁ.

అలరుచు దా నీభరతవాక్యము సిద్ధించునుగాక!

చ. ఇలపయి నిష్టవృష్టిఁ గురియించుచుఁ గావుత మేఘుఁ డెంతయున్!
గలుముల రాజు లేలుదురుగాక మహి న్నిరుపద్రవంబుగన్!
వెలితెలివిం దమంబడఁచి, భీమ మతా విషయోగ్రపంక మై
కలఁచుభవాబ్ధి దాఁటుదురుగాక మహాత్ములు నీదుసత్కృపన్!

సంపూర్ణము.

వాణీ ప్రెస్, రాజమహేంద్రవరం—1950.

# వినీసు వర్తక చరిత్రము.



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగము పంతులు

ఐదవ కూర్పు

ప్రకాశకులు:
హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము
1950

# వినీసు వర్తక చరిత్రము.



## ప్రథమాంకము



౧. రంగము.—వినీసుపురములో నొకవీధి.

[అంటోనియో, శాలారినో, సోలానియో, ప్రవేశించుచున్నారు.]

అంటో—ఏనేలనిజముగా నిటువ్యసనంబు
గా నున్నవాఁడనో కానియెఱుంగ;
ఏమియుఁ దోఁచదు నామదికిపుడు
నీమది యదిచూచి నగులాందెననెదు;
మదిచింతకుఁ గతంబు మఱియేదిగలదో
యదివచ్చి నన్నెల యాశ్రయించినదో,
చింత యనఁగ నేమొ, చింత యెద్దాన
నింతగఁబుట్టెనో, యెఱుఁగంగవలయు.
నను నేనెఱుంగుట కనువుగానంత
చెనఁటివానిని జేసెఁ జింత నన్నిపుడు.

శాలా—నీచిత్తమంతయు నీరధిమీఁది
కే చని చాంచల్య మొనసెడుఁ జూడ
అచ్చట నీయోడ లతిశయం బగుచు
ముచ్చట యౌచాప మొత్తంబుతోడఁ
బ్రభురత్నము లలిమేలివణిజులఁ బో
(ప్రభగల జలధిదేవతలను బోలి),
తమతము తెరఛాపగములను దాల్చి

యమితనమ్రత దోఁప నాతోఁ బ్రవఁబట్టి
చిన్నయోడలచాలు చేరువనుండి
క్రన్నఁ జనునెడఁ గాంచి యువ్వాని
గారవించుచు క్షేమకరయాత్ర చేయు
వారిధిలో నెల్లవానిని మించి.

సోలా—విలువవస్తువు లట్టివింతవినావి
జలనిధిమీఁద దవ్వుల నుండెనేని,
మనసెల్ల వానిమీఁదనె యుండు నాకు
ఘనతర ప్రేమంబుకతమున నెపుడు;
గాలి యేవంకకుఁ గదలునో చూడ
గాలిలోఁ బట్టుదు గడ్డిపోఁ చెవుదు;
దేశపటంబులఁ దెరువులు రేవు
లాశమై వంతెన లరయుచు నుందు;
చోరవచేఁ బంపిన సరకులకింత
దురదృష్టకర మని తోఁచెడునట్టి
ప్రతినిమిత్తముఁజూచి వ్యసనాతిశయత
మతిచెడి యుండుదు మఱి తప్పకుండ.

సాలా—వాడుకగాఁ గాఁచు పలచని పులుసు
వేఁడి చల్లారంగ విసరెదు నపుడు,
అతిమాత్ర మగుగాలి యంబుధిమీఁద
మితిలేనికష్టంబు జతఁగూర్పఁ దగుట
తలపునఁ బాఱుచుఁ గలుగును నాకు
చలిజ్వర మొదవిన చాడ్పునఁ గుదుపు
ఇసుక బల్ గడియార మీక్షించుపట్లు

డిసుకతిన్నెలు మిట్ట లెదకుఁ గాన్పించు;
దానఁ 'నాంద్రూ' యనఁ దనరు నాయోడ
జానగు వెలహెచ్చు సరకులతోడ
మిట్టఁ బట్టుచు నేల మీఁదికి నొఱగి
యెట్టులో యద్దాని యెత్తయిన శిరసు
పుడమిని ముద్దాడువడువున నోడ
కడుపునకన్నను గడుక్రింద వ్రాలి
పసచెడి యిసుకలోఁ బాఁతుకొన్నట్టు
పొసఁగ నామదికిని బొడకట్టు సుమ్ము;
దేవాలయముఁ జేరి దివ్యమండపము
పావనతరశిలాభాగంబుఁ గన్న,
స్మరణకు భీకరాచలములు వచ్చి
గిరి తాఁకి నాయోడ సరగునఁ బగిలి
దానిలోఁగల సుగంధ ద్రవ్యసమితి
యానీరనిధినిండ నలమినయట్లు,
నాసికెక్కిన పట్టువస్త్రముల్ జలధిఁ
గై సేసి నట్టుమ గాన్పించు మదికి
వేయేల! పోరాదె వెలగట్ట రాని
యాయోడ క్షణములో వ్యర్థంబుగాను!
ఇట్టితలంపులు హృదయంబునందుఁ
బుట్టకుండునె నాకు! పుట్టినయపుడు
తలఁపునఁ బాఱదె దైవవంచనము
కలిగినతఱిఁ జింత గదురు నటంచు!
'ఆంటోనియో' యొక్క వ్యసనకారణము

కంటిని జెప్పనక్కఱలేదు నాకు—
అతనికి వాణిజ్యమందున మిగుల
మతిపోయి చింతచే మఱుఁగుచున్నాఁడు.

అంటో—కాదు కారణ మది గట్టిగా నమ్ము;
నాదువ్యాపారంబు నమ్మియంతయును
నొక్కయోడనకాని యొకచోనకాని
చిక్కపడంగ నుంచినవాఁడఁగాను.
నాభాగ్యమును నెల్ల నమ్మి యీయేటి
లాభంబుమీఁదనె లలి నుంచలేదు.
కావున వాణిజ్యకర్మంబుఁబట్టి
నే విచారం పడ నావంత యైన.
శాలా—అటులైన నీవు కామాగ్నిచేనొక్క
కుటిల కుంతలికయి కుందు చున్నావు.
అంటో—నే నేమియు నెఱుంగ; నిందగట్టకుము.

శాలా—మానినిమీఁది ప్రేమయు లేదెనీకు!
అటు లయ్యెనేని మేమనవచ్చు నిన్నుఁ
దటుకున మోదంబు తగ్గినందునను
వ్యసనంబు పడుచున్న వాఁడవంచిపుడు;
వసుధ నవ్వుచుఁ ద్రుళ్ళి వ్యసనంబులేమి
నానంద మొందితి వనికూడ సులభ
మైనట్టిహేతు వీ వమరింప వచ్చు.
ఇలమీఁద సృజియించె నిపుడు దైవంబు,
చెలఁగి రెండుతలల జేనసు తోడు,
చాలవింతల్లు గొల్పు జనశిఖామణులఁ

గాలమాహాత్మ్యంబు కారణముగను,
కలరు కొందఱు విప్పకను లర మోడ్చి,
చిలుకలవలె నెప్డు తెలివేమి లేక,
తిత్తియూఁదెడువానిఁ దిలకించి కూడ
నొత్తి బిగ్గర నవ్వుచుండెడివారు;
కుంభినిపై మఱి కొందఱు గలరు
గాంభీర్యశాలి యన్ గణన గన్నట్టి
యల నెస్టరంతటి యనఘుఁడు వచ్చి,
పలుకఁబడిన హాస్యవచనంబునకును
దగును నవ్వఁగ నని తా నొప్పకొన్నఁ,
దెగువమైఁ బెదవులు తెరచి యొకింత
నవ్వక, వికృతంపునటనల మోము,
క్రొవ్వెసంగ, ముడుచుకొని యుండువారు.

[బస్సానియో, లోరెంజో, గ్రేషియానో, ప్రవేశించుచున్నారు.]

సోలా——వచ్చుచున్నాఁడు నీబంధు వౌ ఘనుఁడు
మెచ్చి 'బస్సానియో' మిత్రులైనట్టి
'గ్రేషియానో'ను, 'లోరెంజో'ను గలిసి
భాషింప వరసఖుల్ వచ్చిరి కాన,
సెలవు గైనియెద కొలది మేమిపుడు.
శాలా——విలువ హెచ్చుగఁ గల చెలులురాకున్న,
నీకు సంతోషంబు నెలకొన్నదాఁక
నీకడనే నిల్చి నే నుండు సుమ్మి.
అంటో——చెలికాఁడ! మఱి నీదువిలువయుఁగూడ

వేళేదియో నీకు వెళ్ళుచుండఁగ
దీఱనిపని యుండి, దీనిని సందు
కావించుకొని యేఁగఁ గాంక్షింతు వనుచు,
భావించెదను నేను వాస్తవంబుగను.
సాలా——అరుగ, నో ప్రభులార ! ఆజ్ఞ యిచ్చెదరె ?
బస్సా——మరల నేకంబుగా మనమెల్ల నెపుడు
కూడి, చెప్పుడు మీరు, కూరిమి మీఱ
వేడుకతోఁ బ్రొద్దు వెళ్ళింపఁ గలము.
ఇట్లు మీరంతంత కెరవగు చుంటి,
రట్లాట న్యాయమే యరయంగ మీకు?
సాలా——చిత్తము. తీఱిక చేసికొంచొకట
వత్తుము మిమ్ముఁగూడి పలుకు లాడంగ.

[సాలారినో, సోలానియో, వెళ్ళుచున్నారు.]

లోరెం——'అంటోనియో' తోడ నమరంగ నిన్ను
జంటగఁ గూర్చుట సమకూఁడె గాన,
'బస్సానియో' ప్రభూ ! వదలి నన్నిచట
లెస్స మే మిందేని లీలఁ బోయెదము.
కాని, భోజనవేళఁ గలయంగవలయు
స్థానంబు, దయచేసి తలఁపున నిలుపు.
బస్సా——కలిసికొందును మిమ్ముఁగని తప్పకుండ.
గ్రేషి——కలదె, 'యాంటోనియో !' కారణ మొకటి !
కనఁబడెదవు, నీవు కళదప్పినట్టు.
వినుము నీ వీ లోకవిషయంబులందు
[illegible]

మతి నెప్పుడుఁ బ్రపంచరతు లగునట్టి
వారు సుఖంబును బడయంగ లేరు.
నీరూప మదియేమొ నిజముగా మాఱె.

ఆంటో——ఎట్లు చూడఁ దగునో యీ ప్రపంచంబు
నట్లె చూచుచునుందు ననయంబు నేను.
సమబుద్ధిఁ జూడ నీక్ష్మామండలంబు
రమణీయనాటకరంగంబు సుమ్ము ;
ఎల్లవారును దమ కేర్పడ్డకథను
జెల్లును వినిపింపఁ జెడని వేషమున;
కలయ దుఃఖకరంపుఁగథ వినిపింప
వలయువంతిప్పుడు పడియె నాపాల.

గ్రేషి——పరిహాసకుని వేషభావములు నేను
ధరియించి యానందభరితుండ నగుచు
ముదిమి వచ్చెడుదాఁకఁ బుత్తుఁగాలంబు
మదిచింత మూల్గుచు మఱుఁగుటకంటె
హాయిగాఁ దినిత్రాగి యలరుచునుందు.
కాయమునను శక్తి గలయట్టినరుఁడు,
ఱాతిపై మలఁచిన తాతను బోలి,
రోఁత పుట్టఁగను గూర్చుండంగ నేల ?
ఏల నిద్దురమబ్బు మేలుకొన్నపుడు ?
మూలిమిఁ బనిలేక మటమట మనుచుఁ
గామలరోగంబు గాంచంగ నేల ?
నీమీఁద నాకెంతో ప్రేమంబు గలదు;
ఆ ప్రేమయే నన్ను వదనఁ బేరేఁచె

నీప్రకారము నీకు హితమును జెప్ప
తెలియఁజెప్పెద, నీవు తిన్నఁగావినుము ;
నిలుకడగా నీరు నిలుచుటఁజేసి
పాకుదుపట్టు తటాకంబుఁ బోలి,
పైకి ముఖంబున వైవర్ణ్య మడరఁ,
బుడమి లోకులు తమ్ము బుద్ధిమంతులఁగఁ
గడు వివేకంబును గలవారిఁ గాఁగ
గాంభీర్యశాలులఁ గాఁ జెప్పుకొనఁగ,
డంభపుమానంబుఁ దమయంతఁ దాల్చి
'నావాక్యమే యెందు దేవవాక్యంబు
గావున, నామాట కేవారు నెదురు
చెప్పఁగూడ దనెడి చిఱువాక్యముల నె
యెప్పుడు గౌరవ మిలఁ బొందవలయు
తరగతిలోఁ జేరు నరులును గలరు.
నిరతము మౌనంబు ధరియించినట్టి
హేతువుచేతనే యిట ధీరు లనుచు
ఖ్యాతిఁ జెందుచునున్నఘనుల నెందఱినొ
యెఱుఁగుదు నేనును; మఱి యట్టివారు
వెఱవక తమనోరు తెఱచి మాటాడ
నెన్నఁడేనిఁ దెగింప నించుకలోన;
మున్ను త మ్మొంతయు మన్ననఁ జూచు
పటుమతు లగుమిత్రవరులవీనులకె
కటువులుగా నుండి కలిగింప వ్యథను,
విధివాదని వారు పిలువకపోరు.

వచ్చి యింకొకసారి యిచ్చట నీకు
నీవిషయము చాల నెఱిఁగింతు నేను.
నీవిటు చింతనా నెగడు గాలమున
జడు లిచ్ఛఖ్యాతి యన్ చెడుచేఁపకొఱకు
నెడఁదయుఁగా కొలఁకును గడుఁ గలంపకుము—
రారమ్ము పోదము, లోరెంజా; మనము—
కోరెద సెలవిమ్ము కొంచెము నీవు;
నడిచి యిప్పుడె భోజనము చేసివచ్చి
కడముట్ట హితబోధ కావింపఁ గలను.

లోరెం—చనెదము భోజనసమయంబుదాఁక
నినునిప్డు డిచట మీనెలవున విడిచి
'గ్రేషియానో' యెందుఁ గించిత్తు నన్ను
భాషింప నీయఁడు, పదిగ నల్లాట
నలఁడిష్టు వర్ణించినట్టియామూగ
మతిమంతులం దొక్క-మాన్యుండ నౌదు.

గ్రేషి—సహవాస మొకరెండు సంవత్సరములు
మహిమీఁదఁ జేయుము మఱియు నాతోడ,
నీవు వినక యుందు నీనోటిమాటె.

అంటో—నేవక్త నయ్యెద నీనిమిత్తంబు;
మంచిది యిప్పుడు మఱిపోయిరండి.

గ్రేషి—మంచిమాటంటివి, కాంచు వందనము
మానంబు తగు, నోరు లేని పశులకుఁ
బైనింక నాథుఁ డబ్బనికన్యలకు నె.

[గ్రేషియానో. లోరెంజో వెళ్ళుచున్నారు.]

ఆంటో—ఇతనిమాటల యుక్తియేమైనఁ గలదె ?

బస్సా—ఇతఁడు 'వినీసు'లో నెల్లరకంటె
నధికంబుగ నిరర్థకాలాపములను
వృథవచింపుచునుండు ; వివరించిచూడ
గంపెడుపొల్లులోఁ గలసి లోపలను
నింపుగా వరిగింజ లెండేని రెండు
గలమాడ్కి నితని వాక్యంబులలోనఁ
గలుగును యుక్తియుక్తములైనవియును
గనుఁగొన వానిని దినమెల్ల బట్టు;
కనుగల్గి శోధించి కనుఁగొంటిమేని,
పడినశ్రమమునకుఁ బ్రతిఫల మింత
పడయుంగఁ జాలము వాస్తవముగను.

ఆంటో—ఏసతిగృహమున కిఁకరహస్యముగ
నాసమై యాత్రచేయుఁగను నీవు
మొక్కికొనితివో యాముద్దియపేరు
నిక్కంబుగాఁ జెప్పు ; నీవీదినంబు
తప్పక చెప్ప వాగ్దానంబు నాకు
నప్పుడె చేసి యున్నాఁడవు కాదె?

బస్సా—ఆయంబు గనిపెట్టి యర్థామా వ్యయము
చేయుటకునుమాఱు, చేతికొలంది
ధనమువెచ్చించుచు డంభము పూని
ఘనుఁడని జనులచే ననిపించుకొనఁగ
స్థిరమైన యట్టినాస్థితిని నేనెట్లు
[illegible]

సకలంబు తెలిసినసంగతి గాదె!
వికలత్వ మొందదు వినుము నామనసు,
మునుపటివలె వ్యయ మొనరింప నిపుడు
పనికిరానియవస్థ ప్రాప్తమాటకును,
ఇప్పుడు నాకున్న యెదచింతయెల్ల
నప్పు డతివ్యయ మరయక చేసి
తెలివిలేమిని బైకిఁ దెచ్చుకొన్నట్టి
పలుఋణములనుండి బయలఁ బడంగఁ
న్యాయమార్గముచేత నాకెట్టు లౌదవు
నోయని కాని, వేఱొక్కటి కాదు.
ధనముచేతఁ బ్రేమచేతను మున్నె నీకు
ఋణపడియున్నాఁడ నెంతయు నేను
నామీఁద నీకున్న ప్రేమను బట్టి
యేమాడ్కి నాయప్పు లెల్లను దీర్పఁ
దలఁచినాఁడనో నేను; దానికి నాకుఁ
గలయూహ లాధారములుఁ బూర్తిగాను
మదివిప్పి నీతోడ మఱిచెప్పి నాదు
హృదయంబుబరువెల్ల నే దించుకొందు.

ఆంటో — చెలికాఁడ! సర్వంబుఁ దెలుపుమి నాకు
చెలఁగి నీవెప్పుఁడు జేసెడుకరణి
నది గౌరవావహమైనదే యైన,
ముదమున నాయర్థమును శరీరంబు
తక్కిన సర్వసాధనములు నావి
[illegible] నీకు ననుకూలపడఁగ

నీయధీనంబులు నేఁ జేయువాఁడ;
వేయేల! నాయెడ విశ్వాస ముంచు

బస్సా—బాలుఁడ నయి పాఠశాలనుజదువు
కాలంబునను నేను గడు వేడ్క మీఱ
విలువిద్య గఱచుచు విడిచినబాణ
మిలఁబడి కనబడ కెందేని నడఁగ,
మఱియొక బాణంబు గుఱిపెట్టి తొంటి
తెఱఁగున నాదిక్కె తిన్నఁగా వదలి
శరపాత మగుచోటు శ్రద్ధతోఁ జూడ,
దొరకును దఱుచుగాఁ దూపులు రెండు
చిన్నప్పటి దగునాచేష్టను బోలి
నిన్న వేఁడఁగఁ బోవుచున్న సాయమును
దుష్టంబు కానిదై తోఁచును గాన
దృష్టాంతముగ దానిఁ దెచ్చుచున్నాఁడ
కడు నీకు నే ఋణపడి యున్నవాఁడ
నెడఁడ నప్పునుదీర్ప నిచ్ఛించు పేద
బాలునిగతి సంభవం బయి యిపుడు
పోలఁగా నష్టమైపోయె నాయుప్పు
నడయుత నింకొక్కసారి యొకమ్మొ
మొదల వేసినయట్ల వదలెదవేని,
ఘనతరజాగ్రత్తఁ గనిపెట్టియుండి
కొనితెత్తు రెంటిని గూడ నే వెదకి;
ఒకవేళఁ దేలేక యుండిలి నేని

కడదాని నర్పించి, కడమదానికయి
యెడఁ గృతజ్ఞుఁడ నయి ఋణపడియుందు.

ఆంటో—ననుజక్కఁగా నెఱింగినవాఁడ వయ్య
బనికిమాలిన దీర్ఘ వర్ణనలంటు
దిగి కాలమును వ్యర్థముగను బుచ్చెదవు.
తనమిత్రుని వాంఛితము దీర్చుకొఱకు
నిర్విచారముగ నేనిత్తునో లేదో
సర్వస్వమునునంచు సందేహపడుచు,
నాసొత్తునెల్ల దుర్ణయమునఁ బాడు
చేసినంతటికంటెఁ జింతాతిశయముఁ
గలిగించు చున్నావు కరమునునాకు
చెలికారమును నెంచి చెచ్చెరఁ జెప్పు
నాచేత నగునని నమ్మకముగను
నీచిత్తమందును నీవెంచినట్టి
పని దేని నైనను బఱుగునఁ జేయఁ
గని పెట్టి సిద్ధముగా నున్నవాఁడ.

బస్సా—కలదు 'బెల్మొంట'ను గ్రామంబునందు
జలజాక్షియొక్కతె సౌందర్యరాశి,
'సౌందర్య' మనుమాట చాల దాయింతి
యందమ్ముఁ దెలుపంగ నావంతయేని;
ధనవంతురాలామె గుణవంతురాలు
మును గొన్ని వేళల ముదమొప్పఁ దనదు
కనుదామరలనుండి కరుణమై నాకుఁ
బనిచెను దేనిలేని వర మానసముల.

ఆమెనామము 'పోర్షి' అరసిచూడంగ
నేమిటం గొఱవడ దించుకయేని,
కోటోకుం గూతురై మేటి యైనట్టి
'బ్రూటసు' భార్యయా 'పోర్షి' యన్ సతికి
మృగనేత్రమహిమంబు మితిలేనయట్టి
జగమెఱుంగనిది లేశంబును గాదు;
ఆమెను జేపట్ట నాత్మలం గోరి
కాముకజనులు నల్గడలయుండుండి
పలుసుప్రసిద్ధులు వచ్చుచు నుందు్రు
తళతళలాడెడి తరుణిముంగురులు
కనక కేశంబులకాంతిని బూని
కణతలపై వ్రాలి, ఘనతం దా నున్న
'బెల్మొంటు' గ్రామంబుం బెను 'కాల్చిసు' నుగ
మేల్మిం జెందింపంగ, మెచ్చికరంబు
చేరుదు రచ్చోటు 'జేసను' వంటి
వార లనేకులు వామాక్షికొఱకు
ఉరవుగా వారిలో నొకరితో నైన
సరి దూంగం జాలెదుసాధన మున్నం
గాంతను దప్పక కైకొనం గల్గు
నంత మహాదృష్టవంతుండ నౌదు
నని నిశ్చయంబుగ ననఘుండ! యిపుడు
ఘనమైన నమ్మిక కలదు నామదిని,

అంటో— ఈ యెడ నాధనమెల్లను జలధి
నే యున్నదని నీ వెఱుంగుదు కాదె!

రొక్కమొుండెను, నట్టిరొక్కంబుఁ గూర్ప
నిక్కడ నరకొండె నిప్పుడు లేమ;
కావునఁ, బురిలోనఁ గలయుంగఁ దిరిగి
యీవు విచారింపు మెంత ఋణంబు
పుట్టఁగలదొ నన్నుఁబట్టి యీక్షణము;
గట్టిగా నానమ్మకంబెల్ల నిందు
వినియోగ పఱిచెద, 'బెల్మంటు' నకును
జని నీవు ఘనతతో సాధ్వి వరింపఁ
దగి యుంటకయి పట్టు ధనము నిప్పింప
తగుధన మెవ్వరిదగ్గఱఁ గలదొ
నరగునఁ గనుఁగొని చనుదెంచి చెప్పు;
అరిగెద నిపుడేను నాపనికొఱకె
నా కేరిటను గాని నా కున్నయట్టి
యీపలువస్తుసంహతిమీఁదఁ గాని,
వలసినధనమును బడయుట కేను
గలలోను వెనుదీయఁ గలవాఁడఁగాను.

(అందఱు నిష్క్రమించిరి)



౨. రంగము—బెల్మంటుగ్రామము
పోర్షియగృహమునందలి గది
[పోర్షియా, నెరిస్సా ప్రవేశించుచున్నారు]

పోర్షియ—నాయల్ప దేహంబు, నాతిరో! వినుమి,
నాయీన యివు డీఘనప్రపంచంబు
తోడను విసు గొంది తొట్రిలఁ జొచ్చె

నెరి—చేడియరో! నిన్నుఁ జేరియున్నట్టి
మితిమీఱుపటుసౌఖ్యవితతులయట్ల
యతికష్టములు వచ్చి యలయించు నేని,
విసుగుపుట్టఁగ వచ్చు విశ్వంబుమీఁద.
వసుమతిపై నొక్కవింతను జూతు
నది యేమొకో కాని యాహారమునకు
నొందలె ధేమియు లేక పదిగఁబస్తుందు
కడుపేద లెట్లో యాకై వడిగాను
కడుపెక్కసంఖ్యఁ గుడుచువారలును
బాధితు లగుచుంద్రు వ్యాధులచేత.
ఈధాత్రి నటుగాన నెంతయు సుఖులు
సతతంబు మధ్యమ స్థితి నుండువారె.
అతిధనవంతు లెం దల్పాయువు లయి
తెగు చుందు, రటు గాక దీర్ఘాయువులుగఁ
దగుపాటిస్థితిమంతు లగుదు రెల్లెడల.

పోర్షి—పడఁతుకరో! నీతివాక్యంబు లహహా!
కడు నింపుగాఁ జెప్పఁబడియె నియ్యెడను.

నెరి—ఇంత కంటెను నవి యింపుగానుండుఁ
గాంత! యనుసరింపఁగాఁ బడు నేని

పోర్షి—ఇదిమంచిపనియని యెఱుఁగుట వోలె
నది చేయుటయుఁగూడ నవనిలో నంత
సులభమే యా నేని, యిలమీఁదఁ గల్లు
పలుచిన్నగుడులెల్ల బహువిశాలంబు
లయినటి దేవాలయంబులు గాఁ గఁ.

గుయి వెట్టుబీదలగుడిసె లన్నియును
స్థిరములౌ రాజమందిరములు గాఁగ,
నరయఁగా నెల్లెడ నయియుండుఁజుమ్ము
తనచేయు నుపదేశమునుబట్టి నడుచు
కొనువాఁడు దేవుఁడేయని చెప్పవచ్చు;
నే నుపదేశించు నీతులఁ గ్రమము
గా నాచరింపంగఁ గలవారిలోన
నొక్క తెనయి నైన నుండుటకంటెఁ
జక్కనిసద్ధర్మసమితిని నేను
గరమును సులభంబుగా నన్యజనుల
కిరువదిమందికి నెఱిఁగింపఁ గలను
ఇద్దర మనయింద్రియోద్ధతి నణఁప
బుద్ధిచే శాసనములఁ జేయ వచ్చు
కాని, యువ్వాని కాగ్రహాగుణమింత
యేనియు లోఁబడ కెగసి లంఘించు
బలహీన మానట్టివలఁ ద్రెంచుకొంచు
వెలి దూఁకు శశకంబువిధమును బూని,
మతిహీనుఁ జడనఁ నువమాణవకుండు
హితబోధన గణింప కెడగాను దాఁటు
కాని, యీవిధవాద మేను జేయంగఁ
బూనుట, నాయంతఁ బురుషుని నేన
వరియింప వలె ననువాంఛతోఁ గాదు
వరియించుటా! యంత భాగ్యంబెనాకు!
నే నిష్టపడునట్టివాని వరింపఁ

గా నొండె, నిష్టంబు లేనట్టివాని
వరియింప నొక్కట వలదంట కొండె,
నరయ నేను స్వతంత్రురాలను గాను;
మరణమొందినతండ్రి మతివ్రాసిచనిన
మరణశాసనమున మగిడింపఁబడుదు,
బ్రతికియున్న కోమార్తెపటుమానసంబు
వదలని పెనుకట్టుబాటున నుండె;
కాంచియొక్కని వరియించుట కొండె
మించి యేరి నిరాకరించుట కొండెఁ
జాలవిదశ నాకు సంభవం బగుట
చాలఁగష్టము గాదె? చానరో! చెపుమ.
నెరి—పుడమి నీజనకుండు పుణ్యాత్ముఁడెంతొ;
కడు పుణ్యు లవసాన కాలంబునందు
నలరు చుందురు దేవతావేశనమునను;
కలికిరో! యటు గానఁ, గ్రమముగాఁబసిఁడి,
వెండిని; సీసంబుఁ బెట్టి చేయించి
యుండినపెట్టెల నొకదానిఁ దనదు
సంకేతమునుబట్టి సరియైనదానిఁ
గొంకు చెందక కోరుకొన్నట్టివాఁడె
యిల నీకు భర్త కాఁగలవాఁ డటంచు
సలిపిననీపిత్రుజనకుప్రతిజ్ఞ
కారణంబున మాఁట గ్రమమైన పెట్టెఁ
గోరుకొనెడువాఁడు కూర్మి నీమీఁదఁ
దమకకలవాఁడు తపు వేఱొకఁడుఁ

డెప్పుడుఁగానేరఁ డిది నిశ్చయంబు,
ఐన నిప్పుడు నిన్ను నాశ్రయింపంగఁ
బూని వచ్చినరాజపుత్రులైనట్టి
కాముకవరులపైఁ గలయట్టి నీదు
ప్రేమతెఱంగును జేర్వేరఁ జెపుదె?

పోర్షి—వారి నామంబులు వరుసతోఁ జెప్పు;
వారివారిగుణానువర్ణనం బేను
జేసెదఁ బేర్కొవు చెప్పుచు రాఁగ.
చేసెడువర్ణనవాసిని బట్టి
యెవ్వారెవ్వరిమీఁద నెంతెంతప్రేమ
నివ్వటిలునో నాకు నీవెఱింగెదవు.

నెరి—వారిలోఁ దొలుదొల్ల వచ్చెడువాఁడు
పెరగు ‘నేపల్సు’ పృథ్వీశసుతుఁడు.

పోర్షి—అతఁడు తలంపఁగ నశ్వలోలుండు
సతతంబు జనవాజిసంగతి తప్ప
మఱి యొకవిషయంబు మాటాడఁ డెపుడు.
తఱుచుగాఁ జెప్పును దనగుఱ్ఱమునకుఁ
దానె లాడము గట్టఁ దగువాఁడనంచుఁ
బూని ప్రతిష్ఠగ బుద్ధిహీనతను
అమ్మాటనుబట్టి యాతనితల్లి
కమ్మరవానికిఁ గనెనేమొ యతని
నమచు సంశయ మయ్యెడును నాకుఁ జాల

నెరి—వెనుకను ‘పోలండు’ జనపతి గలఁడు

పోర్షి—మొకము చిట్లించుట యొకటి తక్కంగ

నకట ! వేరొకరని యతనికి లేదు
'నను గోరవేని, నన్నియుఁ గోరుకొమ్మ'
యని చెప్పవల్లందు నతనిముఖంబు,
నవ్వ వచ్చెడికథల్ నెవ్వడి వినుచు
నవ్వనపాపంబునను బోవఁ డెవుడు
తనపూర్ణయౌవనదశయందె యిట్లు
పనిలేనిచింతలో మునిఁగి యున్నతఁడు
వయసు మీరుచు నోలంది, వ్యసన ప్రధానుఁ
డయిన యాపండితుఁ డగు నేమొ చూడ
ఈయురుపురలోన నెవ్వని నైన
న్యాయంబుగ వివాహమాడుటకంటె,
ఎనుక నోరను బూని యొసఁగెడునట్టి
యతుని నైనను బెండ్లియాడఁ గాంక్షింతు.
వీర లిద్దఱచేతఁ జేరక యుండ
వారించుఁగాత నన్నధిగ దైవంబు
నెరి—వెలఁది ! యేమనెదవు 'ఫ్రెంచి' రాజైన
యుల 'లిబా' ననియెడు నాతనిఁగూర్చి!
పోర్ష్య—దేవుఁడు మానవదేహంబు నందుఁ
గావించె నాతనిఁ గాఁబట్టి యతని
మనము గణింతము మనుజునిగాను
వినుము నే నెఱుఁగుదు విస్పష్టముగను
బరిహాసిరచుట గొప్పపాతకమంచు
అరయంగ 'నెపల్సు' నకు నాథుకంటె
నితఁడు లెంతదగ దుత్తములలో మెలఁగ

అతిఘనుం డనునొప్పు; నంతియకాక,
యనుపమానగుణాఢ్యుఁ డాస్యంబు మూడ్పు
కొనుటలోఁ బోలందు' మనుజేంద్రు కన్న
తఱుచుగా నరులెల్లఁ దాన యోఁగాని
మఱి నేఁడె తానొక్క మనుజుండు గాఁడు
ఒకపక్షి పాడిన; నొగి నందుకొంచుఁ
దక తక మని లేచి తాండవ మాడు;
తనసీడతోడనే తగ సాము చేయు.
విను మాతనిని భర్తఁ గను జేసికొన్న,
నిరువదిమందికి నిల్లాల నయిన
కరణి యగును జుమ్ము కాంత! నా ప్రభుఁడు.
ననుఁ దిరస్కారంబునను గోరఁడేని,
క్షమఁగాని యాతని క్షమియింతు నేను;
విను మంతయే కాని, వెఱ్ఱిమోహమున
నను నాతఁ డత్యంతమును గోరునేని,
బదులు మోహించి యున్మాదినై నేను
సదయుత వహియింపఁ జాల నెన్నటికి.
నెరి—ఏవాక్యమును బల్కు 'దింగ్లాండు' లోని
క్ష్మావరసుతుఁడు 'ఫాల్కన్‌బ్రిడ్జి' గూర్చి!
పోర్షియ—ఈవ యెఱుఁగుదు నే నీతనిగూర్చి
యేవాక్యమును వచియింప లేకుంట
తెలియు వాతఁడు పల్కుపలుకులు నాకుఁ;
దెలియ వాతనికి నాపలుకు లింతైన,
'లాటిను'. రేట తెలవు 'ఫ్రెంచి'. ఇటలి

పాటి 'యిటాలియా' భాషలలోన
నెఱుఁగఁ డేదియు నాతఁ డించుక యైన,
మఱియు 'నింగ్లీషు'లో మహి గవ్వయైనఁ
జేయునే నని నిల్చి స్థిరముగా నీవె
న్యాయసభలఁ బ్రమాణము చేయఁగలవు.
అతఁ డెంతయును సుందరాంగుండె కాని,
సతతంబు నెఱమూగసంజ్ఞలతోనె
యెవ్వరు మాటాడ నిల నోపఁ గలరు?
నవ్వులాటగఁ దోఁచు నను గోరు టతఁడు.
'ఇటలి'లోఁ జొక్కాయి, యట 'ఫ్రాన్సు' నందు
బలువయినయిజారు, పరఁగుకుళ్ళాయి
'జర్మని'లోఁ గొని, సకల దేశములఁ
గూర్మినడత నేర్చుకొనియెఁ గాఁబోలు!
నెరి—అతనిసమీపస్థుఁడయిన 'స్కాట్లాండు'
పతినిగూరిచి యేమి పలికెదు నీవు?
పోర్షి—పొరుగువాని కితండు పరమోపకారి;
వరియించువిషయమత్తా వాగ్వాదమందు
గట్టిగా నొకలెంప కాయను బొంది.
పట్టుతో 'నింగ్లీషు' వానికి దానిఁ
దనచేత శక్తిగలిగినయప్పుడె త్రి
ప్పను మఁ బ్రమాణంబు నొనరించె నితఁడు
అడ్డువచ్చిన 'ఫ్రెంచి' యతఁ డాబుణంబు
వడ్డితో నిడఁ బూఁటపడెనని యెంతు.
నెరి—పడఁతిరో! 'శాక్సనీ' ప్రభుపుత్రుకొమరు

పడుచు 'జర్మను' నట్లు భావింతు నీవు!

పోర్ష్య—తెలివిగలిగియుండు దినపూర్వభాగ
ములనె యాతని నీచముగఁ జూచుచుందు;
స్మరణ తప్పఁగ ద్రాగు మధ్యాహ్నవేళ
గరము నీచతమముగాఁ జూచుచుందు
ఘనవివేకముచాలఁ గలయప్పు డతఁడు
మనుజునికంటెను మఱితక్కువగును;
మిగులంగ నవివేకి యగునప్పు డతఁడు
మృగముకంటె నొకింత మెఱుఁగా నుండు
ప్రాణగండమువచ్చు పట్టుననైనఁ
ప్రాణమై నేదేని తంత్రంబు పన్ని
పతినిగా నీతని వరియింప కుండఁ
గొతుకక తప్పించుకొనుదాన నేను.

నెరి—వరియింపఁగా బూనివచ్చియీతండు
సరియైనపెట్టెనె సాధించునపుడు,
నీవు వరింపక నెపపెట్టి యితని
బోవబంచితి వేని, పొలతిరో! నీదు
జనకుండు మరణశాసనమందు వ్రాసి
చనిన యాజ్ఞను మీఱి చరియింపవలయు

పోర్ష్య—అటువంటి విపరీత మిటుఁ బుట్టకుండఁ
దటుకున సారాయి తగినంతయున్న
యట్టి యుద్ధపుగిన్నియను దెచ్చి కృపను
పెట్టియుంచుము తప్పు పెట్టెయమీఁద
[illegible]

పైనిట్టిమచ్చును బచరింతు వేని,
చేరి యాపెట్టెను జెచ్చెర నితఁడు
కోరునం చెఱుఁగుడుఁ గుతుకంబుతోడ.
విను మిట్టి పావనమూర్తిని జేసికొనక
మునుపు నేనేమి చేసినఁ జేయుదాన.

నెరి—ఈవు భయంపడ కీపరిభువులందు
నేవాఁడుగాని నీ కేలిక గాఁడు;
నోరెత్తి వారిమనోనిశ్చయముల
వారెఱింగించిరి వరుసగా నాకు;
పెట్టెలఁబట్టియే పితృనియోగమున
గట్టిగా వరియింతుఁ గాంతునినంట
మాని వేఱొకమంచిమార్గంబు నీవు
పూనిచూపినఁ దక్కఁ, బోదురు వారు
తమతమగృహముల దారిని బట్టి
శ్రమ పెట్ట కిఁక దర్శనములతో నిన్ను
వరియించు తలఁపులు వడిఁగట్టిపెట్టి.

పోర్ష్య—విను 'సిబిల్లా' యంత వృద్ధకామినిగ
మనుదు నేని, 'డియాన' మాడ్కిని నేను
బరిశుద్ధకన్యకాత్వమునందె యుండి
మరణంబు నొందుదు; మఱి యంతెకాని
ఘననియోగము మీఱఁ గలదానఁగాను
ఈకాముకులమంద యిటు వివేకంబు
[illegible]

అందఱు వీరిలో, నరిగినందునకు
డెందంబులో మోద మొందంగవలయు
వారె కాని, యొకండు వీరిలోపలను
వేఱుచందమువాఁడు వెదకిన లేఁడు ;
కావున క్షేమంబుతో వార లెల్లఁ
బోవఁగ నిండ్లకు దైవంబుఁ గొలుతు.

నెరి—వెనుక నీతండ్రి జీవించియున్నపుడు
ఘనపండితుఁడు శూరజనమండనుండు
వచ్చె నొక 'వినీసు' పట్టణవాసి
యిచ్చటి కొకసారి, యింపు దీపింప
నా 'మాంటుఫెర్రాటు' భూమీశుతోడ,
ఏమైన జ్ఞప్తి నీ కింతయు లేదె?

పోర్షియ—ఔనౌను. మఱవ 'బస్సానియో' యతఁడు
నేనెంతు నదె యాతనిసమాఖ్య యంచు.

నెరి—ఔను. సత్యముసుమ్మి; యోనాతిమిన్న !
నేనుజూచిన యెల్లమానవులందు
నతఁ డొక్కఁడే కదు నర్హతముండు
నుతిపాత్రి యా మేలిసతిని వరింప.

పోర్షియ—జ్ఞప్తిలోనున్నాఁడు చక్కఁగా నతఁడు;
జ్ఞప్తిఁ బట్టి, తలంప నరిగనాతండు
కరము నర్హుఁడు నీవు కామించుస్తుతికి.
[సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]
నరిగఁ జెప్పుము సమాచారము లేమి ?

సేవ—నలువురు క్రొత్తవారలు మీయొద్ద

సెలవుఁ గైకొనియేగఁ దలఁచియున్నాఁడు;
ఏనవవాఁడయి యెసఁగు మొరాకో,
భూనాథుకడనుండి ముందుగా దూత
వచ్చి, యిటకుఁ దనప్రభువె యీరాత్రి
వచ్చునంచును దెచ్చె వర్తమానంబు
పోర్ష్య—తక్కినవారిని దయచేసిపంపఁ
జక్కఁగా మన్నించుచందంబుగానె,
యైదవవానిని నంత నెమ్మదిని
యాదరింప వలంతి నయ్యేద నేని,
ఆనంద మొందుదు నతనరాకకును
మానినిరో! 'మొరాకో' యను జేశ్వరుండు
కడు సాధుహృదయంబు గలుగు వాఁ డయ్యె
వెడఁగురక్కసిఁబోలు నొడలి వాఁడైన,
విను మాతనిని గౌరవింతునె కాని
మనసార నొడఁబడ మఱి పెండ్లియాడ
పోలఁతుకరో! రమ్ము పోదము మనము.

(సేవకునితో)

నిలువక యోరోరి! నీవుపొమ్మవుల;
వెలికొక్క కాముకు వెడలంగఁ బంచి
తలుపు వేసికొనుటె తడవుగానుండు;
క్రమ్మఱ నింతలోఁ గాముకుం డొకడు
గుమ్మముకడఁ జేరి గుద్దును దలుపు

### 3. రంగము—వినీసు నగరములో నొకబహిరంగస్థలము



[బస్సానియో, షైలాకు ప్రవేశించుచున్నారు]

షైలా—మాడలుమూడు వేలు—మంచిది; యింక!
బస్సా—మాడ లన్నియె; మీఁది మూడుమాసములు.
షైలా—మాసములును మూడు—మంచిది, యింక!
బస్సా—ఆసామ్మునకు నెల్ల 'నాంటోనియో'యె,
చిత్తగింపుము నేను జెప్పినయట్లు,
యుత్తరవాదిగా నుండును జుమ్ము.
షైలా—'అంటోనియో', బద్ధుఁ డగు—మంచిదయ్య.
బస్సా—వెంటనే కోరినవిత్తంబునిచ్చి
డెందంబు నానంద మొందింపఁగలవె!
ఇందున కుత్తర మేమి యిచ్చెదవు!
షైలా—మాడలు మూడు వేల్—మఱి వాని గడువు
మూడుమాసంబులు—మొత్తముదీర్ప
నొడఁబడి యాంటోనియో, బద్ధుడగును.
బస్సా—అడిగినదానికి నిదుముత్తరంబు.
షైలా—'అంటోనియో' మంచి యతఁడగు నయ్య.
బస్సా—వింటివె యొండైన వేఱుగానీవు!
షైలా—లేదు లేదింతయు లేదు లేదయ్య;
ఆదట నే మంచియతఁ డంచు నతనిఁ
బలుకుట కుత్తరవాదిగా నుండ
వలఁతి యంచు మదభిప్రాయంబునమ్ము

భయదచంచలదశఁ బడసియుండెడిని
ఆయన కున్నట్టియాయోడలందుఁ
బోయెఁ దానొకటి 'ట్రిపోలీ'కి, మఱియు
'హిందు' దేశంబున కేగె నొండొకటి;
విందు నంతియ కాక విపణి కే నేగి,
యొకయోడ 'మెక్సికో' కొండొకయోడ
యొకట 'యింగ్లాండు'న కరిగెనటంచు;
ఇది గాక తక్కినయెల్లయోడలును
చెదరి యున్నవి పెక్కుసీమలయందు.
బల్ల చెక్కలె యోడ, లల్లనావికులు
నెల్లరు మర్త్యులే; యింతయ కాక
స్థలమూషకంబులు జలమూషికములు
పలునీటిదొంగలు స్థలతస్కరులును—
కా దోడదొంగలు—కరమునుగలరు!
మేదినీధరములు, మితిమీఱుగాలి,
ప్రవహించుపెనునీరు బహుహానిఁజేయు
అవి యెల్ల నెట్లున్న, నాతండు కరము
చాలి యుండినవాఁడె—చక్కనిమాడు
వేల మాడలు—నేను విశ్వాసము నుంచి
యీయెడఁ బత్రంబు వ్రాయించుకొనుచు
నీయ వచ్చునని యెంతు నాతనికి.

బస్సా—నిస్సంశయంబుగ నీ వీయవచ్చు

షైలా—నిస్సంశయంబుగ నే నీయవచ్చు
మంచి దాలోచింతు, మన్ననో యూథి

యించుక కుదురంగ, నీవిషయంబె
నేను నెమ్మదిగ 'నాంటోనియో' తోడఁ
బూనిమాటాడంగఁ బొసఁగునే నేఁడు ?

బస్సా—మాతోడభుజియింపనే తెంతు రేని,
యాతనితోడ మాటాడంగ వచ్చు.

షైలా—వాసన గననేమొ పందిమాంసంబు
మీజరంబుగ మున్ను మీయతకర్త
పెనుదయ్యమును లోనఁ బెట్టిన పంది
ఘనశరీరంబును దినుటకై యేమొ.
కలియుదు మీతోడఁ గ్రమవిక్రయములఁ,
బలుకు లాడంగను, బయనంబు సేయ,
నీరీతిపనుల మఱెన్నిట నైన;
ఆరయ మీతోడ నంతియ కాని,
నేను భుజింపను, బానంబు సేయ,
ధ్యానంబు కలిసి చేయను భగవంతు—(సేవకునితో)
విపణిలో నేమైన వింతలు గలవె?
ఇపు డిందు వచ్చెడ రెవ్వరు వారు?

[ఆంటోనియో ప్రవేశించు చున్నాఁడు.]

బస్సా—'ఆంటోనియో' సుమీ యావచ్చు వాఁడు.

షైలా—(తనలో) కంటకు నితఁ డిచ్చకంబులు పలుకు
సుంకరిగతి నెట్లు చూడ నయ్యెడునో!
ఇంక ద్వేషించెద నీతని నొక్క-
క్రైస్తవుఁ డనునట్టికారణముననె;
[illegible]

పరులకు నప్పిచ్చి, వడ్డిక్రమంబు
నరయక చెడఁగొట్టి యవివేకరీతి
మఱియీ 'వెనీసు'లో మాబోంట్ల కెల్లఁ
దఱుగని నష్టంబు తగిలించుఁ గాన
రోఁత పుట్టు మఱింత యీతనిమీఁద.
ఈతనిజుట్టొక్కయింత నాచేత
దొరకినఁ జాలును, దొంటివైరంబు
కరమర్థి సాధింపఁ గలవాఁడ నేను.
మహనీయు లయినట్టిమాజాతివారి
బహుతరద్వేషభావంబునఁ జూచు;
వణిజు లందఱుఁ గూడుపట్టునఁగూడ
గణన సేయక నన్నుఁ, గడు నేనొనర్చు
బేరంబును, నధర్మవృద్ధియుం జొక్క-
పేరిడి వ్యవహారవిధమున వచ్చు
న్యాయార్జితంబైననాదులాభమును,
దోయమువారిలో దూషించు చుండు.
చేతిలోపల వచ్చి చిక్కినయపుడె
యీతనిఁ గరుణించి యే సైఁతు నేని
మాకులంబున కవమానకరంపు
వ్యాకులతను గూర్చువాఁడ నేనౌదు.

బస్సా—వినుచున్నావె నేనను చున్నదాని?

షైలా—ధనమిప్పుడెంత నాదగ్గఱనిల్వ
నౌదవునో చింతించుచున్నాఁడ మదిని;
పదిలముగాజ్ఞప్తిఁ బట్టియూహింప

మూడు వేల్వాడల మొత్తంబు నేను
నేఁడు పూర్ణంబుగా నిమిషంబులోన
నర్పింపఁగాఁ జాల; నయిన నేమాయె!
ఓర్పుతో నడుగ, మా'యూదుల' జాతి
వాఁడైన 'ట్యూబలు' బహుధనికుండు
నేఁడు తప్పక యిచ్చు నేఁగోరుసొమ్ము
తాళు మించుక సేఁపు; తగ నెన్ని నెలల
కాలంబు వలయును గడు వింక మీకు!
ఘనశుభంబులు నీకుఁ గలుగునుగాక!

(ఆంటోనితోఁ)

నినుగూర్చియే యింతదనుకను నిందు
మాటాడు చున్నాము మాలోన మేము
ఆంటో—నూటికింత యనుచు నొక్కి యొక్కింత
వడ్డివిగ్రకొని బదులిచ్చి యుండె,
వడ్డినూరక యిచ్చి పరులదగ్గఱను
బదులు చేకొనియుండె, పరికించి చూడ
నిదివఱ కెన్నండు నెఱుఁగను నేను;
ఐన, మిత్రునిగొప్ప యక్కఱఁదీర్పఁ
బూనినా వ్రతభంగమున కొప్పుకొందు

(బస్సానితోఁ)

ఈ వెఱింగించితె యితనితో నెంత
కావలయునొ సొమ్ము గట్టిగా నీకు?
షైలా—మూడ లీతఁడు నన్ను మూడు వే లడిగె
ఆంటో—మూడుమాసంబు లప్పును దీర్చ గడువు

షైలా——మఱచిపోయితి; మూడుమాసము లౌను;
మఱి చెప్పితిరి మీరు మంచిదట్లయిన
వంచింప కిపుడిందు పత్రంబువ్రాసి——
కొంచె మాలోచించుకొననిందు నన్ను.
వినవయ్య; యిప్పుడు వృద్ధికి నీవు
ధన మప్పు గొన నని, దాని నన్యులకు
బదు లియ్య ననియును బలికినయట్లు
విదితముగా నింత వినిపించెఁ జెవికి.
ఆంటో——పనియట్టి దెన్నఁడు నొనరింప నేను

షైలా——వెనుకను 'జ్యాకబు' దన పినతండ్రి
యైన 'లేబను' గొఱ్ఱియల మేపునపుడు,
(జ్ఞానాఢ్యురాలైన జనని తా నతని
పక్షంబునను మంచిపని చేయు కతన)
దక్షతఁ బావనతముఁ డైన 'యాబ్ర
హాము' నుండియు వరయఁ దృతీయుఁడైన
స్వామి యయ్యెను గాదె వానికి నెల్ల !
అవుఁగవు మాడవయనుభోక్త యయ్యె.
ఆంటో——అవు నాతనిగుఱించి యనియెడి దేమి !
అతఁ డేమయిన వడ్డినటఁ బుచ్చుకొనెన !

షైలా——అతఁడు వడ్డి గ్రహింపఁ డరసి చూడంగ;
మీయర్థమునుబట్టి మేదిని సరిగ
నాయది వడ్డికా దనుమాత్రె మైన.
కను మేమి 'జ్యాకబు' కావించినాఁడో
మఱియు 'లేబను'ను దాను మాదముతోఁ గలిసి

చిత్రవర్ణంబును జెలఁగు చాఱలును
గాత్రంబునందును గలగొఱ్ఱెపిల్ల
లెల్లను గూలికై యియ్యంగఁ దనకుఁ
జెల్లెడియేర్పాటు చేసికొన్నపుడు,
నేరుపరి యగునా నెఱిగొల్లవాఁడు
చేరి కట్టెలు కొన్ని చిత్రవర్ణంబు
సంభవం బగునట్లు చర్మంబునొలిచి,
సంభోగ వేళ మేషంబులు వానిఁ
జూచునట్టుగ నొక్క చోటనుబాఁతె;
చూచి యవ్వానిని సురతంపువేళ
మచ్చపిల్లలఁ బెట్టె మఱి గొఱ్ఱెలెల్ల,
అచ్చట నవి యెల్ల 'జ్యాకబు' వయ్యె,
ఇది యొక మార్గ మీయిల వృద్ధినొంద;
పొదలెను దీవనఁ బొంది యాతండు.
మ్రుచ్చిలి గడియింపఁ బూనక యున్న
మెచ్చగుఁ జుమ్మి భూమిని వృద్ధి గనుట.

అంటో—అది యదృష్టము చూత మని 'జ్యాక' బెంచి
పదఁపడి చేసినపని యంతె కాని,
దాని ఘటించు టాతని శక్తిలోని
దేవాఁడుఁ గానేర దించుక యైన;
దైవంబు దయచేసి తాను నారీతిఁ
గావించెఁ గావునఁ గలిగె వాంఛితము.
అది వడ్డి మంచిది యని చూపుకొఱకు
మొదలను మన వేదమునఁ జేర్పఁబడెనె!

కాక, నీవైన బంగారంబు వెండి
మీకొనఁ బొట్టేళ్ళు మేషాంగనలు నె!
పైలా—అది చెప్పఁజాలనే నంతియెకాని,
వెదవెట్టి యంతటివేగంబుతో నె
విత్తంబుఁ బిల్లలఁ బెట్టింపఁగలను.
చిత్తగింపుఁడు నేను చెప్పెడుమాట—

అంటో—(తమలో) వినుమి యీయనుఁడు వేదంబునుండి
తనపనికిఁ బ్రమాణమును జూపఁగలఁడు.
అంటో
తనదురాచరణంబు స్థాపించుకొనుకుఁ
పైలా- బనిఁ గొనుచుఁ బ్రమాణ వచనముల్ నుడువు
కష్టాత్ముఁడు, నగుమొగంబును బూను
దుష్టునికరణిని, దొంగఁ జూపులకు
బాగుగా నుండి లోపలఁ గుళ్ళినట్టి
రేఁగుఫలముయొక్క రీతిని నుండు.
ఔరార! పయి కెంత యందంబుగాను
ధారుణిఁ గాన్పించు దబ్బఱ యెపుడు!

పైలా—మూడలు మూడు వేల్—మంచిమొత్తంబు;
మూడు మాసము లొక్క యేఁడాదిలోన—
ఈనెలలకు వడ్డి యెంత కాఁగలదొ
యేను జూచుకొనుచు నన్నిక వేసి.
అంటో—సామ్మును దయచేసి మమ్ముఁ బంపెదవె!
పైలా—నమ్మిక చెడ నాధనమ్మునుగూర్చి
వడ్డిని గూర్చియుఁ బలుమాఱు నన్ను
సడ్డ సేయక తిట్టి సరివారిలోన

నవమాన పటిచిరి వంగళ్ళవాడ.
అవియెల్ల సహియించి యడఁగి యున్నాఁడ,
శాంతియే యెందు మాజాతివారికిని
గాంతి నిచ్చెడియలంకారంబుగాన.
నాయిష్ట మగురీతి నాసొంతసొమ్ము
హాయిగా వాడిక చేయుతప్పేనకై,
యంతగా 'నాస్తికుఁడా' యంచు మఱియు
'గొంతుకలను గోయు కుక్కా' యటంచుఁ
బిలిచితివై చితి వుమ్మి వలువలమీఁద.
బళి! నీకు నిపుడు నావలనితోడ్పాటు
కావలసినయట్లు కానిపించెడును.
నీవద్ద వేయేల? నీవు నాకడకుఁ
జనుదెంచి యిటమాకు ధనము కావలయు
ననుచును మఱిమఱి యడుగు చున్నావు.
వెనుక గడ్డముమీఁద వెస నుమ్మివైచి
చని లోన దూఱినశునకంబు నొకటఁ
దన్నినగతి నన్నుఁ దన్నిననీవె
వెన్నాడి ఋణమియ్య వేడుచున్నావు.
ఈయెడ నీకు నేనేమి యుత్తరము
నీయంగవలయును? ఓయి! యెందైన
శునకంబునొద్దను సొమ్ముండునయ్య?
పనికిమాలినకుక్క బదులుగా మూడు
వేలమాడల నియ్యఁజాలునె? యంచు
లీల నేఁబలుకంగఁ బోలదే యిపుడు?

ఏను నీకడవంగి భృత్యారావమున
దాసిక యూపిరినైన బిగ్గరగ!
వినయంబుతోఁప మెల్లనివాక్యములను
'ఘనపుణ్య! బుధవారమున మొన్న మీర
లొకతేప నామీఁద నుమ్మివైచితిరి;
ఒకనాఁడు తన్నితి రూరక నన్ను;
మఱియొక్కదినమున మన్నించి నన్నుఁ
బిఱికికుక్క యటంచుఁ బిలిచినారు;
మీరుచేసిన యిట్టి గౌరవాధిక్య
కారణంబున నియ్యఁగలవాఁడ ఋణము
నని చెప్పుదునె నేను హర్షంబుతోడ!

—నిను నిప్పుడునుగూడ నే నట్లె పిలిచి,
తిన్నఁగాఁ బయినుమ్మి తిరుగంగ వైచి.
తన్నునుగూడను దన్నంగవలయు.
ఇయ్యెడ నాకప్పు నిచ్చెదవేని,
నెయ్యాన కిచ్చిన ట్లియ్యంగఁ బోకు;
ఏలయన్నను, నెప్పు డెవ్వఁడు సఖుని
పాలను సొమ్మిచ్చి వడ్డిగైకొనెను!
అదికాన, నీవిప్పు డరికిచ్చినట్లె
బదులిమ్ము నాకును; పలికినయట్టి
మాటతప్పితి నేని, మఱియు నిర్దయత
పాటించి కైకొనవచ్చు దండుగను,

షైలా—ఇంతలోవచ్చె నీకెంతకోపంబో!
ఎంతయు నీతోడ నిపుడు స్నేహంబు

కావించుకొని, నీదు కరుణయుఁ బడసి,
నీవొనర్చినయట్టి నికృతుల మఱచి,
యివ్వేళ నీయక్క తెల్లనుదీర్చి,
గవ్వయు వడ్డిని గైకొనకుండ
ధనము నీకప్పియ్యఁ దలచినవాఁడ ;
వినుము నామాటలు కొనముట్ట నీవు ;
దయఁబూనియే యియ్యఁదలఁపుగొన్నాఁడ.

బస్సా—దయచేసె యనవగు ధనమిత్తు వేని.

షైలా—ఈయుపకారంబు నేఁ జేయువాఁడ
న్యాయవాదికడకు నావెంటవచ్చి
'గడవునాఁటికి సొమ్ము కడతేఱనీని
యెడలను, నేను నాయొడలియందుండి
నేరమాంసంబును శీఘ్రంబ నీవు
కోరినచోటును గోసి యియ్యంగఁ
గలవాఁడ' నని యొక్కగడువుపత్రంబు
బలువినోదార్థంబు వ్రాసి చేవ్రాలు
చేసి యాతండు వీక్షింపుచునుండ
వేసి నీముద్రను వేగ నాకిమ్ము.

అంటో—ఇంతటితోడ నీవిఁకఁ దృప్తినొందు
సంతకమొనరించి సరిగఁబత్రమును,
కలదు 'యూదు'నికిని కనికరమంచుఁ
బలుకంగఁగలవాఁడ బహుసుఖంబులను.

బస్సా—న్యాయంబు కానీవు నానిమిత్తంబు
వాణియకు నటువంటిపత్రంబు నెప్పుడు

## వినీసు వర్తకచరిత్రము

ఇట్టిపత్రమున కీవీకొంటకంటె
నట్టియుండెద నున్నయట్టియీస్థితినె.

అంటో—మిత్రుఁడ! భయ మింతమాత్రంబు పడకు;
పత్రింబులోపల వ్రాసినయట్టి
గడువుదాఁటఁగనియ్యఁగలవాఁడఁగాను.
జడియకు రెండుమాసంబులలోన
(మనపెట్టుమితి కొక్కమాసంబుముందె)
చనుదెంచు నోడ లిచ్చటికిని నావి
మనమీతనికి నియ్యఁ జను సొమ్ముకంటె
వినుము తొమ్మిదిరెట్లు విత్తంబుతోడ.

షైలా—ఏమి! యీక్రైస్తవు లెంతటివారు!
తా మితరులతోడఁ దగఁజేయునట్టి
వ్యవహారములనెంచి, పరులపైఁగూడ
మిగుల సంశయమున మెలఁగుచుందురు.
దయచేసి దీనికుత్తర మిమ్ము నాకు!
పయినున్నమితికిలోపల సొమ్మితండు
చెల్లింప లేకున్న, సేరుమాంసంబు
నల్లపత్రముఁబట్టి యదిమి కైకొన్న,
లాభంబు నాకేమి లభియింపఁగలదు!
ఈభువి నరమాంస మెంచిచూడంగ
గొఱియల మేఁకల గొడ్లలో వేని
యెటిచికి వెలయుండు నెనరాకయుండు;
ధర నంత యుపయోగకరమునుగాదు.

నుపకార మిదిచేయ నొప్పుకొన్నాఁడ
ఇపుడిష్టముండి తా నీతండు దాని
నంగీకరించిన నదియొక మేలు;
అంగీకరింపఁడే నటమున్న మేలు
నాయనుగ్రహ మెంచి, నాకేమి కీడు
చేయకుండఁగమీకుఁ జేయుదున తిని

అంటో—నీకొడంబడికను నేవ్రాసియిత్తు.

పైలా—ఈకొందు వేని నీవిటు వ్రాసియియ్య,
న్యాయవాదికడ నడిచి పత్రమున
వ్రాయుపద్ధతి నీవు వ్రాయుచుండు;
చని నేను మాడలు సంచిలో వేసి,
ధనమును దుర్వ్యయ మొనరింపఁజూచు
పలుకుభృత్యునియొక్క వశమున నున్న
యిను మాను కొనివత్తు నీవిఋపంబ.

అంటో—త్వరితముగా రమ్ము తగువాఁడవీవు

[పై॥ వెళ్లెను.]

కరుణాళుఁడయ్యెడుఁ గరమునునితఁడు;
ఈ 'యూదు' డగుఁజుమీ యిఁకఁ గ్రైస్తవుఁడుగ.

బస్సా—తీయనిపలుకులుఁ దెక్కలిమనసుఁ
గలవారినెంతయు గర్హింతు నేను

అంటో—అళుకొంద వలపిన యక్కఱలేదు;
పడతెమ్ము పోదము; నామోడలెల్ల
గడువొక్క నెలయుండఁగనె యిల్లుచేరు

(అందఱు నిష్క్రమించిరి.)

## ద్వితీయాంకము



౧. రంగము — బెల్మాంటుపురము. పోర్ష్యగృహములోని గది.

[వాద్యములు మ్రోయుచుఁగా తనపరివారముతో మొరాకో రాజకుమారుఁడును, పరిచారకులతోఁగూడ పోర్ష యును, నెరిస్సాయును, ప్రవేశించు చున్నారు.]

మొరా — కరముదగ్గఱనుండి పెరిగినకతన
ఖరకిరణుఁడు నాకుఁ గరుణించినట్టి
నీలాంబరంబన నెగడునామేని
నీలిడాలునుజూచి నెలఁతరో! నన్ను
సేవగింపఁగబోకు మించుకయేని
కేవలమును సూర్యకిరణాగ్ని సోఁకి
మంచుగడ్డలను గరంచఁగాలేని
మంచియుత్తరభూమి మఱిపుట్టినట్టి
కడునందగాని నాకడకును దెచ్చి
వడిగ నీప్రేమంబు బయలఁబడంగ
గంటులొనర్చ మాకాయంబులందు
బంటుతనముఁ దెల్పుబహుశోణరక్త
మెవ్వనిలోపల నెసఁగియుండెడునో
యివ్వాడి నందఱి కెఱుఁగంగ నగును
ఎఱిఁగింతు వినుము నాయీరూపెమున్న
వెఱవు పుట్టించెను వీరులమదికి;
వాకొనియెద గొప్పబాసను జేసి

మానీమఁ గలయట్టిమగువలం దెల్ల
వాసికెక్కినరూపవతు లెల్లవారు
నీరూపమునకె మోహింతురు నన్ను
ఈరంగు మార్చుకో నేనిచ్చగింప
నీరజాక్షీమణి! నీమానసమును
గోరి హరించెడికో అకుఁ గాదేని.

పోర్ష్య—కన్నెనయ్యెవరించుకార్యమందొక్క
కన్నులచేతనే ఘనవివేకంబు
వదలి, నే నడపంగఁబడుదానఁ గాను;
అదిగాక నియతియొం డడ్డముండుటను
వరుని స్వేచ్ఛగఁ గోర వల్లగాకుండు
అరయ నింతకుముందె యవులమీాతోడ
విన్నవించినయట్టివిధముగా నెవఁడు
నన్నుసాధించునో యన్నరాగ్రణికి
నేనుభార్యనుగాఁగ నిర్బంధమొకటి
పూని నాజనకుండు బుద్ధిపెంపునను
గావింపఁడేనియు, ఘనకీర్తిధామ!
నీవును ననుగోరి నేఁటివఱకును
వచ్చియుండినయెల్లవారలవలెనె
హెచ్చుచక్కనివాఁడవే యయి యుందు
విందు నాదృష్టికి, నిది నిశ్చయంబు.

మొరా—అందునకును మ్రొక్కు లర్పింతునీకు;
కరుణించి పెట్టెలకడకును నన్ను
నరుగనఁ గొనిపొమ్ము; చనినాయదృష్ట

ఎటులుండునో యత్నమేఁ జేసిచూతు.
ఇటమున్ను ముస్త్ఫాను నెదిరించి పోరి
'సాలిమా' ననఁగను జనెడి 'సుల్తాను'
నాలంబులో గెల్చినట్టియా 'పార
సీక' రాజును, బుత్రుఁ, జెండాడినట్టి
యీకత్తితోడు, నేనిటువంటిక్రూర
దృష్టివానిని మించు తేఱిచూచెదను;
సృష్టిలోపలనెల్ల స్థిరధైర్యశాలి
యైనవానిని మింతు నతిధైర్యగరిమ;
ఈనినప్పుడు తల్లియెలుఁగుబాల్ద్రావు
నెలుఁగుపిల్లలనెల్ల నీడిచి తెత్తు;
బలమైనయాఁకటఁ బటుగర్జనంబు
నొనరించుసింహంబు నొగివెక్కిరింతు;
వనితరో! నిను గెల్చుకొనియెడుకొఱకు.
కటకటా! చింతింతుఁ గాలవక్రతకు.
పటుసమర్థుఁడెవఁడో పరికించుకొఱకు,
యజమానుఁడైనట్టియుల్ల 'హార్క్యులెసు'
నిజసేవకుండయి నెగడు లిచాసుఁ
గలిసి జూదము నాడఁగను దైవికముగ
బలహీనునికె పెద్దపందెంబు భువిని
బడవచ్చుఁ బాచికల్ పట్టివేయంగ.
ఒడిచె 'హార్క్యులెసు'న రయొకసారితొల్లి
సరిగ సేవకుఁ డట్టిచందంబుగాన.
అరయ నేనును నట్టి యంధమైనట్టి

భాగ్యంబుచే నడపంగను బడుచు
యోగ్యపేటికి నయోగ్యున కట్టి విడిచి
వెసఁ బోయి యొకతప్పుపెట్టెను గోరి
వ్యసనాతిశయుతఁ జావంగనువచ్చు.

పోర్షి — భారమదృష్టంబుపయి వైచినీవు
కోరఁ బ్రయత్నింప గూడదు మొదల;
అటుగాక కోరనేయత్నింతు వేని,
యట కేగి పెట్టియ వంటకమున్న
తప్పుపెట్టెనుగోరి తాఁకినయెడల
నెప్పుడు నిఁకమీఁద నయింతితోడ
మఱివివాహముఁగూర్చి మాటాడనంచు
నుఱిదిప్రమాణంబు నొనరింపవలయు
కావునఁబరికించి కార్యంబుగనుము.

మొరా — ఏవెలందినినింక నేఁగోరఁబోను;
వచ్చి పెట్టెలఁ గనఁబఱువుము నాకు.

పోర్షి — క్రచ్చు ఆదేవతాగారంబునకును
ముందుగాఁ బోవలె; భుజియించి వెనుక
నిందుఁ బెట్టెలఁజూచి యేర్పుకోవచ్చు.

మొరా — ఓయదృష్టము! మానసాఘుంబునందుఁ
జేయుదువో ధన్య శేఖరుఁగాఁగ
ఒనరింతువో లేక జనులలోనెల్లఁ
గనరాని మందభాగ్యుని గాఁగ నన్ను!
(వాద్యములు మ్రోయ వెళ్ళుచున్నారు.)

౨ రంగము—వినీసు నగరములో నొకవీధి

[లాంసిలాటు ప్రవేశించుచున్నాఁడు.]

లాంసి—నాయంతరాత్మయు నాస్వామియైన
యీ 'యూదు' కడనుండి యెట్లైనఁబాఱి
పోవనొప్పను 'గ్రైస్తవుఁడ' నాట నేను
ఈవలను బిశాచ మిప్పుడే చేతి
సరసనుజేరి యో సర్వోత్తముండ!
సరగున లేచి, నీచరణంబులకును
బనిపెట్టి, దవ్వుగఁ బఱుగిడు మనును.
'పని చెడు; వలదది పాడిగాదయ్య;
భద్రము! కాలెత్తి పఱచుట యన్న
త్సుత్రిపుఁబనిగాఁగఁ జూచుకొ'మ్మనుచుఁ
బలుకుచున్నది తేటపడ నంతరాత్మ.
తలఁపఁదెంపరియైనదయ్యంబు 'మూట
గట్టుము; పయనంబు గముకి లేలెమ్ము;
దిట్టతనముపూను దృఢముగామదిని;
పాఱిపొ'మ్మనినన్ను బనుచుచున్నయది.
మీఁఱి డెందంబున మెడ కౌఁగిలించి
తద్దయు బుద్ధిగా దా నంతరాత్మ
'పెద్దమనుష్యుఁడా! పెద్దమనుష్య
తనయుండవై యుండి తప్పకునీతి'
ననుచును గడు నాకు న్యాయంబుచెప్పు;
తొలుతనునాతండ్రి దొంగిలుటందు
నలవాటుచేఁ గొంత యభిరుచిగలుగు

వాఁడౌట, నను 'నయవంతురాలైన
యాఁడుదానితనయుఁడ' న్న బాగుండు.
'అఱుగంగవలదయ్య' యనునంతరాత్మ;
'అఱుగుముశీఘ్రంబ' యనుఁబిశాచంబు;
'అఱుగంగవలదయ్య' యనునంతరాత్మ.
సరసంబుగా నీవు సద్బోధ నాకు
నొనరించెదవు చాల నోయంతరాత్మ!
ఒనరించెదవు నీవు నోపిశాచంబ
మంచిబోధనె నాకు మాటిమాటికిని,
వంచనలేక నే వడి నంతరాత్మ
చెప్పినరీతిని చేయుదునేని,
తప్పక యొకరీతిదయ్యాంబువంటి
'యూదు' ని యొద్దనె యుండంగవలయు;
'యూదు' ని కడనుండి యుఱుకుదు వేని,
తలఁపఁ గేవలమును దయ్యమేయైన
యలపిశాచముమాట వలయుఁ జెల్లింప.
ఆ 'య్యూదుఁడు' వి నిశ్చయంబుగ నల్ల
దయ్యంబునపరావతారంబె సుమ్ము.
కఠినత్వము వహించి కడు నంతరాత్మ
శఠుఁడైన 'యూదు' ని సరసను నిలుపఁ
బనుచుచున్నది మనోవ్యథహెచ్చ నన్ను,
మనసున కింపుగా మంచియోచనను
జెప్పెదును బిశాచ మిప్పుడు మిగుల,
తప్పక పఱగెత్తెదను, బిశాచంబ!

సీదగునాజ్ఞలో నిలిపితి నాదు
పాదద్వయము, నింకఁ బాటిపో మెదను.
[ఒకగంప పట్టుకొని వృద్ధుఁడైన 'గాబో' ప్రవేశించుచున్నాఁడు]
గాబో—ఓయయ్యగారు! వే 'యూదుని' యింటి
కేయది త్రోవయో యెఱిఁగింపరయ్య.
లాంసి—(తనలో) ఆహాహా! నాకన్నయ య్యయే యితఁడు.
ఊహింప నరగుడ్డి నొక్కింత మించి,
నను నానవా లిడఁగను లేదికతనఁ
గొనవచ్చు ముప్పావుగుడ్డిగా నితని.
ఇప్పుడు క్షణమాత్రమీతనితోడ
గొప్పవినోదంబు గొలుప భావింతు.
గాబో—ఓయయ్య! దయచేసియూదునియింటి
కేయది త్రోవయో యెఱిఁగింపు మయ్య.

లాంసి—మొదటిమలుపునను ముఖ్యంబుగాను
వదలక కుడిచేతివైపునఁ దిరుగు;
తరువాయిమలుపులోఁ దప్పకుండంగఁ
దిరుగు మెడమచేతిదిక్కునకీవు;
ఆవలిమలుపులో నల 'మేరి' యాన,
యేవంకకును మళ్ళ కేగుము నీవు
'యూదుని' యింటికే యోరగా నడిచి.

గాబో—ఈదారి తెలియుట, యీశ్వరుతోడు
కరముకష్టంబుగఁ గాన్పించు నాకు.
పరిచరుఁడయి 'యూదు' పజ్జను నున్న
యల 'లాంసిలా' టిప్పుడం దే యున్నాఁడొ

కొలువేది యటలేఁడో తెలుపంగఁగలరె?

లాంసి—మాటాడుచున్నావె మఱిచిన్న 'లాంసి
లాటు' గారినిగూర్చి మేటివృద్ధుండ?
(తనలో) చూడు మేనిప్పుడు సొగసుగా నితని
నేడిపించెద నొక్కనిమిషంబులోన.

(ప్రకాశముగా)
మాటాడుచున్నావె మఱి చిన్న 'లాంసి
లాటు' గారినిగూర్చి మేటివృద్ధుండ?

గాబో—గారు గీరును లేదు; కడుబీదవాని
కూరిమిపుత్రుండు; గొప్పగ నేనె
యది చెప్పుచున్నను నాతనితండ్రి
దైవంబుకృపచేతఁ దగుచందమునను
జీవించుటకుఁ జాలుస్థితిగలవాఁడు.

లాంసి—కానిమ్ము జనకునిగతి యెట్లైన;
పూని యిందు మనమిపుడు చిన్న 'లాంసి
లాటు' గారినిగూర్చి మాటలాడెదము.
గాబో—మేటిమిత్రుండు స్వామికి 'లాంసిలాటు'.
లాంసి—అవు నందుచేతనే, ప్రార్థింతునన్ను,
వివరంబుగా, నోయి వృద్ధుండ! 'లాంసి
లాటు' గారినిగూర్చి మాటాడెదయ్య?
గాబో—మాటాడుదును 'లాంసిలాటు' గుఱించి,
కరుణించి మీర లుత్తర మిత్తురేని.
లాంసి—సరి! 'లాంసిలాటు' గారరయుంగ నతఁడు
మాటాడఁబోకయ్య. మాతండ్రి! 'లాంసి

లాటు' గారినిగూర్చి లౌల్యంబుతోఁప,
ఏల యడిగెదవేని, యెఱిఁగింతువినుము—
బాలుఁడాయన విధి వ్రాఁతలఁబట్టి,
గ్రహచారములఁబట్టి, సహజలాత్రివిధ
బహుచిత్రభాగ్యదేవతలను బట్టి,
జ్యోతిషాద్యధమశాస్త్రంబులఁ బట్టి,
జాతకమునుబట్టి, చచ్చినవాఁడు;
వినుము దాని యర్థంబు విప్పి చెప్పెదను—
చని యాతఁ డదె స్వర్గమున నున్నవాఁడు.

గాబో—హా! దైవము! ముదిమి నాబాలకుండు
నాకగు పెనుప్రాపు; నాయూఁతకోల.
లాంసి—నేను స్తంభమువలె నిట్రాడివలెను
గనఁబడుచున్నాన కనుఁగొన నీకు?
నను నెఱుంగుదువయ్య, నాకన్నతండ్రి!
గాబో—దినమహిమంబు నేమని యందు నకట!
నిను నే నెఱుఁగనయ్య; నిజము, కుమార!
అగుఁగాక రక్షణ మతనియాత్మకునను!
తగ నెఱింగింపుము దయచేసి, వాఁడు
మరణంబు నొందెనో మనియున్నవాఁడో.

లాంసి—అరసి న న్నెఱిఁగితివయ్య, యోతండ్రి!
గాబో—అక్కటా! వినుము నే నరగుడ్డివాఁడ;
నిక్కముగా నయ్య నిన్ను నే నెఱుఁగ.
లాంసి—నీకు నేత్రములున్న, నిజముగా నెఱుఁగ

తనకన్నకొడుకును దాఁ గనుంగొనెదు
జనకుండు ఘనబుద్ధిశాలి గావలయు
ఓ పెద్దవాఁడ! నీకోపిక పెట్టి
నీపుత్రువార్తలు నేను దెల్పెదను.
దీవింపు మోయయ్య! నీవు నన్నిపుడు.
భావింప సత్యంబు బయలను బడును;
తనయునివుట్టుక దాఁగంగ వచ్చు.
మనలోన పరహత్య మఱిదాఁగదెపుడు;
నిలుకడమీఁదను నిజమొందు దెలియు.
(వెనుకతిరిగి మోకరించుచున్నాఁడు.)

గాబో—నిలుమయ్య, వేఁడెదనిన్ను నే నిపుడు ;
వివరమెఱుంగుదు వినునాపుత్రుఁ
డవునట్టి 'లాంసిలాటు'వు గావు.

లాంసి—నిను వేఁడుకొనియెద, మనమింక ముందు
పనికిమాలినపిచ్చిపనులు మతేమి.
యీవిషయంబునఁ గావింపవలదు;
దీవన లీవయ్య తిన్నఁగా నాకు.
ఇప్పుఁడు బూర్వంబు నీకముందుఁ గూడఁ
దప్పకుండఁగ నీదుతనుజుండ నైన
'లాంసిలాటు'ని నమ్మి లక్షింప నేను.
గాబో—హింసపెట్టకు నన్ను; నే నించుకేని
నమ్మఁజాలను నీవు నాపట్టివనుచు.
లాంసి—అమ్మాడిక్కఁ జెప్పఁగ, నందునుగూర్చి
దేమియుహింటుట తెలుఁగను నేను;

నామము 'లాంసిలా'టీమహి నాది;
'యూదుని' భృత్యుండ నౌదునునేను.
నీదుభార్యయగుచు మేదినిలోనం
దనరెడు 'మార్గరీ' యనునామె కేను.
దనయుండనౌదును దథ్యంబుగాను.

గాబో—మహినామెనామంబు 'మార్గరీ, నిజము
అహా! 'లాంసిలాటు' వే యగుదేని నీవు,
నారక్తమును మాంసమౌర నీవగుదు.
సైరింప నాతం డీశ్వరుం గొల్చుంగాత!
ఎంతగడ్డమునీకు నిపుడున్నదౌర !
పంతముగా నాదు పందెపుగుఱ్ఱ
మైన 'డాబిను' తోకయందు నున్నట్టి
దానికంటెను జాల దట్టంబుగాను
గలవు వెండ్రుకలు నీగడ్డంబునందె.

లాంసి—తలంపనట్లగునేని, తప్పకుండంగ
వెనుకవైపునకు 'డాబిను' తోక పెరుంగు
చునున్న నట్లుగంగనుపట్ట వలయు
కడసారి నే దానిం గాంచినయపుడు
పడికిందికిని నాదువదనంబుకంటె
విను దానితోంకకె విస్తారముగను
గనంబడినవి వెండ్రుకలు నిశ్చయముగ.
గాబో—ఓయి ! యెంతగ మఱిపోయినా వీవు !
నీయజమానుండు నీవును నింత
యిష్టంబుగా [illegible]

తుష్టికై యతనికిఁ దొలుత నర్పింపఁ
గను గానుకొక్కటి గొనివచ్చినాఁడ
కనియిప్పు డెట్లొప్పు కొనెదవు నీవు!

లాంసి—సరి! సరి! నేగొల్వుచాలించుకొనుచు
బరుగిడ నిశ్చయపఱుచుకొన్నాఁడఁ
గావున, నొక్కెడ గంతిడుదాఁక
సేవలనను నిల్చి యేనుండఁ జాల
తాను గేవల 'యూదుఁ' డౌను నాస్వామి
వానికా కానుక పట్టుటకూడ!
ఉరితాడు వానికి నొకదాని నిమ్ము
మఱిగియీతని సేవ మలమల మాడి
తిండికిలేకనే నెండుచున్నాఁడ
నిండుగా వ్రేలితో నిమిరి నాప్రక్క
యెముకలనెల్ల నీవెన్నంగవచ్చు
ప్రమదమందితి నీవు వచ్చినందునకు
నీవు తెచ్చినకానుక నీవయ్య నాదు
భావిసత్ప్రభువైన 'బస్సానియోకు
ఆతడు నాకు సత్యాద్భుతమైన
నూతనవస్త్రముల్ నూటాఱులిచ్చు.
ఆతనికొలువు నా కబ్బకయున్న'
నీతటి భగవంతు డిచ్చిననేల
యంతయుఁ బరుగెత్త నాసింతు నేను.
ఎంతనియెంతు నదృష్టంబు నిపుడు,
అరుదెంచుచున్నవాఁ డాయన యిటకు,

అరయుము జనకుండ! యతనికి నమ్ము,
విను మింక ముందు యూదునిగొల్తు నేని,
యనయంబు నే 'యూదుఁడ'నె యౌదుఁగాక!

[లియొనార్డో మొదలయిన సేవకులతో బస్సానియో
ప్రవేశించుచున్నాఁడు.]

బస్సా—ఆవిధంబున నీవు గావింపవచ్చు;
తీవరింపుము వేగ నీవేగి, మిగుల
నాలస్య మయినవో నయిదుగంటలకుఁ
జాల లోపల వంట సంసిద్ధపడఁగ
ఎవరివి వారికి నీలేఖ లంపు;
సవరింప నుడువుల సరగునఁ బనుపు;
నుడువుము 'గ్రేషియానో'తోడ నీవు
వడి నీక్షణము నాదుబసకు రమ్మంచు
(ఒక సేవకుఁడు పోవుచున్నాఁడు)
లాంసి—ఓయి! నాయన! అదె యాయన కయ్య,
గాబో—ఈయెడ నీశ్వరుఁ డిడు మీకుఁ శుభము
బస్సా—నీకు మేలగుఁగాక! నేఁడు నావలనఁ
జేకూరుఁ దగుపని నీకిందుఁ గలదె!
గాబో—బీదవాఁ డో దేవ, వీఁడె నాకొడుకు—
లాంసి—బీదవాఁడనుగాను, వినుడయ్య మిగుల
విత్తాఢ్యుఁ డగు 'యూదు' భృత్యుఁడ నేను
ఇత్తఱి నాతండ్రి యెఱిఁగింపఁ బోవు
ననువున నెంతయు మనములోఁ గోరు—
గాబో—మనసులోఁ బల్కఁ గోరుకొనుచుండుఁ జాల,

ప్రజ లమ్మకొన్నట్లు భక్తితో గొలువ—
లాంసి—నిజ మొక్క మాటలో నే సమస్తంబుఁ
జెప్పెద, 'యూదు'ని సేవకుఁగాఁగ
నిప్పు డేమన్నాఁడ· విచ్ఛింతుఁ జాల
మాతండ్రి యికఁమీఁద మనవి యొనర్ప—

గాబో—అతఁడుఁ బ్రభువును సన్యోన్యమిష్టు
పడకుండ నున్నారు, వలయు మన్నింప—
లాంసి—కడు మాట లేటికి ? నుడివెద నిజము ;
'యూదుండు' పెనుకీడు నొనరించి నన్ను
ఖేదపెట్టుటఁబట్టి కేడించి నేను,
అనుకొందుఁ బెద్దవాఁ డౌడుచే నాదు
జనకుండు మీతోడఁ జక్కఁగాఁ జెప్ప—
గాబో—పావురంబులగంప పనిఁబూని యిదిగో
దేవర వారికై తెచ్చినవాఁడ ;
వినుఁడు నేనొనరించువిజ్ఞాపనంబు—

లాంసి—చనుసిందుఁ దెలుపంగ సంక్షేపముగను;
విన్నవింపగఁ బోవువిజ్ఞాపనంబు
నన్నుఁగూర్చియె యుండి—నయపరుండైన
యీవృద్ధువలన మీరెఱుఁగంగఁగలరు;
నే విన్నవించిన, నిజము నాతండ్రి
నెఱవృద్ధుఁ డయ్యును నిఱుపేదవాఁడు.
బస్సా—మఱి యింక నిద్దఱిమాటలుగా నొకరె
మీ వేఁడికోలును గావించుకొనుఁడు.
నావల్లమీ కేమి కావలె నిపుడు!

లాంసి—కోరెద మీయొద్దఁ గుదురంగఁ గొలువు.
గాబో—సారాంశ మిదిసుండి సర్వంబునకును,
బస్సా—ఏ నిన్నుఁ జక్కఁగా నెఱిఁగియున్నాఁడ;
నే నొప్పుకొన్నాఁడ నీప్రార్థనమును.
ఈయనుగ్రహమును జేయంగ నీకు
నీయజమానుఁడు నేఁడు 'షైలాకు'
చెప్పెను నాతోడ—శ్రీమంతుఁడైన
గొప్ప 'యూదు'ని యొక్క కొలువుజ్జగించి
నడతెంచి నావంటి కడుపేదప్రభువు
కడఁ జేరు టొకయనుగ్రహమయ్యె నేని.

లాంసి—తగుఁ దొంటిసామెత తథ్యంబుగాను
జగతిలో మీకును 'షైలాకు' నకును—
కల దీశ్వరకటాక్షగరిమంబు మీకు;
కలదయ్య యతనికిఁ గాంచనగరిమ.

బస్సా—(లాంసి॥ తో) కడుచక్కఁగాఁ బ్రసంగముచేయుదీవు.
(గాబో॥ తో) నడువుము నీవు నీకొడుకుతోఁ గూడ.
(లాంసి॥ తో) నీతొంటిప్రభువద్ద నీయాజ్ఞఁబొంది
యే తెమ్ము వెనుక మాయింటికినీవు—
(సేవకులతో) వీనికిమీరిందు భృత్యులకిచ్చు
వానిలో మేలంచుబట్టలజతను.
లాంసి—జనకుఁడా! లోనికిఁ జను దెమ్ము నీవు.
పనినిసంపాదింపఁగను లేను నేను!
నా కెందు నోటిలో నాలుక లేదు!
(చేయిచూచుకొనుచు)

నాకరంబునకంటె నాడెమౌ హస్త
మెవ్వనికైన నీ 'యిటలి' లో నున్న,
(నివ్వడిఁ జెడిపోనె యే నిశ్చయముగ);
ఘనభాగ్యశాలిని గాఁ గలవాఁడ
నని పుస్తకము ముట్టుకొని ప్రమాణంబు
నిటఁజేయుగతి నున్న దీహస్తతలము.
అటుచూడు మదె చిన్నయాయుష్యరేఖ,
అదె కొంచెముగ భార్య లందున్నవారు;
పదునేవురిల్లాండ్రు బహ్వల్ప మకట!
వారిలో విధవలు పదునొక్కరున్న
వాఁరు; తొమ్మండ్రును వట్టికన్నియలు;
ఒక్క మనుష్యున కొకయిందఱుంట
యెక్కువైనయదృష్ట మెప్పుడుఁ గాదు.
జలగండములు మూఁడు సరిగానుగలవు;
కలదుప్రాణము పోవుగండము హంస
తూలికాతల్పముతోడ నందొకటి;
క్రాలు నిచ్చటఁ జిఱుగండముల్ మూఁడు.
మహి భాగ్యదేవత మగువయేమైన,
బహుభోగ్యరాలౌను బరఁగనాకిన్ని
ఘనమైనమేళ్ళను గలిగించుకతన.
కనుఱెప్ప వేసెడు కాలఁబులోన
'యూదు' ని కడ కేగి యుత్తరువొంది
సాదరముగ వత్తు; జనకుండ! రమ్ము.

(లాంసిలాంటును, గాబోయును వెళ్ళుచున్నారు)

బస్సా—ఓయి 'లియోనార్డో!' చేయుముదీని.
ఈయెడ వలసినయెల్లవస్తువులఁ
గొనియింట నొప్పగింతను బెట్టి సరిగఁ
జనుదెమ్ము క్రమ్మఱ సరగను నీవు;
ఈరాత్రి విందు చేయింతును నేను
గూరిమి చెలులకు; గొబ్బునఁబొమ్ము.
లియో—ఈవిషయంబున నెల్లయత్నములఁ
గావింతునాశక్తి గలయంతవట్టు.

[గ్రేషియానో ప్రవేశించుచున్నాఁడు]

గ్రేషి—ఎచ్చట నున్నవాఁ డిపుడు నీప్రభువు?
లియో—అచ్చోట దవ్వుల నరుగు చున్నాఁడు.
(లియోనార్డో వెళ్లుచున్నాఁడు)
గ్రేషి—ఓయి 'బస్సానియో' యో చెలికాఁడ!
బస్సా—ఓయి! వచ్చితివయ్య? యో'గ్రేషియానో!'
గ్రేషి—చేయుదు నీకొక్క చిన్న విన్నపము.
బస్సా—చేయ కుండనె దానిఁ జెల్లించినాఁడ.
గ్రేషి—నీవునారాకకు నిజముగా నిప్పు
డావంతయును నడ్డమాడంగవలదు;
నీతోడ 'బెల్మంటు' నేను రావలయు.
బస్సా—నాతోడ రావచ్చు; నాయడ్డు లేదు
కాని, యెప్పుడు మోటుగా నుందు వీవు;
కానిపింతు వడవిమానిసివలెను;
వెనుకముం దరయక వినుమెల్ల యెడల
మనసువచ్చినయట్లు మాటాడె దీవు.

దైవికంబుగనీకుఁ దగియున్నయట్టి
నీవైనగుణములు మావంటివారి
కన్నులకును దప్పఁగాఁ గానఁబడవు;
నిన్నెఱుంగనిపట్ల నిజముగా నవియె
యతి దూష్యములు గాఁగ నగపించుఁజుమ్మి
బతిమాలెదను గష్టపడి యెట్టులైన
నణఁగి యుండని త్వదీయస్వభావంబు
నణఁకువ యను శీతలాంబుబిందువుల
చేత శాంతినిబొందఁ జేయుమునీవు;
ఏతెంచి నాతోడ నిటుసేయకున్న,
నీవెత్తినడతచే నేఁబోవునట్టి
తావుగ నను దప్పఁ దలఁపంగ వచ్చు
దాన నాశాభంగ మై నేను బూను
పూనికంతయుఁజెడి పోవంగవచ్చు.

గ్రేషి—ఓయి 'బస్సానియో' యొక్కటివినుము.
వేయేల! నేను గంభీరంబుగాను
గనువారికిని బైకిఁ గన్పడకున్న,
ఘనగౌరవము తోఁపఁగాఁ బల్కకున్న,
పెక్కుప్రమాణముల్ విడువకయున్న,
చొక్కాయిజేబులో స్తోత్రపుస్తకము
లమరించి శాంతాత్మ నట్లుండకున్న,
తమిమీఱనీశ్వరు ధ్యానించువేళఁ
గనులను టోపితోఁ గప్పి నిట్టూర్పు
లనుబుచ్చి 'ఓం తత్స' తనకుండనున్న,

తనదుము త్తప్వను దనిరుంచుకొ లకుఁ
బనివడి గంభీరభావంబుఁ బూన
నలవడ్డపురుషునివలె, నాగరికతఁ
దెలిపెడియాచారముల నెల్ల నేను
బన్నుగా నుపయోగ పఱుపకయున్న,
న న్నింక నెప్పుడు నమ్మఁబోకయ్య.

బస్సా—కానిమ్ము నీచాలకముఁ జూడఁ గలము.

గ్రేషి—కాని, యీరాత్రి నేఁ గావింపనట్లు;
ఈ రేయి మనచేయు నెద్దానివలన
మీరు నాచేష్టల మెప్పెన్నరాదు

బస్సా—అయ్యయో! యీరాత్రి యటు సేయవలదు
నెయ్యురు పలువుంద్రు నేఁడు వేడుకను
గనుటకై యిచటకుఁ జనుదెంత్రుగాన,
నిను వేఁడుకొనియెద నీయిష్టమైన
యంత యుత్సాహంబు నటఁ దెచ్చుకొనఁగ.
ఎంతయు నీకు మే లెనయునుగాక!
పనియున్న దిప్పుడు చనియెద నేను.

గ్రేషి—మునుమన్న 'లోరెంజొ' మొదలైనవారిఁ
గనుఁగొన నేను నేగంగనువలయు;
చనుదెంతు మేము భోజనవేళ రాత్రి.

(అందఱు వెళ్ళుచున్నారు.)

3, రంగము—విసీసునగరము: షైలాకుగృహములోని గది.

[జెస్సికాయును, లాంసిలాటును ప్రవేశించుచున్నారు]

జెస్సి—విను నాజనకు నీవువిడిచి వెళ్ళుటకు
మనమున సంతాప మొనసెడు నాకు.
మాయిల్లు నరకంబు మహిమీఁద నాకు
నాయింట నవ్వించునట్టిదయ్యంబ
వగుచును నీవుండి యాయాసభరము
నొగిఁ గొంత హరియింపుచుంటివి నీవు.
ఇదిగో నీకొకమాడ యిచ్చెద నేను;
ముద మొదవునుగాక మున్దట నీకు!
ఓనోయి! నీక్రొత్త యజమానునింటఁ
దావల్ల 'లోరెంజో' తగ నేఁటిరాత్రి
భోజనములకును బోవునుగాన
నీజాబుఁ గొనిపోయి యీవు శీఘ్రంబ
యాతనికిని రహస్యంబుగ నిమ్ము;
ఈతీరునను నేను నీతోడ మాట
లాడుట నాతండ్రి చూడంగఁ దగదు;
తోడనె యటుగాన తొలఁగిపొమ్మీవు.

లాంసి—కన్నియరో! మూఁగ గైకొందు నేను.
కన్నీరు నాలుకఁ గదలుపనీదు.
ఓ సుందరీమణి! యోనాతిమిన్న!
మోసంబు నటియించి మును క్రైస్తవుఁడు
నిన్నుఁ గైకొనకున్న, నే వెలియాడు.
నన్నుఁ బంపుము; నాదుకన్నీటివఱద

ముంచె నాఘనధైర్యమును మొదలంట.
మంచిది! సెలవిమ్ము; మఱిపోయివత్తు.
జెస్సి—నీకు మేలగుఁగాక! నీ వేగవచ్చు.

(లాంసి॥ వెళ్ళెను)

(తనలో) నా కెంతపాపంబొ నాతండ్రి కేను
దనయనంచును జెప్పకొన సిగ్గుపడెద.
జననంబుచేత నాతనికూఁతునైన,
గుణములచేతను గూఁతురఁ గాను.
ఘనుఁడ 'లోరెంజొ' వాగ్దానంబు నీవు
చెల్లింతువేని, నాయుల్లముతోడ
నల్లనపోరాట మంతంబుచేసి,
'క్రైస్తవు' రాలనై ఘనమోహాభరము
విస్తరింపఁగ నీదుప్రియభార్య నౌదు.

(నిష్క్రమించెను)

---

౪. రంగము—వినీసునగరము; ఒకవీధి.

[గ్రేషియానో, లోరెంజో, శాలారినో, సోలానియో
ప్రవేశించుచున్నారు]

లోరెం—మేము భోజనవేళ మెల్లఁగా జాఱి
మామందిరంబున మాఱువేషముల
ధరియించి, సర్వంబుఁ దగ గంటలోనఁ
బరిపూర్తి గావించి మరల వచ్చెదము.
గ్రేషి—మనము చేయఁగ లేదు మంచియత్నమును.
శాలా—మనమింతవఱకును మాటాడ లేదు

వచ్చి కాఁగడఁ బట్టువారల నైన.
హెచ్చరికను ముందె యెల్ల కార్యముల
సన్నాహ మొనరించి సలిపినఁదక్క,
తిన్నఁగా నుండదు! మున్నట్టిపనికిఁ
బూనుకొనుటకంటెఁ బోవ కావంగ
మానుటమేలు నామతమునుబట్టి.
నాలుగుగంట లైనది; సిద్ధపడఁగఁ
గార మింకను రెండుగంటలు గలదు.

[ఒకలేఖ చేతఁబట్టుకొని లాంసిలాటు ప్రవేశించు చున్నాఁడు.]

ఉన్నవె శుభవార్తలో 'లాంసిలాట?'
లాంసి—మన్నించి యిది మీరు మఱివిప్పిచూడ,
నెఱుఁగంగఁబడునని యెంచెద నేను.
లోరెం—ఎఱుఁగుదు నీవ్రాఁత యెవరిదో నేను;
సత్యముగా నిది చక్కనివ్రాఁత.
అత్యంతధవళిమ నలరారుఁ జుమ్మ
త్రాణమై నీకాగితంబునకన్న
దీని వ్రాసినవారి దేహంబు కాంతి.
గ్రేషి—వలపుసందేశముల్ వాస్తవంబుగను.
లాంసి—సెలవు నాకును దయచేసెదరయ్యా?
లోరెం—ఎక్కడి కేగెద విప్పుడు నీవు?
లాంసి—నిక్కము నాతొంటి నేత యైనట్టి
'యూదుని' విందున కొప్పించి రాత్రి
యాడట నాక్రొత్తయజమాను నింటి
కిని బిల్చుకొని రాఁగఁ జనుచున్నవాఁడ.

లోరెం—కొనుము దీనిని; బుచ్చుకొమ్మదె. నీవు.

(సొమ్మిచ్చెను.)

తప్పక యామెపై దయతప్పననుచుఁ
జెప్పుము నాప్రియ 'జెస్సికా' తోడ;
అరిగెం జెప్పుము రహస్యంబుగ దీని

(లాంసి॥ వెళ్ళెను.)

పరమాప్తులార! మాపటికి మీరెల్ల
సఖునియింటను నేఁడు జరుగు పండుగకు
ముఖముల ముసుఁగులు పూనివర్తింప,
వలయుప్రయత్నముల్ సలుపుఁడు రయ్య!
కలఁడు నాకొక్కఁడు కాగడవాఁడు.

శాలా—నడతుఁదిన్నఁగను గాగడవానికొఱకె.

సోలా—వడిగ నేనును బోయి వెత్తుదాపనికె.

లోరెం—అరిగిగంటకు 'గ్రేషియానో'ను నన్ను
మరల నీతనియింట మఱిగూడుకొనుఁడు.

శాలా—మంచిది మేమట్లె మరలఁ గూడెదము.

(శాలారినో, సోలానియో వెళ్ళుచున్నారు.)

గ్రేషి—పంచెన యిప్ప డీపత్రికనీకుఁ
బ్రియురాలు 'జెస్సికా' ప్రేమమీఱంగ!

లోరెం—ప్రియుఁడ! నీకంతయు వినిపింపవలయు.
తనతండ్రి మందిరంబుననుండి తన్నుఁ
గొనిపోవ నెట్లుచేకూడునో నాకు,
తనవెంటఁగొని తేరఁ దా నెన్నినగలుఁ
గనకంబు సిద్ధముగా నుంచినదియొ,

తా మాఱువేషంబు ధరియించుకొని యిక
నేమాడ్కిఁ గూర్చెనో భృత్యవస్త్రముల,
నాయుత్తరంబున నన్నియుఁ దెల్పె.
ఆయింతికిని దండ్రి యైన 'యూదుండు'
సుగతినొందఁగ శక్తుఁడగునేని, సాధ్వి
యగుకూఁతుబట్టియే యగునిశ్చయముగ;
పతితుఁడౌ 'యూదు'ని సుత యనునెపము
కతనఁ దక్కఁగ నన్యకారణంబునను,
దురదృష్ట మెప్పుఁడు దొయ్యలి కాలి
సరసకై నఁ దెగించి చనుదేరకుండు.
చనుదెమ్ము నాతోడఁ జనుదెమ్ము; దీని
జనుచుండునప్పుడు చదువుమగాని.
అందకత్తెయయైన యా 'జెస్సికా' యె
ముందు కాగడ నాకు ముదముతోఁ బట్టు.

(అందఱును వెళ్ళిరి.)

---

౫. రంగము—విసీసునగరము; షైలాకుగృహము ముందర.

[షైలాకు, లాంసిలాటు ప్రవేశించుచున్నారు]

షైలా—చాలవృద్ధుండగు 'షైలాకు' నకును
బాలుఁడై యున్నట్టి 'బస్సానియోకుఁ'
గలభేదమంతయుఁ గన్నులనిండఁ
దిలకింపఁగల వీవె తెల్లంబుగాను—
ఏమె రమో 'జెస్సికా'! ఏమె యమ్మాయి!
నామందిరంబున నము లెదునట్లు

గా మితితప్పి యాకడఁద్రిమ్మంగఁదగదు—
ఏమెరో 'జెస్సికా'! ఏమి అమ్మాయి!—
కూరికి గుబువెట్టి గుడ్డలవెల్ల
నూరకయుటఁ జింపుకోరాదు నీవు—
ఏమి 'జెస్సిక'! పల్కవెంతపిల్చినను!

లాంసి—ఏమమ్మ 'జెస్సికా'! ఇటకురావమ్మ.

షైలా—నినుఁబిల్వుమని యేరునియమించినారు?
నినుఁ బిల్వుమంచును నేఁ జెప్పలేదు.

లాంసి—ఎప్పుడునా చేత నేపనిగాని
చెప్పించుకోనిది చేయకీవంచు
మీ రనుచుండెడివారు కాఁబట్టి
యీరీతిఁ బిలిచితి నిప్పుడు నేను.

[జెస్సికా ప్రవేశించుచున్నది]

జెస్సి—పిలిచినారేనన్ను? సెలవేమియిపుడు?

షైలా—పిలువంగబడితిని విందునకేను.
అవె నాదుతాళముచెవులు జాగ్రత్త—
(తనలో) అవు నేల యచటికే నరుగంగవలయు?
ప్రేమంబుచే నన్నుఁ బిల్వఁగా లేదు;
నామోమునుముందఱ నన్నుస్తుతింత్రు;
అయినను బగచేత నరిగెద నేను
వ్యయమత్యధికముగా నటుచేయునట్టి
వెడఁగు 'క్రైస్తవు' సొమ్ము వెచ్చ పెట్టంగ
(ప్రకాశముగ)
పడఁతుకరో! యిల్లుభద్రముసుమ్మి—

(తనలో) ఏగ నాకింతయు నిష్టంబులేదు;
జోగుచు సొమ్ముసంచులఁ జూచినట్లు
చనినరే యేను దుస్స్వప్నంబుఁ గంటిఁ
గనుక, నామది కేమొకలఁత రాఁగలదు.

లాంసి—తగదిట్టు; ప్రార్థింతుఁ దరలుము వేగ;
మిగుల నెదురుచూచు మీరాక కోరి
యిగ బాలుఁడైననా యేలిక యిపుడు.

షైలా—తగదిట్టు; నాకు నవగతంబె సుమ్ము.
లాంసి—వారంత యొకటిగాఁ జేరియున్నారు;
బూరటిల్లెదు దొంగముఖములవారి
నీవు చూచెదవంచు నేఁ జెప్పఁజోను.
నీవు చూచెదవేని; నిజముగా నల్ల
సోమవారమునాఁడు సూర్యోదయమున
నాముక్కు బెదరుట నమ్ము మూరకయె
పోలేదు; బూడిద బుధవాసరమున
నాలు గేఁడులక్రింద నావత్సరంబు
వెలయఁగా మధ్యాహ్న వేళను వచ్చె.
షైలా—కలదుగా మాఱుమోముల వేడ్క నేఁడు!—
వినుమోసి 'జెస్సికా'! బీగము వ్రేసి
మనతల్పు లెల్లను మఱిమూసియుంచు;
తుడుములరొదలును, మెడ మేలిదిప్పి
చెడుగఁబిల్లనగ్రోవి వడినూఁదువారి
వెడకేఁచురొదలును, విన్నప్పు డీవు
వడి గవాక్షములెక్క వలవదుసుమ్ము;

పలురంగులానసంబుల నిండఁ దాల్చు
తెలివిమాలిన 'క్రైస్తవులఁ' జూచుకొఱకు
వెలఁదుకరో! రాజవీథులయందుఁ
దలఁజూపఁబోకుమీ తలుపులు తెఱచి
మనయింటికర్ణంబులను మూసిపెట్టు,
మనగవాక్షము లంచు మద్భావమమ్మ.
పనికిమాలినపిచ్చి పనులశబ్దంబు
మనసాధుమందిరంబునం జొరనీకు;—
(తనలో) 'జ్యాకబు' చేకట్టు సాక్షిగా రాత్రి
నాకుఁ గోరిక విందునకు నేగ లేదు;
ఏరీతి నున్న, నే నేగెద నేఁడు—

(లాంసి॥తో)

ఓరోరి! ముందుగా నొక్కెట నడచి
యురు వెంతు నే నిప్పు డని చెప్పు మీవు.
లాంసి—అరిగెద ముందుగా నిచటికి నేను
(జెస్సికాతో)
ఇప్పుడు నీతండ్రి యెంత చెప్పినను,
దప్పకుండ గవాక్షతటినుండి చూడు—
(హాయగతి రగడ)
ఒసరఁ దన్ను 'యూదురాలు'
కనిన మెప్పు గనఁగఁ జాలు
ఘనుఁడు మేటి 'క్రైస్తవుండు'
వనిత! యందు వచ్చియుండు. (లాంసి॥ వెళ్ళెను)
షైలా—పనికిమాలిన యుల బానిసకొడుకు

నిన్నుఁజూచి యిప్పు డేమనుచున్నవాఁడు !

జెస్సి—మఱి యేమియును లేదు; "మంచిదేఁ జనుదు;
మఱవకుమీ నన్ను మాయమ్మ !" యనియె.

షైలా—చాన ! యీజడుఁడు విశ్వాసియే యౌను ;
కాని యారసిచూడఁ గడుతిండిపోతు ;
స్వామికి లాభంబు వచ్చెడుపనుల
సోమరియై నత్తచొప్పునఁ బ్రాఁకు ;
అడవిపిల్లిని మించి యధికంబుగాను
పడి నిద్రపోవును బగలునుగూడ.
సోమరిపోతులు చూడ నాయొద్ద
నేమాత్రమును నదుక రెప్పుడన్నాట,
నే వెడఁబాసెద వీని నియ్యెడను ;
వేనిఋణము గొన్నవిత్తము న్వేగ
పెచ్చు పెట్టుటకును వీఁడు తోడ్పడఁగ
నిచ్చ వాంఛింతునో యేనిప్పు డట్టి
వానివద్దకు వీనిఁ బంచుచున్నాఁడ.
ఔను యో 'జెస్సికా' ! లోనికిఁబొమ్ము ;
నేను గ్రమ్మఱ వత్తు నిమిషంబులోన ;
నేను జెప్పినయట్లు నీ వొనరింపు ;
తలుపులు నీవు లోపల వేసికొమ్ము ;
'బలముగా నెయ్యది బంధింపఁబడునో
చక్కఁగా నయ్యది సాధింపఁబడుచు.'
పొదుపుగా వాడెడు సదమలమతుల
వదల కీసామెత మదిఁబాయకుండు. (వెళ్లెను.)

జెస్సి—నాయాస వదలుము నా తండ్రి నీవు.
నాయదృష్టమునకు నలంత రాకున్నఁ,
గోలుపోవుదు జనకుని నింక నేను ;
గోలుపోవుదు వీవు కూఁతుని నింక.

(నిష్క్రమించెను.)

---

౬. రంగము—వినీసునగరము ; షైలాకుగృహము ముందట.

[కృతిమముఖులుల ధరించుకొని గ్రేషియానో, శాలారియో ప్రవేశించు చున్నారు.]

గ్రేషి—మనల నిక్కడ నిల్వఁ డనుచు 'లోరెంజో'
పనిచిన దీమంచిపంచనే సుమ్మి.

శాలా—అతఁడు వచ్చెదు వేళ యది మించిపోయె.

గ్రేషి—అతఁడు కాలము తప్పు టత్యద్భుతంబు ;
గడియారమునకంటెఁ గడు ముందుగానె
వడినెందుఁ గాముకుల్ పరుగువారెదరు.

శాలా—కాముకు లిలఁ దాము కామించువారి
ప్రేమను బడయంగ వీను మొట్టమొదటఁ
బదిరెట్లు త్వరతోడఁ బరువెత్తివత్తు
రది లభించినపిదపను దానిఁ
జెడఁగొట్టుకొనకుండఁ జేరి కాపాడ
నడుగు లెన్నుచు నేగు నప్పటికంటె.

గ్రేషి—నీవు చెప్పినదెల్ల నిక్కమ్మె సుమ్మి.
ఏనాఁడు విందున కేగి యచ్చోట
నాదిని గూర్చున్నయంత యాఁకటనె

మేదినిలో లేచు మెక్కిన వెనుక!
హయరత్న మే యది యభినవంబుగను
బయలు దేతినపుడు పరుగెత్తునంత
జవసత్వములతోడఁ జనుదెంచు మరల
మిపులఁ బరిశ్రాంతి మించినయపుడు!
వసుధలో వస్తుసంపాదనమునకు
నొసఁగెడుశ్రద్ధలో నొకయింతయైన
మనుజులు పడసిన వెనుకను వాని
ననుభవించుటకియ్య రదియేమొ కాని.
తరుణవయస్కుచందంబున నొండెఁ
బొరిదుర్వ్యయము చేయుపురుషున ట్లొండె
ధ్వజపటంబులు దాల్చి స్వసముద్రసీమ
నిజముగాఁ బెనునౌక నెవ్వడి వెడలి
వగలజారిణిఁబోలు వాయువుచేతఁ
దగనెట్లు లాలింగితము చేయఁబడును!
కడకు సర్వంబును గణికను బోలు
చెడుగాలిచేతన చెడఁగొట్టుకొనుచుఁ
జెల్లి కాలము కడు శిథిలంబులైన
తొల్లిఁటి యువయువస్త్రంబుతోడఁ
జినిఁగిపోయినచాపచేలలతోడఁ
బెనుపటి విచ్ఛిన్నతను జాలఁబొంది
ధరదుర్వ్యయ మొనర్చునరుఁబోలి యోడ
మరల నెట్టులువచ్చి మనికిఁజేరెడును!
శాలా—వెనుక నీకథ చాలవివిపింపవచ్చు

చనుదెంచుచున్నాఁడు, సఖుఁడ! 'లోరెంజో'

[లోరెంజో ప్రవేశించుచున్నాఁడు]

లోరెం—ఏగి, నచ్చెలులార! యేనింత సేపు
జా గొనర్చుటకును క్షమియింపవలయు.
కనిపెట్టుకొనియుండఁగను మిమ్ము నాదు
పనియె చేసెనుగాని వినుఁ డేను గాదు.
మీరు భార్యలకయి మిగుల వేడుకను
జోర వేషములకుఁ జొచ్చినయపుడు
మీనిమిత్తముగూడ నే నింతతడవు
మావక కనిపెట్టి మఱి యుండువాఁడ.
ఈదారిఁ జనుదెండి; యిదిగొ నామామ
'యూదుండు' వసియించి యున్నమందిరము.—
ఎవఁడున్నవా రహో! యింటిలోపలను?

[బాలుని వేషముతో జెస్సికా మేడమీఁద
ప్రవేశించుచున్నది]

జెస్సి—ఎవరయ్యమీరు? మీయెలుఁగును నేను
గుఱుతుపట్టితిఁగాని, మఱియింతసరిగ
నెఱుఁగుటకై మీపేరు తెలియఁగింపుఁడయ్య.
లోరెం—నీకూర్మి 'లోరెంజో'; నీమనోహరుఁడు.
జెస్సి—నాకూర్మి 'లోరెంజో' నామనోహరుఁడె
ఎవ్వఁడిమీఁద నాకింతకంటె
నివ్వటిలునుగూర్మి నిశ్చయంబుగను?
నీదాన నివుడు నే నౌదునో కానో
యే దేవుఁ డెఱుఁదును నీవుదక్కంగ?

లోరెం—వినునీవు నాదాన వనుటకునీదు
మనసును దేవుఁడు తెలుసాక్షులిపుడు

జెస్సి—ఇదె పట్టుకొనుఁడయ్య యీపెట్టెమీరు;
ఇదియిచ్చు బ్రతిఫల మీపడ్డశ్రమకు
మీరు నన్నీక్షింపలేరు కాఁబట్టి
యేరాత్రి యాటకు నెలమిచెందెదను
ఏమందునియ్యెడ నెంతయు సిగ్గు
సామాను వేషంబునకు నాకె పొడము
కామంబు గ్రుడ్డిది; కామాంధు లెందుఁ
దా మెఱుంగఁగలేరు తమదోషములను
వా రెఱుంగఁగఁజాలువా రౌదు రేని,
యీరీతిబాలు నాకారంబుదాల్చు
నన్నుఁజూచి మాదుఁడై నను లజ్జపడుదు.

లోరెం—వనితరో! దిగిరమ్ము; వచ్చి కాగడను
బట్టువాఁడవుగఁ గావలయును నాకు.

జెస్సి—పట్టంగవలయుఁగా వచ్చి కాగడను
నాసిగ్గు వెల్లడి చేసికొనంగ!
నాసిగ్గె కాగడ నాసింపకుండ
వెల్లడియగుఁజుమీ యెల్లవారలకు
పెల్లుగఁ గాగడ వేసెడువాని
పనివెల్తు రొసఁగుట, గనుకఁ జీకటిని
గవరాక డాగంగఁ జనెదు నే నిల!

లోరెం—డాగి యున్నావు చూడఁగ, సుందరాంగి!
బాగుగా నందమౌ బాలవేషమున

రారమ్మి వేవేగ; రాత్రియుఁ గూడ
జారుచున్నది సన్నసన్నగ నిపుడు;
ఘనులు 'బస్సానియో' గమనోత్సవమునఁ
గనిపెట్టియుందురు మననిమిత్తంబు.

జెస్సి—తలుపు లెల్లను వేసి ధన మింతగొనుచుఁ
గలిసికొందును దిన్నగావచ్చి మిమ్ముఁ.

గ్రేషి—నాదు శాటికతోడు! నళిసాక్షితోఁచు
'యూదుని' గాఁగాక యోగ్యజాతిదిగ.
లోరెం—ఈమెను మనసారఁ బ్రేమింపనేని
నే మతిహీనుఁడ నిజముగా నౌదు
తలఁచిచూడంగ నీతన్వంగి నాకుఁ
దెలిసినంతవఱకు ధీమంతురాలు;
రూపసంపన్న నాచూపునఁ జూడ;
కాపురంబు సుగుణగణములకెల్ల
కనుక నామదిలోనఁ గలకాల మీమె
కనఁబడవలయును ఘనబుద్ధిమతిగ
వరరూపవతిగాఁగ బహుగుణాఢ్యగను.

[క్రిందనుండి జెస్సి కాప్రవేశించుచున్నది.]

(జెస్సితో) అరుదెంచితివె నీవు! హా స్త్రీంద్రయాన!
(మిత్రులతో) చనుదెందుపోదము సఖులార! మనము;
మనరాక నెదఁగోరి మాఱువేషములు
వేసినమిత్రులు వేచియుందురు.
(జెస్సికా, లోరెంజో, శాలారినో వెళ్ళుచున్నారు)

[ఆంటోనియో ప్రవేశించుచున్నాఁడు.]

ఆంటో—అసన్నముగ నెవ్వ రందున్నవారు !

గ్రేషి—ఓయి 'యాంటోనియో' ! ఓయి నీవయ్య !

ఆంటో—ఓయి ! ఛీ ! ఛీ ! పొమ్ము. నేఁటిరివ్వేళ
ఎక్కడనున్నారు తక్కినవారు !
ఒక్కటఁ దొమ్మిదిహోర లిప్డయ్యె ;
నీకయి సఖులెల్ల నిలిచియున్నారు ;
ఈకొన్నయుత్సవ మీరాత్రి లేదు ;
అనుకూలగతివాయు వడరెడుఁగానఁ
జను నోడనెక్కి 'బస్సానియో' యిపుడె.
అరసి నిన్గొనిరాఁగ నచ్చటచ్చటకు
నిరువదిమందిని నేఁ బంపినాఁడ.

గ్రేషి—అందున కెంతయు హర్ష మొందెదను ;
పొందుగాఁ బడవెక్కి పోయి యీరాత్రి
వెడలిపోవుటకంటె వేఱుగా నాకుఁ
బడయంగ దగినట్టిపండుగ లేదు.

(అందఱు నిష్క్రమించిరి.)

2 రంగము—బెల్మాఁటు గ్రామము ; పోర్షియాగృహములోనిగది.

[వాద్యములు మ్రోయఁగా, పోర్షియయును, మొరాకో రాజపుత్రుడును
తమపరివారముతోఁ బ్రవేశించు చున్నారు.]

పోర్షి—చని, కాండ పటమును జరపిపెట్టియులఁ
గనఁబఱుపుము నీవు ఘనున కీవారకు,

(మొరా॥ తో)

చని కోరుకొనుఁడయ్య చక్కఁగా జూచి
మనసువచ్చినదాని మనుజేంద్రపుత్త్ర !

మొరా — మిసిమిబంగారుపెట్టె మించుచు మొదటఁ
బసమీఱు నీక్రిందివాక్యంబుతోడ —
"నను గోరుకొనువాఁడు నరులు పెక్కండ్రు
మనసులోపలఁ గోరుకొనుదానిఁ బడయు"
ఇరుల రెండవదైన యీ వెండిపెట్టె
తవిలి యీక్రింద వాగ్దానంబు సలుపు —
"నను గోరుకొనువాఁడు నరులలోపలను
తనయర్హతకు నేది తగు దాని బడయు."
మోటుసీసపుఁబెట్టె మునుతనయంత
మోటుహెచ్చరికతో మూఁడవదొప్పు.
"ననుగోరుకొనువాఁ తనకున్న దెల్లఁ
దనది కాననుకొని తగనియ్యవలయు."
ఇందులో నేనట్టు లెఱుఁగుదు మంచి
మందసంబున కోరుకొందునో లేదో !

పోర్షి — క్ష్మానాథపుత్త్ర ! నాచక్కనిపటము
వానిలోపల నొక్కదానిలో నుండు ;
దానినే యిపుడీవు తగఁ గోరదేని,
నేను బటముతోడ నీదాన నగుదు.

మొరా — భగవానుఁ డెవఁడైన బాగుగా నాకుఁ
దగినయాలోచన దయచేయుఁగాత!

కడనుండి మొదటికిఁ గ్రమముగాఁ బ్రాఁత
లాడఁటఁ బరికింతు నన్నియు మరల.
ఏదిసీసపుఁబెట్టె యేమిచెప్పెదను!
"ననుగోరుకొనువాఁడు తనకున్న దెల్లఁ
దనది కాదనుకొని తగ నియ్యవలయు."
దేనికై సర్వంబుఁ దెగువ నీవలయు!
హీననాగమునకా యియ్యంగవలయు!
బెదరించుచున్న దీపెట్టియ మిగుల
వదలిసర్వంబును వదినిచ్చువారు
తగినలాభముఁ బొంద నగునన్న యాశ
దగిలిచేయుచునుంద్రు దామట్టిపనిని.
అరుగదు చిలుములోహంబుమీఁదికిని
బరఁగ బంగారంబువంటిమానసము,
కాన, సీసముకొఱకే నాఁడు నేను
దేనిని నియ్యంగఁ దెగియుంపకుందు
పదిలమౌ తనస్వచ్ఛవర్ణంబుతోడ
నిది వెండిపెట్టియ యేమిచెప్పెడును!
'ననుకోరుకొనువాఁడు నరులలోపలను
దనయర్హతకు నేది తగు దానిఁబడయు.'
తనయర్హతకుఁదగుదానినా పడయు!
మనస! విచారింపుమా క్షణమాగి
పక్షపాతము లేక పాత్రత యెంత
దక్షతఁ గలదో యాధరణిపై నిటు;
నిర్దైనయున్నకాసె చూతు నిన్ను,

# వినీసు వర్తక చరిత్రము

యాదెంతకైనను నర్హాంబ వీవు.
ఆ యెంతకైనను నర్హాంబ వనుట
యాయింతివఱకును వ్యాపింప దేమి.
అయిన నేనర్హఁగ నౌదునా యనుచు
భయపడుటెల్ల నాపయి లేనిపోని
పెనుకొలంతను దెచ్చి పెట్టుకొంటగును.
తనర నాకెయ్యది తగు, దానినెఱద!
నిస్సంశయముగ నానీరజాననయె
తెన్నఁగాఁ దగియుండు లీలమై నాకు
వరకులీనతచేత భాగ్యంబుచేత
సరససద్గుణరూపసంపదచేత
పెద్దలశిక్షను బెఱుఁగుటచేత
తద్దయుఁ దగుదు నాతరుణికి నేను.
అన్నిటికంటె ముఖ్యంబుగ నామె
కెన్నంగఁ దగియుండు నేను ప్రేమమున.
ఇచ్చటనే యాగి యీపెట్టెఁ గోర
కిచ్చటికిని నేల యిఁక నేగవలెను!
అయిన నింకొకసారి యానువర్ణంబు
పయినిచెక్కినవ్రాఁత పరికింత మిపుడు
"ననుగోరుకొనువాఁడు నరులుపెక్కండ్రు
మనసులోపలఁ గోరుకొనుదానిఁ బడయు,"
నరులుపల్వురుగోరునదియె యీయింతి;
అరయ నీమెను లోకమంతయుఁ గోరు.
మనుజావతారంబు గనినయీదివ్య

వనితదేహమను దేవళము సేవింపఁ
గాముకజనులు నల్గడలయుందుండి
భూమిపై వత్తురు పూర్ణాశతోడ
అలరారు 'హార్కానియా' దేశమందు
వెలయువిశాలంపు విజనభూములను
'యువన' దేశపు దుర్గమారణ్యములును
యువతిఁ జూచెడువేడ్క నూరకవచ్చు
రాజకుమారులరాకనుబట్టి
రాజమార్గము లయ్యె రమణీయముగను
తనశిరస్సు మహోన్నతంబుగ నెత్తి
ఘనగర్వమునను స్వర్గముఖంబునందు
నుమ్మివైచెడునట్టు లూర్మికాళీక
రమ్ములు లేవఁ బరఁగుసముద్రుండు
నితరదేశీయుల కేతెంచుటకును
బ్రతిబంధకముగాక పనచెడి యుండె;
కావున జలధిని గాలువవలెనె
లావణ్యరాశి యీలలన దర్శింప
నవలీల దాఁటి వారరుదెంతు రిటకు
ఇవె పెట్టియలుమూడు నిందులోఁగలదు
దేనిలోనో యీమె దివ్యపటంబు.
పూను నే సీసంబు పూర్ణేందుముఖి!
అపచారమగు హీనమౌయట్టితలఁపు
నిపుడించుకేనియు నెడఁదలంచినను;
నల్లనైనసమాధిరాఁ జను దీవ

వెల్లడిగా నీమెప్రేతవస్త్రంబు
నైనను బెట్టుట యతిలాఘవంబు
ఈ నాతి పుటమిడ్డ హేమంబుకంటెఁ
బదిరెట్లు వెల డిందుపడు వెండిలోనఁ
బొదుగంగఁబడియుండఁ బోలునం చెంతు.
అట్లు తలంచుట హా! పాపమగును!
ఇట్టియమూల్య మైనట్టిరత్నంబు
హేమంబుకంటెను హీనమౌదాన
భూమిపై నెప్పుడుఁ బొదుగంగఁ బడదు.
తిలకింపు 'నింగ్లాండు' దేశంబునందుఁ
గల దొక్క దేవతాకన్యరూపంబు
బంగారునాణెంబుపయిఁ జెక్కఁబడును
బంగారు వెలుపటఁ బడియుండినదియును
కాని, యీ దేవతాకన్య యిచ్చోటఁ
దానున్నది హేమతల్పంబులోన—
ఇమ్ము బీగమ్ము నేనిదె కోరుకొందు,
నెమ్మూడ్కి ఫలము నా కెసఁగినఁగాని.

పోర్షియ—అదిగో రాజకుమార! యదె పుచ్చుకొమ్ము
పదిలముగా నాదుపట మందులోనఁ
గనఁబడ్డ, నీదానఁ గాఁగల నేను.

(అతఁడు బంగారుపెట్టె తాళము తీయుచున్నాడు)

మొరా—ననుఁ జెఱచితివో! హా! నాదు దైవంబ!
ఏల లభించిన దిక్కడ నాకు!
భీమమృత్యువుయొక్క పీనుఁగు దొరకె.

కట్టుగా వ్రాసిన కాగిత మొకటి
చుట్టియున్నది దీనిశూన్య నేత్రమున,
అదివుచ్చుకొని విచ్చి యందేమిగలదో
చదివెద నంతయు సరిగాను నేను.

(ఇట్లు చదువుచున్నాఁడు)

(తేటగీతములు)

"మహిని మెఱసెడిదెల్ల హేమంబుగాదు;
పలుమఱును జెప్ప నిదివిన్నవాఁడవౌదు;
పలువురమ్మిరి తమదుజీవములు నాదు
మీఁదిరూపంబుఁ గనుటకే మిథ్యగాదు.
వృత్తడిసమాధులను లోనఁ బురుగులుండు;
ఎంతధైర్యవంతుడవో యంతనిండు
బుద్ధిమంతుఁడ వయినను; బుడమి మెండు
కాయపాటవమును నీవు గలిగియుండు
చందమునను యాలోచన చాల నుండు
వాఁడవయినను, నీకిట్టిబదు లొకండు
వ్రాయఁబడి యెంతమాత్రంబు రాకయుండు;
పోయెమీకృషి; యిఁకనాజ్ఞ పుచ్చుకొండు."
పోయె నిశ్చయముగఁ; బూనికయెల్ల
నాయది విఫలమై నడచె నియ్యెడను
చిన్నమ్మవారు తా సెలవు గైకొనఁగ,
వెన్నడి నన్నుఁ జేరెఁ బెద్దమ్మవారు—
సెలవిమ్ము రమో పోర్ష్యా! చిరముగా నిలిచి
సెలవుఁ గైకొన మదిచెదరి యున్నాఁడ.

ఇల యత్నవైఫల్య మొనయువారెల్ల
సెలవు నీరీతినే చేకొందు రెపుడు.

[వాద్యములు మ్రోయుఁగా పరివారముతో వెళ్ళుచున్నాఁడు]

పోర్షి—(తనలో) చక్కఁగావడలె నీ జనవల్లభుండు;
తక్కిన యితనిచందమువార లెల్ల
నీరీతినే వరియింతురు గాత!
(సేవకునితో) ఓరి! నీవా తెర నాగివేసిరమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---

౮. రంగము—వెనీసుపురము; ఒక వీధి.

[శాలారినో, సోలానియో ప్రవేశించుచున్నారు]

శాలా—'బస్సానియో' యోడపయి నెక్కిపోవ
నిస్సంశయంబుగ నేఁ జూచినాఁడ;
ప్రీతిమై 'గ్రేషియానో' తానుగూడ
నాతనితోడనె యరిగినవాఁడు.
వార లెక్కినయోడపయిని 'లోరెంజో'
యే రూఢిగా నిప్పు డెఱుఁగుదు లేఁడు.

సోలా—చెడుగు 'యూదుఁడు' రాజుఁ జేరంగఁబోయి
పాడిపాడియేడ్పులఁ బురికొల్పుకతన;
నౌకయందు 'బస్సానియో' యోడ వెదక
వెడలె వానినిగూడ వెంబడిఁగొనుచు.

శాలా—ఆలస్యముగ వార లరిగిరిగానఁ
జాలదూరము పోయె సాగి యావోడ.
కాని, విచారించి క్ష్మానాథుఁ డచటఁ

డానల్ల 'లోరెంజో' తనమోహనాంగి
యగు 'జెస్సికా' తోడ నరిగె వేఱొక్క
తగునోడలోనని దతుల నెఱిఁగె;
అదియునుగాక వారాయోడలోన
సదుపాయముగను 'బస్సానియో' తోడ
లేరు చూచితినంచు లిఖితరూపమునఁ
జేరి, 'యాంటోనియో' చెప్పె రాజునకు.

షైలా——పఱచుచు వీధులఁబడి కుక్కకరణి
నఱచెడి 'యూదుని' యఱపులవంటి
వివిధంబులైనవి వింతయైనవియు
నవకరంబైన వవ్యక్తమైనవియుఁ
బెడబొబ్బ లెంచును వినియుండ లేదు
పుడమిపై నింతకుమునువు నేనెపుడు
"హాసుత! హాసొమ్ము! హానాకుమారి!
ఓసి! క్రైస్తవు' తోడ నొకటఁబోయితివె!
నాదు 'క్రైస్తవ' కాంచనంబ! ధనంబ!
ఏదిన్యాయంబు! మఱేది దండనము!
మాడలు! కూఁతురు! మఱిముద్రసంచి
మాడలసంచులు మంచివి రెండు!
చక్కనైనవరాలసంచు లారెండు
నక్కట కూఁతుచే హరియింపఁబడియె;
నగలును మేలిరత్నంబులు రెండు!
జగజంపువెలహెచ్చు రాతిరత్నముల
హరియించె నారెంటి హానాతనూజ;

సరిసరి! న్యాయంబు! సతి వెతకుండు;
మానికంబులు నాదు మాడలన్నియును
దానియొద్దనె యుండు. తథ్య" మంచఱచు.

శాలా—"వానిరత్నంబులు! వానికొమార్తె
వాని మాడ" లటంచు వడి 'వినీసు' నను
గలబాలురంతయుఁ గడునెగతాళి
సలుపుచు వెంబడిఁ జనుచున్నవారు.

సోలా—తనగడుపునుగూర్చి తగుశ్రద్ధవుచ్చు
కొనియె 'మాంటోనియో' గ్రమ్మఱవలయు;
అటు సేయకుండిన నాతనిపయి నె
య్యెటులైనఁ బడుజుమ్మి యీసొమ్ముకూడ.

శాలా—కడుచక్కఁగా జ్ఞాపకంబు చేసితివి;
వడి నిన్న నొక 'ఫ్రెంచి' వానితో నేను
జేరి ప్రసంగంబు చేయుచునుంటి;
కూరిమినతఁడు వాకుచ్చె నాతోడ
నెడఁబాపి 'ఫ్రాన్సు' ను 'నింగ్లాండు' తోడ
నడుమనున్న యిఱుకు కడలిలోపలను
మన దేశనౌకయొ మంచివస్తువులఁ
గొనివచ్చినది యొండు గ్రుంగెనటంచు.
అతఁ డది చెప్పుచున్నపుడు నామదికి
సతత 'మాంటోనియో' స్మరణకు రాఁగ
ఘనుఁ డాతనిది యది కాకుండుఁ గాక
యనుచు నీశ్వరు లోనధ్యానించినాఁడ.

జెప్పుటయే చాల శ్రేయస్కరంబు !
అయినను జెప్పక మాకస్మికముగ
భయదమనోవ్యథపా లగుఁగాన.

శాం.—కరుణాళుఁ డాతనికంటె నొండొకఁడు
ధరణిపై జననమొందంగను బోఁడు ;
అతఁడు 'బస్సానియో' నంపినయట్టి
వితమేను దటినుండి వీక్షించినాఁడ.
'చని సత్వరంబుగఁ జనుదెంతు మరల'
ననుచు 'బస్సానియో' యన్నప్పు డతఁడు,
"ఆరీతిఁ ద్వరపడి యరుదేరవలదు ;
అర్థయు నాకొఱ కచట నీవనిని
జెడఁగొట్టుకొనకు కొంచియమైన నీవు;
కడముట్టఁ గార్యసంఘటన మాఁదాఁక
నిలువుమీ తటి వేచి నిశ్చలమతిని.
చెలికాఁడ ! వినుమేను జెడుగు 'యూదు' నకు
వ్రాసి యిచ్చినయట్టి పత్రంబుమాట
కాసంతయును మోహకలితమైయుండు
నీమానసంబున వెలుఁగొన నీకు ;
నీమది నలకొల్పు నిత్యమోదమును.
అచ్చుటఁ గడు నీకు నర్హమానట్టి
మచ్చిక ఘటియించు మార్గంబులందు
వరియించుపనియందుఁ ద్వాన్మానసంబు
చరియింపఁ జేయుము సతతంబునచట"
అనుచుఁ బ్రత్యుత్తరం బతిదయ నిచ్చె.





దనది కాదనుకొని తగ నియ్యవలయు."
నీనిమిత్తము దేని నే నీకముంచు
కాన రావలె నీవు కరమింపుగాను.
ఏమని చెప్పనో హేమపేటికయు
దీమసంబున నన్నుఁ దిలకింపనిమ్ము.
"నను గోరుకొనువాఁడు నరులు పెక్కండ్రు
మనసులోపలఁ గోరుకొనుదానిఁ బడయు"
పెక్కండ్రు మది నేది కోరుచుండుదురు ?
'పెక్కండ్రు', నాఁగను వెడఁగునేత్రంబు
కనఁబఱచెడుదానికంటె మఱేమి
కనుఁగొనశక్తులు గాకుండ నుండి
వెలిమెఱుంగునకును వెస మోసపోవు
తెలివిమాలినపామరులమూఁక యేమొ ;
వారలదృష్టి లోపలికిని జొరక,
ఘోరకష్టంబులు గూరెడిచోట
బట్టబైటను వెలుపలిగోడమీఁద
నెట్టనఁ దనగూడు నిర్మించునట్టి
గిజిగానిఁ బోలును గేవల మెవ్వఁడు.
ప్రజలు పెక్కండ్రురు వాంఛించు దాని
నే నెన్నఁడును గోర నిశ్చయంబుగను
ఏను సామాన్యుల నెల్లరఁ గలిసి
యామూర్ఖజనులతో నత్యంత మేను
భూమిపై సమతను బొంద నెప్పుడును.
[illegible]యూహా లన్నియు నేటికి నాహా !

నీయొద్దకును నిదె నేను వచ్చెదను ;
ఓ వెండిపెట్టె ! యింకొకసారి చెప్పు
నీ వేమి ధరియించినావో నీపయిని.
"నను గోరుకొనువాఁడు నరులలోపలను
దనయర్హతకు నేది తగు దానిఁ బడయు"
పలుకుచున్నది యిది బాగుగాఁగూడ.
ఇల దనకర్హత యేమియు లేక
దైవంబు నొక్కటఁ దగ మోసపుచ్చి
యేవాఁడు భాగ్యంబు నెనయ యత్నించు!
తనయోగ్యతను మించుఘనతను బూని
యొనర నేఁడుఁ దెగింపకుండునుగాత !
ఉన్నతపదవులు నుద్యోగములును
జెన్నగు బిరుదులుఁ జెడుమార్గమునను
బడయకుండిన నెంత బాగుగా నుండు !
కడుగొప్పతనమును గాంచెడువాఁడు
తనపాత్రతనుబట్టి దానిని దాను
గనుచునుండిన నెంత ఘనముగా నుండు !
అప్పగిదిన లోకమం దుండు నేని,
యిప్పుడు టోపీల నెందఱు తీసి
ప్రబలులకడ నిల్వఁబడి యుండువారె
ప్రబలులై టోపీలు బలిమిఁగూర్చుంద్రు !
యజమానులయి యుండువా రెందఱిపుడు
భజియింపుచుంద్రు సేవకులౌచుఁ బరుల !
ఘను లయి యిప్పుడు కనఁబడునట్టి
మనుజులలోనుండి మహి నెంతమంది

హీనమానవులుగా నేర్పడఁగలరు!
హీనులై యొకమూల నేర్పడకుండఁ
గాలవిపర్యాసకారణంబునను
గూలి యూరును బేరుఁ గోల్పడినట్టి
వారిలో నెందఱు బాహ్యగౌరవము
వారక ధరియించి వెలుఁగఁగలరు!
మంచిది! యిటువంటిమాట లేమిటికి!
ఎంచి కోరెదువని నేఁ జూచుకొందు.
"నను గోరుకొనువాఁడు నరులలోపలను
దనయర్హతకు నేది తగు దానిఁబడయు."
అనుకొందు నేఁ గడునర్హుఁడనంచు.—
వనిత! దీనిచెవిని వడిగ నాకిచ్చి,
దాన నాభాగ్యంబు తనరునో యెట్లు
కానిపింపఁగనిమ్ము క్షణములోపలను.
(వెండిపెట్టెతాళము తీయుచున్నాఁడు)
పోర్షియా—ఇది యేమి? భ్రమగాని యిట్లింతతడవు
కతలకుండితి విందుఁ గానుదాని కీవు,
ఆర—ఏమి గాన్పించెడు నీపెట్టెలోన!
ఏమేమొ వ్రాసినయీచీటి నాకు
నిచ్చుచుఁ, గన్నుదోయిని జికిలించు
పిచ్చివానిపటంబు పెంపొందు నిందు.
చక్కగా దీనిని జదివెద నేను—
ఎక్కడ పోర్షియ! నీరూపమెడ!
నాకోరికలను నాయర్హతకును
నీకును సామ్యంబు నెమకిన లేదు.

## ద్వితీయాంకము

'నను గోరుకొనువాడు నరులలోపలను
ధనయుక్తతకు నేదితగు దానిఁబడయు"
ఈ వెఱ్ఱితలకంటె నెక్కుడవదాని
కీవేళ నర్హుండ నే నిందుఁ గానె!
ఇదియె నా బహుమతి! ఇంతటికన్న
నధనంబునకును నాకర్హత లేదె!

పోర్షి—నేరంబు సేతయు నెవ్వఁడిఁ దీర్పు
తీరుచుటయు వేఱువేరైనపనులు
ఏమాత్రముఁ బొసంగ వితరేతరమును.

ఆర—ఏమియున్నదొ యిందు నేనుజూచెదను

(తేటగీతములు)

''ఏడుకాఁక లగ్నిని దీఱె నిది కర్మమ్ము;
తప్పు నెపుడుఁ గోరనిబుద్ధి తా ధ్ఫళమ్ము
నేడుకాఁకలు దీఱె వెంపెసఁగుఁ జామ్ము
నీడనే కొంద ఱాసింత్రు నిక్కువమ్ము;
అట్టివా రొందుదురు నీడయాసుఖమ్ము;
బుద్ధిహీనులు పయిపయిపూఁత లిమ్ము
గాను గలవార లెఱుఁగుదుఁ గలరునమ్ము;
ఇందు వారీతి నున్న దీమందనమ్ము
ధరణి నెవ్వతెనైనను బరిణయమ్ము
కమ్ము, నీవు వివాహమ్ము కాకపొమ్ము,
నీశిరమ్మున నయియుండు నేసుతమ్ము
వచ్చినట్టిపనిదీఱె; వడిగఁ బొమ్ము"
తడవుగా నేఁక విందుఁ దగ నిల్తునేని,
వెడఁగు నా యుమతింత విశ్వంబులోన

తెలివిమాలినయొక్క తలతో వరింప
వలెనని చనుదెంచి, తలలట్టివానిఁ
గొని రెంటి నిప్పుడేఁ జనుచున్నవాఁడ.
పనివినియెదనమ్మ, ప్రాణవల్లభరో!
ఏను బొందినశ్రమ మెల్లను మఱచి
నేను జేసినబాస నెఱవేర్తుఁ జూవె.
(అరగాన్ రాజపుత్త్రుఁడు పరివారముతో వెళ్ళు
పోర్షి—ప్రాలి దీపముమీఁదఁ బఱురంగుచూచి
కాలె నీశలభ మీకరణి నియ్యెడను
అతిబుద్ధిమంతులయట్లు నటించు
మతిహీనులగువీరు పని దేనినైనఁ
గోరునప్పుడు తమగొప్పధీమహిమ
నౌర కార్యము చెడునట్లు గోరుదురు.
నెరి—వినుము 'చావును పెండ్లి విధిచేత నౌదవు'
ననుతొంటిలోకోక్తి వ్యర్థంబుగాదు.
పోర్షి—పడఁతిరో! యీకాండపటమును నీవు
వడి మూసివేయుమీ వచ్చి యిక్కడకు
[సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు]
సేవ—ఎచట నాయమ్మగారిపుడున్నవారు?
పోర్షి—ఇచట నున్నావేమి? యిదె యయ్యగారు!
సేవ—అమ్మరో! తనస్వామియాగమనమ్ము
నిమ్మగా మీతోడ నెఱిఁగించుకొఱకు
నరుగుదెంచి 'వినీసు' పురవాసి యొకఁడు
తరుణవయస్కుఁడు తాను వాఁకిటను
నిలుచుండియున్నాఁడు నిరుపమకవిని.

అలఘుఁ డాతఁడు దెచ్చె యజమానుఁడంపఁ
బలుదీవనలు ప్రియవాక్యముల్ గాక
వెలలేని శాన్కలు వివిధముల్ కూడ
వలపువార్తను దెచ్చువారిలో నెపుడు
నిలునింతసరసుని నేఁ జూడలేదు
రాగలట్టివసంతరామణీయకముఁ
దాఁ గనఁబఱుప ముందరవచ్చునట్టి
చైత్రదినంబును, స్వామికిముందు
నేత్రోత్సవంబుగ నేఁడిచ్చటికిని
వచ్చినయీదూతవలె నించుకైన
ముచ్చటగా నుండి ముదమియ్యఁ డెవుడు.

పోర్ష్య—విరమింపుమింతట వేఁడెదనిన్ను;
కరము నీవాతనిఁ గైవార మిపుడు
చేయుచందముచూడఁ జెప్పుచు వేము
నేయుఁడంచును నీకు నే భయంపడెద
రమ్ము 'నెరిస్స'! శీఘ్రంబుగఁబోయి
యమ్మాడ్కి రసికత యచ్చుపడంగఁ
జనుదెంచినట్టియామనసిజుబంటుఁ
గనుఁగొన నెంతయుఁ గాంక్షింతు నేను.

నెరి—మతి కిష్టమేని, యామన్మథుఁడైన
యతఁడు 'బస్సానియో' యయ్యెడుఁగాక!

(అందఱు నిష్క్రమించు చున్నా)

సంపూర్ణము

---

బాలా, ముద్రాక్షర శాల, రాజమహేంద్రవరము—1950.

## కీర్తిశేషులైన రావుబహద్దూరు
## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్రహసనము
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్రహసనము
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

### వచన ప్రబంధములు

### పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వ

స్త్రీలకుపయోగించుకథలు

అయిదవ సంపుటము



స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆరవ సంపుటము



ఏడవ సంపుటము

2 అతిబాల్య వివాహనిషేధము సంఖ్య ...10...
3 విగ్రహారాధనము తేది ....11.6.86...
4 ఈశ్వరదత్త పుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానవధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 మనుష్యజీవితముల యొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్రము

ఉపన్యాసములు—జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ, దానియుద్దేశము
2 శంకరాచార్యులు
3 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము
4 జసస్ చరిత్రము
5 స్వదేశసంస్థాన చరిత్రాదులు
6 విగ్రహతంత్రవిమర్శనము
7 ఉపన్యాసమంజరి
8 వివేకవర్ధని మొదటిభాగము
9 ,, రెండవభాగము
10 ,, మూడవభాగము

సాహిత్యగ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు

పూర్వాంధ్రకవులు

పదియవ సంపుటము

ఆధునికాంధ్రకవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు లభించుచోటు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.